# అస్మద్గురు పంచబ్రహ్మలు



పరమహంస బ్రహ్మ
శ్రీ సచ్చిదానంద
యోగీంద్ర స్వాములు.



వేదబ్రహ్మ
శ్రీ లూటిమర్తి క
(అగ్నిహోత్రి యోగీంద్ర



పరబ్రహ్మ శ్రీ జగద్గురు ఆదిశంకర
భగవత్పాదాచార్యులు.



జ్ఞానబ్రహ్మ
మిక్కిల్లి గరిమెళ్ల వెంకటనృసింహశాస్త్రి
యోగీంద్రులు.



కర్మబ్రహ్మ
శ్రీ వేలంకోటి గుండు వెంకటప్పశా

# ముఖ్యసూచన.

---

ఇందులోఁ జిత్రపటములగురించిన విశేష విషయములుగలచోట వివరణములు జతపరచఁబడినను మధ్యలో సందర్భానుసార విషయాదు లీచిత్రపటములకు సంబంధించిన విషయాదులందుఁగూడఁ జూడవలెను.

ఒకపుడు శాస్త్రతంత్ర పురాణభేదములతోఁ గొందరికిఁ గొన్నివిషయాదులం దీచిత్రపటములు భిన్నములుగాఁ దోచవచ్చును. సర్వులకు సమానార్థభావములకుసరిగాఁ గుదురుట దుర్లభము. అయినను దీర్ఘాలోచనతోఁ గొంతవరకైనన ట్లున్నదా యని యాలోచించి తుదకుకుదరకపోయినచోఁ దమకుఁదోచిన సర్వసమంజసాభిప్రాయము లొసంగినచో లోకోపకారమగును. కాని వృథా వివాదాక్షేపణల కవకాశ మియ్యకుందురని ప్రార్థన. నూతనములో నొకరు ప్రారంభించిన దానినిఁ జూచినవెనుక సర్వులకు సవరణలుఁదోచుట సహజము. అందుచేత విజ్ఞానాభివృద్ధినిఁ గోరి లోకోపకారమార్గదర్శకులగుదురనిప్రార్థన.

గ్రంథాపేక్షకుల తీవ్రమగు వొత్తడిచేతను నాకునువీలులేని అసందర్భముల చేతను గ్రంథములో తప్పొప్పులనుజూచి సవరణచేసి పట్టికవేయనందుకు క్షమించి సమన్వయముచేసుకొందురనిప్రార్థప

కాగిదమువెల లతిశయించినవి. చిత్రపటముల బ్లాకులకును మరికొన్ని విషయములకును ఖర్చులెక్కువగుటచేతను గ్రంథబాహుళ్యముచేతను గ్రంథమూల్య మధికమైనది. గ్రంథస్థవిషయాదరాభిమానులగుదురనిప్రార్థన.

గ్రంథప్రశస్త్య మెటులుండునోయని యైదువందల ప్రతులుమాత్రమే ప్రారంభములో ముద్రించితిని. గ్రంథపోషకుల కొకప్రతి నుచితముగాఁబంపగాఁ గొద్దిప్రతులుమాత్రమే మిగులును. అందులోమరల పండితులకు నాప్తులకుగూడ కొన్నిప్రతులుపోవును. అందుచేత మిగతప్రతులకు మాత్రమే విక్రయమునకు పంపవీలగును. ముద్రణాదిఖర్చుల మొత్తములో పోషకులనుండివచ్చిన ధనములో బుస్తకముల విక్రయమొత్తముబోగా మిగిలినదానిని మరల ముందు ముద్రణకై వినియోగింతును. ఇప్పటికి మొదటిభాగప్రతులుఁ లేవు. అనేకులపేక్షించుచున్నారు.

ఇంకను మూడవభాగమును ముద్రించవలసిన విషయములనేకములున్నవి. వార్ధక్యముచేతను, ఇతరసహకారములు తక్కువగుటచేతను ద్రవ్యము ప్రధానముగుటచేతను నెటులముద్రణమగునోయని యాలోచనలోనున్నది. శ్రీ ఈశ్వరానుగ్రహమెటులున్నదో తెలియదు.

ఇట్లు,

శుభ్రవేటి తిప్పాజ్యోశ్యులు.



# ఆధ్యాత్మిక విషయసూచిక.

## 3. శింశుమార చిత్రపటి వివరము

—o—

ॐ श्रीः

॥ श्री गुरुचरणं ॥

శ్రీపరదేవతాయైనమః

# వేదభూగోళము

## రెండవభాగము

---

## భూతాదిబ్రహ్మాండ భువనకోశ విన్యాసము

## ఆధ్యాత్మికము,

---

ప్రార్థన

శ్లో॥ యస్మాజ్జాతం జగత్సర్వం యస్మిన్నేవ ప్రలీయతే।
యేనేదం ధార్యతేచైవ తస్మై జ్ఞానాత్మనేనమః॥

తా॥ ఎవనివలన నీజగమంతయు నుత్పత్తియైనదో, ఈజగమంతయు నెవనిచేత ధరింపబడి స్థితినందుచు నున్నదో, మరల ఎవనియందు లీనమగునో, (శాంతినిపొందునో) అట్టిజ్ఞానస్వరూపుఁడగు పరమాత్మను నమస్కరించుచున్నాను.

విశేషసూచన:- సృష్టిస్థితిలయాదులు ఒక్కనియందే యున్నవను విషయము స్పష్టము. ఇతనిని విడిచి బొత్తిగా నేమియునులేదు. అప్పటికెటుచూచినను అతఁడు సంపూర్ణుఁడుగానే యున్నాఁడనుట స్పష్టము. అతనికిఁబ్రత్యేకించి యేమియునులేదు. ఇట్టివిషయమును స్పష్టముగా ( దెలియుటకే జ్ఞానమత్యావశ్యకము. జ్ఞానముతోనే సంపూర్ణత్వము గలుగుచున్నది. జ్ఞానముతప్ప మరేదానితోను దెలియలేము. అందుచేత జ్ఞానమే ప్రధానస్వరూపమని "తస్మైజ్ఞానాత్మనేనమః"అని స్పష్టముగ వ్రాయఁబడియున్నది. అజ్ఞానముతో భిన్నత్వమును బ్రత్యేకతయు, అధ్యారోపాపవాదములును గలుగును. ఆదిలో నొకటిపూర్ణముగ నుండినందుచేతనే మరల మధ్యలో భిన్నములకవకాశము గలుగును.

ఇందులో మరొకవిశేషము. "యస్మాజ్జాతం జగత్సర్వం"అని యున్నది.

అజ్ఞానమునకును, భిన్నములకును, సృష్టిస్థితిలయాదులకును స్వతంత్రతాశక్తిబాత్రిగా లేదు. అయితే ఆత్మకుమాత్రము సృష్ట్యాది శక్తులున్నవాయని ప్రశ్నించిన అది భ్రాంతిగ అసంభవమే. ఆత్మకే పైశ్లోకమునందు సృష్ట్యాదిగుణములుగలవని చెప్పిన వారనిన నిది సంపూర్ణాత్మకుఁగాని, ఆత్మస్వరూపత్వమునుబొందిన వారివిషయమైన ప్రశంసగాదు. ఆత్మను బొందఁదలఁచినజ్ఞానులు ఆత్మవిషయ విమర్శనతో నాలోచించిన "అప్రాప్యమనసాసహ, అవాఙ్మానసగోచరమ్, అరూపమవ్యయం, అచలం, భూమ" యిత్యాదిలక్షణములున్న ఆత్మస్వరూపమునకు నివేవియు సంబంధించినవి కావని తెలియును. ముముక్షువునకు జ్ఞానోదయము గలిగినపుడు సృష్టిస్థితిలయాదులమూలమును దెలిసి ఆత్మయొక్క సంపూర్ణజ్ఞానముగలిగి "ఆత్మసన్నిధితోఁగలిగిన" వని ఆత్మజ్ఞానముతోఁ దెలిసినవారలు వచించిన స్తుతివాక్యములు. ఆదిత్యప్రకాశముతో సర్వచరాచరవస్తువులకుఁ బ్రకాశముగలిగించిన విధానమువలెఁ గలుగునని జ్ఞానులు వచించిరని (భావము) తెలియును. అజ్ఞానులు వస్తువులకే స్వప్రకాశమున్నదనెదరు. ఆత్మజ్ఞానస్వరూపుఁడు, జ్ఞానైకగమ్యుఁడుగాన ఉభయమునకు, జ్ఞానప్రకాశమే పరమావధియై ముఖ్యముగ నున్నందుచేత "తస్మైజ్ఞానాత్మనేనమః" అని నమస్కారమును అట్టిజ్ఞానప్రధానాత్మకే చేసినవారైరి.

లేక మరొకఅర్థముగ దలంచవచ్చును. "యస్మాజ్జాతం" అనుటచేతను దేనివల్లజగత్తు సృష్టిస్థితిలయాదులతో నున్నదో అని అనవచ్చును. అప్పటికి మూలప్రకృతికే అన్వయము. అట్టిమూలప్రకృతియుజడమే. జడమునకీగుణములెట్లుగలిగినవనిన ప్రకృతిఆత్మలో నొకఅంశముగ నున్నందుచేత ఆత్మప్రకాశముతోఁగలిగినదని తేలును. అందువలన నమస్కారము (అంశియగు) ఆత్మకేయనికూడ తెలియవలెను. ఆత్మసర్వాధారము. సర్వాధిష్ఠానము. సృష్టిస్థితిలయాదులందు ఆత్మ అంతర్గతముగా నున్నందుచేత ఏనాటికైనను ఆత్మకే పూర్ణత్వ ప్రధానత్వములుగలుగును. ఆత్మఅంతర్గతముగ నున్నందుచేతనే జడాదులకుఁగూడ స్వప్రకాశత్వము సామాన్యజ్ఞానముగనున్నది. మరల శుద్ధసంపూర్ణజ్ఞానమునకును స్వరూపమునకు నవకాశకారణములున్నవి. ఆత్మప్రధానముతోనైనను, ప్రకృతిప్రధానముతోనైనను ఆదిలో వచించి తుదకు ఆత్మప్రధానమునకే నమస్కారము చెప్పినను నొకటేయగును. విపరీతమేమియును లేదు.

శ్రీభాగవతములో గజేంద్రమోక్షములో శ్రీపోతనమహర్షి పరమభాగవతోత్తముఁడు దీనిననుసరించియే యీపద్యమువ్రాసెను.

అష్టమస్కంధము 23.

ఉ॥ ఎవ్వనిచేజనించు, జగమెవ్వనిలోపలనుండు, లీనమై
యెవ్వనియందుఁడిందు, బరమేశ్వరుఁడెవ్వఁడు, మూలకారణం
బెవ్వఁ, డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు, సర్వముఁదానయైన వాఁ
డెవ్వఁడు, వాని, నాత్మభవు, నీశ్వరు నే శరణంబు వేఁడెదన్॥

క॥ ఒకపరిజగముల వెలినిడి
యొకపరిలోపలికిఁగొనుచు నుభయముదానై
సకలార్థసాక్షియగు న
య్యకలంకుని నాత్మమయుని నర్థింతుమదిన్. ౨౮

క॥ లోకంబులులోకేశులు,
లోకస్థులుఁ దెగినఁదుదినలోకంబగు పెం
జీఁకటి కవ్వలనెవ్వం
డేకాకృతి వెలుఁగునతని నే సేవింతున్। ౨౯

మనకు బ్రకృతిలో నజ్ఞానదశలో బ్రకృతివిస్తారావరణములుగ భిన్నములై యగపడుచున్నదేకాని జ్ఞానమునకు నెంతమాత్రము నగపడజాలదు. జ్ఞానులు జ్ఞానముతో ఆత్మప్రధాన సంపూర్ణభావముతో నున్నవారలగుటచేత వారికి సర్వదా సర్వత్ర ఆత్మప్రధానమైయుండగలదు.

శ్లో॥ యంబ్రహ్మవరుణేంద్రరుద్ర మరుతఃస్తున్వంతి దివ్యైఃస్తవై
ర్వేదైస్సాంగ పదక్రమోపనిషదైర్గాయంతి యంసామగాః।
ధ్యానావస్థిత తద్గతేనమనసా పశ్యంతియం యోగినో।
యస్యాంతం నవిదు స్సురాసురగణాః దేవాయతస్మైనమః॥

ఈశ్లోకము బ్రహ్మాండమునకు సంబంధించినదైనందుచేత ఈ బ్రహ్మాండమునకు మూలకారణ మాధిదైవతమగు బ్రహ్మ వరుణేంద్ర, మరుత్తులు, సామగాయకులు, యోగులు, సర్వదా కేవల దివ్యస్తవ వేదగాన షడంగోపనిషత్తులచేతను, పరమధ్యానయోగముతో అద్వితీయముతో తమమనస్సులయందు దదాకారచిత్తవృత్తితో నుండినపుడుమాత్రమే చూడగలిగిరేగాని లేకున్నపరమాత్మయొక్క అద్యంతమును దేవతలుగాని దానవులుకాని మరెవ్వరైనకేమి తదితరవేద విరుద్ధభావములతో నెన్నటికిఁ జూడజాలరు. అంతదనుకనేల? శ్రోత్రియులైన వారలు కూడ ప్రసన్నచిత్తవృత్తులుకాకున్నపుడు చూడఁజాలరు. పొందఁజాలరు. ఇందుకు

శ్రీభాగవతములోని బ్రహ్మనారద సంవాదము తాత్పర్యము.

ఈ బ్రహ్మాండములో నొకవిశేషమున్నది. ప్రయత్నపూర్వకముగ సర్వమునుద్యజించి తదేకనిష్ఠతో శుద్ధజ్ఞానముతోఁగాని పరమాత్మనుజూడజాలరు. పొందజాలరని తీర్మానము.

ఈబ్రహ్మాండములో మధ్యవికల్పములు, విక్షేపముల కవకాశకారణములు ద్వంద్వవిధానముతోనున్నవి. ఈ బ్రహ్మాండాతీతము నీ ఆవరణ విక్షేపాదులు వికల్పాదులులేని కేవలశుద్ధజ్ఞాన వైరాగ్యులకెక్కువగా అవకాశములున్నవని స్పష్టము. ఇటులనే క్రిందినుండి క్రమక్రమముగాఁగేవల శుద్ధసాత్వికాంశమునకే ప్రబలత గలిగినఁగాని ఆత్మస్వరూపత్వము వీకత్వము, పూర్ణత్వము సిద్ధింపజాలదు. మనమెంతదూరములో గేవలము తమస్సులో శుద్ధతమోగుణావరణముతో నున్నామనునది ఎవరికివారే ఆలోచించవలెఁగాని వివాదముఁతోఁబనిలేదు. శుభేచ్ఛగలిగిననాట్రికైన నీవిధానము తెలియకమానదు. సృష్టిక్రమముతో ఁబరంపరలుగా నింతదూరము రాఁగలిగితిమి. మరల నికెంతదూరమువరకు పోఁగలుగుచున్నామో మన కేమాత్రము తెలియదు. మనకుఁదెలిసినది ప్రళయమువరకు ఁబోఁగలఁగుదుమనుట స్పష్టముఁగాని స్వస్వరూపాత్మవరకుఁబోఁగలవారలగుదుమా అను విషయముమాత్రము ప్రకృతకాలస్థితిలో సందేహమే. ప్రళయమును బొందుటమాత్రము తప్పగు. ఈలాగున మనకుఁబరలోకాదులగు పుణ్యభూమిలో నున్నవారలకు సహితము కేవల శుద్ధజ్ఞాన వైరాగ్యాదులతోనున్నగాని స్వస్వరూపానుసంధానముకానేరదు. పుణ్యరాశిఫలముతో ఉత్తమలోకప్రాప్తిగలిగి మనకంటె దీర్ఘాయువుతో మనకంటె నధిక సుఖానందము పరిమితికిలోనై,యున్నవాటిఁమాత్రమే పొందియున్నారేగాని శాశ్వతముగానున్నదానినిమాత్రము పొందలేరు. దీనినిఁజూడ, మనమీలోకములోఁ బుణ్యకర్మలతో స్వర్గలోకాదుల ననుభవించి మరల పుణ్యక్షయముతో నీలోకమునకే మరలివచ్చెదమేకాని తదుపరి బ్రహ్మలోకాదులనుగూడ బొందనేరము. ఇందుకుఁబ్రమాణము గీతలో "క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి" పుణ్యకర్మలతోనే చాలుననిచో నీవిధఫలమునే పొందగలుగుదుమేగాని దీనికిఁబైనున్న బ్రహ్మలోకాదులను వీటికతీతమగు ఆత్మనుబొంఁదలేము. దీనిమార్గమే ధూమాదిమార్గము. కేవల పుణ్యకర్మలను నిష్కామముగఁజేసి యీకర్మలనాత్మసంయోగముతో ఈశ్వరార్పణబుద్ధితోఁ జేసినవారలు అర్చిరాదిమార్గముద్వారా ధ్రువమండలమును భేదించుకొని ఆవల బ్రహ్మలోకాదులగు ఉభయమధ్యస్థ మహర్లోకము, ఆవల జన, తప, సత్యలోకా

దులను బొందగలరు. దీనికిఁ బైన సదాశివ స్వరూపమగు తత్త్వము, స్వరాట్టు మార్గముతో ఈశ్వరుఁడుగా నున్నాఁడుగాన అతనిప్రీతికొఱకై ఈశ్వరార్పణ బుద్ధితోఁ జేసినచో స్వస్వరూపముఁ బహు దారిఁవిడుచును. అందులకే ఈశ్వరార్పణ బుద్ధితోఁ జేయవలెను. సంధులు మూడున్నవి. ఒక్కటిధ్రువమండలము. ఇదే సూర్యమండలము. తేజోలోకము. రెండవది బ్రహ్మలోకమగు సత్యలోకము. ఇదివాయుసంబంధము. మూడవది సదాశివమగు స్వరాట్టుసంబంధము. ఇది ఆకాశతత్వము. ఈమూటితో సర్వాతీతము. సదాశివతత్త్వముతో శక్త్యైక్యమగును. ఇదేప్రకృతికి అధిష్ఠానము. ప్రకృతిఅధిష్ఠానమగుటచే సర్వములీనమగు" "తస్యప్రకృతి లీనస్యయః పరస్సమహేశ్వరః"అని ఉపనిషద్వాక్యము. తుదకు సదాశివమగు ఆత్మయేమిగులును. ఈలాగున విమర్శించినకొలది యుండును.

శ్లో॥ యైరిమే గురుభిఃపూర్వం పదవాక్యప్రమాణతః।
వ్యాఖ్యాతాస్సర్వ వేదాంతాస్తాన్నిత్యం ప్రణతోస్మ్యహమ్।

ఈసర్వవేదాంతోపనిషత్తులను వివేకపూర్వక పదవాక్య ప్రమాణపూర్వక విస్తృతవ్యాఖ్యానముల నెవరొనర్చిరో అట్టిపరంపర గురువులనుగూర్చి నేనెల్లప్పుడను నమస్కరించుచున్నాను.

విశేషార్థము. శ్రీగురుశబ్దము సర్వాతీతాత్మకేఅన్వయముగాని మఱిదేనికినిగాదు. ప్రత్యేకించి మిగిలినదే శిష్యత్వము. శిష్యత్వమున్నంతకాలము గురువు మిగిలియే యుండును. శిష్యుఁడేలేనిచో గురువుచ లేఁడు. తుదకు శిష్యుఁడేగురువు, గురువే శిష్యుఁడని శ్రీగురుసాంప్రదాయపద్ధతి. దీనినే జీవేశ్వరైక్యమని, మఱొకపద్ధతిగను ప్రకృతి పురుషైక్యమని మఱొకపద్ధతిగను సాంప్రదాయభేదములతో నుండునేకాని చివరకు అన్నియునొకటే. ఇట్టిన్యాయము లనేకములున్నవి.

దేవతలకును శ్రీగురువునకును నొకవిశేష తారతమ్యమున్నది. దేవతలు తన్నుస్తుతించి కర్మలనాచరించి పూజించినఁగాని, ఫలమునొసంగరు. శ్రీగురువులటుల కాదు. కరుణాసముద్రులు, శిష్యోద్ధారకులు, మహోపరమోపకారులు, అజ్ఞానమును నాశనముఁజేయుటలోఁ బరమసమర్థులు. ఇదేవారికిఁ బ్రధానగుణము. దేవత లజ్ఞానవాశనమం దంతటిసహకారులుగారు. సర్వదా సేవలను జేయించుకొనఁజూతురు. దేవతలకు గుణత్రయాది బాధలున్నవి. శ్రీగురువులు గుణాతీతులు. దేవతలు కామకులు, శ్రీగురువులు తదతీతులు. నిరంతర తపనోపాయముపెక్కి

జీవుల నిరంతరము నుద్ధరించు సహజగుణయుక్తులు, శాంతులు, అజ్ఞానమును నాశనమును జేయు సమర్థులు దేవతలతో అజ్ఞాననివృత్తి కాఁజాలదు. దేవతలు సపత్నీకులు, సరాగులు. శ్రీగురువులు అపత్నీకులు విరాగులు. ఇట్టియనేక భేదములు గురుదేవతలకున్నవి. ధన్యునిగాఁజేయువారలు తామేవిధముగ గుణాదులతో నుందురో తద్విధముగనే వారిప్రవర్తనలుండును. శ్రీగురువులు నిరంతరము జీవులనుద్ధరించుటకై అవతరించి నిష్కామముతో జీవులలోనుండు అజ్ఞానదోషజనిత దుఃఖములనుదెలిసి తన్నివారణోపాయ సాధనములనే నిరంతరము జీవులకొరకు పరితపించుచు సాధనలను బోధించి ఆచరింపఁజేయుసమర్థులు. శ్రీప్రశ్నోత్తర రత్నమాలలో "కోగురుః అధిగత తత్త్వశ్శిష్యహితాయోద్యతస్సతతమ్" అని శ్రీఆదిశంకరులు వచించిరి. మొదటి గురువు శ్రీసదాశివుఁడు. తర్వాత శ్రీమహావిష్ణువును, బ్రహ్మయు, తర్వాతఋషులు. తర్వాత అవతారమూర్తులు. అవతారమూర్తులవతరించి తమకార్యము కొనసాగిన తత్క్షణమే నిరంతరబ్రహ్మచర్యముతోనేయుండి జీవన్ముక్తులగుదురు. వీరలేయధికారములను పదవులను ఆశించరు. ఆశించినచో మరలకాలగుణాది సంబంధముతో నేనాటికైనా పరంపరలప్రాప్తిగా జన్మములు తప్పవని తెలిసినవారలు శ్రీగురువులు. వారికి పదవియుబ్రహ్మము, స్థానమును బ్రహ్మము, రూపము బ్రహ్మము. పరంపరలుగాఁగల శ్రీగురువు సర్వులకును బరమగురువు పరావరగురువులని తెలియవలెను. భేదములులేవు. సర్వులకు పదమొక్కటే. అందుచేత భేదములులేవు. దేవతలు, లోకనాథులు, లోకాదులనుబెంచువారలు శరీరతీతమగు నాత్మను బొందువారలును నేమియునుజేయజాలని యశక్తులు. ఆత్మనువిడచి లోకాదులను బొందదలఁచినవారలందు వీరిశక్తిని బాగుగాఁ బ్రయోగించి వచింతురు. దేవతలనగా బ్రహ్మాండములో నున్నవారనియే తెలియవలెను, ఇది త్రిమూర్తులకుమాత్రమన్వయించదు. వీరలు పంచబ్రహ్మలలోఁ జేరినవారలు. సూర్యుఁడుగూడ నీదేవతలలోఁజేరఁడు. ఆత్మస్వరూపమే ఈ బ్రహ్మాండములో తేజోరాశిగా జగదాత్మగా ఆదిత్యుఁడుగా నున్నాఁడు. "సూర్యఆత్మాజగతః" ధ్రువుఁడునంతే. ధ్రువసూర్యులకే భేదములులేవు. శ్రీవిష్ణుపురాణములోఁగల ప్రమాణములు, ద్వితీయాంశ నవమోధ్యాయమున "ధ్రువశ్చ శింశుమారశ్చ ధ్రువేభానుర్వ్యవస్థితః ౬ ॥ తదాధారం జగచ్చేదం సదేవాసురమానుషం" అని ఈబ్రహ్మాండములో ముఖ్యముగ మనము దెలియవలసినవి, ధ్రువసూర్యులు, మేరువును, బ్రహ్మమును మాత్రమే. తక్కినవాటితో ముముక్షువులకు నిష్ప్రయోజనము.

సర్వవిషయాదులు నీబ్రహ్మాండమునకుఁ జేరినవై బ్రహ్మాండాంతరములో నున్నవి. బ్రహ్మాండమునువిడిచి బాత్రిగ నేమియును లేవు. వినఁబడునవి, కనఁబడునవి, చేయఁబడినవి. చేయఁబడునవన్నియును బ్రహ్మాండములోనివే: ఆవలనతీతములో నేమియును బాత్రిగా లేవు. ఆత్మయొక్కటే అద్వితీయసంపూర్ణముతో నున్నది. ఏమి యుండినను బ్రహ్మాండమును ఆశ్రయించి బ్రహ్మాండములో నుండవలసినదే అని స్పష్టముగాఁ దెలియవలెను.

హరిః ఓం తత్సత్,



# ప్రార్థనతోఁ బరమాత్మకేవిసంబంధము.

ప్రార్థనలోఁ ద్రివిధకర్మలున్నవి. ఈత్రివిధకర్మల కతీతకర్మలులేవు. మనస్సునను, వాక్కునను, కాయముతోను జేయఁబడు కర్మలకుఁ ద్రివిధకర్మలని పేరు. కాయముతో స్థూలేంద్రియ కర్మలుగను వాక్కుతో శబ్దోచ్చారణతో జ్ఞానేంద్రియ సూక్ష్మకర్మలుఁగను అంతఃకరణముతో ధ్యానధారణాదులతోఁ గారణకర్మలుగను జేసిన ద్రివిధకర్మలగును. ఈత్రివిధకర్మల కతీతముగా మనమీదేహముతో మరే విధములుగాఁ దేనిని జేయలేము. ఈవిధముగ మూఁడుకర్మ లేకకాలములో సమష్టిగాఁ జేయునపుడితరేంద్రియాదులన్నియుఁ గ్రమముగా స్వాధీనములై ఏకముఖముకాఁ గలవు. ఏకముఖముగాఁ గలుగుటచే ధ్యానయోగాదులగు సాధనలకు ముఖ్యావకాశము కలుగును.

కొందరు నేత్రేంద్రియము ప్రధానముగదా? దానిసంబంధము లేనందువలన ధ్యానయోగాదుల కభ్యంతరమగునని సందేహించవచ్చును. సర్వేంద్రియకారణము మనస్సు. కాన మనస్సే నేత్రేంద్రియము. నేత్రేంద్రియమే మనస్సు. మనస్సు లేకున్న నేయింద్రియము ఏపనినిఁ జేయజాలని జడములే. అన్నియింద్రియములతో సమష్టితోఁ గాయముతోఁ జేసిన కర్మలు స్థూలేంద్రియకర్మలనియు జ్ఞానేంద్రియ సమష్టివల్లనైనవి సూక్ష్మేంద్రియ కర్మలనియుఁ బిలువఁబడును. శబ్దప్రధాన కారణమగు వాగింద్రియముచ్చారణతోఁ బ్రేరితము. సూక్ష్మేంద్రియకర్మలు కర్మేంద్రియములకును జ్ఞానేంద్రియములకు మూలకారణమైన మనస్సుతో స్వరూపధ్యానయోగముతో జింతావిమర్శన నిశ్చయాత్మకకారణత్రివిధములగును. పరంపరగాఁ బరమావధి పరమాత్మను బొందగలిగిన సంబంధము గలుగఁజేయునది ప్రార్థనయగును. ఇవితప్ప మరేసాధనములుగాని ఉపాయములుగాని లేనందునఁ బ్రార్థనతో నీత్రివిధ కర్మల కవకాశము ప్రసాదిగ (?)బరమాత్మకు (?)బరమావధి కసంబాధమై స్వరూప ప్రాప్తి తప్పక సిద్ధించునని మహర్షులు తామనుభవించి మనకుబోధించినవారలైరి.

బాహ్యభోగాదులకును ద్రివిధకర్మలే ముఖ్యములు. అంతరములో ఆత్మయోగమన నీత్రివిధకర్మలే. ప్రవృత్తితో బాహ్యాదులకు నివృత్తితో ఆత్మయోగమునకు (?)గార్యకారణ భావమున్నది. ప్రార్థన పరమావధిగాఁగల ధ్యానయోగము బాహ్యవ్యవహారాదులకుఁ బ్రవృత్తి లేనిదై నివృత్తికిఁగారణమయిన లీనవృత్తితో స్థూలదేహమునుమరచి సూక్ష్మతైజస దేహమునుబొంది తర్వాత

మనసాక్షిమాత్రము మిగిలి క్రమముగ స్వరూపధ్యానయోగాదులతోఁ దదాకారవృత్తియగు కారణములో నొకసమయమందు లీనతబొందగా త్రివిధకర్మల కవకాశములేకయుండును. ఈలాగున స్థిరాభ్యాసముతో దీర్ఘకాల మనుభవముతో షడ్విధసమాధి భూమికలనంది తుదకు శాశ్వతస్వరూపానంద ప్రాప్తిగనవగు. కనుక ప్రార్థనయే ప్రధాన ప్రారంభకార్యము.

"మన ఏవమనుష్యాణాం కారణంబంధమోక్షయోః"

బంధమోక్షములకును మనస్సేముఖ్యకారణము. మనస్సుమిగిలినచో బాహ్యముప్రవృత్తిగలిగి సర్వబంధములకు నీత్రివిధకర్మలు తప్పనివగును. మరల మనోలీనతకు నీత్రివిధకర్మలు మనస్సునకు బరమావధిగాగల స్వరూప ధ్యానయోగాదుల సంబంధముతో నివృత్తిమార్గము ననుసంధించి మోక్షదాయకమగును. మనస్సుమిగిలినచో ఉభయకర్మలకుఁ గారణముగానుండును. మనస్సున్నంతకాలము నీత్రివిధకర్మలు త్రివిధదేహములు మిగిలియుండును. సర్వాశ్రయము మనస్సు. మనస్సుతోను త్రివిధకర్మలతో సర్వకార్యకారణ సంబంధములున్నవి. ప్రవృత్తి నివృత్తి మార్గభేదములతో ఫలభేదములుగ నున్నవి.

నేత్రేంద్రియము బాహ్యనేత్రమేకాని అంతర్నేత్రముగాదు. ఇదిస్థూల నేత్రముగాన స్థూలాదులను మాత్రమే చూడగలదు. ఈస్థూలాదులను మనస్సుతోఁ జేరియుండినచోఁ జూడగలుగునేకాని మనస్సులేనపుడుమాత్ర మీ నేత్రము నిష్ప్రయోజనము. సహజముగ గుడ్డివారున్నారు. వారికీబాహ్యనేత్రములుండవు. అట్టి వారికి మనోనేత్రమే ప్రధానము. కనుక వారు ధ్యానాద్యంతఃకర్మల నాచరింతురు. సందర్భానుసారముగ నేత్రమును సమన్వయము చేయవలెను. చూపు దేనికి సహజముగ సర్వదాయుండి యితరాధారములులేకయే స్వయముగా చూడగలుగునో యదియే నేత్రము. మన నేత్రము బాహ్యములోఁగల సహాకారగోళముగాని మూల నేత్రముగాదు.

ఆదిలో నీమనస్సు అగోచరమగు ఆత్మలో నేమియును లేనిదిగానున్నందు చేత అవ్యక్తస్థితికి వచ్చి అవ్యక్తములుగా నున్నవన్నియు వ్యక్తములుకాగా అనంత నామరూపగుణ వికారాదుల నందును. ఆవరించినదై మరల వెనుకకు క్రమముగా ఉపసంహారముతో అవ్యక్తస్థితికివచ్చి తానొక్కటే మిగులును. ఈ అవ్యక్తముతో ఆవల వ్యక్తమునకు అవ్యక్తమునకును అతీతముగనున్న ఆత్మను బ్రార్థనతోఁ బొందఁ గలుగును. ఈఅవ్యక్తస్థితికి సంబంధించిన దృష్టాంతము మననిత్యానుభవములోఁగల

సుషుప్తియే. మననిత్యానుభవములోఁ బరమాత్మధ్యానయోగాదులు బొత్తిగా లేనందుచేత సుషుప్తినుండి మరల వెనుకకు మరలివచ్చుచున్నాము. ఇది సుషుప్తియని తెలుసుకొనునది విజ్ఞాత. విజ్ఞానము దెలిసికొన్నగాని సుషుప్తిని దాటలేము. అందుచేత నీసుషుప్తిలో మనస్సులీనమయినను స్వప్రకాశజ్ఞానముగాని ఆత్మధ్యానయోగముగాని లేనందున సుషుప్తినుండి పునరావృత్తిగఁ బ్రపంచవ్యవహారవాసనలతో వెనుకకేవచ్చున్నాము. అందుచేత ముముక్షువులగు సర్వులకును, ధ్యానయోగమత్యావశ్యకము.

ఈమనస్సు ప్రథమములో ఆవరణయుక్తమైనందుచేత బంధమును బొందెను. ఆవరణము లేకపోవుటే బంధనివృత్తి. మోక్షము. ఈ ఆవరణములు సర్వత్ర బంధమునకును మోక్షమునకును ముఖ్యకారణములు ఈ ఆవరణములు క్రమముగా నొకదానిలో నొకటిగా మరల మరల కాలగుణ భూతాది సంయోగముతో అనంతావరణములాయెను. ఈ ఆవరణములతో అనంతసృష్టిగా అనేకభేదములు గలిగెను. ఈ ఆవరణములు సర్వత్ర సర్వమునకును ఁమదకాత్మకును సంబంధముగా నుండుటచేత మనప్రార్థనలతో జననములు గలిగి చిన్న ఆవరణము నుండి మహదావరణమును దాటి తుదకు బ్రహ్మాండములు దాటి విరాట్స్వరూపేశ్వరతత్త్వములో జేరి ఏకావరణపరమావధి నతిక్రమించి నిరావరణముతో ఆత్మ చేరును.

మనకు ప్రథమములోఁ బంచభూతావరణములున్నవి. వీటినే సైన్సుశాస్త్రవేత్తలు అలలని (వైబ్రేషన్సు) యందురు. ఇందుకు దృష్టాంతము మన రేడియో లే చాలును సర్వభూతములకు కారణము వాయువు. వాయువు సర్వభూతములందును జననముతో నలలయి అంతమువరకు ప్రాకుచుసేయుచును అందుచేతనే దూరశ్రవణాదులకును దూరదర్శనములకును అవకాశములున్నవి. ఈవాయువుతో దూరములోనున్న శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులను గ్రహించఁగలుగుచున్నాము ఈలాగుననే మనప్రార్థన త్రివిధకర్మలతో జననముతో పృథివ్యాది పంచభూతములు దాటి ఆవలగల పరమాత్మలోఁ జేరును. ఒకఆవరణ అలప్రారంభమైనదని అదితుదకు అంతమగువరకు జననముతోఁ బోవుచుసేయుండును తుదకు నిరావరణాలో లీనమగును. అందుచేతఁ బ్రార్థనలోఁగల త్రివిధకర్మలగు మనోవాక్కాయకర్మలు అలలుగా జననముతోఁ బంచభూతాదుల నతిక్రమించి ఆవల పరమాత్మనే తప్పకచేరును. తుదకు ఆకాశములో సర్వము లీనమగుననుట సర్వవిదితము. పరమాత్మ ఆకాశస్వరూపుఁడని ప్రమాణములున్నవి. కాన ఆకాశములోఁ జేరి లీన

మయిన పరమాత్మలోఁ జేరినట్లగును. నిస్సందేహము. ప్రారంభములో ఆవరణల దాటి అలలచేత నెట్లువచ్చినదో అట్లే మరల వెనుకకుఁబోయి మూలముచేరును. ఈ ఆవరణములు ఉభయత్ర కార్యకారణ సంబంధములు. వాయువు సర్వవ్యాపి. వాయువేమనస్సు. వాయువునకును, మనస్సునకు భేదములేదు. వాయువునకుఁగల గుణములన్నియును మనస్సునకునున్నవి. ఇందుకనేక ప్రమాణములు గూడనున్నవి. ఈ ఆవరణల యలలాయాభూతాదుల ననుసరించి స్థూల, సూక్ష్మ కారణరూపా రూపములుగఁ గ్రమముతో ఊర్ధ్వములో మార్పుచెందును. తుదకు లీనముగూడ నగును.

పరమాత్మ అనంతరూపముతోనుండుటచేత మనప్రార్థనలు అనంతములుగా దీర్ఘకాలమపరిమితముగఁ జేయుటచేతఁ గ్రమముగా ఒకదానితోనొకటి అవినాభూతములై యెడతెగనివియై పరమాత్మతో సంబంధమేనాఁడగునో ఆనాఁడే మనము ధన్యులమగుదుము. దూరముగ నున్న వారిని మనము పిలుచుటలో కొంతసేపు ఎడతెగని ధ్వనితోఁగల ప్లుతోచ్చారణతో నెట్లుక్రమముగా ధ్వనిప్రాకి పిలిచిన వానిఁజేరునో యటులనే దీనిని సమన్వయము చేసుకొనవలెను. ఈ ప్రార్థనలు సర్వమతములవారును దప్పక ఆచరించుచున్నారు. ప్రార్థనయొక్క ప్రాముఖ్యత నీలాగున అత్యంతములకు సంబంధించిన సంధిసంబంధముగ నున్నది. మనప్రార్థనలెవరినిగురించి చేయుదుమో వారినే యవి చెందును. నిష్కామముతోఁ జేసినవారు జ్ఞానోదయమయి ఆత్మానుభవముఁ బొందదురు కామాదులతోఁజేసినఁ గామరూపలోకాదులను బొందుదురు.

ఈ ప్రార్థనలు ఉపరిలోకాదులకెట్లు పోగలుగునో ఆలోచింతము. సృష్టిప్రారంభ ముపరిలోకాదులనుండి క్రమముగా నీలోకమునకును మనక్రిందిలోకాదులకును రాగలిగినది. సర్వసృష్టి వ్యవహార పరిశోధనలు సర్వవిషయాదులు సర్వసౌకర్యములు ఉపరిలోకాదులలో మొదటగలిగి క్రమముగా మనలోకాదులకు సంబంధములుగలిగి వచ్చినవేగాని మనలోకమే మొదటపుట్టినదని మనము కనిపెట్టినవారలని యెంతమాత్రము తలంచరాదు. ఈ సర్వలోకాదులును, బ్రహ్మాండమంతయును బంచభూతాత్మకమయినందుచేత సృష్టిఅంతయు బంచభూతాత్మక సమష్టి పంచీకరణముచేతను, ఏలోకములోఁ జేసినను అన్నిలోకాదులకును సంబంధములుగానే యున్నవగును. సమష్టివిరాడీశ్వర సంబంధముతో సర్వసంబంధమగును. ఇందుకు మన దేహమే దృష్టాంతము. మనసమష్టిదేహముతోనే త్రివిధకర్మలు చేసినను నవి మన

దేహమునకంతయు వాయుభూత సంబంధముతోఁ దెలియును. తుదకు త్రివిధదేహములకునుగూడ ఒకదేహముతోఁ జేసినవి సంబంధవ్యాప్తితో అనుభవములుగా నున్నవి. వివరింపనేల. మననూతన పరిశోధనలన్నియును మనకంటెముందుగ ఉపరిలోకాదులలో గలిగినవై మరల మాకు గలిగినవే. మాలోకము స్థూలకఠిన భూత పదార్థలోకము. ఊర్ధ్వలోకాదులు భూతగుణభేదములతో రూపాంతరభేదములుగ సూక్ష్మకారణములుగనుండగలవు సమష్టిలోకసంబంధముతోను. బ్రహ్మాండ సంబంధముతోను, విరాడ్దేహముతోను, మనము వ్యష్టిగాఁజేసిన ప్రార్థనలు సమష్టితో బ్రహ్మలోకమువరకును బ్రహ్మకును బ్రహ్మాండాతీతమగు ఆత్మకునుజేరును.

సృష్టిలో అనంతజీవులు చేసిన ప్రార్థనలు మరల ప్రత్యేకించి ఫలముల నెట్లనుభవించు ననినచో మనసామాన్యమానుష లోకాదుల వ్యవహారములలో చిన్న అధికారిమొదలు చక్రవర్తివరకు ప్రతివ్యక్తి కోరి ప్రత్యేకించిచేసిన వ్యవహారాదికములన్నియును, మరల ఫలములను ఎవరెవరి ప్రార్థనల ననుసరించి ప్రారబ్ధ ఫలానుభవములుగ నిత్యవ్యవహారములందు బొందునో అటులనే దీనిని బొందగలము. మనప్రార్థనలో మనకులగోత్ర గ్రామదేశములను వంశముల నుదహరించియుండుట చేత మరలనవి మనకేవచ్చుచున్నవని భావించి సంకల్పాదులతో సర్వకార్యములను ప్రారంభముచేసిన వారలమగుటచేత ఫలములు మనలనేపొందును. అందుచేతనే మనము ప్రతికార్యమునకును ప్రారంభ సంకల్పములో కులగోత్రనామదేశ కల్పమును త్రికాలము లందుఁదిథివారనక్షత్ర సంబంధముతోఁ జేయుచున్నవారలమయితిమి. ఇది మహాత్ముల ఉపకారము. ఆత్మయోగముతో లీనులగువారలిహపరసంబంధ త్యాగులుగా నున్నవారలగుటచేతఁ దేహాభిమాన రహితులగుటచేత సంకల్పాదులు వారికిలేవు.

ఈ ప్రార్థనలు నప్తాహ యజ్ఞ జయంత్యారాధనా సంధ్యావందనోపాసన ధ్యానయోగోత్సవాదులుగ ననేకవిధములుగనున్నవి. ఎవరో ఒకరిమూలమునఁ తుదకు సర్వులకును సంబంధించిన ఫలకారిణిగ నున్నదగును ఇదేమానవధర్మము.

దేహము కర్మజన్యముగాన దేహసంబంధమున్నంతకాలము కర్మంబుచేయని క్షణముగూడనుండదు. కర్మతో దేహము కలిగివందుచేత మరల కర్మలతోనే ప్రారంభించి ఆకాశాంతమగు శబ్దములో స్తుతివాక్యముతోను, ధ్యానయోగముతో బరమాత్మలో లీనమగుటే త్రివిధ త్రిపుటిగాగల త్రికరణమార్గము. సంపూర్ణలీనమగువరకు భేదరూపముతో నేదో చేయుచుండవలెనేకాని ఏమియును జేయనివా

రలుగ నెంతమాత్రముండరాదు. ఉండలేరు. ఇదేగీతావాక్యము. "నహికశ్చిత్ క్షణమపిజాతు తిష్టత్యకర్మకృత్ కార్యతేహ్యా వశఃకర్మ" కర్మ లనేకవిధములుగా గూపకల్పనతో ఆయా దేహాదుల ననుసరించి వాయువున్నంతకాలము చేయుచుండ వలెను. తాను మిగిలియున్నంతకాలము వాయుభూతము ననుసరించిన విధాన ధ్యానయోగముతో నిరంతరముండుటయే ప్రధానము. కర్మలు కర్మలస్వరూప ములు, కర్మమూలము ను మనముకని పెట్టలేనందుచేత కర్మలెందుకు? కర్మలేలేవని నిర్ధారణ త్రివిధదేహాదులున్నంతకాలము జేయలేము.

ఇటులనే దుష్కర్మలతో దుష్కర్మఫలములను,సుకర్మలతో సత్ఫలములను, నిష్కామముతో ఆత్మస్వరూపమును బొందగలుగుదుము. సర్వము కారణాంత ములతో కార్యనాశనము గావలెను. కాన కారణముండువఱకు మరల కార్యము లుండియేతీరును. కార్యములుండిన కారణములుండితీరును. ఈ లాగుననే అర్చ నాదులు, అభిషేకాదులు, నివేదనలు, తీర్థప్రసాదములు విమర్శించినచో నన్నిటికిని సమన్వయములున్నవి.

హరిః ఓం తత్సత్.



# త్రివిధధ్యానముల వివరములు.

---

## ౧. ధ్యానము.

ధ్యానము మూడువిధములుగనున్నది. దేహములు మూడువిధములుగ స్థూల సూక్ష్మ కారణములతో నెటులున్నవో దేహము ననుసరించి ధ్యానాదులున్నవి. స్థూలశరీర మగ్నిప్రధానమయి బాహ్యములోనున్నదికాన మొదట నీస్థూలదేహముతో బాహ్యధ్యానము చేయవలెను. ఈ బాహ్యధ్యానము ముఖ్యముగ వైదికముగాఁ జేయవలెననిన అగ్నిసాక్షిగా అగ్నిముఖముగాఁ జేయుటే మిక్కిలిప్రశస్తము. ఈధ్యానము కర్మలననుసరించినదైయుండును. కర్మలతోఁ గర్మలననుసరించి అగ్నిసాక్షిగ అగ్నిప్రధానముగాఁగల కర్మలనుజేయుటచే నీస్థూలశరీరము పరిశుద్ధమై తద్ద్వారా చిత్తశుద్ధిగలుగును. స్థూలశరీరము మొదటిది. ఇదికర్మప్రధానభూతమైన క్రిందనుండు ఆదిభూతము. దేహమాధారభూత మగుటచేత యజ్ఞరూపిణియగు నగ్నియందు వైదికకర్మలగు సమిదాజ్యచరు హోమయజ్ఞాదులతోఁ జేయవలెను. ఇది మనవైదికధర్మము. ఆర్షసాంప్రదాయము. భార్యాగ్నినుంచుకొనుటశ్రేష్ఠము. దీనినే గార్హపత్యాగ్నియనియు మన అంతరదేహములో జఠరాగ్నియనియు నందురు. వీటిని గాపాడుట ప్రధానము. ద్యులోకములోనున్న సూర్యునికి నిది ప్రతిరూపము. ఈ లోకములో అగ్నిసాక్షితోనే సర్వకర్మలు చేయవలెను. త్రిభువనములకుఁ గర్మసాక్షి సమష్టిగ ఆదిత్యుఁడున్నాఁడు. ఈ భూలోకములోఁగల కర్మలకు సాక్షిరూపుఁడు అగ్నియని తెలియవలెను. తుదకు రెండును ఒక్కటే. దేహములో జఠరాగ్ని భార్యముగానుండిన నెంతప్రయోజనమో యటులనే బాహ్యములో గృహస్థునకును, బ్రహ్మచారికిని భార్యాగ్ని ప్రయోజనకారిగనుండును. ఉభయులకును, సాయంప్రాతస్సమయములందే హోమాను లున్నవి. వీటితో వాయుభూతాగ్నులు చైతన్యవంతములై కాపాడఁబడుచుండును. ఎల్లరు "యావజ్జీవ హోష్యామి"యను వచనసారమును గ్రహించి హోమాదుల నిరంతరము చేయవలెను. ఈ అగ్నికనేకపర్యాయపదములు ననేకార్థకార్య ఫలములతోనున్నవి శుచ్యగ్ని, పావకాగ్ని, వైద్యుతాగ్ని, ఆదిత్యాగ్ని దహ్యాగ్ని ఇత్యాదులాపర్యాయపదములు. రాత్రులందు సూర్యుఁడులేనందునఁ గర్మలులేవు. ఈయగ్న్యుపాసనతోను శ్రీవేదమాతయగు శ్రీగాయత్ర్యుపాసనతోను ఫలము సిద్ధించును

గాయత్రి సూర్యునియందున్నదని ప్రమాణములున్నవి. ఉపరిబ్రహ్మాండములో ఆదిత్యోపాసనగను, నిచ్చట అగ్న్యుపాసనగను మనకు నిరంతరోపాస్యములుగ నున్నవి. ఇట్టిఅగ్నిని నేడు సర్వహేయకార్యములందు అతినీచముగ, మనకు సేవకునిగఁ జూచుకాలము గలిగెను.

మనమహర్షులు జాతవేదుడని, యజ్ఞపురుషుఁడని యగ్నిముఖమునందు సర్వదేవతలున్నారని "అగ్నిముఖా వై దేవా" యని అగ్ని ప్రథమదేవతయని అధిదైవతముగ ఉపాసింపఁజేసిరి నేటికవి దూరములైనవి. గాయత్రి యెటులనిత్యసంధిగా సర్వదా నున్నదో యాఅగ్నిగూడ నిత్యసంధిగా సర్వకర్మలకునున్నది. కర్మలతో అగ్నిగను ఉపాసనతో గాయత్రిస్వరూపముగను రెండును విహితములైయున్నవి. ఇవిమనకు ప్రథమసంస్కారోపాస్యములు, సంధిదైవతములు. ఇవిమనకు బ్రహ్మోపాసనలుగా నుండుటచేతనే మనము బ్రాహ్మప్రతులమై బ్రాహ్మణశబ్దవాచ్యులమయి ప్రథమసృష్టిలో బ్రహ్మముఖముననే వేదవిహితాచార కర్మప్రధానులమై, విరాట్పురుషుని ముఖమునందు ఆవిర్భవించి క్రమగతముగా నింతవరకు రాఁగలిగితిమి మనకుఁగల ఆధిపత్యమును స్థానమును ఆలోచించిన ఈప్రపంచమెంతటిదో తెలియును.

మనము యజ్ఞయాగాదులచే సమస్తదేవతలకు హవిస్సులను ఆహుతులొసంగుటచే దాతలుగా నగుదుము. అందుచేతనే బ్రాహ్మశక్తికి దేవతలు, రాక్షసులు సర్వులు భయపడుచుండిరి. ఇక రాజులెంతటివారలు? జనులెంతటివారలు? ఇట్టి శక్తులు తపస్సులు మనకు జన్యములుగానున్నవి, "పరశురాములసు దలంచినఁ జాలును" భగవంతుని సోమసూర్యాగ్ని లోచనుఁడని చెప్పిరిగాన మొదటిదగ్ని. రెండవదాదిత్యుఁడు. మూడవది సోముఁడు

అగ్న్యుపాసనగ రాత్రియందును, పగటియందును, దీపారాధన ప్రథమమునఁ జేసినవెనుకనే సర్వకార్యములను జేయుచున్నాము. ఇంతకంటె నిదర్శనము లేల? మనఅంతరములోఁగూడ ప్రారంభములోఁ దేజోధ్యానముననే చేయుచున్నాము. ఇదియే అగ్నితత్త్వము. ఈలోకములోఁ బ్రారంభములో అగ్న్యుపాసన చేసిన తర్వాతనే ఉపాసనాధ్యాన యోగాదులను జేయవలెను. అగ్నియేరూపము. రూపమేఅగ్ని. ఉభయత్రి సగుణములకును, ధ్యానాదియోగములకును, కర్మలకును నిది ప్రధానము. దేహము కర్మజన్యముగాన కర్మలకు అగ్నిప్రధానము. అగ్నియును బరస్పరసంబంధములుగా విడువరానిదిగా నున్నది. ఇది వైదికార్ష సాంప్రదాయ ప్రథమ బాహ్యధ్యానము. ఇది తమోలోకము. తమోనాశ

నార్థముగ అగ్న్యుపాసనయందు వహ్నిధానము. ఇదిఅధోలోకముగాన అగ్నివహ్నిధానముగ నున్నది.

ఈ లాగునవిడిచి మేముబ్రహ్మను ఉపాసించుచున్న జ్ఞానులమై జ్ఞానకోటిలో జేరినామని మాకివి అనావశ్యకములని అనుకొన్న నది స్వప్నతుల్యమే. ఎండగుఱ్ఱములనుజూచి సర్వము నీరేయనెడి భ్రాంతియేకాని సత్యములుకాజాలవు. అట్లైన మహాపాతకికూడ నీలాగుననే క్షణములో ముక్తిపొందవచ్చును. మాటలు చెప్పవచ్చునుగాని భోజనాదులందును సుఖాదులందుమాత్రము సమత్వగుణము అణువైనను గావరాదు. గుడిలో కాని తైలముతో దీపారాధనముచేసి చూచి యెఱుగని వారలు నిర్గుణ నిరాకారాత్మను సర్వదా వెలుగింతుమన్నచో నెంతటిసమర్థులో తెలియదు.

ఈధ్యానమునకు మొదటిస్థానముహృదయము. రెండవది భ్రూమధ్యము. మూడవది తదుపరిస్థానము.



౨. ధ్యానము.

—♦ ఆదిత్యోపాసన రెండవది. ♦—

ఆదిత్యుఁడు మనకత్యంతదూరములో నుండుటచేత నాదిత్యోపాసన కర్మమున కంత యనుకూలముగ నుండఁడు. ఇదియొకకారణము. దీనిని ఆ క్రమము లో జేయవలెను. మొదటిది బాహ్యవస్తుజయము, రెండవది అంతర్జయము. మొదటిది స్థూలదేహజయము రెండవది సూక్ష్మదేహజయముకాన దీనినిఅంతరములో ధ్యానాగ్నితోనే జయించవలెను. సూక్ష్మదేహము అనంతరములోనున్నది. ఇదికేవలము తేజస్సంబంధ తేజోభూతలోక దేహముగాన ధ్యానాగ్నితోనే ఇది సిద్ధినిఁబొందవలెను స్థూలదేహము జలపృథివీభూత సంబంధము, సూక్ష్మశరీరము తేజోవాయుభూతసంబంధము. మొదటిది ఉదయకాలమందును నిది తదనంతరమును జేయవలయును. ఉదయమందు నిత్యకర్మలను దీర్చుకొనినపిమ్మట ధ్యానము సలుపవలెను దీనికి మధ్యశరీరము హృదయము. హృదయమనగా స్థూలశరీరాంతము, సూక్ష్మశరీరాదియని తెలియవలెను, ఇచ్చటి ఆదిత్యుఁడు విద్యుల్లేఖగా ప్రకాశించియున్నందునఁ దత్స్వరూపముగా ధ్యానముచేయవలెను. ఏ దేవతనైనను నీస్వరూపముగానే

ధ్యానించవలెను. బాహ్యములో స్థూలములో శరీరభేదములుగ బ్రహ్మ విష్ణు రుద్రు లవి అంతరములో త్వంబ్రహ్మా, త్వంవిష్ణు, త్వంరుద్ర అని త్వంపదవాచ్యము లతో సూక్ష్మశరీరము సద్రూలకునుసమానమేగాన నిచ్చట, నేదేవతనైనను ఆది త్యస్వరూప విద్యుల్లేఖగానే ధ్యానించవలెను. ఇదిస్థూలమునకు కారణమునకు మధ్యలోగలధ్యానము. సగుణమునకును నిర్గుణమునకు మధ్యలోనిదే ధ్యానము ఇచ్చట శబ్దస్పర్శరూప రసగంధ తన్మాత్రలకే అవకాశము. బాహ్యములోనుండి నవి తనఅంతరములో సూక్ష్మముగ సంబంధము. ఇదిసూక్ష్మశరీరము. మరల నిచ్చట నుండి తదుపరిభ్రూమధ్యస్థానమువరకు ఒకేవిధసంబంధముగ ధ్యానము. తదుపరికా రణములో సహస్రారములోలీనము. మరల అధోముఖముతో క్రిందికిపతనము. ఇటు లనే శరీరములను, అవస్థలను తెలియవలెను. అందుచేత సర్వకేంద్రముగనున్న హృద యధ్యానమునుండి భ్రూమధ్యమువరకు రాగలిగి యిచ్చటమరల ఉపాసించినవాడై మరల సూక్ష్మతరమగు కారణధ్యానము నవలంబించినచో కారణములో సమాధిగ నిలుచును.

ఇచ్చట ఆహవనీయాగ్ని యున్నదిగాన ఈ మార్గముతోను సంబంధమేయు న్నది. ఇదిహిరణ్యగర్భోపాసన. ఇచ్చట రజోగుణ నాశనమగును. జలపృథివీ రూపములిందులో లీనమగును. తేజోభూత సూక్ష్మదేహమే అనుభవముగనిలుచును. దీనిపైన ఆదిత్యభేదనమేను. ఇచ్చటనుండి జ్ఞానప్రాధాన్యమత్యావశ్యకము. లేకున్న నీ తేజస్సు లీనముకాజాలదు. ఇచ్చటఆజ్ఞచక్రమున్నది. తదర్థమునే దెలియజేయును. త్రివిధలింగమునుజయించి ద్విపాదస్వరూపమగు హంసరూప ప్రణవముతో ముందుకు వెళ్లవలెను. నిచ్చట దక్షిణాగ్నిజయముగూడ నగును. యజ్ఞములోగూడ ఉత్తర వేదికలు, దక్షిణవేదికలున్నవి. అగ్నిదక్షిణములోనుంటచేత నీపేరుగలిగెను దీనికి పైన హంస ఏకపాదమగును. అందుచేతనే సూర్యునికిని హంసస్వరూపుడని పేరు గలిగెను. వాయుస్వరూపుడనిఅర్థము. వాయుతత్త్వస్వరూపదేహమును జెందును. ఇచ్చట అశ్వమేధాంతములో సర్వయజ్ఞకర్మలు ముగియును. స్వమేధమగు ఆత్మ యజ్ఞమే మిగులును. ఇది ఏకాహాత్మకయజ్ఞము. మిగిలినవి యనేకహోత్రక యజ్ఞములు. ఈవిషయము చిత్రిపన్నములో విమర్శగాయున్నది. చూడవలెను.



## ధ్యానము 3.

### —♦ ధ్యానయోగము మూడవది. ♦—

ఇచ్చటనుండి కేవలము బ్రహ్మోపాసనగల ఆత్మోపాసనమేను. "తేబ్రహ్మలోకేతు పరాంతకాలే" అను ప్రమాణరీత్యా అన్వయము. పరమహంసోపాసనము. ఆత్మయందు లీనోపాసనమేను. త్యాగముతో సర్వసంహారము సర్వకర్మలు కర్మఫలములు బొత్తిగాయుండవు సంకల్పమేలేదు.

యాజకులకు (ఆహితాగ్నులకు) జీవితమువరకు గార్హపత్యాగ్నిసంబంధముగను, మరలజీవికి, నిదేయగ్నిసంబంధముతో దక్షిణాగ్నిగను ఉపయోగింతురు. అగ్నులుఎడతెగనివిగా దేహాంతమువరకును, ఆవలదేహమునకును మరలసంబంధముగా నెటులున్నవో ఇదేవిధముగా ఉపాసనలు ధ్యానయోగాదులు సర్వదేహములకును సంబంధములుగనున్నవి. అగ్ని ఇహపరసాధకము.

మనవేదములో నెక్కుడజూచిన అగ్నిమహిమను, ఆదిత్యమహిమను తేజోమహిమనేచాల విపులముగవర్ణించిరి. సప్తద్వీపములలోగూడ నివిధముగ పంచభూతాత్మక దేవతాప్రధానముతో ఉపాసనలున్నవి. "సూర్యఆత్మజగతః" యాజగత్తునకు సూర్యుడే ఆత్మయని వేదములుపలికెను. సర్వకార్యకారణుడు సూర్యుడేను. సూర్యునివల్లనే లోకము, లోకనము, లోచనము, ఇహపరములు.

వేదములుజదువనివారలకు కర్మలమహిమలు ఫలములు ప్రయోగములు, ప్రయోజనము లెట్లుతెలియును. తెలియజాలరు. అందుచేత వేదబాహ్యులైనవారలు కర్మల నావశ్యకములని వాదింతురేగాని వేదములను జదివినవారలెప్పటికైనను వాదించరు. తుదకు గీతనైనను కొంతవఱకు చదివినను కర్మలందాసక్తి గలుగును. బొత్తిగా వేదములను, గీతయును జదువనివారికి బొత్తిగానీవిషయములు బధిరునికి శంఖారావము లేను. మనతోయజ్ఞేశ్వరుడును జెడి మనమెట్లు సర్వేంద్రియహేయకార్యములను అభిమానించి జీవించుచున్నామో అటులనే యజ్ఞేశ్వరుడు సహితమనుభవించుచున్నాడు. ఇందుకుకారకులుమనమేను. ముందుబ్రాహ్మణుడు సర్వవిధముల నుడుగుచుటచేతనే సర్వముచెడిపోవుచు ప్రమాదములసమీపించును. బ్రాహ్మణుడు స్వధర్మనిష్ఠలోయున్నంతకాలము, వేదపురాణశాస్త్రములకును కర్మలకును ఉపాసనాదులకును దేవతలకును యజ్ఞేశ్వరునికి దేనికిగాని ప్రమాదములు క్షామములు విపరీతములు సంభవింపవు. మొదట బ్రాహ్మణ్యముచెడిననే ఆవలసర్వముజెడును.

అగ్ని ప్రతిష్ఠలు లేవు, చరుజ్యసమిధహోమాదులు లేవు. ఇష్టులు లేవు. దర్శ పూర్ణిమాసాదులు లేవు, యజ్ఞములు లేవు. యాగములు లేవు. హవిస్సులు లేవు. పర్జన్యుడు లేడు. అన్నియు అసంభవములు. తుదకు బలిదానములకు ప్రాణాహుతులకు అభావమాయెను. మనప్రాణమే ఆహుతిగా నగుకాలము సంభవించినది.

సోమోపాసన 3 వది.

ఇదిమూడవఉపాసన కారణోపాసన. శుద్ధసాక్ష్యోపాసన- ఇది ప్రాజ్ఞఉపాసన. లీనోపాసన- భ్రూమధ్యమునుండి తదుపరి బ్రహ్మరంధ్రాంతములోగలది సోమోపాసన- అమృతతత్త్వోపాసన. సుధాసింధు రసోపాసన. దీనిపైన తురీయోపాసనే నిర్వాణము. ఇంతవరకూ సూక్ష్మతర ఆవరణములు దీనిపైన నిరావరణము. "తేసోమంప్రాప్నువంతి" అని ప్రమాణమున్నది. అనగా మనోలీనోపాసన శివశక్తి సమ్మేళనము. ఐక్యము, లీనము, ప్రకృతిపురుషైక్యము అన్నియు పర్యాయపదములు. "చంద్రమామనసోజాత" ఇది ధృవసప్తదశీకళాత్మక సోమోపాసన. ఈ ప్రపంచములోగల వృద్ధిక్షయకళాత్మక సోముడని తలంచగూడదు- ఇది పంచదశీకళాత్మక అనిత్యకళలు. మొదటిది కేవల శుద్ధమూలజ్ఞానప్రకృతిలోగల శుద్ధఆత్మకళాంశసప్తదశీ ధృవకళాంశమే శుద్ధప్రకృతిలో ప్రతిబింబితము. దీనిఅంతముతో సంపూర్ణఆత్మేను. అందుకే మనచంద్రుడు పై ధృవకళలో అంశాంశముతో అమృతస్వరూపుడుగా నున్నందుచేతనే సర్వులకు సర్వమునకు అమృతస్వరూపుడు. మనకు ఓషధులతో ఆత్మతత్త్వమునుగలుగజేయుచున్నాడు. దైవతలకు స్వరూపముతో అమృతమునిచ్చుచున్నాడు. అమృతాంశముగా అనిత్యకళలతో తాత్కాలిక అమృతాంశ రూపుడుగనున్నాడు. మనమున్న బ్రహ్మాండమే శాశ్వతముకాని దైనందుచేత దీనిదృష్టాంతముతో ధృతకళనుదెలిసి బొందవలెను. సర్వమునీలాగుననే సర్వదృష్టాంతము లింకులోనుండి ఆవల ఉపరిలో శాశ్వతములుగానున్నవనే తెలియుటే జ్ఞానము.

హరిః ఓం తత్సత్.

---

# అ ధ్యా త్మ పీ ఠి క.

---

ప్రతిసృష్టియును ఆత్మలోనే యగుచున్నది. మరల అంత్యము ఆత్మలోనే లీనమగుచున్నది. ఈ లాగున సర్వచరాచరసృష్టి యంతయును సర్వదాసమష్టితో సర్వబ్రహ్మాండాదులుగను, విరాడీశ్వరులుగను, వ్యష్టితో సర్వలోకాదులుగను పిండాండాది సర్వజీవరాసులుగను, సమానత్వములతో సర్వసమన్వయముగ నొకే విధానముతో, కాలగుణభూతాదులతో ఆవరణములతో స్థూల, సూక్ష్మ, కారణములననుసరించి ఉపాధి దేహత్రయములతోను, బ్రహ్మాండాదిలోకాదులతో సర్వదా నగుచుండును. సమష్టితో విరాట్హిరణ్యగర్భ అవ్యాకృతులుగ త్రివిధ విరాట్టులుగను, వ్యష్టితో విశ్వ, తైజస, ప్రాజ్ఞులుగ త్రివిధజీవులుగను సత్వ రజస్తమోగుణములతో ఉత్తమ మధ్యమ కనిష్ఠులుగ నొక్కస్వరూపమునందే లెక్కింపరాని యనేకబ్రహ్మాండములును, చరాచర అనంతనామరూప జీవరాసులును సర్వసాధారణ లీలగా నిమిత్తమాత్రములుగ నగుచున్నవి. ఇవి శాశ్వతములని తలంచువారలకు శాశ్వతములుగను, అశాశ్వతములనినిశ్చయించిన జ్ఞానయోగధీరులకు శాశ్వతములుగసు అభ్యాసములుగను, స్వప్నతుల్యముగను, భయభ్రాంతివ్యామోహాదులు లేక స్వస్వరూపమే సర్వదా సద్వస్తు సంపూర్ణానందమే అనుభవమైయుండును. ప్రపంచమే శాశ్వతసత్యమని తలంనువార లట వారిస్వేచ్ఛానుసారముగనే శాశ్వతముగనే నిరంతర మెడతెగని పరంపరలలోగల జన్మాదులుగ మిశ్రిత ద్వంద్వములతో ననేకభేదములుగ, విపరీతవింతలుగ వ్యామోహితులై విడువరానిదిగనుండును. ఎవని కేనాడు బాధయని దుఃఖమనితోచునో విచారముతోనే యెవరిదుఃఖమును వారే పోగొట్టుకొనే నదుపాయములను తెలుసుకొని చేసుకొనగలరు. ఇది సత్కర్మపరిపక్వదశతోను, ఈశ్వరానుగ్రహముతోను గలుగునేగావి సామాన్యముగ లభింపదు

అనేక బ్రహ్మాండములను గుఱించి యెక్కువవివరములతోగాని, విషయాదులతోగాని లెక్కపెట్టియోచించువారలకు నిరంతరము ఆజన్మావధిగ నాలోచనలతోనే తాను అంత్యమగునేగాని యీవిచారము లెంతమాత్రము సాంతములుగావు. ఇటులనే జీవరాసుల విషయాదులందుగాని యీలోకాది సర్వలోకాదుల విషయవివరములందుగాని యెక్కువగా నిరంతరవివరములతోనే ప్రధానప్రమేయమని పరమావయని తలంచి కొంతవట్టువు విచారముతో తృప్తిచెందవలెను. సత్యముతోచుట

కష్టతరము. ఏలననిన యెడతెగని ఎండమావులవలె నిరంతరం చూచువారికిని ప్రత్యక్షానుభవ ప్రమాణప్రకాశములుగ అభిమాన వ్యామోహితములై చూచుచున్నంతకాలము సత్యములుగనేయుండును. నీవు బాహ్యములో బాహ్యుడవైయున్నందుచేత బాహ్యములే అభిమానసత్యములాయెను. నీ అంతరములోగల ఆత్మనెన్నడనుచూడని దోషముచేత ప్రత్యక్షానుభవముగాకపోయెను. ఇదే ప్రమాదము అవ్యక్తము. తననిశ్చయజ్ఞానముతో సర్వము నిశ్చయమేయగును. ఉన్నదే నాటికైననుండితీరును, లేనిదే నాటికైనను లేకపోవును. మధ్యలోనే అనర్థములు.

ఆదిలో నేమియునులేని మనఆత్మలో మననిత్యసర్వవ్యవహారములు నేమియునులేని అరూపమనస్సులో మధ్యలో అవ్యక్తముతో వెనుకటిఅనుభవమును మరపించి ఏవోలేనివిగ అనంతసంకల్ప వికల్పనతో యెడతెగనివిగ విడువరానివై తుదకెక్కడికి వత్తురో మనకే తెలియరాని యనుభవములుగ నున్నవగుచుండును. ఇవి మొదట నెటులనో యనేకజన్మాగులుగ అనుభవములైనందుచేత వాసనలతో రాగలుగుచున్ననేగాని శాశ్వతములుగ నెంతమాత్రము కాజాలవు. ఇందుకు అవ్యక్తదశయే కారణములు. ఈలాగున నివి సుషుప్తికాలము రాగానే యన్నియును లీనములై పూర్వమువలె నేమియునులేనివై స్వసుఖానందముమాత్రము తప్పకనిలిచి యనుభవింతుము. ఇది అవ్యక్తదశసంధిలో నుండుటచేత ముందుకు పోనివ్వక మరల బాహ్యములోనికే తోయును. ఇదే మననిత్యసంధి సంధ్యావందనము. ఇదిసర్వులకు నిత్యానుభవము. ఈలాగుననే సర్వసృష్టియున్నది.

ఆత్మను నిశ్చయించుటలో అవాఙ్మానసగోచరుని, అప్రాప్యమనసాసహ, అద్వితీయమని, సంపూర్ణమని, నైనంఛిందంతిశస్త్రాణి యిత్యాదిగను, అరూపమవ్యక్తమని, నిత్యసత్య శాశ్వతానందమని ఏవిధములుగ అవకాశములులేనిదిగ శ్రుతిస్మృతి శాస్త్రములు నిర్ణయించెను. వీటని అన్వయవిధానానుభవములతో ఆలోచనలతో తెలుసుకొనలేక శుష్కప్రకాలములోనే సిద్ధఫలితమునకు రాలేదని ప్రత్యక్షమేలకాలేదని ప్రశ్నలతో వాగ్వివాదములతో యెట్లనుభవమునకు రాగలదు. మనకీ స్వరాజ్య సంపాదనమటులనే సులభముగ అనాయాసముగ సుఖముగ వెంటనే రాగలిగినదా? సామాన్యమైనదానికే యింతప్రయాసలుగనుండగ కేవలస్వస్వరూపానంద ప్రాప్తివెంటనే యెట్లురాగలుగును. ఉదాసీనభావముతో నింకను దూరమేయగును. మన స్వరాజ్యసంపాదన మెంతదీర్ఘకాలముతో నెంతఘోరదుఃఖ పరంపరలతో నెంతత్యాగముతో నెంతశాంతముతో యెంతటిధీరతతో నప్పటికిగలిగెను ఆలోచించవలెను,

నన్నియును నటులనేను. శుభేచ్ఛగలుగవలెను. లేకున్న ప్రారబ్ధములు తప్పనివై యున్నవనే తలంచవలెను. శుభేచ్ఛ ఆస్తిక్యతగలవారుతప్పక ఏనాటికైనను ముక్తులగుదురు.

కొందఱిలోకములో అనర్థపాపభూయిష్ఠమగు నీసృష్టినేల ప్రారంభములో జేసెను. లేకున్న సర్వదాసుఖానందమేయుండెనుగదాయని ప్రశ్నింతురు. ఆత్మానుభవములో నీప్రశ్న కవకాశమే లేదు. సృష్టితో ఆత్మకు సంబంధము లేదు. ఆత్మ నిర్లిప్తుడు. నీవీస్వరూపములోనుండునప్పుడీసంబంధ బాధలు లేవు. శ్రీశంకరులందుకే జగన్మిథ్యాభ్రాంతితో నున్నదని మొదటనే తీర్మానించిరి. ఇదెట్లుండిన నీకేమి సంబంధము. అందులో నీవేలప్రవేశించవలెను. లోకములో నొకనేరములో నన్యులకు శిక్షలుసంబంధములుండునా. అసంభవము. నేరస్థునికి మాత్రము శిక్షలు తప్పవు. స్వయంకృతాపరాధముతో నన్నియునుగలుగును. మొదటనేఆత్మను నిశ్చయించుటలో నీప్రశ్నకెంతమాత్ర మవకాశమే లేదు. సృష్టినీతోనే అంతమొందించక మరలనీవేల సృష్టిని చేయుచున్నావో అదినీకే తెలియలేదు. తెలిసినవెంటనే విరమించితివా? మిథ్యావాదప్రశ్నలేగాని యదార్థమే లేదు. ఈ విషయమునే శ్రీశంకరులు చాలావివరించిరి, ఏమియునులేనిదానిలో యున్నదిగానీవుకల్పించి నీవే ప్రశ్నించుచున్నవాడవుగ నున్నావు. నీవెట్లుకల్పితుడవైతివో నెట్లుకల్పించితివో నీదినీకే దెలియదు. నీవిషయము నీకేతెలియక అధ్యారోపాపవాదము లేల ఆత్మయందు కల్పించితివో నీకే ఆలోచించితే తెలియును. ఆత్మయే లేదంకాము. నీవే యున్నావనుకొనుము. నీకుసర్వము దెలిసినది. ఇప్పటినుండి నీవుసర్వమును దుఃఖమని త్యాగముజేసి యేల ఒక్కడవే సంపూర్ణముగ నుండరాదు. నీవునీమనస్సుతో బొత్తిగాచేరక క్షణమాత్రముండు అవకాశశక్తియే బొత్తిగా లేదు. ఆత్మకేసంబంధము సృష్టితో లేదని సర్వవేదపురాణ శాస్త్రములు మొదటనే సిద్ధాంతములుజేసి యుండగ నీస్వకల్పనలతో నేమియునులేని ఆత్మకేల సంబంధములుకల్పించెదవో ఆలోచించుము. నీవుఅనునది నిశ్చయములో నీఅంతరములో అంతరాంతరములో నెంతవరకుబెళ్లి తుదకేదియేమియగునో యనితెలుసుకమలచి అవ్యక్తమగు అజ్ఞానదశతో నీవీబాహ్యములో నెక్కడినుండి యెట్లుదేనితో రాగలిగితివో, యట్టినీయజ్ఞానకారణ మెఱుగక ప్రశ్నించిన నేమిఫలము. నీఅభిమాన వ్యామోహాదులతో నీకివిబంధములై నీతోనివియే నీకే దుఃఖపరంపరా వర్ధములుగ నున్నవేగాని ఆత్మకెంతమాత్రము సంబంధము లేవు. ఏమియునులేని నీమనస్సులో నీవుచేయునేక సంకల్ప

వికల్పాది పరిణామ భ్రమణభ్రాంతిని తెలుసుకొని త్యాగముచేయలేక నీతప్పారు నీవు తెలియక ఆరోపించగముతో ఆత్మకెంతమాత్రము అపవాదములేదని స్పష్టము. అభిమాన వ్యామోహాదుల నేత్రుణములో త్యాగముజేయుదువో యప్పుడే నీకీబంధము లంటనేరవు. కర్తయు, కర్మయు, క్రియయు, భోక్తయు, సర్వమునీవేను. ఎవరిత ప్పిదమును వారేదిద్దుబాటుచేసుకొనుటే ధర్మయుక్తము, సాధనము, ముక్తియు, స్వరూపము, ఆనందము. ఇందుకుప్రమాణము "మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః" నీవు నేనున్నంతకాల మీాప్రశ్నలుండియేతీరును. ఇద్దరితోనే ప్రమాదము. ప్రమాదముతో నేప్రపంచము. ప్రపంచముతోనే దుఃఖము. రెండ వదేలేనపుడు ఒక్కటేమిగులును. అపుడేభయకంపాది దుఃఖములులేక సంపూర్ణ ముగనుండును. ఉభయులు మౌనమును ధరించిననాడేముక్తి. ఇందుకు దృష్టాం తమే శ్రీగురుదక్షిణామూర్త్యవతారము. శిష్యులందరును మౌనవ్యాఖ్యతోనే ధన్యులయిరి. మౌనమే మనోజయము. ఉపాసకుడుగావలెను. దీనినే శాస్త్రము లందు "ద్రష్టవ్యశ్శ్రోతవ్యోనుమంతవ్యోనిధిధ్యాసితవ్యః" యనిముఖ్యముగవ్రాసిరి. విశేషించి వ్రాయుటలో ఆస్తికులు, నాస్తికులును విసుగుజెందవచ్చును.

---

## చైతన్య వివరము.

చైతన్యమనగా సంపూర్ణసచ్చిదానందాద్వితీయ ఆత్మయొక్క జ్ఞానస్వరూ పమే చైతన్యము. ఈచైతన్యము సృష్టిప్రకృతిలోచేరిన ప్రాణమగును. ప్రాణమన భూతసంజ్ఞతోగలవాయురూపము. పైచైతన్యము జ్ఞానరూపముతోనున్నది ప్రకాశ భూతగుణముతో తేజస్వరూపమగును. చైతన్యమనగ కేవలజ్ఞానస్వరూపమని తుదకు ఆత్మయని సమన్వయము. ప్రకృతి ప్రవృత్తిచే భేదములగును. చైతన్యము సర్వత్ర సర్వదా ప్రకాశరూపముతో నుండుపదియనిభావము. ప్రకృతిఆవరణ ముతో భిన్నమేగాని సహజముగ సంపూర్ణము శాశ్వతముసత్యము. ఆత్మనిర్గుణస్వ రూపుడైనందుచేత రూపనామవ్యవహారాదులు లేనందుచేత ఇదేసృష్టిలో ప్రకృతితో చైతన్యముగా మార్పుజెంది భూతాదులలో మధ్యభూతమగు తేజోభూతముగను భూతాతిక్రమణముతో జ్ఞానస్వరూపముగను, సర్వాతీతమున ఆత్మగనున్నది. జ్ఞానేం

ద్రియ, కర్మేంద్రియ, అంతఃకరణములున్న భూతాదులందధిక చైతన్యము ప్రకాశము గను, స్థిరస్థావరాదులందు నిమిత్తమాత్రముగనున్నది. చైతన్యములేనిదే సృష్టిస్థితి లయాదుల కవకాశమేయుండదు. జడస్వరూపప్రకృతికే సర్వాధిక్యతయగునుగాన నిదిఅసంభవము. ప్రకృతికి చైతన్యసంబంధ ప్రకాశమేలేనిచో ప్రకృతికి ప్రవృత్తి ధర్మమేలేక స్థిరస్థావరములకంటె నధోగతిగను సర్వవ్యవహారములును నేవియును బాత్తిగా నుండనేరక స్వతఃప్రకాశములేక పరప్రకాశమునులేక నేమియును తెలియరానిదై వచించుట కవకాశమేలేనిదై ఏలాగుండునో ఎవరునూహించివచింపలేని దిగనుండునో లేక లేనిదిగనే అగునేమో తెలియజాలము ప్రకృతిలో చైతన్యము న్నందుచేతనే ఆద్యంతములతో పరిణామాది వికారగుణములతో భూతములతో ప్రవృత్తిగానున్నది.

చేతతీతి చేతనః = చితసంజ్ఞానే = ఎఱుగునది. తెలివి, ప్రాణమనిఅర్థము- సృష్టిలోనీచైతన్యము చేతనమని, అచేతనములని రెండువిధములుగ వ్యవహారములు న్నవి. ఈ రెండువిధములకు కారణము పై విధమునసరించి గలిగినది. అచేతనములు సాధారణములుగ ఉద్భిజ్జములుగ సృష్టిగనగుచుండును. చేతనములు జరాయుజములుగను, అండజములుగను, స్వేదజములుగ ఉద్భిజ్జములుగ నగుచుండును. పరిపక్వదశలతోను, కర్మఫలములతోను, ప్రారబ్ధానుసారముగ సృష్టిలోచేరి ప్రకాశించుచుండును. నిర్ణయించుట కసాధ్యము. చైతన్యభేదములకు నిదే కారణము. చైతన్యమేలేనిచో పరిణామమేయుండదు. సృష్టియనుండదు స్థిరస్థావరలోహ శిలా పర్వతాదులకు సహితము పరిణామమున్నది. పంచీకరణ పంచభూతాదులకే నీగుణములున్నప్పుడు తజ్జన్యములకేల లేకపోవును సందేహమేలేదు. ఆవరణాతిశయములతోను స్థూలసూక్ష్మకారణములతోను భూతాదులగుణాధిక్యముతోను చైతన్యము క్రమముగ తెలుసుకొనునంతటి భేదములతో నుండునేగాని చైతన్యము బొత్తిగలేదని తలంచకూడదు. ఇందుకు వాయుస్వరూప సంచారముగూడ కొంతముఖ్యముగ మున్నది. దీనివివరము తత్త్వసృష్టివిమర్శయందింకను విశదమగును. అచేతనములకు నీతత్త్వసాంఖ్యవివరముల కాస్పదములేవు. ఇవిసామాన్యసృష్టి అంత్యసృష్టి. అందుచేత మనుష్యజన్మము సర్వవిధముల శ్రేష్ఠమని దర్లభమని జ్ఞానప్రధానము చైతన్యవిశిష్టాధిక్యమని బోధించిరి. మనుష్యజన్మము ఆత్మస్వరూప జ్ఞానచైతన్యముగలది.

మనదేహములో చైతన్యము రెండువిధములుగనున్నది. ఒకటి క్షేత్రస్వరూప ప్రకృతిచైతన్యము. రెండవది జీవస్వరూప చైతన్యము. క్షేత్రజ్ఞస్వరూపము. చిదా

భాస ఈశ్వరస్వరూప తత్త్వమునమసరించి తదాదిగ జీవపర్యంతము క్రమగతముగ రాబడిన చైతన్యము క్షేత్రజ్ఞచైతన్యము. క్షేత్రచైతన్యము ప్రకృతిప్రధానముతో క్రమగతముగా రాబడిన జడాత్మకచైతన్యము దేహరూపముగ దేహసంబంధముతోను పృథివీజల రసస్వరూప మిశ్రిత ఓషధీఫలరూపముగ వ్రీహ్యాది ఫలసార పరిపక్వవీర్య రూపముగ సప్తధాతువులతో పరిణామక్షేత్ర (దేహ) రూపచైతన్యము అందుచేతనే మొదట దేహముకొంతవఱకు పితృగర్భములో నింద్రియరూపమున జీవాణువులేర్పడి తర్వాత తల్లిగర్భములోజేరి దేహముగ పెరుగుచున్న సమయములో జీవుని ప్రవేశ మగునని కపిలదేవహూతి సంవాదములోను మరికొన్నిగ్రంథములలో వినియేయున్నాము. ఈ ఈశ్వరచైతన్యము మనదేహములో హృదయాకాశమువఱకే వచ్చి నిలచి మెరుపువలె ప్రకాశించుచుండును. దీనికిప్రాణవాయువాధారము వాయుస్పందనముతోనిలిచి ప్రకాశించుచుండును. తుదకు వాయుస్పందనము నిలువగానే నిది మాయమగును. దీనిప్రతిబింబమే దేహములో జఠరములో అధోలోకముతో జడ రూపదేహములో జఠరాగ్నిగా దాహక పాచనశక్తిగలిగి జీర్ణింపజేయుచుండును. హృదయములోనున్నదే చైతన్యస్వరూపము. ఈచైతన్యము కాలమునాశ్రయించి యుండుటచేత కాలమాత్రముతో అంతరించగనే జఠరాగ్ని దీనిప్రతిబింబమగుటచేత నిదియు అంతరించును. ఈ చైతన్యమే మార్గముగుండా, జ్ఞానేంద్రియాదులనుండి నీదేహములో జీవుడుకర్మానుసారముచేరియుండునో కాలాంతముతోమరల నీజ్ఞానేంద్రియములద్వారా వెళ్ళును. ఈచైతన్యము వాయువులో అంతర్హితమగును. వాయువు వాయురూపముతో బయలుదేరివెళ్లును. జీవన్ముక్తిదశలో నీరెండునుచేరి బ్రహ్మరంధ్రభేదనముగా వెళ్ళును. అప్పటికి దేహాతీతుడు ముక్తుడగును. దేహాదులబంధములు తప్పును. క్షేత్రదేహము క్షేత్రములోనే సజాతీయత్వలీనమగుచుండును. క్షేత్రచైతన్యము క్షేత్రములోలీనమగును. ఈశ్వరచైతన్యము ఈశ్వరాంశవిరాట్టులోచేరును. మరల నిందులనే పూర్వకర్మల ననుసరించి దేహములు సంప్రాప్తములై పరివర్తనములతో మార్పులుగజెందుచుండును.

ఈదేహాంతర్గత చైతన్యమునకు స్వస్వరూప ఆత్మజ్ఞానములేక దేహమేఆత్మయని నిశ్చయించి దేహమేస్వరూపమని అభిమానించి అనాదిజన్మపరంపరలచేత వాసనారూపముతో దేహాత్మగా నొందుచుండును. దేహముచేత దీనికికర్మలే ప్రధానములుగనుండును. కర్మజన్యమే దేహముగాన మరల కర్మలవాసనలతోనే దేహము పరివర్తించును. రెంటికి నెడతెగనిసంబంధము విడదలేవు. ఏనాడు యీదేహము

తనకు మధ్యలోతటస్థించి బంధమైనదని, తనస్వస్వరూపము నీ దేహమెన్పటికినిగాదని స్వస్వరూప విజ్ఞానమును జ్ఞానేంద్రియాదులతో శ్రీణముతో దెలిసి పరిమిత్నించి తుదకు నిశ్చయజ్ఞానముతో కర్మలను విడిచి తనస్వస్వరూప జ్ఞానముతో సర్వదా ప్రకాశరూపుడైనిలిచి దీర్ఘకాలమనుభవముతో చైతన్యము ఊర్ధ్వముఖమయి సహస్రారముదాటి (అనగానిదేసూర్యమండలిభేదనము) బ్రహ్మరంధ్రముద్వారా స్ఫోటనముతో దేహత్యాగమగును. అనగా జరాసంధ కథవలె, జరయనురాక్షసిచే సంధింపబడినదానిని మరలభాగించి వేరుగాచేసినచో సంధిరాహిత్యముతో జరాసంధుగను రూపములేనట్టుగనగును. పురాణములింకుకేమనకు బోధనలుగ లక్ష్యములుగ భావములుగ పరమోపకారములుగ సగుణములుగనున్నవని నిశ్చయించినచో పురాణములు నిరర్థకములని కల్పనలని యనజాలము.

చైతన్యముసర్వదా చైతన్యముగనే యేమార్పులునులేక నిత్యసత్యశాశ్వత సంపూర్ణ సచ్చిదానందమేయగును. చైతన్యము జ్ఞానస్వరూపముగనుకనే జ్ఞానేంద్రియ ప్రధాన దేహాదులందుండుట ముఖ్యకారణము. జడాదులకు నివిలేనందున చైతన్యమునకెక్కువ యవకాశములేదు. ఆత్మ ఆకాశస్వరూపుడగుటచేత శబ్దస్వరూపుడు, శబ్దమేబ్రహ్మము. ఈ లాగుననే జ్ఞానతన్మాత్రలగుస్పర్శము, రూపగ్రహణము, రసగ్రహణము, గంధగ్రహణములు, తేజోభూత వాయుభూతము ఆకాశగుణభూత జ్ఞానేంద్రియగుణకర్మలు జడాదులకవకాశములేదు. స్థూలముతోనున్నచోటుననే చలనములేక గమనములేక ప్రవృత్తిగుణ జ్ఞానాదులులేకయున్నవి. చైతన్యప్రధానమున నివన్నియుగలుగునేగాని క్షేత్రమున నెప్పటికిని గలుగనేరవు.

ఇట్టిజ్ఞానస్వరూపచైతన్యమునుదెలిసి తానుజ్ఞానస్వరూపుడైనగాని ఆత్మస్వస్వరూపుడుకాజాలడు.

ఓం హరిః తత్సత్.

---

# ఆత్మ- జగత్తు- సత్యము.

ఆత్మయేమియును లేనిదై సర్వసంపూర్ణముతో సర్వదాసత్యమైయున్నది. ఇట్టిదానిలో కల్పిత కల్పాంత కల్పనలుగ యేమియునులేని ఆత్మనుండి యేమియును లేని మూలప్రకృతితో ప్రవృత్తిగా నీజగత్తు పరిణామముజెందెను. మరల అం

తముతో నీజగత్తంతయును ఏమియును లేని మూలప్రకృతిలో లీనమయి తుద కామూల ప్రకృతియును ఆత్మలో లీనమగును. ఒకప్పుడుండి మరొకప్పుడుండనందుచేత జగదసత్యమనియు సర్వదా జగత్తుకు ఆద్యంతములందు ఆత్మసంపూర్ణముగ సర్వదా నున్నందుచేత ఆత్మసత్యమనియు చెప్పవలెను. సృష్టితో స్థితియు, స్థితితో లయము నేనాటికైనను బొందకతప్పదు.

ఇట్టికల్పనలో మనమేమియును లేనిభావయోగముతో గల ఉపాసనలతో కనబడుచున్న కల్పితాదులన్నియునుగూడ తుద కేమియును లేనివిగ నేఅగును. ప్రతీతి ప్రకాశములుగా సృష్టిజాలమున్నంతవఱకుమాత్రము ఉపాసనాదియోగములుగూడ నున్నట్టుగానే తెలియవలెను. అనంతరము ఆత్మయోగలీనముతో నిర్వికల్పితములై యేమియును లేనివిగ నేయగును. ఈలాగున విచారవివేకముతో దెలిసి నిశ్చయించినవాడై నిశ్చయజ్ఞానయోగముతో నిలిచినవాడే తానులీనుడగును.

జగత్తని, ప్రపంచమని, సృష్టియని, నామాంతరములు. జగత్తుకు మూలప్రకృతి ముఖ్యకారణముతో తదాదిగ కాల, గుణ, భూతాదులతో ప్రపంచముగా పంచ భూతముల ప్రవృత్తితో కృతకములుగానైనవి. మరల నివృత్తితో సర్వము ఒకదానిలోనొకటి లీనముగా తుదకు మూలప్రకృతితోసహా ఆత్మలోలీనమగును. ఆత్మ సర్వదాయున్నదున్నదిగనే సత్యమయి నిలుచును.

ఆత్మ తేజః ప్రధానమగుటచేత పంచభూతముల మధ్యలో ఆత్మచైతన్యమే తేజోభూతముగను, పంచీకృత పంచభూత సంబంధమయిన దేహమధ్యలో హృదయమునందు ఆత్మస్వరూపము, అంతరాత్మగనున్నది. ఏలననగా వన్నియు జడాదులగుటచేత వీటికి చైతన్యతగలుగుటకును, తుదకివి చైతన్యఆత్మలో నీఅంతరాత్మచేరుటకును ఆత్మసర్వసంపూర్ణమగుటచేతను, సత్యమగుటచేతను, సర్వత్ర సర్వదా ప్రకాశించుచుండును. ఆవరణాగులచేత భిన్నములతో అంతరాత్మగ ప్రతీతిగా అధ్యారోపముగ జగత్తులోనున్నదే గాని సత్యమెంతమాత్రముగాదు. ఆత్మస్వజ్ఞాన రూపుడుగనుక వీటికన్నిటికిని ప్రధానము జ్ఞానమత్యావశ్యకము.

ఆఃలో జగత్తుభూతసంజ్ఞతో నున్నందుచేత తేజఃప్రభావోపాసనతోను, మరలఆత్మజ్ఞాన ప్రధానస్వరూపమగుటచేత జ్ఞానప్రధానముతో తుదకుముక్తి., భూతాదులస్థూలసూక్ష్మ కారణరూపములతోనున్నందుచేత స్థూలభూతలోకాదులలో స్థూలనివృత్త్యర్థము అగ్నిప్రధానకర్మోపాసనలతోను, "అగ్నిప్రథమోదేవతా" అగ్నిముఖావైదేవాః" సూక్ష్మలోకాదులలో తేజోరూపోపాసనలతోను, కారణభూత

లోకాదులలో వాయ్వాకాశ సంబంధములగు హంసస్వరూప ప్రణవోపాసనతోను భూతాతీతములో జ్ఞానప్రధానోపాసనతో ముక్తి.

తేజస్సును నిర్ణయించుట కష్టతరము. జ్ఞానము తేజస్సేను. ఆత్మ తేజస్సేను. భూతాదులలోను తేజస్సేను. తుదకగ్నియు తేజస్సేను. సూర్యుడు తేజస్సేను. చంద్రుడు తేజస్సేను. ఈ తేజస్సు ఆత్మస్వరూప సంబంధముగుటచేత పరంపరగా సాదర్శ్యానుసారముగ నన్నిటియందును అనుసరించి యెడతెగని ధారగా ప్రనాడిగా బాహ్యములోను అంతరములోను భూతాదులననుసరించియు భూతాతీతములో ఆత్మననుసరించి యెడతెగని ఆత్మస్వరూపముగ ఆత్మలక్షణముగనున్నవి. తేజస్సులేనిదే సృష్టిస్థితిలయాదులు గానేరవు. ఆత్మయెటుల సర్వాధారసత్యమో తేజస్సునటులనేను.

ఈ ఆకాశము పంచభూతాత్మకాకాశము. ఇందులో మిగతనాలుగు భూతాదులంతర్హితములు. మిగతనాలుగు భూతాదులలో నీయాకాశము అంతర్హితము. దీని కతీతము ఆత్మాకాశము. ఆకాశమనగా సర్వావకాశ అరూపమే ఆకాశము. భూతములకు సర్వావకాశము భూతాకాశముగను, సర్వమునసర్వావకాశము ఆత్మాకాశము. ఈ ఆకాశమే ఆత్మయని ఉపనిషత్తులుపలికెను. ఇంద్రియాదులలో తేజస్సనే తేజేంద్రియముగనున్నది. ఆత్మచైతన్యస్వప్రకాశమిూలాగున విరాడాది సర్వజీవరాసులందున్నది. మానవుల దేహాదులందు తేజోరూపచైతన్యము అంతరాత్మగను ఆత్మస్వరూపములో జ్ఞానరూపముగను పరంతుముక్తిమార్గముగనున్నది. అందుచేత మానవజన్మముశ్రేష్ఠము దుర్లభము. జ్ఞానముగలిగిననే శ్రేష్ఠముగాని అటులలేక నజ్ఞానములోనున్నచో నిరర్థకమేగాక విపరీతములకు కారణమగును.

కల్పితాదులు, మూలప్రకృతి. సృష్టిజగత్తుగాన అసత్యజడములుగను, కల్పితములేని ఆత్మస్వరూపము సత్యమయియున్నదని తీర్మానము. అదియునుగాక జగత్తు తమోగుణముతోను మలినభాగముతోను, రూపనామాది వికారపరిణామములతోను భయకంపాదులతోను. సుఖదుఃఖద్వంద్వములతోను వ్యామోహాది అభిమానవాసనలతోనునున్నది. ఇట్టిగుణాదులేవియును ఆత్మకులేవు. సర్వవిషయవిచారవివేకములతో ఆత్మయే సత్యసుఖానంద అద్వితీయసంపూర్ణస్వరూపము.

—o—

# విద్య వివరము.

---

విద్య కేవల స్వస్వరూప ఆత్మను దెలుసుకొనునట్టివిద్యకే విద్యయని స్పష్టము. ఇది వేదమూలముగాన వేదము చెప్పవలెను. ఈవిద్యసత్యజ్ఞానానంద మనంతము. పరిపూర్ణము. ఇదియేనాటికైనను ఆద్యంతములందు సర్వమూలముతో కేంద్రవిద్యగానున్నది. కేవల స్వస్వరూప ఆత్మజ్ఞాన విద్యయని తీర్మానము. క్రమాగతముగ కాలగతితో, ఈవిద్యస్వరూప మనేకవిధములుగా మార్పులుజెందినదైనది. కాబట్టి మిగతవిద్యలు సామాన్యములు, తాత్కాలికవిద్యలు. తుదకు శాస్త్రపురాణాది విద్యలైనను కొంతవఱకు మేలుగానగును. కేవల విషయపదార్థవస్తుజ్ఞానవిద్యలు, జీవనములుగాగల కృషి వాణిజ్య వ్యవహారాది విద్యలనుగుఱించి విమర్శించుటనవసరము. ఇవి జీవితాశయమాత్రవిద్యలు. ఇంకను అక్షరసముదాయములతో వాచికములుగాను వ్రాయుటకనుకూలముగా నున్నదానిని విద్యయనేచెప్పుదుము. ఇవి సర్వవిద్యలను దెలుసుకొనునట్టి మూలస్థూలధనవిద్య. వీటిసహాకారముతో సర్వమును దెలుసుకొనశక్తిగలవారలగుదుము. విద్యలు యిహలోక సాధనవిద్యలు, పరలోక సాధనవిద్యలు, స్వస్వరూపఆత్మప్రాప్తి విద్యలు ముఖ్య ప్రధానములని దెలియవలెను. పరలోకప్రాప్తిసాధనవిద్యలు కేవల ఉపాసనాదియోగములు, యజ్ఞయాగాదిఅర్చనాదులు దానధర్మములుగాగల కర్మక్రియాదివిద్యలు. ఇవికోరికల ననుసరించి ఫలములొసంగుచుండును. ఇవినిష్కామములైనచో స్వస్వరూప ఆత్మజ్ఞానప్రాప్తిగాగల ఆధ్యాత్మిక విద్యగనేర్పడి తద్వారా ఆత్మస్వరూపుడేయగును. ఇవిచైతన్యసంబంధవిద్య. మిగిలినవి జడస్వరూపవిద్యలు.

ఆదిలో సర్వవిద్యలకు సంస్కృతమే మూలము. తర్వాత ననేకవిద్యలు క్రమముగాగలిగెను. వేదములను, శాస్త్రములను, సూత్రములను పురాణములను మొదలుగాగల ఆర్షవిద్యలనుదెలుసుకొనుటకు సంస్కృతభాషయే ప్రధానము. ఇటీవల సంస్కృతవిద్యకెక్కువ వ్యాప్తిలేక సుబోధకములు గాజాలని స్థితియేర్పడినది. (కారణం జీవనములకు ఈవిద్యతో ప్రధానములేనందునను రాజకీయవిద్యగాక బోవుటచేతను, విదేశముల వారిరాజ్యపరిపాలనముతో నాదేశవిద్యకెక్కువ ప్రాముఖ్యత, విలువయుగలిగెను.) మనకుజన్మహక్కుగా మాతృభాషగానున్న సంస్కృతభాషకాలగతిచే నెటులనో పరహస్తగతమయి తద్వారావిదేశభాషలతో నిండలి రహస్యము

లను పరిశోధించి సాధనలమార్పులతో ప్రచారమునకు దేబడుచున్నవి. సంస్కృతమునే దెలిసి సహజముగానున్నదానిని శ్రద్ధతో నభ్యసించినచో మనము మరెంత ముందుకు రాగలిగియుందుమో తెలియదాయె. కాలభేదముచేత నన్నియును కొంతకాలము పరాధీనములగుట సృష్టిప్రకృతి సహజము. ఎన్నిమార్పులు జెందినను మూలముమాత్రము మార్పుజెందదు. ప్రకృతివిద్యలన్నియును స్థిరములుకానివి జడస్వరూపవిద్యలు. వీటికి చైతన్యవిద్యతోనే ప్రకాశముగలుగవలెను. ప్రకృతిస్వరూపవిద్యలకు సర్వదా కృషిచేయుచుండవలెను ఎడతెగని క్రియాకర్మాచరణలతో నుండును. ప్రకృతియేస్థిరములేనిదిగానున్నపుడు ప్రకృతివిద్యలు మాత్రము స్థిరములెట్లగును. ఈవిద్యలు ప్రవృత్తినివృత్తులతో, సృష్టిస్థితిసంహారములతో త్రిగుణముల ననుసరించియుండును. ఏది శాంతము, శాశ్వతము, అమృతము, ఆనందమో అట్టి విద్య తుదకు యేనాటికైన ముఖ్యవిద్యగానగను. పండితులనినను చైతన్యవిద్యను తెలిసినవారలకే సమన్వయముగాని యితరవిద్యలను దెలిసినవారలు సామాన్యులేను. తారతమ్యములనుదెలిసి యేవిద్యప్రధానమో వారలావిద్యను తమయిచ్ఛానుసార మభ్యసించి అనుభవింపవచ్చును. భ్రాంతిగానేవిద్యయునులేక యుండరాదు విద్య సర్వమూలముగాన సర్వముబొందవచ్చును, ఇందుకువిద్యయే ప్రమాణము. విద్య కల్పితముగాదు. సహజస్వరూపము దుఃఖమును గలుగజేయునవి మాత్రము విద్యలుగావు. వాటితో సర్వదాబాధములు, ఆవర్తులుతప్పవు.

ప్రతివిద్యను మనముక్రమించి చదివియే తెలియుటకంటె ఆధ్యాత్మికశక్తితో అంతర్వాణిగా స్వోపజ్ఞానముగ చూచినంతమాత్రముననే ప్రవేశముగలుగునట్టి శక్తిని సంపాదించుటే విద్యగాని మిగతమార్గములతో సంపాదించుట సామాన్యవిద్యగావగును. సర్వవిద్యలు చైతన్యమునుండి బయలువెడలినవిగాన చైతన్యవిద్యనే సాధించినచో "ఏకంవిజ్ఞానేన సర్వవిజ్ఞానభవతి" అనుప్రమాణానుసారము విజ్ఞానసర్వస్వము సులభమగును. మన వేదఋషులవిద్య సర్వముమనలోనేయున్నది మనలోలేనిది లేనేలేదు. సర్వబ్రహ్మాండము మనబుద్ధితత్త్వములో నణగియున్నది. అందుచేతనే మనకు బాహ్యములోగల విద్యలన్నియు చూడగనే అంతరములో స్మృతిలోనిలుచుచున్నవి. ఇదియెఱుగవలెను. ఇదిసర్వదా స్వప్రకాశముతో చైతన్యరూపముగ ప్రకాశించుచునేయుండును. మనమాలోచించికొంతసేపు అంతరములో మనస్సునిలిపినచో నచ్చట సర్వవిషయములు శ్రవణముగా మనకుగలుగును. ఇప్రడీమార్గములు దూరములైనవి. ఈవిద్యలకైనను ప్రారంభము అభ్యాసముతోగాని

గలుగవు. ఇది అధ్యాత్మశక్తితో గలుగును. మనమువిననివి చూడనివి విద్యలు విను చుందము. మనవిద్యలు మనఃప్రధానవిద్యలు. మనస్సుజడముగాన దీనిసంబంధ విద్యలు జడములు తాత్కాలికములు.

విద్యకు రూపనామాదులెట్లు గలిగినవనిన-వో మనముస్వరూపముతో నేవిధ ముగనుండినవారలకు నీరూపనామాది వ్యవహారభిన్నము లేవిధముగా కల్పితకల్పన లుగానైనవో నటులనే సప్తావరణములలోచేరిన పంచభూతాదులతో రూపనామా దులు వ్యవహారాదికములకు నిమిత్తమాత్రముగ అక్షరశబ్దస్వరసముదాయమేర్పడినది. సృష్టిలో సర్వమునకు నీ సంకేతతంత్రవిధానములతో గలిగినవి. మనకుచూచుటకు వ్యవహారములో భిన్నములుగా సహజస్వభావ ప్రకృతి వికృతముతో నగుచున్నవి. కారణాతీతమునుండి కారణసూక్ష్మ స్థూలాగులుగా మనవలె సమానములుగా సర్వ మునుత్పత్తిగానైనవి. భేదమేలేదు.



## శక్తి స్వరూప వివరము.

ఆత్మనుండి ప్రత్యేకించి ద్విత్వరూపమును జెందినందుచేతనే శక్తియని పేరు గలిగెను. ఇదిఆదిలో కేవలము అణురూపమయినను పరిణామములో మహదాకార ముతో ప్రత్యేకప్రకాశ విమర్శనాణువులనంతములతో అనంతావరణములుగ ప్రవృ త్తిజెంది పరిణమించి వ్యాపించెను. ఈశక్తికికారణము మొదటిది. స్ఫోటనముతో గంభీరధ్వని. ధ్వనితో చలనము. చలనముతో తేజస్సు. తేజస్సుతో మహత్తర బలము. ఈలాగున ప్రవృత్తిగ సృష్టిస్థితి తుదకు సంహారముతో నున్నందుచేత కార్యకారణాదులనుబట్టి బలమునుబట్టి శక్తిరూపనామ ప్రతీతిగలిగెను. ఇదిప్రి మాదమునకే ముఖ్యముగా నుత్పత్తిగానైనదనే తప్పక చెప్పవలెను. దీని కింతటిశక్తికి కారణమేమనిన యిదిజడమయినను ఆత్మలోలీనముగానున్నది. బయ టికిరాపడమొకశక్తి. ఆత్మలోనుండి యుత్పన్నమగుటచేత ఆత్మలోగల సర్వశక్తిని తనలోనుంచుకొన్నందుచేతనే దీనికింతటి అత్యద్భుతశక్తిగలిగి శక్తిగానామరూపాది కార్యములతో వ్యవహారికముగలిగెను. శక్తితోనేరెండవదిగా నగుటకు కారణము. ఈశక్తిఅవకాశాకాశ మధికముగానున్నంతకొలది ప్రమాదములంతంత అతిశయించి క్షణములో సర్వమును నాశనమును తప్పక జేయును. ఆకాశాధికముతో విస్తృతిగ

అతివ్యాప్తిగ నాశనమును జేయును.

శక్తియనగా ఆదిలో కేవల అణురూపమేను మధ్యలో భూతాదులసంయోగముతో మహత్తుగా పరిణమించినందుచేత మరల అంత్యములో మధ్యలో సంయోగమయిన భూతాదులనే నాశనము జేసి తుదకు తానుమిగులును. ఇదిప్రకృతిసహజశక్తి. దీనిఅణురూపమే ప్రమాదము. ఆత్మలోనుండి నుత్పన్నమైనందుచేత ఆత్మశక్తినట్లుపొందినదో మరల నీశక్తిలోనుండి యుత్పన్నమయినవాటి యందంతటను దీనిశక్తి అందులో సహజముగ వ్యాపించియుండును. అనంతావరణపరిణామ ప్రవృత్తిచలనముతో నున్నందుచేత మరల ప్రమాదప్రళయమునకు వీటిమూలకారణముతో సర్వావరణపరిణామాదులకును నాశనముతప్పదు. రెండువిధములకును నొకేకారణము. ఈ అణుశక్తి సర్వకార్యకారణమహాశక్తి. ఇంతటిఅత్యంతాణువుగలదానికే నింతటిమహాద్భుతశక్తియుండగా దీనికతీత అధిష్ఠానముగ సర్వసంపూర్ణముగ నిత్యసత్యముగానున్న ఆత్మకెంతటిశక్తియున్నదని యెవరూహించి చెప్పగలరు? వివరింపగలరు? ఈఅణుశక్తి కింతటిశక్తికికారణము ప్రమాదప్రళయమేగాని వేఱుగాదు. లోకములో సహజముగ బలమధికమయినంత తుదకు నాశనమునకే ముఖ్యకారణ దృష్టాంతముగనున్నది. ఆవరణములుండుటచేతనే శబ్దములో స్ఫోటనము గావించును. నిరావరణములో శబ్దములేదు. స్ఫోటనములేదు. ఆవరణములే ప్రమాదములకు కారణము. ఏలననగా ఆవరణాంతరములో ఆత్మచైతన్యమంతరించియుండుటచేత నిదిశాశ్వతసత్యప్రకాశముగుటచేత అణువు ఆవరణమేగాన ఈ అణువుతో మధ్యేకల్పితావరణములకు నాశనముసహజముగతప్పదు. లేనిదిగాన యేనాటికైనను ప్రళయముతప్పదు.

శబ్దస్ఫోటనములతో మొదటియుత్పత్తిగానగుటచేత మరల అంత్యములోను శబ్దస్ఫోటనములతోనే ప్రమాదప్రళయములు తప్పవు. ఈశబ్దస్ఫోటనము లెంతెంత అధికములో అంతంత విశాలవ్యాప్తితో ప్రమాదప్రళయములు తప్పవు. ఉత్పత్తిగానైన భూతాదులకు మరల నాశనభూతాదులతోనే ప్రమాదప్రళయములగ భూతములంతవరకు గలుగును.

ఇందుకుదాహరణము:- ఒకతుపాకిగుండుగాని, అగ్నిగోళముగాని పేలినచో దేనికి ప్రమాదములు? ఆవరణములకే ప్రమాదప్రళయములు గలుగునుగాని నిరావరణకే ప్రమాదప్రళయములును గలుగవు. శక్తియెప్పటికి అంతస్థితము లోనుండియే బాహ్యములోనికి రాగలుగును, శక్తిలేనిదే యేపనియును జరుగవు. శక్తిసర్వ

మూలప్రధానకారణము. శక్తి రెండువిధములు. ఒకటి ఆత్మశక్తి రెండవది ప్రకృతి రూపశక్తి. ప్రకృతము ప్రకృతిప్రత్యక్ష ప్రమాణములో ఆత్మశక్తిని తెలియజాలము. ప్రకృతిశక్తి వస్తుగుణకాలభూతాదులనాశ్రయించియున్నందుచేత ప్రత్యక్ష ప్రమాణానుభవములుగానున్నది. ప్రకృతిశాస్త్రవేత్తలు ప్రకృతిజన్యభూతాదులలో గలశక్తినే ప్రధానమని పరిశోధించిరి. వీటిలో క్రమాదగుణములున్నవని దెలిసియు ఆధ్యాత్మికశక్తిని అభిమానించి యెఱుంగనిదోషముతో ఆదరించరైరి. ప్రకృతిశక్తి కనేక ఉపకరణాదులు బాహ్యములో భూతాదిరూపములతో సజాతీయత గాకావలెను.

సర్వశక్తి శబ్దమూలములోనున్నది శబ్దము సర్వాధారమూలశక్తియని శబ్ద స్వరూపబీజాక్షరములతోగల మంత్రరూపముతో అధ్యాత్మికశక్తితో ఉపాసనాది యోగవిధానముతో మనమహర్షులుకనిపెట్టి సర్వమునకును మనస్సుకారణమని మన శ్శక్తితో నిచ్చటనే సర్వశక్తులను సాధించి ప్రయోగబలముతో అస్త్రములుగను, శాపములుగను, వాగధీనములోనుంచుకొని మరల అనుగ్రహమునకును తమస్వాధీనతిలోనే నుంచుకొని ఉభయసామర్థ్యములతో మహర్షులై దేవతలకును రాక్షసుల కును భయమునుగలిగించినవారలై తమకధీనులుగ జేసుకొన్నవారలైరి. సంహార శక్తి ఉపసంహారశక్తుల రెండిటిని గలిగిన స్వతంత్రులైరి. ప్రకృతిశక్తిలో నీఉప సంహారశక్తులు దుర్లభము. ఇదే ఉభయభేదము. ఇట్టిశక్తిని సామాన్యముగనే మన మహర్షులు తలంచి ఉదాసీనులై అధ్యాత్మిక ఆత్మశక్తినే ప్రధానమని తలంచి నిరంతరము, సర్వమూలకారణప్రకృతిరూప తనుమనస్సును ఆత్మయందే లీనమార్గముతో నుండగలిగిరి.

శక్తికి స్త్రీవాచక మెటులగలిగెననిన, సర్వసృష్టికి మూలకారణముజనని. ఈజననియేమూలమాయ సృష్టికిపూర్వరూపము జనని. మరల సర్వజీవరాసులకు జననియేను. ఈజననియే సర్వశక్తిస్వరూపము. ఈజననిలో సర్వశక్తులున్నందుచేత నే సృష్టికిని సర్వశక్తులుగలిగినవి. ఇవిప్రత్యక్షములు. మనకును సర్వసృష్ట్యాదికిని పూర్వరూపముమాయ మాయగజనని శబ్దవాచికముగాన, దీనికి ఉత్తరరూపము ఆత్మగాన ఆత్మకు నిదిరెండవదిగాను సృష్టిజన్యగుణముగా నుండుటచేత దీనికి శక్తి వాచకముగ స్త్రీవాచక లింగచిహ్నముగా వ్యవహారికమాయెను.

శబ్దముతోసర్వమూల మెటులనిన శబ్దస్ఫోటనముతో వాయుచలనము, వా యుచలనముతో రూపతేజస్సు. తేజస్సుతో రసరూపశలములజలముతో గంధగుణాన్వితివిగమార్పులు జెందుచున్నవి. ఇవేఆవరణములు. మరల శబ్దస్ఫోటనముతోగల

వాయుచలనముతో సర్వములకు స్పర్శగాఁగలిగి స్ఫోటనముగలుగును. స్ఫోటనముతో ప్రవృత్తియు నివృత్తియునగును. తదకీశబ్దము ఆత్మలోలీనమగును కాబట్టిశబ్దమేసర్వాధారము. ఒకశబ్దముతోనే సర్వశక్తియునుగలుగుచున్నందుచేత శబ్దశక్తి నెఱుఁగక మిగతవాటిని ఆశ్రయించుట సామాన్యమగును.

మూలప్రకృతిమాయలో నెంతఆత్మశక్తియున్నదో మనమనశ్శక్తిలో నంతయున్నది. సర్వసృష్టిసమష్టితో బ్రహ్మాండములో మాయగను వ్యష్టిసృష్టిలో ప్రత్యేకించినందుచేత మనస్సుగామాఱ్పుఁజెందెను. మనకుమనశ్శక్తి ప్రధానముగను, విరాడీశ్వరత్వమునకు మాయప్రధానముగనున్నది ఏ ఒకశక్తిని జయించినను తుదకు రెండునొకటేయగును. మనస్సుమాయ, అరూపమయినందుచేత సృష్టిలో రూపమునకును ఆత్మతో అరూపమునకును ఉభయత్రిసాధనములు. ఇవి ఆత్మలో విజృంభింపవు. ఇందుకు దృష్టాంతము జడభరతోపాఖ్యానమేచాలును. ఇతను శక్తికతీతఆత్మయోగముతో నుండటచేత శక్తియేమియును జేయజాలక భయకంపాదులనొంది శక్తిప్రధానోపాసకునినే సంహరించెను. శక్తితో నెప్పటికైనను స్నేహము ప్రవర్తనముగాదు సర్వదావర్జ్యము సర్వథాప్రమాదము విషసర్పమునుపోషించి పెంచిన నెంతఫలమో తుదకట్టిఫలముతప్పదు

ఈవిషసర్పస్వరూపముతోనే మన దేహములో కుండలినీశక్తిగనున్నదని అన్వయముగబోధించిరి. దీని నిరోధమార్గమే జ్ఞానమార్గమని ఆత్మమార్గమని బోధించిరి. సర్పముకుండలాకృతితో పృథివీలింగమును సార్ధత్రివలయముగ చుట్టుమార్గమివ్వక నిరోధించుటచేత అధః కుండలీనిరోధమని ఉపాయములుగ బోధించిరి. అన్నియు సమన్వయములతో పురాణములు, వేదములు, శాస్త్రములు, తంత్రములు అనుకూలములగును. విరుద్ధార్థములెన్నటికిని కానేరవు. ప్రకృతకాలము విప్లవముతో విసుగుకుకారణముగనున్నది. ఈశక్తి ఉభయమధ్యస్థ కార్యకారిణిగ సృష్టికిని, ఆత్మకును సంధిగ మహాశక్తిగనున్నది శుద్ధజ్ఞానవైరాగ్యముతో స్వస్వరూపఆత్మకును త్రిగుణములతో సృష్టిజగత్తుకును తమస్సుతో ప్రమాదమునకును కార్యకారిణిగనున్నది.

మూలప్రకృతికే శక్తియనిపేరు. శక్తియన అణువాదిగ నెంతటిమహత్తరకార్యములనైనను సంకల్పక్షణమాత్రములోనే అవలీలగా కల్పించి సృష్టిస్థితిసంహారములతో మహామాయతో వ్యామోహింపజేసి తుదకేమియును లేకుండజేయును. వర్ణనాతీతము. మొదటనేమియును లేనిదిగానుండి అనంతరమింతటి అత్యద్భుత

విచిత్రకార్యకారణముగ అపరిమితమయి ఊహింపరానిదిగనున్నదో అందుకేశక్తియని పేరుగలిగెను. ఇదితుదకు మన దేహములో మనస్సుగాయున్నది.

—o—

## నాదబిందు కళాస్వరూప వివరము.

కళాతీతమేఆత్మ. కళయనగా శాంత అమృతానంద ప్రకాశస్వరూపముతో శుద్ధమూలప్రకృతిలో ప్రతిబింబితము వర్ణింపరానిది. ఇది కేవలశుద్ధమాయలోని ధృవకళ. ఇది సంపూర్ణానంద ఆత్మలోని యొకయంశమేను. ఇదె మొదటి సప్తదశీకళ. ఈకళ కేవల శుద్ధప్రకృతిలో మహదంశగానున్నది. దీనికే శ్రీరాజరాజేశ్వరీయని శ్రీవిద్యతో నామముగలిగెను. ఇదివృద్ధస్వరూపిణి. మరలనిదే కళయే రెండవరూపముతో షోడశీకళతో యవ్వనస్వరూపిణిగా త్రిపురసుందరిగను మూడవరూపముతో పంచదశీకళగ బాలరూపిణిగ లలితగను శ్రీవిద్యలో మహావిద్యోపాసనగ రహస్యవిద్యగానున్నది. రహస్యమనగా కేవలఆత్మవిద్యకే సమన్వయము. కేవలపరిశుద్ధాంతఃకరణజ్ఞానికే నీవిద్యబోధకాగలదని చెప్పుటకుబగులుగ రహస్యమనిరి. గుప్తమనస్సుగలవాణికే లభించువిద్యయనిఅర్థము. కేవల తామసాహంకార వర్జితునికే, రహస్యమనికూడఅర్థము. ఈకళాంశ చంద్రకళగా ప్రతిశక్తిస్వరూపదేవికిని శిరస్సునందు తప్పకధరింపబడియుండును. ఇదేనిదర్శనము. మనకుగూడ శిరస్సున సహస్రారమందు చంద్రకళాంశమున్నది. ఈచంద్రకళ కేవల సోమాంశఅమృతస్వరూపము. ఇదేరసరూపముతో సుధాసింధువు. ఇదేయజ్ఞాదులలో సోమాత్పత్తిగ సోమలతగాగల క్రియాదులుగ జేయుదురు. యజ్ఞముతో సోమపానఫలముగూడనున్నది. ఆగమతంత్రవేదభాగములతో భేదరూపనామములతోనున్న దేగాని తుదకు సర్వమునొకేయంశము. ఈచంద్రకళను ధరించినదేవియే దేవిగాని తదితర దేవతలు దేవినులుసామాన్యులు. శ్రీమహావిద్యలో ఆత్మాంశమును కళాంశముతో అతిప్రాముఖ్యతగా గ్రహించినందుచేత నీకళాంశము అత్యధికాధిక్యతగా వర్ణించి ఉపాసించితరాగులైరి. ఇదిఆత్మచైతన్యశాంతకళాంశము కేవలశుద్ధాంశము అమృతాంశము.

ఈ శ్రీమహావిద్యను శంచబ్రహ్మలు, బ్రహ్మమానసపుత్రులు ఋషుల

సంఘము, దేవతలసంఘము, పరమ భాగవతసంఘము, యక్షరాక్షసాదులు శ్రీరామాద్యవతారమూర్తులు, వీరువారలనియనేల సర్వులు ఉపాసించి వైరాగ్యముతో జ్ఞానముతో ముక్తులైరి. తుదకు సన్యాసులు జ్ఞానులు యోగులుగూడ ఉపాసించి మార్గదర్శకులైరి. కామాదులతో ఉపాసించినవారలు హతులైరి. ఇందుకు కారణము తామసగుణమే. దానివల్లనేచెందిరి ప్రమాదము. తామసగుణరాక్షసాదులు నీవిద్యారహస్యమెఱుగక అహంకారవ్యామోహాదులతో అప్రమత్తులై మార్గమధ్యలోనే హతులగుచున్నవారలైరి ఇందుకుసప్తదశీ శ్రీలలితాపురాణములే తార్కాణములు. మూలముకు శ్రీవిద్యారహస్యమెఱుగనిమూర్ఖులు తామసమనస్సుతో సర్వప్రమాదము దుఃఖము ప్రళయమునుబొందిరి. శాంతశుద్ధసాత్వికమనస్సుతో ప్రమోదానందమును బ్రహ్మముమపొందిరి. మనస్సును కదిపెట్టుట దుస్సాధ్యము. ఇందుచేతనే శ్రీశంకరభగవత్పాదులు, మనఃప్రసాదమే ముఖ్యమని సర్వవేదాన్తసిద్ధాంతసారగ్రంథములో,

శ్లో॥ మనఃప్రసాద సిధ్యర్థం సాధనం శ్రూయతాంబుధైః।
మనఃప్రసాదో యత్నత్వేయదభావే నసిధ్యతి ॥ ౧౦౫ ॥

శ్లో॥ మనోఽప్రసాదః పురుషస్యబన్ధో
మనఃప్రసాదో భవబన్ధముక్తిః
మనః ప్రసాదాధిగమాయతస్మా
న్మనో నిరాసం విదధీతవిద్వాన్ ॥ ౩౭౪ ॥

వివరించిరి. వేదములోగూడ అంతములో ఓంశాంతిఃయని ముమ్మారువచించిరి. శ్రీవిద్యతో జ్ఞానముతో సద్యోముక్తినిజెందుదురు. కామాదితమోగుణములతో దీర్ఘకాలముతో ఏనాటికి ముక్తులగుదురో? ఇందులో ఆచారభేదములతో అధికానర్థప్రమాద ప్రళయసన్నిహితులైరి. కలియుగములో చెప్పనవసరమేలేదు. మిగత ఉపాసనలకు విద్యయని నామకరణములేదు, గాని యీవిద్యకే శ్రీమహావిద్యయని నామకరణముగలిగెను. శ్రీయనగ, కేవలమోక్షమునకే సమన్వయముగాని యితరములకుకాదని స్పష్టము. శ్రీవిద్యామహిమాతిశయములు నీపురాణములనుచదివినవారలకు స్పష్టమగును.

ఈశక్తియేబిందువుగా చలనముతో మార్పుజెందెను. ఈబిందువు ప్రణవమునకు ముఖ్యప్రాణస్వరూపము. బిందువుతోనే ప్రణవమునకుశక్తిగలిగెను. ఈ బిందువే సర్వసృష్టికి కారణము. బిందువుతేజోంశము బుధ్యంశమును రూపాంశ

మునుకూడ బిందువేను. బిందువుతో కాలగుణభూతాదులు, బ్రహ్మాండములు, సర్వవాఙ్మయముగలిగెను అధోముఖముతో నివన్నిటికికారణము. ఊర్ధ్వముఖములో లీనమునకు కారణము.

బిందువుతో వాయుప్రధానముతో కాలముననుసరించి భూతాదులతో శబ్ద నాదముగలిగెను. ఈనాదమునకు ఆకాశమాధారము. ఇదిసర్వదా కేవలశుద్ధా కాశములో నాదముగలుగుచుండును. ఇదినిరంతరము నోకేవిధముగ త్రికాలము నాదు స్వయముగ మోగుచుచేయుండును. తమోగుణములో దీనినికనిపెట్టజాలము. వినజాలము. ఇదేశబ్దము మనహృదయాకాశమునందు నిరంతరము ప్రాణాగ్నియున్నంతకాలముండును. ఇదేఅనాహతము. ఈనాదమును సర్వదా ఎవడు తనచెవులతోవినునో లేక చెవులలో ధ్వనిగా నిరంతరము గలుగుచున్నదగునో అట్టివారలు కొంతవరకు ధన్యజీవులు, అధికారులు. ఈనాదమే సర్వవ్యవహారములకు ముఖ్యకారణము. ఈనాదము ఆత్మస్వరూపముగాన చరాచరములందన్నిటియందున్నది. ఆకాశమెచ్చటనుండునో నాదమచ్చటనే తప్పకయుండును, సిద్ధాంతము నాదములో నన్నియును లీనములగును. నాదముబ్రహ్మముగాన ప్రణవమునకును నాదప్రధానముతో తుదకు ఆత్మనుబొందును. నాదముక్రిందినుంచి (మూలాధారమునుండి) ఆత్మవరకును ప్రధానముగనున్నది. ఉపాసనాయోగముగకూడనున్నది. నాదముస్వరప్రధానము ఆత్మస్వరూపము మనలో నాదరూపముతో నున్నది. కాబట్టి సర్వవ్యవహారములకు నీనాదమే ఆధారము, నాదోపాసనక్రమముగ బాహ్యాదులను వినకుండ కేవలము హృదయాంతర్గతనాదమునే అభ్యాసయోగముతో వినగ దశవిధనాదములను తెలిసి తుదకు నిరంతర ప్రణవనాదముగలిగి యితరాదులను వినుటకవకాశములేక నీనాదముతోముక్తినిజెందుదురు, కళాస్వరూపమే శక్తిస్వరూపము. బిందువే ఆసనము, క్షేత్రము. నాదమేరూపము. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులివేను. తమోలోకములోశాంతికళాంశమే చంద్రుడుగను తేజోంశమేప్రకాశసూర్యుడుగనున్నది. ఈలాటిపశేషాంశములురహస్యములు, విచారపరిశోధనాంశములు తత్త్వములు శ్రీవిద్యలో అపారములుగనున్నవి. శ్రీవిద్యయనగ ప్రకృతియొక్క అద్యంతములను పరిపూర్ణముగ తెలుసుకొనదగిన మహావిద్య. మహాగుప్తగామిని గంగాయమునతో సరస్వతి వంటిది. అంతరజ్ఞానరూపిణి. రహస్యమనగా కేవలశ్రమతో జ్ఞానములో విచారశ్రద్ధలతో గురుముఖముగ తెలుసుకోదగినదేగాని (కేవల) స్వయముగా ప్రారంభములో తెలియవలసినదికాదు, అది ప్రమాదమునకే కారణము. సాంప్రదాయ

నుసారముగ పఠింపరగా శుద్ధవేదమార్గముగా అనుసరించవలసినందుచేత రహస్యమని పిలిచిరి. స్వేచ్ఛగా బాహ్యములో వినుపడగినదికానందుచేత గుప్తవిద్యయని పలికిరి. రహస్యశబ్దముమనకుకూడ సర్వవ్యవహారములందును జాగ్రతకొరకు భద్రతకై అకు మననిత్యమువాడుకలోనున్నది. రహస్యమనువచనము నూతనము, విరుద్ధముకాదు ప్రకృతినిదాటవలెననినవారలు సత్యములో నీవిద్యోపాసనతోనే క్రమముగ దాటిననేముక్తులగుదురు. ఈ విద్యతో జయించిదాటినవారలే పరమహంసలు, సన్యాసులు, త్యాగులు, జ్ఞానయోగులు, ముక్తులు. దీనిసంపుటీకరణమే మనకు వేదమాతగాయత్రిగా ఉపదేశించిరి. శ్రీవిద్యపరమసాధనము. దీనిసంపూర్ణతతో ఆత్మప్రాప్తి అతిసులభము. నాదబిందుకళలలో అమృతరసస్వరూపమున్నది. ఆత్మరసస్వరూపుడు" రసోవైసః

ఇత్యాదిఉపనిషద్వాక్యములున్నవి. ఈఅమృతరసముతోనే ఆనందమును గలుగజేయును. నాదముతో శోత్రానందము, కళతో నేత్రానందము, బిందువుతో సర్వానందమున్నది. శుద్ధప్రకృతిమిగిలియున్నంతకాల మిదిప్రకాశించును కేవల ఆత్మలో దేనికిని ఆస్పదములేదు. ప్రకృతి కేవల శుద్ధస్వరూపముతో ఆనందస్వరూపిణియగును. తమోగుణముతో ప్రమాదరూపిణియగును. ఇదేమనస్సుగ మనలోతలంచవలెను. ఆత్మరసస్వరూపుడుఅని యనగా ఆత్మలోనేమియును లేదుగాని కేవలశుద్ధప్రకృతిలో రసస్వరూపమున కవకాశముగలిగెను. ఈనాదబిందుకళలు లేనిచో నిర్జీవమేయగును. సృష్టియోజనమగును బిందువేయిచ్ఛాశక్తి. కళయేజ్ఞానశక్తి. నాదముక్రియాశక్తి. ఈమూడును ప్రకృతియందున్నందుచేత ప్రకృతిసంభవములందంతటను నివియుండును. నాదమేసత్తు. బిందువేచిత్తు. కళయేఆనందముగాన నీమూటితో సచ్చిదానంద స్వరూపసమన్వయము. నాదముత్రిగుణము. (అ. ఉ. మకారములు) ప్రణవము. దీనిసంపూర్ణమే బిందువునకరు. దీనిస్వరూపమేకళ. శుద్ధప్రకృతిలో కళ విరాట్టులోబిందువు జీవాంతమునాదము. నాదస్థానము హృదయాకాశము బిందుస్థానము సహస్రారము. కళ తదుపరిచంద్రమండలములోనిది. కేవలశుద్ధసత్వాంశము. జ్ఞానాంశము. ఈకళతో సంపూర్ణఆత్మస్వరూపమగును. ఈనాదబిందుకళలు శుద్ధసత్వములో జ్ఞానరూపమగును. రజోగుణములో శ్రీవిద్యలో శ్రీచక్రరూప ఉపాసనవిద్యగను తమోగుణములో బాహ్యములో ఉత్పత్తిస్థితులుగ సమన్వయము. శుద్ధమూలప్రకృతి జ్ఞానములోగల అమృతకళాంశమే బ్రహ్మాండములో నిదంశప్రతిబింబితముగా మనకు చంద్రుడుగానున్నాడు. ఆకళాంశముతోని సర్వగుణ

ములింకలో అంశాంశములుగ నిలిచియున్నవి. చంద్రిణిలో అమృతాంశమున కారణము దేను. ఈ అమృతాంశమే మన లోకములో ఓషధులందు అమావాస్యయందు శేషించిన చంద్రకళాంశము సుషుమ్నారూపముతో సూర్యునిద్వారా ఓషధులలో చేరి మనకు ఓషధరూపఫల సారాంశములో జీవుల కుత్పత్తికిని జీవితములకు కారణమయియున్నది. ఈ చంద్రిణిలో శుద్ధఅమృతాంశ కళలతో అపరపక్షములో స్వర్గములో దేవతాగణములకు నీఅమృతస్వరూపరసాస్వాదనముతో అమృతరూపులుగ దేవతలుండుటకు ముఖ్యకారణము. ఈచంద్రకళల నిత్యకళగా వృద్ధిక్షయాదులతో పంచదశీకళలుగానున్నవి. ప్రకృతివికృతులతో నీలాగున నుండుటకు కారణము శుద్ధమూలప్రకృతిలోగల ఆత్మాంశకళయే ధృవకళగానున్నది. క్రమగతముతో మనకీచంద్రకళలు ఈశ్వరత్వముగలవాడు అనిత్యజీవుడుగానున్నట్లుగానున్నది. శుద్ధఅమృతమునకు బదులుగా మనలోకములో క్షీరములకు సహిత మీ సంజ్ఞగా కల్పించినట్లుగానున్నది. క్షీరములకును చంద్రిణికిని సంబంధములుగా పుట్టుకగా అంశాంశములతో వేదశాస్త్రపురాణములు బోధించెను. క్షీరములందు చంద్రిణిలోగల శుద్ధశ్వేతరూపము, అమృతగుణము రసమున్నందుచేతనే క్షీరములు మనకు అమృతాంశముగనుండుటకు కారణము. అధోముఖముతో సృష్టిక్రమముతో క్రమముగా మార్పులతో మూలములోని గుణములు తదాంశములుగానున్నవి. మార్పులకు త్రిగుణములే కారణము. ఈచంద్రకళల విమర్శనలు ముందీగ్రంథములో చిత్రపటముతో విమర్శనలు చూచినబోధకాగలదు.

నాదస్థానముహృదయమగుటచేత జీవునికి ఆకాశస్థానమగును. ఆకాశము జీవాంతభూతము, ఇందుకొకదృష్టాంతము. పాశ్చాత్యఆయుర్వేదవైద్యులు మన అంతరములోగల శబ్దమును దేహమును పరీక్షించునపుడు యంత్రముద్వారా హృదయస్థానమునందేచూచి గ్రహించుచున్నారు. శబ్దమునకు ఆకాశమునిలయము. శబ్దము బయటికివచ్చుటకు కారణము వాయువు. వాయుసంధానముతో మనజ్ఞానేంద్రియమగు శ్రోత్రముతో గ్రహింతుము. మన వేదఋషులు ఉపాసనాదియోగాదులతో యంత్రసహాకారములేకనే స్వయముగ వినగలిగిరి. ఆంతరదృష్టి, ఆంతరవిద్యలు, ఉపాసనాది యోగవిధానములు ఇటీవలవారలకెట్లు తెలియును. వేదమువల్ల సంప్రదాయసిద్ధ యోగములవల్లను తెలియదగినవి. ఇట్టిసర్వవిద్యలకు నిలయముగాగలమనము ఉదాసీనతతో పరవిద్యలతో ప్రత్యక్షప్రమాణములతో బాహ్యముతో దూరస్థులై పరాధీనులమయితిమి. మనసంస్కృతవిద్య నభ్యసించనికారణముతో

సర్వస్వతంత్రిత శక్తిని విడచి అతంత్ర్యలమయితిమి. బిందువు తేజోరూపము, ఈశ్వర స్థానము ప్రణవస్వరూపము, నాదాంతముతో తెలుసుకొనగలుగుదుము. బిందువే బుద్ధిస్థానము ప్రకాశము శ్రీవిద్యకు బిందువుముఖ్యము. శ్రీవిద్యయనగా కేవల మోక్షవిద్యయేయని తెలియవలెను. ఉపాసనాదియోగములకు సాధనగా షడాధారకమలములతోను వీటికి సంధిరూప కోణములతో చేరి ఉపరిబిందువుకో శ్రీపరమేశ్వరికి స్థాననిలయము శ్రీవిద్యారహస్యమయియున్నది. బాహ్యపూజకొనిని ప్రారంభకులకు భూప్రస్థారముతో శ్రీచక్రయంత్రరాజముగను, అంతరోపాసకులకు జ్ఞానరూపముతో దేహమందే సన్నిసాధనలతో శ్రీచక్రరూప మేరుప్రస్థారముతో నాదబిందురూపమయియున్నది బిందువు స్థిరసంజ్ఞగ బుద్ధిస్థానముగ తేజోరూపముతో వుపాసనాదియోగముతో చూడగలము. నాదము మనఃప్రధానముతో చలనసంజ్ఞగాగల ఉపాసనాయోగము. ఇది జీవపంచభూతములతోను, బిందువుయొక్క ఉపాసనఈశ్వరి పంచభూతములోచేరిన ఆత్మచైతన్య తేజోరూపోపాసనగనున్నది. ఆవల సర్వపరములతో మహాతత్త్వములో సహస్రాంతముతో ఆత్మస్వరూపము అమృతసోపానతో సుధాసిద్ధువుగ ప్రారంభమయి సమాధినిశ్చలమైన తర్వాత స్వస్వరూపముతో కళాస్వరూపమేర్పడును. తుదకీకళాంశము సంపూర్ణముతో స్వస్వరూపమగు ఆత్మప్రకాశమగును. శ్రీవిద్యతోతప్ప మరేవిద్యతో సంపూర్ణవిద్యకాజాలక శేషించును. అప్పుడయినా మరల శ్రీవిద్యలభించి శ్రీవిద్యతోనే సంపూర్ణతగలుగవలెను. లేకున్న శేషించిన సమాధిలోనుండును. శ్రీవిద్యతో మూలప్రకృతిఅంతమగను. మూలప్రకృతిని సంపూర్ణముగా శ్రీవిద్యతో దెలిసినవారలై అతీతులుగావలెను. కేవలజ్ఞానముతో ఆత్మజ్ఞానముమాత్రము గలుగునేగాని మూలప్రకృతి ఆవరణబంధముతొలగదు. బంధమోక్షవిద్య నిరావరణవిద్యయగు శ్రీవిద్యనుదెలియనిదే నెట్లతీతులగుదురు. తుదకు జ్ఞానులయినందుచేత నిమిత్తమాత్రముతోనైనను శ్రీవిద్యారహస్యమునైనను దెలిసికొనవలెను వీరలు కేవలశుద్ధులుగాన జ్ఞానరూపముతో తెలుసుకొన్నచాలును. ఇదేరహస్యమునకర్థము. విద్యకర్థము జ్ఞానము. శ్రీపదమునకర్థము మోక్షము కేవలజ్ఞానులకు నీవిద్యయొక్క రహస్యము సూక్ష్మము తెలియుటమేచాలును. పరిపూర్ణులయినందుచేత నిమిత్తమాత్రము అందుచేత కేవల తురీయాశ్రమ స్వీకారముగల శంకరానులకును మహర్షులసంఘములవారికిని, దేవతాసంఘములకును తుదకు త్రిమూర్తులకును పంచబ్రహ్మలకును నీవిద్య మూలవిద్యగనున్నదని ప్రసిద్ధప్రమాణములతో దెలియుచున్నది. సర్వమూలముతోగణా

మూలప్రకృతిగానైనది. ఆత్మకు రెండవదిగానున్నది. పంచబ్రహ్మల కలితముతో మూలముగ మూలప్రకృతి ఆసీనురాలైయున్నది. సర్వముసృష్టిలోనిదేగదా. ఆది లో నిదేసృష్టిగానైనది. తర్వాత దీనిమూలముతో సర్వసృష్టియైనది. ప్రతిదియు కష్టపడి అభ్యాసముతో కాలముగడిపినగాని యేదియు ఫలానుభవములుగానేరవు. నిష్కారణముగా నేదియు సులభముగాలభించదు. స్వారాజ్యములభించవలెనన్న సామాన్యముగ లభించెనా? ఎంతకాలము, ఎన్నిశ్రమలు ఎన్నిప్రాణనష్టములతో నిశ్చలతత్త్వముతోగదా నీలో అల్పక్షణిక సుఖసంపత్తియగు స్వారాజ్యములభించెను. సర్వాతీత శాశ్వతస్వరూపానంద ప్రాప్తిగావలెనన్న, నెంతట ఏకాగ్రవిచారముతో లభించగలదు? అశాశ్వతములకును, శాశ్వతములకును తారతమ్యములను దెలియవలెను అభిమానులు గ్రహింతురు. ఎంతవివరించినను, చదువుటకును వినుటకును ఆనందముగానున్న నేమిప్రయోజనము. ప్రవృత్తి అభ్యాస యోగులుగా నగుటముఖ్యము, సాధనతోగాని సర్వసంపత్తి పూర్ణతస్వానుభవము గలుగదు. ఇందుకు శుభతీవ్రేచ్ఛావాసనలు ప్రధానములు. ఇవిరెండువిధములు. ఇహలోకసంబంధవాసనలు, పరలోకసంబంధవాసనలు. ఎవరెవరు వారియిచ్ఛాను సారము అభిమానించి అనుసరించవచ్చును. వాసనలు మనస్సునాశ్రయించి ప్రవర్తించును రెంటికిని యెడతెగని సంబంధబంధము.

సర్వజగత్కారణమునకును, మోక్షమునకును నాదబిందు కళలేముఖ్యములు. ఇవిగుణభేదములతో మార్పులతో సృష్టిలో అధోముఖములుగను, మోక్షములో ఊర్ధ్వముఖముగనున్నవి. సర్వకారణకార్యములుగనున్నవి. బహిర్ముఖబాహ్యములో సర్వవ్యవహారకారణ కార్యరూపములుగ అధోలోకమగు మనలోకములో స్థూలాకారములుగను, సృష్టిస్థితిలయాదులుగనున్నది. అంతరములో సూక్ష్మములో తేజోరూపముతో ఉపాసనాది యోగాదులుగ స్వస్వరూపానందప్రాప్తికారణ కార్యములుగనున్నది. కారణములో సర్వము స్వస్వరూపానంద స్వానుభవముతో దీర్ఘకాలమనుభవామృత రసస్వరూపముగనున్నది. అతీతమున భేదమేలేక సర్వసంపూర్ణకళతో అద్వితీయముగ శాశ్వత నిత్య సత్యముగనున్నది. ప్రయత్నములేనిదే యేదియును సంభవింపదు. ప్రయత్నమే ప్రబలము. నాదబిందుకళలు మూడు దేహములందనుసరించి తదనుసార అవస్థలుగ సర్వమూలముగనున్నవి. తుదకు జడాదులందు సహితము అంశాంశగానున్నవి. ఇవిఆత్మస్వరూప ప్రకృతితో చేరిన చిన్నములుగానుండుటచేత ప్రకృతిస్వరూపానందములుగ మనకగుపడుచున్నవి జడమగు

ప్రకృతిస్వరూపగుణములుగావు. ఆనందము, నాదబిందుకళలు చైతన్యప్రకాశ ఆత్మస్వరూపములుగా తెలియవలెను. ప్రకృతి భేదములకుకారణము. జ్ఞానముతో సర్వమును దెలుసుకొనుచున్నాము. జ్ఞానమేచైతన్యము. చైతన్యమే ఆత్మస్వరూపము. ఆనందము. ఈజ్ఞానము బాహిర్గతముతో ప్రకృతివస్తుదర్శనముతో వస్తుజ్ఞానముగా భ్రాంతిచెందినది. దీనికికారణమెక్కడిది మూలమెక్కడిదియని అంతరములోనాలోచించినగదా తుదకెక్కడికి చేరినిలుచునో తెలియగలదు. దూరమాలోచించక అల్పసంతుష్టులగుదురు. ఎవరితరము. నాదములో పంచభూతములుత్పత్తిగలిగినవి. బిందువుతో ఆనందముగలిగినది. కళతో స్వస్వరూపముగనగును. కళతో ఆనందరసముత్పత్తితో చలనముగలిగి నాదముతో భూతమయినది.

ఓం హరిః తత్సత్.



# అవ్యక్తతత్త్వము.

ఈ అవ్యక్తతత్త్వము సర్వమూలము. సృష్టిస్థితిలయాదులకు అవ్యక్తమే కారణము. దీని పేరునుబట్టి తెలుసుకొనదగిన ముఖ్యాంశమనేతోచును. అవ్యక్తమనగా స్పష్టముగ తెలియరానిది. తెలియరానిదానిని తెలుసుకొనుటే ముఖ్యాంశము దీనిని తెలుసుకొనుటకు జ్ఞానమత్యావశ్యకము. ఇదిజ్ఞానముతో పరిసమాప్తియగును. దీనిని తెలియనిచో సర్వమునకు ప్రతిబంధకములుగనుండును. దేనిని తోచనివ్వకుండాజేసి ముందుకుపోనివ్వక మరలవెనుకకు త్రోయుచుండును. అనగా అజ్ఞానమనిచెప్పవచ్చును. ఏతుదకైనగాని దీనిని తెలిసికొనిననే స్వస్వరూప సచ్చిదానందప్రాప్తి అనుభవము. ఇది ఆదిలోనేమియును లేనిదిగాన, అంత్యములోను యేమియునులేనిదే యగునుగాని నిలువజాలదు. ఏమియునులేనిదిగా నుండుట చేతనే దీనినామూలాగ్రమును దెలియుట దుర్లభమగును. ఇదిపరిణామములో తుదకనంత రూపనామ వికారాది సర్వగుణ క్రియాకర్మలుగ మార్పుజెందును. ఈ అవ్యక్తము ఆత్మకును జీవునికిని మధ్యలోసంధిగా పొరవలెనుండుటచేత ననేకపొరబాటులకును ప్రమాదములకును కారణరూపముగనున్నది. ఇది ఆత్మకు కేవలము రెండవదిగను సమీపముగనున్నది. ఇది కేవల పరిశుద్ధముతోచేరిన అవ్యక్తము. క్రమ

ముగ త్రిగుణములతో మరల ప్రతిగుణముండును నిది అంత్యావరణముగ స్థూలసూక్ష్మకారణ రూపాంతరములుగ అంతర్గతమైయుండును. కేవల తమస్సులో వర్ణనాతీతము. ఈ అవ్యక్తమునకే తమస్సుగో సుషుప్తియందును. ఇదిపునరావృత్తులను సర్వదాగలుగజేయుచుండును. ఈ అవ్యక్తము తుదకు జడాదులను సహితమావరించియున్నది. ఈఅవ్యక్తముతోనే మహత్తు, అహంకారాదిగ నితరావరణములు గలిగెను. ఈ బ్రహ్మాండము ఈలాగుననే ఆవరణములతో ఆవరించియున్నది. సృష్టి జగత్తుకును జీవత్వమునకు నిదేముఖ్యకారణము. ఇది చాలాప్రమాదములకు కారణముగ నున్నందుచేత వ్యవహారములకును ఆత్మకును సర్వప్రతిబంధకముగా నుండుటచేత రెండువిధముల తెలుసుకొనవలసిన ముఖ్యాంశము. ఆలస్యముతో సమీపప్రమాదములకే సర్వదాయున్నది. దీనినే అజ్ఞానమనికూడ చెప్పవలెను. ఇది క్షణక్షణము ఆవరించుచునేయుండును. దీనినే చీకటియనికూడ జెప్పవలెను. దీనిని జయించుటకే జ్ఞానమే సర్వత్రసులభము. ఇది ఆవరించకముందే జ్ఞానమును సంపాదించినచో సర్వత్ర దీనిప్రమాదములు బాధలు తప్పకతొలగును. అవ్యక్తము శాశ్వతముకానిది. కొంతవఱకు మాత్రమేయుండగలదు. ఆద్యంతములందు బొత్తిగాలేనిది. లేనిదగుటనే మాయయనిగూడ జెప్పవచ్చును. దీనికింతటి బలమెక్కడిదని ఆలోచించినచో ఆత్మసన్నిధిలో అధిష్ఠానములో నుండుటచేత మధ్యలోదీనికింత బలమురాగలిగెను మనలోగలమనస్సు కేవిధమయిన రూపాదులులేకున్నను, నిరాకారముగనున్నను, బుద్ధిబలముతో నిమనస్సుకు సర్వవ్యవహారములందు అపరిమితశక్తిగలిగినట్లుగనే యనితలంచవలెను. మనస్సెటుల శాశ్వతముకాదో అటులనే నీ అవ్యక్తము శాశ్వతముకాదు. నీరెండుగూడనొకటేను.

## —♦ విశేషార్థము. ♦—

శాశ్వతసత్యప్రకాశమగు మనఆత్మను తెలియకుండాజేయడము, అశాశ్వతమగు జడ, దుఃఖ, అనర్థప్రమాద హేతువుగానున్నజగత్తును కనుపడునట్లుగాజేసి భ్రాంతివ్యామోహాదులతో ఆవరించి యనేకజన్మమరణ క్లేశములపాలుజేయడము తెలుసుకొనరానిది యనిఅర్థము. ఇది ఆద్యంతములందు యీలాగున నేమియును లేనిదిగా నున్నందుచేతనే బంధవిముక్తిని స్వస్వరూపప్రాప్తికి ముఖ్యావకాశకారణముచేత మిక్కిలిప్రయోజనకారిగ నున్నందుచేత తెలుసుకొనదగిన ముఖ్యాంశము. ఉభయసాధనాంశముగమధ్యలోసంధిగా అవ్యక్తముగనున్నది. జ్ఞానముతోనిది ప్రకృతము వ్యక్తముగానున్నదానిని (జగత్తును) అవ్యక్తముగ జేయడము, అవ్యక్తమును

జ్ఞానముతో నిది అవ్యక్తమనిదెలిసి అవ్యక్తమును వ్యక్తముగానున్న ఆత్మగా తెలిసి చూడడము అనుభవించడమే ముఖ్యసారము. అందుచేతనే వ్యక్తావ్యక్తములకతీతమై ఆత్మ యేగుణమునులేక సంపూర్ణఅద్వితీయానందముతో నున్నదని మన వేద పురాణాదులందు వర్ణించిరి.

శ్లో॥ వ్యక్తావ్యక్తగుణోత్తరం సువిమలం షట్త్రింశ తత్త్వాత్మకం।
తస్మాదుత్తర తత్త్వమక్షర మితిధ్యేయం సదాయోగిభిః।
వన్దే తామసవర్జితం త్రినయనం సూక్ష్మాతి సూక్ష్మాత్పరం।
శాన్తంపఞ్చమ మీశ్వరస్య వదనం ఖవ్యాపి తేజోమయం॥

ఈఅవ్యక్తముతో ఉభయపక్షములు పరిసమాప్తి. ఆలోచించివిచారించినచో చాలసులభముగనే అరచేతిలోని మోక్షమువలెనున్నది. శాశ్వతముగా సర్వదాయున్న జ్ఞానమున్నచో అవ్యక్తమెక్కడిది? భ్రాంతిగాలేదు. ప్రమాదములు, పొరబాటులులేవు. ఈ అవ్యక్తమునకే సంధియని, దీనివల్ల సృష్టియగుటచే మాతయని జననియని (జాయయని) మూలప్రకృతియని, అందుచేతనే సంధ్యాదేవిగ, గాయత్రిగ, జ్ఞానమునకు వేదమాతగా, దీనిదాటుటకే నిత్యోపాసనగా. సంధులు సమష్టితో మూడువిధములుగనున్నవని దీని అన్వయక్రమముతో త్రిసంధ్యలుగ, జననాదులు జననితోగదా గలుగుటకు ముఖ్యకారణమని ఆత్మకును సృష్టిగానగుచున్నజీవునికిని జననిసంధిగా మూలకారణముగా నున్నదని మాతయని, తల్లిఅనుగ్రహముతో జన్మాదులుండనేరవని ప్రథమములో మనకు ఉభయసంధిరాహిత్యమునకే నిత్యసంధ్యోపాసనగా జననితో సర్వకారణమని ఆత్మతోనేమియును లేదని సంధిగాగల జననిలేనపుడు జగత్తునకు జన్మాదులకవకాశమేయుండదని తప్పనిఉపాసనగా అవ్యక్తసంధిని తెలుసుకొనుటే వేదమని అవ్యక్తమే జననియని యీ ఉపాసనే జ్ఞానమని జననిగాన, మూలప్రకృతి ప్రవృత్తితో కృతిగానున్నదని వేదమాత గాయత్రియని స్త్రీరూపిణిగ తాత్కాలిక నిమిత్తమాత్రముగ సంధిరాహిత్యమునకై ఉపాసింపజేసిన మహర్షులెరి. "మాతాపూర్వరూపం పితోత్తరరూపమ్" అని సంధి తల్లి యనంతరమేమియును లేదని సర్వకారణము తల్లియని శ్రీమాతా గాయత్రి దేవిగా గాయంతంత్రాయతే ఇతిగాయత్రీ అని ప్రథమోపాసనగా ఉపాసింపజేసిరి. ఇదిజ్ఞానరూపమేగాని వేరుగాదు, మాయయను జనని మధ్యలోకారణమయియుండగా దీనినతిక్రమించి యితరఉపాసనలతో నీసంధితొలగుటకు కారణములేదు. తొలగదు. స్త్రీరూపమువ్యవహారికము. త్రిమూర్తులకును మూలకారణము. గుణములు,

రూపనామాది వ్యవహారములు త్రిమూర్తులకు గల్పించినచో వ్యవహారదశతో సృష్టిస్థితిలయాదులతో నొకజనని మూలకారణము గావలసివచ్చును. ఇట్టిస్థితులు లేని నిర్గుణముతో నేవిధముగా నుపాసించినచో అప్పుడే భేదములుండవు. భేదములతోనే ప్రశ్నలు. మూలప్రకృతిలేనపుడు సృష్టిజగత్తే లేదు. శక్తియే లేదు. శక్తియని యనినచో శక్తికికార్యకారణములుండితీరును. ఇవిలేకున్న శక్తితో ననావశ్యకము. భ్రాంతిగావనియేయుండదు. శక్తితోనే త్రివిధగుణరూపములకు త్రిమూర్తులకు ముఖ్యకారణము. ఏకరూపముతో నిర్వాదము. ఏకముతో పూర్ణముతో నేమియునులేదు. అప్పుడీగాయత్రి ప్రశంసయే లేదు. తల్లిలేనపుడు తండ్రియుండడు. ఏకమేపూర్ణమేను, స్వస్వరూపమేను. అంతవరకు సర్వవిధములుగ సర్వకర్మలందను. సర్వమంత్రములందును, గాయత్రిమూలము మనకుతప్పనిది. సర్వదాసర్వత్ర ఉపాస్యము.

ఓం హరిః తత్సత్.

—o—

# క్షేత్ర, క్షేత్రజ్ఞ వివరము.

సృష్టిపరంపరలో క్షేత్రసృష్టి మూలప్రకృతి ప్రధానముతోనొకటి. క్షేత్రజ్ఞసృష్టి ఆత్మచైతన్యప్రకాశ ప్రధానముతో నొకటిగ రెండువిధానములతో నున్నవి. సంపూర్ణఆత్మలో మూలప్రకృతితో ఆవరణరూపాదులుగ క్షేత్రసృష్టిజడములుగను, ఆత్మచైతన్య స్వస్వరూప ప్రకాశముతో జీవాదులుగ క్షేత్రజ్ఞసృష్టిచైతన్యములుగను రెండువిధములుగనగుచున్నవి. క్షేత్రసృష్టి క్షేత్రాంశాధిక్యతాసార గ్రహణముతో దినదిన ప్రవర్ధమానముగ అచరరూపాదులగు పర్వతపాషాణాదులును, లోహాదులును, పృథివీజలాంశాధిక్యరసముతో వృక్షతరు గుల్మ లతాదులును నగుచున్నవి. చరములగు సర్వజీవరాసుల దేహములు, పృథివీజలాంశాధిక రససార ఓషధీవ్రీహ్యాది ఫలసారాంశగ్రహణముతో నివి దినదిన ప్రవర్ధమానములగుచున్నవి. చరరూప జీవదేహాదులందు ఆత్మచైతన్య తేజోంశ అగ్నిరూపముతో క్షుత్పిపాసాది గుణములతో అశనాదులను గ్రహించుచు చరసంజ్ఞగ వృద్ధియగుచున్నవి. జీవత్వమునకును, జీవితమునకును, వాయుస్పందనముతో ప్రాణాపాన

ములుగ చలనముతో ఉచ్ఛ్వాస నిశ్వాసలుగలిగి చైతన్యస్వరూపాగ్నిని ప్రకాశింప జేసి సర్వవ్యవహారములకు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములతోను. మనశ్చతుష్టయ ముతోను వచనాదానగమనాది క్రియాదులతో సర్వవ్యవహారములతో నడిపించు చున్నది. జీవత్వమునకు, జీవితమునకు అగ్నిప్రధానము: అగ్నిప్రధానమునకు వాయుప్రధానము. ఈ వాయువునిలిచినచో అగ్నియుప్రకాశించక వాయువులో లీనమగును. ఈ రెండును లేనిచో జీవత్వమునకు జీవితమునకు ప్రమాదము గలుగును. ఈ రెంటితోనే క్షుత్పిపాసాది జీర్ణశక్తులుగ జీవదేహాదులకు గలిగినవి. అచరాదులందు నిట్టి అవకాశకారణములు లేనందుచేత భేదములుగ స్థిరములుగ నున్నవి.

ఇట్టిచరరూపప్రకాశదేహాదులందు క్షేత్రజ్ఞస్వరూపము కేవల సాత్వికగుణాం శాధిక్య దేహాదులతో మహదంశగా విరాడీశ్వరులుగను, క్రమముగ దేవతాదులుగను, ఋషులుగను, తుదకు కేవల అల్పాంశముతో జీవాది దేహాదులందున్నది. ప్రమాణము, "మమైవాంశో జీవః, క్షేత్రజ్ఞంమాంవిద్ధి, క్షేత్రంప్రకృతిసంభవః"

పంచభూతములుగూడ క్షేత్రములకు ముఖ్యాధారములు పంచభూతములలో ఆత్మాంశ చైతన్యాంశ తేజోభూతముగ ఉభయభూతమధ్యలో నున్నందుచేత సద్భావవికారములతో అచరాదులకును ఆత్మసంబంధ మంతమాత్రమే పంచభూతాదులు సంబంధములుగనుండి ప్రకాశించుచున్నవి. (మిగతవిశేషములు ప్రథమ భాగములో చూడతగును.)

ఈదేహాదులు క్షేత్రరూప ప్రకృతిసంబంధములై మరలక్షేత్రముతో నుత్పత్తియైనందుచేతను, మరలక్షేత్రసారములతోనే వృద్ధిగానైనందుచేత, ఏనాడీ క్షేత్రసారమును గ్రహించలేనిదిగానగునో ఆనాడే క్షీణించును. గ్రహించుటకు ఆత్మ చైతన్యరూప జఠరాగ్ని ప్రధానకారణము. ఈజఠరాగ్నితో నీజడరూప క్షేత్రదేహాదులకు చైతన్యతగలిగినది. నశించుటకు భూతత్త్వమే కారణము. ఆత్మచైతన్యాగ్ని అంతరించుటకు పంచభూతాదులలో అగ్నియు నొకభూతరూపాగ్నిగ నేర్పడినందుచేత మార్పుజెందుటకుకారణము. భూతసంజ్ఞలో నన్నియు మధ్యలో కల్పిత కల్పనలుగా నుత్పత్తిగానైనందుచేత కల్పిత కల్పనల కేనాడైనా ప్రళయముతప్పదు.

మూలప్రకృతితో క్షేత్రాదులేలాగువ మరల కల్పితములుగానైనవో అటులనే ఆత్మస్వస్వరూపచైతన్య ప్రకాశముతో పంచభూతాదులలోగల తేజోభూతము అగ్నిభూతముగ కల్పితముతోనైనందుచేత భూతత్వగుణముతో అగ్నికి ప్రళయము

సంభవించెనేగాని ఆత్మస్వరూపచైతన్య అంతరాత్మకెంతమాత్రము యీసంబంధములు లేవు. కల్పితాదులకే ప్రమాదములు. క్షేత్రముతో ప్రత్యేకించి అంతరాత్మగా ప్రతీతిగా అధ్యారోపమైనదేగాని వాస్తవమెంతమాత్రమును కాదు. సృష్టి యీవిధముగ క్షేత్రక్షేత్రజ్ఞ సంబంధముతో విరాడాదిగ సర్వజీవరాసుల పర్యంతము దేహములతో పరిణామాది వికారగుణములతో సర్వవ్యవహార హేతుభూత, జ్ఞానేంద్రియ గుణాదులగు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములతోను కర్మేంద్రియ క్రియాకర్మలగు వచనాదాన గమనమూత్ర పురీషోత్సర్జనాదులతోను జీవభోగ్యములుగను, వీటికిమూలము, మనోబుద్ధి చిత్త అహంకారాదులతోను ఆత్మాంశము చిత్స్వరూపముతో క్షేత్రజ్ఞసంజ్ఞగా అంతరాత్మగను ప్రాణాగ్నితో క్షుత్పిపాస నిద్రాదుల క్రియాకర్మలతో జీవుడుగా నీలోకాదులలో ప్రకృతిస్వరూప క్షేత్ర సంజ్ఞగ జడదేహములతో జన్మించుతూ మరణించుతూ నీలాగున అజ్ఞానసంసార వ్యామోహాది దేహత్రయాద్యవస్థలతో నుండుచున్నాడు. ఏనాటికో ఉత్తమపుణ్యకర్మాచరణతో దైవానుగ్రహముగలిగి ధన్యుడగుటకంటే, స్వయముగా నిపుడే జ్ఞానముగలిగి తెలిసి సర్వకర్మలనాచరించి వెంటనే ముక్తిగాననగుట ఉత్తమము ప్రకృతితో క్షేత్రముగను, క్షేత్రావరణములో ఆత్మాంశక్షేత్రజ్ఞుడుగను రెండువిధములకుకారణము క్షేత్రమున్నంతవరకు క్షేత్రజ్ఞుడుగను, క్షేత్రజ్ఞుడున్నంతవరకు క్షేత్రముగను యెడతెగని సంబంధములుగ అజ్ఞానదశతో నుండగలవు. క్షేత్రదేహము లీపృథివీ భూతలోకములో కల్పితాగ్నిప్రధానముతో వాయుస్పందనముతో ప్రకాశించి దేహాంతరములో అధోభాగము నాశ్రయించి ప్రకాశించుచున్న దేహములుగను, జలభూత చంద్రలోకములో రసాంశతో జ్యోత్స్నాప్రకాశముతో తేజోరాశిని ఆశ్రయించిన సర్వకార్యములతోగల దేహములుగను, స్వర్గలోకములో, సూర్యాంశమగు తేజస్సుతో ప్రధానభూతగుణ ప్రకాశాంశతో కేవల అమృతపానమాత్రముతో స్వప్రకాశభూతగుణ దేహములతో సర్వకార్యములతోను, తదూర్ధ్వమగు ధృవునిపైనగల మహర్లోకాదిగ సత్యలోకాదులలో వాయుప్రధానముతో హంసలు పరమహంసలస్వరూప వాయుప్రధాన దేహములతో ప్రణవశబ్ద ప్రకాశసోమాంశతోగల శాంతకళాంశ ప్రకాశముతో సర్వకార్యములతో ఆత్మలోలీనాంశగాగల ప్రతీతులుగ నీలాగున నాయాభూతలోకాముల గుణానుసారదేహ జీవచైతన్యస్వరూపములతో స్థూల, సూక్ష్మ, కారణముల ననుసరించి, రూపారూపములతో కృతకాకృతకములతో, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమ

యాది కోశస్వరూపులుగ భూరాది సత్యలోకములవరకు నీబ్రహ్మాండములోనొక దేహమును విడువగానే మరల తదుపరి భూతలోకగుణ దేహములతో క్రమముగా సత్యలోకమువఱకు పోగలిగిన వారలగుచూ తుదకు ఆనందమయముతో దేహాతీతులుగ ఆత్మస్వరూపులగుదురు ముక్తియనగా కాలభూతగుణాది ఆవరణవిక్షేపాదుల త్యాగమునకే ముక్తియని తెలియవలెను.

ఇటులనే బ్రహ్మాండములోనున్న విధానమువలెనే ప్రతిమానవజీవ దేహములో పై అంశములన్నియును పిండీకృతసారముతో నీపిండదేహములో మూలాధారాది ఆజ్ఞాంతముగను ఆవల ఆనందముతో అమృతక్వసహస్రముతో నిరంతర మీ పిండాండములో నీజీవచైతన్య ముండువరకు ఆభ్యాసముతో పోగలిగిన అనుభవవాసనలతో మరలనీదేహ పాతానంతర మీవాసనలతో బ్రహ్మాండములోగల భూతలోకాదులలో సమష్టితో సర్వవ్యవహారములుగలిగి అనుభవించుదుము. ఆవల నీకారణబ్రహ్మాంతముతో బ్రహ్మాండభేదనముతో సదాశివముజేరి ఆత్మానంద మనుభవింతుము. ఈ లోకములోగల నీపిండదేహ స్ఫోటన ప్రథమకారణముతో తగుపరిలో సర్వావరణ బ్రహ్మాండస్ఫోటనముగలుగును. స్ఫోటనములేకున్న కేవల అనుభవములతో ఆయాదేహాంతములందు కొంతకాలపరిమితివఱకు తిరుగుచుండి పరిపక్వదశతో తుదకుగలిగి ఆనాడుస్ఫోటనశక్తితో సర్వాతీతుడగును. స్ఫోటనముప్రధానము. మొదటస్ఫోటనతో రాబడినందుచేత మరల అంత్యమునకు స్ఫోటనమే కావలెను.



# ఊర్ధ్వరేతస్సు వివరము.

ఈవిషయము శింశుమారములో "అష్టాసీతిసహస్రాణాం మునీనాం ఊర్ధ్వరేతసాం"అని మునులనుగుఱించి చెప్పబడినది అందుచేత పూర్వభాగములో వివరించితిని. ఇది ఆధ్యాత్మికములో జేరును.

రేతస్సునుమార్గములు రెండువిధములు. ఈరేతస్సు అధోముఖముతో అధోలోకములో అధోగతిగ స్థూలరూపముతో మలస్థానమునాశ్రయించినదై జీవత్వమునకు కారణము. దీనికి ఇంద్రియాదుల సంయోగముతో స్థూలకర్మేంద్రి

యాదుల ప్రబలముతో స్థూలేంద్రియ స్థూలదేహములు సంప్రాప్తమాయెను. దీనికి అధోముఖత్వమే సర్వకారణకార్యము. అధోముఖమే మలరూపము. మలమే మృత్యురూపము. ఇదియొకసారి ప్రారంభముతో సర్వదానిటులనే అధోగతి గామినిగా స్వాభావికముగ నగుచుండును. నిలువజాలదు రేతః=రియతి స్రవతౌ రేతసః, రి=గతౌ (స్రవించునది) (స్త్రీసందర్శనాదులతో) తనువును జేయునది. లేక కృశునిగా జేయునది.)

ఇది మొదటి సంకల్పాదులతో ఊర్ధ్వములోనున్న దానిని జ్ఞానేంద్రియములలోనికి దించి తద్వారా జ్ఞానేంద్రియాంశము లందులో జేరి, యింతవరకు సూక్ష్మరూపముతోనుండి తద్వారా అధోలోక కర్మేంద్రియాదుల కర్మలతో స్థూలరూపమయి తద్వారా రజోగుణముతో రజోగుణాశ్రయక్షేత్ర అధోలోకమగు తమోలోకమును జేరి తమోగుణమాయతో రజోగుణసారముతో ప్రత్యేకించిన జ్ఞానేంద్రియ కర్మేంద్రియాదులతో అంతరములో అణగియున్న యింద్రియాదులు భిన్నక్షేత్ర రజోంశతో అన్నియు భిన్నయింద్రియగోచరము. రూపనామాది వ్యవహారము లేర్పడెను. ఇది జడస్వరూపము. ఇది యింతటితో లీనముగాక మరల వెనుకటివలెనే ప్రవృత్తినాశ్రయించి అపరిమితస్థూలాదుల కవకాశమగును. దీనికి లీనమార్గ గుణము లేదాయెను. స్థూలాదుల నాశ్రయించుటచేతనే నిట్టిప్రమాదములకు కారణము. దీనికి ఉపరిభాగములోగల సూక్ష్మమును కారణమును నాశ్రయించినచో తుదకిది అరూపముతో లీనమగుచుండెను. అట్టియవకాశ కారణము లుగలుగ లేదు. దీనినే అధఃకుండలీమార్గముగను ఊర్ధ్వకుండలినీమార్గముగను సమన్వయము జేయవచ్చును. జీవమార్గముగను స్వస్వరూప ఆత్మమార్గముగను గూడనున్నది. ఈ స్థూల రేతస్సు ఎప్పటికిని ఊర్ధ్వముఖమునకు పోజాలదు. దీనిని విచారవివేకయోగాదుల మార్గములతో అధోముఖగామినిగాకుండ జేయవలెను. చలనముతో పతనముతప్పదు. ఇది జీవ రేతస్సు. ఈశ్వరతత్త్వముతో ఊర్ధ్వరేతస్సుగావలెను. ఇది అతీంద్రియము. అమలము. అమృతము. ఊర్ధ్వముఖముగనే యుండును. మనస్సుముఖ్యకారణేంద్రియము. ఇదిబుద్ధిలో జేరిన ఊర్ధ్వ రేతస్సగును. బుద్ధిమనస్సులో జేరిన అధోరేతస్సగును. ఉభయసంధిమనస్సు. మనస్సు అధోముఖముతో అధోముఖరేతస్సగను, ఊర్ధ్వముఖముతో ఊర్ధ్వముఖమగును, వివరింపనేల మనశ్శక్తి ప్రధానముతో కుండలినీశక్తియను సంజ్ఞగను, మనస్సుదేహాదులకు కారణమగు ఇంద్రియరేతస్సులతో అధోరేతస్సుగను వ్యవహారికములు.

ఊర్ధ్వరేతస్సు దేహాతీతము. కేవల సత్వగుణ మనఃప్రధానము. ఊర్ధ్వరేతస్కులు సూర్యమండలముపైన సప్తర్షిమండలసమీపములో శింశుమార పుచ్ఛములోనుండి తమార్గ్వలోకాదులనుపొందు యెనుబది వేల మహర్షులని దెలియవలెను. ఇంకను సూర్యునాశ్రయించిన అరువదివేల వాలఖిల్యాదిమహర్షులు సహితము ఊర్ధ్వరేతస్కులేను. మనస్సు అంతఃకరణముగాన బాహ్యకరణాదులతో జేరిన కర్మలతో అధోరేతస్సుకు పతనమునకు కారణము. ఉభయత్రి స్వస్వరూపకారణమే వీర్యము.

ఊర్ధ్వరేతస్సనగా ఊర్ధ్వస్థానముతో ఊర్ధ్వగమనముతో సూక్ష్మరూపముగు కేవల తేజస్సునాశ్రయించి క్రమముగ వాయువులో చేరుటకే ఊర్ధ్వరేతస్సు జల పృథివీఅంశములతో అధోభూతములలో జేరుటచే అధోభూతములు స్థూలములగుట చేత అధోముఖకారణము. వాయుప్రధానముతో తేజస్సునాశ్రయించి వాయు రూపమును జెందుటే సూక్ష్మరూపముతో అరూపమగుట ఊర్ధ్వరేతస్సు. దీనికి ఆకాశసమీపవాయువు ముఖ్యకారణము. ఈ వాయువునెటుల సాధించవలెనో నావిధానము నాశ్రయించవలెను. చేతనస్వరూపము క్షీణింపదు. అతీంద్రియము, దీనికిచైతన్యమే (జ్ఞానమే) వీర్యము. ఇవి దీనిసహజగుణములు. దానివి కల్పితములు, చైతన్యగుణములు అంతర్హితములు. దీనిలో అంతర్హితచైతన్యాంశముతోనే మరల ఊర్ధ్వరేతస్సుకు ముఖ్యకారణము మూలము. ఊర్ధ్వరేతస్సుకు ఆశ్రయము, శుద్ధవిద్య, తపోయోగాదులు. దీనిని అవిద్యసంబంధము లంటజాలవు. దీనికిశుద్ధ మాయా సత్వాంశజ్ఞానమే యోని. ఆత్మాంశచైతన్యముతో ధృవకళతో జ్ఞాన ప్రణవ బిందుప్రధానముతో దేహాదులనతిక్రమించి స్వస్వరూపములోజేరును. నాద మేరూపము ఆనంద సంతతియే సంతానము. ఇది ఈశ్వరత్వము.' ఊర్ధ్వరేతస్సు ఋషులకు స్వాభావికము. "ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవైనమో నమః" ఇదే ఊర్ధ్వకుండలినీమార్గము, మనః ప్రధానముతో దీనికి మొదటిది తేజోపాసన, వాయుధారణతో, చలనము, స్పర్శయులేకుండా శమాదులతోను జ్ఞానముతోను సాధనము. భూతరూపముకాగూడదు. కాలగుణాదులను బొందగూడదు. సంకల్పవికల్పాదు లెంతమాత్రము నుండగూడదు. ఇవేపతనకారణములు. శరీరమున్నచో తేజోరూప వాయురూపముతో నుండవలెనుగాని జలపృథివీరూపములను మాత్రము బొందకూడదు. వీటితోనే అధోముఖమునకు స్థూలతకు కారణము. ఊర్ధ్వరేతస్సుతో శమాదులను జయించుట శవకాశమగును. ఊర్ధ్వరేతస్సుగలవాడే యోగి. ఊర్ధ్వరేతస్కుడే గీతలోని వాక్యానుసారము యోగారూఢుడగుచున్నాడు.

"యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్యకర్మసు, యుక్తస్వప్నావబోధస్య యోగోభవతిదుఃఖ" ఊర్ధ్వరేతస్కుడే యమాది అష్టాంగయోగసిద్ధి, సమాధిస్థితి ఇత్యాదులను సాధించగలడు ఊర్ధ్వరేతస్కుడే నిస్సంగుడు, త్యాగి. ఋషి, సన్యాసి, స్వరూపుడు, ఆనందుడు- ప్రకృతిబద్ధముతో అధోరేతస్సుగామారును, ప్రకృతితో ఆవరణప్రధానము బంధము. ప్రకృతి అతీతముతో ఊర్ధ్వరేతస్కుడు ముక్తుడు ఊర్ధ్వరేతస్కునికి నిద్ర, క్షుత్పిపాసాది గుణములును మలోత్పత్తియు నుండవు. శుద్ధవాయుభూతప్రధానదేహముతో వాయులోకమునునుందురు. స్వర్గమునకంటె అతీతలోకము, బ్రహ్మలోకము. కేవల శుద్ధసాత్విక నిష్కామకర్మలతో దేహపరిశుద్ధి ద్వారా మనశ్శుద్ధిగలిగి, ఉపాసనాదులతోను యోగ నియమాదులతోను, నిరంతరము ఊర్ధ్వమనస్కుడై బాహ్యేంద్రియ నిగ్రహముతో సాత్వికాహారాది నియమముతో ధ్యానముతో క్రమముగా సహస్రారమందు మనస్సునూ లీనముగావించుచూ నిరంతర దృఢాభ్యాసముతో తైజసదేహమేర్పడి నీతేజస్సేనాడు వాయురూపమును జెందునో ఆనాటికి ఊర్ధ్వరేతస్కుడగును. రూపముండువరకూ రేతస్సుకు చలనముతో అధోముఖమునకు కారణమగును. రూపరస గంధగుణజయముతోను స్పర్శగుణమార్పుతో మనస్సునిస్సంగమగును. మనస్సు సర్వకారణకార్యము. దీని నిగ్రహమే ఊర్ధ్వరేతస్సు. స్థూలశరీరమునకు అధోరేతస్సుగామార్గము. ఊర్ధ్వరేతస్సునకు అరూపమగువాయువుతో ముఖ్యకారణము. తైజసశరీరమునకు మధ్యదేహరేతస్సుకుకారణము రూపమునకు అధోముఖరేతస్సుగా తేజోభూతమునుండి ప్రారంభము. దేవతలకుగూడ నిజయములేదు. ఋషులు శింశుమారములో ధృవమండల సమీపములో నున్నవారలకే ఊర్ధ్వరేతస్సు లభించును. కామనలుగూడ అధోరేతస్సుకవకాశము. దేవతలు కాముకులు. రేతస్సులో రసగంధరూపగుణాములుండకూడదు. గుణాదులతిశయముతో స్థూలతతో అధోముఖమగును. ఆహారాదులున్నంతకాలము అధోముఖమేను. వీటిననుసరించిన తపోయోగాదులతోను నియమాదులతోను మనోనిగ్రహముతోను స్థూలదేహసంబంధము త్యాగముతో తైజసదేహము ప్రాప్తించి మరల వాయుభూతలోక సంబంధముతో ధృవమండలాదుపరిలోచేరి ఊర్ధ్వరేతస్కులుగావలెను ప్రారంభముతో క్రమముగ నన్నియును లభించును. మనస్సుతోనే సర్వముగలిగినది. మరల మనస్సుతోనే సర్వము త్యాగమగును. మనస్సుమహిమ వర్ణింపరానిది. ఉభయకార్యకారణరూపిణి. ఇంకను కొన్ని విషయములిందుకు సంబంధించినవి. తత్త్వసృష్టిక్రమము

లో లింగదేహవిషయ వివరములో పూర్వభాగమునందు చూడవలెను.

ఓం హరిః తత్సత్.

—o—

## వ్యష్టి, సమష్టి, వివరము.

ఈవ్యష్టి సమిష్టివిచారమును కొంతవరకైనను విచారించి తెలుసుకొనవలెను. ఈ బ్రహ్మాండములో సర్వవిషయాదులందును వ్యష్టిసమష్టి రూపములతో సృష్టిగా నున్నది. ఈ రెంటిభేదములను దెలిసినగాని సర్వముబోధకాజాలదు. అందుచేత నిదియు ప్రాముఖ్యముగనే తలంచి తెలియవలెను. కర్మ, భక్తి, జ్ఞాన, ధ్యాన, తపో యోగాదుల నభ్యసించువారలకును నీవ్యష్టి, సమష్టి విచార్యముగనున్నది.

మనముసాధారణముగా, సమష్టిఈశ్వర శరీరమునుండి వ్యష్టిదేహముగా మార్పుజెందినందుచేత, వ్యష్ట్యుపాధిబుద్ధ్యాదులుగలిగి సమష్టిలోని అంశములను ఏమియును తెలియకపోవడమేగాక శాశ్వతపతనమును పొందుచున్నాము. వ్యష్టితో చాల ప్రమాదములకే కారణములుగనున్నది. ఇటులనే మనలోకాదులలోను పద వులలోను, సర్వమునందు నీలాగుననే వ్యష్టి, సమష్టిభేదములతోనున్నవి. ఇది తెలి యక యెంతటిధ్యాన తపోయోగాదులనుచేసినను, ఆత్మనుబొందుట దుర్లభము. తుద కుజ్ఞానములోకూడ నీవివరమును ముఖ్యముగ దెలుసుకోవలసియున్నది. దేహత్రి యాదులు తమోగుణావరణప్రధానముతో నున్నవి. మనవేద, శాస్త్రపురాణా దులందు సహితము నీమూడుశరీరములను వివరించుటలో, సమష్టిఈశ్వర శరీ మందు, విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృతులుగను, దీనికతీతఅత్మగను, దీనిలోనిదే మరలననేక భిన్నభిన్నరూపాంతరములతో వ్యష్టిగతంగాగల జీవదేహాదులలోను, విశ్వ, తైజస, ప్రాజ్ఞులుగను, భాగించివివరించిరి. జీవత్వముపోవలెననినచో మొదటి సమష్టి ఈశ్వరోపాసనతో సమష్టి ఈశ్వరత్వములభించి తర్వాత ఆత్మను పొందవలె ననినచో నీ ఈశ్వరత్వదేహాతీతముతో అత్మలభించును. ఇదిక్రమసముచ్చయము. లేక కేవలము నేరుగా ఆత్మోపాసనతో ఆత్మనుగూడ పొందవచ్చును. కేవలము ఆత్మోపాసనను జేసినయెడల క్రమముతో ఈశ్వరదేహముగుండానే పొందవలెను.

దీనికిప్రమాణము వేదములో "తేబ్రహ్మలోకేతు పరాంతకాలే పరామృతాత్పరిముచ్యంతిసర్వే" యనియున్నది. ఎటులనైననేమి? ప్రారంభములో నొకశరీరమును అతిక్రమించినచో క్రమముగానన్నిశరీరములను నీమార్గసిద్ధితో జయమునుబొందదగును. ప్రయత్నముతో సర్వముతప్పక లభించును

ఈమూడుదేహములనే అవస్థాత్రయములతో స్థూల, సూక్ష్మ, కారణదేహములుగ సమష్టిలోను వ్యష్టిలోను వివరించిరి. ఇవిదేహాదులు రూపాంతరములతో బొందుచున్న అవస్థలుగా తెలియవలెను. ధ్యానాది తపోయోగాదులన్నియు ఆత్మోపాసనగా తుదకుకావలసినదే బంధవిముక్తిమోక్షము. "వ్యష్ట్యుపాధికో జీవః, సమష్ట్యుపాధిక ఈశ్వరః" అని ప్రమాణవచనానుసారముగ జీవేశ్వరభేదములున్నవి. చక్రవర్తికిని, సామాన్యరాజునకుగల తారతమ్యముగ తెలియవలెను. ఇటులనే పదవులలోను, అవస్థలలోను, దేశ లోకాదులతోను బ్రహ్మాండములలో వ్యష్టిసమష్టిభేదములున్నవి. ఆత్మచైతన్యము ఈశ్వరునియందు మహత్తుగను, జీవునియందు అణుత్వముగను భేదములుగ దేహాదులయొక్క ఆవరణవిశాలమునుబట్టియు, సూక్ష్మమునుబట్టియున్నవి. ఇందుకు మరొకకారణము. త్రిగుణములననుసరించి సూక్ష్మతకు, మహత్తునకును, కారణముగనున్నదగును. కాన మనము సర్వప్రయత్నముతో వ్యష్టిభావనలుముందు బోగొట్టు నుపాయమును ఆశ్రయించవలెను. వ్యష్ట్యుపాసనతో మరలవ్యష్టిఫలమునే బొందుదుమేగాని తదుపరినున్న సమష్టిఅధికత గాగల ఈశ్వరశరీరమెట్లులభించగలదు? లభించజాలదు. సర్వజ్ఞజీవత్వప్రాప్తియే శాశ్వతబంధముగా నుండనగును. ఆవరణమేఅజ్ఞానముగాన యీ ఆవరణములగు దేహాద్యుపాధులను తెలియుటకే సర్వసాధన లవలంబించవలెను.

సమష్టిఅనగా నొకవనముగను, వ్యష్టియనగా ఆవనములోని వృక్షముగ నెఱుంగవలెను. సమష్టియనగా చక్రవర్తిగను, వ్యష్టియనగా నొకమనుష్యునిగను, సమష్టియనగా నొకగొప్పఖండముగను, వ్యష్టియనగా నొకగ్రామముగను, నీలాగున జీవభేదముతోను అవస్థభేదములతోను దేశభేదములతో సర్వమును తెలియవలెను. సమష్టితో విరాట్టు. సృష్టికర్తబ్రహ్మదేహముగను అందులోని అంశాంశగ వ్యష్టిజీవరూప దేహముగను తెలియవలెను. ఆత్మభిన్నోపాసనే వ్యష్టిజీవదేహాత్మోపాసనయగును. దేహమనగ, అనృత, జడ, దుఃఖరూపాత్మకమనే తెలియవలెను. ఇవన్నియును ఆత్మనుండి జీవునికిమధ్యలోగల అంతరకక్ష్యలుగానున్నవి. మొదటివ్యష్టిజీవదేహములోగల విశ్వదేహమునుండి తైజసదేహముజేరి మరలతైజసదేహమునుండి ప్రాజ్ఞ

దేహముతో దీనిఅతీతముతో వ్యష్టిదేహాతీతమయి తదనంతరముసమష్టివిరాట్టు ఈశ్వరదేహములో విరాట్టునుబొంది సమష్టివిరాట్టులోనుండి హిరణ్యగర్భ దేహముచు బొంది తర్వాత అవ్యాకృతమునుబొంది తదనంతరము ఉభయాతీతము, కేవల శుద్ధజ్ఞానావరణముతో తుదకు నిరావరణ ఆత్మస్వరూపము ను జెంద ను. జీవుడీశ్వరుడుగను, ఈశ్వరుడే ఆత్మగను గావలెను. ఈవిధముననుసరించే మనవేదవిహిత కర్మలలో సహితమున్నది. మనముఆరాధనలందును శ్రాద్ధాదులందును రూపత్రయములతో మొదటివ్యష్టిగా గతించినవారికి సపిండీకరణముగావించినగాని అవలగతించినవారలకు శ్రాద్ధాదులందు రూపత్రయములతో సమష్టివిధాన పిండప్రదాన మాచరింతుము, ఇదిలోకాంతర ప్రాప్తికైచేయుదుము. ఏలననగాలోకములు లోకాంతరములు సమష్టిబ్రహ్మాండవిరాడ్దేహములోనివిగా నున్నందుచేత సమష్ట్యాచరణగాగల విధానమునసనుసరించిన సపిండీకరణము ను మన వేదమహర్షులుదెలసి వేదమతాను సారముగ ఉత్తమమార్గావలంబులుగ జేసిరి. ఇదిగొప్ప మహోపకారము. (సపిండీకరణమనగా సమష్టిసమానత్వ పిండీకృత సపిండీకరణమనిఅర్థము.) దీనిని అన్నముతోను పిష్టాదులతోను జేయుట మరొకముఖ్యకారణమున్నది. ఆదిలో అన్నరూపముతోనైనదే నీదేహము. అన్నములేనిదే దేహము సంభవించదు. "అన్నాద్భూతానిజాయంతే జాతాన్యన్నేనవర్ధంతే, అద్యతేత్తి చభూతాని తస్మాదన్నంతదుచ్యతిఇతి. తస్యైవఏవశారీరఆత్మా" అందుచేత అన్నము తో నేఉద్భవించి మరల అన్నము నేభుజించి అన్నము తో నే వృద్ధియగుచున్నది. ఏనాడు అన్నమునుతినుట మానునో ఆనాడే మృతిబొందును గాన నీలోకములో అన్నమేమూలమైనందుచేత అన్నప్రధానరూపముతో అంశాంశముగ సమన్వయించి అన్నముతో పిండప్రదానము నాచరింపజేసిరి. పిష్టముగూడ నిందులోజేరినదేను. ఈ రూపత్రయములు కర్మలతోను, భక్తితోను, జ్ఞానముతోను, ఆధ్యాత్మభావముతోను సర్వవిధముల సమంజససార్థకమగు విధానమనే మన వేదమహర్షులమతము.. ఇందులోనిరూపాదులు, వసురూపము, రుద్రరూపము, ఆదిత్యరూపములు. వసురూపము తో దేవత్వము, రుద్రరూపము తో సమష్టిరూపమును ఆదిత్యరూపముతో సర్వసంపూర్ణ ఆత్మప్రకాశమే ఆదిత్యరూపమనిభావము. ఇవివర్గత్రయు, లోకత్రయు, కర్మత్రయాదులకు సంబంధములు. ఈ సమష్టిసంయోజన సపిండీకరణముతో మృతికి ప్రేతత్వవిముక్తి రూపత్రయాత్మక సపిండీకరణసిద్ధిలో దేవత్వము, ఈశ్వరత్వము, ఆత్మత్వస్వరూపముగానగును. సపిండీకరణమేలేనిచో రూపత్వసిద్ధిలేక దైవత్వములభిం

చక మానుషత్వములభించక మధ్యవర్తిత్వముగు పైశాచికదేహరూపమునుబొంది కల్పాంతమువరకుగూడ నివసించవచ్చునేమో ఎవరికి తెలియును.

ఇందులో మరొకవిశేషాంశమున్నది. కొన్ని సమయసందర్భాదులందు గతించినవారలకు క్రమసాపిండ్యముజరుగక వ్యుత్క్రమసాపిండ్య మాకాలములో విధి లేక దీనికిపైనున్న వారు బ్రతికియుండుటచేత జరిగియుండవచ్చును. మరల ఏకాలమునకైన యపుడుగతించినవారిపైనున్న వారలు గతించినానంతరము మరల తప్పక క్రమసాపిండ్యమును జేసేతీరవలెను. ఇటులనే శ్రీగురుపూలారాధనలలో శ్రీగురు, పరమగురువు, పరాపరగురువులతో జేయుచున్నాము. అనగా కార్యగురువు, కారణగురువు, మహాకారణగురువులని ఊహించవలెను. ఈగురువర్గత్రయము మనశరీరమందేయున్నారనికూడ చెప్పవలెను. ప్రత్యేకముగావెతుకవలసినవనేలేదు. దీనిని తెలియకను బోధకాకున్నచో బాహ్యములోయున్నారనితలంచి పొందవచ్చును. మనదేహములోనే దేహత్రయాదులుండగా గురుత్రయమేల లేకపోవును. ఈదేహములో వ్యష్టిత్రయదేహము లున్నవి. సమష్ట్యసమష్టిఈశ్వర విరాడ్దేహాంశ యున్నందుచేతసర్వసంబంధముతోఅన్నియును సంబంధములుగానే యొకదానిలోనన్నియును, అన్నిటియందు ప్రతియొకటియు వ్యష్టిదేహములో సమష్ట్యంశమును, సమష్టిలో వ్యష్ట్యంశమును ఆద్యంతములందు సర్వసంబంధ బంధములుగనున్నవి. గురుస్వరూపమును వ్యష్టిదృష్టితోచూచిన వ్యష్టిగను, సమష్టిదృష్టితో సర్వవ్యాపకముగనున్నపుడు ఎచ్చటనైనను తప్పకయుండితీరును. గురశబ్దమే గుణాతీతము. గుహాతీతము. సర్వాతీతస్వరూపమేను. పరిపూర్ణవాసుదేవస్వరూపముతో నున్నపుడు దేహయందుండకపోదు? అన్నిటియందుండేతీరును. దీనినేవ్యూహచతుష్టయముతో భాగవతసాంప్రదాయముగ అన్వయించిరి. భేదములెంతమాత్రమును లేవు. పదభేదములేగాని లక్ష్యభావబోధతో నేభేదములులేవు. ఒకసంతతిలో మూలకూటస్థపురుషుడాదిగా ప్రపౌత్రునివరకు అంశమేకమయినను మధ్యలో క్షేత్రభేదముతో రూపనామభేదములున్నట్లుగా అన్వయించవలెను. అజ్ఞాన, అభిమాన, వ్యామోహవాసనలే సర్వభేదములకును ముఖ్యకారణము.

ఇందుకొకలోకానుభవదృష్టాంతమునుచెప్పెదను. భార్యకు భర్తయేదైవమని అధికపూజ్యుడని, సర్వాధికుడని యిట్టిసంపూర్ణ అతీతభావలక్ష్యయోగముతో భార్యభర్తను పూజించుట ఉపచరించుట యిత్యాదిభావమునకు సమానముగనే శ్రీగురువునందు దేవునియందు సమభావము పురుషునకున్నచో మహాపతివ్రత

సర్వాధికురాలై సర్వసిద్ధిజయమును పొందినట్లే మనముకూడ తప్పకబొందుదుము. అట్టులలేక భర్తను సామాన్యమానవునిగ తనకుసమానునిగజూచి నడచిన భార్య యెంతటి ఫలవంతురాలగునో మనకు తెలియకపోలేదు ఇకనుభర్త విరూపియైనను కురూపియైనను వికలాంగుడైనను లక్ష్యముజేయక తనపాతివ్రత్యధర్మబుద్ధితో నిట్టిభర్తను అనంతవిశాల ఈశ్వరదృష్టి లక్ష్యభావబోధలతో పూజించినచో అత్యుత్తమపదవికేమైనా భంగమగునా? అన్నియును వనభావనలో లక్ష్యములో బోధలోనున్నవేగాని యెదుటివస్తుతత్త్వముతో నేమియు ప్రయోజనమే లేదు. ఇట్టిభావనలే లేనపుడు భర్త యెటువంటి మహాత్ముడైనను వ్యతిరేకముతో దుష్టురాలగుభార్య తనస్వబుద్ధి అజ్ఞానముతో నిష్ఫలమునే జెందును. ఇందుకు గీతలో మరొకదృష్టాంతమున్నది. భగవదంశ సంభూతుడును, బంధువుగానున్న అర్జునునికే విశ్వరూపమును చూచునట్టి యోగ్యతగలనేత్రము నీది కాదని సమష్టిదివ్యనేత్రము ప్రసాదమునిచ్చిన సమష్టి అనంతవిరాట్స్వరూపమును చూడగలిగెనుగాని తనవ్యష్టిగలనేత్రముతో చూడ శక్తి లేనివాడాయెను. ఇంకను ఏకలవ్యునిచరిత్రమును, మార్కండేయమహాముని దివ్యచరిత్రమును, జడభరతునిచరిత్రమును, శ్రీప్రహ్లాదచరిత్రమును, ముఖ్యనిదర్శనములుగనున్నవి. మొదటి యీవ్యష్టిదేహములోనే సర్వము సంపాదించి దీనిద్వారా ప్రనాడిగా సమష్టివిరాడ్దేహములో చేరి విరాట్స్వరూపులై తుదకుఆత్మలో చేరుదుము. ఒక్కటితోచును. నిజములో బాల్యములో జ్ఞానముగలిగినతోడనే సన్యసించి తుదకు ఆకులలములభిక్షతో కొంతకాలముగడపి మరల జలాశయభిక్షతోను వాయుభిక్షతో దేహయాత్రగడపి ప్రాణమెట్లుపోయినను తలంచక జ్ఞానముగలిగిన ధన్యుడగుటే నిక్కలియుగమునకు తగినసాధనముగ నున్నది. లేకున్న అనర్థపరంపరలే అతీతముగనున్నవి. లేకయిపుడీజ్ఞానముతో వాసనతో ముందుజన్మమైనా నిట్టిదే సంప్రాప్తముగావలెనని తపస్సుజేసినను ఫలమేయున్నది. లేకున్న ఇంధనజడరూపాదులుగనైనను జన్మించి తుదకు అగ్నితో సర్వసంపూర్ణభస్మమై అట్టిభస్మము ఏ శివలింగమునకైనను ధారణగా నెవరైనను జేసినచో ముక్తిగాకేయగుచుండెనేమో? .తుదకు (స్త్రీలకు సహగమనముతోనైనను ముక్తిమార్గమున్నది. అదియునుగూడ మనకు లేదాయెను.) ఇది తెలిసే బ్రహ్మమానసపుత్రులగు సనకాదులు బాల్యముతో త్యాగముతో ఇహమువదలి బ్రహ్మలో జేరిరి. తుదకు పశురూప గజేంద్రుడు ధన్యుడాయెను. పౌరుషములేనిపురుషజన్మమేల. తుదకు పరిక్షిత్తుగూడ ప్రాయోపవేశమార్గము ననుసరించెను. శ్రీశుకయోగివంటి

బ్రహ్మర్షితో సమగ్రముగావినినను తుదకు మరల మరణభీతితో భయకంపాదులు కలిగెను. ఈవ్యష్టిదేహలక్షణములివియని దెలిసి జ్ఞానముతో సమష్టి ఈశ్వర దేహము సంపూర్ణముతో స్వరూపజ్ఞానముతో మృత్యువునకు చలింపక అమృతత్వరూపమున బొందుదుము. ఈస్థూలశరీరమున్నంతకాలము పృథివిని, జలమును విడువజాలదు. ఆకర్షించియుండును. సూక్ష్మదేహము తైజసముగాన తైజసలోకాదులతో వాసనగలుగును. ఈ దేహము సర్వవ్యాపకము, సర్వసమము. సూక్ష్మము. స్థూలదేహమువిడుచువరకు పైలోకాదులగు తైజస భూతదేహములంట నేరవు. ఆవల తైజస దేహానంతరం వాయుభూతదేహము ధ్రువమండలముపైనగాని లభించదు.

భూతములలోను, సమష్టివ్యష్టి భేదములున్నవి. సమష్టిపంచమహాభూతములలోనుండే వ్యష్టిపంచభూతములుత్పన్నములైనవి. అన్నియును మిశ్రితభూతములేను. వీటికతీతముగ కేవలశుద్ధముతో అపంచీకృత పంచమహాకారణ భూతాదులున్నవి. ఇవి సదాశివతత్త్వమునకు చేరినవిగానున్నవి. అన్నియుపర్యైకించినగాని లీనములుగాజాలవు. ఏకీభవించినచో సృష్టిరూపమును జెందును. అందుచేతనే సృష్టియనగా సర్వమిశ్రితముప్రకృతి, వికృతితోను గలిగియుండును.

అన్నియును బ్రహ్మాండముతో సంబంధములై తదంతర్గతములై తదంశములై ప్రాపకములుగా మనకు నిత్యసన్నిహిత సంబంధములై క్షేత్రరూపకములుగాను దేహరూపకములుగను పంచభూతసంబంధములుగ నుండుటచేత భూసంబంధముతో ఆపైనుండి అధోభాగముతో స్థూలతగా క్రమమున భూతానుగుణరూపాంతరములుగ ఆభూతలోకాదులను స్థూలసూక్ష్మకారణములతో ఊర్ధ్వములో బొంది తుదకు ఆత్మలో లీనముగానగుటచేత భూగోళములో నిది యొకముఖ్యాంశముగ జేర్చితిని. లోకాంతరగమనములకు సూక్ష్మశరీరము ముఖ్యావశ్యకము. ఇది సమష్టిశరీరము. ఇదేసూక్ష్మశరీరము. తైజసశరీరము. ఇదిసర్వులకు సమానశరీరము. ఈసూక్ష్మశరీరము చేతికి చిక్కునదికాదు. అందుచేత ఏబాధలకు సంబంధములేనిది. సర్వసమానత్వముగ నుండునదిగనే చెప్పవలెను. స్థూలములోనే భేదములకవకాశములు. సహజముగ మనోనిగ్రహము, ప్రాణనిగ్రహము, పంచభూతముల నిగ్రహము, గుణనిగ్రహము, సర్వనిగ్రహములు, సమష్టిసూక్ష్మశరీరముతోనే గలుగవలెనుగాని వ్యష్టిగాగల స్థూలశరీరముతో గలుగనేరవు. పూజలలోను ధ్యానాదులలోను యోగాదులలోను సమష్టిధ్యానముతోనే ఏకరూప సమానత్వముగలుగునని సమష్టి ధ్యానమును అధికముగాబోధించిరి. వ్యష్టిధ్యానాదులు సర్వత్రసామాన్యములు.

దీనిననుసరించే శ్రీశంకరలు సమష్టిధ్యానాదులు సర్వత్రిసామాన్యములు. దీనిననుస రించే శ్రీశంకరులు సమష్టిపంచాయతనపూజాధికమునే అధికముగా బోధించిరి. ఈ సమష్టిపూజాదులలో ప్రత్యేకించిన పూజాదులెంతమాత్రము జేయగూడదనే నియ మము ననుసరించిరి. ఈ పంచభూత పంచాయతన దేవతలకు విరుద్ధములగు పూజా దులవస్తువులతో సమష్టిలోచేసినను ప్రత్యవాయముమాత్రము లేదని అన్నిటితోను పూజాదులు సమష్టిలోనున్న పంచాయతన దేవతలకు విరుద్ధములైనను అర్చించవ చ్చుననిరి. ఇంకను ఒకసభయందుగూడ ప్రత్యేకించి ప్రతివారికిని వేరువేరుగా నమస్కరింపగూడదనే ధర్మశాస్త్రవచనములున్నవి. సమష్టిలో భేదములులేవు. శంఖోదకముతో శివాభిషేకముగాని, తులసితో విఘ్నేశ్వరునికిని అక్షతలతో విష్ణు వునకును అర్చించగూడనివి అనేకములున్నవి. సమష్టిలో నీభేదముల కవకాశము లేదు. వ్యష్టిపూజాదులలో మాత్రమే భేదములు. ఇటులనే ఊర్ధ్వముఖములో గల సాధనలన్నియును సమష్టిలోచేరును. అధోముఖములో అధోలోకములో క్రమ ముగా వ్యష్టిగతమునకే ముఖ్యకారణములగును. ప్రతిగుణములోను ఉత్తమాంశ మగు సత్వాంశమే చివరకు సమష్టిగానగును. ప్రతిగుణములోను రజోగుణ తమోంశములు అధోముఖప్రవృత్తితో వ్యష్ట్యంశములుగానగును. కొందరికివి మధ్యలోచేర్చినందుకు విపరీతాంశాధిక్య అసంబంధములని తోచవచ్చు.

ప్రకృతిలో మొదటిసృష్టి సమష్టిగను వికృతిలో ప్రకృతికి ప్రతిసృష్టివ్యష్టి గనుగూడ తలంచవచ్చును. భూతాదులలో ఆకాశవాయుసృష్టి సమష్టిగను జల పృథివీభూతములు వికృతిసృష్టి ప్రతిసృష్టిగను ఉభయమధ్య కారణమే, తేజోభూత ముగను తెలియవలెను. కేవల శుద్ధప్రకృతిలీనముగను తెలియవలెను. సర్వభేద ములకు గుణములేకారణములు. ప్రత్యేకించిన ఏకసంఖ్యతో ప్రకృతితో వ్యష్టిజీ వునిగను పూర్ణముతో విరాట్టుతో ప్రకృతితో బ్రహ్మాండముతో ఈశ్వరునుగను అతీతముతో సంపూర్ణ అద్వితీయముతో ప్రకృతి అతీతముతో ఆత్మగనునగును. ఈ వ్యష్టిసమష్టి భేదములు సంరాట్టునుండియే. స్వరాట్టగు సదాశివతత్వముల కేమియు నుండవు.

ఉపాసకుడు మొదట తానువ్యష్టియని తెలిసి తనకు బాహ్యములో సమష్టి బ్రహ్మాండమున్నదని తెలిసి, ఈసమష్టిబ్రహ్మాండాత్మయగు ఆదిత్యోపాసనతో ప్రారం భించి మరల నీబ్రహ్మాండములోని ఆదిత్యుని తనలోనికి తెచ్చుకొని ప్రకా శింపజేసుకొని ఆవల తనలో సమష్టిగాగల విశ్వవిరాట్టు ధ్యానయోగము

తో తనవ్యష్ట్యావరణదేహమునువిడిచి తనలో ముందుసమష్టివిరాట్టు ధ్యానముతో తనవ్యష్టిదేహమును త్యజించినగాని మరల తనకు బాహ్యములోగల సమష్టి బ్రహ్మాండవిరాట్టులోజేరి ఆవలదీనితో బ్రహ్మాండవిరాడతీతముతో స్వరాట్టు సదాశివతత్త్వముతో ఆత్మనుపొందనగును. విరాట్టువరకు ఉపాసనాయోగములు విరాట్టుతో కేవలధ్యానయోగాదులు ఆవల స్వస్వరూపమునుగలుగును. విషయమనంతము. అనంతమార్గములు. తుదకు ఆత్మయోగముతో అన్నియు ఏకీభవించును. ప్రమిదలోనున్న నేతిని, వత్తిని, ఏమియును లేకుండా జేయవలెననినచో వత్తియగు మనస్సుకు చివరలో తేజస్సంబంధముతో వత్తిని ప్రకాశింపజేసినచో ప్రమిదలోని నేతినిత హించి (ఇవేకర్మలు) ఆవలవత్తినిగూడ సంపూర్ణముగ దహించి తుదకేమియును లేని దే యగును. అటులనే మనసాధనలగును.

మూలముసమష్టి. దీనిలో భిన్నమేవ్యష్టి. బంగారుసమష్టి. ఆభరణములు వ్యష్టి. మృత్తుసమష్టి. పాత్రలువ్యష్టి. ఈశ్వరుడు సమష్టి. జీవులువ్యష్టి. బ్రహ్మాండముసమష్టి. పిండాండమువ్యష్టి. వనముసమష్టి, అందులోని వృక్షాదులువ్యష్టి. జనని సమష్టి. అందులోనుండి యుత్పత్తిగానైనవారలువ్యష్టి. దేహముసమష్టి. అందులోని సర్వాంగములువ్యష్టి. చక్రవర్తిసమష్టి. ప్రజలువ్యష్టి. సముద్రముసమష్టి. ఇతరజలాశయములు, నదులు వ్యష్టి సమష్టియే కారణము. వ్యష్టిఅందులోభిన్నావరణములుగా తెలియవలెను.



## వాసనాస్వరూపవివరము.

ప్రకృతిమూలముతో మనస్సు, వాసన, దేహము క్రమముగా రాబడినవి. ఇట్లురాబడుటచేతనే మరలనివి లీనమార్గములో వెనుకకు బోవుచు తుదకుమూలప్రకృతిలోచేరి ప్రకృతిఆత్మలో లీనమై ఆత్మస్వస్వరూపమునునిల్చును. సర్వులకును తమస్వస్వరూపము ఆత్మయనునిశ్చయమేమో తప్పకయున్నది. ఇదిసర్వులకు బాగుగా దెలిసినవిషయమయినను వివేకవిచారములులేక, సత్యమును దెలియక, పొరబాటునకు లోనైనవారలై ప్రకృతితో ప్రకృతము ప్రత్యక్షబాహ్యాదులందు వ్యామోహితులై బాహ్యాదులే తనఆత్మకు ముఖ్యసుఖములుగానున్నవని నిశ్చ

యించి అనుభవించుచున్నవారలైరి. వాస్తవములో నివి నిజసుఖానందములు గావని ఏదో ఒకానొకప్పుడు మాత్రము తమకు మంచిభక్తి జ్ఞానవైరాగ్యములు గలిగినమనస్సుతో కొంచెము స్వస్వరూపజ్ఞానమున్న సమయములందు దెలిసి దెలి యనివారలై నిమిత్తమాత్రముగ దలంచుచున్నాము. ఈ సిద్ధాంతమును ధారణగా యుంచుకొనలేకున్నాము. ఈలాటి విషయాదులతోను అనేకప్రాపంచిక విషయా దులతోను మనస్సులో నున్నవాటినే వాసనలనిచెప్పవచ్చును. ఈవాసనలు క్రమగతముగా ప్రకృతినుండి వాసనలుగారాబడినవి. ఆదిలోనొకదాని నిశ్చయ ముతో ననుసరించి అన్నియునున్నవి. ఆదిలో నీవాసనలు ప్రకృతిమూలముతో చేరనందుచేత కల్పితములుగాబాహ్యములో సృష్టిలోక్రమాగతముగా కారణమాదిగ సూక్ష్మస్థూలాదులగుటకు అన్నిటివలె దీనికిని ముఖ్యావకాశముగలిగెను. ఆదిలో నొకఆకాశభూతముతో మిగతభూతాదులెట్లులైనవో నటులనే దీనిని దెలియవలెను.

ప్రకృతము మనలోనున్నవాసనలను లెక్కించిచెప్పుటకు సాధ్యములుగానివై యనేకజన్మాదులతో నతిశయించి నిలయమ్ములై యున్నందుచేత వాసనల మూల మును సామాన్యముగ నూహింపలేని వారలమైతిమి. ఇట్టివాసనలధికముతో ఆత్మ స్వరూపజ్ఞానము మరుగుపడియున్నదేగాని లేకపోలేదు. మణులలోని సూత్రము వలె నీవాసనలు ప్రతివిషయాదులందుచేరినవై మనమనస్సునాశ్రయించి అంతర ములోనున్నవి. సుఖదుఃఖాదులకు వాసనలేకారణము. దీనికిమూలముమనస్సు. ఈమనోవాసనలు రెండును యెడతెగనిసంబంధముగలవి.

ఈవాసనలు శ్రీగీతావాక్యప్రమాణానుసారముగ సత్వగుణప్రధానముతో ఊర్ధ్వముఖగమనముగను నివృత్తిమార్గముగను తమోగుణప్రధానములో అధోముఖ ప్రవృత్తిగ రెండుమార్గములుగనున్నవి. ఊర్ధ్వముఖముతోగలవాసనలు ఆధ్యాత్మి కఆత్మయోగ విధానములోను అధోముఖముతో కారణాదిగ స్థూలాకారముజెంది సృష్టిపరిణామ రూపనామవికారాదులతోను కాలగుణభేదములతో త్రివిధదేహము లకు వాసనలతో నిరంతరవాసములుగ పెరుగుచునేయుండును. నాశనముకాజా లవు. కనిపెట్టుటకు కష్టసాధ్యముగాని సులభసాధ్యముగాదు. అనుభవించుట తప్పదు. వాసనలు ఆద్యంతములోనుండజాలవు. ఏమియును లేని ప్రకృతిరూప మనస్సునాశ్రయించి స్థానముగా నేర్పరచుకొని కల్పితమయినందుచేత లేనిదానిలో నెంతకాలముండినను తుదకు తనఆశ్రయమువలె లేనిదేయగును. భ్రమతో భ్రమిం

ఏమియును లేని దెట్లుండిన నేమియని ప్రశ్నింపవచ్చును. కాని విషయాదులందు సంకల్పవికల్పములతో పూర్వాపరములందు నిరంతరము శ్రమలు కలుగజేసి ఈవాసనలు బాధించుచుండును. దీనికిమధ్యలో నీయవస్థమాత్రముండి బాధించుచుండుటచేత పోగొట్టుకొనవలెను. మనస్సున్నంతకాల మీలాగున నుండును. ఆత్మవిషయములో సస్వరూపములో నీమనోవాసనలకు అవకాశములుండవు. సృష్టిపరిణామాది వికారాదులు ప్రకృతిమూలముతో గలిగినందుచేతను, వాసనలకెక్కువగ నిలయకారణమగుటచేతను, జీవస్వరూపము ప్రకృతిబద్ధమగుటచేతను వాసనలకవకాశముగలిగి వశీకృతులైనవారిని మిక్కిలిగ బాధించును. వ్యామోహముతో స్త్రీకి వశీకృతుడైనవానివలెయని భావము. వాసముతో వాసనలుగా కార్యపరిణామముతో క్రియాకర్మలుగను భోగములుగను, విషయాసక్తితో పూర్వోత్తరములందుండును. కాబట్టివేదాంత శాస్త్రిగులు ముందుమనోనాశనమును వాసనాక్షయమునుగావలెనని సిద్ధాంతము జేసిబోధించెను మనోవాసనలేకములైనను కార్యరూపముతో భిన్నములుగనుండును. ఈ వాసనలే గుణానుసారముగ నేభూతదేహాదులలోనుండునో దానిననుసరించిన యవస్థలుగను గుణములుగను 'అభిమానములుగ నుండును. ఒకవాసనమరొకవాసనతోగదా అంతమొందవలెను. అటులలేక సజాతీయాంశములతో నెంతమాత్రమంత మొందజాలదు. వాసనలు దేనితోఅంతమగునో అట్టిమార్గముతో తెలియడమే జ్ఞానముగాని తదితరములన్నియు నజ్ఞానములేను. ఆదిలోనిఅజ్ఞానముతోనే నివన్నియు గలుగుటగాన అజ్ఞాననివృత్తితో నీయవస్థమంతయు నివర్తియగును. దీనినే అవ్యక్తమనియు చెప్పుదురు. అహంకారియై అభిమానించినచో దీనికి అంతమేలేదు. వాసనతో అహంకారముతోనున్నది. విషయాదులయనుభవములంతమయినను మరల వాసనలతో ప్రారంభములగుచుండును. అధోముఖముగానున్నంతకాలము వాసనలకవస్థలుతప్పవు. ఎండమావులేలాగున ఏమియును లేకున్నను చూచుటకు పరంపరలుగా రూపాదులతో నున్నట్టుగానే కన్పట్టుచున్నవో వాసనలటులనేయుండును. వివేకవిచారములతో నిలిచినదే సత్యమగును. మనోవాసనలు రూపములుగానుండినచో సులభముగా పోగొట్టుకొనుచుంటిమి. అరూపములుగానున్నందుచేత కష్టతరసాధ్యములుగనున్నవి. అందుచేతనే వాసనలని నామకరణముగలిగెను. ఇవి బాహ్యములోనున్నటికిని అంతముగానేరవు. తనఅంతరములో కొంతవఱకు అంతమగును. మరల అంతరాంతరములోమిగిలినవి అంతమయి తుదకేకముఖముతో జ్ఞానాధికముతోనదియు

అంతమగును. ఊర్ధ్వములో వాసనల కవకాశముండదు. ఊర్ధ్వమనగా మనలోని జీవస్థానా దూర్ధ్వభాగమనియర్థము. ఆవరణలబంధము చేత అంతరమని చెప్పవలసి వచ్చెను. జీవేశ్వరులవలె నీవాసనలు సమన్వయమగుచు. బాహ్యములోనున్నం తకాలము శాశ్వతములుగ నేయుండును. ఆత్మనిశ్చయజ్ఞానము లేనపుడు మనోవాస నలునశించవు. ఈ వాసనలతోనే దేహాదులకును జన్మాదులకును లోకాదులకును ముఖ్యకారణము. సర్వమునకు వాసనయేమూలము. వాసన, (మనస్సు) ఆత్మకును సృష్టికిని ఉభయమధ్యలో బీజరూపముగనున్నది. ఇవే కోశములు, క్షేత్రములు, బ్రహ్మాండములు, పిండాండములు. ఏతుదకైనను ఇది తెలుసుకొనకతప్పనిది. లేకున్న అంతములేని అనంతములతో అనంతుడవై (యనంతములైన జన్మకర్మలు కలవాడవై) అనుభవించుటమేలాయని ఆలోచించవలెను సుఖానందమనిన ఆత్మనుదెలిసి ఆనం దించుటే శాశ్వతనిత్యసత్యసుఖము. ఈ వాసనయే కుండలినీశక్తిగా (ఊర్ధ్వకుండ లినీఅధఃకుండలినిగాకూడ) సమన్వయమగును వాసనతో వాసుకిగా కుంభలా కృతితో కుండలినిగానున్నది. ఈవాసన లేమనకు సర్వదాసర్వప్రమాదములకు కారణము. వాసనలు త్రిగుణములతో నాయాగుణానుసారములగు ఆకారవికార ములతో నిరంతరము మనస్సులో క్షోభను గలుగజేసి ప్రేరేపించి యెంతటికార్య మునైనను జేయించును. రెండవదానితో చనివ్వదు. సర్వదాకార్యము అంత మగువఱకు వాసనామయముతో వాసనాస్వరూపమే సర్వదానిలిచి బాధించుచుం డును. వాసనాబలము వర్ణింపజాలము. ఇది అంతరములో శేషించియున్న గో ఎట్టివారినైనను తప్పక బాధించునేగాని విడువదు. కేవలదుర్వాసనగల యొక్క పాత్రను శుద్ధిగాజేయదలచినచో దుర్వాసనపదార్థమును పాత్రలోనుండి తీసివేసి నను దానిమూలవాసనలింకను నరూపముతో శేషించియేయుండును. శేషించిన వాసనను శ్రమతో ననేకసారులు కడిగినను కొన్నివాసనలు పోకనిలుచును. దానిని దెలిసి మరలప్రయత్నముతో తుదకు నిశ్శేషముగ జేసినట్టుగా మనప్రయత్న ములటులనే జేయవలెను. శుద్ధసత్వవాసనలు గలుగువఱకు శ్రమతప్పదు. తరు వాత శుద్ధసత్వవాసనలతో ముందుకుపోగలిగి జ్ఞానసంపాదనతో నిశ్శేషమగును. వివేకవిచారము లెక్కువగాకావలెను.

—o—

# భ్ర మ ణ వి వ ర ము.

భ్రమణము సర్వసృష్టి జగత్కారణము. భ్రమణమే లేనిచో సృష్టిక్షణమాత్రమునిలువజాలదు. భ్రమణముతో త్రికాలము లేర్పడెను. సృష్టిస్థితిలయాదులు భ్రమణముతో గలుగుచున్నవి. ఏనాడుభ్రమణమునిలుచునో ఆనాడే ప్రళయముసంభవించును. భ్రమణముతో గతిగలుగుచున్నది. ఆదిలోనొకదానిభ్రమణతో క్రమముగ సృష్టిబ్రహ్మాండములోచేరిన సర్వమునకు సంబంధముగలిగి భ్రమణములుగలుగుచుండును. ఈబ్రహ్మాండము భ్రమణముతోనున్నది. భ్రమణము లేని ఉత్తరక్షణమే దీనికిప్రళయము సంభవించును. భ్రమణమనగా స్థిరములేనిది. సముద్రలోనితరంగములవలె ఒకదానికొకటి సంబంధముగ ఒకదానిచలనముతో నన్నిటికీ యెడతెగని చలనముగలిగియుండును. సముద్రములోనిఅలలవలె నీబ్రహ్మాండములో సర్వమునకును భ్రమణమున్నది. అన్నిటికి స్వపరిభ్రమణములున్నవి. మహత్తుగానున్న భూతముల భ్రమణమును మనముసామాన్యముగ కనిపెట్టలేము. ఒకసర్కసులో బైసికిలును నడుపువారలు తొట్టిలో అతివేగముతో తిరుగునంతకాలము ఎంతఏటవాలుగా బైసికిలును నడిపినను పడదు. ఇందుకుకారణము తీవ్రభ్రమణమేను. భ్రమణములేనిచో బైసికిలు నిలువజాలదు. దానిమీదనున్నవారు సహితమునిలువజాలరు. మరొకఉదాహరణము. నాగులచవితిపండుగమాసములో వేడుకగా కొబ్బరగిన్నను త్రిప్పుచుందురు. ఇదితిరుగు సమయములో కొబ్బరగిన్నెఅడుగునకు ఒకచిన్నరాయినందులోవేసినచో, నది కరుచుకొని కొబ్బరగిన్నెతిరుగుచున్నంతకాలము క్రిందపడదు. తిరుగుటతక్కువైనచో నదిక్రిందపడును. అటులనే భ్రమణముతో సర్వప్రపంచవ్యవహారమున్నది. ప్రళయకాలమున భ్రమణమాగును. లేకున్నసర్వదా భ్రమణముండును. ప్రారంభములో యేయొక్కటి తిరిగినను మిగిలినవి తిరుగకున్నను తిరుగునట్టుగనే తోచుచుండును. ఇందుకుకుమ్మరిసాలదృష్టాంతము. ఇదియొకవిధమైనభ్రమ. భ్రమణముతోగతిగలిగి భూత భవిష్యద్వర్తమానకాలములేర్పడును. సృష్టి, స్థితిలయాదులు పరిణామాదులేర్పడును. సృష్టిజగత్కారణభ్రమణముతోనేయని తెలియవలెను. సముద్రములోని తరంగముల భ్రమణమువలె సర్వమునకు నుండుటచేత నూహించిచెప్పుట కెవరికినిశక్తి చాలదు. దీనిలోనేదిముందో ఏదిమధ్యమో ఏదిఅంతమో ఊహించలేము. వీటిచలనముతో

సముద్రములో స్థిరాదులుగనున్న నావలు మొదలగు జలచరాదులగు వాటికిని నొకసమయములో భ్రమణముగానే కనబడుచుండును. మనమనస్సే భ్రమగానున్నది. మనస్సున్నంతకాలము భ్రమలు భ్రాంతులు భయకంపాదులుతప్పవు. మనస్సునకు సిద్ధాంతములేదు. మనస్సులేనివారు లేనేలేరు. దీనికే జీవత్వము, జీవుడు. ఇట్టి మనస్సుజడరూపముగను, మార్పులుగను, ఊహించి చెప్పునదిగనుండుటచేత సిద్ధాంతమెక్కడిది. ఉన్నంతకాలము చర్చలు, వివాదములు తప్పవు. ఆదిలోమనమేవిధముగ నిట్లుంటిమో యదిమనకే తెలియదు. వీటికిముఖ్యాధారములు వేదశాస్త్ర పురాణములు. వీటిసహకారముతో మనమూహించి సిద్ధాంతమును జేసుకొనవలెను. వీటికి మనభరతదేశమేముఖ్యము. సర్వవేదశాస్త్రపురాణములకు నిలయము. సృష్ట్యాదినుండిగల సర్వవిషయాదుల వివరములిందులోనున్నవి. ఇతరులకు వీటి మూలముతోనే విజ్ఞానముగలుగుటకు ముఖ్యకారణము. మనము, మనభూమి, మనవేదశాస్త్రములు అనాదిసిద్ధములు. సనాతనధర్మములు పరంపరాప్రాప్తములు. విహితములు. వీటికిమూలపురుషులు త్రికాలవేత్తలు, దివ్యదృష్టిగలవారలు, సర్వలోకసంచారశక్తివంతులు, సర్వశక్తివంతులు, కల్పాంతపురుషులు అతీతులు సిద్ధులుమనఋషులేను. వారుమనకుగనే వ్రాసిరి సృష్ట్యాదినుండి ప్రళయమువరకును మరల సృష్టిని యీలాగు ననేకములను విశదీకరించి సిద్ధాంతములుజేసిన దివ్యఋషులు. సృష్టికికారణము మాయ, మాయకుకారణముభ్రమ. ఈలాగున పరస్పరబంధభ్రమణములతో నీసర్వము పరిభ్రమణముగానున్నది. ఒక మిల్లులో ఆదిలో నొకగొప్పచక్రము తిరుగుటచేత మరల దీనిభ్రమణముతో మిగతయనేకపనులకు సందర్భానుసారము మిగతయంత్రములకు సవ్యాపసవ్యములుగ భ్రమణములుగలిగి కార్యములుజరుగుచున్నవో అటులనే బ్రహ్మాండములోనివియును భ్రమణములతోనున్నవి. దీనినేకాలచక్రమునిగూడ జెప్పవచ్చును. ఎటుజెప్పిననొకటేను. ఈభ్రమణములో భ్రాంతియుగలిగెను. భ్రాంతితో భిన్నములకు భిన్నాభిప్రాయములకు నవకాశముగలిగెను. దీనికనుగుణ్యముగననేక ప్రమాణములున్నవి. "భ్రామయన్ సకలాన్ లోకాన్ యంత్రారూఢానిమాయయా" (భగవద్గీత) పంచభూతములకును భ్రమణములున్నవి. వీటికికారణము ప్రధానవాయుభూతమే. ఈవాయువుతో నన్నిభూతములకును భ్రమణములుగలిగెను. భ్రమణమేలేనిచో నిదేశాశ్వతమగుచుండెను. ఆత్మకే ఆస్పదముండియుండజాలదు.

మనఊహాలన్నియును క్రిందినుండియే ఊహించిచెప్పునవిగాని నీబ్రహ్మాండమెంత

వఱకునున్నదో అంతవఱకుపోయిచూడజాలని వారలమయితిమి. ఉపరిలో ధృవమండలమున నిలిచి క్రిందికిజూచినవారలుసహితము కాకపోతిమి. దీనివిమర్శనలు సిద్ధాంతములుజేయవలెననినచో సర్వాతీతమగు ఊర్ధ్వస్థానములోనిలిచి పూర్వాపరములు జూచినగాని నిజము తేలదు. దర్పణాదులతో జూడవచ్చుననెదరేమో అదియు మనచేత కృత్రిమమైనదేగాక కేవలజడపదార్థము. మరల మనమనస్సుతోనే దానిని జూచి ఊహించవలసినదేను. దర్పణాదులకు పరిమితికిలోనైన దృశ్యబింబగ్రహణ ముండునేగాని అపరిమిత అదృశ్యబింబగ్రాహక శక్తియెక్కడిది. తుదకేమియును గనబడదు. ఊహించిజెప్పవలెనేగాని నిజముజెప్పలేము. మనశక్తి మనచేకల్పిత దర్పణాదులశక్తి పరిమితికిలోనైనదేగాని బ్రహ్మాండమును ఆద్యంతమునుజూడ శక్యముగాదు. తుదకుహిమాలయ శిఖరమునుజూడ నింతవరకు ఎన్నిప్రయత్నములు జేసినను కొనసాగక నిష్ఫలములైనవి. అతీతలోకాదులు అపరిమితయోజనాంతరములలో నున్నవాటిని సూక్ష్మరూపముతోను, అమితతేజస్సుతోనున్నవాటిని అన్నిటిని ఆవరించి లోకాలోకపర్వతముదాటి పైనున్నమహర్లోకాదిగ ననేకలోకాదులెన్నియోయున్న వాటినెట్లుచూడనగును. అవిమానవమాత్రునికి బొత్తిగా సాధ్యముకానివి. మనదేహము కేవల స్థూలదేహము. క్షణికము. మనకుదూరములో నున్న పర్వతములు ఆకాశమువలె స్నిగ్ధముగ సీలముగ కానవచ్చుచున్నవి. దాని వెనుక అతిదూరములోనున్న పర్వతములు దీనికి అనుకొనియున్నట్టుగనే భ్రమగలిగింపజేయుచున్నవి. పర్వతము సహజముగ వృక్షములు, శిలలు వాగులు వంకరలు లోయలు, సందులు హెచ్చుతగ్గులతో సహజముగ నుండినను మనచూపునకు నలుకనుపించదు. దీనిస్థితిదెలిసినను మనకు మరలచూచినపుడు భ్రాంతితప్పదు. సముద్రమును జూచిన ఆకాశమునంటినట్టు భ్రాంతితప్పదు. ఆకాశముగుడారమువలె వంపుగానున్నదను భ్రాంతితప్పదు. ఎండమావులనుజూచిన నీటిభ్రాంతితప్పదు. త్రాడునుంజూచిన సర్పమనుభ్రాంతితప్పదు. సమీపములోనివాటినే సిద్ధాంతము జేయలేము. సమాధానములుజెప్పవచ్చునేగాని వాస్తవము కొదలుగలుగదు. కొందరికి పరదేశమునకుబోయినచో దిగ్భ్రమగలుగును. దీనిసత్యమెంత నిరూపించి చూపించినను భ్రమణపోనేరదు. ఆకాశములోజూచిన నన్నియును ధృవాంతములవఱకును సమానకక్ష్యలుగ సమానపరిధిగనున్నటుల కనుబడునేగాని సత్యమాలోచించిన సంబంధమేయుండదు. ఎవరికితోచినట్టు వారిసిద్ధాంతమును బోధింతురుగాని ప్రత్యక్షములో సమగ్రముగ జూచిఎఱుగరు. అన్నియును ఊహించిచెప్పిన

విషయూదు లేను. దీనిని శ్రీపుష్పదంతాచార్యులవారు శ్రీ శివమహిమ్న స్తోత్రములో నావ శ్లోకమూదిలాగునచెప్పిరి.

శ్లో॥ ధృవంకశ్చిత్సర్వం సకలమపర స్త్వ ధ్రువమిదం।
పరోధ్రవ్యాధ్రౌవ్యే జగతిగదతి వ్యస్తవిషయే॥
సమస్తేప్యే తస్మిన్ పురమథనతైర్విస్మితఇతి।
స్తువన్ జహ్రేమిత్వాం నఖలునను ధృష్టాముఖరతా॥

దీనికి మానువప్రయత్న మెంతటిది. "నక్క-యెక్కడ నాగలోక మెక్కడ" అనుసామెత గానగును. గొప్పప్రతిబంధకము భ్రమ. భ్రమతోనన్నియు భ్రాంతిమయములుగ నుండునేగాని సత్యమెక్కడిది. అందుచేతనే సర్పరజ్జుభ్రాంతిగ భయకంపాదులతో నున్నది. భ్రాంతితోనే భయము, కంపము, దఃఖము సర్పమునందిగుణములుం డుటచేతనే నీఉదాహరణమిచ్చిరి. రజ్జువునం దేభయకంపాదులులేనందుచేత రజ్జు సర్పభ్రాంతిగాచెప్పలేదు. దేనివల్లభయకంపాదుల కాస్పదమో దానికేభ్రాంతి యనిచెప్పిరి. మనవేదమహర్షుల సిద్ధాంతమట్టిదికాదు. మొదటనీసిద్ధాంతాధార ములతోగ్రహించినవారలై ఆవలతమబుద్ధిబలముతో స్వయముగ గ్రహించి తెలుసు కొంటిమని చెప్పుచున్నారేగాని ఇటీవల కొన్నిశతాబ్దములవారికి, అనాదిగ యుగాంత కల్పాంతములనాటి విషయగ్రహణము లెట్లు తెలియగలిగెను. ఆధారములేవి? అతీ తాంశములను ఏఆధారములనుజూడనిదే యెట్లుకనిపెట్టగలిగినవారలైరని సందేహము గలుగకమానదు. మన స్వపరిభ్రమణ మనకే తెలియదు. ఇతరభ్రణాల నెట్లు కనిపెట్టగలము. భ్రమణములతో నున్నందుచేత ననేకసిద్ధాంతములకు ముఖ్యావ కాశకారణములుగలిగెను. భ్రణతోను భ్రమణములో భ్రాంతితోజేసిన సిద్ధాంతములన్నియును భ్రణభ్రాంతులుగనే తాత్కాలిక సిద్ధాంతములైయుండి మరల మార్పులు సర్వసాయుండునేగాని సిద్ధాంతసత్యమెన్నటికి నెట్లుకుదురును. ఇటులనే సర్వప్రళయములు దాటుచునేయుండును. వానిలోను నిరంతరమార్పు లునుతప్పలేదు. సంపూర్ణసిద్ధాంతములేదు. యెడతెగనిమార్పులేయున్నవి. ధృవ సూర్యులకుగూడ స్వపరిభ్రమణములు తప్పలేదు. సర్వముకాలబద్ధము వాయుబద్ధ ముగానుండుటచేత భ్రణలతో భ్రాంతితోనే గడువవలెను. తుదకు వీటి సిద్ధాంతములో నేమియును ఫలములేదు. వృథాకాలహరణము. వివాదములు, జన్మ మరణాదులుతప్పవు. బంధముక్తిలేదు. కాబట్టి ముఖ్యముగ దెలియవలసినవి నీబ్రహ్మాండములో త్రివర్గములో మేరువు, సూర్యుడు, ధృవుడు, శింశుమారము

ఆకాశగంగ ఇవేముఖ్యములు. వీటిద్వారా ముందుమార్గమును జూచుకొని ఆవల వీటిత్యాగముతో ముందుపరమావధిని జూడవలెను. ఎక్కువగవిమర్శింపనేల. విమర్శించినంత విసుగునకే కారణము. ఇంకను భూభ్రమణాది విశేషములను గురించి ముందువ్రాసినదానినిచూడగలరు.

—o—

## అండపిండ బ్రహ్మాండముల వివరము.

సృష్టికికారణము అండమేను. అండముతోనేసృష్టి. అండముతోఉపరిలోని అంశములన్నింటిని ఆకర్షింపబడి సర్వసృష్టియు నగుచున్నది. అండముతోనే ప్రత్యేక సృష్టికవకాశమార్గము. అందుచేతసృష్టికిని అండమునకును అవినాభావసంబంధము. ఎడతెగనిది యని అర్థము.

ఈఅండము మూడువిధములుగనున్నది. ఇవే అండపిండబ్రహ్మాండములు. ఇవిస్థూల సూక్ష్మకారణములతోగల ఆకారావరణములుగనున్నవి. ఈఅండము స్థూలమునకు జలాధారముతో ఘనీభవించి పృథివీరూపముతో స్థూలాకారమును బొంది స్థూలసృష్టిగా జేయుచుండును. దీనికికారణము కాల, గుణ, భూతాదులును సంయోగశక్తియు ముఖ్యములు. ఈసంయోగశక్తియే మరల వియోగమునకు అనగా ప్రళయమునకును కారణమేయగును. ఆద్యంతములకును శక్తియే ప్రధానము. దీనినేప్రకృతియని, మాయయని, మనస్సని చెప్పుదురు. ఈ ప్రకృతి అనేకవిధములుగాగల మార్పులతో పరిణామాదులతో వికృతాకారములనుజెందును. ఇందులకు సృష్టికారణము. మధ్యేభిన్నస్వరూపాదులతో పరస్పరభేదములుగ నొకదానికొకటి పంచభూత తంత్రముగా నగుచుండును. స్థూలాండములోనుండి మరలప్రత్యేకించి తమోగుణముతో గలిగినదే మనసృష్టి. ఈలాగున ఒకఅండము లోనుండి మరొకఅండముగా అనంతానంతాండములకు ముఖ్యకారణమాయెను. మనదేహమే పిండాండము. ఉపరిగాగల హిరణ్యాండములోని సర్వసారపిండీకృతముతో పిండాండముగ జీవరాసులకు భోగ్యముగ ప్రత్యేకించిన వ్యష్టిగతసూక్ష్మాండమే పిండాండము. ఇదేవిక్షేపశక్తి. మొదటిది ఆవరణశక్తి. ఒకసమష్టి మహదావరణలోనుండి మరల వ్యష్టిగాప్రత్యేకించి పరిణామాదులతో అణ్వాదిగ అందు

లోనుండే అధోముఖముతో అధోముఖాండముగ కావడమే పిండాండము సర్వాంశములతో నొకటేగాని గుణాదులభేదములతో కనిపెట్టగలుగుట కష్టసాధ్యముగనున్నదగును.

పిండాండమునకు పైనున్నదే సృష్టికర్త యున్నదే, హిరణ్యాగర్భాండము. దీనికే అండమని పేరు. ఇదిరజోగుణముతో బాహ్యములో, అంతరములోను సాత్వికముగ నుండును. ఈ అండకర్త స్థూలసంబంధమగు గుణాదులుండుటచేత మనపురాణాదులలో నీఅండము జలార్ణవములో శ్రీమహావిష్ణ్వంశ శ్రీమన్నారాయణ నాభీకమలములోనుండి ఉత్పత్తిగానైనదని జలమును సృష్టికర్త బ్రహ్మనుద్దేశించి జలసంబంధకమల ముపమానముతో పురాణములు బోధనారూపములుగవ్రాసిరి. నాభి జలభూతతత్త్వాంశస్థానము. విశాలవ్యాప్తితో జలమునకేసమన్వయము. పృథివీరూప స్థూలాండమునకు జలమధిష్ఠానభూతము. కేవల వ్యవహారిక దృష్టితో వివాదములకు అనర్థములకేఆస్పదము. హిరణ్యాండమనగా ప్రకాశమునకే హిరణ్యశబ్దవాచకము ఉత్తమాంశము. తేజఃప్రధానస్వరూపము. ఇది అండస్వరూపము.

మూడవది బ్రహ్మాండము. ఈబ్రహ్మాండములో ననేకహిరణ్యాండములకవకాశకారణమున్నది. ఇట్టిబ్రహ్మాండములు ఆత్మలో ననేకమారులు సృష్టి స్థితి ప్రళయాదులగుచుండుటచేత అనేకాండములుగ సర్వములకు సమన్వయము. ఈ బ్రహ్మాండముతో పరాంతమేను. లేకున్నఅనవస్థదోష సంప్రాప్తమగును. నిర్ణయమే లేకపోవును. ఒకదానిమూలముతో ఆదియును, మరొకదానితో మధ్యముగను, మరొకదానితో అంతముగనుండి మరలప్రారంభముగావచ్చును. వీటినేఆదిమధ్యాంతములని అండపిండ బ్రహ్మాండములనియు తుదకన్నియును ఆదిమధ్యాంతలయుడుగానున్నఆత్మలో లీనమగునని జ్ఞానశాస్త్రములు బోధించెను. ఇదేతత్త్వశాస్త్రము ఈలాగుననే మనదేహములోను సమష్టిఈశ్వరదేహములోను త్రివిధదేహములుగనున్నవని నిర్ణయించిరి.

అండములనగా జడస్వరూపక్షేత్రములుగా కాలగుణభూతాదులతోనైనవే అండములు. ఈలాగున సర్వదా సృష్ట్యాదినుండి ప్రళయమువఱకు నగుచుండును మరల ఉత్పత్తియగుచుండుటసహజము. ఇవిప్రళయములో పిండాండము అండములోను అండముబ్రహ్మాండములోను, బ్రహ్మాండము ప్రకృతిలోను ప్రకృతిఆత్మలోను లీనములుగ క్రమముగా నగుచుండును. అండములన్నియును బ్రహ్మాండములోనేకమై బ్రహ్మాండము శుద్ధమూలప్రకృతిలో లీనమై శుద్ధప్రకృతిఆత్మలో మాయ

గా నేమియును లేనిదేయగును. వీటికేపరిశయ భేదములతో అండములకు సంబంధించి ప్రకృతిప్రళయమువఱకును కాలభేదములతో నిర్ణయించిరి.

ఇవి తెలియక సాత్విక యోగాదులతో నిష్కామముతో పరమావధిగతలంచి చేయనివారలు శాశ్వతముగ అండసంబంధముతో మహాప్రళయములోను శేషించి యుండి మరల నుత్పత్తిలో జన్మాదులుగ అనంతానంతములగు పరివర్తనములతో ప్రళయములను జెందుచుండుదురు. పరమావధియే లేదనిస్పష్టము.

ఇందులకు దృష్టాంతము. మనపొలములో క్రిమికీటకాదులు పైరుకాలములో అనంతానంతములుగ నుత్పత్తిగానగుచూ మరల వెంటనే కాలభేదముతో యెండకాలములోను వర్షాకాలములోను సర్వసమాప్తిగానగుచు కొన్నిభూమినెరియలలోను మరికొన్ని వర్షపాతజలములోను సమాప్తినిజెంది మరల సృష్టికాలములో సృష్టిగానగుచున్న విధానమే ఉదాహరణము. మనముగూడ నేయుగముతో నుత్పత్తిగానైన వారలమయియున్నామో మరల మధ్యలో ఆవర్తులుగా రాబడిన యుగాదులలో సృష్టిసంబంధములేక మరల మనసంబంధయుగమువచ్చునఱకు లీనావస్థతో అనంతానంతకాలము లీనముతో నేయుండవలెను. ఉత్తమయుగాదులలో మనకేలాటి సృష్టి సంబంధముండదు. ఇందులకు గుణకర్మలే కారణము.

ఈఅండపిండ బ్రహ్మాండములు అంశాంశభేదములతో ప్రత్యేకించి పరస్పర భేదములతో క్రమముగా కావడమే కారణము. పూర్ణములోనుండి క్రమముగా యనేక సంఖ్యలకెటుల అవకాశకారణమో నటులేను. సృష్టిమొదటితండ్రిలో నుండి భిన్నమయి తల్లిలోచేరగా ద్వివిధరూపములకారణమై మరలనిటులనే పరస్పర భేదములతో క్రమముగ అనంతానంతభేదములకు కారణము ఇదిబాహ్యములో ప్రకృతి వికృతులతో విరుద్ధములుగా పరిణామవికారాదులు జెందెను.

ఈ అండములు, ఆకాశవాయుభూతముతో నొకఅండముగను తేజోరూపముతో మరొకఅండముగను జలముతో మరొకఅండముగ భూతమిథునములతో పంచీకృతముతో కాలగుణభేదములతో అండత్రయమాయెను. బ్రహ్మాండమే సదాశివతత్వముగను హిరణ్యాండము విరాట్టుతత్వముగను పిండాండము జీవాంశతత్వముగను తెలసిఉపాసయోగులుగావలెను. పిండాండస్ఫోటనముతో క్రమముగా ఉపరి ఆవరణాండములు క్రమముగ స్ఫోటనములుకాగలవు. ఆదిలోస్ఫోటనముతోనే అండములు ప్రారంభముగాన అంతమునకు స్ఫోటనమేకారణము. ఇదేశబ్దస్వరూపము. ఆకాశములోనున్న శబ్దము వాయువుతో శబ్దోత్పత్తికికారణము.

వాయువుసర్వమూలము. సర్వాధారము. సర్వకారణము. పంచభూతములు అండ స్వరూపములేను. అండమనగ గోళాకారము. అండమనగాసర్వగర్భము. గర్భము గోళస్వరూపము.

ఈలాగున అండపిండబ్రహ్మాండములను బ్రహ్మాండాతీతము నుదెలిసి ఉపాసను డుగా నగుటే ఉత్తమజ్ఞానము.



## పిండరూపదేహ ముఖ్యస్వరూప వివరము.

పిండముదేహస్వరూపమేను. బీజప్రాయమువంటిది. స్థూలదేహసృష్టికి ముందును స్థూలదేహానంతరము నిదిముఖ్యకారణరూపముగనున్నది. పిండస్వరూపము ముందు వెనుకలకు మధ్యరూపమే పిండరూపము.

జీవులమరణానంతరము కర్మలులేనివారలకు పిండరూపత్వము లేనందుచేత మరలజన్మాదులకును స్వర్గలోకనివాసమునకు నవకాశకారణములుండవు. మధ్యలో ప్రేతపిశాచాది జన్మములు సంప్రాప్తించి దీర్ఘకాలము బహుక్లేశము లనుభవించ వలెను. మరల నెన్నటికో యేమహాపురుషునివల్లనో గతికలిగినగాని ప్రేతపిశాచాది జన్మములు వదలవు. ఈజన్మమునిరంతరము కేవలక్షుత్పిపాసాదులతో సర్వదా తీరనిబహుబాధలుగలిగి యితరులనుబాధించే తీరవలసినట్టి (జన్మాదులు)వివి. క్రూర మృగములవంటివి. ఏవిధములైన మంచికర్మల కవకాశములులేవు. ఉభయమధ్య జన్మాదులివి. మనకును, స్వర్గమునకును మధ్యలో అంతరిక్షలోకములో సంచరించునవి. వీటితో సర్వులకు తఱచుగాబాధలేను.

జీవులమరణాంతరము కర్మలతోపిండరూపమేర్పడును. మరణానంతరముబొంది న ప్రేతపైశాచికజన్మల నివృత్త్యర్థముగ మనముచేయు వేదవిహితకర్మలతో విముక్తిగల్గి గతికలిగి స్వర్గలోకనివాసయోగ్యమగు దేవత్వముసంభవించును. దీనికి ముఖ్యాధారరూపమే పిండరూపము. పిండరూపములద్వారా మరణించినవారల నుద్దేశించి ఆవాహనాది ఉపచారాది క్రియాకర్మలతో నీప్రతిబింబ పిండరూపము నందు భావనాయోగముతో చేయుట శ్రీభగవంతుడు సర్వాంతర్యామిగ నున్నందు చేత సంబంధముగలిగి వారికిముక్తిలోకమగు స్వర్గలోకనివాసమును గలుగజేయును.

మనలోకమునందు నిటులనేపరస్పర సంబంధములతో మనసర్వకార్యములు వ్యవహారములును మనమున్న చోటుననే దూరస్థులకు చెందుచున్న యవకాశాద్యనుకూలాది విశేషక్రియాది వ్యవహారములు మననిత్యవాడుకలోనన్నియు ప్రత్యక్షానుభవములో నుండగా దీనినిగురించి నాలోచింప నవసరములేదు. దీనిననుసరించే దేవతలనీలోకాదులలో శిలాదారులోహాది మృణ్మయముల మూర్తులుగజేసి దేవతలనావహింపజేసి అర్చింతుము. నిదియు నీవిధానముననుసరించినదేయగును. ఇంకను శ్రాద్ధాదులందు మనబిడ్డలకు మనపితరులు ప్రత్యక్షులైయున్నట్టుగనే వారికిచూపిబోధింతుము.

పిండరూపముతో దేవలోకనివాసరూపములగు వసు, రుద్ర, ఆదిత్యరూపములుగలిగి నీరూపములతో నాయామూర్తులున్న లోకాదులందుచేరి సుఖింతురు. దీనికి మరొకముఖ్యకారణమున్నది. మనకుమొదటిది పితృలోకము. తర్వాతమిగత లోకములు. మరణించినవారలకుముందుగా అతనితండ్రికిదేవిధముగజరిగి అతనికి సద్గతికలిగినందుచేతనే అతనిద్వారా త్రిపురుషులందును దేవత్వముచేత త్రివిధరూపులగు వసు, రుద్ర, ఆదిత్యరూపులుగను రెండువిధములతో సంబంధరూపములుగ ఉచ్చరించిచేయుటచేత స్వలోకమైనను సంభవించును. ఇందులోగల ఆదిత్యరూపముతో గతించినవారికి పుణ్యకర్మలతో జ్ఞానవిశేషముతో ఆదిత్యునిద్వారా బ్రహ్మలోకమునైనను జేరునట్టి ముక్త్యవకాశములుగూడానున్నవి. మనకర్మలతో స్వర్గాదులకు మార్గమును అర్హతను చూపినవారలమయితిమి. ఇదివిశేషము.

ఇటులకొంతకాలము స్వర్గలోకసుఖమనుభవించి "క్షీణేపుణ్యేమర్త్యలోకం విశంతి" .యనుగీతావాక్యానుసారము స్వర్గలోకసుఖపుణ్యముమాత్రము క్షీణించి మిగిలిన పుణ్యముతో ఇలావృతవర్షములో జంబూద్వీపములో భూస్వర్గమనుభవించి తర్వాత పుణ్యశేషముతో నీలోకములో "శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోభిజాయతే" యను గీతావాక్య ప్రమాణానుసారముగ జన్మించవచ్చును. ఇందుకు ముఖ్యకారణము స్వయముగతాను జేసుకొన్న కర్మఫలితములేను.

తుదకు సర్వసన్యాసముతో జ్ఞానులై ముక్తినిచేరువారలనైనను నీదేహపతనానంతరము మధ్యలోని ప్రేతత్వజన్మము తప్పనిదని నిదిజ్ఞానాదులతో దీనికి సంబంధములులేనిదని కేవల కర్మప్రధానములోనే ముక్తిగానున్నందుచేత సన్యాసస్వీకారమునకు ముందుగానే ప్రేతోచ్చారణకర్మను తప్పకజేసి సన్యాసస్వీకారమును జేయుదురు. కర్మలేంత ప్రయోజన ప్రమేయములో నాలోచించ

వలెను కర్మలనావశ్యకములనినచో వృథావాగ్వాదమేయగును. కర్మలచే ఉత్తమజన్మాదులకును ఇహపరసాధనలకును ముఖ్యకారణములు మార్గములు. కర్మలుసర్వదా సర్వవిషయాదులందును దేహాదులున్నంతకాలము నత్యావశ్యకర ముఖ్యసాధనములు. కర్మలు రెండువిధములు. శుభకర్మలని శుభేతరకర్మలని భేదములుగనున్నవి జీవులు బ్రతికియుండునప్పుడు జేయుకర్మలు శుభకర్మలుగను, జీవుల మరణానంతరము జేయుకర్మలు శుభేతరకర్మలని పేరు. కర్మలమూలస్వరూపము దెలియనందుచేతను కర్మలఫలములను దెలియకను బొత్తిగనేకర్మలను జేయకుండనట్లుగా నీదేహము క్షణమాత్రముండజాలదని కనిపెట్టలేక వృథా వాదింతురు. ఈవాదనలతో స్వపతనమూలచ్ఛేదనమునకే ముఖ్యకారణములై తుద కేఅచరజడస్థిరస్థావర జన్మాదులు సంప్రాప్తమగునోయని యోచింపజాలరైరి. అట్టివారి కేకర్మలు లేవనినచో సమాధానపడవచ్చును. సృష్టిప్రకృతిసహజమని వాదింతురేమో. సహజమెట్లుగలిగెననినచో ప్రకృతిస్వరూపమేకర్మగాన కర్మఫలముననుసరించే సహజసృష్టిలోనే సహజముగచేరవచ్చును విచారమే లేదు. వివేకము లేదు. శాశ్వతము తప్పదు. ఎవరికేమిప్రమాదము కర్మలమూలస్వరూపవిషయమును "వేదభూగోళ" ప్రథమ భాగములో మొదటిభాగములో 3౬ పుటలో విమర్శించినాను చూడవచ్చును.

సర్వసాధనములకే కర్మలు. ఆదిలోకర్మలతోనే దేహముసంప్రాప్తమయినది. దేహముకర్మజన్యము. కర్మలఫలస్వరూపమే దేహము. కర్మలకును దేహములకును యెడతెగని అవినాభావసంబంధములు. ఇటులనేపరస్పర సంబంధములతో పరంపరప్రాప్తములుగనున్నవి. కర్మలతో పిండరూపత్వము, తద్వారా ఉత్తమలోక నివాసము మరల ఉత్తమజన్మములుగలుగును.

మరల నీలోకములో జన్మాదులకును పిండమేముఖ్యకారణము. మృతిజెందినవారలకు స్వయంకర్తృత్వాధికారములు పైశాచికప్రేతజన్మముతో లేనందున వారిసంతతివారలచే కర్మలుచేయబడినగాని ముక్తిగలుగదు. లేకముందుగా తన జీవితములోనే ప్రేతత్వముక్తికై ప్రిషోచ్చారణాది యితరవిధానములతోనైనను జేసుకొనవలెను. కర్మసంస్కారములుబొత్తిగాలేకున్న సృష్టిలోనేదానికిని పరిపక్వదశలేక ప్రకాశించనేరదు. సంస్కారరూపములేకర్మలు. ఇవిసర్వదా సర్వులకును, సర్వవస్తువులకు నత్యంతావశ్యకరములు. చేయనిచో పతనమునకే ముఖ్యకారణమగును. మానుషజన్మములకే ఇట్టికర్మలున్నవి. క్రింతతక్కువగాగల జీవరాసులకిట్టి కర్మలులేవు. అవిసామాన్యజన్మములు. వీటికి పరిపక్వదశ ఉత్తమజన్మము

మానుషజన్మసంప్రాప్తమేను

కర్మల సంకల్పములోనే ప్రేతత్వవిముక్తి సాధనము, దేవత్వప్రాప్తి ఉల్లేఖింప బడును. ఇంకను దేహమును దహింపజేసినందుచేత, అగ్నిసంబంధ దాహ, తాప, క్షుత్పిపాసాదుల శమనమునిగూడ నందులోనే విమర్శించబడియున్నది. ఈప్రేతసంబంధకములు బాధలుగూడ కర్మలతో తొలగును. రోగికిఔషధసేవ యెట్టిదో జీవులకు కర్మలట్టివి. ఇదిదేహపతనానంతర విషయము.

మరల జీవోత్పత్తికి మొదట తల్లిగర్భములో పిండరూపమునే బొందును. పిండమనగా సర్వసారపిండీకృతముతో వ్యష్టిగా రసరూపముతో బిందువుగా సూక్ష్మకోశరూపమును జెందినదేపిండము. మనదేహము వ్రీహ్యాది ఓషధీఫలసారముతోను, వీటిపరిపక్వ అన్నరసముతో సప్తధాతురూపముతోను నీసర్వరససార మేకరూపముతో మొదటతండ్రిదేహమున జీవాణురూపముగ ద్రవరూపపిండమై తర్వాత తల్లిగర్భములో బిందువుగజేరి మరల తల్లిభుజించిన ఆహారాది పరిపక్వ రససారముతో రజోగుణ రుధిరముతో స్థూలపిండాకృతిగా దినదిన ప్రవర్ధమానమగును. తండ్రిగర్భములో నిద్రిచైతన్యరూప సత్వగుణవీర్యమయి యింద్రియాదులతోచేరి ఇంద్రియమయి తర్వాత క్షేత్రరూపతల్లిగర్భములో చైతన్యరూపరజోగుణ రుధిరముతో తమోగుణావరణ స్థూలదేహరూపమునకు కారణమగును. తల్లిగర్భములోగూడ పిండశబ్దోచ్చారణ వాడుకగనున్నది. ఇదిప్రత్యక్షమగుటచేత పిండమని వచించుటకు నవకాశముగలిగెను. ఇవేపరస్పరభేదములు. తర్వాత క్రమముగ ప్రతిమాసము మార్పులతో సర్వాంగముతేర్పడి తుదకు సంపూర్ణదేహమగును. ఈదేహమునకు మొదటిరూపము పిండరూపముగాన దేహానంతరము పిండరూపమునే జెందుచున్నదగును. సర్వేంద్రియాదులన్నియు నీపిండరూపములో లీనములైయున్నవేను. తుదకు పంచభూతములన్నియును కోశరూపముతోనున్నవి. అణువులకు పిండరూపములుగను మహదాదులకు కోశరూపములుగనున్నవి. రెండిటికిని భేదములేదు. ఈకారణాంతరములతో వ్రీహ్యాదులతో జన్మమునకు పిండముగానైనందుచేతనే మరల మరణానంతరము కర్మలలోగల పిండముచు వ్రీహ్యాదుల పిష్టముతోను పరిపక్వాన్నముతో జేయుచున్నవారలైరి. జీవస్థూలదేహాదులకు వ్రీహ్యాదులే ముఖ్యములు. ఈకర్మలను సర్వలోకవాసులును తప్పక కొంతవఱకైన, ననుసరించినవిగనే యున్నవిగాని బొత్తిగాలేకపోలేదు. మనవేదశాస్త్రపురాణములందు గణించినవారలకు కర్మలులేనిచో వారివంశములో నెవరైనను గయాదిమహాపుణ్యక్షేత్రములందు

వారి నామోచ్చారణతో పిండమును శ్రీవిష్ణుపాదమునందు వేసినంతమాత్రముతోనే ప్రేతపిశాచత్వాదులకు తత్క్షణమేముక్తి గలిగి ఇతరజన్మములభించునని ప్రమాణవచనములనువ్రాసిరి. దానిచేతనే ప్రేతపిశాచరూపముల నొందినవారలు తమవంశములో నెవరైనను గయాదితీర్థయాత్రలుచేసి తమకు పిండప్రదానము చేయుదురాయని నిరంతరము కాచుకొని స్మరించుచుందురు. అట్టివారలు పుట్టుదురాయనిగూడ కనిపెట్టుకొనియుందురు. ఇంకనుశ్రాద్ధాదులలో నరకలోకాదులలో యనేకవిధములుగా ననుభవించుచున్నవారలకును, కర్మలులేనివారలకును ముక్తికి కారణముగాగల యనేక క్రియాకర్మలను చేయునవకాశములను కల్పించినందుచేత శ్రాద్ధము యజ్ఞమనిగూడ వచించిరి. శ్రాద్ధములో త్రివిధకర్మలు. మొదటిది అగ్నౌకరణము. అగ్నిలో ఆహుతులుగ వేయుటచేత మనపితరులు దేవలోకములోనున్నచో అచ్చటివారితృప్తిగను, రెండవది బ్రాహ్మణభోజనముతో నీలోకరూప సజాతీయత్వముతో తృప్తిగను, మూడవది పిండప్రదానముతో జంతుజలచరాది రూపములతోనుండినచో పిండముల విసర్జనముతో తృప్తిగనున్నది. దీనితో నీత్రిభువనములో నెచ్చటనుండినను నీమూడు కర్మలతో గతించినవారలకు తృప్తిగలుగును. కర్మలు నీత్రిభువనములవరకేను. అవల నీకర్మల కవకాశములులేవు.

## —♦ శ్రీగురుగీతలలో నిందుకుసంబంధ ప్రమాణములు. ♦—

శ్లో॥ పిండేపదే తథారూపే ముక్తోసానాత్రసంశయః॥ ౧౫౦

పార్వత్యువాచ - పిండంకింతు మహాదేవపదంకిం సముదాహృతమ్।
రూపాతీతంచ రూపంకిం ఏతదాఖ్యాహిశంకర॥ ౧౫౧

శ్రీమహాదేవః - పిండంకుండలినీశక్తిః పదంహంస ఉదాహృతః।
రూపంబిందు రితిజ్ఞేయం రూపాతీతం నిరంజనః॥ ౧౫౨
పిండేముక్తాః పదేముక్తాః రూపేముక్తాః వరాననే।
రూపాతీతేచయేముక్తా ముక్తాస్తే నాత్రసంశయః॥౧౫౩

## —♦ ఒకవిశేషలోకసామెత. ♦—

లోకసంభాషణలో "నీపిండమని" సహజముగవాడెదరు. చాలవిశేషార్థము లున్నవి. ఈస్థూలదేహమునుగుఱించి యనినట్టిదనిగాదు. ఈ స్థూలదేహానంతరముకర్మలుగలిగి పిండరూపమును జెందుమని అనుటగానగును. ఈపిండరూపముతో

స్వర్గమనుభవించి మరల ఉత్తమమానుషజన్మమును బొందుమనిభావము. దీనితో మధ్యేగల ప్రేత పిశాచ జన్మములు తప్పిపోయెను. ఇదివిశేషము. పుట్టినవెనుక మరణముతప్పదుగాని, పిండరూపమేర్పడుట దుర్లభము. ఈవాచికము ఇహపరక్షేమ సూచకఉత్తమవాచకముగనున్నది. పిండపద ముభయముక్తిపదవాచికము. మరొకవిధ మయినఅర్థము. పిండరూపముతో నున్నంతకాలము స్వర్గలోక సుఖమనుభవించుచుం డురని మరొకవిశేషార్థము ఈ త్రివర్గములో నున్నంతవరకు కర్మలు, దేహములు, పిండములు, మరణములు, జన్మములు పరంపరలుగా సహజమని, పిండముసర్వకార్య కారణరూపమనిగూడ భావింపవచ్చును. పిండముయొక్క రూపకారణములు, వర్ణ నాతీతములు. కర్మలచేతను, వేదఋషుల బోధచేతను అనుసరించినవారలమయి ధన్యులగుదుమని సిద్ధాంతము. పిండరూపమేదేహము, దేహమేపిండరూపము, కాలభేదముతో రూపపదభేదములేర్పడును. పిండము ముక్తిరూపము, దేహము కర్మరూపము. పిండముసామాన్యముకాదు.

—o—

# ప్రధానకర్తృత్వమేది.

సర్వవేదాన్త సిద్ధాంతసార సంగ్రహము:-

౧౦౫॥ మనఃప్రసాదసిద్ధ్యర్థం సాధనం శ్రూయతాంబుధైః ।
మనః ప్రసాదోయత్సత్వే యదభావే నసిధ్యతి॥

౨౭౮॥ శివప్రసాదేన వినానసిద్ధిః ।
శివప్రసాదేన వినానలబ్ధిః శివప్రసాదేన వినానయుక్తిః॥

3౭౪॥ మనోఽప్రసాదః పురుషస్యబన్ధో। మనఃప్రసాదో భవబన్ధముక్తిః ।
మనః ప్రసాదాధిగమాయతస్మా। న్మనోనిరాసం విదధీతవిద్వాన్॥

ప్రధానప్రమేయ ప్రమోద -కర్తృత్వసంపాదనమే జ్ఞానము. జ్ఞానముతో సర్వప్రాప్తియు మోక్షము స్వస్వరూపానందము గలుగును జ్ఞానములేనిదే నేమియు నుతెలియజాలము పొందనేరము. జ్ఞానసంపాదనమెటులనిన-

జ్ఞానమునకొరకు లక్ష్యముగావలెను. లక్ష్యములేనిదే జ్ఞానముసిద్ధించదు. ఈ లక్ష్యమునకొరకు సాధనముండవలెను. సాధనలులేనిదే సిద్ధికానేరదు. సిద్ధికొరకు ధర్మనియమాచారములుండవలెను. వీటికొరకు గురువు, అధిదైవతముండవలెను. దైవతమునకొరకు ఉపాసన, తపస్సు, యోగము లుండవలెను. వీటికి తీవ్రశుభేచ్ఛయుండవలెను. వీటికిసత్సంగ, సత్సంపత్తి, సదాచరణలుండవలెను. వీటికి సత్కర్మలుండవలెను. వీటికిశాంతయుత మంచిమనస్సుండవలెను. మంచిమనస్సుకు సుగుణములుండవలెను. సుగుణములకు దేహముమంచిదికావలెను. మంచిదేహమున శమ దమాదులేర్పడును. వీటికికారణము నియమాదులు. నియమాదులకు సాత్వికధర్మబుద్ధి మితాహారము లుండవలెను. వీటికిభక్తిశ్రద్ధలు బాగుండవలెను. వీటికి నియమవ్రతాదులుండవలెను. వీటికి ఉపదేశములు శ్రవణాదులుండవలెను. వీటికిసంస్కారములుండవలెను. సంస్కారములకు ఉత్తమమతము జన్మము. సంప్రాప్తముబాగుండవలెను. వీటికి పుణ్యభూప్రదేశముండవలెను. పుణ్యభూమియనిన తీర్థరూప పుణ్యనదులు, సరోవరములు, తీర్థాదులు, క్షేత్రములు, క్షేత్రదేవతాదులమూర్తులు, శైలములు, అరణ్యములు, వనములు, ఆరామదేవాలయములు, మహర్షులు, సిద్ధులు, తపస్వినులు, మహావిరాగులు, యోగులు, జ్ఞాననిష్ఠులు, యజ్ఞయాగాదికర్మిష్ఠులు, భక్తులు, చతురాశ్రమములు. ఆశ్రమములు, సంస్కారములు వేదశాస్త్రపురాణేతిహాసాదులు, ఋతుధర్మములు, మంత్రతంత్రములు, కల్పములు, విద్యలు, ఉపాసనలు ఇత్యాదులన్నియు నుండవలెను. అన్నిటికిని పూర్వసుకృతముండవలెను. పూర్వసుకృతమెటులనిన ఈజన్మములోగాని లేక వెనుకటిజన్మములోగాని యీకొన్ని కొంతవరకు యెప్పుడైనను లభించియుండవలెను. ఇదెటులప్రారంభమగునో తెలియరానిది ప్రకృతఫలానుభవము వెనుకటివేఫలమని తీర్మానము కాన ప్రశ్నలతోపనిలేదు. సంస్కారములులేనిదే ఏప్రపంచలోకాదులలోగాని ఏమియును లభింపజాలవు. సంస్కారబలముతో సర్వము సులభసాధ్యము. ఈసర్వమునకు నిలయస్థానము, సర్వోత్కృష్టము పవిత్రపుణ్యభూమి మహిమలతో జేరిన మహాపుణ్యక్షేత్రభూమి మనభారతభూమియేయని నిశ్చయము. తుదకు మహాప్రళయములోగూడ నిది శివత్రిశూలముపైన సర్వదాబీజప్రాయముగ నిలిచియుండును. వర్ణనాతీతము. విదేశీయుల అభిప్రాయములుగూడ సాక్ష్యములున్నవి.

# తమస్సుల వివరము.

తమస్సులనగా ఆవరణములతో సర్వవిషయాదులందును ఆవరించి ముందుకు తోచనివ్వకుండా ప్రతిబంధకములై యుండునవి. ఈతమస్సులకే అజ్ఞానమని, రాత్రియని, పర్వతములని యనేకవిధములుగా సందర్భానుసారము చెప్పుదురు. సృష్టికి కారణముతమస్సేయైనందుచేత తద్ద్వారా సర్వవిధములతో సర్వవిషయాదులందు జన్యముగ సహజములుగానుండును. మొదటనీతమస్సు సమష్టిమహాదావరణముతో ప్రారంభమై తర్వాత ననేకావరణములతో భిన్నములుగా మరల ప్రత్యేకించిన ఆవరణములతోనే సృష్టిగావలెనేగాని ఆవరణములులేనిదే సృష్టికానేరదు. ప్రారంభ మావరణముతోనే యైనందుచేత సర్వదా ప్రతిసృష్టికిని ఆవరణములే యుండవలెను. సృష్టియన ప్రత్యేకముగాన ఆవరణములేనిదే ప్రత్యేకించదు. తమస్సుగూడ సంపూర్ణశుద్ధసత్వతేజస్సునందు జన్యమైనందుచేత భిన్నముతో ఆవరణముగానేర్పడెను. స్వకీయమైన శుద్ధతేజస్సులో మరలప్రత్యేకించి శుద్ధతేజస్సుగానట్లుకాగలదు. అసంభవము. మొదటిప్రకాశమునకు భిన్నరూపమొకటేర్పడినగాని. అందులో ప్రత్యేకించి సృష్టికాజాలదు. భిన్నరూపమే తమస్సు. ఆవరణము. మధ్యలో నీతమోఆవరణమేర్పడి నందుచేత మరల ప్రయత్నముతో నివారించుననే గాని నిలువజాలదు. ఇందుకు దృష్టాంతము, సినీమాలోని చిత్రపటము లేవిధముగా యంత్రముతో ప్రారంభ ప్రకాశములో నావల చీకటిలో మీరుచూడబడుచున్న ఉభయ మిశ్రిత చిత్రరూపములే ఉదాహరణ నిదర్శనము. ఈతమస్సులు గుణములతో కేవలశుద్ధమాదిగ సత్వ రజ స్తమోగుణములతో మరలనీఅన్నిటిలో అన్నియునుచేరి మరల నీగుణములతో ప్రత్యేకించిన గుణాదుల సృష్టిగానైనవి. అనగా ప్రారంభము కేవల శుద్ధసత్వసంపూర్ణసృష్టి, సత్వసృష్టి, రజోసృష్టి, తమోసృష్టిగానున్నవి. ఇవన్నియును తమస్సులోనైన సృష్టులు. గుణభేదములతో నానావిధ రూపములుగా నగుటకు కారణము ఆత్మచైతన్య ప్రకాశమిందులో నిలిచియున్నందుచేత ప్రకాశమధికముతో కేవల శుద్ధసత్వముగను ప్రకాశముకొంచెము తక్కువతో సత్వసృష్టిగను, మరల ప్రకాశము కొంచెము అందులో తక్కువచేత రజోసృష్టిగను కొంచెము తక్కువచేత తమోసృష్టిగను క్రమముగా నీలాగున తుదకు తమోగుణములో అంతములో కేవల తమోగుణ ప్రధానముతో ప్రకాశము (ఆత్మచైతన్యము)

చాలసూక్ష్మముతో సృష్టిగానున్నదగును. ఇందుకు దృష్టాంతము దీపముయొక్క వెలుగు దీపసమీపములోనుండిదూరముగ పోగలిగినంత దీపప్రకాశ మేవిధముగా నుండునో నదేవిధముగనుండును. ప్రారంభము తమోగుణావరణ పూర్ణములో ప్రకాశించిన తేజస్సెంతవరకు ప్రకాశించగలదు. దీనిచేత నే ద్వివిధములకు ముఖ్యకారణము. మరల నీతమస్సులు పంచభూతాదుల ననుసరించిన ఆవరణముల భేదములతోగూడ నున్నవి. ఈతమస్సులోగల ప్రకాశము శాశ్వతముగా సర్వదా యుండదు. వీనిచేత నే మనకు రాత్రి, పగలని జ్ఞానమని అజ్ఞానమని రెండువిధములు. ఈరాత్రి పగలుగూడ పంచభూతాదులను గుణముల ననుసరించిన స్వరూప భేదములతో నుండును.

## ఇందులోగల సృష్టి భేదము వివరము.

కేవలశుద్ధసత్వజ్ఞానావరణముతో స్వరాట్టుసృష్టియు సత్త్వగుణముతో సంరాట్టుసృష్టియు రజోగుణముతో విరాట్టుసృష్టియు నిదిప్రథమసృష్టివర్గము. మరల సత్వగుణములో త్రివిధగుణములతో మహామూర్తులుగ బ్రహ్మ విష్ణు రుద్రులుగ రెండవ సృష్టి. మరలరజోగుణములో త్రివిధగుణములతో, సామాన్యత్రిమూర్తులుగ బ్రహ్మ విష్ణు రుద్రులుగ మూడవసృష్టి. మరల ప్రతియొక్కమూర్తితో ననేక విధములుగ దేవతలు మొదలుగాగల సృష్టి మనవరకూగలిగి తర్వాత యింకననేకవిధములగు ఋషులాదిగ, జీవరాసులసృష్టియును అచేతనములగు జడాదుల సృష్టియును గలిగెను. ముందుసృష్టిక్రమమును విపరీతమునుమిగతవిషయములందుచూడనగును. ఈతమస్సులనేకవిధములుగ గుణభేదములతోనున్నవి. తెలియుటదుర్లభము. ఈతమస్సుకే శక్తియని ప్రకృతియని, మాయయని, మనస్సని నామాంతరములుగ కార్యభేదములతోవచింతురు. తమస్సున్నంతకాలము సృష్టిబంధముతప్పదు. అందుచేతనే మన మహర్షులిది తెలిసి మన కనేక ఉపాసనాది యోగములు, కర్మలును బోధించి వీటితో విమోచనముగావించిరి. తమస్సుచేత నుత్పత్తిగానైనందుచేత ఉపాసనాదులందును కర్మలందును తేజస్సునకు ప్రధానమిచ్చి క్రమముగా అభ్యాసయోగముతో నీతేజస్సు అభివృద్ధిచెంది తుదకు మనలో తేజస్సే సంపూర్ణముగనిలిచి తుదకేతేజస్సుతో మనకు మహదావరణముగాగల ఆదిత్య ఆత్మస్వరూపతేజస్సంబంధముగలిగి తద్వారా తమోలోకావరణ సంబంధముతొలగి కేవల శుద్ధపరిపూర్ణ స్వస్వరూప ఆత్మతేజోవంతులమగుదుము. ఏమియునుచేయునిదే నేలోకములో మాత్రమెట్లు ఫలసిద్ధియగును. కాజాలదు. ఈలోకములోమాత్ర మేదియెట్లుసిద్ధించును? మిగత

లోకాదు లంతమాత్రము లేను. మనకంటె అత్యధికముతో సూర్యుడెంత ప్రకాశముగలవాడైయున్నాడో చూడవలెను. మనజాతి మానవుడే చక్రవర్తిగానున్నాడు. ఈలాటిభేదముకు స్వకర్మల ఫలములే నిదర్శనములు. ఏమియును లేవని నిమిషమాత్రములో చెప్పవచ్చునేగాని ఆవలఅనుభవములను చూడుము. మనముచూడగ నొకడు నిరంతర మహాదుఃఖములతోను దారిద్ర్యముతోను దేహబాధలతోను తుదకు దుర్మరణములతో ననుభవించుచున్నాడు. వారలకివే శాశ్వతములుగా నుండునని యనినచో నెవరైనా సమ్మతింతురా? అట్టివారలకు నివారణోపాయ మేవిధముగా నగును? ఆలోచించవలెను రాజ్యములో నేరస్థుడు రాజునాశ్రయించి మంచిగుణములతో క్రియాదులతో నైనను తనదుఃఖనివృత్తి చేసుకొనుచున్నాడు. అదేవిధముగ దైవము సర్వాధికుడును సర్వకారణుడునుగాన నతనినాశ్రయించి మంచిగుణకర్మలతోను ఉపాసనాది యోగాదులతోను భక్తిజ్ఞానవైరాగ్యములతోను ధర్మములతోను శాశ్వతసుఖము ననుభవించుము.

ఈతమోగుణావరణములు సర్వదాప్రతిబంధకములై అజ్ఞానముతో నేమియును తోచనివ్వకుండా జేయుచున్నవి. తుదకు మనలోకములో దూరవస్తువులను తెలియనివ్వకుండా నీలముగా సర్వసామాన్యముగ ఆకాశములో నగుపింపజేయుచున్నవి. ఇదేఅవ్యక్తము, తమస్సు: ఇవేలోకాలోక పర్వతము. పర్వతము గొప్పదిగాన తమోఆవరణము మహదాకారముతో నున్నందుచేత పర్వతోపమానముగా బోధించిరి. అన్నియును తత్త్వశాస్త్రములతో నొకవిధముగ ఉపమానబోధనలతోను పురాణములతో నొకవిధబోధనలతోను కర్మలతో నొకవిధబోధనలుగను భక్తి జ్ఞాన వైరాగ్యములతో నొకవిధభేదములతోను వాటిక్రమానుసారముగ బోధించిరేగాని ఆలోచించితే నన్నియును తుదకొకటేయగును. తెలియకపోవడమే భేదము. ఈవిధములుగ మనవేదశాస్త్ర పురాణాదులను కర్మ భక్తి జ్ఞాన వైరాగ్యాదులను ఉపాసనాది యోగాదులను తంత్రమును స్త్రీపురుషదేవతాది భేదములను లోకాదులను సమన్వయముతో దెలియవలెను. ఉదాసీనముచేయరాదు. శాంతముతో వివేకముతో ఆలోచించి సిద్ధాంతముచేయువలెను. మనమెట్లుభిన్నములుగ నొకరికొకరున్నామో అటులనే మనల ననుసరించిన భేదములతో సర్వములున్నవని మననిమిత్తమునకే ఉపకారముగ నున్నవని దెలియవలెను.

—o—

## వేదభూగోళ నామకరణ విశేషము - వివరము (నిర్వచనము.)

వేదభూగోళనామకరణముతోనే సర్వసమన్వయ సమంజసము. విమర్శించి ఆలోచించినచో స్పష్టముగనే అర్థమగుచున్నను లోకహితార్థముగ కొందఱుమిత్రులు నాశ్రేయమునకే విమర్శింపగోరినందుకు వారిహితమును శిరసావహించి సవినయముగ తోచినంత విమర్శింపదలచినాను. ఆదిలో వేదశబ్దముతో సర్వమూలము సర్వసమన్వయ సర్వస్వరూపము సర్వసమామ్నాయము. వేదపదమనంతనిలయము. వేదము సర్వాధారము. సర్వవిజ్ఞానమయము. సర్వసృష్టిజగత్తు సర్వబ్రహ్మాండములును సర్వవాఙ్మయమును నీవేదశబ్దములో జ్ఞానస్వరూపముతోనున్నవి. ఇందులో లేనివెప్పటికిని యెచ్చటనులేనివిగ నున్నవి. సర్వదానిందులోనే యున్నవేను. విచారించుట అనవసరము.

రెండవదియగు భూగోళపదముతో నీసర్వము చతుర్దశభువనములు సహితము భూగోళముతో జేరి సంబంధించియున్నవే గాని భూగోళాతీతములో ప్రత్యేకించియుండినవిలేవు. సర్వసముదాయసమష్టి స్వరూపమేభూగోళము. లోకములో సహజముగా "ఇదేమి పెద్దభూగోళముగనున్నదే"యని వచింతురు. అనగా అనంత విషయవిస్తారముతో నిండియున్నదనే తెలియుచున్నది. అందుచేత సర్వవిషయాదులను విస్తరించి విమర్శించుటకొరకే ముఖ్యకారణము. ఏదోయొక కారణముతో అనేక అపూర్వవిషయాదులను విమర్శించుటచేత లోకజ్ఞానమునకు ముఖ్యకారణమగును.

ఇందులో పూర్వభాగములో కాలాంతరేణ యుగధర్మానుసారము వేదవిద్యలు క్రమముగ మాసిపోవుటచేత పునరుద్ధరణకై పూర్వభాగముగను, ఉత్తరభాగముగను, గ్రంథవిషయాదులుగను విమర్శించితిని. మనభారతభూమిలో తుదకే నాటికైనను వేదములు, వేదవిద్యలు తప్పనివి. సృష్టికి ఆద్యంతములందు తప్పక అధ్యాత్మవిద్యలే మార్గదర్శనములు. సృష్ట్యాదిలో నీవిద్యలు ప్రధానాంశములుగ నుండి క్రమముగ ప్రకృతి వికృతి విస్తారముతో దూరములాయెను. ప్రకృతివిస్తారముతో విషయవిస్తారములు ఎడతెగని అభిమాన వ్యామోహాదులతో భేదములతో తాత్కాలికములై తర్వాత అనృతజడ దుఃఖపరిణామ ప్రళయములగునని మనవేద ఋషులు తెలిసి ప్రకృతిని ప్రకృతసంబంధవిద్యలను సామాన్యముగ నిమిత్తమాత్రముగ తలంచి ఆధ్యాత్మిక విద్యలనే విస్తరించి అనుభవించినవారలైరి. ప్రత్యక్ష

ప్రమాణవాదములతో నీఆధ్యాత్మికవిద్య ప్రకృతివిస్తారములో రాదాయెను. ఈకాలములో నీప్రకృతి ప్రమాదము లిటీవల కొంత అనుభవములకేవచ్చినవి. ఆధ్యాత్మికముతో శాంతి సర్వసుఖము. అభేదము సృష్టివిస్తారమునకు నవకాశము లేదు. ఆదిలోగలిగిన సుఖాదులన్నియును, అంత్యములోనివే. దుఃఖములకును ప్రమాదప్రళయములకు ముఖ్యకారణములగును. స్వర్గభూమిసుఖ మత్యధికముచేత సర్వులు తప్పక అపేక్షింతురు. దీనిసాధనలు వేదవిహితమార్గములేగాని అన్యమార్గములతో లభించవు. దీనిపై ఆత్మను బొందదలచినవారికిని నీవేదవిద్యయే గావలెను. ఇదిజ్ఞానస్వరూపము. రెంటికిని వేదమే ముఖ్యాధారము. మనమున్న భూమిని సాధించుటకు, కృషివాణిజ్య వ్యాపార, వ్యవహార రాజ్యపదవులతో లభించును. అన్నియుననుభవించుభూములేను. సాధనాసంపత్తివిధానములువేరు. అధిలోకాదులకు అధివిద్యలే సహకారములు. ఎవరెవరి ఇచ్ఛానుసారము నడువ వచ్చును. తుమింతుసుగాకయనిప్రార్థన.

—o—

# సృష్టికి కారణము తమస్సు.

పరిపూర్ణఅద్వితీయ స్వప్రకాశమగు ఆత్మలోనేమియును లేని శుద్ధచ్ఛాయారూపములో భిన్నముగా నొకటికల్పితమై ఆవరణముతో ఆవరించినదగును. సత్యముగానిది కల్పితముగాన నీలాగుననే ప్రారంభము. ఇది మనలోకములోగల సహజ దృష్టాంతము. ఇదిక్రమముగ ఊర్ధ్వమునుండి అధోముఖముగ ప్రవృత్తిపరిణామ వికారాదులతో క్రమముగా కేవల మలినరూపచ్ఛాయగా నేర్పడెను. ఇదియే తమస్సుఅని చెప్పబడును. ఇదిప్రారంభములో నెటులఆవిర్భవించునో తెలుసుకొనుటకు అసత్యమయినందుచేత కష్టతరము. సత్యమేమైనచో శాశ్వతముగనే యుండెను. ఇదేప్రమాదముపొరబాటు. అజ్ఞానమని, జ్ఞానముతో దెలుసుకొనదగును. అందుచేత ఆదిలో తెలియుట కష్టతరము. తర్వాత స్థూలముతో తెలిసినదగును. సమాన స్వస్వరూపములో రెండవది కారణములేనిదే యుత్పత్తికవకాశమేర్పడదు. సృష్టియనగామూడవది. మూడవదానికి మొదటరెండువస్తువులు లేనిదే కానేరదు. ఈరెంటినే మొదటిది ఆత్మయని, రెండవది మాయయు

చెప్పుదురు. ఈమాయ ఆదిలో శుద్ధచ్ఛాయగను తమోగుణముతో మలినముగను త్రిగుణములతో త్రివిధరూపములుగ సృష్టినిగలుగజేయును. ఈ కారణములచేతనే సృష్టిగుణభేదములతో స్థూల సూక్ష్మ కారణములతో తమస్సులో భేదములుగ నుండుటచేత సర్వసృష్టి తమోరూపమేయని సృష్టికి కారణభూతమన్నని శాస్త్రములు నిరూపించెను. ఈతమస్సులో ఆత్మస్వప్రకాశము జేరియుండుటచేత ద్విత్వమునకారణముగలిగి చిజ్జడముగ నేర్పడెను. లేకున్న కేవల తమస్సుకు ప్రకాశమెట్లుకలుగును? కలుగనేరదు. తమస్సునకే జడమనిచెప్పుదురు. జడమునకేశక్తియును స్వయముగ గలుగనేరదు. ఆత్మప్రకాశచైతన్యముతోనే గలుగవలెను. చైతన్యమే జ్ఞానరూపము జీవరూపము. తమస్సునకే అజ్ఞానమనిచెప్పవలెను. ఈ రెంటితో నొకటి జ్ఞానమని రెండవది అజ్ఞానమని, రాత్రియని పగలని, చరాచరములని ప్రకృతి (స్త్రీ) పురుషులని, వ్యతిరేకముల కవకాశముగలిగెను.

ఆదిలో తమస్సే ప్రధానముగ నుండినచో మరల తేజస్సుతో పనియే లేకయుండెను. తేజస్సులేనిదే సర్వమునకు చాలకష్టతరముగను ప్రమాదముగను స్థిరస్థావరముగను యెడతెగనిదిగను బొత్తిగ ముక్తియేలేక సర్వదా బంధమే శాశ్వతముగానుండెను. విజ్ఞానమునకుబొత్తిగానవకాశమే లేకయుండెను. ఇది అనుభవములోలేదు. విరుద్ధముగనున్నది. తమస్సుతో సర్వప్రమాదముబంధము, దుఃఖమని తత్త్వశాస్త్రములు బోధించెను.

ఆదిలో ఆత్మతేజస్సుతోనే సృష్టికి కారణమనినచో తమస్సుకు, అంధకారమునకు, అజ్ఞానమునకు ద్విత్వమునకు నవకాశమేయుండదు. ఏకస్వరూపమే యుండవలెను. ఇదియు అసంభవము. విరుద్ధము. తమస్సుతోనే సృష్టికికారణమగుటచేతనే సర్వవ్యవహారములకు, మరల ఉపరిగా తేజస్సుకావలసిన అవసరమేర్పడెను. తేజస్సుతోనే సృష్టిగలిగియుండినచో మరల ఉపరితేజస్సుతో అంధకార తమోనివృత్తికి అనావశ్యకతగాయుండెను. తమస్సేలేకయుండెను. ఉపరితేజస్సుతో బొత్తిగాపనేయుండదు. ఈకారణములచేత మొదట ఆత్మస్వప్రకాశములో మధ్యకల్పిత తమోరూపిణిగాగల మాయయేర్పడినందుచేత రెంటికిని మిథునీభావమేర్పడుటచేత సృష్టి జగత్కారణమాయెను. మనలోకములోనిదే యనుభవము. తమస్సుతో జగత్కారణమైనందుకే చంద్ర సూర్య నక్షత్ర అగ్నిరూపములతో ప్రకాశములు ముఖ్యావసరములుగనున్నవి. రాత్రులు తమోరూపములు, అంధకారములుగాన ఉపరితేజస్సు ముఖ్యావసరములు. పగలుఆత్మప్రకాశస్వరూపుడగు

ఆదిత్యునిగను తెలియవలెను. "సూర్యఆత్మజగతః"యని ప్రమాణము. ఇదిఉదాహరణము బాగుగా నేత్రదృష్టిగలవారికి ఉపరిఅర్థము లనావశ్యకములగును. ఇందుకు దృష్టాంతరము. సృష్టికికారణము తమస్సని ప్రత్యక్షప్రమాణముతో సిసీమాలే చాలును. వివరించనేల.

సృష్టియనగాభిన్నము. భిన్నమునకు మధ్యేఆవరణరూపమేర్పడినగాని కాజాలదు. ఆవరణము మొదటిఅధిష్ఠానముగనున్నదానికి విరుద్ధముగ నుండిననే సృష్టి ప్రత్యేకించికాగలదు. సమానప్రకాశముతో ఆవరణముండజాలదు. భిన్నరూపముతో నుండేతీరవలెను. ప్రకాశమునకుభిన్నమే. తమస్సుతప్ప మరేదియునులేదు ఒకవేళ ఇతరరంగులను చెప్పినను తమస్సంబంధములేయగును. దీనికి శబలమని గూడ పర్యాయపదమున్నది. ఈతమస్సుచేతనే సృష్టిస్థితిప్రళయాదులేర్పడెను. ఇవేబంధములు, దుఃఖములు, భయభ్రాంతులు.

మనకు స్వానుభవములో స్వాభావికములుగ ప్రారంభమాలోచనలో శుద్ధజ్ఞానములో, ధ్యానాదియోగములో నున్నవారలకు మధ్యలో తెలియకానిదిగ ప్రవేశమయి పూర్వానుభవములో ఏకరూపముగ నున్నదానిని మరిపించి మాయగ నేదియోకల్పితమై తదాదిగ అనంతానంత వికారసృష్టిగ నెడతెగనిదిగా గలుగుచు నేయుండునేగాని నిలువజాలదు. మరల జ్ఞానదృష్టితో దీనిని తెలిసి నివారించుకొనవలెను. మనలోగల ఆత్మస్వరూప జ్ఞానములో మాయారూపమనస్సుతో నిందులకుకారణము మాయేమనస్సు తమస్సు. ఇదిత్రిగుణములతో త్రివిధరూప గుణకర్మలుగ మనోవాక్కాయములందు జేర జేయించుచుండును. జ్ఞానములోనన్నియు సామ్యావస్థజెంది ఏకరూపమగును ప్రత్యేకించినపుడు భిన్నరూపములగును. ఈ తమోనాశనమునకే తేజోరూప ధ్యానాదియోగము లత్యావశ్యకములు. గీతలో "ఊర్ధ్వంగచ్ఛంతి సత్వస్థాః, మధ్యేతిష్ఠంతిరాజసాః అధోగచ్ఛంతి తామసాః" మన మున్నది తమోలోకమగుటచేత, ఉపాసనలు, కర్మలు, యోగాదులు, భక్తిజ్ఞానాదులవకాశమార్గములై వీటితో తమోరాహిత్యమయి ఊర్ధ్వాది ఉత్తమతేజోలోక ప్రాప్తికాగలదు. తమోలోకముచేత మనమనస్సుగూడ, మలిన అజ్ఞానగుణముల కెక్కువ అవకాశములాయెను. దీనిచేతనే శ్రీపురుషసూక్తములో "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"అని ప్రమాణమున్నది. తమస్సుతో సృష్టికల్పితమైనందుచేతనే "తథాలోకాగ్ం అకల్పయన్" శ్రీపురుషసూక్తములోను "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోర్జున" గీతలోను ప్రమాణములనుబట్టి సృష్టికల్పితమని, కల్పితముతో

ప్రళయము౯ని. మరల ప్రళయానంతరముసృష్టిప్రారంభమని, ఈ ప్రళయమాద్యంతము లందున్నందుచేత తమస్సేప్రళయరూపమని సృష్టికి కారణమని తెలియవలెను. మనకు నీప్రళయమే సుషుప్తియని, అజ్ఞానమని, తమస్సని తెలియవలెను. దీనినే అవ్యక్తమనిగూడ చెప్పుదురు.

సృష్టిప్రారంభము, అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచభూత ములతోగల ఆవరణములతో క్రమముగ కారణసృష్ట్యాదిగా స్థూలసృష్టివరకు గలిగెను. అసత్పదార్థమేజడము. సత్పదార్థమేచైతన్యము రెండునుచేరినందుచేత వీటినే సదసత్తనిచెప్పుదురు.

ఏనాడు శుద్ధతిమోగుణ స్వరూపాధిక్యమేనిలిచి ఆత్మాంశములేనినాడే తమోప్రళయమగును. ఆత్మాంశమున్నంతకాలము ప్రళయము సంభవింపదు. ప్రకృతిపెరిగివిస్తరించుకొలది మలినాంశభారమతిశయించినగాని తమస్సునకు ప్రళయ ముసంభవించదు. ఇందులోని చైతన్యమే బ్రహ్మత్వము. ఇది నిత్య సత్యశాశ్వతము. గీతలో "నైనంఛిందంతి శస్త్రాణి, నైనందహతిపావకః" ఇత్యాదిప్రమాణములున్నవి. బ్రహ్మత్వము బ్రాహ్మ్యమునకు హానిగలిగినచో ప్రకృతి తమస్సువ కెక్కువనవకా శముగలుగుచూ ప్రళయసమీపమునకు వచ్చినవారలమే యగుదుము. దీనినికాపాడి మిగిలియున్నంతకాలము ప్రళయభయము, ప్రమాదభయములేదు. చైతన్యము పైన ఆవరించినదానికే స్వకారణముచేతనే తనకేప్రళయము సంభవించును. ఇది కల్పితముతో ప్రమాదమునకు కారణము.



# మ ల స్వ రూ పా ద్యం త వి వ ర ము.

(౧) ఆత్మమలము=మాయ, (౨) మాయామలము=మనస్సు, (3) మనోమలము=అజ్ఞానము, త్రిగుణములు, (౪) వీటిమలము=చిత్తము. అహం కారము, (౫) వీటిమలరూపము=జీవుడు, (౬) జీవమలము=దేహము, (౭) దేహమలము=అభిమానవ్యామోహాధివాసనలు, (౮) వీటిమలము=కామక్రోధా దులు, (౯) వీటిమలము=ఇంద్రియాదులు, (౧౦) వీటిమలము=తామసగుణ

కర్మలు, (౧౧) వీటిమలము=భోగేచ్ఛ, (౧౨) దీనిమలము=దుఃఖము తృప్తి తీరనిది, (౧౩) దుఃఖమలము=మృత్యువు. (౧౪) మృత్యుమలము=మరల జన్మాదులు, (౧౫) దీనిమలము=మరల జీవులయుత్పత్తి, (౧౬) దీనిమలము=సంసారము, (౧౭) సంసారమలము=జాయ, (౧౮) జాయమలము=సంతానము, (౧౯) దీనిమలము=ఇహసంబంధవాసనలు, (౨౦) వీటిమలము—మరల ననేకజన్మములు, (౨౧) దీనిమలము=పాపకృత్యములు, (౨౨) దీనిమలము=ప్రేతత్వము, (౨౩) దీనిమలము=యమలోకానుభవశరీరము, (౨౪) దీని మలము=నరకములు, (౨౫) వీటిమలము=మరలమాతృగర్భనరకము జన్మాది పరంపరలు, (౨౬) సర్వమలము=ప్రమాదము, అజ్ఞానము, అహంకార, మమకార వ్యామోహాదులు, అభిమానములు వాసనలు.

## —♦ (ప్రకృతి) క్షేత్ర స్వరూపములవివరము. ♦—

[౧) క్షేత్రమలమునకు కారణము=అవ్యక్తము, (౨) అవ్యక్తమలము=మహత్తు, (౩) మహత్తుమలము=అహంకారము, (౪) అహంకారమలము=ఆకాశభూతము, (౫) ఆకాశభూతమలము=శబ్దము, (౬) శబ్దమలము=వాయువు, (౭) వాయుమలము=స్పర్శ, (౮) స్పర్శమలము=రూపము, (౯) రూపమలము=తేజస్సు, (౧౦) తేజోమలము=రసము, (౧౧) రసమలము=జలము, (౧౨) జలమలము=గంధము, (౧౩) గంధమలము=పృథివి; మనకు దృష్టాంతరముగ మన దేహములో వీటిస్థానములో మలోత్పత్తియగుచున్నది. (౧౪) పృథివీమలము=ఓషధి, (౧౫) దీనిమలము=ద్రవరూపరసము, (౧౬) దీని మలము=క్షేత్రరూపదేహము, (౧౭) దీనిమలము=వీర్యము, (౧౮) దీని మలము=ఇంద్రియము, (౧౯) దీనిమలము=మరలక్షేత్రరూపప్రకృతి వికృతి క్షేత్రగర్భప్రవేశము, (౨౦) దీనిమలము=రుధిరము, (౨౧) దీనిమలము=దేహము, (౨౨) దేహమలము=స్త్రీ పురుషరూప ద్వంద్వరూపాదులప్రాప్తి, (౨౩) వీటిమలము=అధోముఖ మలస్వరూప స్థాననిరంతరప్రాప్తి, (౨౪) తుదకు మహాపాపకార్యములతో స్థిరస్థావర లోహ, పాషాణాది పర్వతరూపప్రాప్తి, (౨౫) కేవల జడరూపమే ప్రళయాంతమువరకు అవధి. చైతన్యత కవకాశమేలేనిది. సాత్విక వేదకర్మలతో కొంతవరకు స్థూలదేహ మలశుద్ధిగలుగును. తదనంతరము ఉపాసనాది ధ్యానయోగాదులతో సూక్ష్మదేహమలశుద్ధియగును. పిమ్మట

జ్ఞానముతో కారణ దేహ సంబంధ మలశుద్ధిగలిగి జ్ఞానస్వరూపుడగును. ఆయాగుణానుసారదేహాదు లనుసరించి మలములుండును. దేహమే మలస్వరూపము. క్షణక్షణము మలోత్పత్తియగుచునేయుండును. సృష్ట్యాదిగా సత్వరజోగుణానంతరము తమోగుణ సృష్టిగాగలిగి, మరల నీతమోగుణముతో కేవల తమోగుణ సృష్టిగా మనదేహాదు లుత్పత్తిగానైనవి ఎటులనగా మనముభుజించు ఆహారాదు లన్నియును మలముతో నుత్పత్తిగానగుచున్నవి. ఆద్యాంతములందు మలముతప్ప లేదు. ఇదిలేనిదేపండవు. మార్పులతో రూపభేదములుగానుండును. కాబట్టి మనకెట్లుమలవిమోచనమగు నుపాయ మాలోచించవలెను. ఇట్టియెడతెగని మలముతో సర్వదా సృష్టిస్థితిలయాదులతోనున్న దేహమును గమనించక నింతకంటె అతిశయమే లేదని నిరంతరమాశ్రయించి అభిమానించి ముందువెనుకలు దెలియని ప్రవృత్తులమై శాశ్వతమనిదలంచి మరల మలదేహాదులనే బొందుచున్నవారలమగుచున్నాము. త్రిగుణానుసారమలములను మనసమష్టివ్యష్టిదేహములోనే చూచుచున్నాము. జ్ఞానేంద్రియముల మలములకును కర్మేంద్రియమలమునకునుగల భేదములే దృష్టాంతరములు. సదాచారసంపత్తితో వ్రతాదులతో, ఆహారాది నియమములతో, ప్రాణాయామాది యోగాదులతో స్థూలదేహమలవిమోచనము గావించి పరిశుద్ధస్థూలదేహముతో సూక్ష్మతైజస శరీరమును బొందవలెను. సూక్ష్మతైజసశరీరముతో ఉపాసనాదులతోను, ధ్యానధారణాదులతోను, యోగాదులతో నీసూక్ష్మదేహ మలవిమోచనముతో కారణదేహమును బొందవలెను. ఈమూడు విధములగుదేహము త్రివృత్కరణముగ ప్రతిదేహమందును మరల నీమూడుగుణముల దేహము లంతరములో నొకదానిలొనొకటిగానున్నవి. గుణభేదములతో స్థూలసూక్ష్మకారణరూపములుగ నాయాగుణానుసార దేహములనుబట్టి అంశాశములుగానుండును. మనదేహములోగల త్రివిధ దేహములు మనకు నిత్యానుభవములుగానున్నవి. జ్ఞానముతో కారణరూపదేహమునుదెలిసి కారణరూపదేహమలమునంటినవాడై సమాధినిశ్చలతతో జ్ఞానప్రధానుడై దేహాతీతుడుగావలెను.

దేహమే మలరూపము, స్థూలము, వాసనలకు నిలయము, అధోముఖప్రవృత్తితో యెడతెగనిపరంపరలు, అజ్ఞానగుణములు, కామక్రోధాదులకును అహంకారాది వ్యామోహాదులకు నిలయరూపము, మలములు స్థూలసూక్ష్మకారణరూపముతో నాయాగుణాదుల నాశ్రయించియుండును. ఇవిత్రివృత్కరణముతో త్రివిధములుగ నన్నిటియందుండుటచేత నన్నిదేహమలములు తొలగువిధానముల

నాశ్రయించి పరిశుద్ధుడుగావలెను. క్రిందిగుణపరిశుద్ధితో ఉపరిగుణదేహాదులను బొందదగును. సంపూర్ణమలనాశనముతో సర్వదేహాతీతుడగును. మలమున్నంత కాలము జ్ఞానమునకు ప్రతిబంధకము. మలముతో నజ్ఞానము తప్పదు. పీఠియందు నమ్మకముగలిగినగాని చేయుటకు బుద్ధిపుట్టదు. బుద్ధిపుట్టలేదని చెప్పుటకునిదే ముఖ్యకారణము. ప్రత్యక్షతేజస్సు కానరాదని వచించువారలకు దృష్టిదోషము న్నదనే స్పష్టమగును. దృష్టిగలుగుటకు నేత్రపరిశుద్ధతగావలెను. అందులోని మాలిన్యముతొలగవలెను. మలము ప్రారంభములో శుద్ధచ్ఛాయగా ప్రారంభమయి కడపటికి అతిస్థూలకఠిన స్థిరస్థావరరూపమగును. ఉదాహరణము. స్వచ్ఛమైన దీప సమీపములోగల వెలుతురునాచ్ఛాదించిన శుద్ధచ్ఛాయకును సమీపచ్ఛాయకును, స్థలాంతరదూరస్థచ్ఛాయకున్నుగల ఛాయాభేదములే మధ్యేఆవరణ పంచభూతాదుల తో కఠిన, స్థిర, స్థావరమలరూపములకు కారణమగును. తనమలమును తానేనాడు నశింపజేయునో ఆనాడే తానుముక్తుడు. ఇది సర్వదా ఈలాగున నుండవలెననిన ఆత్మస్వస్వరూపమును బొందినవారనిఅర్థము. ఇది సంభవించకున్నను తుదకు మన శాస్త్రధర్మములరీత్యా పక్షమున కొకరోజు సంభవించు నేకాదశినాటి శుద్ధఉపవాస వ్రతముతో ప్రాయశ్చిత్తుడై ద్వాదశినాడైనా తనమలమును తానుజూడనిచో అంతటితోనైనను ధన్యుడగుటకు అవకాశములేనివారల మగుచున్నాము. ఇట్టి వారలకు సంపూర్ణమలవిమోచనమెట్లు లభించునో ఊహింపజాలని పరిస్థితులు గలిగినవి. శ్రీభగవానుడేశరణ్యము. విచారమనంతము. వివేకమగుపడదు. మలవిమోచనముకొఱకేస్నానము. ప్రతిరోజు నీలాగుననేయునిన అర్థమేమి విచార మేమి. ఇదిస్థూలముతో ప్రతిరోజున కన్వయము. కాని కేవలఆధ్యాత్మిక చింతనతో ముముక్షువునకు సామాన్యము. దేహాదులభిమానించువారలకు నిత్యస్నానము, నిరంతరమలవిమోచనము తాత్కాలిక పరిశుద్ధములుగా నగుచుండును. ముము క్షువులకిది విరుద్ధము.

మలము కల్పితమాయతో నుత్పత్తిగానైనది. మరల అందులో కల్పితాది పదార్థములతో కల్పితములు గాగలిగిన నీదేహాదులకు మలసంబంధముగలిగి మల స్వరూపమేర్పడెను. ప్రారంభముకల్పితము. మహదంశతో దీర్ఘకాలముగ మలో త్పత్తిగను తదనంతర మనంతకాలవ్యవధిసృష్టితో క్షణికములుగాను కేవల అణువంశగా వ్యష్టిగా మనదేహాదులైనందుచేత నిత్యనిరంతర క్షణికకాలముతో సర్వదామలోత్పత్తులకు కారణముగలిగెను. మలముశాశ్వతముగాదు. మధ్యేకల్పి

తముగాన నివారించుకొనుట కవకాశమున్నది.

నిరంతరబాహ్యశ్రిమలతో విమోచనాది క్రియలకంటె మూలమునుదెలిసి మూలచ్ఛేదన క్రియాకర్మలతోను ఉపాసనాదియోగాదులతోను నియమవ్రతాదులతోను వేదవిధిరీత్యావిమోచనముగావించి జ్ఞానముతో నిరంతరపరిశుద్ధమగు స్వస్వరూపుడవగుటేముఖ్యము. నిరంతరశ్రమలతో కల్పాంతములతో కల్పితసృష్టిలో నేలచేరవలెను. కల్పితమేమలము. మలమేఅజ్ఞానము, జీవత్వము, మనస్సు ఇత్యాదులు. మలము లనేకవిధములుగనున్నవి. దేహమలము, మనోమలము, వాఙ్మలము, అజ్ఞానమలము, అశ్రద్ధామలము, అనాచారమలము. వాసనామలము, ఇత్యాదులు. అచేతనములగు ప్రకృతిసంబంధములన్నియును మలములేను. చైతన్య సంబంధములన్నియును నిర్మలము. అమృతత్వము. దేహాదివాసనలతో అభిమానించి మలస్వరూపములనే నిరంతరము పొందుటకంటె చైతన్యస్వరూపజ్ఞానమునుదెలిసి దేహాతీతుడై స్వస్వరూపుడగుటే ఏనాటికైనను ముఖ్యము. మలమెప్పటికిని అధోముఖమేను. నిర్మలమెప్పటికి నూర్ధ్వముఖమేను.

త్రిశంకుస్వర్గము మనదేను వేరులేదు. ఇది దక్షిణదిశలోనుండునది. అంత్యభాగమధోభాగము. మనమున్నది దక్షిణదిశగ నధోభాగములో నీబ్రహ్మాండము లోనున్నది. ఇంకను కొన్నివిషయాదులతో త్రిశంకుస్వర్గ కారణాంశములతో నున్నవి మనము కేవలము దేహమే పరమాధిగా నభిమానించి నడిచినచో నిరంతరముమనకు అధోముఖముగాగల త్రిశంకుస్వర్గముతప్పదు. దీనిసుఖముచు వర్ణించి వ్రాయనేల. దూరమాలోకనతో ప్రత్యక్షానుభవముతో ఏనాటికైనను అనుభవముతో విసుగురాకమానదు.

మనచైతన్యప్రకాశము గోడనడ్డముగ నున్న దీపమువలె కానరాకున్నది కేవల ప్రయత్నముతోగాని దెలియరాకున్నది అందుచేత వేదశాస్త్రిపురాణములెంత వివరించినను అగుపడనిదిగా నున్నందుచేత అలక్ష్యభావముగలిగినది. మనకుమనస్సే ప్రధానముగ సర్వకార్యాదులందున్నది. ఇదిప్రకృతిసృష్టి ప్రపంచసంబంధమేగాని ఆత్మసంబంధ మెంతమాత్రముగాదు ఇదియున్నంతకాలము ద్వంద్వములు జన్మాదులు తప్పవు. వాసనలిందులోనివేను. అందుచేతనే జ్ఞానశాస్త్రిము మనోనాశనము వాసనాక్షయము రెండును మలములే నాశనముకావలెననిరి. ఉత్పత్తికి మలమే కారణము. మలగుణభావమేలేనిచో నుత్పత్తిబొత్తిగానుండదు. మలమనిన మనస్సనకే అర్థము వేఱుకాదు. మలముబొత్తిగాలేనిదే జ్ఞానము. జ్ఞానముతో

సంపూర్ణము ఏకమగును. భిన్న మేమలము. దేహాభిమానముతో చైతన్యప్రకాశ మడుగంటియున్నది. అందుచేత సులభముగా బోధకును అభ్యాసమునకును చాల ప్రయత్నముగావలెను. అందఃయుగముగూడ అట్టిదేయున్నది. గుణములననుసరించే యుగములుక్రమముగానున్నవి. ముందుసృష్టిక్రమముజూచిన మనసృష్టిగోచర మగును. శ్రీభగవానుశేశ్వరణ్యము. జ్ఞానదృష్టిగోచరములోనున్నవాటిని! స్థూల ప్రకృతిలో ప్రత్యక్షప్రమాణముగా తమకుసమానముగ నగుపడవలెననిన సాధ్యము కాదు. రాత్రికాలములో పగటిసూర్యుని అగుపడవలెనని యిచ్ఛయించినట్టుగా నగును. అసంభవము. మనసమీపములోనున్న స్థూలవస్తువులే మధ్యలో అంత రాయములతో నిచ్చటనే స్థూలములోనే కానరావు. ఇటులనే నన్నియును మనకధీనములోనే సులభముగానున్నవా లేవాయని దెలిసినను ఆక్షేపణలుమానరు. ఈ స్థూలలోకములో సూక్ష్మములుగాగల వస్తుదర్శనమున కితరసాధనాంశ ములతోగాని నీస్థూలములోనే అగుపించనపుడు కేవల జ్ఞానగోచరములో నున్నవాటి విషయమై బొత్తిగాలేవని యెట్లనదగును. మనస్సునే గుర్తెరుగనివారలకు జ్ఞాన మెట్లుగోచరించును. స్థూలసూక్ష్మకారణరూపములు త్రివృత్కరణముతో ప్రతి గుణమునందును రూపాదులాగుణప్రధానాంశము ననుసరించి త్రివిధములతోనున్నవి. అందుచేత స్థూలరూపాదులకును, సూక్ష్మరూపాదులకును, కారణములోగల రూపాదులకును జ్ఞానములోను చాలభేదముబుగనుండును. సర్వము కారణములో జ్ఞానరూపములోనుండి క్రమముగా స్థూలమునకు రాబడినవి. మరలస్థూలములో నుండి తుదకు నన్నియును కారణములోనేజేరును. మన స్థూలకార్యములన్నియు ఆలోచనలో మొదటిఅరూపాంశములుగ జ్ఞానస్వరూపముగనేయుండి క్రమముగా మనోవాక్కాయ త్రివిధములతో కారణసూక్ష్మస్థూలాంశములుగా క్రమముగా యింద్రియాదుల గుణానుసారముగనున్నవి మనదేహాంతర్భాగములోనున్న లోపాదు లను విద్యుచ్ఛక్తి తేజస్సాధనతో ప్రకాశములో చూడగలుగుచున్నారేగాని ప్రత్యక్ష నేత్రముతో చూడనేరరైరి. ఇంకను అంతరములో కేవలము జ్ఞానముతో నాలో చించవలసినదేగాని తేజస్సునకుగూడ సాధ్యముగానేరదు. వీటినిగురించి యాక్షేప ణలులేవుగాని ఆధ్యాత్మిక విషయాదులలో ఆక్షేపణలకవకాశము మాత్రమతిశ యము. ఇది మలరూపజ్ఞానముతో గలిగినది.

—o—

# తత్త్వ సృష్టి క్రమ వివరము.

---

అధ్యారోప అపవాదములతో కల్పితముగ సృష్టిప్రారంభమాయెను. ఈ రెంటికిని కారణము అజ్ఞానము. ఈఅజ్ఞానమునకే ప్రకృతియనియు, తమస్సనియు, మాయయనియు, మనస్సనియు, శక్తియనియు ననేకవిధములుగా జెప్పబడును. గుణములయొక్క సామ్యావస్థకు ప్రకృతియని పేరు. ఇదియే ప్రళయావస్థయనియు మహాసుషుప్తియనియు జెప్పబడును. మాయయనిన నేమియును లేనిదనేదిస్పష్టము. కాబట్టి మాయతోనే సృష్టియని సిద్ధాంతముగచెప్పుట అసంభవము. ఆత్మవల్ల సృష్టియనిచెప్పుదమా. ఆత్మస్వరూపలక్షణ ప్రమాణములనుబట్టి యిదియు అసంభవమేను. ఇందుచేత నేమియునుతోచక అనిర్వాచ్యమని చెప్పవలెను. ఈ లాగున చెప్పినచో ప్రకృతకాలికులు ఒప్పుకొనరు. మనమాలోచించినను సృష్టి ప్రత్యక్షానుభవముతో కనుబడుచున్నది. వేదశాస్త్రముల వచనములప్రమాణము లెన్నటికిని కాజాలవు. తత్త్వవేత్త మహర్షులు ఉభయసంధిగా మిథ్యయని నిర్ణయించిరి. ఈమిథ్యాశబ్దార్థానుభవము బాగాఆలోచించి విమర్శింపవలెను. దీనితో నొకపర్యాయము పూర్వోత్తరములందు నీసృష్టిజాలముండదనేది సర్వులకు స్పష్టముగ విదితము. కాబట్టి మధ్యలోనుండినను శాశ్వతసత్యము కాదని మిథ్యగా చెప్పవచ్చును. మరొకపక్షమున ఆత్మనిర్వికారుడైనందుచేత అట్టినిర్వికార ఆత్మ స్వస్వరూపములో మధ్యలో సృష్టియైనదనినచో స్వస్వరూప ఆత్మకేవిధసంబంధము గాని బాధగాని యుండనేరదు సంబంధములు బాధలు దుఃఖములు మిథ్యాకల్పిత సృష్టికే. నాబడులుగలిగి అనుభవించియే తుదకై నాననే శాంతించుటచేత నిదిమిథ్యగా స్వకల్పితముతో జడముగానుండి ఆత్మచైతన్య అధిష్ఠానములో నుండుటచేత ప్రకాశవంతమయి తనకుతానే సర్వవ్యవహారములు గలిగించుకొని మరలతనకుతానే యేమియునులేకుండా నగుటచేత భ్రాంతియని మిథ్యయని దీనితో స్వస్వరూపమునకే విధసంబంధ బాధలులేవని ఉదాసీనమని చెప్పవచ్చును. ఆదిలోనొకటి సంపూర్ణముగ మార్పులులేని శాశ్వతసత్యముగ నున్నదానిలో ప్రత్యేకించినను అందులోనే యుండుటచేత అధిష్ఠానకారణములో ఉపాదాన కారణమని ఆత్మనువిడువలేక మనవివేకార్థమునకును బంధముక్తికిని ఆత్మనిత్యసత్యశాశ్వతముచేత ఆత్మను పొందదలచి దేనితో దుఃఖముగలిగినందుచేత దానిని దెలిసినందుచేత నిదిశాశ్వత




1. త్రివిధ త్రిలింగ స్వరూప సమష్టి వ్యష్టి వివరము.

## (I) త్రివిధ త్రిలింగ స్వరూప సమష్టివ్యష్టి వివరము.

ఒకసమష్టిదేహమునఁ ద్రివిధదేహములున్నవి. ప్రతిదేహమునకును బంచ భూతము లాధారాధేయములు. ప్రతిదేహమునకును సృష్టిస్థితిలయాదులున్నవి. సృష్టికొకవిధ పంచభూతముల వరుసక్రమమును, స్థితికొకవిధ పంచభూతముల వరుస క్రమమును లయమునకొకవిధ పంచభూతముల క్రమముండును, మూఁడు దేహ ములకు మూఁడుద్వారములున్నవి. వీటిద్వారా ఉత్పత్తులు గలుగుచుండును. దేహాంతమందు జీవుఁడు క్రిందిదేహమునుండి తనుపరిదేహములోఁజేరి యాదేహాంత మునఁగలద్వారముగుండా వెడలిపోవుచుండును. సృష్టియందుఁ గారణదేహ పంచ భూత తన్మాత్రల నుండి సూక్ష్మదేహ పంచభూతములలోఁ బ్రవేశించినవాఁడై మరల స్థూలదేహ పంచకర్మేంద్రియములతో మిధునీభూతమగును. స్థూలభోగాయన స్థూలదేహము మరొకసమష్టి స్థూలదేహమునందుఁజేరి తద్వారా స్థూలప్రపంచ ములోపలికి స్థూలరూపుఁడై సమష్టి త్రివిధ దేహ గుణాదులతోవచ్చి లోకవ్యవహార ముండగును. (ఇందులో మరొకవిమర్శన)

మొదటిసమష్టికారణ దేహక్షేత్ర మీ విశ్వబ్రహ్మాండము. రెండవతైజస దేహ మీ విశ్వములో వ్యష్టిగానున్న పురుషదేహము. మూఁడవది వ్యష్టిరూప క్షేత్రము. అదియే మాతృభూగర్భము. ఈవిధముగాఁ ద్రివిధ దేహోత్పత్తి స్థితిలయములగుచుండును. ఇట్టివ్యష్ట్యాత్మక సమష్టి జీవ దేహములో మూఁడుద్వా రములున్నవి. అధోముఖసృష్టి కధోముఖ ద్వారములును, ఊర్ధ్వముఖసృష్టి కూర్ధ్వ ముఖద్వారములునున్నవి. వీనిఁదెలిసి వేవియుందానక్తి కలవార లాద్వారములను బ్రియత్నీకృతాభ్యాసముతో సమీపించి చేరుదురు. ఒకయింటి మూఁడువాకిండ్లలో నొకటిసమష్టి. అది బాహ్య విశ్వవిరాట్టులోనికిఁబోవు తలవాకిలి. రెండవది లోకాంతరములఁ బ్రవేశించుటకు మధ్యలోఁగలదారి (సోపానము). ఇది తానున్న యింటికిఁబైఁగల మేడలలోనికిఁజేర్చునది, ఈ మేడలే యూర్ధ్వలోకాదులు. మూఁడ వది యింటలోఁగల యధోముఖద్వారము, దానితో నే ప్రధానసంబంధము కలవాఁడై నిత్యక్రియా కర్మాదులతో నవకాశముగలవాఁడై యుండును. స్వర్గసుఖాదుల నాసించువాఁడు మధ్యలోఁగల (సోపానము) మేడలనుబొంది (ఊర్ధ్వలోకాదులను) మరల నింటిలోనికి వచ్చుచుండును. మూడవవాఁడు అన్నిటికూర్ధ్వములోనున్న దేహాంతములోనున్న బ్రహ్మరంధ్రద్వారమును జేరి భేదించుకొని దేహాభిమానికాక విరాట్టులోఁజేరును. ఇతఁడే వ్యష్టిదేహద్వావరణ విముక్తుఁడై సమష్టి విరాడ్దేహ ములో నిమిత్తమాత్రుఁడైయుండి ముక్తుఁడగును.

లోకాదులను, దేహాదులను నాసించువాఁడీస్థూలదేహ పాతానంతరమున మధ్యదేహములోఁగల ద్వారమునందు బయలుదేరినవాఁడై తనపుణ్యపాప లోకానుభవాంతమున మరల నీమధ్య తైజసదేహముతో నిట్టిస్థూలదేహము నధోముఖమున నాభినాళముద్వారా నధోత్థుఁడై పొందును. ఉత్క్రాంతిలోఁ తైజసదేహాంతమగు నేత్రాదీంద్రియ ద్వారములద్వారా మనోవాయురూపముతో బహిర్గతుఁడగు. ఈస్థూలదేహముతో నెంతమాత్రము పోఁజాలఁడు అపుడు సూక్ష్మదేహమగు తైజసమధ్యదేహము నాశ్రయించి తైజసరూపుఁడై వెళ్ళునుగాని స్థూలముతో నెంతమాత్రము పోఁజాలఁడు. వెళ్ళఁదలచినవార లాయాలోకసంబంధ దేహాదుల నాశ్రయించియే వెళ్ళవలెనుగాని తదితర దేహాదులతో నెంతమాత్రము వెళ్ళఁజాలరు. కారణదేహాదులకుఁగాని దీనిసంబంధవిరాడ్విశ్వఁలోకాదులకుఁగాని వెళ్ళువాఁడీసంబంధ స్వస్వరూప దేహాంతరప్రాప్తితో వెళ్ళవలెను అందుచేత రూపములు, దేహములు, నవస్థలు, క్రియాకర్మలు, అనుభవములు భేదములుగ నుండును. ఆహారాదులుగూడ వీటిననుసరించియేయుండును. దీనిని సమగ్రముగాఁ దెలిసి యాలోచించి యాద్వారములచెంతఁ జేరినవాఁడై నిరంతరాభ్యాసియైన యోగయుక్తుఁడగును. ఇట్లగుటకు ధ్యానయోగాదులు కర్మభక్తిజ్ఞాన వైరాగ్యాదులు నుండవలెను. అందుచేత సర్వదా విచార వివేక విజ్ఞానము లత్యంతావశ్యకములు.

మనము స్థూలదేహాభిమానులమై స్థూలదేహసంబంధ దేహములో నున్నపుడు సర్వము తేజస్సంబంధములుగ నేయుండును. మనము కారణదేహముతో నున్నపుడన్నియు కారణదేహసంబంధములుగ నుండును. ఏదేహముతో నెంత దృఢచిరాభ్యాసయోగముతో నుండిన నంతమాత్రానుభవములై తదితర గుణాదుల కవకాశము లెక్కువలేకయుండును. ఈలోకములో నిరంతరము జన్మాదులతో స్థూలసంబంధాదులతోఁ బరంపరగానున్నందుచేత నివి స్థిరములై యెడతెగనివై పరమావధిగ వినువరాక ప్రబలానుభవైక భూతములగులున్నవి. వీనినామూలాగ్రముగఁ దెలియకను, శ్రవణముచేయకను, నభ్యాసముజేయకను నున్నందుచేత ననుకొన్న తక్షణమే యవి యనుభవమునకు రాఁజాలవు. అందుచే స్థూలాదులందు విసుగు చెంది విముఖులై యిటనుండియైనను యోగాదులఁ బ్రారంభించుటాక పుణ్యాంశమే. లేనిచో హీనులమనియే నిశ్చయించవలెను.

—o—

౦త్యసత్యమని ఆగంతుకమనిదెలిసినది. నిమిత్తకారణముగాదు ఉపాదాన కారణముసు గాదని తెలిసి మిథ్యగా దలంచినను సరేయగును. సృష్టియెందుకు గలిగినదో యని ఆలోచించినచో తనకుతానే దెలుసుకొనలేనట్టి అజ్ఞానస్థితిలో అజ్ఞానస్వరూపముతో తానున్నందుచేత మరలతాను సృష్టినిగురించిన సత్యమును శాశ్వతము నెవరి నడుగుచున్నాడని ఆలోచించినచో తనలోతానే తననే తనవంటి వానినే తానే అడుగుచున్నాడేగాని ఆలోచించి యితరుడెవ్వడును లేడు. తానులేడు అడుగునది లేదు. సృష్టిజాలము ప్రకృతిలో ప్రకృతమునొకరిని సృష్టిచేసినచో తద్వారామరల నాఒకనితో పరంపరలుగ నీలాగుననే సృష్టికొకరికొకరు అధోముఖములో సంబంధులుగానున్నవారలై రేగాని మరెవ్వరును వృథాగా కల్పించి నిమ్ములను దుఃఖింపజేయలేదు. ఇది తెలిసియైనను యింతటితోనైనను తూష్ణీంభావముజెందినచో మరేవిధమయిన దుఃఖములు బాధలునులేవు. ఈలాగున నాలోచించితే కారణముగాని కార్యముగాని యేమియునుండవు. అన్నియునాలోచించగా స్వస్వరూప ఆత్మను బొందదలచిన తీవ్రేచ్ఛగలవారికి నీకారణములతో నేమియును ప్రయోజనమే లేదు. వీటితో వృథాగా కాలహరణముగను, మరలమధ్యలో తీవ్రశుభేచ్ఛకు భంగముగూడ గలుగవచ్చునేగాని నీవిచారముతో ప్రాముఖ్యతేలేదు. ఇచ్ఛలేని వారికిని దీనితో విచారసిద్ధాంత మనవాశ్యకమేను. కొంతవ్యవధిగా తటస్థునికి బోధనార్థముగ లోదారిగలిగినగాని నిశ్చయజ్ఞానముగలిగి ఉద్యుక్తుడగు. అందుచేత ప్రారంభము ఎటులనో నొకదానిమూలముగా నెంచి తదాదిగా మనవరకుగల తత్త్వవిచారముతో తత్త్వజ్ఞానము గలుగుటకే అనగాతత్త్వమని స్వరూపవిజ్ఞానమునకే తత్త్వసృష్టిగా తత్త్వముతో జ్ఞానమాత్రముగ తత్త్వసృష్టిగా తత్త్వశాస్త్రములతో బంధవిమోచనార్థముగ వ్యవహారజ్ఞానములేకుండా నన్నియును నివృత్తములు, అధ్యారోపములు, అపవాదములు, భ్రాంత్యాదులుగ మిథ్యల నివృత్తికొఱకు తత్త్వసృష్టితో సాంఖ్యముగా కేవల జ్ఞానేంద్రియాత్మిక ప్రధానభావములుగా తత్త్వశాస్త్రము ముఖ్యమయినదిగా సర్వులకు అత్యావశ్యక సాధనామార్గములుగ నున్నవని సిద్ధాంతము. అందుచేత విశేషముగ విమర్శించుటకంటె ముందు ప్రయోజన ప్రమేయ విషయములనాలోచించుట ముఖ్యకర్తవ్యమని విరమింపవలెను. లేకున్న నిదియెడతెగని వివాదమయి తుదకేదియును లేక ఉన్నది. తప్పనిబాధ్యతయై దుఃఖముశాశ్వత సత్యమేయగును. అనేకవాదములు ప్రశ్నలు ప్రబలియుండుటచేత సమాధాన నిమిత్తముగా నీలాగున వ్రాయవలసినదాయెను.

ఏమతమునకుగాని యేసిద్ధాంతమునకుగాని యేశాస్త్రమునకుగాని విరుద్ధమని సర్వాత్మనా దయచేసి భావించక మన్నించుదురని ప్రార్థన. ఎవరికి తెలిసినదానిని వారవలంబులగుటలో నెవరియడ్డును లెంతమాత్రముండజాలవు. ఇందుకొకముఖ్యోదాహరణము. అనుభవము నిత్తును. విశేషించి తరచనేల. మనలో ఆత్మఅనేది యున్నదని సర్వులకు విదితమేను. ఇది సూక్ష్మముతో అంతరాత్మగానున్న దానిని సంపూర్ణముగ నునదనే అనుకొందము. ఇదియెటులిరిగి ఏనాటికైనను సంపూర్ణ ఆత్మేను. ఆదిలోనుండినదేను. అంతములోను తప్పక కాబోవుచున్న దేను. నిర్వివాదము. ఇది అధిష్ఠానముగనున్నది. దీనిలోకదా మాయాంశమనస్సాకటుండి ఆదిలో సంపూర్ణముతో లీనముగానేమియులేనిదిగానుండి మధ్యలో సూక్ష్మరూపముతో తైజసరూపమును గలిగించుకొని మరలస్థూలాకృతినిజెంది సర్వవ్యవహారము జేయుచూ మరలవెనుకకు క్రమముగనే టురల పూర్వమువలె నేమియును లేనిదిగనే యగుచున్నది. ఈలాగున నిరంతరమగుచుండుటను దెలిసి ఏలనివారించలేకపోతిమి. దేనివల్ల ఈసర్వానర్థములు దేనికికలిగినవి. ఇవిదేనికిసంబంధములైయున్నవి. ఒకవేళ తెలియలేదని వచింతురేమో ఇపుడు సంపూర్ణతను, సత్యమును దెలిసినది. మిధ్యగా లీనముగా నేమియునులేనిదిగానుండి మధ్యలోని వ్యవహారసృష్టిజాలమునంతయును దెలిసినది. ఈ తక్షణమే దీనినేల నిగ్రహించి నిలుపరాదు. సర్వస్వాతంత్ర్యమున్నదేకదా? నిలుపను శక్తి లేనివారలైనను దీనినామూలాగ్రమునైనాదెలిసి సిద్ధాంతమునైన సర్వ సమంజసముగా నేల వివరించి నిర్ణయింపరాదు. మించిపోయినదిలేదు. ఎప్పుడైననేమి? మనముగూడ సాధ్యముగాదనే చెప్పుదుమేగాని నిరూపించి సందేహములేని సిద్ధాంతము చేయలేము. ఆలోచించితే మన తత్త్వవేత్తలుగాగల మహర్షులేమి, శ్రీగురువులేమి, ఆలోచనలుచేయకనే అనిర్వాచ్యమని వ్రాసిరేగాని వేరుగాదు. ఏలయన మిథ్యాస్వరూపిణి, జడస్వరూపిణి స్వశక్తిలేనిదని ఏదిసంపూర్ణముగ సాక్షిగ నిత్యసత్యశాశ్వతముతో చైతన్యముతోనున్న దానికే నిమిత్తమాత్రముగ కారణములు ఔపచారికముగ నుండని దానిని చెప్పినలోపమేఅని జ్ఞానమునకై నొకనిర్ణయమునుగావించి తుదకేమియును లేనిదని అవాఙ్మానసగోచరమని అప్రాప్యమనసాసహాయని సిద్ధాంతవాక్యములనేచూపిరి. ఆత్మాధిష్ఠానసన్నిధిలోలేని దేమిజరిగినదని చెప్పినంత మాత్రమున నేమిప్రమాదమని బోధనార్థము జ్ఞాననిమిత్తమయి తుదకేమియును నిలవజాలదనే బోధించిరి. మరలఅంత్యములో తుదకేమియును లేదని శ్రీఆదిశంకర

దేశికేంద్రులే అనేకస్తోత్రములనువ్రాసిరి. కొన్ని విధములుగ ఆదిలోను మరికొంత భేదములుగ మధ్యలోను తుదకు సిద్ధాంతమే కడపటిదిగను తెలియుట ముఖ్యము. సహజము. లేనిదాని నిరూపించి యెవరేమియెట్లుచెప్పతగును? తుదకు అనిర్వాచ్యమనే సర్వసాధారణముగ చెప్పినగాని అంతముగాదు. ఎండమావులను వివరించి నిరూపించుటనెటులనో నటులే నిదియగును. సర్వమాలోచించిచూడగ అన్నిటికంటెను ఆత్మనిత్యసత్యశాశ్వతముగ సంపూర్ణముగ అద్వితీయముగ నున్నదనే దానికి నిరూపణగా ముఖ్యముగా సర్వాధికముగానున్నదనేదానికి ఆత్మకేముఖ్యకారణముగా చెప్పిరని తోచుచున్నది. మాయ (మనస్సు) నెటులవిజృంభించి సృష్టిజగజ్జాలమును చేసిననేమి చేయక ప్రళయావస్థలో లీనముగనున్ననేమి? మిధ్యగానున్ననేమి? సత్యముగానున్ననేమి? ఎటులైనను దుఃఖగుణముగాగలదని ప్రమాదమని దెలిసినదానితో మనకు సంబంధమును గలుగజేసికొనక మనస్వరూపముతో మనమున్నచో నేదియెటులుండిననేమి లేకున్ననేమి? సంబంధమే లేనపుడు మనమందులో చేరనపుడు సృష్టిజగజ్జాలముతో అవి ప్రత్యక్షప్రమాణానుభవములగును. ఇందుకు దృష్టాంతము స్వప్నావస్థేను. స్వప్నావస్థలో ప్రకృతిసంబంధమున్నందుచేత పునరావృత్తులున్నవి. దానికతీతములో స్వస్వరూపములోనున్నచో నేయవస్థలులేవు. మొదటనే ఆత్మయుండినందుచేతను మాయరెండవదిగా నందులో కల్పితమగుటచేతను మొకటిఆధారములేకున్న మాయకు అవకాశములేనందుచేత ఆత్మకేప్రధాన కారణముగను మాయకు చైతన్యములేనందున చైతన్యము సర్వదా సర్వములందు ప్రధానముగ నుండుటచేత చైతన్యము ఆత్మసంబంధముచేతను సృష్టికిప్రధాన కారణత్వము ఆత్మకేయుండిన నేమియుప్రమాదముండనేరదని వేదాంత తత్త్వశాస్త్రములు పలికినవాయెను. ఆత్మ, మాయ, ఈరెండులేనిదే సృష్టికానేరదు. అందుచేత ఒకటిముఖ్యకారణము రెండవది సామాన్యకారణముగ మనము గ్రహించవలసివచ్చెను. ముందు సృష్టిక్రమమును విచారింతము. మనఃప్రసాదముతో మనోనిశ్చయముతో సర్వసమన్వయమగును. అనర్థములుండవు.

## —♦ తత్త్వసృష్టిక్రమము. ♦—

అధిష్ఠాన ఆత్మఆధారముతో రెండవదియగు మాయలో లీనముతోనున్న సృష్టిగుణములతో బహిర్గతముగా గలిగినవి. ఎట్లనిన సత్వగుణప్రధాన మాయయందు ప్రతిఫలించిన చైతన్యము ౧, మాయ ౨, ఈరెంటికిని అధిష్ఠానము

పరిపూర్ణముగాగల ఆత్మ 3. ఈమూడును జేరిన తత్త్వమునకే ఈశ్వరుడనబడును. ఈ యీశ్వరునికే అంతర్యామి, అవ్యాకృతుడు, సాక్షి జగత్స్రష్టయని పర్యాయ పదములు. అందుచేత సృష్టికి మొదటిది ఉపాదాన కారణముగను, రెండవదినిమిత్త కారణముగను చెప్పవలెను.

## —♦ అ ధ్యా రో ప ము. అ ప వా ద ము. ♦—

అధ్యారోపమనగా నిష్ప్రపంచ స్వరూపుడైన ఆత్మయందు ప్రపంచ మున్నట్లుగ ఆరోపించుటకే అధ్యారోపము. దృష్టాంతము. రజ్జువునందు సర్ప భ్రాంతియు, మరుమరీచికలయందు జలాధ్యారోపము యిత్యాదులు. ఇదియొందు చేత గలిగినదనిన అజ్ఞానమేను. అజ్ఞానమనగా స్పష్టముగానున్నదాని విడచి మరొకదాని నందు ఆరోపించడమేను. ఈ అజ్ఞానమునే ప్రకృతియనియు, తమ స్సనియు, మాయయనియు, అవ్యక్తమనియు, ననేకవిధములుగా జెప్పుదురు. అధ్యారోపముతో అపవాదమేర్పడెను.

ఆత్మలో అణువంశగానున్న ప్రకృతితో మహత్తు అహంకారములు ఆవరణ ములుగా గలిగెను. ఇదివరకు స్వస్వరూప ఆత్మప్రతిబింబిత చైతన్యస్వరూప ఈశ్వరుడు సత్త్వగుణ ప్రధానమయిన మాయతో గూడినవాడై నీమాయలో నున్న తమోగుణప్రధాన యుక్తమాయెను. వీక్షించెను. అందుచేత నీతమోగుణ మాయలో ఈశ్వరచైతన్యము ప్రతిఫలించినందుచేత మరల త్రిగుణాత్మకమయిన యాకాశభూతము పుట్టెను. మరల నీఆకాశములో విశిష్టమయిన చైతన్యము వలన త్రిగుణాత్మక వాయ్వాదిగా తేజోభూతమును, జలభూతమును, పృథివీభూత మును త్రిగుణయుక్తముతో పుట్టెను. ఇవి మొదటి అపంచీకృత భూతములుగా దెలియవలెను. ఇందులోని త్రిగుణములు ముందు సృష్టిస్థితిలయాదులకు కారణ ములుగ దెలియవలెను. ఈ అపంచీకృత భూతములు సూక్ష్మభూతములనియు, తన్మాత్రలనియు జెప్పబడును. క్రమముగా నీభూతములవలన ద్వివిధభేదములుగ వ్యష్టి, సమష్ట్యాత్మకమయిన లింగశరీరము గలిగెను.

## —♦ లిం గ శ రీ ర ము. - (సా త్త్వి క గు ణ సృ ష్టి.) ♦—

లింగశరీరము పదియేడు పదార్థములతో జేరియున్నది. అదెటులనిన ఆకాశముయొక్క సాత్త్వికాంశమువలన శ్రోత్రేంద్రియమును వాయువుయొక్క

సాత్వికాంశమువలన త్వగింద్రియమును తేజస్సుయొక్క సాత్వికాంశము మన చక్షు రింద్రియమును జలముయొక్క సాత్వికాంశమువలన జిహ్వేంద్రియమును పృథ్వి యొక్క సాత్వికాంశమువలన ఘ్రాణేంద్రియమును బుట్టెను.

ఈపంచభూతములయొక్క సాత్వికాంశసమష్టివలన అంతఃకరణము పుట్టినదై యిది వృత్తిభేదములతో మనోబుద్ధి చిత్తాహంకారంబులాయెను. ఇవి బుద్ధియం దహంకారమును మనస్సునందు చిత్తమును అంతర్భావములు.

## —♦ ర జో గు ణ సృ ష్టి. ♦—

ఆకాశముయొక్క రజోంశగుణమువలన వాగింద్రియమును వాయువు యొక్క రజోంశమువలన పాణీంద్రియమును, తేజస్సుయొక్క రజోంశము వలన పాదేంద్రియమును అప్పుయొక్క రజోంశమువలన పాయ్వింద్రియమును పృథ్వి యొక్కరజోంశమువలన నుపస్థేంద్రియంబుగా నేతత్ప్రకారముగ కర్మేంద్రియంబు లైదు నుత్పత్తిగాగలిగెను.

ఈపంచభూతముయొక్క రజోంశ సమష్టివలన ప్రాణంబుపుట్టెను. ఈ ప్రాణము వృత్తిభేదములతో ప్రాణాపానవ్యానోదానసమానంబు లన నైదువిధంబు లైనవి. వీనిలో నుపవాయులంతర్భూతములైయున్నవి.

కర్మేంద్రియములైదును జ్ఞానేంద్రియములైదును, పంచప్రాణములు, అహం కారము, మనస్సునుజేరి యీపదియేడు తత్వములు సమష్టివ్యష్ట్యాత్మకంబైన లింగ శరీరమని చెప్పబడును. ఆ యీశ్వరుడే లింగశరీరంబునం దభిమానముజేసి హిరణ్య గర్భుండాయెను. ఇతనికే సూత్రాత్మయనియు, ప్రాణుండనియు, రెండువిధములుగ పేరులుగలిగెను. ఇదియే సూక్ష్మసృష్టి.

మొదటచెప్పినది కారణముతో ఈశ్వరసృష్టి. కేవలజ్ఞానస్వరూపముతో వ్యాపకత్త్వమధికము. ప్రకృతికి వ్యాపకత్వము అతిసూక్ష్మనిమిత్త 'శుద్ధావరణము. ఈశ్వరుడు సర్వస్వతంత్రుడు. మాయకధిపుడు. భూతాతీతుడు. మహత్తత్వ స్వరూపుడు. కేవలము తత్ త్వం అసి గాసిద్ధస్వరూపుడు. ఈ స్వరూపము రెండు విధములు. ఒకటికేవల ఆత్మతో స్వరూపత్వము. రెండవది భూతాదులతో గలిగిన స్వరూపత్వముగాను కాలగుణ వస్తుభేదముగా దెలియవలెను. భూత స్వరూపము ప్రాణముతో సృష్టిస్థితిలయాది ప్రళయపరంపరలతో భూతాదుల ప్రమాణముతో కాలగుణవస్తువులతో భూతాదులు కార్యాపేక్షకన్న కారణములు

నిత్యమైనవి. పరతంత్రము. ఇదేలింగశరీరము. అనగా కనుబడనట్టి శరీరములకు నొకగుర్తుగా ప్రారంభముతో మూలముగానున్న దానికే లింగశరీరము. లేక శరీరములకు పూర్వరూపకారణ చిహ్నము. దీనితోముందు స్థూలశరీరమునకు ముఖ్యకారణము. అందుచేతనే అతీతులకు నీలింగశరీరము భంగముగావలెనని తత్వశాస్త్రములు బోధించెను. అనగా నీలింగశరీరము గుణములతో భూత తన్మాత్రలుగాగల సూక్ష్మాంశముతో జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతో వ్యష్టిగను యిందులో సమష్టిసాత్వికాంశముతో మనోబుద్ధ్యాదులును, ప్రాణమునుబుట్టెను. భూత పంచీకరణముతోగలిగినవి. భూతగుణాదు లేకములై పంచీకృతములై వ్యష్టి సమష్టితో మిశ్రమమైయున్నంతకాలము దేహాదులుతప్పవు. ప్రాణముతప్పదు. సృష్టి స్థితిలయాదులుతప్పవు. ఇచ్చట గమనించవలసిన యొక ముఖ్యాంశమున్నది. మనస్సు ప్రధానముగ సమష్టిపంచభూతముల సాత్వికాంశముతోగలిగినందుచేత సమష్టిమనస్సుచేత సర్వభూతగుణాదులను ప్రతిశరీరసంబంధమునకు సూత్రప్రాయమై గ్రహించుట కొకముఖ్యకారణము. దీనికారణముగా సమష్టిగుణరజోంశముతో వాయురూపప్రాణముపుట్టెను. అనగా ఆకాశప్రధానముగ మనస్సుగను, వాయు ప్రధానముగ ప్రాణముగను తేజస్సుప్రధానముతో రూపముగలిగెను. ఆద్యంతములకును ప్రాణమనునదును వాయుసర్వప్రధానమై సర్వాధారమయి సర్వ స్వరూపమయి సర్వకార్యకారణమయి స్ఫోటనశక్తిగలిగి సృష్టికిని సృష్టిగాగలిగిన లింగదేహభంగమునకును సాధనాంశమూలముగ సమష్ట్యాత్మకముగ నున్నదని ముఖ్యముగా సాధకులు ముముక్షువులు ప్రాణులుగ్రహించి ముందుఆలోచ నాంశముగా తెలియవలెను. ఇవిసమష్టిస్వరూపముగా చేరినందుచేత వ్యష్టిస్థూల దేహమునకును సమష్టిసర్వస్వరూప అభేదలింగదేహమునకును సర్వదేహములకును సర్వమునకు సంబంధముగానున్నందుకు ముఖ్యకారణమని స్పష్టముగాదెలియవలెను. ఈలింగదేహ భంగమే బహుకష్టతరసాధనము. వాయువు ఊర్ధ్వముఖముతో గతి గలిగినగాని కానేరదు. మనకు బహిర్గతముగాగల ఇడాపింగళనాడులను కుంభ నముతోబంధించి ఏకముగా సమానముగాజేసి సమానవాయువును కుంభకమయిన దానిని అధఃకుండలినిగ దలంచి దీనిని సుషుమ్నగామినిగా (ఆకాశముగా) ఊర్ధ్వ ముఖముగా ఊర్ధ్వకుండలినిగా గావించి అచ్చటదీనికంతమగు శబ్దరూప ప్రణవ నాదముతో నిదిమొదట నధస్ఫోటనముగా వచ్చినదానిని ఊర్ధ్వస్ఫోటనముగావించుటే కపాలస్ఫోటనము. లింగదేహభంగము బ్రహ్మరంధ్రభేదనము ఆదిత్యమండలభేదనము

యిత్యాదులు. ఈలాగున శ్రమించిన సాధించిన గాని స్థూలదేహనివృత్తిగాదు. స్థూల కర్మాంగములతోను సూక్ష్మజ్ఞానాంగములతోను కారణమనస్సుతో నుండుట చేత స్థూలకర్మాంగ కర్మలతోను సూక్ష్మజ్ఞానాంగములతో జ్ఞానముతోను కారణ మనస్సుతో (వాయువుతో) స్ఫోటనముగావించినగాని ప్రాణశబ్దముపోదు. దేహ శబ్దముపోదు. బంధమైనదానిద్వారముదెలిసి యాద్వారముద్వారా మరలబంధ విమోచనము గావించక అధోముఖద్వారముగా విమోచనాదులతో నిరంతరము గావించుచూ మరల బంధములుగాగల అనేక దేహాదులనే యుత్పత్తిగా జేయు చున్నామనిన నేమిప్రయోజనము. అధోముఖద్వార మందున్న నిరంతరాభి మానము. ఊర్ధ్వముఖద్వారమం దేనాడుఎట్లుగలుగునో ఆనాడే ఊర్ధ్వరేతస్కుడు దేహాతీతుడు ఏకాంతుడవగుదువు. ముక్తుడవగుదువు. ఉపన్యాసములతో గానేరదు. సాధనలతోనగుదువు. వ్యవహారములతో వచించుటచే వంచకుడవగుదు ముగాని క్రియాశుద్ధిగలుగదు. అందుచేతనే మనదేహమునకు రెండుముఖ్యద్వార ములున్నవి. ఒకటి ఊర్ధ్వముఖద్వారము మరొకటి అధోముఖద్వారము. అధో ముఖద్వారము సర్వదా స్ఫోటనముతో విశాలముగ స్వేచ్ఛగ నేయున్నది. ఊర్ధ్వ ముఖద్వారము బొత్తిగా తెలియనందుచేత మూతబడినది. అధోముఖమే నిరంతర మయినది. ఈమార్గమే స్థూలదేహమార్గము. స్థూలకర్మలతో స్థూలాంగమార్గము. కర్మలతో దేహజన్యమో లేక కర్మలు లేకనే దేహముజన్యమాయెనో దెలియక కర్మలే లేవని సిద్ధాంతము జేయుట యెట్టిసాహసమో దెలియదు. ఈలాగున పంచీ కృతదేహమును స్ఫోటనముతో జరాసంధుని వధవలె పంచత్వమునుతొలగించి అపంచీకృత భూతాదుల నతిక్రమించినగాని ఈశ్వరుడవుకానేరవు. ఈశ్వరుడే ఆత్మస్వస్వరూపుడగును. ఈలింగదేహాభిమానియే హిరణ్యగర్భుడు. భూతముల కాదిదైవతము. "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్" విరమింతము.

స్థూలతత్త్వసృష్టివివరము తమోసృష్టి - ఈశ్వరునియొక్క వీక్షణముచేతను తమోగుణప్రధానములైన యపంచీకృతభూతము లొక్కొక్కటి రెండేసిభాగములు విభజించి యిందులో మొదటిభాగము విడిచి మిగతపగభాగములో నొక్కొక్కటి నాలుగుభాగములతోగూడి పంచీకృతభూతములాయెను. ఇవేస్థూలభూతములు. వీటితో ఈశ్వరదృష్టితో బ్రహ్మాండమును, యిందులో చతుర్దశభువనములాయెను. ఆయాభూతలోకాదుల ననుసరించిన గుణాదులతో నాయాగుణభూతములను చతు

ద్విధభూత గ్రామాదులుబుట్టెను. ఇది స్థూలప్రపంచము. దీనియందభిమానియగు నీశ్వరునికి విరాట్టనిపేరు. ఇతనికే వైరాజసుండని వైశ్వానరుండని వ్యష్టిసమష్టి నామాంతరములు. వ్యష్టిశరీరము సమష్టివిరాట్టుదేహములో అంతర్భూతముగ నున్నది.

ఈవ్యష్టి స్థూలశరీరమందు జాగ్రదవస్థలో అభిమానించిన ఆత్మకు విశ్వుడని వ్యవహారికుడని చిదాభాసుడని నామాంతరములు. ప్రతిశరీరమందును త్రివృత్కరణములో త్రివిధశరీరములుండును. ఆయాశరీరమునుబట్టి శరీరప్రధానముగను మిగతవి అంశాంశములుగనుండును.

స్వప్నావస్థయందును లింగశరీరమందును, అభిమానించిన ఆత్మకు తైజసుండని, ప్రాతిభాసికుండనియు, స్వప్నకల్పితుడని నామాంతరము.

సుషుప్త్యవస్థయందును కారణ శరీరమందును అభిమానించిన ఆత్మకు ప్రాజ్ఞుండనియు అవిచ్ఛిన్నుడనియు నామాంతరములు. ఇదిస్థూలప్రపంచముయొక్కయుత్పత్తి. దేహాదులు స్థూలబ్రహ్మాండము ననుసరించి గలిగినందుచేత స్థూలములో క్షేత్రములుగ జీవులకాధారనిలయములైనవి. కాబట్టి నీదేహాదులు స్థూలక్షేత్రములుగను యింగులోని అంతర్యామిగనున్న ఆత్మ క్షేత్రజ్ఞుడుగను ప్రతీతికికారణము. అంతరాత్మ అంతర్విాతముతో క్షేత్రావరణ బంధముతో నీపేరుగలిగెను. మరల నీస్థూలప్రపంచముయొక్క అవాంతరసృష్టిప్రళయములకొఱకై త్రిమూర్తులుగ సత్త్వగుణముతో బాహ్యములో విష్ణువుగను రజోగుణముతో సృష్టికర్తగ బ్రహ్మగను, తమోగుణబాహ్యముతో సంహారకుండుగ రుద్రుడుగను నగుచున్నవారలైరి. త్రివిధసమష్టిలో విరాడంతర్భూతుండు బ్రహ్మయును, హిరణ్యగర్భాంతర్భూతుండు విష్ణువును, అవ్యాకృతాంతర్భూతుండు రుద్రుండును నీప్రకారము ప్రపంచోత్పత్తిగలిగెను.

మరల మనసృష్టి నీస్థూలములో దశవిధసర్గములతో స్థూలములో స్థూలముగను యుగాదులలో అంత్యయుగముగను, మానవులతోమరల కామాదులతో కేవల కామనాసృష్టిగ స్వయంకృతాపరాధముతో కేవలమలరూపుడుగను స్వేచ్ఛతో గలిగిన మనము దైవమేళ్ళసృష్టిగావించి నీలాగునందరినేల దుఃఖంపజేయవలెననిచో మనము ఈశ్వరసృష్టిలోను చేరక తత్త్వసృష్టిలోనుచేరక మొదటిభూతసృష్టిలోనుచేరక దేవఋషి గంధర్వాదులసృష్టిలోను చేరక కేవల కామాతురతతో వంశపరముగా సంతానేచ్ఛప్రధానముతో సంతుగాగలిగిన మనాక్షేపణలెంతటివో

తెలియజాలనివి. ఈశ్వరాదులుగా నవగరించిన మహనీయులు సిద్ధులు. మహర్షులు సహిత మీ యాక్షేపణలు చేయజాలనివారలై బంధవిమోచనమార్గ ప్రధానమునే వెతకి సాధకులైతరించిరి. కేవల ప్రమాదావస్థలోనున్న రోగి శత్రుపోరాటములో నున్నవాడును తమకు ప్రకృతప్రమాదావస్థలను తప్పించుకొను యుపాయమాలోచించక ఎవడుదీనికి కారకుడని నిందారోపణలుగావించి ప్రయత్నమేలేనిచో ప్రమాదములపాలెవరగుదురో దానినెఱుంగక నిర్వికార నిర్వికల్ప నిర్గుణపరిపూర్ణ ఆత్మయందారోపణలు అపవాదములుంచుటచే నెవరికిముప్పగలుగునో ఆలోచించక ధూర్తులతో దూరస్థులగుటకే అధికమాయెను. అజ్ఞానతమస్సుల బలమెంతటిది. ఎంతకాల మీకాలసర్పము కాచుకొనియున్నదో దెలియదు. ఏనాటికైనను ఈశ్వరుడే శరణ్యుడగుటతప్పదు. మాయను అనిర్వాచ్యమని తత్వశాస్త్రవేత్తలు జెప్పినందుకు మననిత్యానుభవములో మరొక ముఖ్యదృష్టాంతరమును జూపెదను. మనము సుషుప్తిలోచేరుటను రోజు అనుభవములోనున్న బాత్తిగా గ్రహించలేము. మరల సుషుప్తినుండి నెటు లింగశరీరములోనికివచ్చినది గమనించలేము. దీనిని గమనించి తెలుసుకొన్నచో ఆత్మలోనిమాయ ఎటులవచ్చినది లీనమగునది తెలుసుకొన్నవారలమే యగుదుము. ఏమియునులేనిదానిలో యేమియును లేనిదిగనే ప్రారంభమై తుదకు స్థూలమువఱకు రాబడి మరల లీనములోను తుదకేమియును లేనిదగనే నగుచు లీనము సంపూర్ణములోనగును. ఇట్టి నిత్యానుభవమైనదానిని కనిపెట్టుటెటులకాదో యటులనే మాయను అనిర్వాచ్యమని తత్వవేత్తలాలోచించి వ్రాసిరి. మూలప్రకృతి మాయతో తనంతకుతానే ప్రకృతము మిథ్యగానున్న దానిని దెలియక ప్రకృతిసంబంధక్షేత్ర రూపావరణమని దెలియకను, ఈ అంతరములో ఆత్మస్వరూపముగానున్నదానిని దెలియకను, నీవుజడస్వరూప ప్రకృతితో జేరిన దేహముతోను, ప్రకృతిసమష్టి భూతరూప మనస్సుతోను సృష్టిగాగలిగి దీనిని విడిచి అంతరాత్మకు ఆత్మకు సంబంధించిన సృష్టిగా సిద్ధాంతముతో అధ్యారోప అపవాదముగా మిథ్యగాభిన్నముతో దెలియక వృథా వచించిన జడక్షేత్రరూపుడవైతివిగాని చైతన్యస్వస్వరూపు డెంతమాత్రము కానివాడవైతివి. కాబట్టి నీ వాదములన్నియు యెండమావులవలె వృథా వాదములేగాని సత్యమెంతమాత్రము గాదని స్పష్టము. ఒకడు నాటకములో మరొక వేషము వేసి అభినయించి మాటలాడిన సర్వవ్యవహారమున్నది. సత్యమెంతమాత్రముకాదు. సంపూర్ణములో నేమియు నుండదు. ఉండినచో నది సంపూర్ణమేగాదు. మరొకదాని అంతరాయములో గుణ

ములచేత క్రమముగా స్థూలమువఱకు రాగలుగును. గుణములయాధిక్యమే స్థూలము. తుదకు పంచతన్మాత్రలకు మూలమగు శబ్దమేనిలువను. "లోక పామెతలో అన్నియునెటులవచ్చినవో మరలనటులనే పోవుననెదరు. ప్రకృతసైన్సు విధానమంతయు నిదేవిధానము ననుసరించినదిగానే యున్నదేగాని వేఱులేదు. ఆద్యంతములందన్నియును జ్ఞానస్వరూపములుగానే నిలిచియున్నవగును. మధ్యలో స్థూలాదులుగా కొంతకాలము మాత్రముండును. దీనికే మిథ్యయందురు. శబ్దము సంపూర్ణముతో చెప్పవలెను. మిథ్యలోనుండి మిథ్యలనిజెప్పుట జ్ఞానమాత్రమగును. అనుభవమును సంపాదించుకొనవలెను. తుదకేమో మిథ్యయనునది స్పష్టము. ఒకవిషయమునుగాని వస్తువునుగాని నిరూపించి సిద్ధాంతముచేయవలెననిన మానవ మాత్రునితో నెంతమాత్రముగాదు. మనస్సుతో సిద్ధాంతములుగాజేసిన మన స్మృతులు ఋషిత్వముతో దివ్యతేజస్సుతో సిద్ధితో దివ్యదృష్టితోజేసిన శ్రుతి స్మృతులుగావు శాస్త్రములుగావు. మనకు భయకంపాదులు భ్రమణలుడుగలేదు. కామక్రోధాదులణగలేదు. అభిమానములు వదలలేదు. వ్యామోహాదులు వదలలేదు. కాన ఇష్టమువచ్చినట్లు పరిశీలించుట సామాన్యమగును. ఎక్కువ వ్రాయనేల. సర్వము కాలాత్మకము. కాలాధీనము. కాలస్వరూపము. సర్వ విధములు కాలమేప్రధానప్రకృతి. అన్నియు తనకుతానేకారణము. మరొక టేదియునులేదు. లేకున్న సంపూర్ణస్వరూప జ్ఞానముతోను జ్ఞానానందముతోనున్న మనలో నదెటులనో ఊహింపను సాధ్యములేనిదిగా మాయ, మనస్సొకటియేమి యును లేనిదిగనే యుత్పత్తియై మరలనెటులనో గుణాదులుత్పత్తిగానై కారణ మాదిగా స్థూలకార్యకర్మలను గుణాదుల ననుసరించి చేయించి మరలఅంతములో అనంతపరిపూర్ణముతోనేజేరి ఏమియును లేనిదిగనే నిరంతరమగుచున్నది. మరల నదెటులనో ప్రారంభమగుచున్నది. వచింపను, నిర్వహింపను, ఊరకయుండు టకును, ఏవిధమునను సాధ్యముగానిదైయున్నది. ఇది మన నిత్యానుభవ స్వాధీ నములోనుండియు నివారించలేనివారలమైతిమి. సాధ్యముగాదని చెప్పుటకు వీలు లేదు. కష్టసాధ్యముగనున్నదేను. ఇటులనే మనకు దేహాదులు సంభవించు చున్నవి. తొందరపడి బాహ్యములోనిలిచి ప్రకృతిగుణాదుల ప్రమాదభ్రాంతితో అజ్ఞానమోహాజనకములతో స్వఘాతములుగ సర్వము జ్ఞానముతో నాలోచించక తొందరపడివచించి సర్వముచేయుట నాలోచించినచో నేమియును జెప్పజాలము. ఇది అనిర్వాచ్యము. అందుచేతనే అనిర్వాచ్యమనిరి. వాక్కుకతీతము. రెండు

విధములతో సమన్వయము. ఆత్మకుఅతీతమేను. అనగా అవాఙ్మానసగోచరము ఇచ్చట అటులనే వాక్కుకు అతీతముగనున్నది. ఎక్కువగావివరించనేల. బోధ కొరకుమాత్రమే చూపుచాలును. మనస్సుతో జేరక స్వస్వరూపజ్ఞానములో జేరుటకే కర్మ భక్తిజ్ఞానవైరాగ్య ఉపాసనాది యోగాదులనుచూపిరి. దేనితోనైనను ప్రారంభుడు గావచ్చును. తుదకదే నావగా దరిజేర్చును.

ఓం తత్సత్.

—o—

# సృష్టిక్రమవివరము.

---

సృష్టి అనడముతోనే ఏవిధముగనో నొకవిధమయిన ఆకారవిశిష్టప్రకాశ రూపముతో ఒకదానికొకటి సంబంధముతో మిథునీభావముతో మరలప్రత్యేకించి చూచువారికి, చూడబడునదిగా స్థూలముగను, సూక్ష్మముగను, కారణముగను, తోచునట్లుగాని, ఆలోచనతో అనుమానప్రమాణముగగాని, స్పష్టముగగాని నగ బడుచుండును. ఇదేలాగనిన మనస్సుతో ఆలోచనగ కారణరూపముగను బుద్ధితో జ్ఞానరూపముగ సూక్ష్మముగను స్థూలేంద్రియనేత్రముతో స్థూలరూపముగను మూడువిధములుగ నీసర్వమున్నది. అందుచేగ చూపు, చూడబడునది, చూచు వాడును యీమూడును తప్పకయుండినగాని గనుబడవు. వీటికాధారముండే తీర వలెను. ఆధారమెటులుండవలెననిన చో ఆదిలోనొకవస్తువు సంపూర్ణ అద్వితీయ ముతో సర్వత్ర ఆక్రమించి యుండినగాని మరల మరొకవస్తువందులో కనుబడుటకు అవకాశముండదు. అందుచేత ఆధారమొకటి ఆధేయమొకటి యుని యునదగును. ఇటులనే మరలస్థూలాదులకు సూక్ష్మమాధారము సూక్ష్మమునకుకారణ మాధా రము కారణమునకు సంపూర్ణముతో అద్వితీయముతో నొకసర్వ పరాపరముతో సంపూర్ణముగనుండుటచేత వచింపరానిదిగనుండును. ఇటులనే మరల స్థూలమునకు స్థూలమే ఆధారముగను, సూక్ష్మమునకు సూక్ష్మమేఆధారముగను, కారణమునకు కారణమేఆధారముగను సర్వాధార సంపూర్ణస్వరూపమునకు సంపూర్ణఅద్వితీయ స్వస్వరూపమే స్వయమాధారముగను నుండును. సంపూర్ణముతో నన్నియును

సంపూర్ణము లేయగును. కాబట్టి సంపూర్ణము శాశ్వతముగను సత్యముగను మిగిలినవి. అశాశ్వతములుగను అసత్యములుగ నుండును. ఇందుకు కారణము మొదటనున్న దానిలో మరల కల్పితములో నుత్పత్తిగానైనందుచేతనేను. ఏనాటికైనను ఏతుద కైనను నొకటి తప్పక మిగులును. అదే శాశ్వతము. సత్యము పూర్ణము స్వస్వరూపము అవాఙ్మానసగోచరము. అద్వితీయముచేత నిరూపించజాలము. కల్పితముతో భూతాదికాలములుగను, భూతాదిపంచభూతములుగను భూతాదిగుణములుగనున్నవి. ఈలాగు నెంతవివరించినను బోధకుకష్టముగనుండును. ఆత్మను దెలియనందుచేత అనర్థములకును వివాదములకును, సందేహములకును, ప్రశ్నలకును ముఖ్యకారణము.

సృష్టికి మూడువిధములతో సర్వకారణ కార్యములుగ నునవి. ఈమూటినే, త్రిపుటియని, త్రికాలములని, త్రిగుణములని, త్ర్యవస్థలని, త్రిదేహములని, అండపిండ బ్రహ్మాండములని చేతనాచేతనములకును క్షేత్రక్షేత్రజ్ఞునికిని సమన్వయ సంబంధములుగనున్నవి.

మొదటి అపంచీకృతభూతములుగ నున్నవాటిని పంచీకృత పంచీకరణముతో సృష్టికిప్రారంభము. పంచీకృతమేమిధునము. ఈమిధునముతో మరల నన్నియును మిధునీభూతములై మిధునీభావ క్రియాకర్మలతో అంతమువరకునుతప్పక జరుచుగునే యుండును. సృష్టిక్రమమెటులనో లయక్రమమటులనేను. ఒకదానిలోనొకటి ఉపరి భూతాదులలో లీనముకావడముతో ఈరెండు నెడతెగని పరంపరలుగా నుండుట చేత మనమెంత ఆలోచించినను యెడతెగనివిగానే స్వభావగుణానుసారముతో అంతముతోచదు. తోచనికారణమునకే అజ్ఞానమనిజెప్పిరి. అజ్ఞానములో నెంత జ్ఞానమును సంపాదించినను అజ్ఞానముతో చేరిన జ్ఞానమేయగును. ఆధ్యాత్మిక జ్ఞానముతో నీయజ్ఞానము నశించునవకాశమగును. ఈ ఆధ్యాత్మిక జ్ఞానము మన భారతభూమిలో సహజముగా అనుభూతమైనందుచేత మనభారతభూమి మహాపుణ్యభూమి. ఇతరులకు ప్రథమములో బోధకావడమే మహాదుస్తరము. మనకుబోధ కావడము సహజభావముతో సులభము.

ఎప్పటికిని స్వాభావికముతో సర్వదానున్నదానిలో ప్రత్యేకించి భిన్నముగా సృష్టికానేరదు. దీనికి భిన్నముగా మరొకటేర్పడినగాని సృష్టికవకాశముండదు. భిన్నరూపమునకే ఛాయయని, మాలిన్యమని, అజ్ఞానమని, ప్రకృతియని, మాయయని సృష్టియని, కల్పితమని రెండవదియని నామాంతరములు. రెండవదానితోనే సృష్టికి

అవకాశము. దీనికేభిన్నమనియందురు. భిన్నముచేత అశాశ్వతమనియు భిన్నము లేనిదిసర్వదా యేకరూపముతో నుండుటచేత శాశ్వతమని ఆత్మయని స్వస్వరూపమని సత్యమని జ్ఞానస్వరూపమని మనతత్త్వశాస్త్రములు, వేదములు, నిరూపించినవై మనభరతదేశములో అనాదియముగ ప్రకాశించి సులభబోధకములై సహజములై సర్వసామాన్యములుగ మనకు సర్వమూలముగ నున్నందుచేతనే మనజన్మభూమి సర్వవిధములుగ అన్నిటితోను సర్వోత్కృష్టత జెందినది. మనవేదశాస్త్రపురాణములు సహితము స్వప్రకాశములై సృష్ట్యాదియందును, సృష్టిమధ్యలోను, సృష్ట్యంతమందును సర్వదాప్రకాశ ప్రమాణములై మధ్యలోనే మార్పులులేని సత్యములై సర్వులకు సర్వమూలమయి సర్వవిజ్ఞానావకాశములై శాశ్వతములుగనున్నవి. ఆధ్యాత్మికదృష్టితోను, ప్రకృతిప్రపంచదృష్టితోను ముఖ్యావకాశ మూలాధారములై యేనాటికైన నివే ఆశ్రయములైయున్నవి. మహాప్రళయములోసహితము ప్రళయ శ్రీరుద్రమూర్తి యున్నంతకాలము ప్రళయములో మిగిలియుండి ప్రళయముపసంహారానంతరమందు మరల బయలుదేరి సృష్ట్యారంభమగును. ప్రళయమూర్తి శ్రీరుద్రుడే బొత్తిగా లేనిచో ఆనాడివి లేకపోవునేమోయని తలంచవచ్చును. ప్రళయములో శ్రీరుద్రమూర్తి హస్తగత త్రిగుణరూప త్రిశూలమందు నీభరత భూమి గుణసామ్యముతో కారణరూప బీజప్రాయమయి అణువుగానుండి ప్రళయాంతమందు మరల త్రిగుణరూపములతో కారణ, సూక్ష్మ, స్థూలాదుల ననుసరించి ప్రవృత్తి పరిణామముతో అణువాదిగా మహత్తు బ్రహ్మాండమగుచుండును. బ్రహ్మాండములో మనభరతభూమియే అంత్యభూమి. విరాట్టనుపాదము. ఇదేమూలాధారకమలము. శిరస్సే సహస్రారము. ఆదికారణభూమి. ఆద్యంతములతో అణురూపమును బొందియుండును. కాబట్టి మనభరతభూమి సర్వకార్యకారణ విశిష్ట శేషభూమి. సర్వనిలయభూమి. సర్వాశ్రయభూమి. మహాపవిత్రపుణ్యభూమి. క్రమముగా దీనిమూలముతో సర్వమునకు సర్వులకు సర్వాధార మూలకారణభూమి. ప్రళయములో నిదిబొత్తిగా నశించినచో మరల సృష్టికి నేమాత్రమవకాశమే లేకపోవును. సృష్టికి కారణభూమి యుండేతీరవలెను. కారణనాశనముతో కార్యముండదు. కాబట్టి మనభరతభూమి కారణభూమి. వేదశాస్త్రపురాణములో ప్రమాణము లనేకములుగలవు. వేదశాస్త్రపురాణములు భరతభూమియును పరస్పర సంబంధములై శాశ్వతములై సత్యధర్మ సాంప్రదాయ సనాతనములై పరంపరానుగత ప్రమాణములైయున్నవి. ప్రళయమూర్తియే ఈశ్వరుడు. ప్రకృతే శ్రీ

రూపముతో సృష్టికికారణభూమి. ఈ రెంటిని ప్రకాశింపజేసినదే వేదము. నిదే జ్ఞానస్వరూపఆత్మ. ప్రకృతితోనే ప్రళయము. ప్రకృతితోనేసృష్టి. ఇంతటి మహావిమర్శనలు విద్యలు విజ్ఞానమునకు మనవేదమే సర్వమూలము. సర్వులకు నిదే ప్రారంభములోఆధారము. వేదమేలేనిచో నీజడప్రకృతితో నేమియును బొత్తిగా దెలియజాలనివారలమే అగుచుంటిమి. వేదములు స్వతఃప్రమాణములు. సృష్టిలోచేరినవిగావు. శాశ్వతప్రకాశములు. వేదముల ననుసరించే శాస్త్రపురాణాదు లుత్పత్తిగాబోధకములైనవి. ఇదియొకవిధముగా సృష్టిక్రమమునకు వివరకారణము.

—o—

# సృష్టితోగల మార్పుల వివరము.

సృష్టియనుటచేతనే కాలగుణభూత పరిణామవికారాదులతో సర్వవిధములుగ మార్పులుండితీరును. కాబట్టి ప్రతివస్తువునకును పదార్థమునకును స్థిర చరాదులకును నిరంతరము క్రమముగ ఆద్యంతములందు ఆవరణములతో అనంతానంతావకాశములతో ప్రకృతి వికృతులతో నున్నదున్నట్టుగా నుండక సర్వదా మార్పుజెందుచుండును. ఇదిసహజము. మనమింతవరకు రాగలిగినందుకును మరల మనతో ముందెంతవరకు నీలాగున పరస్పరకార్య కారణాదులతో పోగలుగుచున్నదో తెలియరానిదిగనున్నది. ఇటులనీబ్రహ్మాండగోళముగూడ ఆదినుండి నింతవర కనేకపరిణామవికారాది ప్రళయమార్పులతో వచ్చినదేయని తెలియవలెను. అందుచేత కాలభేదములతో రూపుమార్పులతో భేదములుగ పురాణసృష్టికిని నిప్పటికిని ముందు కాలమునకును విపరీతాంశ రూపనామక్రియాభేదములతో ప్రళయమువఱకును భేదములుగ నగుచునేయుండును ఇదిప్రకృతితోగల సృష్టివిచిత్రసహజము. వీటికి సహకారము భ్రమణతోను భ్రాంతితోను మరొక కారణము.

భూమి నీరుగామార్పుజెందవచ్చును. నీరు తేజస్సుగా మార్పుజెందవచ్చును. తేజస్సువాయువుగా మార్పుజెందవచ్చును. వాయువుఆకాశముగా మార్పుజెందవచ్చును. ఆకాశము ఆత్మగాకావచ్చును. మరలక్రమముగ నన్నియును మార్పులతో ప్రారంభముగావచ్చును. ఇట్టిమార్పులతో నిరంతరమగుచున్నదానికి మనవేద

పురాణాదులలో చెప్పబడినవాటికిని నేటివర్తమానకాలమునకును ముందురాబోవు కాలమునకును క్రమముగా భిన్నరూప పరిణామాదులతో సహజమార్పులతో నగుచున్న బ్రహ్మాండములోని లోకాదులను గుఱించి పరిశీలించి విమర్శించినచో నేలాగున సర్వమునకు సమన్వయముకుదురును. రాజ్యములమార్పులతో అల్పకాలములోనే సర్వము మనము చూడగ ననేకమార్పులుగ మారుచున్నవి. యుగముల భేదములతోగలమార్పులను తెలియుట చాలదుర్వగాహముగనుండును. ముందురాబోవుకాలమువారలకు మనవి వారలకు భేదములుగనే నుండును. భూమిద్వీపములుగ మారవచ్చును. సముద్రములుగను మారవచ్చును. ఇటులనే సముద్రము భూమిగ మార్పుజెందవచ్చును. జలమునకును, భూమికిని పరస్పరసంబంధ సంయోగముతో మార్పులు సహజములు. ఇదియునుగాక చిన్నప్రళయములాదిగ మహాప్రళయములవఱకు గలుగుచుండుటచేత ప్రళయములతో మరలమార్పులు రూపనామాదులకు వికారములుగ మార్పులు గలుగవచ్చును. ఊహింపరానివి మూలప్రకృతికే మార్పులుగగలగుణాదులతో నున్నందుచేత ప్రకృతిసంభవములన్నింటికిని పరిణామవికారాది మార్పులు సహజములు.

అందుచేతనే వేదపురాణాదిశాస్త్రములు పరిణామ, భ్రమణ, భ్రాంతి, ప్రళయాదులు, సృష్ట్యాది వికారగుణములున్నవని మొదటనే వివరించిరి. దీనికే జగన్మిథ్యయనిరిగాని బొత్తిగా లేదని యర్థముకాదు. ఉన్నంతవరకేసత్యముగాని శాశ్వతసత్యముగాదనిరి. ప్రకృతిని ఆశ్రయించియున్నదేగాని స్వయముగా నెంతమాత్రము లేదు. ప్రకృతితో ప్రపంచము. ప్రకృతిగుణాదులే ప్రపంచమునకుండును. సిద్ధాంతము సత్యమెప్పటికిని ఒక్కటేను. అసత్యమనేకములు. ఇట్టిసిద్ధాంతములు దెలిసియును మమతతోగల మనస్సుతోను మతముతోను మనమున్నంతకాలము మన అనంతరమున్నవారలకును పరస్పరభిన్నతా జనిత దోషముతో భిన్నవాదములు తప్పవు. సత్యముదెలిసినను వాదములు సహజములుగ మఱెవ్వరితోనైనను గలుగుచుండవచ్చును. ఏతుదకైనను ఆద్యంతములొక్కటేను. అవే మనమహర్షుల సిద్ధాంతములు. అవే వేదశాస్త్రపురాణాదసారములు. ఇందుకుదాహరణము. ఒకస్వప్నములోనున్నవానినిజూచి జాగ్రదవస్థలోనున్నవాడు స్వప్నగతావస్థుని ఏమి కలువరించుచున్నావని హెచ్చరించి స్వప్నసత్యమని అపుడుదెలసియు మరలతాను స్వప్నావస్థాగతుడుకాగా నిదివరకు స్వప్నావస్థయొక్క అసత్యమునుదెలిసియు మరల తాను ఆస్వప్నభ్రాంతినే సహజముగ జెంది కలువరించినట్టుగనే నీఅసత్యభ్రాంతి

సర్వులకును క్రమముగ నావరించి సత్యజ్ఞానమును తెలుసుకొనునంతవరకు భ్రమింప జేయుచుండును.

సృష్టితోగలమార్పులు సహజముగ సంపూర్ణఅద్వితీయ స్వప్రకాశ ఆత్మలో మరొకప్రకాశముగలుగదు. ఇట్టిస్వప్రకాశములో మఱొక ప్రకాశమునకు అవకాశముగలుగవలెననినచో నది భేదముగను, ప్రకాశహీనముగను మరొకదానితో కల్పితముగ నుండినగాని గనుబడదు. ఈమధ్యలో కల్పితభేదముతోగలిగినదే తమస్సు. మాయ, అజ్ఞానము మనస్సు మూలప్రకృతియని నామాంతరములు. ఈలాగున నొకఆవరణము రెండవదిగానేర్పడి మరల అందులో మొదటిస్వప్రకాశ ఆత్మతేజస్సుభిన్నముతో మాలిన్యముతో మిశ్రితతేజస్సుగా ప్రతీతిగానగును. మొదటిస్వప్రకాశతేజస్సే లేకున్న సర్వము శుద్ధమాలిన్యముగ నొకేవిధముగ భిన్నస్వరూపములే బొత్తిగ లేకుండ సమానముగనేయుండునుగాని మధ్యలో తేజస్సున కవకాశముండదు. మొదటిది స్వప్రకాశతేజస్సు సత్యముగను మరల కల్పితముతో భిన్నప్రకాశ మిశ్రితతేజోరూపాదులుగ మార్పులతో క్రమముగ సృష్టిమార్పు లగుచుండును. [illegible]తేములో నేదియున్నుండక మరల స్వస్వరూప ఆత్మనిలుచును. ఇందుకు ప్రకృతము మనమురోజు చూచుచున్న సినీమాదృష్టాంతరమేచాలును. సినీమాప్రారంభము స్వప్రకాశతేజస్సులో మధ్యలోతమస్సు ఆవరించినగాని చిత్రములకవకాశముగలుగవు. మొదటితేజస్సహాకారమేలేక తమస్సుతోనే ప్రారంభించదలచినచో భిన్నమేలేక శుద్ధతమస్సే అద్వితీయముగనేనుండును. సినీమా అనంతరము మరల స్వప్రకాశతేజస్సే మిగులును. ఆద్యంతములందు స్వరూపస్వప్రకాశ తేజస్సుసత్యముగనున్నది. మనము తమస్సులోగల ప్రకాశమునేజూచి యంతకంటె ప్రకాశమేలేదని మూలమును దెలియక భ్రమపడుచున్నాము. ఇది స్వస్వరూప ఆత్మప్రకాశ మెంతమాత్రమును గాదనిస్పష్టము.

మరొకదృష్టాంతమునుజూడుడు. ఒకజననిలో మరల సృష్టికావలెననినచో మరల ఆజననిగర్భములో మధ్యలో ఆవరణముగా మాయయొక్క టేమియును లేనిది మధ్యకాలములో కల్పితమై అందులో మరల మధ్యేకల్పితముగ తత్స్వరూపసృష్టి తదంశగా నీలాగున సృష్టిగామార్పులతోనగుచు తుదకు బాహ్యముతో నేమియును లేనిదిగనగును. ఉభయత్ర మాయ. మాయలేనిదే సృష్టి. మార్పులుగలుగవు. మొదటితండ్రినుండి, తల్లిగర్భముతో పరంపరలుగా మార్పులతో గలుగుచున్నవి. ఈలాగున ప్రళయమువఱకును మధ్యేకల్పితావరణములతో కల్పితరూపాదులుగ

నగుచుండును. ప్రకృతియొక్క విచిత్రచిత్రమును కనిపెట్టుట దురవగాహకమును, అనంతభేదములు ప్రకృతికిసహజము. భ్రాంతియే సర్వకారణము. అభిమాన వ్యామోహితము సత్యమునకు బాధాకరము. ప్రకృతిప్రబలించి విస్తరించి నంత ప్రళయ ప్రమాదములు సమీపించుటతప్పవు. ఆధ్యాత్మజ్ఞానమువిస్తరించి ధృఢపడినకొలది ప్రకృతివిస్తారము ప్రబలముకానేరదు. ఈసంజ్ఞచేత యుగాదుల రూపములుగనున్నదని తెలియవలెను.



## సైన్సుకును తత్త్వమునకునుగల సంబంధవివరము.

ఈవిషయ మతిసూక్ష్మముతో విమర్శింపదలచితిని. ప్రకృతకాలానుసార మీవిషయమును కొంతవిమర్శించడముతో ప్రయోజనము ప్రమేయముగూడనున్నది.

సైన్సుకును తత్త్వమునకును కొంతవరకు భేదములులేవు. రెండును ఉత్పత్తినే గోరుచున్నవి. అనుభవమును ఆశించుచున్నవి. ఈరెంటికిగల విధాన ములు నొకటి ఊర్ధ్వగతిమార్గముగను తుదకు సర్వములీనముతో శాశ్వతమగు స్వస్వరూపముతో అంతమొంది తుదకు ఆనందముతో ఏవిధములైన క్రియలు, కార్యములు, అన్యవస్తువులు లేకపోవడము తూష్ణీంభావమేను. ఇది తత్త్వవిధానము. సైన్సుకు బాహ్యవిధాన పరికరాదు లావశ్యకములు. ప్రారంభములో కొంతవరకు రెంటికిని త్రిపుటిసంబంధముమాత్రమున్నది. తత్త్వత్రిపుటికి చూపుచూడబడునది చూచువాడుముఖ్యము. ఈలాగున ప్రారంభముతో తనఅంతరములో ప్రారంభించి తుదకు బ్రహ్మాండముతోను అతీతుడై ఆవలపరాపరముతో సర్వాతీతుడగును. అంత వరకు ఆవరణసంబంధములతో బంధములుగానుండును. ఇవిఒకదానిలోనొకటిగా లీనముతో తుదకు నివారణములగును.

సైన్సువిధానమునకును త్రిపుటియున్నది. రెండుపదార్థములు చేయువాడు చేరి త్రిపుటియగును. సైన్సు సృష్టిలోనుండి మరల బాహ్యములో అనంతసృష్టిగా చేయడమేను. ఈలాగున అంతములేకుండా ప్రళయమువరకును చర్విత చర్వణముగా చేయుచుండుటే సైన్సువిధానము. ఇదిస్థూలవిధానము; మొదతెగనివిధానముతో అనంతనామరూప వికారాదుల కాస్పదమగునది. తుదకిది ప్రళయముతోనేఅంతము.

ఇదే ఫలితము. ఇదిప్రారంభములో అభిమానప్రేమలుగాగలిగి అంతములో దుఃఖమునుగలిగించును. ఏనాటికైనను శాశ్వతము సుఖానందములు గాజాలవు. వస్తువులు నిస్సారమయినను విడువజాలనివి. చేయువారలకేదోయొకవస్తుగుణ సారరూపములుగనె తోచుచుండును. ఇదిఅధోదృష్టి. ఆవరణపరంపరలుగ కాగలమార్గము. జడపదార్థములతో సంబంధవిధానమేగాని చైతన్యసంబంధ మెంత మాత్రమునుగానేరదు. స్థూలమార్గము మలమార్గము.

ఈసైన్సు భూతకాలములోజేసినవి వర్తమానకాలములవారికి భిన్నములుగను పురాతనములుగను మరలమార్పులతో భవిష్యత్కాలములవారికి భేదములుగను స్థిరములులేని భ్రమలతో సర్వదా చేయుచుండువారలేయగుచుందురు. నిలుకడ లేనివిధానమార్గము. తృప్తిలేనిమార్గము. నశింపుమార్గము. తుదకు సర్వనాశన మగును. ఇది స్వతంత్రముగా నిది. అన్యతంత్రము. తత్త్వము స్వతంత్రము. సైన్సు ఆవరణ విధానములతో అనంతావరణములతో ప్రత్యేకములుగా గలుగును. రెంటికిని జ్ఞానముప్రధానము. సైన్సుకు పదార్థప్రకృతికి విజ్ఞానముప్రధానము. తత్త్వమునకు అధ్యాత్మవిజ్ఞానము స్వస్వరూపప్రధానము. ఆత్మసంపూర్ణుడగుటచేతనే నిత్యుడు సర్వవస్తుగతుడగుటకు ముఖ్యావకాశకారణము. అనంతావరణములతో తుదకు అత్యంత సూక్ష్మముగా ఆవరణమగుటచేత అందులో అతిసూక్ష్మదశగాగల అణుత్వముగా ఆత్మఅగుటకు ముఖ్యకారణము. మహదావరణముతో అధ్యాత్మిక విద్యతో మహత్తుగా కాగలిగి తుదకు నిరావరణముతో సంపూర్ణుడుగానగును. ఈ రెండువిధానముల కివేభేదములు.

సైన్సుకు కర్తృత్వభోక్తృత్వప్రధాన విధానము. అధ్యాత్మవిద్యకేదియును లేదు. భిన్నముతోనే దుఃఖము. అభిన్నముతో ఆనందము. అమృతము. జ్ఞానముతో సర్వసంబంధముగా ఆత్మయున్నది. అజ్ఞానముతో పరస్పరభేదముగా ప్రకృతి యున్నది. ఏదిప్రతివస్తువునందును ఉన్నదియని అనుచున్నామో అదిఆత్మస్వరూపమేను. అందుచేత మనమెంత ఉత్పత్తిగాచేసినను యెడతెగని సారముతో అన్నిటి యందుండును. ఇందుకు నిత్యసత్యత్వము లేకారణము. ఇదిసంపూర్ణముగాతెలిసిన వారలే మనమహర్షులు. సైన్సుతో నెప్పటికైనను ప్రమాదము దుఃఖమనే తెలిసి దీనినిదూరముజేసి అధ్యాత్మవిద్యనే యధికముగా సాధనపరులై సుఖించి ఆనంద మూర్తులైరి. అమృతస్వరూపులైరి.

ప్రకృతకాలానుసారముగ సైన్సువిధానముతో ఆత్మతత్త్వమునకు ప్రత్యక్ష

ప్రమాణములకును చాలసహాకారములుగ నున్నందుచేత చాలసంతోషసహాకా
ముగనున్నది. ఈసైన్సువిద్యాపండితుల మహోపకారముతో అధ్యాత్మికవిద్య
నిలుచుటకును వ్యాప్తికిని ప్రకృతకాలమునందు చాలసహాకారమొనర్చినదాయెను
సృష్టియంతయు సైన్సుననుసరించినదేను. ఈరెంటికిని భేదమేలేదు. మనవిజ్ఞా
మును కేవలము ప్రకృతిక్షేత్రరూప జడపదార్థవస్తువిజ్ఞానమునందే సర్వదానిమగ్ను
లగుటకంటె చైతన్యమునందు ఉపయోగించి సాధించులేటి ఉత్తమముక్తిమార్గము
ఎక్కువవివరింపజాలము. సర్వదాఅవస్థలుపడుట కష్టతరమార్గమగుటచేత అధ్యాత్మ
తత్త్వము ననుసరించుటఉత్తమము.

—o—

# పురాణముల వివరము.

| వరుస సంఖ్య. | పురాణములు | శ్లోకసంఖ్య | ముఖ్యఫలవివరములు ఫలప్రాప్తి. |
|---|---|---|---|
| ౧ | బ్రహ్మపురాణము | ౧౦,౦౦౦ | జలధేనువును వైశాఖపూర్ణిమయందు దానమిచ్చిన బ్రహ్మలోకప్రాప్తి. |
| ౨ | పద్మపురాణము. | ౫౫,౦౦౦ | సువర్ణలేఖినిని జ్యేష్ఠ శుద్ధ పౌర్ణమియందు దానమిచ్చిన అశ్వమేధఫలసంప్రాప్తి. |
| 3 | వైష్ణవము. | ౨3,౦౦౦ | ఘృతధేనువును ఆషాఢశుద్ధ ౧౫ లు నాడు దానమిచ్చిన విష్ణులోకప్రాప్తి. |
| ౪ | శైవము. ఇదే వాయవీయము | ౧౨,౦౦౦ | గుడధేనువును. శ్రావణశుద్ధ పౌర్ణమియందు దానమిచ్చిన శివలోకప్రాప్తి. |
| ౫ | భాగవతము. | ౧౮,౦౦౦ | బంగారుసింహమును భాద్రపద శుద్ధపౌర్ణమియందు దానమిచ్చిన పరమపదప్రాప్తి. |
| ౬ | నారదీయము. | ౨౫,౦౦౦ | ప్రత్యక్షధేనువును ఆశ్వయుజ శుద్ధ పౌర్ణమియందు దానమిచ్చిన ఇష్టలోకప్రాప్తి. |
| ౭ | మార్కండేయము | ౯,౦౦౦ | స్వర్ణగజమును కార్తీక శుద్ధపౌర్ణమియందు దానమిచ్చిన పౌండరీకయజ్ఞఫలప్రాప్తి. |

| వరుస సంఖ్య. | పురాణములు | శ్లోకసంఖ్య. | ముఖ్యఫలవివరములు ఫలప్రాప్తి. |
|---|---|---|---|
| ౮ | ఆగ్నేయము. | ౧౬,౦౦౦ | స్వర్ణపద్మసహితములగు రెండుతిలధేనువులను మార్గశిర శుద్ధపౌర్ణమియందు దానమిచ్చిన సర్వక్రతుఫలప్రాప్తి. |
| ౯ | భవిష్యత్పురాణము | ౧౪,౫౦౦ | గుడధేనువును పుష్యశుద్ధపౌర్ణమిరోజున దానమిచ్చిన అగ్నిష్టోమయాగ ఫలప్రాప్తి. |
| ౧౦ | బ్రహ్మకైవర్తము | ౧౮,౦౦౦ | గృహదానము మాఘశుద్ధపౌర్ణమిరోజున దానమిచ్చిన బ్రహ్మలోకప్రాప్తి. |
| ౧౧ | లైంగపురాణము. | ౧౧,౦౦౦ | తిలధేనువును ఫాల్గుణ శుద్ధపౌర్ణమిరోజున దానమిచ్చిన శివలోకఫలప్రాప్తి. |
| ౧౨ | వరాహపురాణము | ౨౪,౦౦౦ | బంగారుగరుత్మంతుని, తిలధేనువును చైత్రశుద్ధపౌర్ణమియందు దానమిచ్చిన విష్ణులోకఫలప్రాప్తి. |
| ౧౩ | స్కాందపురాణము | ౧,౦౧,౦౦౦ | బంగారుత్రిశూలమును దానమిచ్చిన శివలోకఫలప్రాప్తి. |
| ౧౪ | వామనపురాణము | ౧౪,౦౦౦ | విషువత్పుణ్యకాలమున ఏదియైనను దానమిచ్చిన శ్రీవిష్ణులోకప్రాప్తి. |
| ౧౫ | కూర్మపురాణము | ౬,౦౦౦ | ఉత్తరాయణపర్వ పుణ్యకాలమున బంగారుతాబేలును దానమిచ్చిన గోసహస్రదానఫలప్రాప్తి. |
| ౧౬ | మత్స్యపురాణము | ౧౪,౦౦౦ | ఉగాదిరోజున గోదానమిచ్చిన సకలపృథివీదానమొసగిన ఫలప్రాప్తి. |
| ౧౭ | గరుడపురాణము | ౧౯,౦౦౦ | బంగారుహంసను దానమిచ్చిన శ్రీశివలోకప్రాప్తి. |
| ౧౮ | బ్రహ్మాండపురాణం | ౧౨,౨౦౦ | సువర్ణసహితముగ కంబళమును వ్యతీపాతాదులందు దానమిచ్చిన సహస్రరాజసూయఫలప్రాప్తి. |
| | | ౪,౦౧,౭౦౦ | |

## ——♦ శ్రీస్కాందపురాణవివరము - సంహితలారు, ఖండములారు. ♦——

### సంహితలవివరము.

| | | | |
|---|---|---|---|
| ౧ సనత్కుమార సంహిత | పంచపంచాశత్సాహస్రిక | శ్లోకములు | ౫౫౦౦౦ |
| ౨ సూత సంహిత | షట్సాహస్రిక | ,, | ౬౦౦౦ |
| ౩ శాంకర సంహిత | త్రిసాహస్రిక | ,, | ౩౦౦౦ |
| ౪ వైష్ణవ సంహిత | పంచసాహస్రిక | ,, | ౫౦౦౦ |
| ౫ బ్రహ్మ సంహిత | త్రిసాహస్రిక | ,, | ౩౦౦౦ |
| ౬ సౌర సంహిత | ఏకసాహస్రిక | ,, | ౧౦౦౦ |

### వీటిలోగల ఆరు ఖండముల వివరము.

౧ పంచనాగర ఖండము
౨ కమలాలయ ఖండము
౩ రేవా ఖండము
౪ ఏకవీర ఖండము
౫ మైలార ఖండము
౬ గోదావరీ ఖండము

ఇవిఆదిగాగల పంచాశత్ఖం (౫౦) డములున్నవి.

## ——♦ ఉపపురాణముల వివరము. ♦——

౧ సనత్కుమారపురాణము
౨ నరసింహపురాణము
౩ నందికేశ్వరపురాణము
౪ శివధర్మపురాణము
౫ దూర్వాసపురాణము
౬ నారదీయపురాణము
౭ కపిలపురాణము
౮ ఉశనశపురాణము
౯ బ్రహ్మాండపురాణము
౧౦ వరుణపురాణము
౧౧ కాళీపురాణము
౧౨ వాసిష్ఠపురాణము
౧౩ లైంగపురాణము
౧౪ సాంబపురాణము
౧౫ సౌరపురాణము
౧౬ పారాశరపురాణము
౧౭ మారీచపురాణము
౧౮ గంగాఖ్యపురాణము

అన్నిపురాణములలోచేరి ఒకలక్ష శ్లోకములు.

# వేదశాస్త్రపురాణములకు ముఖ్యప్రయోజనము.

వేదశాస్త్రపురాణములకు ప్రయోజనము ఈ సర్వస్వరూపమంతయు మొదటనేమియును లేని జ్ఞానస్వరూపముతో నుండి క్రమముగా ప్రకృతి గుణభేద విస్తారముతో కారణమాదిగ సూక్ష్మ స్థూలములుగా అగుపడుచున్నదాయెను. వీటి బోధనారూపమార్గములే వేదశాస్త్రపురాణాదులు. వీటిసహాకారముతో తెలుసుకొనుటకును సాధించుటకును, అనుభవించుట కనుకూల మూలకారణములుగ విద్యలుగను వాఙ్మయస్వరూపముగ ఆధారములైయున్నవి. మొదటికారణస్వరూపముగు జ్ఞానములో నన్నియు జ్ఞానస్వరూపములతో సమష్టిగ లీనములుగానున్నవి. అట్టివాటిని బోధించినవే వేదములు. వేదములనగా కేవల జ్ఞానస్వరూపాత్మక బోధనారూపములతో స్వయముద్భవములగుట అనాదిగనున్నవి. జ్ఞానమెట్లు స్వస్వరూపమో వేదములట్లనే స్వస్వరూపములేను. కల్పించినవికావు. సృష్టిక్రమముతో సర్వమేవిధముగా కారణసూక్ష్మస్థూలాది నామరూప పరస్పర భిన్నములుగా గుణభేదములతోగలిగిన విధానమువలె వీటివిమర్శనార్థము ఆయాభేదరూప నామాదులుగ విస్తరించెను.

ఈసర్వప్రపంచమునంతయును జ్ఞానస్వరూపముగ తెలియుటకు వేదములతోనే తెలియవలెను. ఇతరాదులతో దెలుసుకొనలేము. అందుచేత వేదములు. వేదశాస్త్రిపురాణములకు ముఖ్యప్రయోజనము. అతిప్రశస్తములై మూలవిద్యగా జ్ఞానస్వరూప బోధాత్మకముగా కేవల సత్వగుణ ప్రధానములుగ మొదటివిద్యగానున్నవి. వేదములోలేనివి మరేమిటియందుగాని బొత్తిగానుండనేరవు. ఇందులోనుండియే క్రమగతముగా స్థూలమువఱకు రాగలిగినవి. సర్వమునకు మూలము జ్ఞానము. జ్ఞానమే వేదము.

రెండవరూపము శాస్త్రములు. ఇవిసూక్ష్మస్వరూప నామాదులతో వాఙ్మయరూపములుగా వైఖరిగా బోధనాత్మకములుగా వేదములనుండి తదనుసారముగ నేర్పడినవి. ఇవేస్మృతులుగా సృష్ట్యాదిలో సత్వగుణప్రధాన బ్రహ్మమానసపుత్రులు వివరించిరి. మానసపుత్రులనగా మన్వాదులు. మహర్షులు సాత్వికమనస్సుతో లోకోపకారార్థములుగ స్మృతితో అనగా తమ అంతర్వాణితో జ్ఞానస్ఫురణతో దివ్యదృక్పథములో నగుపడినవాటిని వ్రాసిరి. ఇవేశాస్త్రములు. శాసనతో

శాస్త్రములు. ఇవి తత్త్వస్వరూపములో సూక్ష్మరూపనామక్రియాదులుగా బోధనా రూపములుగను వాఙ్మయములుగనున్నవి.

మూడవస్వరూపములు పురాణాదులు. ప్రపంచము స్థూలాకారముగ పరిణామముతో జెందినందుచేత వీటివిజ్ఞానమునకై పురాణరూపములుగ స్థూలముతో రూపనామ గుణకర్మల భేదములుగా ననుసరించి స్థూలరూపాత్మక వ్యవహారములకు సమన్వయముగ యితిహాసాదులుగ బోధనాత్మకములైయున్నవి. మనము మొదట ఆత్మస్వస్వరూప జ్ఞానరూపముతో నున్నవారలము కడపటి కేవిధముగ నీస్థూలరూప నామాదివ్యవహారములను బొందితిమో నటులనే మనకు సహకారములుగ విజ్ఞానములుగ త్రివిధగుణ భేదములతో బోధనాత్మకములుగా స్వస్వరూపకారణములుగా నున్నవని స్పష్టముగా దెలియవలెను. పురాణములందలి విషయ విజ్ఞానాదులు కల్పితములుగావు. వీటికి వేదములే మూలములు. వేదశాస్త్రపురాణములు త్రిగుణ భేదములను దెలిపినవి. వేదములలో త్రిగుణభాగములను దెలిపినది వేఱు. కేవల జ్ఞానస్వరూపములను బోధించిన భాగము వేఱు. ఇవే ఉపనిషత్తులు జ్ఞానస్వరూప బోధకములు. గుణాతీతములు.

సృష్టిప్రపంచము ననుసరించి లోకవిజ్ఞానమునకై పరాపశ్యంతి మధ్యమవైఖరీ రూపకములుగ శ్రీభగవదనుగ్రహముతో వేదశాస్త్రపురాణములుగ బోధనారూపములుగ జగదుపకారములుగనున్నవి. విస్పష్టముగ దెలియవలెను. మందాధికారులకు పురాణములుగను సూక్ష్మాధికారులకు తత్త్వశాస్త్రములుగను జ్ఞానస్వరూపులకు వేదములుగను బోధనాత్మకములుగ నున్నవి. అన్యభావముతో ఉదాసీనులు గాక స్వస్వరూప సోపానయోగములని దలంచవలెను. ఈసృష్టిబ్రహ్మాండములో నన్నియును జేరిన వేగాని ప్రత్యేకించి వేరుగా నేమియును లేవు.



## యజ్ఞములు యజ్ఞఫలములు త్రివిధములు.

యజ్ఞములనుగుఱించి ఇదివరకే ప్రథమభాగములో వివరించియున్నందుచేత నిచ్చట మరలవిమర్శింపలేదు. యజ్ఞములు త్రివిధములు. యజ్ఞఫలములు త్రివిధములు. త్రిగుణములనాశ్రయించి కార్యక్రమాదులు, ఫలములుండును. సాత్త్విక

నిష్కామముతో జేసిన యజ్ఞమునకుఫలము సోమపానమనిన సామాన్యముగాదు. ఇది పునరావృత్తి లేని అమృతత్వము. తమనిష్కామ సాత్విక ఆత్మయజ్ఞముతో తనయందే సోమోత్పత్తిగానగును. అట్టిస్వాతంత్ర్యస్వరూప ఆనందరససోపానమే సోమపానము గాని సామాన్యముగ స్వర్గలోకములో లభించునట్టి చంద్రకళామృతపానముగాదు ఇదికృతకము. అది అకృతకము. ఈసోమపానార్హులు, ఊర్ధ్వరేతస్కులు, బ్రహ్మనిష్ఠులు, జితేంద్రియులు, త్యాగులు బ్రహ్మమానసపుత్రులు మొదలుగాగల వారలుండు మహర్లోకాదిగాగల సత్యలోకమువఱకు గల లోకాదులు యీలోకవాసులకే నీసోమపానము లభించును. ధృవమండలమును సూర్యమండలమును భేదించి వెళ్లినవారల కీ సోమపానము ప్రాప్తించును. వీరలగుణాతిశయములు వివరములు నీలోకాదుల వివర్శనలో చూడతగును. ఇది ఏకాహాత్మపశుయజ్ఞము. సర్వము తానే అన్యపశుపులేదు. దీనినే ఆత్మయజ్ఞమనికూడ నందురు. వీరలు నిమిత్త కారణ శరీరములతో అభాసగా శేషించియుందురు.

రెండవది రజోగుణసంబంధము. దేవతలనాహ్వానించి ఆహుతులివ్వడము. దీసికి అన్యపరికరాదులతోను అన్యపశువుతో ప్రధానముగాజేయు యజ్ఞము. ఇది కామనాయజ్ఞము. దీనికిలోకము ధృవమండలము క్రిందుగాగల స్వర్గలోకము. కృతకము. ఆత్మసంబంధమేమియును లేక కేవల తేజోలోక తేజోభూత తేజశ్శరీరసంబంధము సావధికము. కాలపరిమితితోనుండునది. వీరలకు మిధునసంబంధముతో సర్వ వ్యవహారాదులన్నియునుండును. ఈయజ్ఞమునకు దేవతలు ప్రధానులధిదేవతలు. మనభూలోకములోజేసిన యజ్ఞానంతరము మరొకదేహముతో కొంత దీర్ఘకాలపరిమితితో జేరిన రజోగుణయజ్ఞ ఫలసంబంధలోకము. వీరలకు అమృతపానము చంద్రకళలేదు. ఇదిగుణభేదముతో సోమపానమునకు బదులుగా లోకానుసారము రజోగుణముతో చంద్రస్వరూప అమృతోత్పత్తిగా ఆదిత్యునితో సంబంధముగానున్నది. ఇది కృతకము. పరాధీనము. కాలము ననుసరించి అపుడపుడు పాన మనేకపర్యాయములు కాలపరిమితివఱకు జేయుచుండవలెను. సోమపాన మిటువంటిదికాదు. ఇది స్వస్వరూప ఆత్మసంబంధ ధృవాంశ. సోమధృవకళయని తెలియవలెను. అన్నియును వేదవిహితయజ్ఞములేను. మనముగాని మనపితరులుగాని యేవిధ గుణప్రధానముతోజేసిన వారల కాలోకప్రాప్తితో సోమపానముగూడ భేదరూపములతో అంశాంశములుగ లభించును. ఈపితరుల భేదములను వారిస్థానములను గణములను ధృవాదూర్ధ్వములో జితేంద్రియులుగాన యజ్వలను ధృవమునకు క్రిందిలోకాదులలో

గల వారలను పితృసంబంధవిషయములో విమర్శించియున్నాను. ఇదివఱకు ప్రథమ భాగములో బ్రహ్మయజ్ఞ విషయములోను చాలవివరించినాను. పితృగణభేదము లనేకవిధములుగనున్నవి. ఈదృష్టాంతముచేత సోమపానము చంద్రుని నిత్యకళాంశ అమృతపానము. ఈ భేదములకు ప్రమాణములగుచున్నవగును. యజ్ఞములనేకము లైనను గుణములతోమాత్రము త్రివిధములుగనే ఫలవంతములుగ నున్నవి. ఈ యజ్ఞములు దేవీపరముతో శ్రీవిద్యాసంబంధములుగను ప్రధానాధిదేవతలు స్త్రీ పర్యాములుగను నివియు త్రివిధగుణభేదములతోనున్నవి. వేదయజ్ఞములు త్రిగుణ భేదములతోను, జ్ఞానయజ్ఞములు త్రివిధగుణభేదములతోను, భక్తియజ్ఞములు నీవిధ ముగనేయుండును. యజ్ఞస్వరూపమును గుణభేదములను కర్మభక్తి జ్ఞానభేదములను మార్గములను గమ్యములను కనిపెట్టలేక భేదములను కల్పించి పరస్పరకక్ష్యల వివా దములతో మూలమునుదెలియక ఆలోచించక నిందితులగుచున్నాము. ఈవిషయ ములో శ్రీశంకరాదులు చాలవిమర్శనలతో కొన్నిసిద్ధాంతములనువ్రాసిరి. ఋషు లనేకసూత్రములనువ్రాసిరి. వీటినన్నిటి ననుసరించి గీతలోను విపులముగనున్నవి. ఏవిధముతోనైనను యజ్ఞముమాత్రము ప్రధానకర్తవ్యము. ఆచరితము. గుణము లను గ్రహించినచో నన్నియు విశదమగును. ఈ యజ్ఞస్వరూపము శ్రీవిష్ణుసహస్ర నామస్తోత్రములో అంతమందు విపులవిమర్శనతోనున్నది. యజ్ఞము సర్వసాధన సర్వస్వరూపము. దీనిఅర్థమును మూలమునుదెలిసి ధన్యుడవుగమ్ము. వివాద మేల. ఈలాటి సర్వవిధయజ్ఞములకన్నిటికి మనభరతభూమి నిలయము. ఈలోక ములో నేవిధగుణకర్మలతో నాచరించిన నాయావిధలోకాదులను నీదేహపాతానం తరము తప్పక బొందుదుము. పరస్పరభావనాయోగ ప్రధానములు. యజ్ఞము శాశ్వతధర్మము. రజోగుణప్రవృత్తియజ్ఞముతో నీవిధముగ సోమపానము లభించును.

మూడవది తమోగుణయజ్ఞము. ఇది కేవల హింసాత్మకము. కామాది సర్వగుణప్రధానము. దీనిఫలమీలోకములో నీదేహముతోనే యనుభవింపవచ్చును. ఈ తమోగుణయజ్ఞములో సత్త్వసంబంధమున్నచో నదికొంతవఱకైనను దేవతలచే యితరులకును సుఖమార్గహేతువుగానగును. లేక కేవలస్వప్రయోజనముగా అహం భావనతో జేసినచో తుదకువృష్టికిని సంబంధములేనిదగును. అటులలేక నీతమో లోకములో వేదవిహితమార్గముతో కామ్యేష్టిగాజేసినచో నీలోకసంబంధ సోమ పానము ఓషధీరూప రసముతో నీ దేహమునకు అమృతత్వముగా జీవించుటకు పర్జన్య

స్వరూపముతో చంద్రునియందు అమృతకళాంశము తమోగుణముతో రూపాంతర ముగ వ్రీహ్యాదిధాన్యాదులందుగల అమృతస్వరూపఫలముతో సూక్ష్మస్థూలలోకములో స్థూలదేహముతోనైనను యజ్ఞరూప సోమఫలపానము తప్పకలభించును. గుణభేదములతో రూపాంతరభేదములతో లోకభేదములతో దేహభేదములతో సుఖభేదములతో కాలభేదములతో యజ్ఞఫలరూప సోమపానమును తప్పక బొందుదుము. యజ్ఞము సర్వదా ఫలస్వరూపము. ఫలప్రదము. ఫలితాంశము. గీతావాక్యానుసారముగ యజ్ఞశిష్టాశనముతో సర్వకిల్బిషములు నాశనమైపోవుచుండగా యజ్ఞముచేసినవారి ఫలమెంత యతిశయమో యోచింపవలెను. యజ్ఞస్వరూపుడే యైనచో మనమెంత యతిశయమో దానినిగుర్తెరుగవలయును. సోమస్వరూపము మూడువిధములుగ నున్నది. కేవలబ్రహ్మలోకాదులలో ధ్రువమైనఆత్మసంబంధ సోమకళాంశ స్వరూపముగనున్నది. స్వర్గలోకములో ఆత్మచైతన్యాంశ ప్రతిబింబిత ఆదిత్యసంబంధ కల్పిత చంద్రరూపముతో సోమాంశముగనున్నది మనలోకములో ఆదిత్యాంశసంబంధ చైతన్య అగ్నిసంబంధ కల్పితాంశ వ్రీహ్యాదిగా ఫలరసాంశగా సోమాంశముగ నున్నది. క్రమముగ కల్పితములతో గుణాదులననుసరించి అధోముఖముతో సామాన్యాంశముగ నున్నది. ఇది తెలిసి యేదిముఖ్యాంశమో దానినాలోచించి యజ్ఞముజేయుట యుత్తమము. ధర్మములును, దానములును, తపోయోగాదులును, ఉపాసనాదులును, అర్చనాదులును, పరోపకారములును, సర్వకార్యక్రియాకర్మలన్నియును యజ్ఞరూపములు. యజ్ఞములు. సర్వదా మనధన్యతకొఱకే ఈశ్వరుడు సృజించినాడని దెలిసి సాంప్రదాయ శిష్టాచార వేదయుక్తములుగాగల యజ్ఞముల నాచరించి ముక్తుడవుకమ్మ. యజ్ఞఫలమే సోమము. యజ్ఞములు, సోమములు, త్రిగుణములననుసరించిన భేదములతోనుండును. చేయడము నిశ్చయమయినచో ఉత్తమఫలస్వరూపమును దెలసిచేయుట పురుషార్థమగును. అంశాంశముగాజేసి అంశాంశఫలమును బొందుటకంటె పూర్ణముతో పూర్ణఫలమును బొందుటే యుత్తమము.

—०—

# శాంతి పాఠము.

ఓం తచ్ఛంయో రావృణీమహే। గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞపతయే।
దైవీస్స్వస్తిరస్తునః। స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వంజగాతు భేషజమ్।
శన్నో అస్తు ద్విపదే। శంచతుష్పదే॥

ఓంశాన్తి శ్శాన్తి శ్శాన్తిః
ఓం తత్సత్.

సర్వము యజ్ఞమయము. యజ్ఞముభయకార్యకారణము. ఈశ్వరుడు యజ్ఞమూర్తి. చేయవలసినదియజ్ఞము. చేయువాడు యాజకుడు. త్రిపుటితో సర్వము చేరియున్నది. సాధనములన్నియును యజ్ఞరూపములుగనున్నవి. కేవలశుద్ధసాత్విక యజ్ఞవిధానముతో నన్నియును సిద్ధించును. సర్వప్రాణికిని సర్వలోకములకును యజ్ఞముతోనే సర్వసిద్ధి నిరంతరసుఖము సచ్చిదానందప్రాప్తి. త్రివిధశాంతులతో త్రివిధతాపములుడుగును.

శాంతిపాఠముతో సర్వశాంతికరముగా గమనించవలసిన అనుభవ ముఖ్యతాత్పర్యమును వ్రాయుచున్నాను. శాంతులు త్రివిధములు. బంధములు (గ్రంథులు) మూడువిధములుగనున్నవి.

(౧) బాహ్యములో విషయవాంఛ వ్యామోహాతిశయానుభవ మిచ్చటను మఱల దేహపాతానంతరము బ్రహ్మాండములో లోకాదులందును వీటిననుసరించిన త్రివిధరూపావస్థల దేహాదులబంధములు. వీటిని బోందుటకు స్థూలరూపముగ బాహ్యములో కర్మ, భక్తి, జ్ఞానాది యోగాదులతోను దానధర్మ పరోపకారములతో నాచరించుచేను. ఇవి పరంపరలుగా ప్రాప్తములగుచుండును. ఈ గ్రంథి బంధ నివారణోపాయ మూలము నాలోచించక తొలగదు. ఇవేశాశ్వత పరివర్తనములని నిశ్చయించడమే మొదటి గ్రంథిబంధము. స్థూలము.

రెండవ గ్రంథిబంధము మనఅంతరములో సూక్ష్మతైజస దేహముతో కర్మ భక్తి జ్ఞాన ధ్యానయోగాదులతోను సాత్వికదానధర్మ పరోపకారములతో అంతరము జేసిన బాహ్యస్థూల రూపాదుల సంబంధ గ్రంథితొలగి అంతరములోగల సూక్ష్మ రూపగ్రంథిని తెలియడము. ఇది తొలగువఱకు బాహ్యాదులను త్యాగముతో తన

అంతరములోనే నిరంతరానందముతో బాహ్యస్థూలలోకాదులను దేహాదులను పొందక నిరంతరము తనసూక్ష్మ తైజసదేహ స్వాధీనవంతుడై శ్రమలేక మనఃప్రసాదముగలిగి తనలోనే చూడడము. ఉపరి పరికరాదులు లేకనే సాధనానుభవము.

మూడవది ఈలాగున నుండగ కారణదేహ సంబంధ గ్రంధి నిష్కామముతో రెండవగ్రంధి బంధముతొలగి మనస్సమాధితో సంపూర్ణముతో అమనస్కయోగము స్వయముగాలభించి ఆనందరూపముతో సంకల్పవికల్పాదులు లేనివాడుగా నిశ్చలముతో నుండడము.

మూడవది ఈలాగున దీర్ఘకాలావధితో ధృఢ చిరాభ్యాస యోగముతో నీకారణరూప అజ్ఞానబంధ గ్రంధి జ్ఞానముతో స్వస్వరూపముతో జ్ఞానముగలిగిన వెంటనే నీ అరూప అవ్యక్త తమోగ్రంధి కారణగ్రంధి బంధముతొలగుటతో నీసమష్టిగాగల జీవదేహములో సహస్రముపైన బ్రహ్మరంధ్రపుటభేదనముతో సహస్రముతో ఆదిత్యభేదనము బ్రహ్మరంధ్రముతో ధృవమండల భేదనముతో సర్వగ్రంధి బంధములు దేహాదులునుతొలగి శాశ్వత సచ్చిదానంద స్వరూపమే నిలుచును. ఈ గ్రంధి త్రయములే బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధి గుణత్రయగ్రంధి, దేహత్రయగ్రంధి, అవస్థాత్రయగ్రంధి, త్రికరణగ్రంధులు. వీటినే శాంతిత్రయముగా వేదములు బోధించెను.

ఓం తత్సత్.



॥ श्री गुरुचरणं ॥

# వేదభూగోళము

## రెండవభాగము

---

## భూతాదిబ్రహ్మాండ భువనకోశ విన్యాసము.

---

### ద్వితీయప్రకరణము.

### విజ్ఞాపన.

---

గ్రంథమునకు విజ్ఞాపనప్రధానము. విజ్ఞాపనస్వస్తివాచనము. ఈవేద భూగోళమనునది మహార్ణవము. ఇందులో తరంగములు, ఫేనములు, బుద్బుదములు ననంతములు. బ్రహ్మాండమను పేరుతోనే చాలగొప్పదనుటయేకాక సర్వవిజ్ఞానమునకును, ప్రకృతిపరిశోధనాది సర్వవిషయములకును సర్వవేదశాస్త్రపురాణాది తంత్రముల విషయ విజ్ఞానమునకును కర్మ, భక్తి, జ్ఞాన, యోగాదులకును సృష్టి (Sceince) పరిశోధన విషయాదులకును చరాచరసృష్టికిని, క్షేత్రక్షేత్రజ్ఞ విషయాదులకును సంబంధించియున్నందుచేత సర్వులు విమర్శించి వ్రాయ నవకాశములున్నవి. ఇట్టిసర్వవిషయాదులన్నిటికిని నావంటి అల్పజ్ఞుడు వ్రాయుటన నెట్టిదో గోచరముగాను. ప్రారంభములో దీనిఆలోచనయే బొత్తిగా దెలిసినదిగాదు. దీనిని సమగ్రముగ ప్రత్యేకించి వ్రాసిన పండితమహాశయులకృతులు నాపూర్వపుణ్యాలోపముతో లభించలేదు. దైవప్రేరణ చేదగితిని. ఇట్టిమహాసముద్ర మధ్యలోనున్న నావంటి బాలుని అన్నిటిని దప్పించి శ్రీపరమేశ్వరుడెట్లు దరిజేర్చునో తెలియదు. ఎందులకు ప్రేరేపించెనో దెలియదు. ఆదిలో చతుర్ముఖబ్రహ్మ శ్రీమన్నారాయణ నాభికమలములోనుండి ఆవిర్భవించిచూడగా దిక్కులు పరదిక్కులై యేమియునుదోచక భయభ్రాంతులతో మరల శ్రీమహావిష్ణుస్వరూప శ్రీమన్నారాయణాంతరములోజేరి ప్రార్థించగ అనుగ్రహమునుబొంది సృష్టినిజేసినట్లుగా శ్రీభగవదనుగ్రహముతో

గావలెను. బాహ్యములో అనంతభయవిస్తృతియున్నది. అంతరములో శ్రీభగవ దనుగ్రహముతో అంతర్వాణి ప్రవృత్తి విస్తృతి అతిశయించి ఆనందముతో విడువక ప్రేరేపించుచున్నది. అందుకు శ్రీభగవదనుగ్రహముచేతను, శ్రీగురువులయను గ్రహముచేతను పండితుల యభిమానాదరములచేతను ప్రారంభించితిని.

గ్రంథములో విషయాదుల విమర్శనలో క్రమములు లేకున్నందుకు, విషయా దులు స్ఫురించినప్పుడే వ్రాసినవేతప్ప జ్ఞాపకమునకు రాజాలవు. బుద్ధిబలము జ్ఞాప కశక్తియు తక్కువకుతోడుగా ఉత్తరవయస్సంప్రాప్తియు కారణము. ఆయువృత్తునిక మని యేదియో ప్రారంభించి యుండినచో ముందెవ్వరైనను విమర్శింపగలరనే భావముతో త్వరపడితిని, ఇదిసర్వప్రపంచమునకుజేరిన ఆర్షప్రాచీన విజ్ఞానము. సర్వులుతోడ్పడి యెక్కువ అభిప్రాయములను జేర్చివ్రాసినచో సర్వలోకోపకారము గాగలదు. కొన్నివిషయములు ప్రశ్నలతో తర్కించినగాని బయటికిరాజాలవు. ఈప్రాచీన ఆర్షవిజ్ఞానమును అడుగంటనివ్వకుండ కేనాటికైన నిదిప్రయోజనకారిగ నుండగలదనే అభిమానముతో దీనినభివృద్ధిజేయుటలో సర్వులకు సంబంధమున్నదని విజ్ఞాపనజేయుచున్నాను.

వెనుకటిప్రథమభాగములో కొన్నివిషయాదు లిందుకుసంబంధించినవి యుం డుటచేత నిందులో నుదహరించలేదు. ప్రథమభాగములో గ్రంథపరిచయము, మున్నుడి అభిప్రాయములను హితవులను, సవరణలను, నిష్పక్షపాతముతో పండిత మహాశయు లొసంగినందులకు వారిహితవులనే శిరసావహించి నాకుదోచినంత నిందులో సమాధానమొసంగితిని. ఇంకను లోపములుండవచ్చును. క్షమింతురు గాత.

ఈపరిశోధన విజ్ఞానముతో నేమిప్రయోజనమని కొందఱుప్రశ్నింపవచ్చును. ఈశ్వరసర్వసృష్టినిదెలిసి ప్రతిసృష్టిలో నేమేమియేవిధముగ నుత్పత్తి స్థితిలయా దులతో నున్నదనియు, మనకేనాటికైనను ప్రయోజనకారిగ నుండుననియు (బ్రపం చమునకు మంచిచెడుగుల కేమైనను తెలుసుకొను నవకాశములున్నవా? యట్టియు ఉత్పాతముల కేమైనను కారణములున్నవా? అనియు నూతనోత్పత్తికి సాధనవిధాన మార్గము లేవైనయున్నచో మనముకల్పించిచేయు నవకాశములుండునా? యనియు నాలోచింపవలెను. ఈశ్వరసృష్టిలో బ్రథమమున నే సర్వవిషయాదులు భూత భవిష్యద్వర్తమాన కాలములననుసరించి రాబోవునవన్నియును జేరియుండినగాని మేఱల మనకవిగోచరించి లభించవు. ప్రకృతము మనకు లభించిన విద్యుచ్ఛక్తి

మొదలగునవి మనకుపైనున్న తేజోలోకమగు శింశుమారమున నుండినందుచేతనే దానినిదెలిసి సాధించి మనలోకమున నుపకారార్థము సృష్టించుకొంటిమి. మఱల ముందేమి విశేషాలు కనిపెట్టవలసియున్నదో దెలియదు. సర్వసృష్టికి కారణము తేజోభూతము. దీనినే శింశుమారమని యందురు. శింశుమారములో నూతన నక్షత్రములు గ్రహములాదిగ ననేకవిషయాద లిందులో బయలుదేరుచున్నవని దూర దర్శన యంత్రములతో పరిశోధనలు జరుగుచునేయున్నవి. ఇట్టివిషయాదు లనేకములు మనవేదశాస్త్రపురాణములందున్నవి. సృష్టికి ప్రతిసృష్టిగాజేసిన మహర్షుల చరిత్రములనుబట్టి అత్యద్భుత ఘనకార్యములను సర్వలోక గమనాదులనేకములను జేసినట్లు వినినవి యిటీవల జరిగినయుద్ధములతో అనేకవిషయములు దృష్టములై నమ్మకముగలిగెను. మనవేదపురాణశాస్త్రములే సర్వులకు ఆధారములుగ నున్న వని యిటీవలవార్తలను వినుచున్నాము. అన్నియును మనప్రాచీన సాంప్రదాయములై సుప్రసిద్ధములుగా నున్నవని దెలుసుకొంటిమి. అధర్వణవేదములోను శ్రీవిద్యలోను ఋగ్వేదములోను సర్వవిషయాదులకు సాధనాంశమార్గములను విదేశీయులు గమనించి కొంతవఱకుసాధించిరి.

మనప్రాచీన సంస్కృతవిద్య కెక్కువయవకాశము లేనందుచేత వేదశాస్త్రపురాణములలోని రహస్యములు దెలియక దూరమాయెను. విదేశీయులు వీటిపరిశోధనలతో చాలముందుకురాగలిగిరి. మఱల మనప్రాచీనార్షవిద్యల నెప్పుడు గ్రహించు నవకాశమురాగలదో దెలియదు. మనవేదములు సర్వమూలములు. వేదవిద్యలెప్పటికిని వృథాకాజాలవు. వేదములను కాండలుగావిభజించి మహర్షులు కాండర్షులైరి. ఇవి సప్రయోగములుగనున్నవి ప్రకృతిలో సర్వమున్నది. మన విజ్ఞాన మతిశయించినంత ప్రకృతియు విస్తరించి ముందుకుబోవుచునేయుండును గాని అంతమెప్పటికి గానేరదు. మనమే అంతమొందుదుము. సృష్టిప్రారంభము ఊర్ధ్వలోకాదులనుండి. అచ్చటలేనిది మనలోకములో నుండజాలదు. అందుచేత బ్రహాండ వివరమత్యావశ్యకము. బ్రహ్మాండమును నందలిలోకాదులను అతీంద్రియములను మనమహర్షులు సహితముకనిపెట్టి అనేకవిషయాదులను పురాణరూపములుగ వ్రాసియుంచిరి. విద్యలెప్పటికిని నిష్ప్రయోజకముగాజాలవు. ప్రతివిద్యయందును ఫలములున్నవి. కాలగతి పరిణామముతో ప్రతివస్తువునకును సృష్ట్యాదికిని స్థితికిని క్రమముగ కాలభేదముతోను జలముతోను ఆకారవికారాదులు యుగాదులు జరుగుటచేత మిక్కిలిమార్పులగుచుండును. సృష్టిస్థిరముగాదు.' అందుచేత పురాణ

భూములకును వర్తమానభూమికిని సర్వవిధముల భేదములు తప్పకగలుగును. సముద్రము భూమిగావచ్చును, భూమిసముద్రముగావచ్చును. ఇటులనే పర్వతాదులు మార్పులు జెందవచ్చును. మనుష్యప్రయత్నముతోనే భూమికి మార్పులుగలుగుచుండగ ఈశ్వరప్రయత్నముతో భేదములు, మార్పులుగలుగుట సహజము. సప్తద్వీపములుగూడ ప్రియవ్రతుని రథముతో మధ్యలోనేర్పడినట్టు పురాణచరిత్రల వలన దెలియుచున్నది. మనముచూడగనే పట్టణములు ప్రదేశములు మార్పులు జెందుచున్నవి. వానికనిపెట్ట గష్టతరము. మనమహర్షులు కేవలప్రకృతి విజ్ఞానమునసేగాక అధ్యాత్మ విజ్ఞానమును సాంప్రదాయానుభవములను చాల సమూక్ష్మముగ గనిపెట్టి ధన్యమార్గములనుజూపిరి. దీనిలో మనతత్వశాస్త్రములు చాల విమర్శించి యితరులకు మార్గదర్శకులైరి. సర్వసాధనలకు కేవల జడములగు కృషి వాణిజ్య వ్యవహార వస్తు విజ్ఞానసాధనములకంటెను స్వశక్తితో నితరసాధనాంతరములు లేకనే అధ్యాత్మవిద్యలో మంత్ర యంత్ర తంత్ర ఉపాసనాది యోగములతోను అక్షర సముదాయ బీజబిందువులతో సాధించి సర్వశక్తిమంతులైరి. అట్టిచైతన్యవిద్యలు నేటికి నామమాత్రావశిష్టములైనవి. కారణము కేవలము పాశ్చాత్య ప్రకృతివిజ్ఞాన సాధనబలమే. ఇది అధ్యాత్మశక్తివిజ్ఞానము చైతన్యతను బాత్తిగదెలియని మనఃప్రధానముగలవారి విజ్ఞానము. ప్రకృతివిజ్ఞానముతో యేనాటికైనను ప్రమాదము తప్పదు. ప్రకృతిసంబంధమే మనస్సు. క్షేత్రరూపాదులు దేహము. అందుచేతనే ప్రకృతివిద్యలు జడములు. మనస్సునకును దేహమునకు అధికవ్యామోహాద్యభిమానములున్నవి. ఇవిప్రమాదములను జెందుచున్నవి. వీటిస్వభావమే ప్రళయప్రమాదము. చైతన్యవిద్యలట్లుకావు. స్వరూప నిత్యసత్య శాశ్వతప్రకాశములు. ప్రకృతివిజ్ఞానమునకంటె అధ్యాత్మక చైతన్యవిజ్ఞానమే మేలు.

ఉన్నతవిద్యతో విజ్ఞానముతో అత్యుత్తమ పదవులనెట్లాసించి సుఖములను అధికముగనెట్లు బొందనపేక్షించుచున్నామో అటులనే అధికోత్తమసాత్విక పుణ్యకర్మలతో ఉత్తమలోక సుఖమును దీర్ఘకాలముతో కర్మఫలానుభవమును బొందవలెగదా. సర్వులకు తారతమ్యమేలేక సమానఫలము లనుభవించవలెననిన చో ఉత్తమ పుణ్యకార్యములెట్లుచేయగలరు. వృథాశ్రమలేయని విసుగుజెంది విరమింతురు. ఎక్కువపాపకార్యముల కవకాశములుగలుగును. ఇదిపాశ్చాత్యవిరుద్ధము

ఉత్తమలోకాదులను దెలసినగాని నాలోకప్రాప్తిగాగల పుణ్యకర్మలతో బొందలేము. కేవల కనిష్ఠమును మధ్యమును శాశ్వతముగా నటులనేయుండుటకు

నెప్పటికిని నిచ్ఛయింపరు. ఈలాటియనేక కారణాంశములతో నీవిజ్ఞానము ప్రాధాన్యమని వివరించితిని. కొన్ని యిందుకు సంబంధించిన వచ్చటచ్చట సందర్భాను సారము వివరించియున్నాను. మనలోకములో కర్మభక్తి జ్ఞానాదులు దానధర్మాదులున్నవి. వీటిననుసరించి యాజేసిన స్థూలదేహులు నీస్థూలలోకమును విడువగానే ఉత్తమలోకాదులను బొందుటకు నాలోకానుకూలదేహములబొంది యాలోక ఫలములను బొందుదుము. కాబట్టి భూగోళవిజ్ఞానము సర్వవిధములుగ అన్నిలోకాదులనుదెలిసి యెవరియిచ్ఛానుసార మనుభవించుటకు నాయా కర్మలనుజేసి ఉత్తమ మధ్యమ కనిష్ఠ భూమిక లోకాదులను బొందు ముఖ్యావకాశము యొసగును. ఎక్కువవ్రాయనేల. నమ్మకమేప్రధానము.

మొదటిభాగమునకు పండిత మహాశయులందరు తమతమ అభిప్రాయములను వెల్లడించి బంపినందులకు వారలకునేను కృతజ్ఞుడను. వారిహితవులను భగవదాజ్ఞగా శిరసావహించినాను. మఱల నీరెండవభాగమును బంపుచున్నాను. దయచేసి విమర్శించి దీనికిని తమయభిప్రాయములనివ్వ బ్రార్థన. వెనుకటి ప్రథమభాగములో అభిప్రాయములను ముద్రించుటలో కొన్ని సకాలమునకు చేరనందున ననేకములగు నచ్చుపొరబాటులుండును. నాకీపని నూతనమగుటచేతను దెలసిదెలియకను గలిగినలోపాదులను విజ్ఞులు మన్నింతురని ప్రార్థన.

వేదరహస్యములను అపూర్వశాస్త్రివిషయ సాంప్రదాయములగు ధర్మములను సమన్వయముతో విమర్శనలఁదెలియఁజేసి మహోపకారులైన శ్రీ వేదచతుర్ముఖ స్వరూపానరావతార బ్రహ్మవేత్తలును, శ్రౌత స్మార్తాదులందు అధ్వర్యనిపుణులునగు తూర్పుగోదావరిజిల్లా రాజోలుతాలూకు లూటకుఱ్ఱుగ్రామం కత్తి అగ్నిహోత్రశాస్త్రులవారు మహాప్రేమవిశ్వాస సాదరాభిమానములతో గ్రంథమును సవరణజేసినందులకు నేనెంతోకృతజ్ఞుడను. వారిఋణమునుదీర్చలేను. వారికివేనాసహస్ర ప్రణామంబులు. వీరు కేవల వైదికసాంప్రదాయులైనందున ఆధునికప్రపంచములో ప్రకాశింపరైరి. వీరు సర్వవిషయ రహస్యాదులందు సర్వజ్ఞులని అనుభవైకవేద్యులని తప్పకచెప్పితీరవలెను. వీరుఉదారనిరపేక్షులు. వీరినిదెలిసి కదలించినవారలులేరైరి. ప్రాచీనార్షసాంప్రదాయ ధర్మములను వేదరహస్యములను శాస్త్రములను చాలపరిశోధించిన అపరావతార బృహస్పతులు. వీరితోనే సర్వరహస్యములు ధర్మములు అంతరించునేమోయనికూడ భయముగలుగుచున్నది. వీరి వయస్సుదాదాపు డెబ్బదిసంవత్సరములు. కాలపరిస్థితులనుబట్టి వారివల్ల వేదవిజ్ఞా

నాపూర్వవిషయాదులను గ్రహించుట మనకర్తవ్యమనినాతలంపు. వారుకీర్తిప్రతిష్ఠలనాశించువారలుగారైరి.

ఈగ్రంథమును కడపజిల్లా ప్రొద్దుటూరుతాలూకు అరకటవేముల శ్రీ "శిరోమణి విద్వాన్" వెల్లాల చిదంబరశాస్త్రిలవారును, (గుత్తిలండన్‌మిషన్ హైస్కూలు పండితులు.) లేపాక్షి శ్రీవిద్వాన్ పంచాంగం సూరప్పగారును (యాడికిబోర్డుహైస్కూలు తెలుగుపండితులు) అవ్యాజప్రేమతో ఆద్యంతము కడుశ్రద్ధతో దిలకించి సవరణలు జేసినందుకు వారికి నాధన్యవాదములు.

శ్రీ విద్వాన్ మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశర్మ శాస్త్రిలవారు, (మునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్రపండితుడు, నంద్యాల) ఆదరాభిమానుశ్రద్ధతో హితవొసంగి గ్రంథసహాకారులైనందుకు వారికిని నాసహస్రవందనములు.



# వేద పీఠిక.



వేదముసర్వమూలము. వేదములోసర్వము జ్ఞానస్వరూపముతో లీనముగనుండును. వేదము నాదబిందు కళస్వరాక్షర స్వరూప వాఙ్మయముతో ప్రారంభమయి తదనంతరము ఆకాశాదిగ పంచభూతముల స్వరూపములతో గుణానులననుసరించి పరిణామక్రమముతో స్థూలాదులవఱకు రాగలిగినది. తుదకు సర్వము మరల మూలస్వరూపమునకు రాగలదు. స్థూలాదులకు సృష్టిస్థితిలయాదులండుటచేత వీటిలయమునకు ప్రళయమనిపేరు. వీటికి పునరావృత్తిగలదు. సూక్ష్మతన్మాత్రల లయము లీనము. అయ్యవి కారణాతీతముతో స్వస్వరూపమందు పునరావృత్తిలేదు. స్థూలాదులకు స్థూలకర్మలతోను, సూక్ష్మాదులకు వాక్కుతోను కారణము. కారణాతీతము మనస్సుతోను లీనస్వరూపములుగ నున్నవి. సర్వము శబ్దస్వరాక్షరమూలముగా ప్రారంభమయి తుదకు మరల నీసర్వము శబ్దస్వరాక్షరమునే జేరి స్వస్వరూపమును జెందును. అందుచేత వేదవిహితశబ్ద స్వరాక్షరములతో స్థూలాదుల నివృత్తికొఱకు స్థూలకర్మాదులతోను, సూక్ష్మాదుల నివృత్తికొఱకు శబ్దస్వరాక్షరనామరూప మంత్రోచ్చారణతో జపాదిధ్యానయోగాదులతోను తరువాత శబ్దస్వరాక్షర నామరూప మంత్రమూలమగు ప్రణవమూల యోగములతో

నీసర్వము ప్రణవమందే లీనమయి తుదకు స్వస్వరూపపరబ్రహ్మవాచిక ప్రణవముతో లీనమగు ఈసర్వము నామరూపాత్మకముగ శబ్దస్వరాక్షరమూలముతో చేరియున్నవి. ఇవిలేనివ్యవహారమే లేదు. మనసర్వవ్యవహార కార్యములన్నియు వీటిమూలముననే జరుగుచున్నవి. కొన్నిసమయములందు నీసర్వము సమక్షములో లేకున్నను వీటిమూలముగు శబ్దాక్షరస్వరనామముల నుచ్చరించి వాటిసంబంధమునం దుదకు ఫలప్రాప్తు లగుచున్నారము. అప్పటి కీస్థూలాదులు ప్రత్యక్షముగ నుండజాలవు. స్థావరములుదలంచినంతన రాకున్నను వీటివ్యవహారాదులను మనమున్నచోటుననే జరుప్రకొని తత్ఫలములను బొంది సుఖించుచున్నాము. ఇవెట్లు సంబంధవ్యవహారమున మనకుగార్యసిద్ధిగా గలిగెనో యటులనే వేదమంత్రలతో నీస్థూలబ్రహ్మాండాది భువనకోశములు సర్వవ్యవహారములు క్షేత్రదేహాదులు జేరినవైవ్యాహృతులతో లీనములగును. మనలోకవ్యవహారాదులవలెనే ఆధ్యాత్మికములో స్వస్వరూపమున కనుగుణ్యములుగ నీభూరాది సప్తలోకములు భూరాదిసప్తవ్యాహృతులలో అంతర్హితములై సంబంధ సంబంధులై నీవ్యాహృతుల స్వరూపముతో స్థూల ఫలకాములకు ఆత్మకు ప్రతినిధిగాగల ఆదిత్యునియందుంగాని లేక ఆదిత్యప్రతినిధిగాంగల నీలోకములోని అగ్నియందుగాని వ్యాహృతులుగా ఆహుతులచే యిష్టఫలసిద్ధిని బొందవచ్చును. వీటినే ధ్యానయోగాదులతో స్వరూపతేజస్సునందు నీవ్యాహుతులతో లీనముచేయవలయు మరల నీవ్యాహృతులు ప్రణవమూలముతోంజేర్చి బ్రహ్మమందు లీనముజేయుటయే స్వస్వరూపము. ఈమార్గమునకే అధ్యాత్మికమని పేరు. సర్వవ్యవహారములును, నాధ్యాత్మికములును, శబ్దాక్షరస్వరవాఙ్మయములో అంతర్హితమయి సర్వకార్యక్రియాకరణ సాధనప్రయోజన ఫలసిద్ధిగనున్నవి. అందుచేతనే యజ్ఞయాగాది జపతపహోమాదులు, ధ్యానాదియోగాదులు ముఖ్యకార్యములైయున్నవి. వీటికి సర్వమూలముగ శ్రీగాయత్రీరూపకముగ అధిదైవతోపాసనగ నున్నందుచేతనే నిత్యనిరంతరవిధిగ సంధ్యగా మహర్షులు మనల నుపాసింపంజేసిరి. శ్రీవేదమాతగాయత్రికి భూరాది నీసప్తవ్యాహృతులు అందులో ముఖ్యముగా సర్వత్రవచింపబడుచున్నది. ఇవే సర్వమంత్రములందును యజ్ఞయాగాది హోమాదులందును ధ్యానాదియోగాదులందును ముఖ్యములయి ఉచ్చరింపబడుచున్నవి. ఈసప్తవ్యాహృతులలో సర్వబ్రహ్మాండములు నందులోని సర్వలోకాదులును నందులోనేచేరియున్నవి. ఈలాగునదెలిసి ఉపాసించువారల పుణ్యఫలమనంతము. ఈమార్గము వేదవిదులకుందప్ప మరెవ్వరికిని దురవగహనము.

అందుచేతనే నేను మొదటిభాగము నాధ్యాత్మికముగ వ్రాసితిని. సర్వకార్యక్రియాకరణాది సాధనలన్నియును భూగోళములోనున్నట్టివే. ఆయాలోకాదుల ననుసరించి మనము చేయవలసిన విధానములు వేరు వేరుగానున్నవి. వీటిని తెలియుటకు వేదమే ముఖ్యసాధనము. ఇతరాదులతో వీలుపడదు. భూగోళమనునది ఆద్యంతములెటులున్నవో? దీనికి స్వరూపమేదో? మార్గమేదో? కర్తవ్యమేదో? వేదవిదులు గ్రహించి క్షమింతురుగాత. ప్రకృతివిజ్ఞాన విధానము భేదములకు, నిరంతరప్రమాద ప్రళయ దుఃఖములకు, పునరావృత్తులకు శాశ్వతమార్గమగును. భూగోళమాద్యంతమును ప్రకృతివిజ్ఞానముతో నిర్ణయించలేము.

లోకములో మనమొకరినుద్దేశించి జననాదియందే నామకరణముజేసినచో తదాదిగ జీవితమున్నంతకాలము నాపేరునకు సంబంధించినదై సర్వకార్యకారణములు ఫలితములు ననుభవములై సాధనములుగ నెటులజరుగుచు వ్యవహారికములుగనున్నవో నటులనే వేదవిహిత భూరాది సర్వమంత్ర వ్యాహృతులు వాటివాటికి సంబంధములై కార్యకారణ క్రియలకు సాధనములై ఫలవంతములగుచున్నవి. దూరాలోచనలతో నన్నియుఁ దుదకు నొకేయంశమునకే తప్పకవచ్చును.

ఇందుకు ముఖ్యకారణము పంచభూతప్రవృత్తిధర్మమే. భూతముల కాది ఆకాశము. ఆకాశము శబ్దగుణకము. శబ్దముశ్రోత్రగ్రాహ్యము. శబ్దాదిగ వాయువుతో స్పర్శము. స్పర్శముతో ఆవరణచర్మము. వాయువువలన తేజముగరూపము. రూపముతో నేత్రము. తేజస్సుతో రసమగుజలము. రసముతో రసన. జలముతో గంధగుణమగు పృథివి. గంధగుణగ్రాహ్యావయవమే నాసికము. వీనిననుసరించినవే స్థూలాదులు. అందుచేతనే యీపంచభూతము శబ్దాదులతో సర్వకార్యకారణక్రియాది సాధకమై ఫలసిద్ధిగనున్నది. వేదము శబ్దాక్షర సర్వజ్ఞాన సముదాయమూలస్వరూపము. వేదముతో సర్వసిద్ధి గలుగుచున్నది.

—o—

## స్థూల బ్రహ్మాండ భువనకోశోపోద్ఘాతము.

---

ప్రకృతముమనమున్న బ్రహ్మాండవివరము నామూలాగ్రమును బాగుగ తెలియవలెను. బ్రహ్మాండము స్వరాట్టు సత్వగుణదృష్టిలో కేవల సూక్ష్మములో స్థూలబ్రహ్మాండముగ నున్నది. ప్రకృతమీబ్రహ్మాండము స్వరాట్టుతమోగుణములో

మరల కారణమాదిగా స్థూలమిశ్రిత త్రయీగుణాత్మిక స్థూలబ్రహ్మాండముగ దెలియవలెను. త్రివిధగుణ త్రివిధావస్థలతో త్రివృత్కరణముగ నన్నిటియందుండును. అందుచేత ఈశ్వర విరాట్టుల దృష్టిలో నొకవిధముగను మనదృష్టిలో మరొకవిధముగ సమన్వయము జేయవలెను. సృష్టిక్రమము ఈశ్వరునినుండి క్రమముగ క్రిందికి వచ్చుటచేత మొదటిది కారణసృష్టిగను, రెండవది సూక్ష్మసృష్టిగను, మూడవది స్థూలసృష్టిగనుండుటచేత నీబ్రహ్మాండము స్థూలముగ వ్యవహరింపబడెను. మరల నిందులోనుండి నూర్ధ్వభాగములో కారణసృష్టిగను, మధ్యలోసృష్టిగను, అంత్యములో స్థూలసృష్టిగ నున్నవారలమే మనము. ఈలాగున గుణములనుబట్టి భూతములలోకాగుల యవస్థ లుండును. మనచుట్టునున్న సర్వజీవరాసులు మనసమానభూతసృష్టిలోఁజేరినవే. ఈ విధముగ పంచభూతములు ప్రారంభమునుండి అనగా ఆకాశమునుండి పృథివివఱకు కేవలశుద్ధసాత్వికాంశముతో స్వరాడంశముగ ఈశ్వరునియందును, మరలనిదే ఈశ్వరునియందే సంరాడంశములో సూక్ష్మగుణానేక బ్రహ్మాండములుగ ప్రతిబ్రహ్మాండము విరాడంశముగను; మరల నీవిరాడంశములో రుద్ర, విష్ణు, బ్రహ్మలతో స్థూలముగ మనమున్న బ్రహ్మాండముగనుండును. మనమున్న ఈస్థూల బ్రహ్మాండసృష్టి కారణకర్త బ్రహ్మగాన హిరణ్యగర్భబ్రహ్మాండమని వ్యవహరింపఁబడెను. ఈబ్రహ్మాండములో బ్రహ్మసృష్టి మొదటిఅంశము; ప్రధానము, కారణమునైనది. ఇది బ్రహ్మమానసపుత్రులనుండి మనువులవఱకునున్నది. ఇది సాత్వికసృష్టి. రెండవది రజోగుణసృష్టితో సూక్ష్మతైజస ప్రధానముతో దేవతల సృష్టియు, మూడవది తమోగుణముతో మనుజలోకసృష్టియునైనది. మరల మనుజలోకములో నీలాగుననే త్రివిధగుణములతో చరాచర సృష్టియున్నది. ఈలాగున ప్రతిలోకమునందును త్రివిధగుణములతో సృష్టియగుచుండును. దీనినేత్రివృత్కరణ మనియందురు. ఈలాగున ప్రకృతిజడ ప్రధానముతో క్షేత్రసృష్టియు, ఈశ్వరచైతన్య విజ్ఞానప్రధానముతో క్షేత్రజ్ఞసృష్టియు సర్వదాసంభవించుచుండును ఈ రెండునుచేరినదే జీవతత్వము సమష్టిసృష్టిలో మహాత్రిమూర్తులు త్రిగుణంబులఁగలుగుచుందురు. సమష్టిమహాత్రిమూర్తులలో బ్రహ్మైకంబుగ వ్యష్టిమూర్తిత్రయంబు గుణత్రయంబుల వ్యవహరింతురు. భేదములెంతమాత్రమునులేదు. ఈశ్వరదృష్టిలో సర్వులుసమానులు. భూతాదులుగూడ నీవిధముగనే ఆకాశాదిగ పృథివి వరకు మొదటకారణ మహాపంచభూతములుగను, మరల కార్యపంచభూతములుగను నొకదానిలో నన్నియును, అన్నిటియందన్నియును పంచీకరణప్రధానములై ప్రకృతి

వికృతులై ఆకాశాదిగ పృథివివరకును మరల పృథివ్యాదిగ ఆకాశమువరకు ద్వంద్వ విధానముతో మిథునీభూతములై యొకటి ఆధారముగను మరొకటి ఆధేయముగ నగుచుండును.

మనబ్రహ్మాండము జలమునందుప్రకృతిభూతాంశక్షేత్రరూపముగను, ఈశ్వర చైతన్యాంశముతో ఆధ్యాత్మిక శ్రీమన్నారాయణాంశమున నుత్పత్తియైనట్లు మనవేదశాస్త్ర పురాణములందు విశదీకరింపబడియె. ఈవిధముగ బ్రహ్మతో ప్రకాశాంశముగ హిరణ్యాండమని, నారాయణాంశముతో నారాయణాండమని ప్రకృతిభూతాదులతో క్షేత్రమనియు నామాంతరములుగ నచ్చటచ్చటచెప్పబడెను.

ఆకాశవాయ్వంశములు అరూపముతో (లీనముతో) కారణముగ రుద్రుడుగను, తేజస్సు జలాంశము ప్రకాశప్రధానముతో రూపకారణస్థిత్యంశముగ విష్ణురూపముగను, జలపృథ్వులతో స్థూలసృష్టిగ బ్రహ్మాంశముగనుగూడ దెలియవలెను. ఈవిధముగ త్రిగుణములతోను, అన్వయించవలెను. సర్వమునకు లీనమే జన్మస్థానము. మొదటిది ఆత్మగను, రెండవది శుద్ధసత్వగుణముగను (జ్ఞానస్వరూపముగను) మూడవది రుద్రస్వరూపముగను దెలియవలెను. తమోగుణసృష్టికి తమోగుణలయముతో రుద్రుడుగను రజోగుణసృష్టికి లయముతో శుద్ధసత్వజ్ఞానముతో లీనముగను, శుద్ధసత్వముతో స్వరూపముగ ఆత్మగను, దెలిసికొనుట క్రమపద్ధతి ననుసరించినదగును.

ప్రకృత కాలానుసారము మనము కేవల దూరస్థులమయినందుచేత చర్విత చర్వణముగా వివరించుటకు ముఖ్యకారణము. వివరించినంత వివేకమునకే ముఖ్యకారణమగుననే దలంచి క్షమించవలెను.

దీనిననుసరించి ప్రకృతసృష్టి పృథివిభూతమున కుపరిగానున్న జలభూతముతో శ్రీమన్నారాయణ నాభీకమలమునందు బ్రహ్మగను మరల నీబ్రహ్మతో నీబ్రహ్మాండముగను సృష్టికి కారణమాయెనని పురాణాదులందు వివరింపఁబడెను. ఇవి మహదాకారముతో సమష్టిబ్రహ్మాండముగను, పృథగాకారవ్యష్టితో లోకాదులుగను, దేహాదులుగనున్నవి. మహత్తుతో ఈశ్వరుడుగ సమష్టిగను, పృథగ్వ్యష్టితో అణ్వంశముతో జీవులుగనుగూడ దెలియవలెను. ఈవిధముగ బ్రహ్మాండసమష్టిరూపక్షేత్రముతో మహదాకార బ్రహ్మాండజడరూపముగను, అణ్వంశముతో పిండాండవ్యష్టిగ జీవదేహాదులుగను దెలియవలెను.

బ్రహ్మయొక్క యుత్పత్తి వలె నుదరజలరాశిలో నాభీకమలములో మనఉత్ప

త్తియునున్నది "ధాతాయథాపూర్వ మకల్పయత్" అనెడి వేదప్రమాణముగ కనుక జరిగిన ప్రకారమే సర్వదా సృష్టియగుచుండును. సర్వకారణ కార్యములుగ జలాంశముతో సప్తధాతువులు సర్వమునుత్పత్తియయ్యెను ఈజలమందు సర్వము అంగర్భితమైయున్నందుచేతనే సర్వకారణకార్యమాయెను. "ఆపోవాఇదగ్ం సర్వం.........భూర్భువస్సువరాప ఓం" అనువేదప్రమాణమున్నది. జలప్రధానముతో కొబ్బరికాయపైగల యావరణభాగము చిప్పగను రెండవభాగము కొబ్బరిగను నానావిధముగనున్నది. ఈప్రకారము అండరూపముతో నున్నందుచేత అండమని ప్రసిద్ధిగాంచెను. ఈప్రకారమే అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు సర్వసృష్టియనయ్యెను. సృష్టిఅధోముఖముతోను అంత్యభూతముతో నత్యంత స్థూల స్థావర కఠినాంశములతోనిలిచె. శింశుమారము స్థూలభాగముతో నుత్పత్తిగా తలక్రిందుగానున్నది. తలక్రిందుగా నున్నందుచేత నేనాటికైనను నాశనము జెందును. ఇది అజ్ఞానస్వరూపమైనందుచేతనే శింశుమారమని శిశుమారమని (అజ్ఞానమే శిశుప్రాయము) తెలియవలెను. గీతలో "ఊర్ధ్వమూల మధశ్శాఖం" అనుప్రమాణమున్నది. శింశుమారమే శిరస్సుగా మూలముగ నెంచవలెను. మన శిరస్సులో నీవిధముగనే తలక్రిందుగా పంచభూతగణ తన్మాత్రలున్నవి.

ఇట్టికారణ శ్రీభగవత్స్వరూప జలాంశమును ఉపాసనగా మార్గగతిగమ్య ప్రధానముగ ఆధ్యాత్మికదృష్టితో నారాయణాంశ శబ్దవాచక స్వరూపముతో యతీంద్రులకు సహితము సర్వకాల సర్వావస్థలందు ప్రణవపూర్వక మంత్రస్వరూపముగ ప్రవచనీయమాయెను. పృథివీభూతమునకు మాతృభూమి జలభూతము. సర్వకార్యక్రియాకరణములందు జలముచే పరిశుద్ధాంశముగ మనవేదఋషులు తమ దివ్యదృష్టితో తీర్థప్రధానములుగను అభిషేకప్రధానములుగను, స్నానప్రధానములుగను ఆచమనప్రధానముగ పవిత్రప్రధానముగ సర్వాధారమని సర్వకర్మల నాచరింప మార్గదర్శకులైరి. ప్రాణికోటి కాద్యంతముల జలమాధారము. అంత్యమయినచెరుకను జలమే ముఖ్యాధారము. సర్వదాజలమే ముక్తికాధారము. ఈ లాగున దెలిసినచో ధన్యులమగుదము. దీనినిబ్రకృతిగా దలంచినచో ప్రళయమును జేరుదుము. ఈ రెండే ముఖ్యమార్గములు. ఇందకు వేదప్రమాణము లనేకము లున్నవి. ప్రకృతకాలము ప్రకృతిదృష్టిప్రధానమయి ప్రమాదములకు కారణమాయెను. కేవల భూతరూపజలమునకే ఇంతపవిత్ర ప్రాశస్త్యమున్నచో వేద

మంత్రప్రణవ ప్రధాన మంత్రోచ్చారణ సముచ్చయముతో నాచరించిన క్రియా కర్మలం దాయుదక మెంత చైతన్యయుతంబో చెప్ప నేల?

—o—

# వేదభూగోళనామకరణ ముఖ్యఫలితాంశము.

మహాశయులారా,

మన మెంతవఱకు మిగిలియుందుమో అంతవఱకు క్షేత్రము క్షేత్రజ్ఞత్వము మిగిలియుండును. క్షేత్రమే భూమి. క్షేత్రమే దేహము. క్షేత్రమే ప్రకృతి. ఇవన్నియును మిగిలియున్నంతవఱకు అన్యోన్యాశ్రయములై యుండును. భూగోళమునకుఁ గారణము పంచభూతములు. పంచభూతములు గోళాకారములు. భూశబ్దము గోళశబ్దము సర్వభూతములం దనువర్తించుచుండును. గోళమన స్థూల, స్థిర, స్థావర రూపము. దీనికి సూక్ష్మరూపము, కారణరూపముగూడ నున్నది. కారణరూపము బిందువు. ఇది ప్రణవాకృతికంబు. సూక్ష్మరూపము వాయుభూత తరంగావరణంబు. ఇదే తేజోభూతములో బింబరూపముతో బ్రకాశమును జెంది కొంత స్థూలముగ నుండును. భూతాదుల గుణాధిక్యములతోఁ గ్రమముగ స్థూలతను జెందుటకుఁ గారణమగును. ఈలాగున జలపృథివీభూతములు కాగా స్థిరస్థావర స్థూలములను బొందును. పృథివీ జలభూతములు తమోరూపములు. అందుచేత రజోగుణ తేజోభూతంబును సత్వగుణవాయుభూతంబును ఆకాశములో ఆత్మస్వరూపముగ నీలాగున నాయాభూతములు నాయాగోళములతోఁ గల సంబంధక్రియా కర్మలతో వ్యావహారికములుగా నుండును. వీటికిగుణములే కారణములు. మనమున్నది కేవల తమోరూప భూతగోళమగుటచేత కృషి వాణిజ్య వ్యవహారాదులే ప్రధానములుగ నున్నందుచేత వీటినే కొందరు నిశ్చయించుకొన్నవారైరి. ఇవన్నియు ఊర్ధ్వలోకాదుల కెంతమాత్రము సంబంధములు కావు. తన్నిశ్చయులకీలోకము శాశ్వతముగ నేయుండుటచేత వీటి నేనమ్మి ఆశ్రయించి తదనుసారముగ వర్తింపవలసియుండును. ఊర్ధ్వలోకాదులను బొందనిశ్చయించిన వారలకీకృషి వాణిజ్యవ్యవహార వ్యాపారాదులతో నంతగా నగత్యముండదు. కేవలము శరీరపోషణకు మాత్రమే

తాత్కాలిక సంబంధముగాఁగొని ఊర్ధ్వలోకప్రాప్తిగాగల వేదవిహిత కర్మభక్తిజ్ఞానాదియోగాదుల నభ్యసింపవలసియుండును. భూగోళశబ్దము పంచభూతములకు ననువర్తించునేకాని కేవలము నీలోకమునకుమాత్రమేయని నిర్ణయముగాదు. ప్రవర్తనకు వ్యవహారమున కేదిసంబంధమో దానినే ప్రధానముగాఁదలంచి తదనుసార ప్రవర్తనులుగావలెను.

దీనిననుసరించి తాపత్రయాదులున్నవి. వీటిని విమర్శింప విషయము స్పష్టమగును. తాపత్రయములు, ౧. ఆధ్యాత్మికము, ౨. ఆధిదైవికము, 3. అధిభౌతికము. ఇవిత్రివృత్కరణముతో అనేకావర్తులగ సంబంధములైయుండును. వీటినిబాగొట్టుకొనఁదలఁచిన వారలీలోకములోనే కేవల కృషివాణిజ్య వ్యవహారాది వ్యాపారాదులే పరమావధులని తలంచి నడచినచో నివర్తించునా? కానేరదు. ఏసంబంధ తాపములుగలుగునో యాసంబంధ క్రియాకర్మలతో నదినివారణమగునేకాని యితరాదులతో నివర్తించదు. భూశబ్దము, గోళశబ్దము నన్నిభూతములకును సంబంధించినదై యనువర్తించునేకాని యొకదానినే తీర్మానము చేయజాలదు. భూమి యననేమి? మనముండుట కాధారభూతములగునవన్నియును భూములేయగును. ప్రతి భూతంబునందును దదితరభూతంబు లంతర్వ్యాప్తంబులైయుండు. దీనినేపంచీకృత పంచ మహాభూతములనియందురు. ఆబ్రహ్మాండాద్యణుపర్యంతంబును, నాబ్రహ్మాద్యతి సూక్ష్మప్రాణిపర్యంతంబు పంచభూత సంయోగ విలసితంబు. తదనుసారముగనే క్రియాకర్మలుండును. అన్నియును సంబంధసన్నిహితములని తలంచవలెను.

వివేకవిచారముతో జ్ఞానవైరాగ్యములతో నీలోకములోనే చర్వితచర్వణములుగా జననమరణాదులనుబొంది నిరంతరమిచ్చటనే యుండనొల్లక క్రమముగ ఊర్ధ్వలోకాదులద్వారా స్వరూపమునకు పోదలంచినవారలు క్షేత్రములు, దేహములు లోకాదులు, భూతాదులు, ప్రకృతిసంబంధములని దుఃఖమయములని అశాశ్వతములని పరంపరలని తెలిసి ఉపాసనాదియోగములతోను కర్మభక్తి జ్ఞానవైరాగ్యములతోను వేదవిహితోపాస నానుగాములై బంధవిముక్తులై స్వస్వరూపమును జెందగలరు. లేకున్న నిచ్చటనే వీటినేనమ్మి శాశ్వతులైయుందురు. అందుచేత నిదే భూగోళమనియు తదితరభూతాదులు భూగోళసంబంధములుగావనియు నిశ్చయింపరాదు. ఇదంతయును మహర్షులచేపూర్వమే యాలోచింపఁబడి నిర్ణయింపఁబడి పురాణ, శాస్త్ర, స్మృతి, యజ్ఞ, యాగాదులు కర్మభక్తి జ్ఞానయోగాదులు నిశ్చయింపబడి నిరంతర మాచరణయోగ్యంబుగఁజేయంబడియె. ప్రకృతి సంబంధములను సామా

న్యములని తాత్కాలికములని ఉదాసీనభావమునుజూపిరి. మన మనోనిశ్చయము ననుసరించి యన్నియు ననువర్తించును. మనోనిశ్చయముతో నభిప్రాయభేదముల గుదు. మనస్సుతోనే ద్వంద్వములు. ఆత్మస్వరూప జ్ఞానముతో నివి సామాన్యములగును.

మనభరత భూధర్మ మెంతమాత్రము ప్రకృతిధర్మప్రాధాన్యత నంగీకరింపదు. మహాప్రళయావసరంబునను మహాపవిత్రాత్మ సంపద్యుతంబగు భరతఖండంబవిముక్త క్షేత్రంబగు. కాశికాక్షేత్రాంతర్భూతంబై శివరాత్రిశూలాగ్రంబుననిలిచి భవిష్యత్ప్రవృత్తి బీజభూతంబైయుండుట సప్రమాణంబు "కాశీసర్వంప్రకాశతే". ప్రవృత్తి నివృత్తి ధర్మములని రెండువిధములుగ వివరించిరి. ప్రకృతివిజ్ఞానశాస్త్రజ్ఞులు ప్రకృతిప్రధాన క్షేత్రముతో క్షేత్రధర్మమునే పరమావధిగఁ దలంచి క్షేత్రసంబంధాదరాభిమానులై యున్నారేకాని ఆధ్యాత్మిక మెంతమాత్రము పరమావధి ప్రమాణముగాఁ గొనరు. ఇది చైతన్యమెంతమాత్రమునుగాదు. శాశ్వత నిత్యసచ్చిదానంద సంపూర్ణాద్వితీయానందముగాదు.

ప్రకృతితో సర్వదాఘోరదుర్మరణానర్థ ప్రమాదములుదప్పవు. ప్రళయములుదప్పవు. ప్రకృతియనగా మహాకాలకూట విషసర్పమువంటిది. ఇది సర్వదా మృత్యుస్వరూపము. ప్రకృతివ్యవహార సంబంధములన్నియును గోళసంబంధములే. వేదభూగోళము మనము ప్రకృతితో సంబంధించియున్నంతకాలము పంచభూతసంబంధముతో గోళరూపముతోఁజేరిన ఆత్మస్వరూపకారణ విజ్ఞానరూపములతోఁబ్రవృత్తి నివృత్తిధర్మయుత జగత్తుకు నళినీదళ జలములట్లు లంటియు నంటకుండు నేటి విజ్ఞాన శాస్త్రజ్ఞులు నిశ్చయించకపోయినను లోపమెంతమాత్రముండ జాలదు.

మనోనిశ్చయము, భావనయు సర్వత్ర ప్రధానము. ఈ నిశ్చయముతో సర్వమును బొందఁదగును కాఁబట్టి ఆధ్యాత్మికజ్ఞాన ప్రధానముతో ఆధ్యాత్మిక భూగోళముగను, ఆధిదైవిక వేదవిహితకర్మలతో ఆధిదేవత్వ లోకసంబంధాధిదైవికభూగోళముగను, ఆధిభౌతిక కృషివాణిజ్య వ్యవహారాదుల ప్రధానముతో ఆధిభౌతిక భూగోళముగను త్రివిధములుగ వేదభూగోళముసు దలంచవలెను.

నీలోకములోనున్నవారలు వేదవిహిత కర్మలతో దేవలోక సంబంధములును, దేవలోకములో నున్నవారలు జ్ఞానప్రధానముతో అధ్యాత్మిక సంబంధముతో స్వస్వరూపమును బొందగలుగుదురు. ఈ లోకములోనే నీరెండువిధముల నాచరించి ఉభయలోకాదులను బొందవచ్చును. లేక కేవలజ్ఞానముతో నిచ్చటినుండియే స్వస్వ

రూపమును బొందవచ్చును. లేక కేవల కర్మలతో దేవత్వమును బొందవచ్చును. దేవత్వము, ఋషిత్వము, బ్రహ్మత్వము సర్వవిధములతో నీలోకములోనుండి సాధించు మహాదవకాశము మనభరతభూమియందు మాత్రమేకలదు. మరెచ్చటను నిట్టియవకాశములులేవు అంౘచేత భరతభూమి చాలప్రశంసనీయముగ బురాణాదులంను వివరించిరి. ఇట్టిసర్వావకాశములను వర్తమానకాలములో కేవల ప్రత్యక్ష ప్రమాణదర్శన ప్రకృతిసంబంధములనుజూచి వ్యామోహితులుగాక వేద విజ్ఞానదృష్టితో దూరమాలోచించి ఉత్తమలోకప్రాప్తినిగాని స్వస్వరూపమునుగాని బొంద నిశ్చయించుటకే నేనీగ్రంథమునకు వేదభూగోళ నామకరణ మొనరించితిని.

భూరాది సర్వభూతగోళములకు వేదశాస్త్రపురాణాదులును విద్యలును ఉపాసనాది యోగాదులును సమాధులును ఆధ్యాత్మిక విద్యలుగా సర్వము నీభూరాది గోళములనాశ్రయించియేయున్నవి. కృషి వాణిజ్య వ్యవహారవ్యాపారాది స్థూల కర్మలు కేవల మీపృథివీలోక సంబంధ విద్యలే వేదభూగోళమును జేరినవని తక్కంగల విద్యలు బొత్తిగసంబంధములేదని తలంచరాదు, అటులఁదలంచితే దేవలోకమందును, ఋషిలోకమందును, బ్రహ్మమానసపుత్ర బ్రహ్మలోకాదులందున్నవారికి గతియేమి? విధానమేమి? విద్యయేమి? మార్గమేమి? యని ప్రశ్నించినచో సమాధానమేమిచెప్పవలెను? వారలు మనవలె జీవరాసులలోను లోకాదులలోను విజ్ఞానములోను జేరినవారలుగనే యున్నారు. మనకంటె నెంత అతీతులైనను దేహాదులు వ్యవహారధర్మములు ప్రతీతిగానున్నవి. స్థూలక్రియా కర్మాదులు లేకపోయినను విద్యలు ఉపాసనాదియోగాదులు, సమాధినియమములున్నవి. వేద శాస్త్రపురాణములన్నియును, కాలమును, కర్మలను, ఉపాసనాదియోగాదులను సమాధులను, యజ్ఞయాగాదులను, విద్యలను, కృషివాణిజ్య వ్యవహారాదులను, యంత్ర మంత్ర తంత్రాదులను, ధనుర్వేద గాంధర్వవేదాయుర్వేద విద్యాది సర్వ విద్యలను అనేకముఖములుగా సమష్టితో బోధించియుంచగా నవన్నియును నీపంచ భూత భూగోళలోకాదులకు సంబంధించినవై ప్రవృత్త నివృత్తి ధర్మములుగా నున్నందుచేత సర్వవిషయాదులు సర్వవిద్యలు భూగోళమునకు జేరినవై వారివారి యిష్టాను సారము పొందఁదగినవిగను, అనుష్ఠింపఁదగినవిగను నున్నందుచేత సృష్టిలో ఆదివిద్య ఆధ్యాత్మిక విద్యయగుటచేత నేను నచ్చటినుండియే ప్రారంభించితిని.

---

ఓం శ్రీః

॥ श्री गुरुचरणं ॥

శ్రీపరదేవతాయైనమః

# వేదభాగోళము

## రెండవభాగము

---

## భూతాదిబ్రహ్మాండ భువనకోశ విన్యాసము

ప్రారంభము.

—♦ ప్రార్థన. ♦—

—♦ వేదమునందుఁగల సృష్టిప్రమాణ మంత్రరూప హిరణ్యగర్భాష్టసూక్తులు. ♦—

హరిః ఓం.

సహనావవతు । సహనౌభునక్తు

సహవీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై

ఓం శాన్తిః శ్శాన్తిః శ్శాన్తిః

—♦ పురుషసూక్తమందుగల ఉత్తరనారాయణ ఉపనిషత్తు. ♦—

అద్భ్యస్సంభూతః పృథివ్యైరసాచ్చ। విశ్వకర్మణస్సమవర్తతాధి

తస్యత్వష్టా విదధద్రూపమేతి తత్పురుషస్య విశ్వమాజానమగ్రే ॥ ౧ ॥

వేదాహమేతంపురుషంమహాన్తమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్

తమేవం విద్వానమృతఇహభవతి । నాన్యః పంథా విద్యతేఽయనాయ॥ ౨ ॥

ప్రజాపతిశ్చరతిగర్భే అంతః । అజాయమానో బహుధావిజాయతే

తస్యధీరాః పరిజానన్తియోనిమ్ । మరీచీనాం పదమిచ్ఛన్తివేధసః ॥ 3 ॥

యోదేవేభ్య ఆతపతి యోదేవానాం పురోహితః ।
పూర్వోయోదేవేభ్యోజాతః । నమోరుచాయబ్రాహ్మయే ॥ ౪ ॥
రుచంబ్రాహ్మం జనయంతః దేవాఅగ్రేతదబ్రువన్ ।
యస్త్వైవం బ్రాహ్మణోవిద్యాత్ తస్యదేవాఅసన్వశే ॥ ౫ ॥
హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ అహోరాత్రేపార్శ్వే నక్షత్రాణిరూపమ్ ।
అశ్వినౌవ్యాత్తమ్ ఇష్టంమనిషాణ। అముంమనిషాణ। సర్వంమనిషాణ ॥ ౬ ॥

తా॥ తత్పురుషముఖస్వరూపుడగు ఆదినారాయణుడు జలమునుండియు వాటి రసమునుండియు భూమికొఱకు అవతరించి త్వష్టప్రజాపతిని రూపమాత్ర సృష్టిచేయ నియమించెను. అందువలన అతనికి విశ్వమనునది సృష్ట్యాదియందే జన్మసిద్ధమని మొదటిమంత్రార్థము॥ ౧ ॥

ఆమహాపురుషుని నేనెరుగుదుననియు, స్థూలజగత్సృష్టిహేతువగు తమస్సునకు పరమందు ఆదిత్యవర్ణుడైయున్నాడనియు అతని 'నీలాగు తెలుసుకొన్నవాడు నీసృష్టియందు అమృతస్వరూపుడేయగుననియు నీజ్ఞానముతప్ప మోక్షమునకు మరొకమార్గమే లేదని రెండవమంత్రార్థము॥ ౨ ॥

ఈసృష్టిగర్భమందు ప్రజాపతిరూపుడై జన్మయనునది లేకయే తనమాయచే బహువిధముల జాయమానుడగుచున్న ఆతత్పురుష నారాయణుని యోనినిధీరులగు వారే తెలుసుకొనుచున్నారని మూడవమంత్రార్థము. మరియు కార్యబ్రహ్మరూపులగువారు అతని కిరణములయొక్క పదమునుమాత్రమే సంకల్పించుకొనుచున్నారని మూడవమంత్రార్థము॥ 3 ॥

ఏ తత్పురుషనారాయణుడు దేవతలకొఱకే ప్రకాశించుచు వారికిపురోహితుడై ఆదేవతలకంటె ముందుపుట్టియుండెనో, మూలబ్రహ్మకు కిరణరూపుడో యాయాదినారాయణునకొఱకు నమస్కారము॥ ౪ ॥

ఇట్లు పరబ్రహ్మ కిరణస్వరూపుడగు నీత్వష్ట నే కర్మదేవతలును, బ్రాహ్మణులును తెలుసుకొందురో వారిస్వాధీనములో సమస్తదేవతా చక్రముండును॥ ౫ ॥

కావున ఓతత్పురుష నారాయణా! వెలుపల దుష్కర్మలయందు లజ్జయు

లోపల త్రియీవేద్యమగు వైదికలక్ష్మియు నీకుభార్యలు. అహోరాత్రములు రెండును దక్షిణోత్తరపార్శ్వములు. నక్షత్రములే నీస్వరూపము. అశ్వినీదేవతలే నీముఖవ్యాప్తిస్వరూపము. కావున ఇష్టముచే (యాగముచే) సంకల్పింపుమా యనియు సర్వసంకల్పమాత్రమును సత్యమునుగా జేయుమనియు సారవమాత్రార్థము. ఇట్టియుత్తరనారాయణ మంత్రార్థమును విమర్శించగా దీనికి పూర్వమందుగల పురుష సూక్తము కార్యబ్రహ్మకభూతిని చెప్పుచున్నదై పూర్వనారాయణస్వరూపమును చెప్పకయే తెలియుచున్నది. ఇందలివిశేషార్థంబులు ప్రథమభాగమందు గననగును.

—♦ నాలుగవకాణ్డ ప్రథమప్రశ్న - ౮-వ అనువాకము - మహాగ్నిచయనము. ♦—

౧. హిరణ్యగర్భస్సమవర్తతాగ్రేభూతస్య జాతః పతిరేక ఆసీత్
సదాధార పృథివీంద్యామ్ ॥౩౧॥ ఉతేమాం కస్మైదేవాయ
హవిషా విధేమ॥

౨. యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ।
య ఈశే అస్యద్విపదశ్చతుష్పదః కస్మైదేవాయ హవిషావిధేమ॥

౧. ప్రజాపతిసృష్ట్యాదియందే ప్రవృత్తిధర్మముగలవాడై పుట్టినభూతముల కెల్ల దానేభూతపతియై అద్వితీయుడై ద్యావాపృథ్వుల రెంటికి ఆధారభూతుడైయున్న ప్రజాపతికి హవిస్సుచేత యజ్ఞము జేయుచున్నాము.

౨. జీవించుచున్నట్టియుం గనుమూసియున్నట్టియు జగత్తునకంతకు నధిపతియై ద్విపాద, చతుష్పాద భూతములకంతకు నియామకుడైన ప్రజాపతికొఱకు యజ్ఞమును జేయుచున్నాము.

3. య ఆత్మదా బలదా యస్యవిశ్వ ఉపాసతే ప్రశిషం యస్యదేవాః।
యస్యఛాయాఽమృతం యస్యమృత్యుః కస్మైదేవాయహవిషా విధేమ॥

తా॥ యేప్రజాపతిజగత్తునకంతకు ఆత్మయు బలమునిచ్చుచుండునో, యెవని యాజ్ఞను దేవతలందరు శిరసావహించుచుందురో, యెవనిశుక్లకృష్ణఛ్ఛాయయే అమృతమనియు మృత్యువనియు చెప్పబడునో అతనికొఱకు యజ్ఞమును జేయుచున్నాము.

౪. యస్యేమే హిమవన్తో మహిత్వా యస్యసముద్రగ్ం రసయాసహా ॥ ౩౨॥ ఆహుః। యస్యేమాః ప్రదిశోయస్య బాహూకస్మై దేవాయహవిషా విధేమ॥

తా॥ హిమవత్పర్వతముతోగూడిన భూమియు జనులు సముద్రముసెవని శరీరమై దిశలు విదిశలుగూడ యెవనికి బాహువులగుచున్నవో ఆప్రజాపతికై యజ్ఞముచేయుచున్నాము.

౫. యం క్రన్దసీ అవసాతస్తభానే అభ్యైక్షేతాంమనసా రేజమానే। యత్రాధిసూర ఉదితౌ వ్యేతి కస్మైదేవాయహవిషావిధేమ॥

తా॥ ఏప్రజాపతి నుద్దేశించి మొఱపెట్టుచున్న నీద్యావాభూములు మనస్సు చేతనే ప్రకాశింపుచున్నవో ఏమనస్సునందు సూర్యుడుదయించుచుండగా మొఱ పెట్టెడు ధ్వనిసూర్యరూపమై పోవుచున్నదో ఆప్రజాపతికొఱకు యజ్ఞమునుజేయు చున్నాము.

౬. యేనద్యౌరుగ్రా పృథివీచదృఢేయేనసువస్తభితం యేననాకః యోఅన్తరిక్షే రజసో విమానః కస్మైదేవాయ హవిషావిధేమ॥

తా॥ ఏప్రజాపతిచేత ఉగ్రమగు అంతరిక్షమున్ను పృథివియు దృఢములై యున్నవో ఎవనిచే స్వర్గలోకము స్తంభితమైయున్నదో ఏప్రజాపతి అంతరిక్షమందు రజస్సువల్ల నవిమనస్కుడైయుండెనో అతనికొఱకు యజ్ఞమునుజేయుచున్నాము.

౭. ఆపోహయన్మహతీర్విశ్వమ్॥ ౩౩॥ ఆయన్గర్భం దధానా జనయన్తీ రగ్నిమ్। తతోదేవానాం నిరవర్తతాసురేకః కస్మైదేవాయహవిషా విధేమ॥

తా॥ జలదేవతలచే నప్పులసృజింపబడిన యగ్నియందు సంసారనివృత్తికై కర్మదేవతలే ప్రజాపతికై హవిస్సుల వేల్తురో యాప్రజాపతికై యజ్ఞమాచరించు చున్నాము.

౮. యశ్చిదాపో మహినాపర్యపశ్యద్దక్షం దధానా జనయన్తీరగ్నిమ్ ।
యోదేవేష్వధిదేవఏక ఆసీత్కస్మైదేవాయహవిషావిధేమ॥ ౩౮ ॥

“అగ్నిస్సరస్వతీద్యాగ్ం సహవిశ్వం చతుస్త్రిగ్ంశచ్చ॥ ౮ ॥

ఊర్ధ్వాయః ప్రాణతో యఆత్మదాయస్యేమేయంక్రన్దసీయేనద్యౌరాపో హయ
త్తతో దేవానాం యశ్చిదాపో యోదేవేషునవ

తా॥ చిన్మయుడగు యేప్రజాపతి సమర్థుడగు అగ్నినిపుట్టించుచున్న ఆపో దేవతలను సాక్షిభూతుడై చూచుచున్నాడో దేవతలందరికంటెను నధికుడగు దేవతయగుచున్నాడో అట్టిప్రజాపతికొఱకు యజ్ఞమునుజేయుచున్నాను.



## మహత్తత్వ వివరము.

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - సప్తమోధ్యాయం.

పాదగమ్యంతు యత్కించిద్వస్త్వస్తి పృథివీమయం । సభూర్లోక స్సమాఖ్యాతో విస్తారోస్యమయోదితః॥ ౧౬ ॥ భూమిసూర్యాంతరంయత్తు సిద్ధాదిముని సేవితం । భువర్లోకస్తుసోప్యుక్తో ద్వితీయోమునిసత్తమ॥ ౧౭ ॥ ధృవసూర్యాంతరం యత్తునియుతాని చతుర్దశ । స్వర్లోకస్సోపికథితో లోకసంస్థాన చింతకైః॥ ౧౮ ॥ త్రైలోక్యమేతత్కృతకం మైత్రేయ పరిపఠ్యతే । జనస్తపస్తథా సత్యమితిచాకృతకత్రయమ్ ॥ ౧౯ ॥ కృతాకృతః యోర్మధ్యే మహర్లోక ఇతిస్మృతః॥ శూన్యో భవతి కల్పాంతే యోఽత్యంతం నవినశ్యతి॥ ౨౦ ॥ ఏతేసప్తమహాలోకా మైత్రేయ కథితాస్తవ । పాతాళానిచసప్తైవ బ్రహ్మాండస్యైషవిస్తరః ౨౧ ॥ ఏతదండకటాహేన తిర్యక్చోర్ధ్వమధస్తథా । కపిత్థస్యయథాబీజం సర్వతో వైసమావృతమ్ ॥ ౨౨ ॥ దశోత్తరేణ పయసామైత్రేయాండంచ తద్వృతమ్ । సర్వోఽంబుపరిధానో సౌవహ్నినావేష్టితో బహిః ౨౩ ॥ వహ్నిశ్చవాయునా వాయుర్మైత్రేయ నభసావృతః । భూతాదినా నభస్సోఽపి మహతాపరివేష్టితః । దశోత్తరాణ్యశేషాణి మైత్రేయైతాని సప్తవై॥ ౨౪ ॥ మహాఽంతంచ సమావృత్యప్రధానం సముపస్థితమ్ । అనంతస్యనత

స్యాఽన్తస్సంఖ్యానం వాపి విద్యతే॥ ౨౫ ॥ తదనంతమసంఖ్యాత ప్రమాణంచాఽపి వైయతః। హేతుభూతమశేషస్య ప్రకృతిస్సాపరా మునే॥ ౨౬ ॥ అండానాంచ సహస్రాణాం సహస్రాణ్యయుతానిచ। ఈదృశానాం తథాతత్ర కోటి కోటిశతానిచ ॥ ౨౭॥ దారుణ్యగ్నిర్యథా తైలం తిలేతద్వత్పుమానపి। ప్రధానేఽవస్థితో వ్యాపీ చేతనాఽఽత్మాఽఽత్మవేదనః॥ ౨౮ ॥ ప్రధానంచ పుమాంశ్చైవ సర్వభూతాత్మభూతయా। విష్ణుశక్త్యామహాబుద్ధే వృతౌ సంశ్రయధర్మిణౌ॥ ౨౯ ॥ తయోస్సైవ పృథగ్భావ కారణం సంశ్రయస్యచ। క్షోభకారణభూతాచ సర్గకాలే మహామతే॥ ౩౦ ॥ యథా సక్తం జలేవాతో బిభర్తి కణికాశతమ్। శక్తిస్సాఽపి తథావిష్ణోః ప్రధానపురుషాఽఽత్మకమ్॥ ౩౧ ॥ యథాచపాదపో మూలస్కంధశాఖాది సంయుతః। ఆదిబీజాత్ప్రభవతి బీజాన్యన్యానివైతతః ॥ ౩౨ ॥ ప్రభవంతి తతస్తేభ్యస్సంభవంత్యపరేద్రుమాః తేఽపితల్లక్షణద్రవ్య కారణాఽనుగతామునే॥ ౩౩ ॥ ఏవమవ్యాకృతాత్పూర్వం జాయంతే మహదాదయః। విశేషాఽన్తాస్తతస్తేభ్యస్సంభవంతి సురాదయః। తేభ్యశ్చపుత్రాస్తేషాంచ పుత్రాణామపరేసుతాః॥ ౩౪ ॥ బీజవృక్షప్రరోహేణ యథానాపచయస్తరోః। భూతానాం భూతసర్గేణనైవాఽస్త్యపచయస్తథా। ౩౫ ॥ సన్నిధానాద్యథాకాశ కాలాఽద్యాఃకారణంతరోః। తథైవాపరిణామేన విశ్వస్యభగవాన్ హరిః॥ ౩౬ ॥ వ్రీహిబీజే యథామూలం నాళం పత్రాఽఙ్కురౌతథా। కాండం కోశస్తథాపుష్పం క్షీరం తద్వచ్చతండులం॥ ౩౭ ॥ తుషాః కణాశ్చసంతో వైయాం త్యావిర్భావమాత్మనః। ప్రరోహ హేతుసామగ్ర్యమాసాద్యమునిసత్తమ॥ ౩౮ ॥ తథాకర్మస్వనేకేషు దేవాఽఽద్యాస్సమవస్థితాః। విష్ణుశక్తిం సమాసాద్య ప్రరోహముపయాంతివై॥ ౩౯ ॥ సచవిష్ణుః పరంబ్రహ్మ యతస్సర్వమిదంజగత్ జగచ్చయో యత్రచేదం యస్మింశ్చలయమేష్యతి॥ ౪౦ ॥ తద్బ్రహ్మపరమంధామ సదసత్పరం పదమ్। యస్యసర్వమభేదేన జగదేతచ్చరాచరమ్॥ ౪౧ ॥ సఏవమూలప్రకృతిర్వ్యక్తరూపీజగచ్చసః। తస్మిన్నేవలయంసర్వం యాతితత్రచతిష్ఠతి॥ ౪౨ ॥ కర్తా క్రియాణాం సచఇజ్యతే క్రతుస్సఏవ తత్కర్మఫలంచతస్య। స్రుగాదియత్సాధనమప్యశేషం హరేర్నకించిద్వ్యతిరిక్తమస్తి॥ ౪౩ ॥

—♦ మహత్త్వము. - విష్ణు. ద్వితీ. అధ్యా ౭. ♦—

పార్థివాంతమగు శరీరముతో ఏకపాద్విభూతిగ వ్యవహరింపబడుచున్న వస్తుమాత్రములన్నియును భూర్లోకమని, దీనివిషయవిస్తారమును నాచేత మీకిదివరకే

చెప్పబడెను. ఇట్టిభూర్లోకమునకును, సూర్యునికింగల అంతరాళమే సిద్ధాదిమునిసేవితమయి రెండవదియగు భువర్లోక వ్యాహృత్యర్థరూపముగా లోకమనియును జెప్పబడెను. సూర్యుడు మొదలు పరభాగములోగల ధ్రువమువఱకు పదునాలుగు లక్షల పరిమాణముగలదియును లోకసంస్థానచింతకులచే స్వర్గలోకమనియు సువః అనెడు వ్యాహృతిగ మూడవదిగ జెప్పబడుచున్నది. వీటికే త్రైలోక్యమనిపేరు. ఇవికృతకములని యుపనిషత్తులందుఁ బఠింపబడుచున్నవి. ఇటులనే వీటికావల లోకాదులగు జన, స్తప, సత్యములనెడి వ్యాహృతినామములతో జెప్పబడుచున్న యీ లోకత్రియ మకృతకమని చెప్పబడుచున్నవి. ఇట్టికృతాకృతక లోకత్రియములకు మధ్యలోనున్నది మహావ్యాహృత్యర్థమగు మహర్లోకమని స్మృతులచే జెప్పబడుచున్నది. ఈ రెండును కల్పాంతమందు శూన్యమగునుగాని అత్యంతవినాశనము (సంపూర్ణ) మాత్రముగా నేరదు. ఓమైత్రేయా! యేడుమహాలోకములనుగుఱించి నీకిదివఱకే చెప్పబడినది. ఇటులనే సప్తపాతాళాదిలోకాదులుగూడ నున్నవి. ఇదే బ్రహ్మాండముయొక్క విస్తారము. ఈచతుర్దశభువనములుకలిసి అడ్డముగను, ఊర్ధ్వముగను, పరిణామములో అండకటాహముగనున్నది ఇవి వెలగపండులోని బీజములవలె సర్వవిధములుగ నావరింపబడియున్నవి. ఇట్లావరింపబడిన యీభువనబ్రహ్మాండమునకు బదిరెట్లధికముగాఁగల పరిణామముతో జలభూతముచే నావరింపబడియున్నది. ఇట్టిపద్మాంబు పరిధానమగు నీజలభూతమును బహిరావరణముగా బదిరెట్లధికముగా వహ్నిభూతముచే చుట్టుచుట్టియున్నది. ఇటులనే యీవహ్నిభూతమునకు వాయుభూతమును నీవాయుభూతమున కాకాశభూతము చుట్టుచుట్టియొకదానికొకటి ఆవరణముగా బదిరెట్లధికముతోనున్నది. మరల నీయాకాశమునకు భూతాదులహంకారముచేతను నాలహంకారము మహత్తత్వముచేతను చుట్టుచుట్టబడి యొకదానికంటె మరొకటి పదిరెట్లధికముగ నున్నవి. ఈపదిరెట్లు ఔపచారికముగ దెలియవలెను. ఇట్టిమహత్తత్వాహంకారమును అవ్యక్తమూలప్రకృతియని జెప్పబడుచున్న మూలతత్వమావరించియున్నది. దీనికిఁగారణముగ అనంతము నాద్యంతరహితమునగు పరమాత్మయేయున్నదని తెలియవలెను. ఇట్లుసకలసృష్టికిని అంతమునకును, అతీతమునకును మూలకారణమగుచున్నదే పరాప్రకృతియనియు జెప్పబడుచున్నది. ఇట్టిబ్రహ్మాండ సహస్రములు అయుత, నియుత, ప్రయుతార్బుద సంఖ్యాకములనేకములుగనున్నవి, దారువునందగ్నివలెను, దిలలయందు దైలమువలెను గూఢప్రధానుడని జెప్పబడుచున్న. పురుషచైతన్య మాపరావర ప్రకృతి

యందే సర్వవ్యాపియు, చేతనాత్మకుడుగ స్వయంప్రకాశ జ్ఞానరూపుడుగ నున్న వాఁడు. ఇట్టిప్రధానపురుష సర్వభూతాత్మ భూతాత్మకమగు విష్ణుశక్తిచే నావృతమై ఆశ్రయాశ్రయ భావములచే ధర్మాధర్మివ్యవహారమునుగూడ బొందుచున్నాడు. అట్టిప్రకృతి పురుషులకు నాపరాప్రకృతియే వారిపృథగ్భావమునకును ఆశ్రయాశ్రయి భావమునకును గారణభూతమగుచు సృష్టికాలమందు ఆత్మక్షోభ కారణ భూతమగుచున్నది.

అదెట్లన ఒకగుహాపరమాణు శతవాయువును భరించునటు లావిష్ణువు ప్రకృతి పురుషోభయాత్మికముగూడ తానేయగుచున్నాడు. ఒకవృక్షమెట్లు మూల, ప్రకాండ శాఖాదులతోఁగూడి అదిలో బీజమువల్లఁదాను సృష్టియై తరువాత ననంతములగు బీజములను దననుండి పుట్టించునో తదుపరి నాయనంత బీజములవల్ల మరికొన్ని సజాతీయ విజాతీయ, స్వగతభేదయుక్తములగు వృక్షములనుబుట్టించు చుండునో యటులనే యీపరాప్రకృతులు రెండును ద్రవ్యకారణానుగతములై యున్నవి. ఇట్లవ్యాకృతమగు మూలప్రకృతి సృష్ట్యాది క్రమసృష్టిచే మహదాదులతో క్రమక్రమముగ మూలమునుండి రాబడినవని తెలియవలెను. అన్నియును దమతమ విశేషములచే అంతమగునవగుటచే బీజాంకురన్యాయముగ నీసంసారవృక్షమున కెప్పటికిని క్షయము లేకయే పెరుగుచుండును. ఆమూలప్రకృతి పురుషునివలన నెట్లు ఆకాశ, కళాదులు వృక్షమునకు కారణభూతములో యాప్రకారము పరిణామము లేకయే విశ్వమున కంతకుఁబరమపురుషుడు భగవంతుఁడునగు శ్రీహరి సర్వకారణభూతుడగుచున్నాడు. అదెట్లన వడ్లగింజ మూలము, నాళము, స్తంభము, పత్రాంకురములు, కాండ, కోశాదులు, పుష్పము, క్షీరము (రసము) వృద్ధిజెంది ముదిరి పరిపక్వమగుటచే తండులమగుచుండును. ఆతండులమునకు పైపొట్టుకణములు నంకురముగల్గి మఱల సస్యప్రరోహమునకు సమాశ్రయమగుచున్నది. అటులనే శ్రీవిష్ణుశక్తియని జెప్పబడుచున్న నామూలప్రకృతినిబొంది నానాకార జగత్తులు ప్రరోహము (అంకురించుట) బొందుచున్నవి. అందువలన నావిష్ణువే పరబ్రహ్మము, జగత్తనియు, జగత్కారణమనియు, జెప్పబడు ఎవనివలన జగత్తులు సృజింపబడుచున్నవో యెచ్చట స్థితిలయాదులగుచున్నవో యాప్రకృతి పురుషోభయరూప మావిష్ణువేయని చెప్పబడుచున్నది. ఈచరాచరాత్మకమగు జగత్తంతయు నెవనియందు నభేదముగనుండునో అదే శ్రీమహావిష్ణువు మూలప్రకృతియు జగత్తునదేయని నామత్రయములచే వ్యవహరింపబడుచున్నది. అందువలన సర్వమాతనియందే యుండుటచేత సర్వమతడేయని

చెప్పబడుచున్నది. యజ్ఞమును జేయించు వాడును, యజ్ఞమును, యజ్ఞరూపుడు కారణ క్రతువు, కాలము (సంవత్సరాత్మకము) యజ్ఞకర్మఫలస్వరూపుడు. సాధనములగు, సృక్స్రువములు సర్వము శ్రీమహావిష్ణువునకంటె వేరేమియును లేదని భావము.

---

# దేవగృహాగ్నుల వివరము.

వాయుపురాణం - అధ్యా. ౫౩ - పుట ౭౯.

ఋషయః ఊచుః యదేతదుక్తం భవతా గృహాణ్యేతాని విశ్రుతం॥ కథం దేవగృహాణిస్యుః కథంజ్యోతీంషి వర్ణయ॥ ౨ ॥ ఏతత్సర్వం సమాచక్ష్వ జ్యోతిషాంచైవ నిశ్చయం। శ్రుత్వాతు వచనం తేషాం తదాసూతః సమాహితః॥ ౩ ॥ అస్మిన్నర్థే మహాప్రాజ్ఞైర్యదుక్తం జ్ఞానబుద్ధిభిః। తదోఽహం సంప్రవక్ష్యామి సూర్యాచంద్రమసోర్భవం। యథా దేవ గృహాణీహ సూర్యాచంద్రమసోగృహం॥ ౪ ॥ అతఃపరం త్రివిధాగ్నే ర్వక్ష్యేఽహం తుసముద్భవం। దివ్యస్యభౌతికస్యాగ్నే రథాగ్నేః పార్థివస్యచ॥ ౫ ॥ వ్యుష్టాయాంతు రజన్యాం వైబ్రహ్మణోఽవ్యక్తజన్మనః। అవ్యాకృతమిదంత్వాసీన్నైశేన తమసావృతం ॥ ౬ ॥ చతుర్భూతా వశిష్టేఽస్మిన్ పార్థివః సోఽగ్నిరుచ్యతే। యశ్చాసౌ తపతేసూర్యే శుచిరగ్నిస్తు సస్మృతః॥ ౭ ॥ వైద్యుతాఖ్యాస్తు విజ్ఞేయస్తేషాం వక్ష్యేఽథలక్షణం। వైద్యుతో జాఠరః సౌరోహ్యపాంగర్భాస్త్రయోఽగ్నయః। తస్మాదపః పిబన్ సూర్యో గోభిర్దీప్యత్యసౌదివి॥ ౮ ॥ వైద్యుతేన సమావిష్టో వార్క్షోనాద్భిః ప్రశామ్యతి। మానవానాంచ కుక్షిస్థోనాద్భిః శామ్యతి పావకః॥ ౯ ॥ అర్చిష్మాన్ పరమఃసోఽగ్నిః ప్రభవో జాఠరస్స్మృతః। యశ్చాయం మండలీశుక్లో నిరూష్మా సంప్రకాశతే॥ ౧౦ ॥ ప్రభాహిసౌరీపాదేన హ్యస్తంయాతి దివాకరే అగ్నిమావిశతే రాత్రౌతస్మాద్దూరాత్ప్రకాశతే॥ ౧౧ ॥ ఉద్యంతంచ పునఃసూర్యమౌష్ణ్యమాగ్నేయ మావిశత్। పాదేనపార్థివస్యాగ్నే స్తస్మాదగ్నిస్తపత్యసౌ॥ ౧౨॥ ప్రకాశశ్చ తథౌష్ణ్యంచ సౌరాగ్నేయేతు తేజసీ। పరస్పరానుప్రవేశాదాప్యాయేతే దివానిశం॥ ౧౩ ॥ ఉత్తరేచైవ భూమ్యర్ధే తస్మాదస్మింశ్చ దక్షిణే ఉత్తిష్ఠతిపునఃసూర్యే రాత్రిరావిశతేత్వపః। తస్మాత్తామ్రా భవంత్యాపో దివారాత్రిప్రవేశనాత్॥ ౧౪ ॥ అస్తంయాతి పునఃసూర్యే అహర్వైప్రవిశత్యపః।



2. స్థూల బ్రహ్మాండగోళవివర చిత్రపటము.

## (2) స్థూలబ్రహ్మాండగోళ చిత్రపట వివరము.

1=సప్తదశ్యాత్మస్వరూపామృత ధ్రువచంద్రకళ. 2=ఉభయమధ్య సంధి రూపబిందువు, 3=సృష్టిరూపకారణాధోముఖ చంద్రషోడశీకళ. 4=పరాశక్తి లోకము. 5=శివకైలాసము, 6=గోలోకము, 7=విష్ణులోకము, 8=ఈబ్రహ్మాండ సృష్టికర్తయగు బ్రహ్మయుండు సత్యలోకము 9=తపోలోకము, 10=జనలోకము, 11=మహర్లోకము, 12=వియన్మార్గ స్వర్గగామిని, జ్ఞానరూపగంగను, [illegible] మముతో మహాపవిత్రరూపిణిగ క్రిందిలోకాదులలో తోయభూతరూపగంగను సమన్వయము. ఇది ధ్రువరూప విష్ణుపదమునుండి శింశుమారములో ప్రవహించి మేరుపీఠముతోనున్న బ్రహ్మసరస్సులోఁజేరి, చతుర్దిశలద్వారములనుండి ప్రవాహరూపములతో మేరువుపైనుండి క్రిందికి నాలుగుదిక్కులందు నాలుగు పేరులతో జలపాతధారలై మనజంబూద్వీపములోఁ జతుర్దిశలందుఁబడి సర్వమును మహాపవిత్రవంతముగఁజేసి సముద్రమును జేరును. ఈ ప్రవాహరూప జలపాతధారయే దక్షిణ దిశలోనున్న మనభారతభూమిలోని హిమాలయపర్వత శిఖరముపైఁబడి ప్రవహించి శ్రీప్రయాగ కాశీక్షేత్రములందు శ్రీగంగానది యను పేరుతో ప్రవాహరూపమై తుదకు కాళీఘట్ట పట్టణమున (కలకత్తా)గల సముద్రములో తొమ్మిదిశాఖలుగ, నవద్వీపములందు సముద్రములోఁజేరును. ఇందులో శ్రీ కాశీక్షేత్రములోగల బ్రహ్మనాళమునుండి పాతాళవాహినిగా సప్తపాతాళాదులందును ప్రవేశించి తుదకు శ్రీఅనంతరూప ఆదిశేషునివద్దకు జేరెను. ఇచ్చట సీతిప్రవర్గములనావరించి ధ్రువమండలమునకు సమానకక్ష్యగాఁ బరిధిగానున్న దేవాలయాకారరూప సీమాపర్వతమే లోకాలోకపర్వతము. దీనిమీద నాలుగుకరింద్రములున్నవి. 1=వృషభము, 2=పుష్పదంతము, 3=వామనము, 4=అపరాజితము. ఒకప్పుడు యీకరింద్రముల తొండములనుండి పగటిపూట జలధారలు మేఘములుబొత్తిగా లేని కాలములో సూర్యప్రకాశమున్నపుడు క్రిందబడును. ఇవి మనమున్న భారతభూమిలోఁగూడబడును. ఈజలధార బిందువులు బడినవారలపుణ్య మతిశయము. దీనినే దివ్యస్నానమని వేదపురాణములందు వచించిరి. శ్రీవిష్ణుపురాణములో నీవిషయప్రమాణములు గూడనున్నవి. ఇచ్చటికూర్ధ్వములోఁగల బ్రహ్మలోకాదులు నాలుగు ముగిసెను.

13=ధ్రువమండల ధ్రువస్థానమని విష్ణుపదమని దీనికి నామాంతరములు. 14=శింశుమారము. సర్వతారాగణయుక్త దివ్యతేజోమండలము, సువర్లోకము.

దీని నే శ్రీవిష్ణు దివ్యస్వరూప కుండలీభూత దేహమనియు దీనిని బ్రితిదినము సంధ్య యందు ధ్యానించువారలపుణ్యము వర్ణనాతీతమనియు పురాణములందును వేదములం దును జెప్పఁబడెను. ఈశింశుమారము రెండుభాగములుగనున్నది. 15=ఎఱుపు రంగుతోనున్నదే ఉత్తరాయణార్చిరాది మార్గమనియు దేవయానమనియు దేవతలకు పగలనియు, 16=నీలిరంగుతోనున్నదే దక్షిణాయన ధూమాదిమార్గము పితృయాన మను, దేవతలకు రాత్రికాలమనియును శ్రీగీతాదులలో నుదహరించిన పురాణ ములకు సంబంధించినవిగా తెలియవలెను. 17=మేరుపీఠముపైనున్న అష్టదిక్పాలుర పురములు. మధ్యలో బ్రహ్మపురియున్నది. మనము శాంతిమొదలగు సర్వవిష యాదులందు వాడుకగానున్న ఆవాహన కలశస్థాపనచేయు మండలయంత్రమిదే. 18=రాహుకేతువుల మండలము, 19=కిన్నర కింపురుషాది దేవగంధర్వులమండ లము, 20=రాక్షసులమండలములు, 21=ఋక్షులమండలము, 22=మేఘమం డలము, 23=సూర్యరథము, రథచక్రము, సప్తఛందాశ్వములు. (గుర్తులు 0000000) రథముపైన సారథి అనూరుడు, రథపీఠముపైన శ్రీసూర్యభగవానుఁడున్నారు.

—♦ క్రిందిభాగములోఁగల సంఖ్యలవివరము ♦—

1=శుద్ధోదకసముద్రము. ఈ శుద్ధోదకసముద్రమునకును లోకాలోక ప ర్వతమునకును మధ్యలోఁగలది సైకతస్వరూపస్నిగ్ధ స్వర్ణభూమి, 2=పుష్కరద్వీ 3=పుష్కరద్వీపములోఁగల మానసోత్తరపర్వతము. ఇదిసూర్యమండలము ఉన్నతమైయుండుటచేత సూర్యరథచక్రమున కాధారమార్గభూమిగ మేరువ నకు జుట్టువలయాకారముగనున్నది. పుష్కరద్వీపమధ్యభాగములో నిది సీ తముగ రెండుభాగములుగ విభజనగానున్నది. 4=క్షీరసముద్రము, 5= ద్వీపము, 6=దధిసముద్రము, 7=శాకద్వీపము, 8=సర్పిసముద్రము, 9 ద్వీపము, 10=సురాసముద్రము, 11=కుశద్వీపము. 12=ఇక్షురస ... 13=ప్లక్షసముద్రము, 14=జంబూద్వీపము దీనిచుట్టుచుట్టినదే లవణసము సముద్రములు, ద్వీపములు వలయాకారముతో నొకదానిపైనొకటి యంత ఉపరిలో నధిక విశాలముతో మేరువుపరిధివరకునున్నవి. జంబూద్వీపము ... భాగములుగ విభజింపఁబడినది. అవే నవవర్షములు. అందులో దక్షిణ గడపటనున్నదే మనభారతభూమి. ప్రతివర్షభూమికిని మధ్యలో విభజనగ ర్వతములున్నవి. మనకుఁగల సీమాపర్వతమే హిమాలయపర్వతము,

జంబూద్వీపమధ్యలోనున్నదే మేరుపర్వతము. ఈపర్వతముక్రింద విశాలము కొంచె ముగను ఊర్ధ్వములో నెక్కువగనున్నది. 16=మానసోత్తర పర్వతముపైన మన పశ్చిమదిశలోనున్నది వరుణపురి, 17=తూర్పుదిశలో నింద్రపురి, 18=దక్షిణ దిశలోని యమపురి, దీనికెదురుగ ఉత్తరదిశలోఁ గుబేరపురమున్నది, 19=నుండి 25 సంఖ్యలవరకు సప్తపాతాళ లోకములు, 26=మహాజలము, 27=అగ్ని, 28=ఆది శేషుని శిరస్సుననున్న మహాకాలాగ్ని, 29=అనంతరూప బ్రహ్మాండాధారాది శేష సంకర్షణుఁడు, 30=శ్రీభగవత్స్వరూప మహాయజ్ఞవరాహావతార విశేషము. 31=శ్రీభగవత్స్వరూప మహాకూర్మావతార విశేషము, 32=మూలాధారమహా శక్తి. ఆదిశేషుని కెదురుగ భూభారమును, గొంతవహించియున్నవే అష్టదిగ్గజ ములు. 1=ఐరావతము, 2=పుండరీకము, 3=వామనము, 4=కుముదము, 5=అంజనము, 6=పుష్పదంతము, 7=సార్వభౌమము, 8=సుప్రతీకము. ఈ సర్వమునుజుట్టి వలయాకారముగనున్నవే సప్తావరణములు. ఈసప్తావరణములకును బ్రహ్మాండగోళమునకును మధ్యలోనున్నది అగమ్యాలోకము. మహర్షులకు, దివ్యజ్ఞా నులకు దేవతలకు సాధ్యమైనదిగాని మానవసాధ్యముగానిది.

మనముండునది భూర్లోకమనియు, మేఘమండలములాదిగనున్నది భువర్లోక మనియు శింశుమారమంతయు సువర్లోకమనియు మనవేదపురాణములందుఁ బ్రమా ణములున్నవి. ఇదియొక బ్రహ్మాండము.

—0—

తస్మాన్నక్తం పునః శుక్లాఆపోవిశ్యంతి భాస్కరే॥ ౧౫॥ ఏతేన క్రమయోగేన భూమ్యర్ధే దక్షిణోత్తరే। ఉదయాస్తమయే నిత్యమహోరాత్రం విశత్యపః॥ ౧౬॥ యశ్చాసౌ తపతే సూర్యః పిబన్నంభో గభస్తిభిః। పార్థివో హివిమిశ్రోఽసౌ దివ్యాశ్శుచిరితిస్మృతః॥ ౧౭॥ సహస్రపాదః సోఽగ్నిస్తు వృత్తః కుంభనిభశ్శుచిః। ఆధత్తే తత్తురశ్మీనాం సహస్రేణసమంతతః॥ ౧౮॥ నాదేయీశ్చైవ సాముద్రీః కౌప్యాశ్చైవసధాన్వనీః। స్థావరాజంగమాశ్చైవ యశ్చసూర్యో హిరణ్మయః। తస్యరస్మిసహస్రంతు వర్షశీతోష్ణనిస్స్రవం॥ ౧౯॥ విశంతిసర్వదేవాస్తు స్థానాన్యేతాని సర్వశః॥ మన్వంతరేషు సర్వేషుఋక్షసూర్యగ్రహాశ్రయాః ౨౦॥ తాని దేవ గృహాణ్యేవ తదాఖ్యాస్తే భవంతిచ॥

ఇట్లుసర్వదేవతలు సర్వమన్వంతరములందును నీస్థానములలో ఆవేశించిన వారలై నక్షత్రసూర్య గ్రహాశ్రయులగుచుందురు. అందువలన నియ్యది దేవ గృహమని చెప్పబడెను. వేదప్రమాణం.

-♦ సంహితః తైత్తిరీయము, ఆరవకాండ, నాలుగవప్రశ్న పదియవ అనువాకము. ♦-

బృహస్పతి ర్దేవానాం పురోహిత ఆసీచ్ఛణ్డామర్కా వసురాణాంబ్రహ్మణ్వా

న్తోదేవాఆసన్బ్రహ్మణ్వన్తోఽసురాస్తేఽన్యోన్యం నాశక్నువన్నభిభవితుం తేదేవాశ్ష

ణ్డామర్కా వుపామన్త్రయన్త తావబ్రూతాంవరం వృణావహైగ్రహా వేవనావత్రాపి

గృహ్యేతామితి తాభ్యామేతౌ శుక్రామన్థినావగృహ్ణన్తతో దేవాఅభవన్పరాఽసురా

యస్యైవం విదుషశ్శుక్రామన్థినా గృహ్యేతే భవత్యాత్మనాపరా

భారతములో శ్లో॥ "అన్యౌతు దానవానాంహి సూర్యాచంద్రమసౌస్మృతౌ" అనియుగలదు. శుక్రుడు, సూర్యుడు మంథియనుపేరుగల-సోమగ్రహముచంద్రుడు.

-♦ తైత్తరీయబ్రాహ్మణము-ప్రథమకాణ్డం-అయిదవప్రశ్న- రెండవఅనువాకం ♦-

"దేవగృహా వై నక్షత్రాణి। యఏవం వేద। గృహ్యేవభవతి।

యాని వా ఇమాని పృథివ్యాశ్చిత్రాణి। తానినక్షత్రాణి"

పృథివియందుండు చిత్రములే నక్షత్రములనియు దేవగృహములనియుఁ జెప్ప బడుచున్నవి.

## —• దే వ గృ హా గ్ను లు. •—

"ఓసూతా! నీవుచెప్పిన విశ్రుతదేవగృహములగు ఖగోళజ్యోతిస్సులెట్లున్న వో విస్తరించి వర్ణింపు"మని ప్రశ్నించిన ఋషులవచనములకు సూతులవారిట్లు చెప్పిరి. దేవగృహమనగా సూర్యచంద్ర గ్రహనక్షత్రాదులుగల ఖగోళము.

ఈవిషయమై మహాప్రాజ్ఞులు సూర్యచంద్రులయొక్క సంసారమునుగూర్చి చెప్పినచరిత్ర మీకు విస్తరింపబడుచున్నది. ఈఖగోళములుగా కనబడుచున్న దేవ గృహములన్నియు సూర్యచంద్రులయొక్క గృహములనియేచెప్పిరి. ఇటుపైన త్రి రూపుడగు అగ్నియొక్క సముత్పత్తి చెప్పబడినది. అగ్ని దివ్యభౌమాంతరిక్ష భేద ములచే మూడువిధములుగ నున్నది. అవ్యక్తప్రాదుర్భావముగల బ్రహ్మకు (దెల్ల వారుచుండ రాత్రిసంబంధమైన తమస్సుచే వ్యాపింపబడిన యీఅవ్యక్తజగత్తునుజూచి నప్రడు చతుర్భూత రూపముగ పృథివియందుండిన నీయగ్నియే చెప్పబడుచున్నాడు. సృష్ట్యాదియందు సూర్యునియందుండి తపించుచున్న అగ్నియే "శుచి"యని చెప్పబడు చున్నాడు. ఇట్లువైద్యుతాగ్నినిగూడ తెలియవలెను. వైద్యుతాగ్ని జఠరమందుండి సూర్యగర్భోదక ఆపోజ్యోతి స్వరూపాగ్నిత్రయాత్మకమని చెప్పబడుచున్నది. అందు వల్ల ఈ అప్పులను తనకిరణములచేత పానముజేయుచు నాకాశమందు ప్రకాశించు చున్నది. ఈవైద్యుతాగ్నియొక్క సమావేశమునుపొందియు పూర్వముజెప్పిన సూర్యచంద్రులయొక్క సంసారవృక్షము ఉదకములచే శాంతినిబొందుటలేదు. మానవుల జఠరాగ్ని పానీయములచే నుపశమింపబడుటలేదు. ఆపావకాగ్నియుత్కృ ష్టమగు జ్వాలలుగలిగి జన్మప్రదమగుచుండుటచేత జాఠరమని చెప్పబడుచున్నది. మండలాకృతిగలిగి వేడిమిలేనిదై శుక్లవర్ణము తో అనగా చంద్రమండలరూపము తో నేదిప్రకాశించుచున్నదో అది పాదవిభూతితో సూర్యకాంతియేయయి దివాకరుని యందు హస్తగతమగుచున్నది. రాత్రియందు అగ్నియందుప్రవేశించి ప్రకాశించు చున్నది. సూర్యోదయముకాగా నీయగ్నియొక్క ఉష్ణత్వము తిరిగి సూర్యునే పొందుచున్నది. అందువలన పార్థివాగ్నియొక్క యొకపాదమాత్రముచేత నే అగ్ని స్వరూపుడై సూర్యుడును ప్రకాశించుచున్నాడు. అందువలన ప్రకాశము, ఉష్ణ త్వము క్రమముగా సూర్యునియొక్కయు అగ్నియొక్కయు తేజస్సులైయున్నవి. ఇట్లు పరస్పరానుప్రవేశమువలన దివారాత్రములందు సూర్యాగ్నులే ప్రకాశించుచున్నవి భూమియొక్క ఉత్తరార్ధమందున్ను దక్షిణార్థగోళమందున్ను సూర్యుడు పర్యాయ ముగ నుదయించుచుండగా రాత్రి నీటియందుప్రవేశించుచున్నది. అందుచేత నీటి

దేవతలు పగటియందు తామ్రవర్ణముగలవారై యుగపడుచుందురు. సూర్యుడస్తమింపగా నీఆపోదేవతలే పగటియందుఁ బ్రవేశించుచున్నారు. అందువలన రాత్రియందు శుక్లవర్ణముగల భాస్కరునియందు ప్రవేశించుచున్నారు. ఈక్రమయోగముచేత భూమ్యర్ధభాగములగు దక్షిణోత్తరగోళములు ఉదయాస్తమయములందు ఆపోదేవతలే నిత్యము అహోరాత్రములందు బ్రవేశించుచుందురు.

ఈసూర్యునియందీయాపోదేవతలను గిరణములచే పానముచేయుచున్న యీపార్థివాగ్నియే మిశ్రరూపముతో దివ్యమగు శుచ్యగ్నియని చెప్పబడుచున్నది. ఇట్లు సహస్రపాదుడగు నాఅగ్నియే కుంభమువలె వృత్తాకారముగలిగి శుచియను పేరుగలవాడై రశ్ములయొక్క సహస్రముచే నంతటను రసమును గ్రహించుచున్నాడు. ఇందుకు వేదప్రమాణములు.

తైత్తిరీయసంహిత- ఆరవకాండ- నాలుగవప్రశ్నయొక్క ద్వితీయానువాకములో-

"యద్వైదివా భవత్యాపోరాత్రిః ప్రవిశతి తస్మాత్తామ్రా ఆపోదివాదదృశ్రే యన్నక్తం భవత్యపోహాః ప్రవిశతి। తస్మాచ్చాంద్రా ఆపోనక్తందదృశే"

—o—

## సూక్ష్మముగ ఆత్మనుండి బ్రహ్మాండపువరున కక్ష్యలవివరములు.

—♦ ఆత్మ ♦—

సంవిత్తు - బిందువు (కారణము)

చంద్రకళా - పరాశక్తి -

అవ్యక్త తత్త్వము (ప్రకృతి)

మహత్త్వం - సదాశివాదిగ పంచబ్రహ్మలు (స్పష్టాస్పష్టం) కేవలశుద్ధజ్ఞాన స్వరూపావరణము. స్వరాట్స్వరూపము అంతరము శుద్ధసాత్త్వికజ్ఞాన స్వరూపము బాహ్యము సాత్త్వికము.

అవిద్య - మహదహంకారము, మాయస్పష్టము శుద్ధచ్ఛాయ.

తన్మాత్రస్వరూపము, ఆకాశాదిపంచభూతములు, గుణత్రయములు, సమష్టి సంరాట్స్వరూపము ఇందులో మహాకారణత్రిమూర్తులు.

విరాట్ - పైవిరాట్టులకు వ్యష్టిగను, మనకు సమష్టిబ్రహ్మాండ విశ్వరూపుడు. ఇది శుద్ధసాత్వికములో అధోభాగమగు తమోంశము. మనకు శుద్ధసత్వగుణాంశము ఇచ్చటినుండి ఆవరణలోకాదులు.

మహాశివకైలాసము - దేవీపురము. దీనిక్రిందనిటులనే వరుసలుగ క్రింది లోకాదులను గ్రహించవలెను.

| | |
|---|---|
| గోలోకము | అనంతము. |
| మహావిష్ణులోకము | ౧౬,౨౦,౦౦౦ |
| సత్యలోకము - హిరణ్యగర్భబ్రహ్మలోకము దీనికెదురుగ యోజనవిస్తీర్ణములున్నవి. హిరణ్యగర్భబ్రహ్మాండమునకు ప్రారంభము | ౫,౦౦,౦౦౦ |
| తపోలోకము - ఇవన్నియు ఛత్రాకారమున సప్తవరాసివలె నున్నవనిప్రమాణము. | ౪,౦౦,౦౦౦ |
| జనలోకము | ౨,౦౦,౦౦౦ |
| మహర్లోకము - (ఇదిఉభయమధ్యలోకము) దీనికిరుపార్శ్వములందు ఉభయలోకాదులున్నవి. | ౧,౦౦,౦౦౦ |
| ధ్రువస్థానమండలము, (విష్ణుపదము) దీనికిసమానకక్ష్యలో ఆవరణముగ లోకాలోకపర్వతము, దీనిపైనే నాలుగుకరీంద్రములు, లోకపాలురునున్నారు. | ౧౩,౦౦,౦౦౦ |

—♦ దీనిక్రిందనే శింశుమారము. ♦—

ఇదిసర్వతారాగణమయ స్వరూపతేజోలోకస్వర్గము దీనిమధ్యలో అంతరసుషుమ్నగ ఆకాశగంగ. దీనిక్రింద మేరువుయొక్క ఉపరిపీఠము. దీనిఅంతరములో నీక్రిందవరుసలుగ కక్ష్యలున్నవి.

దీనిమూలపుచ్ఛము ధ్రువునంటియున్నది. ధ్రువునకు సమానముగక్రింద శింశుమారపుచ్ఛాగ్రమందు ప్రజాపతి, ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, ధర్ముడు గలరు వీరిక్రింద శింశుమార పుచ్ఛములో ధాత, విధాతయుగలరు,

| | |
|---|---|
| సప్తఋషిమండలము | ౧౧,౦౦,౦౦౦ |
| శనిమండలము | ౨,౦౦,౦౦౦ |
| గురుమండలము | ౨,౦౦,౦౦౦ |
| కుజమండలము | ౨,౦౦,౦౦౦ |

| | |
|---|---|
| బుధమండలము | ౨,౦౦,౦౦౦ |
| శుక్రమండలము | ౨,౦౦,౦౦౦ |
| నక్షత్రమండలము | ౧,౦౦,౦౦౦ |
| చంద్రమండలము | ౧౨,౦౦౦ |
| సూర్యమండలము | ౧౦,౦౦౦ |
| రాహుకేతుగ్రహమండలము | ౧౩,౦౦౦ |
| సిద్ధవిద్యాధర చారణాదులమండలము | ౧౦,౦౦౦ |
| యక్షరాక్షసప్రేతపిశాచాదిమండలములు | ౧౦,౧౦౦ |
| మేఘమండలము | ౧౦౦ |
| మేరువుప్రమాణము | ౧,౦౦,౦౦౦ |
| పృధివిలోపల బునాదియోజనములు | ౧౬,౦౦౦ |
| పృథివిపై నెత్తుగనున్న యోజనములు | ౮౪,౦౦౦ |
| మేరువుఉపరిపీఠవిశాలము | ౩౨,౦౦౦ |

దీనియందు అష్టదిక్పాలకులపురములు, మధ్యబ్రహ్మపురియున్నది.

| | |
|---|---|
| లోకాలోకపర్వతము (దీనికావల అలోకము) | ౧౨,౫౦,౦౦,౦౦౦ |
| స్వర్ణభూమి (అగ్నిమార్గము) | ౧,౫౭,౫౦,౦౦౦ |
| శుద్ధోదకసముద్రము | ౬౪,౦౦,౦౦౦ |
| పుష్కరద్వీపము | ౬౪,౦౦,౦౦౦ |
| క్షీరసముద్రము | ౩౨,౦౦,౦౦౦ |
| శాకద్వీపము | ౩౨,౦౦,౦౦౦ |
| దధిసముద్రము | ౧౬,౦౦,౦౦౦ |
| క్రౌంచద్వీపము | ౧౬,౦౦,౦౦౦ |
| సర్పి (నెయ్యి) సముద్రము | ౮,౦౦,౦౦౦ |
| కుశద్వీపము | ౮,౦౦,౦౦౦ |
| సురసముద్రము | ౪,౦౦,౦౦౦ |
| శాల్మలీద్వీపము | ౪,౦౦,౦౦౦ |
| ఇక్షుసముద్రము | ౨,౦౦,౦౦౦ |
| ప్లక్షద్వీపము | ౨,౦౦,౦౦౦ |
| లవణసముద్రము | ౧,౦౦,౦౦౦ |
| జంబూద్వీపము | ౧,౦౦,౦౦౦ |

## —♦ పా తా ళా దు లు. ♦—

| | | |
|---|---|---|
| అతలము | ౧౦,౦౦౦ | |
| వితలము | ౧౦,౦౦౦ | |
| సుతలము | ౧౦,౦౦౦ | |
| తలాతలము | ౧౦,౦౦౦ | ౭౦,౦౦౦ |
| మహాతలము | ౧౦,౦౦౦ | |
| రసాతలము | ౧౦,౦౦౦ | |
| పాతాళము | ౧౦,౦౦౦ | |

## —♦ న ర కా దు లు. ♦—

భూగర్భములో నొకభాగములోనున్నవి. ఇవి అసంఖ్యాకములులనగా దక్షిణదిశలో పితృలోకమునకు, యమపురికి క్రింద భూగర్భములోనున్నవి.

జలము

అగ్ని

జలం

బ్రహ్మాండాధారాష్టదిగ్గజములు (అష్టప్రకృతులు)

ఆదిశేషుడు (సంకర్షణస్వరూపరుద్రుడు వాయుస్వరూపుడు ౩౦,౦౦౦ వైశాల్యము

కూర్మము (ఆకాశస్వరూపము)

యజ్ఞవరాహము (పృథివీస్వరూపము)

ఆధారశక్తి (మూలప్రకృతి)

మరల ఆవరణములు (ఇదియొకబ్రహ్మాండము)

బ్రహ్మాండమంతయును ౫౦,౦౦,౦౦,౦౦౦ (ఏబదికోట్ల) యోజన విస్తీర్ణమని ప్రమాణములున్నవి. వాటిని విమర్శించి యిందులోగల సర్వభాగముల విస్తీర్ణములను దీసుకొని గణించి పై మొత్తములకు సరిపోవునా? లేదా? యని యోచింపవలెను. ఇందులో తీసుకొనవలసినవేవి? విడువవలసినవేవి? యని కొన్నిసందేహములున్నవి. లోకాలోక పర్వతమును దీసుకొనవలెనా? విడువవలెనా? యని మొత్తముపై నేబదికోటుల విస్తీర్ణమురావలెను. ప్రమాణములనుబట్టి విరుద్ధములుండవు. మనము తెలిసికొనకపోవడమే పొరపాటు. దానినింకను ఆలోచించి మనస్సునకు సంపూర్ణ

ముగఁ దెలిసినఁగాని సిద్ధాంతమునకురాఁగాదు. అవకాశము, ఆధారములు, సంపూర్ణముగా దొరకక విమర్శించివ్రాయనందుకు క్షమించవలెను.



# ఆ వ ర ణ ము లు.

శ్రీవాయుపురాణము - అధ్యా ౫౦

ఏతేసప్తకృతాలోకాః ఛత్రాకారావ్యవస్థితాః ।

శ్లో॥ స్వ్వైరావరణైః సూక్ష్మైర్ధార్యమాణాః పృథక్ పృథక్॥ ౮౦ ॥ దశభాగాధి కాభిశ్చ తాభిః ప్రకృతిభిర్బహిః । ధార్యమాణా విశేషైశ్చ సముత్పన్నైః పరస్పరం॥ ౮౧ ॥ అస్యాండస్య సమంతాచ్చ సన్నివిష్టో ఘనోదధిః । పృథివీమండలం కృత్స్నం ఘనతోయేన ధార్యతే॥ ౮౨ ॥ ఘనోదధి పరేణాథ ధార్యతే ఘనతేజసా । బాహ్యతోఘనతేజస్తు తిర్యగూర్ధ్వంతు మండలం॥ ౮౩ ॥ సమంతాద్ఘనవాతేన ధార్యమాణం ప్రతిష్ఠితం । ఘనవాతాత్తథాకాశ మహాకాశంచ మహాత్మనా॥ ౮౪॥ భూతాదినా, వృతంసర్వం భూతాదిర్మహతావృతః । వృతో మహాననం తేన ప్రధానే నావ్యయాత్మనా॥ ౮౫ ॥

శ్రీవాయుపురాణము - భువనవిన్యాసము. అధ్యా. ౪౯ - పుట. ౭౧.

కారణైః ప్రాకృతైస్తత్ర హ్యావృతం ప్రతిసప్తభిః॥ ౧౫౧ ॥ దశాధిక్యేన నచాన్యోన్యం ధారయంతి పరస్పరం । పరస్పరావృతా స్సర్వేఉత్పన్నాశ్చ పరస్పరాత్॥ ౧౫౨ ॥ అండస్యాస్య సమంతాత్తు సన్నివిష్టో ఘనోదధిః । సమంతాద్యేన తోయేన ధార్యమాణ స్తతిష్ఠతి॥ ౧౫౩॥ బాహ్యతో ఘనతోయస్య తిర్యగూర్ధ్వానుమండలం। ధార్యమాణం సమంతాత్తు తిష్ఠతే ఘనతేజసా॥ ౧౫౪॥ అయోగుడనిభోవహ్నిః సమంతాన్మండలాకృతిః । సమంతాద్ఘనవాతేన ధార్యమాణః సతిష్ఠతి । ఘనవాతస్తథాకాశ న్ధారయాణస్తు తిష్ఠతి॥ ౧౫౫ ॥ భూతాదిశ్చతదాకాశం భూతాద్యాం చావ్యసామహాన్ । మహావ్యాప్తో హ్యనంతేన అవ్యక్తేనతుధార్యతే॥ ౧౫౬ ॥ అనంతమపరివ్యక్తం దశధా సూక్ష్మమేవచ। అనంతమకృతాత్మానం మనాది నిధనం చతత్ ॥ ౧౫౭॥ - అతీత్య వరతో ఘోర మనాలంబ మనామయం । -

నైకయోజనసాహస్రం విప్రకృష్టం తమోవృతం॥ ౧౮ ॥ తమఏవనిరాలోక మమర్యాద మదేశికం। దేవానామస్యవిదితం వ్యవహార వివర్జితం॥ ౧౯ ॥ తమసోఽతేచ విఖ్యాతమాకాశాంతేచభాస్వరం। మర్యాదాయామ తస్తస్య శివస్యాయతనం మహత్॥ ౨౦ ॥ త్రిదశానా మగమ్యంతుస్థానం దివ్యమితి శ్రుతిః। మహాతోదేవదేవస్య మర్యాదాయాం వ్యవస్థితం॥ ౨౧ ॥

—♦ ఆ వ ర ణ ము లు ♦—

సప్తలోకంబులు ఛత్రాకారంబున నున్నవి. ఇయ్యవి వేరువేరుగా నొక్కొక్కటిసూక్ష్మమగు నిజావరణంబున నొప్పియుండును. పంచభూతమయము లైన యీ లోకము లొక్కొక్కటి దశాంశాధిక మైన యూర్ధ్వలోకంబులచే నావరింపఁబడి యాకర్షింపబడియున్నవి. పంచమహాభూతములుకూడ నిటులనేయున్నవి. మహత్తి పంచభూతముల నావరించి యాకర్షించియున్నది ఈ మహత్తునవ్యయుండగు ననంతు నావరించి యాకర్షించియున్నది. ఒక్కొక్కటి క్రిందివానికిఁ గారణభూతమై యున్నది. అనంతము సూక్ష్మమై యవ్యక్తమై దశభాగంబులుగనుండును. ఇది యనేక సహస్రయోజనవ్యాప్తితమావృతంబు దీనిపై నాత్మస్వరూపంబుతప్ప మరేమియు లేదు. ఈవిషయంబు పోతన, ......"లోకంబులు......తెగిన తుదిన లోకంబగు పెంజీఁకటికవ్వల నెవ్వండేకాకృతివెలుగు"నని భాగవతమున నష్టమస్కంధమున దెలిపియున్నాడు. ఇది కేవల జ్ఞానగోచరమయినది.

—o—

## బ్రహ్మాండముల అవిర్భావవిషయం.

శ్రీదేవీభాగవతం స్కంధం ౯ - అధ్యా. 3.

శ్రీనారాయణ ఉవాచ

అథడింభోజలే తిష్ఠన్యావద్వైబ్రహ్మణోవయః। తతస్సకాలే సహసాద్విధాభూతో బభూవహ॥ ౧ ॥ తన్మధ్యే శిశురేకశ్చ శతకోటి రవిప్రభవః। క్షణంరోరూయమాణశ్చస్తనాన్థః పీడితఃక్షుధా॥ ౨ ॥ పితృమాత్రా పరిత్యక్తో జలమధ్యే నిరాశ్రయః। బ్రహ్మాండాసఖ్యనాథో యోదదర్శోర్ధ్వమనాథవత్॥ 3 ॥ స్థూలాత్థూలతమసోఽపి నామ్నాదేవో మహావిరాట్। పరమాణుర్యథాసూక్ష్మ

త్వరస్థూన్సలాత్తథాప్యసౌ॥ ౪ ॥ తేజసాషోడశాంశోZయం కృష్ణస్యపరమాత్మనః। ఆధారస్సర్వ విశ్వానాం మహావిష్ణుశ్చప్రాకృతః॥ ౫ ॥ ప్రత్యేకం లోమకూపేషు విశ్వాని నిఖిలానిచ॥ అస్యాపితేషాం సంఖ్యాచ కృష్ణోవక్తుం నహిక్షమః॥ ౬ ॥ సంఖ్యా చేద్రజసామస్తి విశ్వానాం నకదాచన। బ్రహ్మవిష్ణు శివాదీనాం తథాసంఖ్యా నవిద్యతే। ౭ ॥

ఇదేవిధముగనే బ్రహ్మవైవర్త పురాణములో ౭౬౨ పుటలోనున్నది.

—o—

శ్రీమద్దేవీభాగవతము. స్కంధం. ౯ - అధ్యా 3.

ప్రతివిశ్వేషు సంత్యేవం బ్రహ్మవిష్ణు శివాదయః పాతాళాద్బ్రహ్మలోకాంతం బ్రహ్మాండం పరికీర్తితం॥ ౮ ॥ అతఊర్ధ్వంచ వైకుంఠో బ్రహ్మాండాద్బహిరేవసః। తతఊర్ధ్వంచ గోలోకః పంచాశత్కోటియోజనః॥ ౯ ॥ నిత్యస్సత్య స్వరూపశ్చ యథాకృష్ణస్తథాప్యయం। సప్తద్వీప మితాపృథ్వీ సప్తసాగరసంయుతా॥ ౧౦ ॥ ఊనపంచాశచ్చద్వీప సంఖ్యాశైల వనాన్వితా। ఊర్ధ్వంసప్తస్వర్గలోకా బ్రహ్మలోక సమన్వితాః॥ ౧౧ ॥ పాతాళానిచసప్తాథశ్చైవం బ్రహ్మాండమేవచ। ఊర్ధ్వంధరాయా భూర్లోకోభువర్లోకస్తతఃపరం॥ ౧౨ ॥ తతఃపరశ్చస్వర్లోకో జనలోకస్తథాపరః। తపఃపరస్తపోలోక స్సత్యలోకస్తతః పరః॥ ౧౩ ॥ తతఃపరం బ్రహ్మలోకస్తప్తకాంచనసన్నిభః। ఏవంసర్వం కృత్రిమంచ బాహ్యాభ్యంతరమేవచ॥ ౧౪ ॥ తద్వినాశే వినాశశ్చ సర్వేషామేవ నారద। జలబుద్బుదవత్సర్వం విశ్వసంఘ మనిత్యకం॥ ౧౫ నిత్యౌగోలోక వైకుంఠౌ ప్రోక్తౌ శశ్వదకృత్రిమౌ। ప్రత్యేకం లోమకూపేషు బ్రహ్మాణ్డం పరినిశ్చితం॥ ౧౬ ॥ ఏషాంసంఖ్యాం నజానాతి కృష్ణోZన్యస్యాపికాకథా। ప్రత్యేకం ప్రతిబ్రహ్మాండం బ్రహ్మవిష్ణు శివాదయః॥ ౧౭ ॥

—♦ బ్రహ్మాండముల వివరము. ♦—

బాల రూపముతో దైవయోగముచే మహాజలమందు కార్యవిరాడ్బ్రహ్మగా ప్రణవాక్షర రూపమాత్రుడై ఆవిర్భవించి అనంతకాలము బాలరూపముతో యోగయుక్తుడై యుండగా ఆకస్మికముగ ద్యావాభూములు ద్వివిధములుగ స్ఫురించెను. ఈలాగున రెండువిధములుగ స్ఫురించిన తనప్రతిబింబ భూతశిశువు తనకంటె వేరైనట్టుగను, ఆకలిచే పీడింపబడుచున్నట్టుగను క్షణకాలమేడ్చుచున్నట్టుగను, తనసంకల్పముతో తనలో తోచుచుండెను. "ఉపనిషత్తులో" "అహమన్న మహమన్న

మహామన్నాదోహమన్నాదః"యని యున్నది. దేవీపురాణములో సర్వసంహారా నంతరము పరాప్రకృతి (శక్తి) త్రిమూర్తులను, త్రిశక్తులను, త్రివిధఅండములం దు జేర్చి తనయొడిలో నుంచుకొని సర్వసంహారానంతరము నీమూడండములనుబయట దీసినవెనుక అవియింటగా నవిపగిలి నొకయండమందు బ్రహ్మయు, లక్ష్మీదేవియును, మరొక అండమందు విష్ణువు గౌరీదేవియును, మరొకఅండమున రుద్రుడు సరస్వతీదేవి యును; బయటికిరాగా మరలవానిచ్చక్తి లక్ష్మికి విష్ణువును, బ్రహ్మకు సరస్వతిని, రుద్రునకు గౌరీదేవిని జతపరచి లోకసృష్టినిఁ జేయుమని ఆజ్ఞాపించెను. అందరి కంటెఁదన కళలను శక్తిని నెక్కువగా నీగౌరీదేవియందు మాత్రము గలుగజేసి అంత ర్ధానమొందెను అందుచేత పార్వతీపరమేశ్వరులాదిదంపతులైరి ఇందుకు శ్రుతి ప్రమాణము. "త్రివృద్వైశ్వం। మాతాపితా పుత్రః। త్రివృత్ప్రజనం। ఉపస్థో యోనిర్మధ్యమా।" అనియున్నది. ఇట్లావిర్భవించి మాతాపితరులచేవిడువబడి జలను సందాడింభకుడు దీర్ఘాలోచనతో నీఅనంత బ్రహ్మాండముల నాయకుడెవడని యూర్ధ్వ దృష్టితో యనాథునివలె దిక్కు తెలియక తపించుచుండెను.

ఇట్లుండఁ గొంతకాలమున కాశిశువు మహత్తుకంటె మహదాకార శరీరము గలిగి విరాట్టనుపేరుగలవాఁడయ్యెను. ఇయ్యది వృక్షబీజన్యాయము. ఒకస్థూల మునుండి అతిసూక్ష్మముగు పరమాణువుగలిగి మరల ప్రత్యేకప్రకాశ పరమాణు వుల సంయోగముతో పరిణామమును జెందినవిధానముపలెఁనని యర్థము. ఈబాలుడు గోలోకనాథుడును, పరమాత్మరూపుడునగు కృష్ణపరమాత్మయందలి షోడశాంశకళ తో తేజోరూపుడై విశ్వాధారుడును ప్రకృతిబద్ధుడుగ విశ్వమయు విష్ణువేయగుచు న్నాడు. ఈ శిశువునకుగూడ ప్రతిరోమకూపములందు ప్రత్యేకముగ అఖిలవిశ్వ రూపములున్నవి. కాని స్వరూపజ్ఞానముగలిగినగాని నివియగుపించవు. అర్జునునికి విశ్వరూపసందర్శనమెటుల దివ్యచక్షువు నిచ్చువరకు గలుగలేదో యటులనే తలం చవలెను. కాబట్టి విశ్వములన్నియును అవ్యక్తములుగనే యున్నవగును. దివ్య జ్ఞానముతో నన్నియును గలుగును. పరమాణువులనైనను లెక్కజేయవచ్చునుగాని యీశిశువు రోమకూపములందుగల విశ్వములనులెక్కింప శక్యములుగానివై యున్నవి. ఇకత్రిమూర్తుల విషయమాలోచనే లేదు. ఇదేప్రమాణమే బ్రహ్మవైవర్తపురాణ మందునుగలదు. ఈలాగుననే ప్రతివిశ్వజీవులయందును త్రిమూర్తు లనంతసంఖ్య లుగ త్రిగుణములతో నున్నారనియే చెప్పవలెను. బ్రహ్మాండమున పాతాళము మొదలు కొని బ్రహ్మలోకమువరకని చెప్పబడెను. దీనికుపరిలో బహిర్భాగమందు దీనికి

గారణముగ వైకుంఠముగలదు. దీనికంటె బహిర్భాగములో నూర్ధ్వమున గోలోకమును దమపరిభాగములో శివలోకము పరాశక్తిలోకములుగూడనున్నవి. గోశబ్దమునకుఁ బదునాలుగర్థములు. అచ్చటపదునాలుగు లోకాదులుగూడనున్నవి. గోలోకము గాయత్రిలోకమనియుఁ జెప్పబడును. ఇదియు పంచాశత్కోటియోజన విస్తీర్ణమై సప్తసాగర ద్వీపాదులతో గుణభేదతారతమ్యములుగలదై యుండును. స్వరూపజ్ఞానము గలుగునంతవరకు నీలాగుననే కల్పితములుగా నుండుననికూడ దలంచవలెను.

మరొకవిధముతో గోలోకము ఊనపంచాశత్కోటి యోజనమనికూడ జెప్పబడుచున్నది. దీనిపైభాగమందు వాస్తవబ్రహ్మలోకములగు వేదు స్వర్గలోకముతో ప్రకాశించునదే గోలోకమని విశేషించి చెప్పఁబడియున్నది. అది హాంతముగా ఊనపంచాశన్మాత్రాక్షర విశేషము. సూత్రము:- "ఆదిరంత్యేనసహేతా" అనెడి శాబ్దికాక్షర ప్రత్యాహార నియముచే ఏకపంచాశత్కోటికాక్షాంతముగా విభిన్నస్వరూపములుగల అక్షరప్రత్యాహారమువలె అభిన్నస్వర్గస్వరూపముగ మంత్రయోగ మర్యాదచే సిద్ధించునదే గోలోకమని యంతరార్థము. ఈలాగున గోభూమి మొదలుగ నేడవదియగు సత్యలోకమున కూర్ధ్వమందు సువర్ణాక్షరములతోఁ బ్రకాశించుచున్న వేదబ్రహ్మలోకముగలదని ప్రమాణములున్నవి. ఈలాగున స్వరూపసాక్షాత్కారమగునంతవరకు తనయందేవిధముగ అభిమానాధిక్యతగా నుండునో అదే ఉత్తరోత్తర కేంద్ర ప్రధానలోకముగ నగపడుచుండుట సహజముగా కల్పితములుగానుండును. అంతవరకు నివి సత్యములుగనే తోచి స్వస్వరూప సాక్షాత్కారమైన వెనుక మిథ్యలుగాదోచును.

అట్టిగోలోక భూమితో సహాసప్తలోకాదుల వినాశము సర్వలోకవినాశనమునకు మూలమగును. ఇదియవిష్ణుకల్పమగును. కల్పాదియందు గలిగినజలములో బ్రహ్మాండములు జలబుద్బుదములవలెనుండి యనిత్యములైయుండును. మనుజుడు కర్మోపాసనాది వైదిక శాస్త్రీయ విధివిహితాచార యుక్తుడై నిష్కాముడై యున్నచో నెప్పటికైనను తప్పక ఈలోకముచేరి తుదకు ధన్యుడగును. ఇతరమార్గముల సర్వదా బద్ధుడగును.

దీనిననుసరించి శారీరక సంస్కారములగు కర్మసంస్కారములు చత్వారింశతిగాని, పంచదశసంస్కారములుగాని, తరువాత జ్ఞానసంస్కారములుగాని చేయుటే గోశబ్దార్థరహస్యము. కేశశబ్ద విశ్వవిరాట్ హిరణ్యగర్భాదులగు జీవేశ్వరులు

వ్యోమకేశ శబ్దముతో శ్రీరుద్రునకుం జెప్పంబడియున్నారు. అందుచేత మహేశ్వరుని రోమకూపములందు కూడ బ్రహ్మాండములిమిడియున్నవనే భావన ప్రధానమైనది. దీనిచేతనే గోవుయొక్క రోమములను వ్రాలునట్లుగా జేయగూడదని పెద్దలుజెప్పుదురు. అందువలన గోవుచాలాపూజనీయము. సర్వబ్రహ్మాండములకు నిలయస్వరూపము. గోప్రదక్షిణముతో సర్వబ్రహ్మాండముల ప్రదక్షిణ సమస్కార ఫలము, గోదానముతో అనంతపుణ్యఫలముగలిగి గోలోకప్రాప్తియు గలుగునని ప్రమాణములున్నవి. ధేనువు భూస్వరూపమనియు భూరాది సర్వలోక స్వరూపమని తెలియవలెను. ఉపనిషత్తులో నారాయణమునందు "భూమిర్ధేనుర్ధరణీ లోకధారిణీ" అనియున్నది.

భాగవతములో పృథుచక్రవర్తికథలో నిందుకుసంబంధించిన అంతరార్థమున్నది. గోరూపధారిణియగు భూమియందు ఓషధులను పిదుకుటయను చరిత్రమునుగురించి సూక్ష్మార్థములు దీనికిసంబంధించినదిగ నున్నది.



## బ్రహ్మాండములోని అంతర్విభాగములు.

ఈబ్రహ్మాండములో మూడుభాగములు ముఖ్యములైయున్నవి. మనమున్న భూలోకము, మనక్రిందగల పాతాళాదులన్నియుచేరి యొకభాగము. ఇదే బ్రహ్మాండమునకు క్రిందిభాగము. మనకు పైనగల భువర్లోకమగు యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుషాది రాక్షసలోకమంతయును జేరినది అంతరిక్షము. దీనిపైన స్వర్గలోకము ధ్రువమండలము వఱకును నొకభాగముగ మధ్యభాగము, రెండవభాగము దీనిపైన చుట్టుఆవరించి తమోరూపముతో మహదాకార పర్వతరూపముగను ఎల్లగను లోకాలోక పర్వతమావరించియున్నది. దీనికిపైన మహర్లోకాదిగ జనలోకము, తపోలోకము, సత్యలోకముచే మూడవభాగముగ నున్నదగును. ఇది సత్వగుణలోకము, రెండవది రజోగుణలోకము, మూడవది తమోగుణప్రధాన లోకము. ఈ లోకగుణానుసారముగ నాయాలోకములు లోకస్థులు, వారిఆహారాది వ్యవహారములు స్వభావములుగ నుండును. పైభాగము సత్వగుణలోకాదులు బ్రహ్మలోకాదులుగను నిచ్చటివారలు కేవలధ్యానతపో యోగాదులతోను సమాధి

నిశ్చలతతోను జలాన్నాది వర్జితులును, కేవల వాయుప్రధానాహారాది వ్యవహార భూత దేహులుగను, సూక్ష్మశరీరులుగను, జితేంద్రియులుగను, ఊర్ధ్వరేతస్కులుగను గార్హస్థ్యధర్మ వర్జితులుగను బ్రహ్మచర్యులుగను బ్రహ్మనిష్ఠులుగ నుందురు. ఈలోకములో మనువులుతప్ప మరెవ్వరెను గృహస్థధర్మమునుస్వీకరించరైరి. ఈ మనువులు వంశములకును సంతానములకును గ్రిందిలోకాదుల నాశ్రయించిరి. దేవతలు లోకనాథులైరి కాబట్టి వీరిఆయువులు బ్రహ్మయువులోజేరి మనకంటే అపరిమిత దివ్యయుగముల సంఖ్యలతో పరమాయువుగ గణింపబడియె. పైలోకములు బ్రహ్మలోకాదులైనందుచేత బ్రహ్మగణాది సంబంధ సంపత్తితో చేరినవారలైరి, ఈలోకాదులలో, క్రిందిలోకాదులలోగలిగినటువంటి చరిత్రలు అవతారములు నితరవ్యవహారములును రాగద్వేషాద్యాస్పదములు లేనివారలుగ నున్నారు. వీరలు సత్త్వగుణ ప్రధానలోక ధర్ములు.

రెండవభాగమగు స్వర్గలోకము రజోగుణప్రధానలోకము సర్వవ్యవహారములును రజోగుణానుసారముగ నుండును. ఇది దేవతాగణములకు నిలయము. ఇది తేజోలోకభూమి. వీరిఆహారాదులు కేవల తేజస్సంబంధ రసస్వరూపము. ఈ పానముతో సర్వపదార్థస్వరూపసార తృప్తికంటె నతిశయించిన అమృతస్వరూపముతో వీరికి తృప్తిసంభవించుచున్నది. దీనికిఁదోడుగ దివ్యగంగయున్నది కాబట్టి వీరు జరామరణములును నిద్రాదులును, వలీ పలితాదులును స్వేదదుర్గంధాదులును మనలోకములోవలె లేక మనకంటె అత్యుత్తమస్థితిలో సర్వవిషయాగాలందు నధిక సంతృప్తిగలవారైరి. వీరి ఆయువులు మనకంటె దీర్ఘములు. వీరలకాలమానము మనవలె శీఘ్రగమనముగ నుండదు. మనసంవత్సరము వారలకొకదినముగ గణన జేయువలసియుండును. మనవలె కృషివాణిజ్య వ్యవహారాది వ్యాపారములు లేవు. మనకీదేవతల సంబంధము లెటుల ప్రీతివిషయాదులనున్నవో వీరలకు త్రిమూర్తులసంబంధము ప్రీతివిషయాదులందధికములుగ నుండును. ఈలోకములో కొందరు ఋషులున్నారు. వీరలు జితేంద్రియులు. ఊర్ధ్వరేతస్కులు, ఉత్తరోత్తర బ్రహ్మలోజేరి ముక్తులుగా దగినవారలు. వీరలీలోకములో ధ్రువమండల సమీపస్థులుగాగల స్థానములోనున్నారు. మిగతవారలందరు వివాహాదులతో స్త్రీసంబంధములుగలిగి సంతానవంతులై పై బ్రహ్మలోకాదులకంటే రజోగుణముతో నతిశయించినవారలైరి. పైలోకము కేవల మనువులకుమాత్రమేయుండినది. ఈలోకములో క్రమముగ నతిశయించెను. అనగా ఉత్తమసత్త్వలోకములో సృష్టికిగార

ణముగ కేవల మనువులకును నీలోకములో రజోగుణవ్యాప్తితో దేవతలకును మన తమోలోకములోనికి వచ్చునప్పటికి సర్వులకు గుణాదులతిశయవ్యాప్తినిగాంచెను. అన్నిలోకములలోను విరక్తివైరాగ్య విజ్ఞానసంపత్తిగాగల మహర్షులును కామాపేక్ష గల పత్నీవంతులునున్నారు. ఊర్ధ్వలోకములో సత్వగుణముతో మహర్షులు జ్ఞానులు బ్రహ్మనిష్ఠులధికముగను రజోగుణస్వర్గములో మధ్యమముగను మనలోకములో నత్యల్పముగనున్నారని దెలియవలెను. ఈగుణత్రయములు విరాడ్దేహసంబంధ బ్రహ్మాండములోనివిగ దెలియవలెను. ప్రతిలోకములోను నీగుణత్రయాదులు త్రివృత్కరణములో నుండును. ఈ విమర్శనను సమష్టివిరాడ్దేహసంబంధ బ్రహ్మాండవిమర్శనముగా భావించవలెను. ఈ రజోగుణ లోకములో గొందరు ఋషులు సహధర్మచారిణీయుతులై ఉత్తమాశ్రమ వేదకర్మలతో ముక్తిసాధన యజ్ఞయాగాదులతో తపోయోగాద్యుత్తమ మార్గానువర్తులై ముందు బ్రహ్మలోకాది ప్రాప్తికాములుగ నున్నవారలు. ఇటులనే దేవతలలోను గొందరిని గణించవలెను. కొందఱు కేవల కామముతో నధోముఖలోకాదులను జేరినవారలైరి. ఇటులనే మనలోకములోను కొందఱు ఊర్ధ్వలోకానువర్తన ప్రాప్తకర్మానుష్ఠాతలుగను కొందఱుమరల నిదే లోక ప్రాప్తిగలవారలుగను గుణాదుల ననుసరించిన వారలుగ నున్నారని దెలియవలెను. క్రమగతముతో క్రిందికి తమోగుణాతిశయ మధికముగను ఊర్ధ్వములో సత్వగుణాతిశయ మధికముగనుండును. గుణభేదములతో లోకభేదములుగను లోకస్థులున్నారు.

ఇందుకుదాహరణము. మనలోకములోగల రాజ్యములో ఉత్తమాధికార వర్గసంబంధరాష్ట్రములుగలవారికిని రాజులుండు ప్రదేశములవారికిని చక్రవర్తులుండు పట్టణనివాసులగువారికినిగల సంబంధసుఖాదులవలె నీబ్రహ్మాండములో క్రిందిలోకములవారికినీ దారతమ్యములుండును. ఈప్రకారము మన తమోగుణప్రధాన భూలోకమునకు వచ్చునప్పటికి పైయుత్తమలోకాదులందరాని దూరములైయుండుట చేత ఉత్తమసంబంధములన్నియును దూరములాయెను. సంతతుల సంతానములతిశయించెను. ప్రతియొక్కరు మనువులైరి. ప్రజాపతులైరి. ఉత్తమాశ్రమ ధర్మములు వైరాగ్యములు జితేంద్రియత్వములు ఊర్ధ్వరేతస్కులు బ్రహ్మనిష్ఠులు చాలా అరుదుగా దాగియుండవలసివచ్చెను. ధర్మములన్నియు ఆక్షేపణీయములాయెను. ఇదియు శాశ్వతముగాదు. మనకు మనలోకమునకు ప్రకృతిసంబంధ విషయాదులెక్కువ. నిరంతరసంబంధవ్యామోహిత విస్తారములుగలిగెను. వేదమా

ర్గములతిదూరము జేరెను. తమోగుణప్రాధాన్యతయు అధోలోకమగుటయు నిత టికిగారణము. ఈ లోకముతో సాత్వికాంశసంబంధ సంపదాదులు కేవల తీవ్రేచ్ఛా ప్రయత్నబలముతో గలుగవలసినవే గాని సామాన్యముగ పైలోకాదలవలె లభించుట కష్టతరము. ఆహారాది వ్యవహారముల సంపాదనకే కాలప్రాముఖ్యతగన్నట్టి భాగమిది. కాబట్టి నీయంశభాగములో సత్త్వాదిగుణ సంపత్తిగల పురుషులు అరుదుగానుందురు. అందుచేత క్షణకాలతపోయోగ ధ్యానాదులతో నీతమస్సంబంధాధోలోకము త్వరలోవిముక్తమై ఊర్ధ్వలోకాదుల ప్రాప్తిగలిగి యచ్చటిదీర్ఘకాలప్రాప్తితో నిధ్యానాదియోగాదుల కెక్కువగా నవకాశములుగలిగి తదనంతరము సాయుజ్యము సులభముగా లభించును. ఇది ప్రథమకర్మాంగ ప్రధానకర్మలోకము. దీనిఫలముతో ఊర్ధ్వాదిలోక సంప్రాప్తిగలుగును. ఊర్ధ్వాదిలోకాములలో నీలోకములోవలె భంగములు లేక విరామముతో ననుకూల పరిస్థితులుగలిగి నిరంతరయోగులుగానుండుట కవకాశములు గలుగును. ఎవరైనను మొదట కష్టముతో సంపాదించిన ధనముతో తర్వాత సుఖింతురు. ఇదియునట్లే. ధనమున్నవారీలోకములో నెచ్చటనున్నను ఎట్లుసుఖింపగలరో అటులనే ధ్యానాదితపోయోగాది ధనసంపత్తితో పైలోకాదులందెచ్చటనున్నను పుణ్యపురుషుడై యోగాదిసంపత్తులతో సంపూర్ణానందుడై ముక్తుడగును. ఈలాగు నీసమష్టి బ్రహ్మాండములోని భాగాదులున్నవి. దీనికి పైన మరల స్వరాడ్బ్రహ్మాండములో దీనికిపైన ఆవరణములుగ శ్రీమహావిష్ణ్వంశావరణముగను దీనికిపైన శ్రీమహాసదాశివాంశావరణముగను దానిపైన కేవల శుద్ధజ్ఞానావరణ ప్రకాశముతో సంపూర్ణావచ్ఛిన్నాత్మ స్వరూపమే. ఈ బ్రహ్మాండము సమష్టి విరాడ్వ్యష్టితో స్థూలముగను దీనికిపైవి సూక్ష్మకారణములుగనుండును. ఇదేవిధముగనే నీస్థూలబ్రహ్మాండములో మరల త్రివిధగుణయుక్తముతోను మరల నిందులో ప్రతిపిండాండములో త్రివిధగుణసంపత్తిగా బ్రతి జీవియందును త్రివిధగుణ సంపత్తితో దప్పకయున్నది. ఈ విధముగ దెలసి మనశరీరములో నేదియూర్ధ్వలోకమగునో యది నిరంతర ధ్యానయోగాది తపస్సాధనాంశమగును. అధోలోకభాగము నిరంతరాహారాది గుణసంపత్తి కర్మాంగభాగమగును మధ్యభాగము దేవతల లోకమగు స్వర్గలోకమగును. అందుచేత ఊర్ధ్వలోకభాగమగు శిరస్సు సర్వప్రధానసాత్వికాంశముగ నున్నది. ఇదిహృదయమాదిగ స్వర్గలోకాంశభాగముగను భ్రూమధ్యను డి సహస్రాంతము బ్రహ్మలోకాదులుగనున్నవి. ఇది తెలిసి యోగయుక్తుండు అభ్యాసియుగావలయు. ఈవ్యష్టిపిండ దేహ మార్గావలంబనముతో

పిండ దేహపాతానంతరము లోపల సూక్ష్మశరీరముతో సమష్టివిరాడ్బ్రహ్మాండ ములో సూక్ష్మతైజస దేహముతో తేజోలోకమగు స్వర్గప్రాప్తి గలిగి మరల నచ్చట తేజస దేహానంతరము మనదేహములోగల కారణదేహ సమాధియోగాంశముతోను స్వర్గలోకాంశ తేజస్సుతో నుభయసంబంధముతో బ్రహ్మలోకాదుల సంప్రాప్తి గలిగి నీదేహములో కారణదేహ సహస్రారభాగములో సమాధ్యంశతో నీవాసనా బలముతో బ్రహ్మలోక ప్రాప్తిగలిగి యచ్చట సమాధియోగానందముతో నీగుణ త్రయ సంబంధ దేహములులేక జ్ఞానముతో స్వస్వరూప ప్రాప్తిగాగల ముక్తులమ గుదుము. కనుక మొదట మనమీలోకములోనుండి క్రమముగా ఊర్ధ్వాది లోకాంత రగమనప్రాప్తకాములై తుదకు నిరాలోకముగలిగి స్వస్వరూపులగుదుము. దీనికే నిర్వాణమనియు పర్యాయపదము. ప్రారంభములో పై లోకాదుల అంశాంశగాగల నీవ్యష్టిదేహములో స్థానముగలిగి నీవాసనలతో సమష్టిలోజేరి తుదకు ముక్తులగు దుము. మొదటనీదేహములో నీసర్వసంపత్తి గలిగించుకొని నిశ్చయులమై నిరంత రాభ్యాసులమయినఁజాలును. అవల నేమార్గముతోనైన గ్రమముగా నీయోగసా ధనబలముతో క్రమముగా తప్పక ముక్తులగుదుము. ఎక్కువవిచారమేల? ఈశ్వ రుఁడయుండు సర్వభారమున్నదిగాన తప్పక ఆయనచేసితీరును. సందేహమువలదు. ప్రారంభకర్తృత్వము జీవునిది. ఈకర్తృత్వానంతరము ఈశ్వరునికర్తవ్యము తప్పని దిగా నగును. మనవలెనె ఆయన సిద్ధముగానున్నాడు. ఉభయులకును సర్వదా సర్వసంబంధములున్నవి. ఒకరుప్రారంభించిచేసినచో మరొకరు తప్పక జేసితీరు దురు. దీనికే యోగమనిపేరు. గీతలో నీయోగమునే విపులముగా వివరించిరి. సాధనమిదియే అనుభవమిదే. ఒకయోగముతో సర్వదా యన్నియోగములకు సంబంధములుగలిగి వ్యష్టిగతదేహమునుండి సమష్టీశ్వర విరాడ్దేహమందు జేర్చును, యోగమున కమితవీర్యబలమున్నది. యోగయుక్తులము కావలెను. యోగమును వర్ణింపజాలము. అనుభవముతో సాధనముతో దెలియవలెను.

—o—

# బ్రహ్మాండమునకు పిండాండమునకుగల సంబంధము.

---

బ్రహ్మాండమనఁగా సర్వలోకములతోఁ జేరిన సమష్టిరూప బ్రహ్మాండాకార ముగాఁగలది. దీనినే సమష్టీశ్వర దేహమని చెప్పుదురు. ఇందులో సూక్ష్మరూప సర్వాంశములతోఁ జేరి ప్రత్యేకించి అణ్వంశగానున్నదే పిండాండ జీవులదేహము. వీటిని క్షేత్రములనియందురు. ఇవి మూఁడువిధముల ఉత్తమ, మధ్యమ, కనిష్ఠము లుగను, సత్వరజస్తమోగుణములుగను స్థూల సూక్ష్మకారణములుగను దేహము లో శిరస్సు హృదయము ఉదరమాదిగ అధోభాగముగను దెలియవలెను. బ్రహ్మాండములో బ్రహ్మలోకాదులగు మహర్లోక జనోలోక తపోలోక సత్యలోకాదులు శిరస్సుగను నుండును. శింశుమారము సువర్లోకమునకు దేజోలోకమనియు ద్యులోకమనియు స్వర్గలోకమనియు జ్యోతిర్లోకమనియు నామాంతరములుకలవు. ఇది హృదయమువంటిది. అంతరిక్షమాదిగ భూలోకము పాతాళాదులు మనలో ఉదర మాదిగ పాద పర్యంతముగ సమన్వయింపవలెను, ఉదరభాగమగు భూలోకము కర్మాంగలోకమనియు, హృదయమగు సువర్లోకము (శింశుమారము) భక్తిజ్ఞాన తపోయోగాదులకు నిలయస్థానమనియు, శిరస్సు జ్ఞానలోకమనియు బ్రహ్మకు స్థాన ముగాఁగలదియనియు అంతరములో నీలాగున దెలియవలెను. ఇందులకు శ్రీపురుష సూక్తమే ప్రమాణము. శ్రీపురుషసూక్తము విశ్వవిరాణ్ణ్యాసముగ నిరంతరము మనకు ఉపాసనాధ్యయన సృష్టిన్యాసములుగను సర్వకర్మలందు ముఖ్యముగనున్నది. శ్రీరుద్రము ఉపసంహారముగ నమస్తేఅనుపదముతో లీనమార్గముతో శాంతిస్వరూప బోధగ నిరంతర మధ్యయన యోగ్యమాయెను. వీటినే ప్రధానములుగ సర్వత్ర ముఖ్యవేదముగ గ్రహించుచున్నాము.

ఈ భావములతో విరాడ్యోగముతో నీజీవదేహమునుండి చాలించుకొని వెళ్లగానే ఈశ్వర దేహమగు బ్రహ్మాండములోఁ జేరి అచ్చట, నెక్కువకాల మధిక సుఖానందముతో నుండఁగలిగినవే ఊర్ధ్వలోకాదులు. అయ్యావత్యుత్తమములైన పుణ్యలోకములు కేవల దేహబుద్ధితో నీలోకవాసనలుగనే చేసినయెడల మరల వాస నానుసార మాలోకముననే జనింతుము. ఈ లోకము సామాన్యమనుష్యలోకా ల్పానందమైనది. కేవల మీశ్వరార్పణబుద్ధితో జ్ఞానముతోఁ జేసిన ఆత్మస్వస్వరూ పానందమును బొందుదుము. ఉత్తమమార్గము ననుసరించుట మేలు. మనవేద ములయొక్క ఆధిక్యత ఈలాగుననున్నది. సమష్టివిరాడ్దేహములో విరాట్టు హిర

న్యాగర్భావ్యాకృత దేహముల ననుసరించి మనవ్యష్టిదేహములో విశ్వతైజస ప్రాజ్ఞ దేహములున్నవి. వీటికనుగుణ్యములుగనే బ్రహ్మాండములో త్రివిధలోకములున్నవి. ఈదేహములే స్థూల సూక్ష్మ కారణములుగను, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలుగ మనఅనుభవములోనున్నవి. ఇవి ఆవరణములుగ నుండుటచేత ఒకదేహమునుండి మరొకదేహమునకుఁ బోవుచువచ్చుచున్నాము. ఇటులనే బ్రహ్మాండములోను సీలోకమునుండి ఉపరిలోకాదులను బున్యాకర్మలతోఁ బొందునవకాశములున్నవి. మనస్సుతో నిశ్చయముతో సర్వసంబంధములున్నవి. ఈలోకములో మనముచేయు కార్యములన్నియును మొదట మనోనిశ్చయముతోనే మరలనవి స్థూలరూపానుభవములైయున్నవి. ఊర్ధ్వలోకాదులేరూప గుణాదులతోనున్నవో ఆయారూపగుణదేహాదులనుబొంది యనుభవించవలెను. స్థూలదేహముతో స్థూలలోకానుభవమే కలుగును. కాని తదివర లోకాదులెట్లనుభూతములగును. స్థూలదేహావరణము దేహత్యాగముతో వెంటనే సూక్ష్మదేహావరణమేర్పడి సూక్ష్మలోకానుభవముకలుగును. మనకు నీదేహత్రయాదులు ప్రత్యక్షానుభవములే. వీటికి స్థూలదేహసంబంధ బంధ మెక్కువగానుండుటచేత నితరదేహసుఖములు వాసనలుగ సూక్ష్మకాలావస్థతో నున్నవేగాని దీర్ఘకాలవ్యవధిలేనివిగా నున్నవి. మనకు నేదేహసంబంధ మధికముగానుండునో ఆదేహసంబంధ మధికానుభవములు కడపటివిగానుండును. మిగిలిన దేహసంబంధములు వాసనలుగనుండును. మనము మొదట యేసమష్టి బ్రహ్మాండములోనుండి మరల మధ్యలో నీజీవస్థూలదేహములో ప్రవేశించితిమో మరల దేహత్యాగానంతరము మరల బ్రహ్మాండములోనేచేరి మనస్వకర్మల ననుసరించిన లోకాదులలో కొంతకాలముందుము. ఏలనన మనకు స్థూలదేహ వాసనా బలమధికముగ నున్నందుచేత కర్మలఫలానుభవానంతరము మరల వాసనాబలముతో నీస్థూలమునకే లాగును. ఇదిమనస్సుయొక్క సంకల్పప్రభావము. మనస్సంకల్పప్రభావముననుసరించి యన్నియు సుఖదుఃఖాదు లనుసరించినవై తప్పకనిశ్చయములైయున్నవి. ఉపరిలోకాదులు లేవని నిశ్చయించినవారికి ఉపరిలోకాదులు బ్రహ్మాండమునకు బిండాండమునకుగల సంబంధములులేవు. తత్ఫలానుభవములులేవు. ఈ లోకానుభవమే శాశ్వతముగనేయుండును. ఎవరికేమిప్రమాదమునిన ఈలోకములో సుఖాదులు పదవులు దేశములెట్లు ఒకదానికొకటి అధికతారతమ్యములుగ నున్నవో అటులనే లోకాదులున్నవి. మనకుఁజూడ ఉపరిలోకాదులు ప్రత్యక్షముగ గనుపించుచునేయున్నవి. స్వర్గలోకమనిన సర్వమతములవారును ఊర్ధ్వమునకే

చూతురు. అచ్చట తేజోరూపములతో సూర్యచంద్రాదులు నక్షత్రములు సర్వమును నిరంతరము మనముచూచుచునేయున్నాము. లోకమే లేదనినచో నివియెట్లు నిలుచును? లోకనతో లోకములగుచు. మనముందు వెనుకలవారలు సర్వలోకనక్షత్రరూపములను ననేకయుగానంతర దివ్యసంవత్సరము లాయువుతో నున్నవారలను జూచుచున్నాము. సర్వవిధముల మనలోకమునకంటె అత్యధిక సుఖములతో సర్వవిషయాదులందున్నవి. పాశ్చాత్యులుసహితము లోకాంతరగమన ప్రయత్నమును జేయుచుండుటను వినుచున్నాము. మనస్సుతో సర్వసృష్టి సర్వప్రపంచము, సర్వలోకాదులున్నవి. మనస్సేలేనిచో నేమియునులేవని చెప్పినను కొంతవఱకు సమాధానమగును. మనోరూపమే క్షేత్రము మనస్సులో సర్వము ఆలోచనగాఁ గలిగినవెనుకనే పరిణామములో ప్రత్యక్షములగును. మనస్సులోఁ బొత్తిగా లేకున్న ప్రత్యక్షమున కవకాశమే లేదు. ఈలాగున వ్యష్టిపిండదేహమునుండి బ్రహ్మాండ సమష్టి విరాడ్దేహములోను నీదేహమునుండి మరల జీవదేహములోను బంధితులమై నిరంతరము తిరుగుచుందుము. కేవలజ్ఞానముతో నీబ్రహ్మాండావరణమునుదాటి నీ విరాడ్బ్రహ్మతో సహముక్తులగుదుము. "తేబ్రహ్మలోకేతు పరాంతకాలేపరామృతాత్పరిముచ్యంతిసర్వే" అని ఉపనిషత్ప్రమాణమున్నది. బ్రహ్మాండమునకు పిండాండమునకు నీలాగున దప్పని సంబంధము లెడ తెగనివిగనున్నవి. మనసమష్టి జీవదేహములో నెట్లు త్రివిధ దేహములఁ బొందుచున్నామో అటులనే దేహపాతానంతరము బ్రహ్మాండములోను దప్పకపొందుచున్నాము. దేహము క్షేత్రమే. బ్రహ్మాండము క్షేత్రమే. బ్రహ్మాండములోనే సృష్టిస్థితిలయాదులుగ నున్నవి. ఈ లోకములో కృషి వాణిజ్య వ్యాపార వ్యవహారాది కర్మలతో నెట్లు సుఖమును బొందుచున్నామో అటులనే ఈలోకములోఁ జేసిన సాత్విక కర్మలతో దపోయోగాదులతో, యజ్ఞాదులతో దానధర్మములతో అతిశయించిన సుఖానందముతో దీర్ఘకాలవ్యవధి కర్మలకాస్పదము లేని కేవల సుఖానందస్వర్గమును మనము తప్పకపొందుచున్నాము. తానుజేయక పోయినను జేయువారలను భంగపరచకుండుట యొకఉత్తమగుణమగును. ఈలాటి ప్రమాణానుభవము లెన్నింటినైనను బ్రశ్నయడుగువారలకు సమాధానము జెప్ప వచ్చును. ఇప్పటి విజ్ఞానమే చాలాప్రశ్నలకు సమాధానమగును.

# ప్రపంచ నిరూపణము.

"ఇదేమి పెద్దబ్రహ్మాండమా!"అనుమాట మననిత్యవ్యవహారములోనిది. దీనిని బట్టియే బ్రహ్మాండమునునది ఒక అకారగుణ విశిష్టమైయున్నదని విదితమగును. కాని దానిస్వరూపగుణ ప్రధాన ప్రయోజనములు విమర్శించినవారు చాలతక్కువ. "పొరిగింటి పుల్లకూరరుచి"అన్నట్లు మనకితర పాశ్చాత్య విజ్ఞాన సంస్కార నాగరకతల యందు వ్యామోహాతిశయ మెక్కువయగుటచేత, పరదేశీయులు మనవిజ్ఞాన సర్వస్వము నపహరించుట కారణములు. రాజకీయముగా ఆర్థికముగా మనదేశము చాలవెనపడి మనపూర్వవిజ్ఞానముపై నూతన పరిశోధనలు జేయునవకాశములు కొఱతపడినవి.

అఖండము, అద్వితీయము, ఆనందము సర్వశక్తిసంపన్నమగు ఈశ్వరతేజోవిలాసములో ఒక్క అణుశక్తియగు మాయలోనుండి జన్యమైన అనంతాణువుల పరిణామమే యీ బ్రహ్మాండము. మన వేదఋషులు దీనివిచారము విశేషముగా జేసియున్నారు. భౌతికములగు మనఇంద్రియముల కగపడు ప్రపంచమేగాక అనేక లోకాదులు మనపైనను గ్రిందను గలవని తమసూక్ష్మ దివ్యదృష్టితో ప్రత్యక్షానుభవముగ కని పెట్టియున్నారు. కాలపరిణామముతో పరిస్థితులన్నింటికి మార్పులగుచుండుటచేత ఋజువుపరచుట కొంతవరకు కష్టమేయైనను ఇటీవల ప్రాచ్యపాశ్చాత్యభూగోళ విజ్ఞాన శాస్త్రజ్ఞులు రెంటిసమన్వయమునకు మిక్కిలి కృషిచేసి కొంతవఱకు జయమును బొందగలిగిరి. మరికొన్ని విశేషములను నాకు దెలిసినంత వెల్లడించుచున్నాను.

ఈశ్వరసృష్టి లీలాస్వరూపమగు నవ్యక్తతత్త్వమునుండి పంచభూతముల ప్రవృత్తి పరిణామమే పదునాలుగు భువనములు, శింశుమారము. వానిసమష్టినామమే బ్రహ్మాండము. విరాట్టు, విశ్వమని వానినామాంతరములు. వృక్షబీజన్యాయముగను, దల్లిగర్భములోని శిశువువలెను బ్రహ్మాండము పిండాండము బృహద్రూపముతోను సూక్ష్మరూపముతోనున్నవి.

మనముందు లోకమునకు ఆవరణములుగాజుట్టి సప్తసముద్రములు, సప్తద్వీపములు, అంతస్థులుగా పంచభూతానుగుణరూపముతో క్రమముగాగల జీవరాసులతో మనకగపడనిదూరములో కష్టసాధ్యములుగా నున్నవి. మనకుఁబైనకూడ పం

చభూతగుణ స్వరూపముగా నే మేఘమండలము యక్షకిన్నర కింపురుషాది లోకములు రాహుమండలము అష్టదిక్పాలకుల పురములు, వీనికన్నిటి కాధారముగ మేరుపర్వతము దానిపైన శింశుమారమను పేరుతో నక్షత్రరూపముగ మహాతేజస్వరూపముతో చంద్ర సూర్యాది నవగ్రహమండలములు, ఋషులమండలములునున్నవి. దేవగణ పితృగణములు, ఇంద్రాదులు సర్వలోక సంచార శక్తివంతులైయున్నవి. ఇవి కొంతవరకు మనకు దృష్టాంతరముగా నగుపడును. వానిప్రకాశముతోనే మనకు వెలుతురుగలిగి సర్వవ్యవహారములకు నవకాశమబ్బుచున్నది. వానినే తేజోలోకములనుచున్నాము.

అందుపైన లోకాలోక పర్వతమునెల్లగాముగిసినది. మరల ధ్రువునిపైన కోట్యంశాధిక్యముతో మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోకాదులగు బ్రహ్మలోకములున్నవి. వాయుభూతగుణములుగల దివ్యపురుషులు ఊర్ధ్వరేతస్కులు నారద, సనక, సనందనాది బ్రహ్మర్షులు సర్వదా ధ్యానముతోనే అన్నాములులేని దివ్యదేహులైన బ్రహ్మమానసపుత్రులచట నివసించుచున్నారు.

అటుపైన శ్రీమహావిష్ణులోకము (వైకుంఠము) గోలోకము, శివలోకములున్నవి. అటుపైన సప్తావరణములును దానిపైన ఏమియునులేని బయలుగాఁగల ఆత్మస్వరూపములో ఒకచిన్నఅణువు మూలప్రకృతి అను మహాశక్తియున్నది. అదే సర్వజగత్కారణము. పైనవలెనే క్రిందఁగూడ కొన్నిలోకాదులున్నవి. అవి అతల వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళలోకములు. ఈపాతాళమునందు బలిచక్రవర్తిగలఁడని అతఁడుముందు ఇంద్రుఁడగునని మనకు తెలిసినదే.

వానిక్రింద జలము అగ్నియునున్నవి ఇన్నిటికాధారము వాయురూపమగు ఆదిశేషుడును, ఆక్రిందకూర్మము (చక్రాకారముగ) ఆవల శ్రీయజ్ఞరూపమగు (వర+అహం) వరాహమును అధారశక్తి యున్నది. ఆవల సప్తావరణములున్నవి.

ఇక్కడినుండి మూలప్రకృతివరకుఁగల యీ విశ్వమంతయును గోడిగ్రుడ్డురూపముగ నున్నందున బ్రహ్మాండనామమున వ్యవహరింపఁబడుచున్నది. ఒకపనసచెట్టునకు పెక్కుపనసకాయలున్నట్టు ఇట్టివనేక బ్రహ్మాండములుగూడ కలవని నిర్ణయించినందుననే మనము అనేక బ్రహ్మాండనాయక యని స్తుతించుచున్నాము.

దీనివలన బ్రహ్మాజనమేమనగా మనమున్న దేశముతోనే తృప్తిపడక ప్రపంచస్వరూపమును చిత్రపటములద్వారా తెలిసి మనకుగల సుఖానందముకన్న మిన్నయగుదాని నపేక్షించుట సహజము. అల్పసుఖమును జీవుకూడనాశింపదు. అత్య

ధిక స్వరాజ్యసౌఖ్యకాంక్షతో మనదేశవీరులు త్యాగముఁజేసి పడయునట్లే ఈలోకమునకన్న నధికలోకములు, ఇక్కడి ఆనందముకన్న నత్యధికానందము కలవనిఎరిగినఁగాని శాశ్వతబ్రహ్మానంద సుఖానుభవాభిలాషులు కాజాలరు. ఆబ్రహ్మాండ విజ్ఞాన ప్రాప్తికై ప్రాచీనవేదశాస్త్ర పురాణ సమ్మతముగ అనేకచిత్రపటముల సహాయముతో వివరించియున్నాను. అధ్యాత్మికముగ మనదేహములో దీనిసమన్వయ పద్ధతిని నిరూపించితిని. ఈ వేదభూగోళమునగల పటములఁజూడ బోధపడఁగలదు.

—o—

## భూతమన నేమి? వివరము.

సృష్టిస్వరూపమేభూతము. భూతమనఁగ బాహ్యదృష్టిలో స్థూలరూపముతో ఇంద్రియగోచరముగను, అంతరములో సూక్ష్మరూపముతో మనస్సేగ్రాహ్యముగను కారణములో ఁదీవ్రరూపముగనుండునది. భూతమే సృష్టిస్థితిలయాదులతో, భూత భవిష్యద్వర్తమాన కాలముగనున్నది. భూతము సర్వసృష్టికాధారము. చరాచర స్వరూపాదులన్నియు భూతములు. “భూయతే భవతీతిభూతం, భూప్రాప్తౌ భూసత్తాయాం”·పొందబడునది కలుగునదియును భూతం=పంచభూతములకును, సత్యమునకును, ప్రాణిమాత్రమునకును, అతీతకాలమునకును, సదృశవస్తువునకును అన్వయము. శ్రీపురుషసూక్తములో “యద్భూతం యచ్చభవ్యమ్”అని యున్నది. భూతముతోనే అన్నాదికములకు అన్నాదులకును గారణము. భూతముతో బుభుక్షుత్వాది సర్వకార్యకరణ కర్మలుగను క్రియాదులుగను వ్యవహారహేతు భూతములుగ నున్నది. భూతమే కాలరూప పరిమాణాదులు. మూలప్రకృతే మరల వికృతాకారముతో భూతరూపముగ బ్రపంచమునకు ఁగారణముగనున్నది. భూతముతోనే సర్వావస్థ పరంపర ప్రమాదములుకూడ. భూతమే లేనిచో నేమియునుండదు. భూతరూపమే జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, స్థూలదేహాది త్రయములు వీటియవస్థలు, పరిణామాదులు. భూతమే పంచభూతాది స్వరూపములతో నాయాగుణకర్మాదులుగనున్నది. సర్వబ్రహ్మాండము, పిండాండము భూతస్వరూపమే. అణ్వాదిగ మహత్తువఱకును భూతమే. భూతము సృష్టిస్థితిలయాదులతోఁజేరి అశాశ్వతముగ అసత్యముగ నున్నదికాన సత్యముగాదు. భూతము పంచభూతాది గుణప్రధానముతో

నాయాభూతాదుల ననుసరించిన భూతస్వరూపములకు గారణముగనున్నది. భూత మనగ మనస్సే భూతమనగా మనోరూపముతో ఇష్టాదులతో సర్వకామప్రాప్తిగ నుండునది. సృష్టికి ముఖ్యకారణమే భూతము కాలస్వరూపమేభూతము. రూపాదులకును గామాదులకును మూలకారణమేభూతము.



# భూభ్రమణచ్ఛాయుల వివరము.

ఈఛాయను గురించి కొంతభాగము పూర్వభాగములో విమర్శించితిని. ఇచ్చట ప్రత్యేకించి భూచ్ఛాయను గురించి కొన్ని సందేహముల నివృత్తికొఱకు వివరించవలసిన విశేషాంశములను వివరింతును. గ్రహణాదులకును నీవివరము కొంత ఆవశ్యకమగును.

జగత్సృష్టి స్థితిలయాదులకు ఛాయ మూలకారణము. ఛాయతో దినము రెండుభాగములయ్యెను. అందొకటిపగలు, రెండవదిరాత్రి. తేజోభూత భాగదిశతోఁ బగలుగను జలభూతభోగ దిశతోఁగల ఛాయతో నాచ్ఛాదితభాగము రాత్రిగ నేర్పడెను. ఈరాత్రి పగలు భేదములు భూరాదిసత్యలోకాంతమగు బ్రహ్మాలోకము వఱకును లోకస్థులకును దప్పనిదైయున్నది. ఆయాభూత గుణానుసారచ్ఛాయతో రాత్రి పగలు అనుభవములుగనుండును. కాలరూపమగు వాయుభూత భ్రమణతో నన్నిటికిని భ్రమణమేర్పడినందుచేత రెండువిధములుగా ఒకభాగదిశ పగలని మరొక భాగదిశ రాత్రియని యేర్పడెను. పంచభూతములలో పృథివీభూతమునకును స్వీయముగా ఛాయగలిగియున్నది. కాబట్టి పంచభూతములతో నుత్పత్తిగానైన స్థావర జంగమములకును చేతనా చేతనములకును ఆదికారణ చ్ఛాయమూలముతో నన్నిటికిని ఛాయగలిగెను ఈ ఛాయతోనే జ్ఞానాజ్ఞానములకును ద్వివిధభేదములు అన్నిటికిని గలిగెను. ఛాయతోసంధి రెండుభాగములందేర్పడెను. ఇవే ఉదయాస్తమయములు. అందుచేత ఛాయరెండువైపుల కొనలందున్నది. ఉదాహరణము:- మనకు సూర్యోదయకాలమందు మనఛాయ మనకు పశ్చిమ దిశయందగపడును. సాయంకాలమందు మనఛాయ మనకు బూర్వదిశయందగఁబడును. ఇది భ్రమణతోఁ గలిగినది. రాత్రికాలమందు సంపూర్ణచ్ఛాయతో నాచ్ఛాదితమైయుండును. పగటి

యందు సూర్యతేజో భాగదిశతో బ్రకాశించుచుండును. మనమున్న భూభాగార్ధము జలభూతభాగమగు పశ్చిమదిశలో జేరుటచేత నీటినీడతో (ఛాయతో) సంపూర్ణముగ నాక్రమించినందుచేత రాత్రికాలముగలిగెను. నీటిదిశ భాగముతో రాత్రిగను సూర్యదిశ భాగముతో బగలుగను రెండువిధములేర్పడెను. ఛాయ ఉపరిభూతములనుండి క్రమముగ క్రిందిభూతములను ఆచ్ఛాదించుచుండుటచేత జలభూతచ్ఛాయ పృథివినిగూడ ఆచ్ఛాదించుటచేత రాత్రికాలసంజ్ఞగలిగెను. స్వపరిభ్రమణతో ఒకభాగార్ధము తదుపరి భూతదిశయందు జేరుట సహజము. కాబట్టి ఉపరి భూతచ్ఛాయ క్రిందిభూమినాచ్ఛాదించును. మరొకభాగార్ధము సూర్యునిదిశలో నుండుట తేజఃప్రభావముతో బగలాయెను. దీనిని దెలిసి దివ్యదృష్టిగల మహర్షులు సంధ్యావందనములో ప్రాతస్సంధ్యోపస్థానము కేవలము సూర్యునుద్దేశించి "మిత్రస్యచర్షణీధృతః" యని వేదమంత్రముతో ప్రార్థించుట్లువిధించిరి. సాయంసంధ్యోపస్థానము మనమున్న భూభాగార్ధము మనకు బశ్చిమదిశయందుగల జలభూతాధి దేవతాత్మక వరుణ మంత్రమగు "ఇమంమే వరుణశ్రుధీహవ" యని వరుణోపాసనగా బ్రార్థించజేసిరి. వరుణుడు అపాంపతి. అదియునుగాక యీవరుణోపాసన మంత్రముగూడ సూర్యునికిని సమన్వయమగును. సూర్యస్వరూపము (తేజస్సు) జలమందు అగ్నిరూపముగ అంతర్హితమైయున్నది. ఉభయత్ర సమన్వయప్రార్థన మంత్రముగనున్నది. ఎవరిని సంబోధించినను ఉభయులకు సంబంధమగును. ఇంతకంటె ప్రమాణమేల, ఉదాహరణమేల! .

ఈ పంచభూతములు పైనుండి క్రిందికి నూటిగలేవు. ఏటవాలుగానున్నవి. మనదృష్టితో ఒకభూత మొకదిశయందును మరొకభూతము దానికెదురుగ మరొక దిశయందుండును. ఇట్లుండుటకు వాటియందుగలదైవిక ఆకర్షణశక్తిబలమే ముఖ్యకారణము. ఈఆకర్షణశక్తిలో మేరువుగూడ నొకఆకర్షణశక్తిగనే ధ్రువాధారముతో బృథివిభూతమువరకు వాయుతేజోరూపముతోనున్నది. కొన్ని పురాణములందు పంచభూతాత్మకముగ మేరువున్నదని వ్రాసిరి. మనపృథివీభాగము జలభూతమునకును తేజోభూతమునకును మధ్యలోనున్నది. 'అందుచేతనే ఒకభాగము పగలుగను మరొకభాగము రాత్రిగనున్నది. ఈరెండుభూతములయాకర్షణలతో మధ్యలో మనభూమి నిలిచియున్నది. భ్రమణలేనిచో సర్వభూతములకు బ్రళయమే సంభవించును. భ్రమణ త్రికాలసంజ్ఞగనున్నది.

భూచ్ఛాయనుగురించి కొంతవివరింతము. పృథివీభూత మంత్యభూమియగుట

చేతను పృథివీభూతమునకుఁగ్రింద అంతరాయముండి మరొకటి ఆవల ఆధారముగ నుండినచో భూచ్ఛాయ దానిమీద పడుచుండెను. అటులలేనందుచేత భూచ్ఛాయ తదుపరిలోకమగు అంతరిక్షము పై వ్యాపించెను. ఈభూచ్ఛాయతో ఉపరిజలభూత చ్ఛాయగూడ నందులోచేరెను. ఛాయాభూతముల విస్తృతిలంబమునుబట్టి పరిమితి దూరమువఱకు వ్యాపించునేకాని యెక్కువదూరము వ్యాప్తినందనేరదు. అందు చేతనే భూచ్ఛాయ సూర్యచంద్రమండలములవఱకే వ్యాపించగలిగెను. తదుపరి గ్రహమండలముల నాచ్ఛాందిచలేకపోయెను. భూతపరిమితి ననుసరించి ఛాయకు పరిమితివ్యాప్తియుండును. రాత్రియందీభూచ్ఛాయ సంపూర్ణజలభూతచ్ఛా యతోఁజేరినందుచేత ఁబత్యేకించక రెండును మిశ్రితములై రాత్రికాలము సంపూర్ణ తమస్సేర్పడెను. అధిష్ఠాన సంపూర్ణతేజస్సుండిననే రెండవదిగ ఛాయయేర్పడును. అధిష్ఠానముగూడ సంపూర్ణచ్ఛాయగానేయున్నచో నేభేదములేక సర్వము సమము గానేయుండును. ఈ ఛాయనే సూర్యునికిభార్యగా మన వేదశాస్త్రపురాణాదులందు దెలిపిరి. సూర్యోపాసనలో నతడుఛాయా ఉష అరుణసమేతయుఁ ఉపాసింపబడును. సూర్యునికి ఛాయ వెనుకటిపార్శ్వముతో సంబంధముగ భార్యగను ఉషయనునది ముందుభాగమునను అరుణరూపము సూర్యోదయమునకుముందు సారథిరూపము గను బోధించిరి. ఇంకనురహస్యాంశములుండితీరును. భార్యయనగా స్వశరీర ములో వామభాగార్ధమని తెలిపిరి. సూర్యునిఛాయ భూచ్ఛాయ యంతటితమో గుణమైనదికాదు. తేజస్సంబంధముతో ఁదేలికగానుండును. ప్రతిభూతములోను సగభాగము ఛాయయున్నట్టు దెలియుచున్నది. ఛాయయే లేకున్నచో నాయా భూతాదిలోకాదులందు రాత్రికాలమెట్లేర్పడగలదు? అసంభవము. ఛాయతోనే రాత్రియని తేజస్సుతో ఁబగలని భేదములకవకాశముగలిగెను. ఛాయయే లేనపుడు సర్వదాపగలేయుండును. ఇదిసృష్టిలో అసంభవము. సృష్టికిభేదకారణము ఛాయ తోగలిగెను. ఇదిపూర్వభాగములోవ్రాసిన సిసిమాదృష్టాంతము చూడ వచ్చును. వివరము దెలియగలదు. ఛాయతోనేప్రపంచము. ఛాయలేనిచో ఆత్మ స్వస్వరూపమే నిలుచును. ఈఛాయ త్రిగుణరూపాదులతోనుండును. మనది తమోలోకమగుటచేత ఛాయతమోగుణ రూపమునుబొందెను. ఈ భూచ్ఛాయ యొక్క రెండుకొనలే అంతరిక్షములో రాహుకేతువుల నంజ్ఞగా మండలమేర్పడెను. ఛాయచేతనే తమోగ్రహములని ఛాయాగ్రహములని జ్యోతిశ్శాస్త్రజ్ఞులేర్పరచిరి. ఈఛాయ రెండుకొనలందు సమానపరిధిలోను సమానాంతరాయముతో నుండుట

చేత నే మేషాదిద్వాదశ రాసులలో రాహుకేతువులు మధ్యే ఆరురాసులంతర ముగ సంచరించుచున్నవి. (అనగా రాహువునకు కేతువు ఏడవయింట నుండును. అట్లే కేతువునకు రాహువుగూడ) భూభ్రమణననుసరించిన ఛాయతో నీరాహు కేతువులకు అపద్రక్షిణముగ రాశిసంచారమేర్పడెను. ఛాయాగ్రహములగుట చేతనే సూర్యచంద్రుల నాచ్ఛాదించు నవకాశముగలిగెను. ఈగ్రహమండలము సూర్యునికి గ్రిందిభాగమునందేయున్నవి. భ్రమణచేతనే నీఛాయపరిమితికి లోనైనకాలముమాత్రమే అల్పకాలముగ నాచ్ఛాదించెను. భూమికి భ్రమణ లేకున్న యెంతకాలమైనను ఆచ్ఛాదించియుండవచ్చును. కాలనియమమునకు పరిమితిని మించకుండా ఆచ్ఛాదించునదిగానున్నది నీఛాయాగ్రహముల అపసవ్య సంచారము మధ్యగతిలోచేరిన సమయమందే సూర్యచంద్రుల నాచ్ఛాదించునే గాని వీటిసంచారాపసవ్యమార్గ దిశరాసులనువిడిచి యీవలరాసులతోనున్నచో ఉభయమధ్యగతులైనను ఆచ్ఛాదించుట కవకాశములేదు. ఇచ్చటఛాయయుండదు. గ్రహణవిషయమందు నింకనుకొన్నివిశేషాంశములను వివరింపవచ్చును. భూఛ్ఛాయ భ్రమణతో గతిగలిగి పోవుచుండుటచేత ఛాయతో గ్రహణమునకు పరిమితికాల మేర్పడెను లేకున్న సర్వదా గ్రహణమేయుండెడిది. వీటిమర్మనలను జ్యోతిశ్శాస్త్రమందు గణితక్రమమున విపులముగా వివరించిరి. దీర్ఘాలోచనతో శాంతముతో సమన్వయము చేసిన సర్వలసిద్ధాంతము తుదకేర్పడియగును. బోధించడములో బుద్ధిభేదములో మతభేదములుగా నుండవచ్చును.

ఛాయకు సంపూర్ణత, స్వతంత్రతలేదు. సంపూర్ణతేజస్సులో అంతర్గతమై యున్నను మరల నీఛాయలో సంపూర్ణాధిష్ఠాన తేజస్సంబంధము తప్పనిదైయున్నది. కాబట్టి ఛాయశాశ్వతము సత్యము స్థిరము కాదు ఛాయకు చలనముండితీరును.

రాహుకేతువులు సమష్టిరూప మొకటేయైనను ఉభయసంధికోనలతో భిన్నముగా ద్వివిధరూపములుగ గోచరించును. శిరస్సు శూర్పాకారముగను, శరీరము దీర్ఘముగుటచేత సర్పాకారముగను, రాక్షసలోకముగుటచేత రాక్షసులుగను, తమోగుణముతో తమోగ్రహములుగను పర్యాయపదములుగలిగెను.

భూభ్రమణగూడ మనకు పూర్వదిశకే తిరుగుచున్నట్లున్నది. ఏలననగా భూమితూర్పుదిశ దిరిగినగాని తదుపరిభాగము పశ్చిమమునకు రాదు. దీనిచేతనే ఛాయ అపసవ్యముగ దిరుగుటచేత రాహుకేతువుల కపసవ్యప్రదక్షిణ దశగలిగెను. భూభ్రమణ పశ్చిమదిశకేయున్నచో పశ్చిమదిశ అస్తమయ సమయములో మనకు

తూర్పుదిశయందే గలిగియుండెడిది. ఉదయము మధ్యాహ్నము సాయంకాలము వరుసలుగ పశ్చిమదిశగతిగా మనకు గోచరమగుచున్నది. భూభ్రమణ తూర్పుదిశ గానుండుటచేతనే మననిత్యానుభవముగా దిశలు సరిపోవును. పశ్చిమదిశయగు వరుణలోకమును జేరవలెననిన చో భూభ్రమణ తూర్పుదిశ కేయుండవలెను. ఉదయా స్తమయములు తూర్పునకే సంభవించును. ఇదిలోకవిరుద్ధము. రాహుకేతువుల సంచారకాలపరిమితి పదునెనిమిది మాసములేర్పరచిరి.

—o—

# ప్రకృతిపురుషుల కక్ష్యల వివరము.

ఆత్మ సర్వసంపూర్ణమై సర్వాధిష్ఠానాద్వితీయమైయున్నది. కేవల శుద్ధసత్వ ముతో జ్ఞానాజ్ఞానావరణ కక్ష్యలురెండు. జ్ఞానావరణకక్ష్య శుద్ధసత్వప్రధానము. అజ్ఞానావరణకక్ష్య యవ్యక్తప్రధానము. వీనినుండి మరల రెండుకక్ష్యలుకలిగి సృష్టి కారణభూతమయ్యెను. ఒకటిపురుషకక్ష్య. మఱొకటి ప్రకృతికక్ష్య. పురుష అనగా శ్రేష్ఠవాచకము. ఉత్తమము. తుదకు ఆత్మకేసమన్వయమగును. రెండవకక్ష్యప్ర కృతికి, శక్తికి. అజ్ఞానమునకు సమన్వయము. ఇవిక్రమముగా గుణాదులననుసరించి మార్పులతో అంతస్థులుగా కక్ష్యలుగా అధోముఖములో నామభేదములుగానగు చున్నవి. ఇవిమొదట సమష్టిసత్త్వగుణ ప్రధానముతో సమష్టిరజోగుణముతో సదాశివశక్తులుగను, విరాట్టుల కక్ష్యలావరణలో సమష్టితమోగుణముతో శివశక్తు లుగను, మహావిష్ణులక్ష్ములుగను, బ్రహ్మసరస్వతులుగ నావరణోపర్యావరణములుగ బ్రతిబ్రహ్మాండమునను నుండును. ఇంతవఱకు సమష్టీశ్వరస్వరూపతత్త్వము. శక్త్యావరణముపైన పురుషావరణమున్నది. ఈ రెంటిని బ్రత్యేకించి వేఱుగాచేయుటే నివృత్తిమార్గము.

పురుషుడుప్రధానుడయ్యును సృష్టిప్రారంభమున నందులీనమగుట ప్రకృతి ప్రాధాన్యమువహించినది. సర్వము దీనస్త్రీవాచకపూర్వమై ప్రకృతిపురుష కక్ష్య యేర్పడినది. దీనికధోముఖసృష్టియే కారణము.

బ్రహ్మాండసృష్టికర్త బ్రహ్మమైనచో బ్రహ్మాండానంతరములో విష్ణుస్వరూ

పావరణ ముపరిలోనుండగలదు. దీనికుపరిలో శివస్వరూపావరణ ముండును. దీని కుపరిలో సదా శివ స్వరూపావరణముగను దర్వాత అవ్యక్తజ్ఞాన స్వస్వరూపాత్మా వరణములో సర్వములీనము. ఈఅవ్యక్తస్వరూపము నిదివఱకే నిందులో వివరించితిని. అటులనే ప్రతిత్రిమూర్తుల బ్రహ్మాండములో నీత్రిమూర్తులవరుస క్రమములతో దిగ్వృత్యావరణములుగాగల యుపర్యావరణములుగ త్రిగుణస్వరూప భేదములతో త్రిమూర్తి భేదస్వరూపములుగా రజోగుణములో నొకరినుండి మరొకరుత్పత్తిగా సృష్టిక్రమ మనుసరించిన విధానముతోనుండును. ఇవి వ్యవహారభేదములే గాని సమష్టితో నెంతమాత్రమును భేదములేనివి. తండ్రియొకడు కుమారులరూపములతో భేదమూర్తులుగ నున్నవిధానమగును. సమష్టిస్వరూపమునుండి ప్రత్యేకించి భేదముల కవకాశముగా గలిగినదే వ్యష్టిస్వరూపము. ఈ త్రిమూర్తులు మూర్తి స్వరూపముతో సమష్టిసత్యస్వరాట్టునుండి శక్తితో గలిగినవారలే. ఈస్వరాట్టు కేవల జ్ఞానావరణములో మూలప్రకృతితో గలిగినవాడే. ఈప్రకృతి ఆత్మలో లీనముకాగా సర్వములీనమగును.



# కాలస్వరూపము.

విష్ణుపురాణము - ప్రథమాంశము - చతుర్థాధ్యాయము శ్లో॥ ౧, పుట ౨౦.

శ్లో॥ నిజేన తస్యమానేన ఆయుర్వర్ష శతంస్మృతమ్। తత్పరార్థం తదర్ధం హిపరార్ధ మభిధీయతే॥ కాలస్వరూపం విష్ణోశ్చయన్మయోక్తం తవానఘ। తేనతస్య నిబోధత్వం పరిమాణోప సాధనం॥ అన్యేషాం చైవ జంతూనా మచరాణాం చరాశ్చయే। భూభూభృత్సాగరాదీనా మశేషాణాంచ సత్తమ॥ కాలః కలయతే లోకం కాలః కలయతేజగత్। కాలః కలయతేవిశ్వం తేనకాలోఽభిధీయతే॥ కాలస్య వశగాస్సర్వే సిద్ధదేవర్షికిన్నరాః। కాలోహి భగవాన్ దేవ స్ససాక్షాత్పరమేశ్వరః॥ సర్గపాలన సంహార్తా సకాలస్సర్వతస్సమః॥ కాలేన కల్ప్యతేవిశ్వం తేనకాలోఽభిధీయతే॥ యేనోత్పత్తిశ్చ జాయేత యేనవైకల్ప్యతేకలా। సోఽనన్తవచ్చ భవేత్బ్రాలో జగదుత్పత్తికారకః॥ యః కర్మణి ప్రపశ్యేత ప్రకర్షే వర్తమానకే॥ సోఽపి ప్రవర్తకోజ్ఞేయః కాలస్స్యాత్ప్రతిపాలకః॥ యేనమృత్యువశం యాతి కృతంయేన లయం

వర్జేత్। సంహార్తాపోऽపి విజ్ఞేయః కాలస్సాత్కలనాపరః॥ కాలస్సృజతి భూతాని కాలస్సంహరతే ప్రజాః కాలస్స్వపితి జాగర్తి కాలోహి దురతిక్రమః॥ కాలే దేవా వినశ్యంతి కాలేచాసురపన్నగాః। నరేంద్రాస్సర్వజీవాశ్చ కాలేసర్వం వినశ్యతి॥ అవేహి సర్వభూతేషు కాలస్యగతిరీదృశీ। కాలోభవాయ భూతానా మభవాయచ పాండవకాల మూలమిదం జ్ఞాత్వా భవస్థైర్య పరోర్జున॥ నద్యస్సముద్రాగిరయ స్సకలాచ వసుంధరా। దేవామనుష్యాః పశవస్థావరాశ్చ సరీసృపాః॥ సృష్టాఃకాలేన కాలేన పునర్యాస్యంతి సంక్షయం। కాలాత్మక మిదంసర్వం జ్ఞాత్వాశమ మవాప్నుహి॥ కాలస్వరూపీభగవాన్ కృష్ణః కమలలోచనః॥

శ్రీభగవత్స్వరూపమే సృష్టితో కాలస్వరూపమయినందుచేత సర్వము కాలాత్మకమయి కాలముతో (బరిభ్రమణగా సృష్టిస్థితిలయాదులతో నున్నది. కాలస్వరూపము:- మొదటి బ్రహ్మాండసృష్టికర్తయగు బ్రహ్మయువనేక సహస్రదివ్యయుగములు. మనసంవత్సరమానము బ్రహ్మకొక క్షణముగూడ కానేరదు, ఇట్టిమనకాలముతో సహస్రదివ్యయుగముల పరిమితి సంఖ్యమైనగాని బ్రహ్మకొక పగలుగాదు, మరల నిటులనే రాత్రియుండును. కాలము అతిదీర్ఘవ్యాప్తితోను విశాలముతోను ప్రారంభముతోను బ్రహ్మాండమునకు (దగినట్లుగా భగవదాజ్ఞగా నున్నది. ఈకాలము క్రమగతముగా వచ్చుటచే స్థూలమగుట పంచభూతగుణాదుల ననుసరించిన సృష్టిమేరకు మనువులాదిగా మనవరకువచ్చి అత్యంతసూక్ష్మకాలమేర్పడెను. మనకాలగతి మహాతీవ్రగతిగలదై క్రమముగ ఉపరిలోకాదులలో (బంచభూత గుణాదుల ననుసరించి అతివ్యాప్తితో దీర్ఘముగను గేవలమందగతిగను, దుదకు బ్రహ్మలోకములో అధికమందగతిసి గనుచున్నది. సర్వులకును ఎవరెవరి కాలపరిమితి సంవత్సరసంఖ్యతో ఆయువు నూరుసంవత్సరముల పరిమితిగానున్నది. మనమున్న పృథివీభూతగమనము మహాతీవ్రగతిని యన్నిటికిమించి యున్నదనుట స్పష్టము. మిగతభూతాదుల లోకములలో (గాలగతి భూతాదులననుసరించి మంద గతితో కాలభేదముతో సంవత్సరకాలపరిమితి మనకంటె దీర్ఘకాలవ్యవధితోనున్నది. ఈభేదవివరములను మన వేదశాస్త్ర పురాణాదులలో (జక్కగావిమర్శించిరి. ఇందుకు దృష్టాంతము శింశుమారములోగల నక్షత్ర, గ్రహ[illegible]తితోను సప్తర్షులగతితోను సూర్యచంద్రులగతితోను శింశుమారగతితోను [illegible] ప్రత్యక్షనిదర్శనముగ నున్నది. గతులు (భ్రమణలు) కాలభేదములకుముఖ్యకారణము. భూతాదుల గుణ

ములననుసరించి గతులుగలుగును. ఒక ఉదాహరణము. గడియారములో సెకండ్ల ముల్లొకచుట్టుతిరిగిన నిమిషముల ముల్లు అరవదవభాగము మాత్రము కదలును. ఈ నిమిషముల ముల్లు ఒకచుట్టు సంపూర్ణముగ తిరిగిన గంటలముల్లు పండ్రెండవయంశము జరుగును. ఇటులనే దినములు వారములు, పక్షములు, నెలలు, ఋతువులు, సంవత్సరములాదిగ మీటరునుంచిన కాలగతిలాగున తీవ్రమధ్య మాంద్యగతుల భేదముల దిరుగును. ఈకాలగతియు భూతాదులగతి ననుసరించి తిరుగుచుండుటచేత కాలపరిమితిభేదములు కలుగును. ఎవరెవరిగతి, భ్రమణానుసారము కాలగతిభేదములతో సంవత్సరభేదములుగ పరమాయువు నూరుసంవత్సరములు సర్వులకునొకటిగానున్నది.

ఈవిషయమును ముందుసందర్భానుసారము గమనించవలెను. ఇట్టిభేదములతో సర్వవిషయములందును మనకును మనలోకమునకును, ఉపరిలోకములకును లోకస్థులకును అనంత తారతమ్య గుణభేదములతోనున్నవి. ఒకచక్రవర్తికిని చక్రవర్తిదేశమునకును పురమునకును సుఖాదులకును కుగ్రామకుటీరాత్యల్ప జీవికినిగల భేదములు తారతమ్యానుసారములుగ నుండును. బ్రహ్మాయువుగూడ నేనాటికైన నంతమందునేగాని నిలువజాలదు. ఇట్లు బ్రహ్మాయువుగూడపరిమితికిలోనై యుండగా మానవుల జీవితాశయము లెంతటివి?

కాలమనగ గతితో అనుభవమయి పరిమితికాలము మీరగానే చిన్నదిగా దినప్రళయము మొదలుగా తుదకు బ్రహ్మకును బ్రహ్మాండమునకును ప్రళయమే నాటికైనను తప్పదు. మరలసృష్టి శ్రీమన్నారాయణ నాభీకమలము బ్రహ్మతో నారంభమగుచుండును. “ధాతాయథా పూర్వమకల్పయత్” సంకల్పములో “ఆద్యబ్రహ్మణః” అనుటలోనే తెలియుచున్నది. స్థూలబ్రహ్మాండకర్త స్థూల బ్రహ్మ శ్రీమన్నారాయణ నాభీకమలమునుండి జలభూతముతో బుట్టును. మనజననంబును నట్టిదియే. నాభినాళమే కమలనాళము. కమలమే మాయ (కోశము) అందులోని జలమే జలభూతముగా దెలియవలెను. బ్రహ్మాదిదేవతలాదిగాగల పదవులు మనరాజ్యములోని పదవులవలె నియమితస్థానములుగ నుండును. పదవుల నధిష్ఠించువారలు కల్పాంతము నశింతురు. మరియు కల్పాది నితరులధిష్ఠాతలు. అన్నియును సమానములు. బ్రహ్మసృష్టివలె మనసృష్టియున్నది. మనదేహాదులు ద్రవముతో నుత్పత్తిస్థితిలయాదులు గనుచున్నవి, ఈజలము రసస్వరూపముతోను ద్రవస్వరూపముతోను శీతగుణాంశముతోను సందర్భానుసారముగనున్నది. “ఆపోవా

ఇదగ్ంసర్వమ్" అను ప్రమాణానుసారము తుదకతి కఠినస్థిరస్థావరాదిలోహ పాషాణాములకునుగారణముగ నున్నది. లోకములో నిందుకుదాహరణములు నిత్యానుభవములుగ మంచుగడ్డ, లవణము, గలకండ మున్నగునవి. తుదకురసమే అమృతస్వరూపముగ మన సహస్రారములో సుధాసింధువుగనున్నది. రసముతోనే ఆనందము తుదకు జ్ఞానరూపముతో ఆనందమయాత్మగానున్నది పరమాత్మ రసస్వరూపుడని శ్రుతులుపలికెను ఇట్టిరసము మనకుపరిభాగములోను మనలోను లోకాదులలోను అమృతస్వరూపరసముతో నిరంతరమున్నందుచేత నవి ఉత్తమములైనవి. ఈరసము త్రిగుణముల ననుసరించి కాలగతితో తమోలోకములో జలముగామారెను.

ఉదాహరణము:- మనము క్షీరములనుద్రావినచో తుదకవి మూత్రముగా మారును స్వర్గలోకములో దివ్యగంగను తదుపరిలోకమున జ్ఞానస్వరూపగంగను మనలోకములో జలస్వరూప గంగయు నిల్లేయుగును. ఈ గంగ మనజలమునకంటె సర్వవిధములుగ నన్నిగుణములందు నధికత్వముగలిగియున్నది. కాలము సర్వస్వరూపము. కాలముతో (బరిణామాది మార్పులు భూతాదులతోను గుణాదులతో నగుచుండును. కాలముతోనే పరిభ్రమణలు.

లోకములో (గాలచక్రము తిరుగుచున్నదని వాడుకలో(జెప్పుదుము. కాలము వలయాకారముతో (బరిభ్రమణగా దేంచేతనో తిరుగుటచేతనే అతిసూక్ష్మతరాంతర పరిమితికాలమునుండి సంవత్సరపరిమితి సంజ్ఞగానున్నది. సంవత్సరాంతముతో మరల ప్రారంభముగావలెను. "శతసంవత్సరం దీర్ఘమాయుః" అని వేదప్రమాణము. ఏకాలమానసంజ్ఞతోనైనను సరిపోవును. ప్రణ్యాతిశయముతో బ్రహ్మయుర్దాయమును బొందవచ్చును.

కాలమనగ శబ్దస్వరూపము. శబ్దమువాయుసంబంధముగాన చలనముతో ఆవరణములుగా అలలుగానుండును. పంచభూతములు కాలచలనముతో ఆకాశాదిగ శబ్దతన్మాత్రలతో పృథివ్యంతమువరకు రాగలిగెను. జలరూపసముద్రచలనముతో భూమికిని (జలనముగలిగెను. కాలచలనమే లేనిచో సృష్టిస్థితిలయాదులేయుండవు. సముద్రావరణములో భూమియున్నపుడు సముద్రమునకు గలిగినచలనమే భూమికిని గలుగును. సముద్రములోని బుద్బుదఫేనములకు (జలనమేకారణము. మూలప్రకృతి యాచలనముతోనున్నది. బ్రహ్మాండమునకు నిదేకారణము. మనకుచలనము మనస్సే. చలనమే లేనిచో మనకు ఆయుఃపరిమితి లేక ఆత్మస్వస్వరూప

శాశ్వత సత్యసంపూర్ణులుగానుందురు. కాలస్వరూప వాయుభూతమున్నంతకాల మదెట్లు తప్పును? యోగులు దీనిని దెలిసి అపరిమితాయువు నందుటకై మొదటవా యుధారణతో కుంభకమునుసాధించి స్వాధీనపఱచుకొని అమితాయువును బొంద గలిగిరి. వాయువే ప్రాణస్వరూపము. వాయువులోని తేజస్సే అగ్నిరూపము. ఈరెంటిచేతనే జీవునకు దేహములోనికి రాకపోక లేర్పడును. సమాధిస్థితిలో నీ వాయునిగ్రహముతో జ్వలింపక సజీవులై శాశ్వతముగ నుండగలరు. గడియారములో Hair Spring ను ఆడించనిచో గడియారమెన్ని సంవత్సరములైనను జెడక యుండును.



## కాలమానవివరము.

కాలము.

౧ త్రుటి అనగా వాడియైన సూదిమొనచే తామరపుష్పదళమును గుచ్చినంత కాలము.

౧౦౦ త్రుటులు — ౧ లవము.

౩౦ లవములు = ౧ నిమేషము (ఱెప్పపాటుకాలము)

౧౮ నిమేషములు = ౧ కాష్ఠ

౩౦ కాష్ఠలు = ౧ కల (గుర్వక్షరోచ్చారణకాలము ప్రాణమనబడును)

౩౦ కలలు = ౧ క్షణము.

౧౨ క్షణములు = ౧ ముహూర్తము.

౧౦ గుర్వక్షరోచ్చారణకాలములు = ౧ ప్రాణమనబడును.

౬ ప్రాణములు = ౧ వినాడి (విఘటిక)

౬౦ విఘటికలు = ౧ ఘటిక

౬౦ ఘటికలు = ౧ దినము (అహోరాత్రము)

౭ దినములు = ౧ వారము.

౧౫ దినములు = ౧ పక్షము

౨ పక్షములు = మాసము.

౨ మాసములు = ౧ ఋతువు.

౩ ఋతువులు (౬ మాసములు) = ౧ అయనము.

౨ అయనములు (౧౨ మాసములు) = ౧ సంవత్సరము (సౌరాబ్దము)

—♦ పి తృ మా న ము. ♦—

శుక్లపక్షము = పితృదేవతలకు పగటికాలము

కృష్ణపక్షము = పితృదేవతలకు రాత్రికాలము

—♦ దే వ మా న ము ♦—

౬ మాసములుగల ఉత్తరాయణము = దేవతలకు పగటికాలము

౬ మాసములుగల దక్షిణాయనము = దేవతలకు రాత్రికాలము.

౧ సంవత్సరము = అహోరాత్రమగుదినము.

—♦ కా ల మా న ము. ♦—

౩౬౦ మానవసంవత్సరములు = దేవతలకు ఒకసంవత్సరము

౧౨౦౦౦ దైవిక సంవత్సరములు= దేవయుగము మనుష్యమానముతో ౪,౩౨,౦౦౦ మహాయుగము.

—♦ యు గ ప్ర మా ణ ము. ♦—

౪,౩౨,౦౦౦ మానవసంవత్సరములు = కలియుగప్రమాణము

౮,౬౪,౦౦౦ మానవసంవత్సరములు = ద్వాపరయుగప్రమాణము.

౧౨,౯౬,౦౦౦ మానవసంవత్సరములు = త్రేతాయుగప్రమాణము.

౧౭,౨౮,౦౦౦ మానవసంవత్సరములు = కృతయుగప్రమాణము.

౪౩,౨౦,౦౦౦ సంవత్సరములు = మహాయుగప్రమాణము ౧ దేవయుగము.

౭౧ మహాయుగములు = ౧ మన్వంతరకాలము.

౪౩,౨౦,౦౦౦×౭౧=౩౦,౬౭,౨౦,౦౦౦ సంవత్సరములగును.

౧౪ మన్వంతరములు =౪౨౯౪౦౮౦౦౦౦ సంవత్సరములు కల్పబ్రహ్మమానము } బ్రహ్మదేవునిసృష్టి పగటికాలము.

౧౪ మన్వంతరములు లేక ౧౦౦౦ మహాయుగములు } బ్రహ్మదేవుని పగటికాలము సృష్టికల్పము

౧౦౦౦ మహాయుగములు = రాత్రికాలము, ప్రళయకల్పము అహోరాత్రములు (దినము) కల్పమనఁబడును.

౧౪ మన్వంతరములు లేక ౧౦౦౦ మహాయుగముల కాలము } ౪,౨౯,౪౦,౮౦,౦౦౦ మానవసౌరాబ్దములు.

౬ మహాయుగములసంధికాలము = ౨౫,౯౨౦౦౦

బ్రహ్మదేవుని అహోరాత్రముగు దినము లేక కల్పము = ౮౬,౪౦,౦౦౦౦౦

౩౦ కల్పములగు మాసప్రమాణము = ౨౫౯౨౦౦౦౦౦౦౦

౧౨ మాసములుగల సంవత్సరప్రమాణము = ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦

౧౦౦ శతవత్సరముల పరమాయుఃప్రమాణము = ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦౦౦

ఇదిబ్రహ్మమానము.

సంఖ్యాక్రమము - శ్రీవాయుపురాణం అధ్యా ౩౯.

ఋషయఊచుః:- కస్మాదేష పరార్థశ్చ కశ్చైవ పరఉచ్యతే। ఏతద్వేదితు
మిచ్ఛామస్తన్మే నిగదసత్తమ॥ ౯౨॥ సూతఉవాచ:- శృణుధ్వంమే పరార్థంచ
పరిసంఖ్యాం పరస్యచ। ఏకం దశ శతంచైవ సహస్రంచైవ సంఖ్యయా॥ ౯౩॥
విజ్ఞేయమా సహస్రంతు సహస్రాణి దశాయుతం। ఏకంశత సహస్రంతు నియుతం
ప్రోచ్యతే బుధైః॥ ౯౪॥ తథాశత సహస్రాణా మర్బుదం కోటిరుచ్యతే। అర్బు
దం దశకోట్యస్తు హ్యబ్దంకోటి శతం విదుః॥ ౯౫॥ సహస్రమపికోటీనాం సర్వమా
హుర్మనీషిణః। దశకోటి సహస్రాణి నిఖర్వమితితం విదుః॥ ౯౬॥ శతంకోటి సహ
స్రాణాం శంఖఇత్యభిధీయతే। సహస్రంతు సహస్రాణాం కోటీనాం దశధా
పునః॥ ౯౭॥ గుణితాని సముద్రంవైప్రాహుః సంఖ్యావిదోజనాః॥ ౯౮॥ కోటీ
నాం సహస్రమయుత మిత్యాయ మధ్యఉచ్యతే। కోటీసహస్రనియుతా సచాంత
ఇతిసంజ్ఞితః॥ ౯౯॥ కోటికోటి సహస్రాణి పరార్థఇతికీర్త్యతే। పరార్థద్విగుణం
చాపి పరమాహు ర్మనీషిణః॥ ౯౯॥ శతమాహుః పరిదృశం సహస్రం పరిపద్మకం।
విజ్ఞేయ మయుతం తస్మాన్నియుతం ప్రయుగంతతః। ౧౦౦॥ అర్బుదం న్యర్బుదంచైవ
ఖర్బుదం చతతఃస్మృతం। ఖర్వంచైవ నిఖర్వంచశంఖః పద్మం తథైవచ॥ ౧౦౧॥ సము
ద్రం మధ్యమంచైవ పరార్థమపరం తతః। ఏవమష్టాదశైతాని స్థానాని గణనా
విధా॥ ౧౦౨॥ శతానీతి విజానీయాత్ సంజ్ఞితాని మహర్షిభిః। కల్పసంఖ్యాప్ర
వృత్తస్య పరార్థం బ్రహ్మణః స్మృతం॥ ౧౦౩॥ తావచ్ఛేషోఽపి కాలోఽస్య తస్యాం

తే ప్రతిసృజ్యతే। పరపేష పరార్ధంచ సంఖ్యాతాః సంఖ్యయామయా॥ ౧౦౪ ॥ యస్మాదస్య పరంవీర్యం పరమాయుః పరంతపః। పరాశక్తిః పరోధర్మః పరావిద్యా పరాధృతిః॥ ౧౦౫ ॥ పరంబ్రహ్మ పరంజ్ఞానం పరమైశ్వర్యమేవచ। తస్మాత్పరతరం భూతం బ్రహ్మణోzస్యన్నవిద్యతే॥౧౦౬॥ పరేస్థితోహ్యేషపరః సర్వాక్షేషు తతఃపరః। సంఖ్యాతస్తుపరోబ్రహ్మ తస్యార్ధంతు పరార్థతా॥౧౦౭॥సంఖ్యేయం చాప్యసంఖ్యేయం సతతంచాపి తాంత్రికం। సంఖ్యేయం సంఖ్యయాదృష్ట మపరార్ధా ద్విభావ్యతే॥౧౦౮॥ రాశౌదృష్టేన సంఖ్యాస్తి తదసంఖ్యస్యలక్షణం। అసంఖ్యం సికతాభ్యేషు దృష్టవాన్ పంచలక్షణం॥ ౧౦౯ ॥ ఈశ్వరైస్తత్ప్రసంఖ్యాంతం శుద్ధత్వాద్దివ్యదృష్టిభిః। ఏవం జ్ఞాన ప్రతిష్ఠత్వాత్ సర్వంబ్రహ్మానుపశ్యతి॥ ౧౧౦ ॥ ఏతచ్ఛ్రుత్వాతు తేసర్వేనై మిశేయాస్తపస్వినః। బాష్పపర్యాకులాస్తు ప్రహర్షాద్గద్గద స్వరాః॥ ౧౧౧ ॥ ప్రప్రచ్ఛుర్మాతరిశ్వానం సర్వేతే బ్రహ్మవాదినః। బ్రహ్మలోకస్తుభగవాన్ యావన్మాత్రాంతరఃప్రభో॥ ౧౧౨ ॥

## సంఖ్యామానము.

శ్లో॥ ఏకందశ, శతంచైవ సహస్రమయుతం తథాలక్షశ్చ నియుతశ్చైవ, కోటి రర్బుదమేవచ। బృందః ఖర్వో నిఖర్వశ్చ శంఖపద్మౌచ సాగరః అంత్యం మధ్యం పరార్థశ్చ దశవృద్ధ్యా యథాక్రమమ్॥

| | |
|---|---|
| ౧ | = ౧ ఏకం |
| ౧౦ | = ౨ దశ |
| ౧౦౦ | = ౩ శతం |
| ౧౦౦౦ | = ౪ సహస్రం |
| ౧౦,౦౦౦ | = ౫ దశసహస్రం (అయుతం) |
| ౧,౦౦,౦౦౦ | = ౬ లక్ష |
| ౧౦,౦౦,౦౦౦ | = ౭ నియుతం (పదిలక్షలు) |
| ౧,౦౦,౦౦,౦౦౦ | = ౮ కోటి |
| ౧౦,౦౦,౦౦,౦౦౦ | = ౯ అర్బుదమ్ |
| ౧,౦౦,౦౦,౦౦,౦౦౦ | = ౧౦ బృందః |
| ౧౦,౦౦,౦౦,౦౦,౦౦౦ | = ౧౧ ఖర్వః |
| ౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ | = ౧౨ నిఖర్వః |

౧౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ = ౧౩ శంఖః

౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ = ౧౪ పద్మం

౧౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ = ౧౫ సముద్రః

౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ = ౧౬ అంత్యః

౧౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ = ౧౭ మధ్యం

౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ = ౧౮ పరార్థం

త్రింశత్కల్పాస్తేషాం నామాని బ్రహ్మదేవుని మాసములోని
౩౦ తిథులు కల్పములని పేరు.

౧ శ్వేతవరాహకల్పము
౨ నీలలోహితకల్పము
౩ వామదేవకల్పము
౪ రథంతరకల్పము
౫ రౌరవకల్పము
౬ దేవకల్పము
౭ బృహత్కల్పము
౮ కందర్పకల్పము
౯ సత్యకల్పము
౧౦ ఈశానకల్పము
౧౧ తమఃకల్పము
౧౨ సారస్వతకల్పము
౧౩ ఉదానకల్పము
౧౪ గారుడకల్పము
౧౫ కౌర్మ (పౌర్ణమాసీ) కల్పము
౧౬ నారసింహకల్పము
౧౭ సమానకల్పము
౧౮ ఆగ్నేయకల్పము
౧౯ సోమకల్పము
౨౦ మానవకల్పము
౨౧ తత్పురుషకల్పము
౨౨ వైకుంఠకల్పము
౨౩ లక్ష్మీకల్పము
౨౪ సావిత్రీకల్పము
౨౫ ఘోరకల్పము
౨౬ వరాహకల్పము
౨౭ వైరాజకల్పము
౨౮ గౌరీకల్పము
౨౯ మహేశ్వరకల్పము
౩౦ పితృకల్పము (అమావాస్య)

## బ్రహ్మాయుః ప్రమాణము.

శ్లో॥ నిజేన తస్యమానేన చాయుర్వర్షశతంస్మృతమ్।
తత్పరాఖ్యం తదర్ధంచ పరార్థమభిధీయతే। (కౌర్మే ౫ అధ్యాయః)
శ్లో॥ శతంహి తస్యవర్షాణాం పరమిత్యభిధీయతే।

పంచాశద్భి స్తథావర్షైః పరార్ధమితికీర్త్యతే॥
ఏవమస్యపరార్ధంతు వ్యతీతం ద్విజసత్తమ
యస్యాంతేzభూన్మహాకల్పః పాద్మఇత్యభివిశ్రుతః॥
(మార్కండేయే ౪౬. అధ్యాయే ౪౨, ౪౩ శ్లోకాః)

సర్వలోక సృష్టికర్తయుఁ బితామహుఁడును, దేవతలలో జ్యేష్ఠుఁడు నగు బ్రహ్మదేవు నాయుఃప్రమాణము మార్కండేయ, కూర్మ, విష్ణుపురాణములయందు వివరింపఁబడియున్నది. పదునాలుగు మన్వంతరములుగల వేయిమహాయుగములు, బ్రహ్మదేవుడు సృజించునది పగటికాలమనియు వేయిమహాయుగములు లయించియుండునది రాత్రికాలమనియు రెండువేల మహాయుగములు, అహోరాత్రమగు కల్పమనియు నిట్లుబ్రహ్మమానము చెప్పఁబడెను. అట్టిమూడువందల యరువదిదినములు సంవత్సరము శతసంవత్సరములుగల పరమాయువునకు "పరము" అనిసంజ్ఞ. పరార్ధమనఁగ నేబది సంవత్సరములు. మొదటి యేబదిసంవత్సరములకు ప్రథమపరార్ధమని, రెండవయేఁబదిసంవత్సరములకు, ద్వితీయపరార్ధమని పేరు. ప్రకృతము మొదటిపరార్ధము (యేబదిసంవత్సరములు) గతించి, రెండవ (యేబదిసంవత్సరములు) గల ద్వితీయపరార్ధములో ప్రథమసంవత్సరములో బ్రథమమాస శుక్లపక్ష ప్రతిపత్తిథి జరుగుచున్నది. ఉదయాది ౧౩ ఘటికలు, ౪౨ విఘటికలు. ౨౧ కలలు ౧౬ నిమేషములు, ౨౨ లవలు, ౫౮ త్రుటికలకాలము జరుగుచున్నది. ఇంకను మధ్యాహ్నముకాలేదు. పైకాలమునకు సరిగా స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, సంజ్ఞిక మన్మన్వంతరములు గతించి ౭ వదియగు వైవస్వత మన్వంతరములో ౨౭ మహాయుగములు కడచి ౨౮-వ మహాయుగస్థ కలియుగములో ౫౦౫౦ సంవత్సరములు గతించినవి. ౬౦ సంవత్సరముల పరుసలు ౮౪ వ పరుసలో శ్రీవిరోధినామసంవత్సరము జరుగుచున్నది. ప్రతికల్పమునందు బదునాలుగు మనువులు, నలుబదియొక్క ఇంద్రులు, దేవగణములు, సప్తర్షులు, అవతారమూర్తులు పాలకులునుందురు. పదునాలుగుమన్వంతరములు పూర్తియైనంతట కల్పప్రళయముగలిగి రాత్రిప్రవేశించును. ఇదిబ్రహ్మకు నిదురించుసమయము.

బ్రహ్మకును బ్రహ్మలోకమునకును మనకును మనలోకమునకెంతదూరమో యాలోచించవలెను. ఇచ్చటికాలస్వరూపవాయువెంతటి మందచలనమో యోచింపవలెను. మనఉచ్ఛ్వాసనిశ్వాసములకును అచ్చటివారల ఉచ్ఛ్వాసనిశ్వాసలకు నెంత తారతమ్యమున్నదో గమనించవలెను. మనకు పైనున్న అంతరిక్షలోకమునకుఁ

బోయినచో మనస్థూలదేహము నిలువఁజాలదు. ఊపిరివిడుచుటకు వాయువుచాలదు. శీతభాగమత్యధికము అటులనే తేజోలోకము స్వర్గములోనివారలు అనిమిషలోచనులు తైజసదేహులుగనున్నారు. వాయుభూతలోకాదులలో వాయుసంబంధభూతదేహులుగనుందురు. కాలముచేత మానభేదములు కాలగతులననుసరించియుండును. మనకుఁజూడగ స్వర్గము ధృవపథము. అచ్చటివారలు నక్షత్రరూపప్రకాశదేహములతో నుండుట మననిత్యానుభవగమునున్నది. వారలరూపము మనముకనిపెట్టలేనివారలము. పైనున్నలోకాదుల నెట్లు తెలియగలము? స్థూలలోకాదులుగాదు, వాయుభూతలోకాదులు. తేజోలోకమును తేజోరూపములుగలవారలే కనిపెట్టుట దుస్సాధ్యము. మనకుజూడగ నక్షత్రరూపములతోనున్నను అనేకయోజనముల విశాలము పరిమితిగలవారైయున్నారు.



# కా ల ప రి మా ణ ము. — సం వ త్స ర భే ద ము.

శ్రీవాయుపురాణం. - అధ్యా. ౫౦.

కాష్ఠానిమేషాదశపంచచైవ త్రింశచ్చకాష్ఠా గణయేత్కలాంతమ్। త్రింశత్కలాశ్చైవ భవేన్ముహూర్తస్తై స్త్రింశతారాత్ర్యహనీసమేతే॥ ౧౮ ॥ హ్రాసవృద్ధిత్వహర్భాగే దివసానాం యథాక్రమం। సంధ్యాముహూర్తమానంతుహ్రాసే వృద్ధాసమాస్మృతా॥ ౧౯ ॥ లేఖాప్రభృత్యథాదిత్యే త్రిముహూర్తాగతేతువై। ప్రాతస్తనః స్మృతఃకాలో భాగస్త్వహ్నః సపంచమః॥ ౨౦ ॥ తస్మాత్ప్రాతస్తనాత్కాలాత్ త్రిముహూర్తస్తుసంగవః। మధ్యాహ్నస్త్రిముహూర్తస్తు తస్మాత్కాలాచ్చసంగవాత్॥ ౨౧ ॥ తస్మాన్మధ్యం దినాత్కాలాదరాపహ్ణ ఇతిస్మృతః। త్రయఏవముహూర్తాస్తు తస్మాత్ కాలాచ్చమధ్యమాత్॥ ౨౨ ॥ అపరాహ్ణావ్యతీపాతేతుకాలః సాయాహ్న ఉచ్యతే। దశపంచముహూర్తాద్వై ముహూర్తాస్త్రయఏవచ॥ ౨౩ దశపంచముహూర్తంవై అహర్వ్విషువతిస్మృతం। దశపంచముహూర్తాద్వై రాత్రిందివమితిస్మృతం॥ ౨౪ ॥ వర్ధతేహ్రాసతేచైవ అయనేదక్షిణోత్తరే। అహస్తుగ్రసతే రాత్రిం రాత్రిస్తుగ్రసతేత్వహః॥ ౨౫ ॥ శరద్వసంతయోర్మధ్యే విషువంతచ్చభా

వ్యతే। అహోరాత్రం కలాశ్చైవ సప్తసోమః సమశ్నుతే. ౧౭౬ ॥ తథాపంచ దశాహాని పక్షఇత్యభిధీయతే। ద్వౌపక్షౌచ భవేన్మాసో ద్వౌమాసావృతురావృతుః। ఋతుత్రయమయనం స్యాత్ ద్వేzయనే వర్షముచ్యతే। ౧౭౭ ॥ నిమేషాదికృతః కాలః కాష్ఠాయాదశపంచచ। కలాయాస్త్రింశతః కాష్ఠామాత్రాశీతిద్వయాత్మికా। ౧౭౮ ॥ శతమ్నైనకాస్త్రింశన్మాత్రా త్రింశత్ మడుత్తరా। ద్విషష్టిభాక్ త్రయోవింశన్మాత్రాయాంచ చలాభవేత్ ॥ ౧౭౯ ॥ చత్వారింశత్ సహస్రాణి తతాన్యష్టౌచవిద్యుతిః। సప్తతించాపి తత్రైవనవతిం విద్ధిశ్రయే। ౧౮౦ ॥ చత్వారింశన శతాన్యాహుర్విద్యుతౌ వైధనంయుగే। చరాంశో హ్యేషవిజ్ఞేయో నాళికాచాత్రికారణమ్॥ ౧౮౧ ॥ సంవత్సరాదయః పంచచతుర్మాన వికల్పితాః। నిశ్చయః సర్వకాలస్యయుగ ఇత్యభిధీయతే॥ ౧౮౨ ॥

పదునేనుకాష్ఠలు = ఒకనిమషము.
ముప్పదికాష్ఠలు = కల. ఇట్లుకలాంతము.
ముప్పదికలలు = ఒక ముహూర్తము.
ముప్పదిముహూర్తములు = ఒకఅహోరాత్రము.

హ్రాసవృద్ధులు పగటియందుండును. సంధ్యాకాలముమాత్రము హ్రాసవృద్ధులందు ముహూర్తకాల పరిమాణమేయుండును. పగటిభాగ మైదువిధములుగ భాగింపబడినది. ౧ ప్రాతస్తవము=తూర్పుదిశ సూర్యోదయాత్పూర్వము అరుణరేఖ దయము మొదలు మూడుముహూర్తములకాలమువరకు (సూర్యుడుఆకసమందూర్ధ్వభాగమునకువచ్చువరకు)అని తెలియవలెను. అనగా ఆరుఘడియలకాలమగును. అహఃప్రమాణ హ్రాసవృద్ధుల ననుసరించి కొంచెము ఇంచుమించుగనుండును. ఇది అహర్భాగములో అయిదవభాగమని తెలియవలెను. ఇటులనే వరుసగా మూడుముహూర్తములప్రకారము, ౨ సంగమకాలము, 3 మధ్యాహ్నకాలము, ౪ అపరాహ్ణము, ౫ సాయాహ్నము. ఈలాగున త్రికాలమునకు మూడుముహూర్తముల ప్రకారము అయిదుకాలములకు పదునైదుముహూర్తములగును. ఈలాగున సమకాలమునకు "విషు" సంజ్ఞతో మేష, తులామాసములు రెండున్నవి. వీటికి విషుసంక్రమణ మాసములనిపేరు. ఈలాగుననే రాత్రికాలపరిణామము పదునైదుముహూర్తముల కాలముతో సమానముగ నుండును. విషువత్సంక్రమణ మాసములనగా సమకాలరాత్రిందివసమాసములని యర్థము.

దక్షిణోత్తరాయణములందు క్రమముగా రాత్రికాలము వృద్ధిక్షీణము

లగుచును, పగటికాలము క్షీణవృద్ధులుగనుండును శరద్వసంతఋతువులమధ్యయందు విభాగింపఁబడు ఏడుకళలను అహోరాత్రసంజ్ఞతో సోమునకు బొందుచుండును. ఈ లాగున పదునైదుదినములొకపక్షమనియు, రెండుపక్షములొకమాసమనియు, రెండు మాసములొకఋతువనియు. మూడుఋతువు లొకఅయనమనియు, రెండయనము లొకసంవత్సరమనియుఁ జెప్పబడును.

నిమేషము మొదలు కాష్ఠపర్యంతము పంచదశసంఖ్యతోను, ముప్పదికళలు, ఒకకాష్ఠమాత్రముగ అశీతిద్వయాత్మకముగ (౧౨) పరిణామముగలిగియు, శతఘ్ని యనియు నిరువదితొమ్మిది మాత్రలును, ముప్పదియారుమాత్రలును, రెండుమష్ఠు లును (౧౨౦) భాగము లై యిరువదిమూడు మాత్రలుగల కాలశక్తియందు చంచల మగు కాలమగుచున్నది. నలుబదివేలు నెనిమిదివందలు సంఖ్యగల కాలము విద్య లనబడును. ఇచ్చటనే జెబ్బదియునియు, తొంబదియునియు గూడ హ్రస్వవృద్ధులను నిశ్చయింపవలెను. ఒకయుగమందైన చలవిద్యుత్తుదినమంను (క్రాంతి) కార్యబ్రహ్మ మానకాలచక్రము నాలుగునూర్ల పరిణామాంశలుగలిగియుండును. ఇదికాలము యొక్క చరాంశయని తెలియవలెను. (దీనిపైనలేదు) ఈచరాంశ విషయమునే నాడికయంత్రముగాఁ (Observator) జూపరులకు గోలరూపమగుచున్నది ఇట్లు చెప్పుచున్న సంవత్సరాది కాలావయవము లైదువిధములుగ నాలుగుమానములందుఁ గల్పింపఁబడియున్నది. ఇట్లుసర్వకాలయుగముగ మనకు యుగమును నిశ్చయించిన విధానమని శాస్త్రములందు జెప్పబడినది.



# సంవత్సరభేదములు.

శ్రీవాయుపురాణం - అధ్యా ౫౦

సంవత్సరస్తు ప్రథమోద్వితీయః పరివత్సరః। ఇద్వత్సరస్తృతీయస్తు చతుర్థ శ్చానువత్సరః। పంచమోవత్సర స్తేషాం కాలస్తుపరిసంజ్ఞితః॥ ౧౩॥ వింశశతం భవే త్పూర్ణం పర్వణాంతుర వేర్యుగం। ఏతాన్యష్టాదశత్రింశ దుదయో భాస్కర స్యచ॥ ౧౪॥ ఋతవస్త్రింశతః స్తాశాఅయనాని దశైవతు। పంచత్రింశత్ శతం

చాపి షష్టిర్మాసాశ్చ భాస్కరః॥౧౮౫॥ త్రింశదేవ త్వహోరాత్రం సతుమాస శ్చభాస్కరః। ఏకషష్టిస్త్వహోరాత్రా దనురేకో విభావ్యతే॥౧౮౬॥ అహ్నాంతు త్ర్యధికాశీతిః శతం చాప్యధికంభవేత్। మానం తచ్చిత్రభానోస్తు విజ్ఞేయం భువనస్య తు॥౧౮౭॥ సౌరసామ్యంతువిజ్ఞేయం నక్షత్రం సావనంతథా। నామాన్యేతాని చత్వారిమైః పురాణం విభావ్యతే॥౧౮౮॥ శ్వేతస్యోత్తర తశ్చైవ శృంగవాన్నామ పర్వతః॥

" వేదప్రమాణములు "

పరాయతనం - బ్రాహ్మణము - కాఠకభాగం - చతుర్థప్రశ్నః

ప్రపాఠకః - ౬౯ పుట. ౫౭ అనువాకము.

అగ్నిర్వావసంవథ్సరః। ఆదిత్యఃపరివథ్సరః। చంద్రమా ఇదావథ్సరః। వాయుర నువథ్సరః। యద్వైశ్వదేవేన యజతే। అగ్నిమేవ తథ్సంవథ్సరమాప్నోతి తస్మాద్వైశ్వ దేవేన యజమానః। సంవథ్సరీణాగ్ం స్వస్తిమాశాస్త ఇత్యాశాసీత యద్వరుణ ప్ర ఘాసైర్యజతే। ఆదిత్యమేవ తత్పరివథ్సమాప్నోతి।

ఇందులోనింకననేకవిషయాదులున్నవి. వీటిప్రయోజనఫలాదులున్నవి. పూర్వ ము జెప్పిన పంచసంవత్సరముల సంజ్ఞతో ౧ సంవత్సరమనియు, ౨ పరివత్సరమనియు ౩ ఇద్వత్సరమనియు, ౪ అనువత్సరమనియు, ౫ వత్సరమనియు, ఇటు ఐదవ యవములుగాగల కాలముతో అరువదిసంవత్సరములును, దీనితోయుగసంజ్ఞగను వ్యావహారికములుగ జెప్పబడుచున్నది. ఇట్టికాలావయవములు నిరువదివందలు పూర్వము జెప్పిన అయనపర్వములతో పూర్ణమై పారమార్థికసూర్యుని కొకయుగమని జెప్పబడుచున్నది. ఇదేసౌరయుగము. ఇట్టియుగములు పదునెనిమిది పారమా ర్థిక భాస్కరోదయమునకు ముప్పదిసంఖ్యలు గలిగిన మాసమగును ఇట్టిముప్పది సౌరఋతువులు, పదిఅయనముల పరిమాణముగలదగును. నూటముప్పదైదు అయనములుగాని, లేక పూర్వము జెప్పిన సూర్యుని అరువదిమాసములుగాని పారమా ర్థికసూర్యుని పారమార్థిక కాలచక్రమగును. అతడు తత్ప్రవర్తకుడై భాస్కరుడగు చున్నాడు. అట్టిముప్పది అహోరాత్రముల కాలచక్రమే సౌరమాసమగుచున్నది. అరువది అహోరాత్రముల పరిమాణముగల కాలమైనచో భాస్కరమను కాల

మని భావింపబడుచున్నది. నూటయెనుబదిమూడుపగళ్ల కధికమగుకాలము (అయనము) పారమార్థికాగ్నిమానమునకు భువనకాలమని దెలియవలెను. ఈఅగ్నిభువనములలో సౌరమనియు, సౌమ్యమనియు, నాక్షత్రమనియు, సావనమనియు, నాలుగు నామముల క్రాంతిమానముగ జెప్పబడుచున్నది. ఏక్రాంతిమానముచే పురాణ వాఙ్మయము భావింపబడుచున్నదో దానికే క్రాంతిమానమని పేరు.

—o—

## మహాకారణత్రిమూర్తులకు సామాన్యత్రిమూర్తులకు గల భేదములు.

సమష్టిసత్వగుణ స్వరాట్టులో సమష్టిరజోగుణములో మహాకారణ త్రిమూర్తులుగ సంరాట్టులుగ బ్రహ్మాండా దుపరిభాగమున నున్నారు. మరల సమష్టి తమోగుణములో ప్రతివిరాడ్బ్రహ్మాండములో అంతర్భూతులుగ త్రిగుణములతో సామాన్యత్రిమూర్తులుగ నాయాకార్యాదుల నిమిత్తముగ కార్యనిర్వహణమునకును నవతరించి కార్యాంతములో మఱల మహాకారణత్రిమూర్త్యంశములో జేరుదురు. ఇటులనే ప్రతిబ్రహ్మాండములోను త్రివృత్కరణములతో నీత్రిమూర్తులవతరించుచు మఱల స్వస్వరూపములో జేరుచుందురు. దీనినిముఖ్యముగా దెలుసుకొనవలెను. పురాణములలో సందర్భానుసారముగ నొకరిని యధికముగను మరొకరిని తక్కువగను గొన్నిసమయములందును, విషయాదులందును న్యూనాధికులుగ విధిలేక జెప్పవలసియుండును. ఈ విభేదములు సామాన్యములుగను తాత్కాలికములుగను సమన్వయించవలెను. లేకున్న విపరీతభావనలతో విపరీతఫలమునే తప్పక బొందవలసివచ్చును. సమష్టిలో సర్వులు సమానులె. ఇటులనే శక్తిత్రయములోను సమన్వయము జేయవలెను.

మరల నీత్రిమూర్తులు నీత్రివర్గములో అనగా భూర్లోక భువర్లోక సువర్లోకములో దేవతాసంఘములోను ఋషులసంఘములోను మనలోకములో మానవరూపావతారములుగ సత్వగుణాంశములో త్రిమూర్తులు త్రిశక్తు లనేకావతారులుగ సందర్భానుసారముగ కార్యనిర్వహణార్థముగ నవతరించి కార్యానంతరము కారణమగు తదూర్ధ్వ త్రిమూర్తుల స్వస్వరూపములో నాయామూర్తులు జేరుదురేకాని

మఱల మనవలె యవధిలేని జన్మాములుగ జన్మించరు. ఈయవతారములలో నెవ రైనను తక్కువగా నవతరించినవార లైనను మనమువాటిని శాశ్వతసిద్ధాంతము లుగను అధికులుగను తలంచరాదు. అభిమానులై తలంచినచో నుత్తమఫలమెంత మాత్రమును బొందరు. ఒకఉదాహరణము:- విష్ణుపాదములో గంగపుట్టినది అట్టి గంగను శివుడు తనశిరస్సున ధరించినందుచేత శివుడువిష్ణువుకంటె నధముడనికొందరు తలంచవచ్చును. అదిసత్యమెట్టుగజాలని సామాన్యులతలంపు. శ్రీభాగవతాది గ్రంథములో విమర్శించిచూదినచో త్రివిక్రమ పాదాంగుష్ఠనఖముతో నూర్ధ్వ కటాహమునకు తగిలినందుచేత కటాహముపగిలినదై యారంధ్రమునుండి పైనున్నగంగ ధారగా విష్ణుపాదాంగుష్ఠమూలముగ గ్రిందికిబడినది దీనిదెలియ విమర్శించక దురభి మానులీవిధముగా నన్వయించిరి. గంగకు నుత్పత్తిస్థానము బ్రహ్మస్వరూపము నుండియే జనించి ప్రవహించినది. అట్టిగంగను మనత్రివర్గములోనికి భగీరథుని తపో మహిమతో మనభూలోకములో బడుటకుగాను నామహాజలపాత ధాటికి శివుడుతప్ప మరెవ్వరును ధరించలేరని (హాలాహలపానమువలె) శివునిబ్రార్థించగా లోకహితా ర్థముగ మహాకారణ మూర్త్యంశమునుండి నొకయంశముగా నీత్రివర్గములో శివ మూర్తిగా నాకార్యార్థమై యవతరించి నిజజటాజూటమునందు ధరించి భూమిమీ దికివిడిచెను. కార్యాంతమున స్వస్వరూపములోజేరెను. కాబట్టి త్రిమూర్తులా విర్భవించిరని వ్రాసిరేగాని మనజన్మాదులవలె సామాన్యులట్లు వ్రాయలేరి. సామాన్యజీవులవలె మరణాదులను బొందలేరి. స్వస్వరూపముతోనే మూలకార ణాతీతదేహములోజేరి స్వస్వరూపులైరి. గాని మరల అనంతజన్మాములుగ ముక్తిలేని బంధములను బొందలేరి. అవతారాద్భుత మాహాత్మ్యశక్తులను గుఱించి వివరింప నేల? పురాణాదులే నిదర్శనాదర్శన ప్రమాణప్రసిద్ధములుగనున్నవి. ఇటులనే నితరమూర్తులాధిక్య మందుచు సిద్ధాంతము జేయక విమర్శనలతో నాలోచించి ధన్యు లుగావలెను. భేదములెంతమాత్రము తలంపరాదు.

—o—

## ఊర్ధ్వ లోకాదుల వివరము.

శ్రీవాయుపురాణం - భువనకోశం - ఉపసంహారపాదః అధ్యా. 39.

ఋషయఊచుః:-

మహర్లోకేతి యత్ప్రోక్తం మాతరిశ్వం స్త్వయావిభో। ప్రిథిలోకేచ కర్తవ్య

మన్వైకైః సమధిష్ఠితాః॥ ౭ ॥ యావన్తశ్చైవ తేలోకాదహ్యాన్తే యేన తేప్రభో ఏ
తన్నఃకథయ పృత్యాత్వంహి వేత్థ యథాతథం॥ ౮ ॥ ఏవముక్తస్తతో వాయుర్మని
భిర్వినయాత్మభిః। ప్రోవాచమధురంవాక్యం యథాతత్త్వేన తత్త్వవిత్॥ ౯ ॥

వాయురువాచ:-

చతుర్దశైవస్థానాని వర్ణితాని మహర్షిభిః। లోకాఖ్యానితుయానిస్యుర్యేషు
తిష్ఠంతిమానవాః॥ ౧౦ ॥ సప్తతేషు కృతాన్యాహు రకృతాఃతుసప్తవై। భూరాద
యస్తుసంఖ్యాతాః సప్తలోకాః కృతాస్త్విహ॥ ౧౧ ॥ అకృతానితుసప్తైవ ప్రాకృతా
నితుయానివై। స్థానాని స్థానిభిః సార్థం కృతానితు నిబంధనం॥ ౧౨ ॥ పృథివీం చాం
తరిక్షంచ దివ్యంయచ్చమహః స్మృతం స్థానాన్యేతాని చత్వారి స్మృతాన్యావర్ణకాని
చ॥ ౧౩ ॥ క్షయాతిశయయుక్తాని తథాయుక్తాని వక్ష్యతే। యానినైమిత్తికాని
స్యుస్తిష్ఠం త్వాభూత సంప్లవం॥ ౧౪ ॥ జనస్తపశ్చ సత్యంచ స్థానాన్యేతానిత్రీణితు
ఏకాంతికాని సత్త్వాని తిష్ఠంతీహాప్రసంయమాత్॥ ౧౫ ॥ వ్యక్తానితు ప్రసఖ్యాని
స్థానాన్యేతాని సప్తవై। భూర్లోకః ప్రథమస్తేషాం ద్వితీయస్తు భువస్స్మృతః॥ ౧౬ ॥
స్వస్తృతీయస్తు విజ్ఞేయశ్చతుర్థోవై మహాస్మృతః। జనస్తుపంచమోలోక స్తపఃషష్ఠో
విభావ్యతే॥ ౧౭ ॥ సత్యంతుసప్తమోలోకో నిరాలోకాస్తతఃపరమ్। భూరితివ్యా
హృతేపూర్వం భువర్లోకశ్చతతోఽభవత్॥ ౧౮ ॥ ద్వితీయంభువ ఇత్యుక్త అంతరిక్షం
తతోఽభవత్। తృతీయంస్వరితీత్యుక్తో దివంప్రాదుర్బభూవహ॥ ౧౯ ॥ వ్యాహారై
స్త్రిభిరేతైస్తు బ్రహ్మాలోక మకల్పయత్। తతోభూః పార్థివోలోక అంతరిక్షం భువః
స్మృతం॥ ౨౦॥ స్వర్లోకోవైదివం హ్యా తత్పురాణో సిక్ష్చయంగతం। భూతస్యాధిపతిశ్చా
గ్ని స్తతో భూతపతిస్స్మృతః॥ ౨౧॥ వాయుర్భువస్యాధిపతిస్తేన వాయుర్భువపతిః భవ్య
స్యసూర్యోఽధిపతిస్తేన సూర్యోదివస్పతిః॥ ౨౨॥ మహేతివ్యాహృతేనైవం మహర్లోకాస్త
తోఽభవత్। వినివృత్తాధికారాణాం దేవానాంతత్రవైక్షయః॥ ౨౩ ॥ జనస్తుపంచమో
లోకస్తస్మాజ్జాయంతివైజనాః। తాసాంస్వాయంభువాద్యానాం ప్రజానాం జననాజ్జనః॥
౨౪ ॥ యస్తాఃస్వాయంభువాద్యాహి పురస్తాత్పరికీర్తితాః। కల్పదగ్ధేతదాలోకే ప్రతిష్ఠంతి
తదాతకః॥ ౨౫॥ ఋభుఃసనత్కుమారాద్యాయత్ర సంతూర్ధ్వరేతసః। తపసాభావితా
త్మానస్తత్ర సంతీతివాతపః॥ ౨౬ ॥ సత్యేతిబ్రహ్మణః శబ్దః సత్తామాత్రస్తు సస్మృ
తః। బ్రహ్మలోకాస్తతః సత్యస్సప్తమః సతుభాస్వరః॥ ౨౭ ॥ మరీచిః కస్యపో
దక్షస్తథాస్వాయంభువోంగిరాః। భృగుః పులస్త్యః పులహః క్రతురిత్యేవమాద
యః॥ ౩౫ ॥ ప్రజానాంపతయ స్సర్వేప్రవర్తంతే తత్రవైఃసహ। నిఃసత్వాన్నిర్మమా

శ్చైవ తత్రితేహ్యూర్ధ్వరేతసః॥ ౩౬ ॥ ఋభుః సనత్కుమారాద్యా వైరాజ్యాస్తే తపోధనాః। మన్వంతరాణాం సర్వేషాం సావర్ణానాం తతః స్మృతాః॥ చతుర్దశానాం సర్వేషాం పునరావృత్తిహేతవః॥ ౩౭ ॥ యోగంతపశ్చ సత్యంచ సమాధాయ తదాత్మని। షష్టికాలే నివర్తంతే తత్రదాహార్వపర్యయే॥ ౩౯ ॥ సర్వేసూక్ష్మ శరీరాస్తే తత్రిస్థాస్తు భవంతి తే। ౪౩ ॥ తేషాం తేతుల్యసామర్థ్యాస్తుల్యమూర్తి ధరాస్తథా। జనలోకేనివర్తంతే యావత్సంప్లవతే జగత్। ౪౪ ॥ వ్యుష్టాయాంతు రజన్యాంవై బ్రిహ్మణోఽవ్యక్తయోగిన। అహారాదౌప్రిసూయంతే పూర్వవత్క్రిమశాస్త్విహ॥ ౪౫ ॥ స్వాయంభువాదయః సర్వేమరీచ్యంతాస్తుసాధకాః। దేవాస్తేవై పునస్తేషాం జాయంతేనిధనేష్విహ॥ ౪౬ ॥ యామాదయః క్రిమేణైవ కనిష్ఠాద్యాః ప్రిజాపతేః। పూర్వం పూర్వం ప్రిసూయంతే పశ్చిమే పశ్చిమాస్తథా। ౪౭ దేవాన్యయేదేవతాహి సప్తసంభూతయః స్మృతాః। వ్యతీతాః కల్యజాస్తేషాం త్రిస్రః శిష్టాస్తథాపరే॥ ౪౮ ॥ ఆవర్తమానాదేవాస్తే క్రిమేణైతేన సర్వశః। గత్వాచజాంతప్రీ భావం దశకృత్వః పునః పునః॥ ౪౯ ॥ తతస్తేవైగణాః సర్వేదృష్టా భావేష్వనిత్యతామ్। భావినోర్థస్యచబలాత్ పుణ్యాఖ్యాతి బలేనచ॥ ౫౦ ॥ నివృత్తవృత్తయః సర్వే స్వస్థాః సుమనసస్తథా। వైరాజో తూపపద్యంతేలోకా మృత్యుజ్యత్యజనం॥ ౫౧ ॥ తతోఽన్యైనైవకాలేన నిత్యయుక్తాస్తపస్వినః। కథనాచ్చైవధర్మస్య తేషాంతే జజ్ఞిరేఽన్వయే। ౫౨ ॥ ఇహోత్పన్నాస్తతస్తేవై స్థానాత్పూరయంత్యుత। దేవత్వేచ ఋషిత్వేచ మనుష్యత్వేచ సర్వశః॥ ౫౩ ॥ ఏవందేవగణాః సర్వేదశకృత్వో నివర్త్యవై। వైరాజేపూప పన్నాస్తే దశతిష్ఠంత్యుపప్లవాన్॥ ౫౪ ॥ పూర్ణే పూర్ణతతః కల్పేస్థిత్వావైరాజకేపునః। బ్రిహ్మలోకే నివర్తంతే పూర్వపూర్వక్రిమేణతత్॥ ౫౫ ॥ ఏతస్మిన్ బ్రిహ్మలోకేతు కల్పేవైరాజకేగతే। వైరాజం పునరప్యేకే కల్పస్థాన మకల్పయన్॥ ౫౬ ॥ ఏవంపూర్వాను పూర్వ్యేణ బ్రిహ్మలోకగతేష్వవై ఏవంతేషు వ్యతీతేషు తపసాపరికల్పితే। వైరాజే తూపపద్యంతే దశకృత్వో నివర్తతే। ౫౭ ॥ ఏవం దేవ యుగానీహ వ్యతీతాని సహస్రిశః। నిధనం బ్రిహ్మలోకేతు గతానామృషిభిఃసహ॥ ౫౮ ॥

సూతఉవాచ:-

నశక్యమానుపూర్వేణ తేషాంవక్తుం ప్రవిస్తరం। అనాదిత్వాచ్చకాలస్య హ్యసంఖ్యానాచ్చసర్వశః। ఏవమేవ నసందేహో యథావత్కథితంమయా॥ ౫౯॥ తదుపశ్రుత్యవాక్యార్థ మృషయః సంశయాన్వితాః। సూతమూచుః పురాణజ్ఞం

వ్యాసశిష్యం మహామతిం॥ ౭౦ ॥
ఋషయ ఊచుః:-

వైరాజాస్తే యదాహారా యత్సత్త్వాశ్చ యదాశ్రయాః॥ తిష్ఠంతి చైవ యత్రాలం తన్నో బ్రూహి యథాతథమ్॥ ౭౧ ॥ తమక్త మృషిభిర్వాక్యం శ్రుత్వాలోకార్థతత్త్వవిత్। సూతః పౌరాణికో వాక్యం వినయేనే దమబ్రవీత్ ॥ ౭౨॥ తతః ప్రాప్యం త తే సర్వే శుద్ధిశుద్ధతమాశ్చ యే। అభూతసంప్లవాస్తత్ర దశతిష్ఠంతి తేజనాః॥౭౩॥ సర్వేసూక్ష్మ శరీరాస్తే విద్వాంసో ఘనమూర్తయః। స్థితలోకాస్థితత్వాచ్చ తేషాం భూతం నవిద్యతే॥ ౭౪॥ ఊచుః సనత్కుమారాద్యాః సిద్ధాస్తే యోగధర్మిణః। ఖ్యాతిం నేమిత్తకీం తేషాం పర్యాయే సముపస్థితే॥ ౭౫ ॥ స్థానత్యాగో మనశ్చాపి యుగవత్సంప్రవర్తతే। ఊచుస్సర్వే తదాఽన్యోన్యం వైరాజాంచ్ఛుద్ధబుద్ధయః॥ ౭౬ ॥ ఏవమేవమహాభాగాః ప్రణవం సంప్రవిశ్యవా। బ్రహ్మలోకే ప్రవర్తా నస్తన్నః శ్రేయో భవిష్యతి॥ ౭౭ ॥ ఏవముక్త్వాత దాసర్వే బ్రహ్మాణం తే వ్యవసాయినః। యోజయిత్వా తదాసర్వే వర్తంతే యోగధర్మిణః॥ ౭౮ ॥ తత్త్రైవసంప్రలీయంతే కాంతా దీపార్చిషోయథా। బ్రహ్మకాయ మవర్తంత పునరావృత్తిదుర్లభమ్॥ ౭౯ ॥ లోకంతం సమనుప్రాప్య సర్వే తే భావనామయమ్। ఆనందః బ్రహ్మణః ప్రాప్యహ్యమృతత్వాయతే గతాః॥ ౮౦ ॥ వైరాజో భ్యస్తథైవోర్ధ్వమంతరే షడ్గుణేతతః బ్రహ్మలోకః సమాఖ్యాతే యత్ర బ్రహ్మపురోహితః॥౮౧॥ తేసర్వే ప్రణమాత్మానో బుద్ధశుద్ధతపస్తదా ఆనందబ్రహ్మణః ప్రాప్యమృతత్వంచ భజంత్యుత॥ ౮౨ ॥ ద్వంద్వైస్తేనాభిభూయంతే భావత్రయ వివర్జితాః। ఆధిపత్యం వినాతుల్యా బ్రహ్మణస్తే మహాజనః॥ ౮౩॥ ప్రభావ విజయైశ్వర్య స్థితి వైరాగ్య దర్శనైః। తేబ్రహ్మలౌకికాః సర్వేగతిం ప్రాప్య నివర్తనీమ్॥ ౮౪ ॥ బ్రహ్మణాసహ దేవైశ్చ సంప్రాప్తే ప్రతిసంచరే। తపసోంతే క్రియాత్మానో బుద్ధావస్థామనీషిణః॥

—॥ ప్ర ళ య ం. ॥—

అవ్యక్తే సంప్రలీయంతే సర్వే తేక్షణ దర్శినః॥ ౮౫ ॥ ఇత్యేతదమృతంశుక్రం నిత్యమక్షయమవ్యయం దేవర్షయో బ్రహ్మసత్రం సనాతన ముపాసతే॥ ౮౬ ॥ అపునర్మార్గగాదీనాం తేషాంచైవోర్ధ్వరేతసాం। కర్మాభ్యాసకృతాశుద్ధిర్వేదాంతే షూపలక్ష్యతే॥౮౭॥ తత్రతేఽభ్యాసినో యుక్తాః పరాంకాష్ఠాముపాసతే। హిత్వా శరీరం పాప్మానమమృతత్వాయతే గతాః॥ ౮౮ ॥ వీతరాగా జితక్రోధాః నిర్మోహాః సత్యవాదినః। శాంతాః ప్రణిహితాత్మానో దయావంతో జితేంద్రియాః॥ ౮౯ ॥

సిన్నంగాః శుచయశ్చైవ బ్రహ్మసాయుజ్యగాస్స్మృతాః। అకామయుక్తైర్యేవీరాస్త పోభిర్దగ్ధకిల్బిషాః। తేషామభ్రంసినోలోకా అప్రమేయ సుఖాస్స్మృతాః॥ ౯౦॥ ఏత ద్బ్రహ్మపదందివ్యం పరమంవ్యోమ్ని భాస్వరం। గత్వానయత్రశోచంతి వ్యామరా బ్రహ్మణాసహ॥ ౯౧॥

## —♦ ఊర్ధ్వలోకముల విశేష వివరము. ♦—

ఇందులోని కొన్ని విషయములు మహర్లోకవిషయములో వివరించియుండుట చేత నచ్చటచ్చట విడువబడియున్నవి (గమనించవలెను.)

మహర్లోకమని నీవుదేనినిగుఱించి చెప్పితివో దానినిగుఱించి సంపూర్ణయథా ర్థమును నెరుగుదువుగాన మరలవిస్తరించి చెప్పవలెనని మహర్షులు శ్రీవాయుదేవుని ప్రశ్నించిరి. ఏలోకములు మహర్లోకాధారములైయుండి మన్వంతర ప్రళయమందు దహింపబడునో వాటినిఁజెప్పఁగోరిరి. అంతవాయుదేవుఁడిట్లని ప్రత్యుత్తరంబొసఁగెను.

పదునాలుగుస్థానములే లోకములు, మనువులసంకల్పములచే జన్యులు. వార లేలోకములందు నివసించియున్నారో యవియే జన్యలోకములు. ఆపదునాలుగు లోకములలో నేడులోకములు కర్మసంబంధములు. ఇతరములుజ్ఞానసంబంధములు. క్రింది ఈయేడులోకములు మహర్లోకార్ధభాగముతోఁ జేరియున్నవి. ఊర్ధ్వలోకము లేడు నట్లేమహర్లోకోర్ధ్వభాగముతోఁ జేరియుండును.

మహర్లోకార్ధభాగయుతోర్ధ్వలోకము లోక కోటిఖండములుగను, అధోలోక ములట్టులే యొకకోటిఖండములుగ విభజింపఁబడినవి. ఈలోకము లయారోహణా లగు వరోహణ మార్గములు జ్ఞానాజ్ఞానమార్గములు. గను,

పృథివ్యంతరిక్ష ద్యులోకఖండములును మహర్లోకములోని సగముఖండము గ గలసి నాలుగుస్థానములు ఋణత్రయములతో సంబంధించినవిగాఁజెప్పఁబడుచున్నవి. ఇవి త్రయాశ్రయ యుక్తములై భౌతికప్రళయమగువఱకు నైమిత్తికములని చెప్పఁ బడును. జనలోక, తపోలోక, సత్యలోకములనెడి మూడును ఐకాంతికములై ప్రాణుల భూతసంప్లవమువఱకు నిత్యములనిచెప్పఁబడును. అనగా మన్వంతర ప్రళ యమువఱకని తెలియవలెను. కాబట్టి వ్యక్తములైన నీయేడుస్థానములను జెప్పు చున్నాను.

౧ భూర్లోకము, ౨ భువర్లోకము, 3 సువర్లోకము, ౪ మహర్లోకము ౫ జనలోకము, ౬ తపోలోకము, ౭ సత్యలోకము, దీనిపైన సిరాలోకము

దును. పరాయత బ్రాహ్మణము - ద్వితీయాష్టకము - ద్వితీయప్రపాఠకము - నాలుగవఅనువాకం. ఇందులో సర్వసృష్టిక్రమమున్నది.

ప్రజాపతిరకామయత ప్రజాయేయేతి। సఏతద్దశహోతార మపశ్యత్। తేన దశధాzzత్మానం విధాయ। దశహోత్రాzతప్యత। తస్యచిత్తి స్స్రుగాసీత్। చిత్త మాజ్యమ్। తస్యైతావత్యేవ వాగాసీత్। ఏతావా యజ్ఞక్రతుః। సచతుర్హోతారమసృజత। సోzనన్దత్॥ ౨౧॥ అసృక్షివా ఇమమితి। తస్యసోమో హవిరాసీత్। సచతుర్హోత్రాzతప్యత। సోzతామ్యత్। సభూరితివ్యాహరత్। సభూమిమసృజత అగ్నిహోత్రన్దర్శపూర్ణమాసౌ యజూగ్ంషి। సద్వితీయ మతప్యత। సోzతామ్యత్। సభువఇతి వ్యాహరత్॥ ౨౨॥ సోzన్తరిక్షమసృజత। చాతుర్మాస్యాని సామాని। సతృతీయ మతప్యత। సోzతామ్యత్। ససువరితి వ్యాహరత్। సదివమసృజత అగ్నిష్టోమ ముక్థ్యమతి రాత్రిమృచః। ఏతావైవ్యాహృతయ ఇమేలోకాః। ఇమాన్ఖలువైలోకానుప్రజాః పశవశ్ఛందాగ్ంసి ప్రాజాయన్త। యఏవమేతాః ప్రజాపతేః ప్రథమావ్యాహృతీః ప్రజాతా వేద॥ ౨౩॥ ప్రప్రజయా పశుభిర్మిథునైర్జాయతే। సపఞ్చహోతార మసృజత। సహవిర్నావిన్దత। తస్మైసోమ స్తనువం ప్రాయచ్ఛత్। ఏతత్తే హవిరితి। సపఞ్చహోత్రాzతప్యత। సోzతామ్యత్। సప్రత్యఙ్ఙబాధత। సోzసురానసృజత। తదస్యాప్రియమాసీత్॥ ౨౪॥ తద్దుర్వర్ణగ్ం హిరణ్యమభవత్। తద్దుర్వర్ణస్య హిరణ్యస్యజన్మ। సద్వితీయమతప్యత। సోతామ్యత్। సప్రాఙబాధత। సదేవానసృజత। తదస్యప్రియమాసీత్। తథ్సువర్ణగ్ం హిరణ్యమభ

వత్। తద్ధ్సువర్ణస్య హిరణ్యస్యైజన్మ। యఏవగ్ సువర్ణస్య హిరణ్యస్య జన్మ వేద॥౨౫॥ సువర్ణఆత్మనాభవతి। దుర్వర్ణోఽస్య భ్రాతృవ్యః। తస్మాద్ధ్సువర్ణగ్ం హిరణ్యం భార్యమ్। సువర్ణఏవభవతి। ఐశం ప్రియగ్చ్ఛతి నాప్రియమ్। సనప్తహోతార మసృజత। సనప్తహోత్రైవ సువర్గల్లోకమైత్। త్రిణవేనస్తోమే నైభ్యో లోకేభ్యోఽసురాన్ప్రాణుదత। త్రయస్త్రిగ్ంశేన ప్రత్యతిష్ఠత్। ఏకవిగ్ంశేనరుచమధత్త॥౨౬॥ సప్తదశేన ప్రాజాయత। యఏన విద్వాన్ థ్సోమేన యజతే। సప్తహోత్రైవ సువర్గల్లోకమేతి। త్రిణవేన సోమైనైభ్యోలోకేభ్యో భ్రాతృవ్యాన్ప్రణుదతే। త్రయస్త్రిగ్ంశేన ప్రతితిష్ఠతి। ఏకవిగ్ంశేన రుచనత్తె। సప్తదశేన ప్రజాయతే। తస్మాథ్సప్త దశస్తోమో ననిర్హృత్యః। ప్రజాపతిర్వైసప్తదశః। ప్రజాపతి మేవమధ్యతో ధత్తే ప్రజాత్యై॥౨౭

అగ్నిహోత్రాది శ్రౌతకర్మలతోసహా భూరాదిలోకసృష్టికూడ వేదములో వినబడుచున్నది.

భూః యని బ్రహ్మచేత వచింపఁబడగా భూలోకముగలిగెను. అటులనే, భువః అనుటచే అంతరిక్షమును, సువః అనుటచే స్వర్గమునుగలిగెను. ఈమూఁడు వ్యాహృతులచేతనే బ్రహ్మ, లోకములను గల్పించెను. ఈమూఁటిలోఁబడునాలుగు లోకములిమిడియున్నవని తెలియవలెను. భూర్లోకమనఁగా బృథివీసంబంధముగను, భువర్లోకమనఁగా అంతరిక్షసంబంధముగను, సువర్లోకమనఁగా స్వర్గలోకసంబంధముగ సీవ్యాహృతి త్రయమునే పురాణములందు లోకత్రయముగా జెప్పఁబడెను. భూతాధిపతి అగ్నిగనున్న రుద్రుఁడనియు, అంతరిక్షాధిపతి వాయువనియు భువర్లోకాధిపతియనియు, భవ్యమునకుఅనఁగా రాబోవులోకాధిపతి సూర్యుఁడనియు స్వర్గలోకాధిపతియనియు నీసూర్యునికే నానావిధ నామములు ఇంద్రాదిగా ప్రాజాపత్యాదిగా జెప్పఁబడుచున్నది. శింశుమారమనినను సూర్యునితేజస్సంబంధమే ధ్రువుఁడన్నను సూర్యుఁడే. మహః అని వచింపఁబడగా నాలుగవదియగు మహర్లోకముగలిగెను.

నివృత్తినిబొందినదేవతలు మహర్లోకనివాస యోగ్యతాధికారముగలవారలై

యాలోకనివాసులగుదురు. అయిదవది జనలోకము. ఈలోకమునకు బ్రైవిధము గనే రాగలరు. ఈలోకములనుండి మరల గ్రిందిలోకాదులకు నొకప్పుడు లోకానుగ్రహార్థమై అధికారావతార మహామూర్తులుగ వచ్చుచుందురు. కార్యానంతరము, మరల తమనిజస్వరూపమును జేరుదురు. జనలోకము స్వాయంభువాది మనువుల యొక్కయు దజ్జనులయొక్కయు జన్మస్థానమగుటచే జనలోకమని ప్రతీతిగలిగినది. అట్టిజనలోకవాసము కొఱకు జన్మించిన స్వాయంభువాద్యాధికారిక ప్రజలు, మనువులు. మన్వంతరప్రళయమందు నాలోకము దగ్ధముకాగా దదూర్ధ్వమగు తపోలోకమునాశ్రయింతురు. సామాన్యముగా మనలోకములో ఉపద్రవాదులు సంభవించునపుడు మనముకూడ స్థలాంతరములకు మార్పుచెందినట్లేయని గ్రహించవలెను. తపోలోకమనఁగా ఋభువులు నూర్ధ్వరేతస్కులగు సనత్కుమారాదులు. తమతపోబలముచే సదానివసించు లోకము. సత్యమనునది బ్రహ్మపరమగు శబ్దము. అదిసత్తామాత్రమనియే చెప్పఁబడుచున్నది. అందుచేత బ్రహ్మలోకమనియు, తపోలోకమనియు, సత్యలోకమనియు నేడవసూర్యలోకమనియు చెప్పఁబడుచున్నది.(౩౨)

గంధర్వులు,అప్సరసలు, యక్షులు, గుహ్యకులు రాక్షసులతోఁగూడిన సర్వభూతపిశాచాదులు మనుష్యులతోఁగూడిన నాగులు, స్వర్లోకవాసులందరు భూలోకమునందుఁగూడ నివసింతురు. అటులనే మరుత్తులు, ఆవహుతాదిగావాయుసప్తమరుత్పథాదులు రుద్రాధిదేవతలు,అశ్వినులు, నియమితస్థానములేక భూర్లోక స్వర్గలోకములందు నుండగలరు (౩౨) ఇటులనే ద్వాదశాదిత్యులు, ఋభుగణములు,విశ్వేదేవతలు, సాధ్యదేవతలు, పితరులు, అంగీరసవంశఋషులు భువర్లోకమును, సువర్లోకమును నాశ్రయింతురు. వీరలే వైమానికులై తారాగ్రహములుగా, అంగారక, బుధ, బృహస్పతి, శుక్ర, శనిగ్రహములుగను బైనజెప్పబడిన ప్రకారము బ్రహ్మయొక్క వ్యాహృతులవలన బుట్టినవారలగుదురు.(33) వ్యాహృతిలోకములు భూర్లోకాదిగ మహర్లోకాంతములని చెప్పబడుచున్నవి. తన్మాత్రలచేతనే సృష్ట్యారంభము చేయబడి పరస్పరము అట్టితన్మాత్రశరీరములచేతనే పరిశుద్ధములగుచున్నవి. అనగా నొకశరీరములో అంతరమందు మరలశరీరములు వృత్కరణములుగానుండును. (33) ఇదిమహర్లోకవిషయములో వ్రాయబడినది. (3౪) భూర్లోకము మొదలు మహాదంతముగా ఆరోహణావరోహణ క్రమముతో నేవిలోకములుగా జెప్పబడినవో వాటిని సప్తప్రకృతులుగల సూర్యకిరణములు జ్వాలలచేఁ దపింపజేయుచుండుచు. (3౫) మరీచి, కశ్యప, దక్ష, స్వాయంభువ, అంగిరస, భృగు, పులస్త్య, పులహ క్రతువులు

నవప్రజాపతులై యాయాలోకవాసులైన ప్రజలతోసహా ఆయాలోకములందు నివసించుచుందురు. (౩౬) శుద్ధసత్త్వులు, నిర్మలులు, ఊర్ధ్వరేతస్కులగు, ఋభువులును, సనకాదులును, మహావిరాట్సంబంధముచే దపోధనులై సావర్ణిమన్వంతరముగా సకలమన్వంతరములకు నధిపతులని చెప్పబడుచు పునరావృత్తిలేనివారలగుచుందురు. (౩౭) ఇతరులు స్మార్తయోగము, తపస్సు, సత్యము, ఆత్మయందు సమాధానపఱచుకొని ఆరవకాలమనగా పగలైదుకాలములు గతించగా రాత్రికాలమందు నివృత్తిధర్మముగల వారలగుటచేత నట్టిఊర్ధ్వరేతస్కులగు మహర్షులకు అహర్విపర్యయమగా రాత్రిపగలను భేదములులేక ననుభవింతురు. గీతావాక్యప్రమాణ మీయర్థమును సూచించును "యానిశాసర్వభూతాని యస్యాంజాగర్తిసంయమి। యస్యాంజాగ్రతిభూతాని సానిశాపశ్యతోమునేః" రాత్రిపగలుగను పగలురాత్రిగను మన్దృష్టికిభేదముగ నగపడుచుండును. రాత్రిభూత సృష్టికాలము ఇదివారలకు లయకాలము. భూతములకు జాగ్రత్కాలమగు పగలు యోగులకు జాగ్రత్తతోపనిలేనందున సంబంధములేనందుచేత లయకాలమగును. (౩౮) సత్యమనువ్యాహృతియే సత్యలోకము. ఇదియేడవది. ఇదిపునరావృత్తిలేని అప్రతిహాతమగు లోకమని చెప్పబడుచున్నది. ఈసత్యలోకములో సమష్టితో పరిమాణవైశాల్యాదులచే భూర్లోకమున్నది. దీనికిభూర్లోకసమితియని సాంకేతికము. భూమిమొదలు ఆదిత్యునివఱకుఁగల అంతరాళమే అంతరిక్షమని భువర్లోకమని చెప్పబడును. (౪౦-౫౬ వరకు) దీనివివరము మహర్లోకములో వ్రాయబడినది. (౫౬-౬౧) బ్రహ్మదేవునియొక్క కనిష్ఠాంగుళ్యాదిగా యామాదిదేవతా గణములును, ఋషిగణములును, పూర్వపూర్వముగా ప్రత్యగ్దృష్టిగలవారై ఆత్మయందే సంతానవంతులగుచుందురు. అనగా "నరఋషిదేవ ద్రుహిణవిష్ణు రుద్రాద్యుదీరితం। ఉత్తరోత్తరవైశిష్ట్యాత్పూర్వపూర్వప్రబాధకమ్॥" అను ప్రమాణరీతిగా షట్చక్రదేవతలలో నరాదిజన్మక్రమముచే, ఆజ్ఞాచక్రనేత్రవిద్యాసిద్ధిగల రుద్రదేవతాపదవివఱకు పూర్వపూర్వసంసార ప్రవృత్తి దుఃఖప్రదమగుచుండుటచే ఉత్తరోత్తర నివృత్తిజన్మసంసారముచే బాధితమగుచుండును. కావున కర్మసాధనమగు హస్తాంగుళులు కనిష్ఠాదిక్రమమున వ్యవహారికి జ్యేష్ఠపదప్రాప్తి పర్యంతముగా ననగానంగుష్ఠపర్యంతము కర్మజ్యేష్ఠత్వము నష్టమైనపిమ్మటగాని నీసృష్టిక్రమమునకు జన్మమేమొదలో లేక మరణమేమొదలగునో వేదాంతములయందు గ్రమసృష్టి అక్రమసృష్టి చెప్పబడుటచే సాధకుండు తెలియనేరఁడు దానిని దెలియుటకు నీపంచపదములు క్రమముగ బాధితము

లై నిజమగు రుద్రపదము ప్రాప్తించినవెనుక సాధకుడు దెలుసుకొనగలడు. ఈ రహస్యమునుగూర్చియే "నారుద్రః క్రమపాఠకః"అని ప్రమాణములున్నవి. ఇవ న్నియును తనఆత్మయందే ఆధ్యాత్మయోగదృష్టితో నీసంతానపదవులన్నియును కనుగొని పొందుదురు. మనచేతియైదంగుళీయములకు నైదధికారదేవతాపద వులున్నవి. అన్నిటికిని బెద్దది అంగుష్ఠము. ఇదియేవిష్ణుపదబ్రహ్మము. ఆదిలోనర త్వమే కనిష్ఠాంగుళీయము. రెండవదిఋషిత్వము, మూడవది దేవత్వము, నాలు గవది ద్రుహిణత్వము (బ్రహ్మ), అయిదవది విష్ణుత్వము, ఆరవదే ఆజ్ఞాచక్రము రుద్రస్థానము. ఈలాగున షట్చక్రములకును సమన్వయము. మరొకవిధానముతోఁ గనిష్ఠికము యామగణము, అనామికఋషిగణము, మధ్యమము మానవగణము, మను గణము, తర్జనీనవవిధమాన కాలమానములు, అంగుష్ఠము సనకాదులుగ సమన్వయించ వలెను. దేవాన్వయమందు దేవతలు, ఋష్యన్వయమంద ఋషులు సప్తసంఖ్యాక గోత్రసంతతి గలవారలై యుండుటలో మూడుగతకల్పములు మిగిలిన నాలుగును వర్తమానములనియుఁ దెలియవలెను. (గీ॥ వీరుక్రమము చే ఆవర్తమానమైన దేవ తాభావముగలవారై జన్మమునకురాక జగన్ముఖత్వమాత్రము చేతనే (అనగా చూపు మాత్రము) మరల మరల జన్మముగలవారలవలె ఆభాసగాఁదమభావములందనిత్య త్వమునేచూచి భవితవ్యతా బలమువల్లను పుణ్యాధిక్యత ఖ్యాతిబలముచేతను నివృత్త సంసారవృత్తిగలవారలై స్వర్గస్థులై శాశ్వతమగు దేవత్వమును బొందగలరు. మహా విరాట్టునందు నాజనలోకమునుగూడ విడిచి గత్యుత్క్రమణములు లేనివారలై మహా విరాట్స్వరూపమునే పొందెదరు. శ్రుతిప్రమాణము, "సతస్యప్రాణా ఉత్క్రా మంతి అత్రైవ సమవలీయంతే" (౬౧) తర్వాతమరియొక కాలముచేగూడ తపో లోకమందు యోగాభ్యాస తత్పరులై ధర్మతత్త్వముయొక్క ఉపదేశమువలన తమ తమ వంశమునందే యవతరించుచుందురు. (౬౨) ఈమహావిరాట్టునందే ఆవిర్భ వించి తమతమవంశస్థానములగు దేవత్వమందుగాని, ఋషిత్వమందుగాని, మనుష్యత్వ మందుగాని, తమస్థానములను బూరించుచుందురు. ఈప్రకారము సర్వదేవతాగణ ములు పదిపర్యాయములు నివృత్తినిబొంది అనగా దశావతారులై ఏకవింశత్యవ తార లీలారూపులై విరాట్టుస్థానమునందే దశసంఖ్యాకములగు శ్రీశంకరుని అవ్యయ ములతో సమానములగు ఉపప్లవములను (యోగవిఘ్నములను) బొందుచుందురు. లోకజన్మాదిదుఃఖములతోఁ దపింతురు. (౬౩)

ఇట్లు తమతమ ఆయుఃకల్పము పూర్ణమగుచుండగా విరాట్టు ధారణోపాసన

యుం దేయుండి పూర్వపూర్వక్రమముచే బ్రహ్మలోకవిషయమై నివృత్తినిబొందుదురు (౬౫). ఈప్రకారము బ్రహ్మలోకమందైన మహావిరాట్కల్పము గతించగా మరికొందరు సాధకులు ఉపాసకులగు ఋషులు విరాడవయకల్పమునుగూడ కల్పించుచున్నారు. జడచైతన్యమును భాగాలుగ విభజించిరనియర్థము. సృష్టినిజేసిరి. దీనినే గీతలో "భూమిరాపో నలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ। అహంకార ఇతీయంమేభిన్నాప్రకృతిరష్టధా॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరామ్। జీవభూతాం మహాబాహో యయేదంధార్యతేజగత్॥ ఏతద్యోనీనిభూతాని సర్వాణీత్యుపధారయ॥" చిజ్జడప్రకృతిభేద సృష్టిలోని ఆత్మయొక్క ప్రకృతిభేదమును గీతాచార్యుడు వివరించెను. ఎనిమిదిక్షేత్రములు కనిమిదియోనులని తెలియవలెను. జడములో కనిమిదియంశములు, క్షేత్రజ్ఞునిలో కనిమిదిఅంశలుకలసి పదునారంశములు. దీనికతీతుడు పురుషోత్తముడు. (౬౬)

ఈప్రకారముగ మొకటిక్రమము ననుసరించి బ్రహ్మలోకపర్యంతముగు క్రమముచే బూర్వకల్పములు గతించగా కేవల తపస్సుచే బరికల్పితమగు విరాడవయవకల్పమందు బదివర్యాయములు ప్రవృత్తిధర్మమును బొందుచుందురు. తదుపరి ఆత్మప్రవృత్తి ధర్మమునుండి నివర్తింతురు (౬౭) ఈప్రకారము వేలకొలది దేవయుగములు గతించెను. బ్రహ్మలోకమందు సనకాదిఋషులతోసహా నిధనమును బొందినవారియొక్క దేవయుగములు గతించినవి (౬౮). కాల మనాదికావున నాదేవయుగములయొక్కగాని యాదేవయుగములలోని ధనమునుబొందినవారియొక్కగాని విషయమును సామాన్యయముగ జెప్పితిని. విశేషించిచెప్ప వీలులేదని సూతుల వారు చెప్పుటచేత ఋషులు సంశయగ్రస్తులై మరలప్రశ్నించిరి (౬౯).

మహావిరాట్టునందుగల లోకాధికారఋషు లెట్టియాహార సత్వబలముగలవారలై యుందురో వారికాలమెట్టిదో చెప్పవలెనని ప్రశ్నించిరి.

అట్లు ఋషులవాక్యములనువిని సకలలోకార్థ హితతత్వ వేత్తయగు నాసూతుడు సవినయముగ బలికెను (౭౦).

ఆతపోలోకమునుండి పరిశుద్ధతపస్సుగల వారావిరాట్స్వత్యలోకమునుబొందివారిపంచభూతముల పంచీకరణము నశించుపర్యంతము పదియుగములుమాత్ర ముచ్చటనుందురు (౭౧). వారలుసూక్ష్మశరీరులుగను, మహావిద్వాంసులుగను, మహామేఘస్వరూపులుగ నుండుటచేత వారిదృష్టిలో జడభూతమేయుండదు. అన్నియును చైతన్యములే. గతించినకాలమేయుండదు (౭౨). అచ్చటినిత్యులుగానుండెడి సన

త్కుమారాదులు యోగసిద్ధులగుటచేత గార్గ్యబ్రహ్మయొక్క విపర్యయము సంభవించగా నైమిత్తిక ఖ్యాతినిబొంది యోగమునుండి వ్యుత్థానము నుబొంది యొకే పర్యాయము స్థానత్యాగముగూడ సంభవించగా నచ్చట తమతోసహా నివసించియున్న వైరాజకోపాసకులనుగూర్చి పలుకుదురు ౭౮. ఇదేప్రకారము ప్రణవమును బ్రవేశించుట శ్రేయస్సుకాగలదని యుపదేశించిరి, ఇట్లుసర్వులు నాకార్యవిరాడ్బ్రహ్మాండమందు ప్రణవప్రవేశమునుగూర్చి ప్రయత్నముగలవారై ప్రణవయోగమందు యోగధర్మమవలంబించియుందురు (౭౯). ఆవిరాడ్బ్రహ్మ శరీరముగు ప్రణవమందే దీపజ్వాలలవలె బ్రకాశించువారలై పునరావర్తి దుర్లభమగు బ్రహ్మశరీరముచే యవలంబించియుందురు. ఇట్లాబ్రహ్మలోకమునుబొంది బ్రహ్మయొక్క భావనా మయమగు ఆనందమునుబొంది శాశ్వతమగు మోక్షముకొరకై వెళ్లెదరు (౮౦ ఇట్లు వైరాజిలోకములకంటె నారురెట్లూర్ధ్వముగానున్నదే బ్రహ్మలోకము. అచ్చటబ్రహ్మయే పురోహితుడు అదియేబ్రహ్మలోకము (౮౧). కావున నట్టివారలందరు ప్రణవమే శరీరముగాఁగలవారలై తెలియబడిన శుద్ధవిద్యాతపస్సుగలవారలై బ్రహ్మానందము నుబొంది అమృతత్త్వమునుబొందుదురు. అటుపిమ్మట ఆధ్యాత్మికాది తాపత్రయవిముక్తిగలుగుటచే ద్వంద్వముచే నంటబడరు. ప్రభావము, విజయము, ఐశ్వర్యము, స్థితి, వైరాగ్యదర్శనము మొదలైనవాటిచే బ్రహ్మలోకాధికారులై తారుమారుగతిని గాలకర్మగతినిఁబొందక బ్రహ్మతోను, ఆబ్రహ్మయొక్క పరివార దేవతలతోను బ్రళయముసంభవించినను తమతమ తపస్సుయొక్క అంతమందు క్రియాత్మకులై బోధావస్థగల విద్వాంసులై అవ్యక్తకాలగతియందు యుగములను క్షణములుగాఁ జూచుచున్నవారలై తమస్వరూపమందే లయించినవారలైయుందురు. (ప్రజ్ఞలేనివారలని) ఇదేతేజోమయమగు అమృతత్వము; నిత్యము; అక్షయము; అవ్యయము. ఇట్టిదానిని దేవఋషులగువారలే సనాతనబ్రహ్మసత్రముగ ఉపాసించుచుందురు (౮౨). పునరావృత్తిమార్గమును బొందనట్టియు, ఊర్ధ్వరేతస్కులగునట్టివారు కర్మాభ్యాసకృతమైన శుద్ధవేందాంతనుఁలయందేయుందురు. అనగా నేమియును లేనివారలనియర్థము. ప్రణవోచ్చారణతో సర్వశుద్ధియగును. ఇతరాదులతో అట్టివారలకెంతమాత్రము నిమిత్తమేలేదు. ప్రణవమే సర్వమూలము (౮౩). అట్టిబ్రహ్మలోకమందే పరాకాష్ఠనుగూడ ఉపాసించుచు, యోగాభ్యాసకులగువారు పాశప్రధానమగు భౌతికశబ్దశరీరమునుగూడవిడచి అశబ్దమగు అమృతత్వమునే బొందుదురు (౮౪). అట్టివారలు వీతరాగులుగను, జితక్రోధులుగను.

## (8) శింశుమార చిత్రపట వివరణము.

1 ఆత్మ,
2 పరాశక్తి,
3 మహాశివలోకము
4 గోలోకము (గాయత్రీలోకము)
5 మహావిష్ణులోకము
6 సత్యలోకము (బ్రహ్మలోకము)
7 తపోలోకము,
8 జనలోకము,
9 మహర్లోకము (కేంద్రము)
10 ధ్రువపదము
11 లోకాలోకపర్వతము
12 ధ్రువపదమునున్నవారలు:
ధాత, విధాత, వరుణోపేంద్రేంద్ర
ధర్ములు,
13 సప్తర్షిమండలము, అరుంధతి,
14 ధ్రువసప్తవాయుసూత్రములు:
౧. ధ్రువములు, ౨. అవహము.
3 ఉద్వహము, ౪ సంవహము,
౫
15 శింశుమారపుచ్ఛము,
16 శనిమండలము
17 గురుమండలము
18 కుజమండలము
19 స్వర్గపథగంగ
20 ఉత్తర, దక్షిణాయనములు
21 అర్చిరాదిమార్గము సూర్యజ్యోతి
22 ధూమాదిమార్గము. చాంద్రజ్యోతి
23 శుక్రమండలము
24 బుధమండలము
25 వీధిత్రయము: ౧ జరద్గరవీధి ౨ వై
శ్వానరవీధి, 3 ఐరావతవీధి.
26 నవవీధులు
27 మేషాది ద్వాదశరాసులు
28 అశ్విన్యాది సప్తవింశతి నక్షత్రములు
29 సోమమండలము
30 రవిమండలము
31 పంచదశకాళాత్మక చంద్రమండలము
32 మేరుపర్వతోపరిపీఠము
33 సూర్యరథ చక్రాక్షము
34 ధ్రువమునంటిన రెండవయక్షము
35 సూర్యరథము
36 సూర్యుడు
37 సూర్యరథచక్రము
38 షడృతువులు, సూర్యరథచక్రపు
వంపులు,
39
40 స్వర్ణభూమి
41 అలోకము
42 మహదావరణసప్తకము
౧ కరీంద్రములునాలుగు ౧ ఋషభము
౨ పుష్కరచూడము, 3 అపరాజి
తము ౪ వామనము

—०—

నిర్మోహులుగను, సత్యవాదులుగను, శాంతులుగను, ప్రాణిహితాత్ములుగను, భూతదయావంతులుగను, జితేంద్రియులుగను, నిస్సంగులుగను, నిత్యశుద్ధిర్యాభ్యాతు లుగను నుండి బ్రహ్మసాయుజ్యమును బొందుదురు (౮౯). దీనిపైన కామయోగ ములేని సహజతపస్సులచే దగ్ధమగు వాసనామాత్ర పాపములుగలవారై యుందు వారు. బ్రహ్మప్రళయమందుగూడ అప్రమేయ సుఖస్వరూపులై నశింపనివారలై యుందురు (౯౦). ఇదియే దివ్యమగు పరమవిష్ణుపదమందైన బ్రహ్మపదమనిజెప్పఁ బడును. ఇచ్చటికిఁబోయినవార లమరులై దుఃఖము నెంతమాత్రముబొందరు. ఇట్లు సూతవాక్యములవిని మరల ఋషులు ఎందువలన నిదిపరార్థమనియు నిదేవరమని కూడ జెప్పబడునని ప్రశ్నింప నతడు ఋషులార! పరబ్రహ్మ పరార్థమనియు, ఏకమ నియు బూర్ణమనియు జెప్పబడును (౯౩). ఇట్లుబ్రహ్మసారస్వత భాషతో సంఖ్యా క్రమమును దెలియువలెను.

హరిః ఓంతత్సత్.

—o—

# శివపురము.

శ్రీవాయుపురాణం ఉపసంహారపాదము అధ్యా. ౩౯.

శ్లో॥ పురస్తాద్బ్రహ్మలోకస్య హ్యండా దర్వాక్చబ్రహ్మణః। తయోర్మధ్యే పురందివ్యం స్థానం యస్యమనోమయం॥ ౨౩౦ ॥ తద్వ్రగ్రావతః స్థానమీశ్వర స్యామితౌజసః॥ శివంనామ పురంతత్రశరణం జన్మభీరుణాం॥ ౨౩౧ ॥ సహస్రా ణాం శతంపూర్ణం, యోజనానాం ద్విజోత్తమ। అభ్యంతరేతు విస్తీర్ణం మహీ మండల సంస్థితం॥౨౩౨॥ మధ్యాహ్నార్క ప్రకాశేన పరతేజోఽభిమర్దినా। శాతకాం భేనమహతా ప్రాకారేణార్క వర్చసా॥ ౨౩౩ ॥ ద్వారైశ్చతుర్భిః సోపన్నైర్ముక్తాదామ విభూషితైః। తపనీయనిభైః శుభ్రైర్గాఢం సుకృతవేష్టనం॥ ౨౩౪ ॥ తచ్చాకాశే పురంరమ్యం దివ్యంఘంటాదినాదితం। నతత్రక్రమతే మృత్యుర్నతపోనజ రాశ్రమాః॥ ౨౩౫ ॥ నహితస్య పురస్యాన్యే రుపమాం కర్తుమర్హతి। సహస్రా ణాంశతంపూర్ణంయోజనానాం దిశోదశ॥ ౨౩౬ ॥ తత్పురం గోవృషాంగస్యతేజ సావ్యాప్యతిష్ఠతి। భావేన మనసా భూమిర్విన్యస్తా కనకామయీ॥ ౨౩౭ ॥ రత్నవా

లంకయాతత్రి విన్యస్తా శుశుభేzధికం। శారదేందు ప్రికాశాని బాలసూర్యనిభాని చ॥ ౨౩౮ ॥ అర్ధశ్వేతార్ధ రక్తాని సావర్ణాని తథైవచ। రథచక్రప్రమాణాని నానై ర్మరకతప్రభైః॥ ౨౩౯ ॥ సాకుమా రేణ రూపేణ గంధినాప్రితిమేనచ। తత్రిదివ్యాని పద్మాని వనేషూప వనేషుచ॥ ౨౪౦ ॥ భృంగపత్రి నికాశాని తపనీయాని యానిచ। అర్ధకృష్ణార్ధ రక్తాని సుకుమారాంతరాణిచ॥ ౨౪౧ ॥ ఆతపత్రిప్రమాణాని పంకజైః సంవృతానిచ। భూయఃసప్త మహానద్యస్తా న్నామానిబోధత॥ ౨౪౨ ॥ వరా వరేణ్యా వరదావరాగ్రా వరవర్ణినీ। వరమా వరభద్రాచ రమ్యాస్తస్మిన్పురోత్తమే॥ ౨౪౩ ॥ పద్మోత్పలదలో న్మిశ్రింఫేనా ద్యావర్తవిగ్రహం। జలం మణిదల ప్రఖ్యామావహంతి సరిద్వరాః॥ ౨౪౪ ॥ నతుబ్రిహ్మర్షయోదేవానాసురాః పితరస్తథా। నఖల్వన్యేzప్రమేయస్య విదురీశస్య తత్పురం॥ ౨౪౫ ॥ తత్రియేధ్యాన మవ్యగ్రాః సుయుక్తాఃజితేంద్రియాః పశ్యంతీహ మహాత్మానః పరంతద్గో వృషాత్మనః॥ ౨౪౬ ॥ మధ్యేపురవరేంద్రిస్య తస్యాzప్రితిమతేజసః। సుమహాన్మేరు సంకాశో దివ్యోభద్రి శ్రియావృతః॥ ౨౪౭ ॥ సహస్రపాదః ప్రాసాదస్తపనీయ మయఃశుభః। అనుపమేయై రత్నైశ్చసర్వతః సవిభూషితః॥ ౨౪౮ ॥ స్ఫటికైశ్చంద్రి సంకాశై ర్వైడూర్యైఃసోమసంప్రభైః। బాలసూర్యప్రితైశ్చైవ సావర్ణైశ్చాగ్ని సంప్రభైః॥ ౨౪౯ ॥ రాజతైశ్చాపి శుశుభే ఇంద్రినీల మయైః శుభైః। ద్రుతైర్వజ్రమయైశ్చైవ ఇత్యేవం సుమహాహితైః॥ ౨౫౦ ॥ జలైశ్చవివిధాకారై ర్దీప్యద్భిరధివాసితః। చంద్రిరశ్మి ప్రికాశాభిః పతాకాభిరలకృతం॥ ౨౫౧ ॥ రుక్మఘంటానినాదైశ్చ నిత్యప్రముదితోత్సవః। కిన్నరాణా మధివాసైః సంధ్యాభ్రాకారరాజితైః॥ ౨౫౨ పరివారసమంతాత్తు హేమప్రఖ్యైదకప్రిభైః। యథాహిమేరుశైలేం ద్రోహేమ శృంగై ర్విరాజతే॥ ౨౫౩ ॥ చామీకరమయాభిస్తు పతాకాభిస్తథాపురం। ఏవం ప్రాసాదరాజోzసౌభూమికాభి ర్విరాజతే॥ ౨౫౪ ॥

బ్రిహ్మలోకాండమునకు మహావిరాడ్బ్రిహ్మాండమునకు నడుమ సత్యలోకో పరిభాగమున మనోమయ దివ్యశివపురియుండు. ముముక్షువుల కిదిశరణ్యంబు. సహస్రిశతయోజన విస్తృతంబై యొప్పుచుండును. మధ్యాహ్నసూర్యమండల నిభంబై తప్తకాంచన ప్రాకార వేష్టితమైవెలయు. ఈప్రాకారంబు నాల్గుద్వారములుగల్గి ముక్తాఖచిత సువర్ణహారములతో నలంకరింపఁబడియుండును. తత్పురోపరి నాక సంబున ఘంటాశబ్దంబులొ సరింపఁ బడుచుండును. అందుమృత్యుదేవతకు జరకు

స్థానంబు లేదు. దీనిమించిన పురంబు మఱిలేదు. గోవృషభంబు లంతటనిండి యుండు. భూభాగము రత్నసైకతంబులతో బాలార్క శారదేందు నిభంబై యలరారు పాటల వర్ణసువర్ణమయ నాళములతో ఘ్రాతర్పణ గంధంబుతో దివ్యపద్మ బులందలి యుపవనంబుల నలంకరించియుండును. తత్ప్రాంతమున భ్రమరపక్షనిభంబులు అర్ధకృష్ణార్ధరక్తవర్ణంబులు,నాతపత్రప్రమాణంబులు నగు సుకుమార పంకజంబులుగల సప్తమహానదులు ప్రవహించుచుండు. అయ్యవి వరా, వరేణ్యా, వరదా, వరార్హా, వరవర్ణినీ, వరమా, వరభద్రానామకంబులు. వానియందు పద్మోత్పలఫేనావర్త యుత జలంబులలరుచుండు. దీనిఁబ్రవేశింప బ్రహ్మర్షిదేవాసుర పితరులకుఁగాదు. ధ్యానతత్పరులు, విజితేంద్రియులు, మహాత్ములునగు నీశుభక్తులు దానిఁజూడఁ గలరు. పురమధ్యంబు దివ్యమేరుసంకాశ ప్రాసాదంబులు, నానావిధాలంకార మణిగణ విరాజితంబులై, చంద్రికాసంకాశ పతాకాసంయుతములై రుక్మఘంటా నినాద శోభితములై నిత్యప్రముదితోత్సవంబులుగలవై కిన్నరవాసయోగములై సంధ్యాకాలాభ్రవిరాజితంబులై యొప్పుచుండు.



## శివపురవాసులు.

శ్రీవాయుపురాణం - భువనకోశం అధ్యా. ౩౯

వసంత ప్రీతిమాయత్రి త్ర్యియంబకస్య నివేశనే। లక్ష్మీశ్శ్రీశ్చ వపుర్మాయా కీర్తిః శోభా సరస్వతీ॥ ౨౫౫॥ దేవ్యాసై సహితా హ్యేతా రూపగంధ సమన్వితాః। నిత్యాహ్యపరిసంఖ్యాతాః పరస్పరగుణాశ్రయాః। భూషణం సర్వరత్నానాం యోన్యః కాంతివిలాసయోః॥ ౨౫౬ ॥ కోటిశతం మహాభాగా విభజ్యాత్మాన మాత్మనా। భగవంతం మహాత్మానం ప్రీతిమోదం త్యతంద్రితాః॥ ౨౫౭ ॥ తాసాం సహస్రశశ్చాన్యాః పృష్టతః పరిచారికాః। రూపిణ్యశ్చ శ్రియాయుక్తాః సర్వాః కమలలోచనాః॥ ౨౫౮ ॥ లీలావిలాస సంయుక్తైర్భావై ర్రుతిమనోహరైః। గణైస్తాః సహమోదంతే శైలాభైః పావకోపమైః॥ ౨౫౯ ॥ కుబ్జాకామ నికామైశ్చ వరగాత్రాహయాననాః। పుండ్రాశ్చ వికటాశ్చైవ కరాలాశ్చ పిపాసనాః॥ ౨౬౦॥ లంగోదరా హ్రస్వభుజావినేత్రా హ్రస్వపాదికాః। మృగేంద్ర వదనాశ్చాన్యా గజవక్త్రా

దరాస్తథా। ౧౯౧ । గజాననాస్తథైవాన్యాః సింహవ్యాఘ్రాననాస్తథా। లోహి
తాక్షో మహాస్తన్య॥ సుభగాశ్చారులోచనాః॥ ౧౯౨ ॥ హ్రస్వకుంచిత కేశాశ్చ
సుందర్యశ్చారులోచనాః। అన్యాశ్చ కామరూపిణ్యో నానా వేషధరాః స్త్రియః॥ ౧౯౩
అభ్యంతర పరిస్కంధా దేవావాస గృహోపాచితాః। తత్రాసు భగవాంస్తత్ర దశబా
హుర్మహేశ్వరః॥ ౧౯౪ ॥ నందినాచ గణైఃసార్థం విశ్వరూపైర్మహాత్మభిః। తథా
రుద్రగణైశ్చాపి తుల్యాదార్య పరాక్రమైః॥ ౧౯౫ । పావకాత్మజసంకాశైర్వ్యావృత
దంష్ట్రోత్కటాననైః। వంద్యమానో విమానాశ్చ పూజ్యమానశ్చ తత్పరైః॥ ౧౯౬ ॥
సర్వర్తు కుసుమాం మాలాం బిభ్రమాణోరసి స్థితాం। నీలోత్పలదళశ్యామం పృథు
తామ్రాయతేక్షణమ్॥ ౧౯౭ ॥ ఈషత్కరాల లంబోష్ఠం తీక్ష్ణదంష్ట్రా గణాంచితం।
షడూర్ధ్వనేత్రం దుష్ప్రేక్ష్యం రుచిరం చీరవాససం॥ ౧౯౮ ॥ అహావేష్ట్వపరిక్లిష్టం
దేవానా మరినాశనమ్। బాహునా బాహుమావేశ్య పార్శ్వే సవ్యేఽతరేస్థితం॥ ౧౯౯
రరాజాపదిశం తస్య వామాగ్ర కరగోచరమ్। మహాభైరవ నిర్ఘోషం బలేనాప్రతిమౌ
జసమ్। దశవర్ణ ధనుశ్చైవ విచిత్రం శోభతేఽధికమ్। ౨౦౦ ॥ త్రిశూలం విద్యుతా
భాస మమోఘం శత్రునాశనం। జాజ్వల్యమానం వపుషా పరమం తత్ర్వపాయు
తమ్। ౨౦౧ ॥ అసిశ్చైవాజసాంశ్రేష్ఠః శితరశ్మిః శశీతథా। తేజసా వపుషాక్రాం
త్యా దేవేశస్య మహాత్మనః। శుశుభేఽభ్యధికం తత్ర వేద్య మగ్ని శిఖాఇవ॥ ౨౦౨ ॥
స్థితః పురస్తాద్దేవస్య శాతకుంభ మయోమహాన్। శుశుభేరుచిరః శ్రీమాన్నోదకః
సకమండలుః॥ ౨౦౩ ॥ అసిమావేశ్యచాంగేషు పాండురాంబరధారిణీ। ఉరశ్చ దేన
మహతామాక్తికేనవిరాజితా। చతుర్భుజా మహాభాగా విజయాలోకసమ్మతా॥ ౨౦౪
దేవ్యాఆస్యాః ప్రతీహారీ శ్రీరివాఽప్రతిమాపరా। విభ్రాజతీ స్థితాచైవ కృత్వాదేవ
స్య చాంచలిమ్। ౨౦౫ ॥ తస్యాః పృష్టాఽనుగాశ్చాన్యాః స్త్రియోఽప్సరోగణా
న్వితాః। తాఃఖల్వభినవైః కాంతై రుపతిష్ఠంతి శంకరమ్॥ ౨౦౬ ॥ సర్వలక్షణ సం
పన్నా వాదిత్రై రుపబృంహితాః। ఉపగాయంతి దేవేశం గణాగంధర్వయోన
యః॥ ౨౦౭ ॥ అభ్యున్నతో మహాహారస్కః శరన్మేఘ సముద్యుతిః। శోభతేనంద
మానశ్చ గోపతిస్తస్య వేశ్మని॥ ౨౦౮ ॥ స్కందశ్చ సపరివారః పుత్రోఽస్యామిత
వీర్యవాన్। రక్తాంబరధరః శ్రీమాన్వరాంబుజ దళేక్షణః॥ ౨౦౯ ॥ తస్యశాఖో విశా
ఖశ్చనైగమేయశ్చ చాప్తవాన్। వ్యపేత వ్యసనాత్ క్రూరాః ప్రజానాం పాలనే
రతాః॥ ౨౧౦ ॥ తైః సార్థం సమహావీర్యః శోభతే శిఖివాహనః। వ్యాళక్రీడనకై
స్తత్ర క్రీడతే విశ్వతోముఖః॥ ౨౧౧ ॥ యేనృపా విబుధేంద్రాణాం కాంచనస్య

వ్రిదాయినః। యేచసావ్వియతనావిప్రా గృహస్థా బ్రహ్మవాదినః॥ ౨౮౨ ॥ గూఢ స్వాధ్యాయ తపసస్తథాచైవోంఛ వృత్తయః। ఏతేన సభాసదస్తస్య దేవేశస్యచ సమ్మతాః॥ ౨౮౩ ॥ మన్వంతరాణ్యనేకాని వ్యావర్తంత పునః పునః। శ్రియం తాం దేవదేవస్య భవిష్యాశ్చర్య ముత్తమం॥ ౨౮౪ ॥ వ్యాఘ్రాశ్చైవానుగాస్తత్ర కాంచనాభాస్తరస్వినః। స్వచ్ఛందచారిణః సర్వేస్వయం దేవేన నిర్మితాః॥ ౨౮౫ ॥ మృత్యోర్మృత్యు సమాస్తేతు యదర్వాzపహారిణః। విభూతిమప్యసంఖ్యేయాం కోనఖ ల్వభిధాస్యతే। ౨౮౬ ॥ అతః పరమిదం భూయోభవేనాద్భుతముత్తమం భూతానా మనుకంపార్థం యత్కృతం తన్నిబోధత। ౨౮౭ ॥

## —♦ శివపురవాసుల విశేషము. ♦—

త్ర్యంబక పురనివాసులు వసంతకాల సమానంబుగనుండు తమ నగరంబున శ్రీలక్ష్మీయుతులు, మంజులవాక్సమన్వితులు, రూపగంధసమన్విత సుదతీయుతులు, పరస్పరగుణమైత్రీ విరాజమానులు, మణిగణఖచిత భూషణాలంకృతులునై మహాత్ముండగు భగవంతుసంతత సమారాధన తత్పరమతి సమ్మోదింపఁజేయుచుందురు. వారల సహస్రసంఖ్య పరివార వారంబు వెన్నంటి సేవింతురు. అందలి సుందరులు లీలావిలాసయుక్త భావరతిమనోహర రూపవిరాజమానలై వికచాయత సహస్రపత్ర పత్రలోచనలై యలరుదురు. అందు శైలాభులు, పావకోపమానులునగు గణగణంబులుందురు, వారు కుబ్జాకారులు, హయాననులు, వికటులు, పుండరీకరాశి చిపిటాస్యులు. లంబోదరులు, హ్రస్వపాదభుజులు విసేత్రులు నైయుందురు. అందుఁ గొందరు వృగేంద్రముఖులు; కొందరుగజముఖులు. సింహవ్యాఘ్రాననులుకొందరు స్త్రీలు; చాపలోహితాక్షులు; కుంభస్తనులు; సుభగులు హ్రస్వవక్రాలకసుందర వదనలు; నానావేషధారిణులు. దేవనివాస సముచితంబగు నభ్యంతరమందిరంబున దశబాహుసంకాశుండగు మహేశ్వరుండు రుద్రగణంబులు నందితోఁగూడి సమానోదార్యపరాక్రమ క్రములు, పావకాత్మజ సంకాశులు, యూపదంష్ట్రోత్కటముఖులు, దేవారిభీకరమూర్తులు, పఙూర్ధ్వనేత్రులు, నీపత్కరాళ లంబోష్ఠతీక్ష్ణ దంష్ట్రులు, నాహవదుర్నిరీక్ష్యులు, మహాభైర నిర్ఘోషులు ధనుర్విరాజితబాహులు, శత్రుధ్వంస త్రిశూలయుతులునై యొప్పుచుందురు.

నిజపరివారయుతుండై శశిధరుండై అగ్నిశిఖా సంకాశవేదికాస్థలంబున ఁబాండురాంబరధారులు,ససియుతకరులు, మౌక్తికహారధారులు, చతుర్భుజులునగు ద్వారపాలురు ద్వారంబునందిరుగడలనుండ నప్సరోగణ సేవ్యమానుండై యుపవసింపియుండు

మహాదేవు నెదుట గంధర్వులు గానంబులదన్ను నుతింప ననమానపీన వక్షస్థలుండును, శారదనీరద సమాభుండును నగు శిఖివాహనుండు పరివారంబుతోఁగూడి సేవించుచుండు. గృహస్థులు బ్రహ్మవాదులుగూఢ స్వాధ్యాయ తపోనిరతులు, నూంఛవృత్తులు నగువారలందఱి సభాసదులు. మృత్యుంజయలోకమగుట నిందలివారు మృత్యుంజయులైయుందురు. అనేకమన్వంతరము లీలోకము పలుమారు వ్యావర్తమగుచుండును.

—౦—

## శివపురసన్నిధిలో సర్వులు శివసములు.

శ్రీవాయుపురాణ - భువనకోశం - అధ్యా. ౩౯.

ఋషయఊచుః:-

కేతుతత్రి మహాత్మానో యేభవస్యానుసారిణః। అనుగ్రాహ్యతమాః సమ్యక్
పమోదం తేప్రరోత్తమే। ఋషీణాంవచనంశ్రుత్వా వాయుర్వాక్య మథాబ్రవీత్ ॥౩౧౦

వాయురువాచ:-

శ్రూయతాం దేవదేవస్య భక్తైర్యైరనుకల్పితా। హిమవంతః సూర్జితాదాం
తాః శౌర్యయుక్తాద్యలోలుపాః ॥ ౩౧౧ ॥ మధ్యాహారాశ్చ మాత్రాశ్చహ్యాత్మా
రామా జితేంద్రియాః। జితద్వంద్వా మహోత్సాహాః సామ్యావిగత మత్సరాః॥౩౧౨
భావస్థాః సర్వభూతానా మవ్యాపారా అనాకులాః। కర్మణా మనసా వాచా విశుద్ధే
నాంతరాత్మనా। అనన్యమాన సోభూత్వా ప్రపన్నాయే మహేశ్వరం। ౩౧౩ ॥
తైర్లబ్ధం రుద్రసాలోక్యం శాశ్వతం పదమవ్యయం। భవస్యరూప సాదృశ్యం నీతా
శ్చైవ హ్యనుత్తమం। ౩౧౪ ॥ వైశ్వానరముఖాః సర్వేవిశ్వరూపాః కపర్దినః। నీల
కంఠాః సితగ్రీవాస్తీక్ష్ణ దంష్ట్రా త్రిలోచనాః॥ ౩౧౫ ॥ ఊర్ధ్వచంద్ర కృతోష్ణీషా
జటామకుటధారిణః। సర్వేదశభుజావీరాః పద్మాంతర సుగంధినః॥ ౩౧౬ ॥ తరుణా
దిత్య సంకాశాః సర్వేతే పీతవాససః। పినాకపాణయః సర్వే శ్వేతగోవృషవాహ
నాః॥ ౩౧౭ ॥ శ్రియాన్వితాః కుండలినో ముక్తాహార విభూషితాః। తేజసాఽభ్యధి
కాదేవైః సర్వజ్ఞాః సర్వదార్శినః॥ ౩౧౮ ॥ విభజ్యబహుధాత్మానం జరామృత్యు
వివర్జితాః। క్రీడంతే వివిధైర్భావై ర్భోగానుప్రాప్యసుదుర్లభాన్। ౩౧౯ ॥ స్వచ్ఛం

దగతయః సిద్ధాః సిద్ధైశ్చాన్యైర్విబోధితాః। ఏకాదశానాం రుద్రాణాం కోటయోఽనేక మహాత్మనాం॥ 3౨౦ ॥ ఏభిః సహ మహాత్మా హి దేవదేవో మహేశ్వరః। భక్తానుకంపీ భగవాన్మోదతే పార్వతీప్రియః॥ 3౨౧ ॥ నాహం తేషాంతు రుద్రాణాం భవస్యచ మహాత్మనః। నానాత్వమను పశ్యామి సత్యమే తద్బ్రవీమివః॥ 3౨౨ మాతరిశ్వాఽబ్రవీత్పుణ్యామిత్యేతా మీశ్వరోఽవ్యయః। అథ తే ఋషయః సర్వేదివాకర సమప్రభాః। శ్రుత్వేమాం పరమాంపుణ్యాం కథాం త్రైయంబకీంశుభాం॥ 3౨3 ॥ భృశంచానుగ్రహం ప్రాప్యహర్షం చైవాప్యనుత్తమం। సంభావయిత్వా చాప్యేనాం వాయుమూచుర్మహాబలం॥ 3౨౪ ॥

ఈశ్వరానుయాయులగువారలెట్లు శివసాయుజ్యమునొంది నుతిసింతురని ప్రశ్నించిన ఋషులతో వాయుదేవుండిట్లనియె.

భక్తియుక్తులు, హ్రీమంతులు, దాంతులు, నాత్మారామ జితేంద్రియులు, ద్వంద్వాతీతులు, సౌమ్యులు,విగతమత్సరులు సర్వభూతహితులు, సనాతులులు మనోవాక్కాయ కర్మంబులఁ బరిశుద్ధులునగువారలు శివసాయుజ్యమునుబొందుదురు. అందలివారందరు సములు, భవరూపసదృశులు, సితాసిత కంధరులు, తీక్ష్ణదంష్ట్రాకరాళ వదనులు, ఊర్ధ్వచంద్రకృతోష్ణీషులు, జటామకుటధారులు, దశభుజావీర్యులు, తరుణారుణ కిరణసన్నిభులు, పీతవసనులు, పినాకపాణులు, శ్వేతగోవృషవాహనులు, శ్రీసమన్వితులు, మండితకుండల ముక్తాహారధరులు, జరామరణవివర్జితులు, స్వచ్ఛందగమనులునై శివసన్నిధి నమందానందంబునవర్తింతురు.

—o—

## శివపురము - అష్టమస్వర్గము.

---

శ్రీవాయుపురాణం - అధ్యా. 3౯.

సూతఉవాచః:-

నఖలువాచభగవాఙ్ కింభూయో వర్తయామ్యహం। కింమయాచైవ వక్తవ్యం తద్వదిష్యామి సువ్రతాః॥ 33౨ ॥

ఋషయఊచుః:-

ఆదిత్యాః పారిషార్ద్యేయాః సింహావైకోధవిక్రమాః। వైశ్వానరా భూతగణా వ్యాఘ్రాశ్చైవాను గామినః॥ 333 ॥ ఆభూతసంప్లవే ఘోరే సర్వప్రాణ

భృతాంశుయే। కిమవస్థా భవంత్యేతే తన్మే బ్రూహియథార్థవత్॥ ౩౩౪॥ ఏతే యేవైత్వయాప్రోక్తాః సింహవ్యాఘ్రాగ్రజైఃసహ। యేచాన్యే సిద్ధిసంప్రాప్తా మాతరిశ్వా జగాదహ॥ ౩౩౫॥ ఇదంచ పరమంతత్త్వం సమాఖ్యాస్యామి శృణ్వతాం। విజ్ఞాతేశ్వర సద్భావ మవ్యక్తం ప్రభవంతథా॥ ౩౩౬॥ తత్రపూర్వ గతాస్తేషు కుమారా బ్రహ్మణః సుతాః। సనకశ్చ సనందనశ్చ తృతీయశ్చ సనాతనః॥ ౩౩౭॥ వోఢుశ్చకపిలస్తేషా మాసురిశ్చ మహాయశాః। మునిః పంచశిఖశ్చైవ యేచాన్యేఽప్యేవమాదయః॥ ౩౩౮॥ గతేఃకాలే వ్యతిక్రాంతే కల్పానాం పర్యయేగతే। మహాభూత వినాశాంతే ప్రళయే ప్రత్యుపస్థితే॥ ౩౩౯॥ అనేకరుద్రకోట్యస్తు యాప్రసన్నా మహేశ్వరీ। శబ్దాది విషయాన్భోగాం స్త్యక్త్వాసాష్ట విధప్రియాత్॥ ౩౪౦॥ పరిత్యజ్యసర్వభూతాని జ్ఞానయుక్తేన తేజసా। వైరాగ్య పదమవ్యగ్రం భూతానామనుకంపయా॥ ౩౪౧॥ తత్రయాంతి మహాత్మానః పరమాణుం మహేశ్వరం। తరంతి సుమహావర్తాం జన్మమృత్యూదకాం నదీం॥ ౩౪౨॥ తతః పశ్యంతి శర్వాణం పరం బ్రహ్మణమేవచ। దేవ్యావైసహితాః సప్తయాదేవ్యః పరికీర్తితాః॥ ౩౪౩॥ యత్రత్సహస్రం సింహానా మాదిత్యానాం తథైవచ। వైశ్వానరభూత భవ్య వ్యాఘ్రాశ్చైవాను గామినః॥ ౩౪౪॥ ఆవేశ్యాత్మనితాః సర్వాః సంఖ్యాయోపద్రవాంస్తథా। లోకాః సప్తఇమాః త్సర్వాన్మహా భూతాని పంచచ॥ ౩౪౫॥ విష్ణునాసహ సంయుక్తం కరోతి వికరోతిచ। సరుద్రోయః సామమయస్తథైవచ యజుర్మయః॥ ౩౪౬॥ సఏవ ఓతః ప్రోతశ్చ బహిరంతశ్చ నిశ్చయాత్। ఏకోహిభగవాన్నాథః అభావీశాంత కృద్వజః॥ ౩౪౭॥ తతస్తేఋషయః సర్వే దివాకర సమప్రభాః। స్వంస్వమాశ్రమ సంవాస మారోప్యాగ్నింతథాత్మని॥ ౩౪౮॥ కర్మణా మనసావాచా విశుద్ధేనాంతరాత్మనా। అనన్యమానసోభూత్వా ప్రపద్యంతే మహేశ్వరం॥ ౩౪౯॥ వ్రతోపవాస నిరతాః సర్వభూత దయాపరః। యోగం ధ్యానుపమం దివ్యంప్రాప్తం తైశ్ఛిన్న సంశయైః। ౩౫౦॥ ప్రపద్య పరయాభక్త్యా జ్ఞానయుక్తేనచేతసా। త్రైలబ్ధం రుద్రసాలోక్యం శాశ్వతం పదమవ్యయం॥ ౩౫౧॥ యఃపఠేత్ త్రపసాయుక్తో వాయుప్రోక్తా మిమాంస్తుతిం। బ్రాహ్మణః క్షత్రియోవాః వైశ్యోవా స్వకీయావరః॥ ౩౫౨॥ లభతేరుద్రసాలోక్యం భక్తిమాన్విగతజ్వరః। అనుద్యపశ్చయఃశూద్రో భవభక్తో జితేంద్రియః॥ ౩౫౩॥ ఆభూతసంప్లవస్థాయీ స్యాత్ప్రతీఘాతలక్షణః। గాణపత్యం సలభతేస్థానం వా సర్వకామికం॥ ౩౫౪॥ మద్యప్తో మద్యపైః సార్థంభూత సంఘైశ్చమోదతే। సోఽర్చ్యమానో మహీపృష్ఠే మర్త్యై

నాం వరదోభవేత్। ఇతిహేవాచ భగవాన్వాయుర్వాక్యమిదంవరః॥ 3౫౫ ॥
ఇతిశ్రీమహాపురాణే వాయుప్రోక్తే శివపురవర్ణనం నామైకోనచత్వారింశోధ్యాయః॥ 3౯ ॥

సూతుండు మునిగణంబులఁగని మఱియేమి వినవలతురని ప్రశ్నింప వారలు శివపురంబునుజేరి ప్రళయసమయంబున నేమగుదురో వివరింపఁగోరిరి. అంత నాసూతుండు మునులతో నిట్లనియె. ప్రళయకాలమునకుఁబూర్వమే తత్పురిఁజేరియున్న సనకసనందన సనాతనాదులు శబ్దవిషయభోగాదుల జ్ఞానయుక్తతేజంబు నావేశించి సూక్ష్మరూపుననున్న మహేశ్వరీ మహేశ్వరులదయ జన్మమృత్యూదకనదినిఁదరించి పరబ్రహ్మయగు శర్వుఁగాంతురు. ఆశర్వుండు సమస్త సృష్టిని దనయందు లీనముగావించుకొనును. అతండు విష్ణువును సృష్టించి లయంబు గావించుచుండు అతండు యజుస్సామమయుండు. ఓతప్రోత బహిరంతర వ్యాప్తుఁడై భగవానుఁడై వెలయుచుండు.

సప్తోర్ధ్వలోకము (సప్తస్వర్గము)లపై సిలోకము కారణరూపమయి ప్రళయానంతరమున దన్నివాసుల మృత్యుంజయుల నొనర్పఁగలదై యుండుటఁబట్టి యష్టమ స్వర్గంబునాఁబడు.



## గో లో క ము.

ఇదిసర్వలోకాధిష్ఠాన గర్భలోకముగ ధేనుస్వరూపముగ లోకాదులతో సన్వయశ్రీమముగను ఉపాసనతో గాయత్రీలోకముగను సర్వమంత్రార్థ వేదస్వరూపముగ బ్రిణవశబ్దమూలముగ నన్వయించవలెను. సర్వేంద్రియాధిష్ఠానాధిదేవత లోకముగను దెలియవలెను. లోకాదులన్నియు నొకపూర్ణములోఁ జేరియుండుట చేత విలోమానులోమములతో నొకసారి అధికముగను మరొకసారి సమముగను అంతమందును నున్నట్టుగానగుచుండును. తుదకు ఆద్యంతములు రెండునొక్కటే. ప్రకృతిలో భేదములుగ భ్రమగనుండును. ఎవరెవరి యభిమానసమ్మతానుసారముగ నధికముగ అన్వయింపవచ్చును.

"పరిమాణములు"

శ్రీమద్దేవీభాగవతము. - నవమస్కంధం - అధ్యా. 3.

శ్లో॥ పాతాళాద్బ్రహ్మలోకాంతం బ్రహ్మాండం పరికీర్తితం॥ ౧ ॥ అతఊర్ధ్వంచ వైకుంఠో బ్రహ్మాండాద్బహిరేవసః। తతఊర్ధ్వంచ గోలోకః పంచాశత్కోటియోజనః॥ ౨ ॥ నిత్యసత్య స్వరూపశ్చ యథాకృష్ణ స్తథాప్యయమ్॥

—o—

# శ్రీ మ హా వి ష్ణు లో క ము.

## (వై కుం ఠ ము.)

శ్రీదేవీభాగవతము - నవమస్కంధము - తృతీయోధ్యాయము.

శ్లో॥ పాతాళాద్బ్రహ్మలోకాన్తం బ్రహ్మాండం పరికీర్తితమ్।
అతఊర్ధ్వంచవైకుంఠో బ్రహ్మాండాద్బహిరేవసః॥

పాతాళలోకంబునుండి బ్రహ్మలోకమువరకు బ్రహ్మాండంబనంబడు. దీనిపైన వైకుంఠనామక శ్రీమహావిష్ణుస్థానముకలదు. దీనివైశాల్యంబు బ్రహ్మలోకమున కద్వైగుణ్యము. ఇందు శ్రీమహాలక్ష్మియు, వసిష్ఠ గరుడోద్ధవానంతశేషనారదులు నుందురు.

(౧౬,౦౦,౦౦,౦౦౦ యోజనవిస్తృతి.)

—o—

# ప్ర ద్యు మ్న స ం క ర్ష ణ వ్యూ హ ము.

—♦ వ్యూహములు. ♦—

(౧) పరవాసుదేవవ్యూహము, జగత్సాక్షియగు సర్వకారణ బ్రహ్మమునకు శ్రవణాధిష్ఠానదేవత అనంతుడనియు మహావిష్ణువనియు నామాంతరములు ఆబ్రహ్మ స్థూలసూక్ష్మకారణాధిష్ఠానము.

(౨) ఇదిసంకర్షణ ప్రద్యుమ్నో భయాత్మకగోళము. కార్యబ్రహ్మ జ్ఞానా జ్ఞానాధిష్ఠానదేవతయు నభిజిన్నక్షత్రాధిష్ఠానదేవతయు, మహావిరాట్టును స్థూలజగ

తాకారణుడునగు.

(3) విశ్వేదేవతలు సమష్టికార్య వసురుద్రాదిత్యాది భేదములుగ గర్మదేవతాగణముగను, స్థూలగోళము మహావిరాడంతరముగను అభిజిన్నక్షత్రాధిష్ఠాన దేవతలుగను నున్నవారలు. హస్తాది నక్షత్రచతుష్టయము యమనక్షత్రగణమునకు మూలాధారమగు అనూరాధయుఁగలసి మహావిరాట్టునకు నైదవయవములై పంచాంగవిశిష్టమగు కార్యరూపముగనున్నవని వేదమందు జెప్పఁబడినది.

శ్రుతి:- హస్త ఏవాస్యహస్తః। చిత్రా శిరః। నిష్ట్యా (స్వాతి) హృదయం। ఊరూవిశాఖే। ప్రతిష్ఠానూరాధాః। ఏషవై నక్షత్రియః ప్రజాపతిః। యఏవం వేద। ఉభయోరేనం లోకయోర్విదుః। అస్మిగ్గ్‌శ్చా ముష్మిగ్గ్‌శ్చ। (ఇదినక్షత్రరూప ప్రజాపతియనియర్థము. దీనిపైన అసురనక్షత్రగణములుగలవు. జ్యేష్ఠాద్యపభరణ్యంతముగ యమనక్షత్రంబులనంబడు అయ్యవి యపసవ్యంబులుగను దేవనక్షత్రంబులు సవ్యంబులుగను నాకాశమందు బ్రకాశించుచున్నవని వేదప్రమాణములున్నవి.

(తైత్తిరీయబ్రాహ్మణం - రెండవకాణ్డ - అయిదవప్రశ్నయొక్క రెండవ అనువాకంలో ఈవిషయమంతయు విశదముగనున్నది.)

నక్షత్రవిరాట్టుకు ధ్రువనక్షత్రము, అభిజిత్తు, దివ్యధృవాధిష్ఠాన దేవత, పరవాసుదేవము, కార్యధ్రువము, అభిజిన్నక్షత్రాధిదేవత, మహాకార్యవిరాడ్బ్రహ్మ యని నామాంతరములు. ఈఅభిజిన్నక్షత్రగోళమునుండి తలక్రిందుగా గర్మదేవతాగణములు మొదలైన కార్యవర్గమంతయుఁ గాలకర్మచక్రమంతయు సృజింపఁబడెను. ఇది ప్రద్యుమ్నగోళము. ఈ ప్రద్యుమ్నగోళము ప్రవృత్తి ధర్మచక్రమునకంతకు నధిష్ఠాన దేవతగ నగుచున్నది ఇటులనే జ్యేష్ఠాధిష్ఠాన దేవతయగు ఇంద్రుఁడును కూటస్థజీవుఁడై నివృత్తిధర్మ చక్రప్రధానుఁడైయుండును. కనుకనే నివృత్తిధర్మచక్రమునకు వైవస్వత మన్వంతరాధిపతియు సూర్యపుత్రుఁడు నగుయముడధిష్ఠానదేవత. అధోమార్గకక్షకును నిటులనే అశ్వినీనక్షత్రమునకు అధిష్ఠానదేవతల,సూర్యపుత్రులు, అగు అశ్వినీదేవతలు గతించిన చాక్షుషమన్వంతరమునకు అధిష్ఠానదేవతలగుచు ఊర్ధ్వదృష్టితో బ్రవృత్తిధర్మనాయకులైరని వేదమంత్రార్థమందుఁగలదు. అయ్యది ధర్మతత్త్వరహస్యము. లోకాంగమగు జ్యోతిశ్శాస్త్రమందు అశ్విని మొదలు కృత్తికానక్షత్ర ప్రథమచరణమువఱకు దొమ్మిదిపాదములుగల మేషరాశియగుచున్నది. అశ్విన్యాది కృత్తికాంత నక్షత్రత్రయములో జాక్షుషమన్వంతరమున నక్షత్రచక్రము అశ్విన్యాదియగు ఈ వైవస్వత మన్వంతరమందు గృత్తికాదియు నగుటచే జెబ్బది

యొక్క మహాయుగకాలచక్ర పరిమాణముగల స్వీవైవస్వత మన్వంతరమందుగల వేదములు కృత్రిమాదిగఁ జెప్పఁబడును.

—o—

# దేహాదులకు లోకాదులకుఁగల సంబంధము.

దేహాదుల ననుసరించి లోకాదులును లోకాదుల ననుసరించి దేహాదులును సర్వసంబంధములతోనున్నవి. మూఁడువిధములగుదేహములుగలిసి యొకసమష్టిదేహముగనుండును. మూఁడువిధములగు లోకములుగలిసి యొకసమష్టిబ్రహ్మాండ విరాడ్విశ్వముగనున్నది. దేహాదులు త్రిగుణములతో త్రివ్యయవస్థలుగ సూక్ష్మ, స్థూలకారణదేహములుగనున్నవి. లోకాదులటులనేయున్నవి. ఈమూఁడుదేహములకు మూఁడువిధములుగ క్రియాకర్మలు, అనుభవములు, ఫలానులున్నవి. లోకత్రయములకును నాయాలోక సంబంధానుగుణానుసారముగ క్రియాకర్మానుభవ ఫలములున్నవి. ఆహారాది సర్వవ్యవహారములును దేహాదులను, స్థూలలోకములో స్థూలములుగను తేజోలోకములో సూక్ష్మముగను, కారణలోకములో గారణముగనున్నవి. అవ్యక్తమునందవ్యక్తముగనేయుండును. త్రివృత్కరణముతో అన్నియునొకదానిలోనుండును. కాలపరిమితిమాత్రము స్థూలముకంటె సూక్ష్మములో నధికముగను సూక్ష్మమునకంటె గారణములో నధికముగను సర్వవిషయానులందుండును. ఈలాగున నొకసమష్టిదేహమందే నాదేహాసంబంధావస్థల ననుభవింతుము. త్రివిధావస్థలందు మిగతదేహములున్నట్టు ఆభాసగా స్వప్నతుల్యముగా ననుభవముండునేగాని ప్రబలముగ నుండజాలదు. ఈలాగుననే దేహములోనున్నను నేలోకాంతరములో నున్నను మిగతదేహములు, లోకాదులు నిమిత్తమాత్రానుభవగోచరములుగ నుండును.

ఇందుకనుభవ దృష్టాంతము:- కారణదేహాసుషుప్త్యనుభవములో నాకారణదేహ సుషుప్త్యవస్థా గుణాదులుండునేకాని మిగతదేహాదులందులోనున్నను నాగుణములంతగా స్ఫురించవు. స్వప్నదేహముగూడ దదనుసారమే. ఇతరమవస్సు మణులహారములోని సూత్రమువంటిది. ఈమనస్సుతోనే సర్వసంబంధములు గుణములు స్థూలసూక్ష్మకారణములు అవస్థలుగలిగి సర్వము తానై వ్యవహారములను జేయుచున్నది.

లోకాదులందు కారణలోకము సత్యలోకమగు బ్రహ్మలోకము అది ఆనంద శాంతిసుఖ సమాధియుతము. స్వర్గలోకము సూక్ష్మతైజస స్వప్నలోకము. స్థూలలోకమే మనమున్న పృథివీలోకము. లోకములను లోకాంతరములను బ్రకృతము మనమున్న ఈసమష్ట్యాత్మక వ్యష్టిస్థూలదేహపాతానంతరము మనకర్మఫలముతోఁ బొందుదుము. కర్మలు లేవని లోకాదులు లేవనినవార లుత్తమసుఖానంద దీర్ఘకాల లోకాది ప్రాప్తిలేక కూపస్థమండూక న్యాయమున నిచ్చటనేయుందురు. లోచన ముండియు లోకములగపడుచుండియు లేవనుకొనువార లంధప్రాయులైయుత్తమసుఖాదులను బొందరు. వీరికంటె పుట్టుగ్రుడ్డివారలే యుత్తములు. పుట్టంధులుచూడక పోయినను చెప్పినదానినిగ్రహింతురు. ఊర్ధ్వలోకాదులలో నీస్థూలలోక సర్వగుణ వ్యవహారాదులకంటె సర్వవిధసుఖములు నత్యధికముగనుండును. మనదేహములోను నీలాగుననే ఊర్ధ్వశరీరమునకును మధ్యశరీరమునకును గ్రిందిశరీరమునకును క్రియాకర్మగుణాది సుఖాదిభేదములు చాలయున్నవి. క్రిందిదేహము నిరంతరము కేవల క్రియాకర్మాచరణమే ప్రధానమై విరామములేకయుండును సుఖానంద శాంత సమాధి ధ్యానయోగాదులకు నూర్ధ్వశరీరమే ముఖ్యము. ఇటులనే లోకాదులను గ్రహించవలెను.

ఇవన్నియు ప్రత్యక్షదృష్టాంతానుభవములే. భూతద్వంద్వ యోగముతో లోకాదులును దేహములు గలుగును. ఊర్ధ్వగుణముతో నూర్ధ్వలోకసంబంధము నధోభూతగుణముతో నధోలోకసంబంధము దేహాదులందును, క్రియాకర్మాదులన్నియును ఉభయభూతగుణ మిశ్రితములైయుండును. కృషివాణిజ్య వ్యవహారాదులతో నీలోకములోనుండి యీవాసనలతో నిచ్చటనే శాశ్వతముగా నుందుము. కనుక నీభూలోకము కర్మలోకము. ఇందుండి తపోధ్యానయోగాదులతో బ్రహ్మాదిలోక ప్రాప్తినందవీలున్నది. ఈదేహముతో నేమియు నాచరింపనిచో నేలోకప్రాప్తియు లేక నీలోకముననేయుందుము. దీనిననుసరించి నిశ్చయితులై ప్రాప్తప్రవృత్తులు గావలెను. క్షేత్రములు లోకాదులు దేహములు కర్మసంబంధ జడస్వరూపములు. క్షేత్రజ్ఞచైతన్యస్వరూపము తపస్సు ధ్యానయోగాదులు. ఆత్మచైతన్యసంబంధములు. మనము రెండువిధములుగ నున్నందుచేత నీరెండువిధముల నాచరించి క్రమముగా ధన్యులుగావచ్చును. వేదవిహితసాత్విక కర్మలతో దేహవిముక్తియు ధ్యానాదియోగసమాధుల జీవస్వరూప బంధవిముక్తియు నందవచ్చును. ఏదివిడిచిన నదిమిగిలియుండును. ఇవన్నియును శాస్త్రపురాణాది శ్రవణాదులతో సంపా

దించి వివేకవంతుఁడై ఆచార్యునిసమీపమునఁజేరి సాంప్రదాయములనుదెలిసి అనుభవములతో వేదశాస్త్రాది నియమములతో క్రమాభ్యాసముతో దృఢాభ్యాసయుక్తులై స్థిరచిరాభ్యాసములతో దేవవాసనలను మనస్సుసు నాశంబుగావించిన బునరావృత్తిలేని స్వస్వరూపానంద ప్రాప్తికలుగును. మనుజుఁడీమార్గము దెలియక వేదశాస్త్రపురాణాదులనువినక మహాపాపకార్యముల నాచరించును. తుదకేనాటికైనను విసుగుజెంది అంత్యములో జ్ఞానముగలిగి ధన్యుఁడగునేకానితప్పదు. ఇంతదీర్ఘకాలావధితో మధ్యలోననేక జన్మములతో వృధాశ్రమతో నిరంతరదుఃఖములపాలుగాక యిప్పుడే వివేకవిజ్ఞానముగలిగి సదాచార సంపత్తితో ధన్యుఁడగుటమేలు. ఈలాగున సర్వవిధములతో సంబంధములుగ నీభూగోళమున్నందుచేత వేదభూగోళమను నామకరణముతో వ్రాయదలంచితినేకాని వేరుగాదు.

ఈస్థూలదేహ మీపృథివిలోక సంబంధమగుటచేత సర్వదాయొక్కవకాలము పృథ్వీసంబంధవ్యామోహాది వాసనాభిమాన వ్యవహారాదులఁబడియుండును.ఇయ్యవి వాస్తవములుగావు. ప్రమాదములు. దీనికి గారణమభిమానమనస్సే. దేవలోకమగు తైజససూక్ష్మదేహముతోజేరిన వారలమైనచో మనకు నిరంతర ముపాసనాది ధ్యానయోగాములందభిమానముండును.

—o—

# సత్యలోకము.

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం అధ్యా. ౭.

శ్లో॥ షడ్గుణేన తపోలోకా త్సత్యోలోకోవిరాజతే। అపునర్మారకోయత్ర బ్రహ్మలోకో హిసస్మృతః॥ ౧౫ ॥

శ్రీవాయుపురాణం - అధ్యా. 3౯ - పుట. ౧౯౪.

సత్యంతుసప్తమేలోకో హ్యపునర్మార్గగామినాం। బ్రహ్మలోకః సమాఖ్యాతో హ్యప్రతీఘాతలక్షణః। పర్యాసపారిమాణ్యేన భూర్లోకసమితిః స్మృతః॥ 3౯ ॥ సత్యేతి బ్రహ్మణః శబ్దః సత్తామాత్రస్తు సఃస్మృతః। బ్రహ్మలోకాస్తతః సత్యం సప్తమః సతు భాస్కరః॥ ౨౭ ॥ షడ్గుణంతు తపోలోకా త్సత్యలోకాంతరం స్మృతం। అపునర్మారకా మానాం బ్రహ్మలోకః సఉచ్యతే॥ ౧౪౧ ॥ యస్మాన్నచ్యవతేభూయో బ్రహ్మణాం సఉపాసతే। ఏకకోటి ర్యోజనానాం పంచాశన్నియుతానిచ॥ ౧౪౨ ॥

ఊర్ధ్వంభాగ స్తతోఽండస్య బ్రహ్మలోకాత్పరః స్మృతః। చతుర్శ్చైవ కోట్యస్తు నియుతాః పంచషష్టిచ॥ ౧౪౩ ॥ ఏషోర్ధ్వాంశ ప్రచారోస్య గత్యంతశ్చా పరఃస్మృతః। ధ్రువాగ్రమే తద్వ్యాఖ్యాతం యోజనాగ్రాద్యథా శ్రుతం॥ ౧౪౪ ॥

పునరావృత్తి లేనివారలుండు లోకమునకే బ్రహ్మలోకమనిపేరు. తపోలోకము నుండి యారుకోట్లంతదూరమున బ్రకాశించుచుండును. ఇదిబ్రహ్మతో సభతోఁ గూడిన బ్రహ్మలోకము. దీనికిసత్తామాత్ర సత్యస్వరూప బ్రహ్మయుండుట చేత బ్రహ్మలోకమని సత్యలోకమని పేరుగలిగెను. ఇచ్చటివారలు యేబ్రహ్మ స్వరూపముతో చ్యుతిలేనిదిగానుందురో యట్టికూటస్థ బ్రహ్మోపాసకులుగ నిరంతరముందురు. ఈబ్రహ్మలోకముయొక్క ఊర్ధ్వభాగములోఁగల అండవైశాల్యమొకటి యేబదినియుతయోజనములుండను. నాలుగుకోట్లు అరువదియైదు యోజనముల నిడివిగలిగియుండును. దీనిపైన మరేమియునులేక నిరాలోకముగ నుండును. ఇదేధ్రువాగ్రమని వేదములఁజెప్పఁబడినది.

ఈకార్యబ్రహ్మలోకములో ౧. అచ్యుతులు=సవితర్క ధ్యాన సుఖము గలవారలును, ౨. శుద్ధనివాసులు=సవిచారధ్యాన సుఖముగలవారలును, 3. సత్యాభులు=ఆనందమాత్రధ్యాన సుఖముగలవారును, ౪. సంజ్ఞాసంజ్ఞులు=అస్మితాధ్యాన సుఖముగలవారలు నుందురు. బ్రహ్మసరస్వతితోఁగూడుకొనియుండును. దీనివిస్తారము యెనిమిదికోటుల యోజనములు.



# తపోలోకము.

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౭.

శ్లో॥ చతుర్గుణోత్తరే చోర్ధ్వం జనలోకాత్తపస్స్మృతః। వైరాజే యత్రతే దేవాః స్థితాదాహ వివర్జితాః॥ ౧౪ ॥

వాయుపురాణం అధ్యా. 3౯

ఋభుః సనత్కుమారాద్యాయత్ర సంత్యూర్ధ్వరేతసః। తపసా భావితాత్మానస్తత్ర సంతిత్రివాతపః॥ ౨౬ ॥ చతుర్గుణోత్తరాదూర్ధ్వం జనలోకాత్తపస్స్మృతం।

వైరాజేయత్రి తేదేవా భూతదాహ వివర్జితాః॥ ౧౪౦ ॥

ఈతపోలోకము జనలోకముకంటె నాలుగురెట్లధికముగాఁగల యోజనదూరములోనున్నది. ఇదియు వైరాజిక తపోలోకమగుటచేత (బ్రి)శయజ్వాలలు గలిగినను నిచ్చటి వారల నాబాధలుమాత్రము స్పృశించవు. ఇదిమహావిరాట్తపోలోకము. ఋభువులు, సనత్కుమారాదిగాఁగల యూర్ధ్వరేతస్క మహర్షులుందురు. ఇచ్చట సర్వులు తపస్సుచేత సర్వదా ప్రకాశించుచున్నవారలగుటచేత దీనికి తపోలోకమని పేరుగలిగెను. దీనివిస్తారము నాలుగుకోటుల యోజనములు. ఇదిద్వితీయబ్రహ్మలోకము. ఇచ్చటివారలు, ౧. అభ్యాసకులు=విశ్వధ్యానరతులు, ౨. మహాభాస్వరులు=తైజసధ్యానరతులు, 3. సత్యమహాభాస్వరులు=ప్రాజ్ఞధ్యానరతులు, సూక్ష్మవ్యవహిత విప్రకృష్టులు వైరాజికనామ దేవతలు.

—o—

## జనలోకము,

శ్రీవాయుపురాణం - భువనలోకము - అధ్యా. 3౯.

సర్వేసూక్ష్మశరీరాస్తే తత్రస్థాస్తు భవంతితే॥ ౫3 ॥ తేషాంతే తుల్యసామర్థ్యా స్తుల్యమూర్తి ధరాస్తథా। జనలోకే వివర్తంతే యతస్సం ప్లవతేజగత్॥ ౫౪॥ వ్యుష్టాయాంతు రజన్యాంవై బ్రహ్మణోZ వ్యక్తయోనినః। అహరాదాప్రసూయంతే పూర్వవత్క్రిమశస్త్విహ॥ ౫౫ ॥ స్వయంభువాదయస్సర్వే మరీచ్యం తాస్తుసాధకాః। దేవాశ్చైవ పునస్తేషాం జాయంతే నిధనేష్విహ॥ ౫౬ ॥ యామాదయః క్రిమేణైవ కనిష్ఠాద్యాః ప్రజాపతేః। పూర్వం పూర్వం ప్రసూయంతే పశ్చిమే పశ్చిమాస్తథా॥ ౫౭ ॥ దేవాన్వయే దేవతాహి సప్తసంభూత యస్మృతాః। వ్యతీతాః కల్పజాస్తేషాంత్రిస శ్చిష్టాస్తథాపరే॥ ౫౮ ॥ ఆవర్తమానా దేవాస్తే క్రమేణైతేన సర్వశః। గత్వాచ జాంతివీభావం దశకృత్వః పునః పునః॥ ౫౯ ॥ తతస్తేవైగణాః సర్వేదృష్ట్వా భావేష్వ నిత్యతామ్। భావినోర్థస్యచబలాత్ పుణ్యాభ్యాసబలేనచ ౬౦ ॥ నివృత్తవృత్తయః సర్వేస్వస్థాః సుమనసస్తథా। వైరాజేతూప పద్యంతే లోక ముత్సృజ్యతజ్జనం॥ ౬౧ ॥

శ్రీవిష్ణుపురాణము - ద్వితీయాంశము - అధ్యాయము ౭.

ద్వికోట్యాతు జనోలోకో యత్రతే బ్రహ్మణః స్మృతాః। సనందనాద్యాః కథితాః మైత్రేయాஉమలచేతసః॥ ౧3 ॥

—♦ జ న లో క ము. ♦—

ఈజనలోకమందు ప్రవృత్తి నివృత్తి గుణద్వయముతోఁజేరిన కోటిద్వయగుణ ముగలవారలు నివాసులుగనుందురు. వీరలలోసనకాది చతుష్టయము నివృత్తిధర్మపరులు. "మహర్షయస్సప్తపూర్వే చత్వారో మనవస్తథా మద్భావామానసా జాతాః యేషాం లోకఇమేప్రజాః"అని గీతాప్రమాణముగూడనున్నది. సప్తఋషులు ప్రవృత్తిధర్మపరులని తెలియవలెను. ఇందుకుఁగారణము ప్రతిమన్వంతరమునందును మార్పుజెందుచుందురు. సనకాదులు పునరావృత్తిలేనివారలని తెలియవలెను. అనఁగా శ్రీమహావిరాట్టుయొక్క మనస్తత్వమువల్లనే ఆవిర్భవించి యచ్చటనే తిరోధానము నొందకటచే (బంచవార్షిక వయోధర్మములో సర్వదాయున్నారని పురాణములందు (జెప్పినదే ప్రమాణము. అందువల్ల వారలు ద్వికోటికమగు మహర్లోకము మొదలగు క్రిందిలోకములందు (ప్రవృత్తిధర్మయుక్తులుగ నుండరు ఇచ్చట కోటియనగ ప్రకృతిధర్మగుణములని సమన్వయము.

జనలోకవాసుల శరీరములతిసూక్ష్మములు. అనఁగావాయుభూతదేహులని తెలియవలెను ఈలోకము వాయుభూతలోకము. సర్వులు సర్వసమాన సామర్థ్యము గలవారలు. మహర్లోకమునకుఁ బ్రళయజ్వాలలు గలిగినపుడు జనలోకమునకు వచ్చెదరు. బ్రహ్మయొక్కదైనందిన ప్రళయమందు నీజనలోకమునకు ప్రళయజ్వాలలు గలిగినపుడు తపోలోకమున కేగుదురు. ఈలాగున గ్రిందిలోకముననున్న వారలు తమూర్ధ్వలోకములకు బ్రళయసంభవమునందుఁబోవుచు మరల ప్రళయకాలాంత్యనంతరము స్వలోకమునకుఁబోవుచుందురు. ఇదిమనలోకములోను సహజము.

ఇది అకృతలోకము. సర్పరాశివలె చక్రాకారముగనుండును. ఇదిహిరణ్యగర్భ బ్రహ్మలోకమునకుఁ జేరియుండును. సూక్ష్మవ్యక్తతత్త్వముగనుండును. ఇది క్రిందిమహర్లోకమునకంటె ద్విగుణితముగనుండును. ఇదిప్రథమబ్రహ్మలోకము. ఇచ్చట సనక, సనందన, సనత్కుమార సనత్సుజాతులుందురు.

౧. బ్రహ్మపురోహితులు=వితర్కధ్యాన సుఖముగలవారలు.

౨. బ్రహ్మకాయకులు=విచారధ్యాన సుఖముగలవారలు.

3. బ్రహ్మమహాకాయకులు=ఆనందధ్యానముగలవారలు.

౪. అజరామరులు=అస్మితాధ్యానశ్లోకులు. అహంస్వరూపమే చరమా

వధిగాఁగల ధ్యానశ్లోకలు.

౫. ఆభాస్వరదేహులు=భూతేంద్రియపరిత్యక్తివశ్యముగలవారలు (అధికద్వి గుణీకృతులు).

ఈజనలోకములోని క్రిందియర్ధభాగము వైజ్ఞానికకోశముగను, ఇందలి యూర్ధ్వభాగార్ధ మానందమయ కోశముగఁ దలంచవలెను. ఈజనలోకములోని జనులనే జనులని చెప్పవలెను. మనము మర్త్యులము; మనముపలు మూరు స్వాభావికముగ జన్మమరణాదిక్లేశములుగలవారమని తెలియవలెను. జనలోకము త్రిపాద్విభూతి లోకము. మధ్యమవాక్స్వరూపము, వైఖరీస్ఫోటరూపమును చెందగా వర్ణాత్మమును జెందిన గోళములే జనతపోసత్యలోకములు మహర్లోకము. భయాత్మకము.



# మహర్లోకము.

## ప్రమాణములు.

### శ్రీవాయుపురాణము - భువనకోశం - అధ్యా. ౩౯.

శ్రీవాయురువాచ:-

అసాధారణవృత్తైస్తు హుతశేషాదిభిర్ద్విజైః। ధర్మవైశేషికైశ్చైవ వ్యాపూర్ణైన్యూనతుష్మదర్శిభిః॥ ౧ ॥ తేదేవైః సహాతిష్ఠంతి మహర్లోక నివాసినః। చతుర్దశైతే మనవః కీర్తితాః కీర్తివర్ధనాః॥ ౨ ॥ అతీతావర్తమానాశ్చ తథైవాఽనాగతాశ్చయే। ఋషిభిర్దేవతైశ్చైవ సహాగంధర్వరాక్షసైః॥ ౩ ॥ మన్వంతరాధికారేషు జాయంతీహ పునః పునః। దేవాః సప్తఋషయశ్చైవ మనవః పితరస్తథా॥ ౪ ॥ సర్వేహ్యాపికర్మాతీతా మహర్లోకం సమాశ్రితాః। బ్రాహ్మణైః క్షత్రియైః స్వైస్వైర్ధార్మికైః సహితైస్సురాః॥ ౫ ॥ తైస్తథ్యకాలభిర్యుక్తైః శ్రద్ధావద్భిరదర్పితైః। వర్ణాశ్రమాణాం ధర్మేషు శ్రౌతస్మార్తేషు సంస్థితైః॥ వినివృత్తాధికారాస్తే యావన్మన్వంతరక్షయః॥ ౬ ॥

ఋషయఊచుః:-

మహర్లోకేతి యత్ప్రోక్తం మాతరిశ్వంస్త్వయాఽవిభో। ప్రతిలోకేచకర్తవ్య మనేకైః సమధిష్ఠితాః॥ ౭ ॥ యావంతశ్చైవ తేలోకాః దహ్యంతే యేనతే ప్రభో।

ఏతన్నః కథయ ప్రీత్యాత్వం హి వేత్థయథాతథం॥ ౮॥ మహర్లోకశ్చతుర్థస్తు తస్మింస్తే కల్పవాసినః॥ 33 ॥ సూర్యధ్రువాంతరం యచ్చ స్వర్గలోకో దివస్స్మృతః। ధ్రువాజ్జవాంతరం యచ్చమహర్లోకస్తదుచ్యతే. ౪౧ ॥ చతుర్థే యేపి వర్తంతే మహర్లోకం సమాశ్రితాః॥ ౪3 ॥ విజ్ఞేయా మానసీతేషాం సిద్ధిర్వైకుంచలక్షణాః। సద్యశ్చోత్పద్యతే తేషాం మనసా సర్వమీప్సితం॥ ౪౪ । యేతే దేవాయజంతే వైయజ్ఞైః స్సర్వైః కరస్పరం। అతీతాన్ వర్తమానాంశ్చ వర్తమానా ననాగతాన్॥ ౪౫॥ ప్రథమానంతరై రిష్ట్వాహ్యంతరాః సాంప్రతైః పునః। నివృత్త్యతీత్యా సంబంధోzతీతే దేవగణైతతః॥ ౪౬ ॥ వినివృత్తాధి కారాణాం సిద్ధిస్తేషాంతు మానసీ। తేషాంతు మానసీ జ్ఞేయా శుద్ధాసిద్ధి కరంతరా॥ ౪౭ ॥ ఉక్తాలోకాశ్చ చత్వారో జనస్యాస్య విధిస్తథా। సమాసేన మయావిప్రా భూయస్తం వర్తయామిన్వః॥ ౪౮ ॥

వాయురువాచ:-మరీచిః కశ్యపోదక్షో వసిష్ఠశ్చాంగిరాభృగుః। పులస్త్యః పులహాశ్చైవక్రతురిత్యేవమాదయః॥౪౯॥ పూర్వంతే సంప్రసూయంతే బ్రహ్మణోమానసాఇహ। తతః ప్రజాః ప్రతిష్ఠాప్య జనమే వాశ్రయంతితే॥ ౫౦ ॥ కల్పదాహ ప్రదీప్తేషు తదాకాలేషు తేషువై। భూరాదీషు మహాంతేషు భృశంవ్యాప్తే మ్వథాగ్నినా॥ ౫౧॥ శిఖాసంవర్త కాగ్నేయా ప్రాప్నువం... ...నాః। యామాదయో గణాః సర్వే మహర్లోక నివాసినః॥ ౫౨ ॥ మహర్లోకేషు దీప్తేషు జనమేవాశ్రయంతితే। సర్వే సూక్ష్మ శరీరాస్తే తత్రస్థాస్తు భవంతితే॥౫3॥ తేషాంతేzతులసామర్థ్యాస్తు...యూర్ధ్వధరాస్తథా॥ జనలోకే వివర్తంతే యావత్సంప్లవతే జగత్॥ ౫౪ ॥ ధ్రువాదూర్ధ్వం మహర్లోకో యస్మిన్ స్తే కల్పవాసినః। ద్వేకోట్యాతు మహర్లోకా ద్యస్మింస్తే కల్పవాసినః। యత్రతేzప్రసూయంతే పూర్వవత్క్రమ శస్త్వహం॥ ౫౫ ॥

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా ౭.

ఏకయోజనకోటీస్యాదిత్యేవం నిశ్చయంగతః॥ ౧౩౮ ॥ ధ్రువాదూర్ధ్వం మహర్లోకో యత్రతే కల్పవాసినః। యేకయోజనకోటీతు యత్రతే కల్పవాసినః॥ ౧౭ ॥ కృతా కృతకయోర్మధ్యే మహర్లోక ఇతిస్మృతః। శూన్యోభవతి కల్పాంతే యోత్యంతం నవినశ్యతి॥ ౨౦ ॥

## — మ హ ర్లో క ము. —

మహర్లోకము ధ్రువమండలముపైనున్నది. దీనివైశాల్య మొకకోటి యోజన పరిమితముగలది. ఈలోకము సర్షపరాశివలె ఛత్రాకారముగ నుండును. ఇది

క్రిందికటాహములోనున్న భూర్లోక భువర్లోక సువర్లోకములకును ఊర్ధ్వాండ కటాహములోనున్న జనలోక, తపోలోక, సత్యలోకములకును మధ్యలోకాలోక పర్వతము పైనున్నది.

ఇది అసమాన బ్రహ్మ ధర్మప్రవృత్తి గలవారలై హవ్యావశేషమునే భుజించుచున్న ద్విజులచేతను, విశేషధర్మజ్ఞులైన వారిచేతను జన్మముతో నేసిద్ధదేవత్వము గల అజానజానదేవలచేతను నిండియున్నలోకము. ఇది పదునాలుగు మనువులకుగూడ నివాసస్థానము. వీరలతీతులు, వర్తమానులు, అనాగతులుగ నుందురు. ఋషులతోడను, దేవతలతోడను, గంధర్వరాక్షసాదులతోడను బ్రతిమన్వంతరమందును దీనికిపైనున్న జనలోకమునకుఁ బోవుచుందురు. దేవతలు, సప్తఋషులు, మనువులు, పితృదేవతలు నెవరంతకువారు క్రమములేకయే నీమహర్లోకము నాశ్రయించియుందురు. ధార్మికులగు బ్రహ్మక్షత్రియ వైశ్యులతోసహా దేవతలగుచు యథార్థమగు కర్మలను జేయుచున్నవారలై శ్రద్ధావంతులై దర్పములేక శ్రౌతస్మార్త వర్ణాశ్రమ ధర్మములయందు గ్రమముగా బ్రతిమన్వంతరాంత కాలమందు నివృత్తాధికారులగుదురు.

శుక్రాదిగ, నారుగ్రహములు(శుక్రబుధ, సోమ, సూర్య, రాహుకేతువులు) స్వారోచిషాది చాక్షుషమన్వంతర పర్యంతము మనువులై అతీతులై భూమినే యాశ్రయించియున్నారు. అనగా మనువులై స్థూలసృష్టికి గారణభూతులై నాలుగవదియగు నీమహర్లోకమునందు కల్పాంతవాసులగు మనువులు నివసించుచుందురు. "మహర్షయస్సప్తపూర్వే చత్వారో మనవస్తథా, మద్భావామానసాజాతా యేషాం లోకయిమాః ప్రజాః"యని గీతావాక్యప్రమాణము.

సూర్యుఁడు మొదలు ధ్రువలోకపర్యంతముగల అంతరాళము కారణ స్వర్లోకమని తెలియవలెను. ఈ ధ్రువుని అన్వయక్రమముతో బ్రహ్మగాగూడ సందర్భానుసారము గ్రహించవలెను. కాబట్టి సత్యలోక బ్రహ్మనుగూడ ధ్రువునిగ నిశ్చయించవలెను. ధ్రువసంజ్ఞలో నీలోకములన్నియు ధ్రువములని తెలియవలెను. అందుచేత ధ్రువసంజ్ఞతో సత్యలోకమునకుఁ గ్రిందుగాఁగల మహర్లోకోర్ధ్వభాగ పర్యంతము మహర్లోకమనియు జెప్పబడును. ఈలాగున నేడులోకములున్ను రెండేసిభాగములుగ విభజించి చెప్పఁబడినవి. ఆలోకములోని ప్రజలను లోకాధిపతులను సిద్ధులని చెప్పుచున్నారు. భూర్లోకవాసులందరు అన్నాత్మకులై అన్నరసాత్మకులగుచున్నారు. ఊర్ధ్వలోకవాసులు భూలోకజన్మకొఱకు స్వర్గమునందు సోమపా

నము జేయువారలయు, ఆజ్యపానములను జేయువారలయు, నాలుగవలోకమగు మహర్లోకమున నెవరుందురో వారలయు, సిద్ధిపంచలక్షణములుకలవి. వారలు మనస్సునందు సంకల్పమాత్రముతో సర్వసిద్ధులుగా నగుచున్నారు. వీరలే యవతారమూర్తులుగ భూలోకమున జన్మించి కార్యానంతరము తమనిజ నివాసములను జేరుదురు. వారి జన్మాదులు మనజన్మాదులవలెఁ దలంపరాదు. వీరలందరు కర్మదేవతలు, అతీతులు, అందుచేత ప్రవృత్తిలో వీరలను, భూత, భవిష్యద్వర్తమాన కాలములందందరును యజ్ఞయాగాది క్రతువులతో శ్రాద్ధాదులతోను బూజించుచుందురు. అందుచేత కర్మదేవతలై ఫలములనొసంగుచుందురు. "మనుష్యావా ఈడేన్యాః పితరో నమస్యాః దేవాయజ్ఞియాః దేవతాఏవ తద్యథాభాగం యజతి" అని వేదప్రమాణము ఈశబ్దము పరస్పరార్థధర్మముగ ప్రవృత్తిగను నివృత్తిధర్మముగనున్నది. స్తుతితో సంతసించువారలు మానవులుగను, నమస్కారముతోఁ దృప్తిపడువారలు పితరులుగను, యజ్ఞయాగాదులతోఁ దృప్తిఁజెందువారలు దేవతలుగనున్నారు.

ప్రథమ ప్రారంభయజ్ఞము మొదలు అనంతవిధములగు యజ్ఞములకాలమున మందు నివృత్తిధర్మముతో అతీతులగు దేవగణములఁగూర్చి చేయుచు కోటియేఁబది గర్మలతో నివృత్తినిఁబొందినవారియొక్క సిద్ధమనస్సంకల్పముచే నన్నిఁభూమి అర్ధము చుండగా అతీతులగు కర్మదేవతల సిద్ధమనస్సంకల్పములగుచుంచి యయుగ నుండును. లేదు. పంచయజ్ఞములందులోఁజేరినవి. ప్రత్యేకభూతపంచక పంచతత్త్వరూపము ములు, ప్రవృత్తియజ్ఞములు వీటిని ఫలాభిలాషలేక చేసినవారలకు అత్మజ్ఞ చేయున్నది. శబ్దప్రణవయజ్ఞము జ్ఞానయజ్ఞములు లభించును. ఇదంతయు మీకుసంక్షేపము. పంచ తేజో జెప్పితినని వాయువుచెప్పెను.

మరీచి, కశ్యపుఁడు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, అంగీరసుఁడు, భృగువు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వీరలు పూర్వము బ్రహ్మయొక్క మనస్సుచేతనే మానసిక ప్రవృత్తులై యీ భౌతికమందు తమ మానసిక సంతానమును బ్రతిష్ఠజేసి జనోవ్యాహృతి లోకమగు జన్మాదుల నాశ్రయించు చుందురు.

ప్రళయకాలమందు సంవర్తాగ్నిజ్వాలలచే నీభూరాది మహదంతలోకములు నాశ్రయింపబడగా నీలోక సర్వగణములు జనలోకము నాశ్రయింతురు. ఇచ్చట సనకాదులుందురు క్రిందిలోకమువారలు నీ సనకాదులతో సమానసర్వధర్మములుగలవారలై తురీయమూర్తులై మన్వంతరప్రళయ రాత్రికల్పమువఱకు నిచ్చట నుందురు. తరువాత జగత్ప్రళయములో బ్రహ్మను బొందుదురు. ఇది మన్వంతర

రాత్రికల్పము. తదుపరి తెల్లవారిన వెనుక అవ్యక్తయోనియగు మానవబ్రహ్మ యొక్క అహోరాదియందు ప్రవృత్తిధర్మరతులు పూర్వమువలె మరల సంతానవంతు లగుదురు. ప్రతిలోకములోను రెండుధర్మములుండును. ఇవిప్రవృత్తి, నివృత్తి ధర్మములు. వీటిననుసరించిన వార లాయాఫలములుగల లోకాదులను బొందుదురు. ఇదిమనదేహములో హృదయాది శిరఃపర్యంతము నన్వయము. తపస్సుచేత హృద యాదిగా క్రమముగ సహస్రారముచేరి మరల హృదయమును జేరుటొకవిధమగును. దృఢధ్యాన వైరాగ్యనివృత్తి యోగముతో దీక్షాకాలము పరిపక్వముతో సహస్రా రమందుండి స్ఫోటనతో బ్రహ్మరంధ్రాంతముతో ముక్తినిఁజెందినవారలగను దెలియ వలెను. (తపోగ్ని, కంఠవహ్ని) కావున స్వాయభువ మనువులందరును అనగా మరీచ్యాదులందరు మానవబ్రహ్మలగుటచేత సాధకులని చెప్పఁబడుచుందురు వారే దేవతలై సామవైదికనాద నిధనమునందువలె తమతమ ఔపాధిక నిధనమందు మరల మరల జాయమానులగుచుందురు. దీనివివరము సామవైదికభాగమందు, ౧ వాది లేక కారా ౨ ఉద్గీతము, ౩ ప్రస్తావము, ౪ ప్రతిహారము, ౫ నిధనమని కాలమందు సామముయొక్క పంచావయవ లక్షణములు తెలుపఁబడినవి. వీటినే

మన్త్రాక్షరము(?)గాను, అంతమును ఉపద్రవముగాను జెప్పఁబడెను. దీనినే స్వారోచిపాదియమని పిలుతురు. సామవైదిక స్వరము. స రి గ మ ప ద ని స యుంచియున్న వారలు, ౧ మహాభూతవశినులు, ౨ కుముదులు, ౩ ఋభువులు నీమహర్లోకులు, ౫ అంజనాభులు. దీనివిస్తృతి ఒకకోటి యోజనములుండును.

యున్నప్పుడు ౧ మహాభూతవశినులు:- పంచభూతము స్వవశంబుగ గొన్నవారలు.

లోక

౨ కుముదులు:- లోకముల సంతసింపజేయువారు.

౩ ఋభువులు:- స్వర్గముతోఁ బుట్టినవారలు.

౪ ప్రతర్దనులు:- అనాదినుండియు మోక్షముగోరువారలు.

౫ అంజనాభులు:- కాటుకవంటి కాంతిగలవారు.



## కాం చ న భూ మి.

శ్రీవిష్ణుపురాణము - ద్వితీయాంశము - అధ్యా. ౪

శ్లో॥ స్వాదూదకస్యపురతో దృశ్యతే లోకసంస్థితిః। ద్విగుణా కాంచనీభూమి

స్సర్వజంతు వివర్జితాః ॥ ౯3 ॥

శ్రీదేవీభాగవతము - అష్టమస్కంధము - అధ్యా. ౧౪.

శ్రీనారాయణ ఉవాచ:-

అంతరాళే చలోకా లోకయోర్యః పరికల్పితః ॥ ౧ ॥ యావదస్తి చదేవర్షే హ్యంతరం మానసోత్తరాత్ ॥ సువేరోస్తావతీ శుద్ధా కాంచనీ భూమిరస్తికా ॥ ౨ దర్పణోదర తుల్యాసా సర్వప్రాణి వివర్జితా ॥ యస్యాం పదార్థః ప్రహితోనకించ త్ప్రత్యుదీయతే ॥ 3 ॥ అతస్సర్వప్రాణి సంఘరహితా సాచనారద ॥

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము ౫ - అధ్యా ౨౦.

యావన్మానసోత్తర మేర్వోరంతరం తావతీభూమిః - కాంచన్యాదర్శతలోపమా - యస్యాంప్రహితః పదార్థో నకథం చిత్పునః ప్రత్యుపలభ్యతే - తస్మాత్సర్వసత్త్వపరిహృతా - ఆసీత్ ॥ 3౫ ॥

ఈ కాంచనభూమి శుద్ధోదక సముద్రము నుండి లోకాలోక పర్వతమువఱకు వ్యాపించియున్నది. దీనికే అగ్నిమార్గమని పేరు. దీనివిస్తారము మేరుమూలమున నుండి మానసోత్తర పర్వతమువఱకు వ్యాపించియున్నది. భూవిస్తారము కోటియేబది యేడులక్షల యేబదివేలయోజన పరిమితికి సమానము. ఈ కాంచనభూమి అద్దము వలె స్నిగ్ధముగను నిర్మలముగను ప్రాణిశూన్యముగను, జలశూన్యముగ నుండును. ఈభూమియందుంచిన వస్తువును దేనినైనను మఱల బొందనేరము. తత్స్వరూపము గనే అగును. అట్టిమహిమాతిశయ మాభూమియందు భగవదాజ్ఞచేయున్నది. అచటికెవరునుబోఁజాలరు జ్ఞానులకు, బ్రహ్మర్షులకు, త్రిమూర్తులకు సాధ్యము. పంచభూతములెటుజూచినను న్నవి. కాబట్టి తత్త్వశాస్త్రము ననుసరించి ఈభూమి తేజోమయభూమి. కాంచనమనఁగఁ బ్రకాశస్వరూపమూలము. ఏవస్తువును బొందజాలమనినందు కిదేకారణము. ఎవరును బోఁజాలరనిన జలపృథివీభూత ప్రధాన స్వరూపులకు ప్రమాదముగ నుండునని యర్థము. తత్స్వరూపులకు సమానత్వముగ నుండును. అన్నిపురాణముల ప్రమాణములు సమానములుగ నున్నవి అగ్నిమార్గమని మత్స్యపురాణమందుగలదు.

## అగ్నిమార్గము.

మత్స్యపురాణము - భూగోళవిషయము.

లోకాలోక పర్వతమునకును, శుద్ధోదక సముద్రమునకును మధ్యలోగల

హిరణ్మయ ప్రదేశమునకే అగ్నిమార్గమని పేరు. అగస్త్యుడీయగ్నిమార్గమునకును, శుద్ధోదకమునకును మధ్యలో దక్షిణదిశలోనున్నాడు. ఈ ఉభయమధ్యమార్గమే పితృయానము. ఇచ్చట అగ్నిహోత్ర పరులగు ఋషులు లోకసంతాన వృద్ధికై హేతుభూతులై వసించియున్నారు.

—o—

## ప ర్వ త ము ల వి వ ర ము.

మూర్తివంతములన్నియును భూతమయములు. మూర్తిమంతమునకే భూతమని సంజ్ఞగలిగినది. పంచభూతాదులతోఁ గలిగినందుచేత రూపమేర్పడినది. కాబట్టి భూతమన్నను రూపమన్నను నొకేయర్థము. ఇవి స్థూల సూక్ష్మకారణములుగా చరాచరసృష్టిజాల మంతయునున్నది. కారణరూపమే వాయుభూతము. ఇదిఛాయామాత్రరూపము. ఈఛాయ త్రివిధములుగ స్థూల సూక్ష్మ కారణాంతరములతో నున్నది. ఇంతకుముందే ఛాయనుగుఱించి వివరించితిని. చూడవచ్చును. తేజోభూతముతో సూక్ష్మ ప్రకాశముగలుగును. ఇదిహస్తగతము: దుస్సాధ్యము. జలపృథివీభూతములతో స్థూలభూతరూపమగను. ఉదాహరణము;- మన దేహములోఁగల శల్యాదులాదిలో బిందువునందెట్లుండి తుదకు పరిణామముతో మార్పు చెంది స్థూలరూపములాయెనో యట్టులాయాభూత ప్రధాన స్థానముతో నాభూత గుణానుసార రూపవంతముగ నన్నియుచుండును.

క్రమముగ మఃభూమినుండి ఊర్ధ్వమునకే దిశకేగినను భూతాదుల వరుసలు ఆవరణములుగా నున్నవి. లోకాదులటులనే భూతాదిగుణాముల నాశ్రయించి యున్నవి. అచ్చటి పర్వతాదులటులనే భూతానుగుణ్యరూపాదులుగనే యుండును. లోకాలోక పర్వతము కడపటిది. ఇది వాయుభూత లోకముగాన వాయురూపముతో తమోరూపముగానుండును దీనికావల ఆకాశమగుటచేత ఆకాశ వాయువు మిశ్రితముగ ఉభయమధ్యభూత రూపచ్ఛాయతోనుండును. ఇందుకుఁ బ్రమాణములు శ్రుతిపురాణమునందును దమోరూపములనే నిరూపించిరి. మన భూమిలోఁగల పర్వతాదులవంటివేనాయని సందేహింపఁబనిలేదు. మనమెట్లు ఊర్ధ్వ లోకాదులలో భేదమూర్తులుగ నున్నామో యవియు నటులనేయుండును. మేరు పర్వతమును నీలాగే గ్రహించవలెను. ఇది కేవల తేజోవాయుభూత సంబంధము.

స్థూలాకారమును బర్వత సంజ్ఞగా నుడివిరి. ధ్రువసూర్యుల సంబంధముతో సర్వమునాకర్షించిన సూత్రరూపమే మేరువు. మేరువే లేకున్నచో సర్వలోకము సంబంధములులేక భిన్నములుగానుండి నిలుకడలేనివిగా నుండెడిది. మణులందు సూత్రమువలె మేరువున్నది. వస్తువులకు పదార్థములకు ఆవరణమువలె లోకాదులకుఁ బర్వతములున్నవి. సర్వచరాచర మంతయు నీలాగుననే లోకానుసారము లుగ భూతాదుల ననుసరించి చైతన్యములు జడాదులునున్నవి. ఈలాగున నుత్పత్తి యందును బ్రళయములందునున్నది. ఒకభూతములోనుండి అధోముఖముతో మరొకభూత మెటులుత్పత్తియైనదో యటులనే ప్రళయములో క్రిందిభూత ముపరిభూతముతో ఆకర్షింపఁబడుచున్నవి. మన మెట్లు ఆహారాదుల నాకర్షించి తిను చున్నామో యటులనే. అందుచేతనే సర్వభూతములును భూతములచే నుత్పన్నములై తుదివాటిలోన లీనములగుచున్నవి. ఇదే బుభుక్షుత్వము. ఇదేప్రళయము. అగ్ని యను దనకు దా నేయుత్పత్తియై మజల తనకుఁదానే నాశనముగానున్నవి. ఇవి మూల ప్రకృతి లక్షణముగాన తదనుసారమే యీ సర్వసృష్టియునున్నది. భూతముతోనే యుత్పత్తి భూతముతోనే ప్రళయము. ఆలోచననే తపస్సనఁబడును. తొందరపడి ఉదాసీనము చేయరాదు. ఉదాసీనత కజ్ఞానమే కారణము. వేదశాస్త్రపురా ణాదులం దప్రమాణంబు లెంతమాత్రము లేవని తెలియవలెను అవి ఆధారాధే యములుగ సర్వదాప్రమాణముగ నున్నవి. ఈలాగుననే సముద్రములు, ద్వీప ములు, లోకముల నన్వయించవలెను.



# లోకాలోకపర్వతము.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౦ - పుట ౭౮.

శ్లో॥ దక్షిణే నాగవీథ్యాయాం లోకాలోకస్య చోత్తరం। లోక సంతారకో హ్యేష వైశ్వానర పథాద్బహిః॥ ౧౫౬ ॥ వ్యష్టేయావతు ప్రభాసారీ పురస్తాత్ సంప్రకాశతే। పార్శ్వయోః పృష్ఠతస్తావ ల్లోకాలోకస్య పర్వతః॥ ౧౫౭ ॥ యోజ నానాం సహస్రాణి దశోర్ధ్వం తూచ్ఛ్రితోగిరిః। ప్రకాశశ్చా ప్రకాశశ్చ సర్వతః పరిమండలః॥ ౧౫౮ ॥ నక్షత్ర చంద్రసూర్యాశ్చ గ్రహాస్తారాగణైః సహ। అభ్యం

తరం ప్రకాశంతే లోకాలోకస్య శైగిరేః॥ ౧౫౯॥ ఏతావానేవ లోకస్తు నిరా లోకస్త్వతః పరం। లోకా లోక ఏకధాతు నిరాలోకస్త్వనేకధా॥ ౧౬౦॥ లోకా లోకంతు సంధత్తే యస్మాత్ సూర్యః పరిగ్రహం।

శ్రీవాయుపురాణము - భువనవిన్యాసము - అధ్యా. ౪౯ - పుట ౭౧.

కాంచనీ ద్విగుణాభూమిః సర్వాచైక శిలోపమా॥ ౧౪౩॥ తస్యాత్పరేణ శైలస్తు మర్యాదాంతేతు మండలం। ప్రకాశశ్చా ప్రకాశశ్చ లోకాలోకః సఉచ్య తే॥ ౧౪౪॥ అలోకస్తస్య చార్వాక్తు నిరాలోక స్తతఃపరం। యోజనానాం సహ స్రాణి దశతస్యోచ్ఛ్రియః స్మృతః॥ ౧౪౫॥ తావాంశ్చ విస్తరస్తస్య పృథివ్యాం కామగశ్చసః అలోకే లోకశబ్దస్తు నిరాలోకే సలోకతా। లోకార్థం సమ్మతోలోకో నిరాలోకస్తు బాహ్యతః॥ ౧౪౬॥ లోకవిస్తర మాత్రంతు అలోకః సర్వతోబహిః సరిచ్ఛిన్నః సమంతాచ్చ ఉదకే నావృతశ్చసః॥ నిరాలోకాత్పరశ్చాపి అండమా వృత్య తిష్ఠతి॥ ౧౪౭॥

శ్రీవిష్ణుపురాణము - ద్వితీయాంశం - అధ్యా. ౪.

శ్లో॥ స్వాదూదకస్యపరతో దృశ్యతే లోకసంస్థితిః॥ ద్విగుణా కాంచనీభూమి సర్వజంతు వివర్జితా॥ ౯౩॥ లోకాలోకాస్తతశ్శైలో యోజనాయుత విస్తృతః। ఉచ్ఛ్రయేణాపి తావంతి సహస్రాణ్యాచ లోహిసః॥ ౯౪॥ తతస్తమస్స మావృత్య తంశైలం సర్వతస్థితమ్। తమశ్చాండ కటాహేన సమంతా త్పరివేష్టితమ్॥ ౯౫॥ పంచాశత్కోటి విస్తారా సేయ ముర్వీమహామునే।

శ్రీదేవీభాగవతం - అష్టమస్కంధం - అధ్యా. ౧౪.

శ్రీనారాయణఉవాచ:-

తతః పరస్తాదచలో లోకాలోకేతి నామకః। అంతరాళేచ లోకాలోకయోర్యః పరికల్పితః॥ ౧॥ లోకాలోక ఇతివ్యాఖ్యా యదత్ర పరికల్పితా॥ ౪॥ లోకాలో కాంతరే చాస్యవర్తతే సర్వదాస్థితిః। ఈశ్వరేణ సలోకానాం త్రయాణామంతగః కృతః॥ ౫॥ సూర్యాదీనాం ధృవాంతానాం రశ్మయో యద్వశాదిహ। అర్వా చీనాశ్చ త్రీన్ లోకా నాతన్వానాః కదాపిహి॥ ౬॥ పరాచీనత్వ భాజోహి నభ వంతిచ నారద। తావదున్నహ నా యామః పర్వతేంద్రో మహాహాదయః॥ ౭॥ ఏతావాన్ లోక విన్యాసేzయం సంస్థామానస లక్షణైః। కవిభిస్తు సపంచాశత్కోటి భిర్గణితస్యచ॥ ౮॥ భూగోళస్య చతుర్థాంశో లోకాలోకాచలో మునే॥

శ్రీమత్స్యపురాణము - అధ్యాయము ౧౨౩.

స్వాదూదకస్యపరితః శైలాస్తుపరిమండలః॥ ౮౬ ॥ ప్రకాశశ్చా ప్రకాశశ్చ లోకాలోకః సఉచ్యతే। ఆలోకస్తత్రిచార్వాక్చ నిరాలోకాస్తతఃపరమ్॥ ౮౭ ॥

## —♦ లో కా లో క ప ర్వ త ము. ♦—

ఈపర్వతము అలోకమునకును లోకమునకును మధ్యలో మర్యాదపర్వతముగ ఆవరణముగ నున్నందుచేత లోకాలోకపర్వతమని పేరుగలిగెను. ఈపర్వతమున కంతరములో భూర్లోక, భువర్లోక, సువర్లోకములున్నవి. సూర్యుడీ మూడులోకముల మధ్యలో నుండుటచేత సూర్యప్రకాశముచే నీమూడులోకములు ప్రకాశించుటచేత లోకాదులుగ కనుబడుచున్నవి. ఈలోకాదులు మూర్తవంతములుగ నున్నవి. కాబట్టి యివిలోకాదులుగ లోచనతో లోకనతోలోకములుగను లోకస్థులుండుటచేత లోకాదులుగ ప్రకాశించియున్నవి. సూర్యప్రకాశస్వరూపాంశమే మననేత్రములు. ఈలోకాలోక పర్వతమునకావల ఆకాశభూతముతో అలోకముగ నున్నది. ప్రకాశించులోకము తేజోభూతము. ఈ రెంటిమధ్యలో వాయుభూతమే లోకాలోకపర్వతము. ఈపర్వతమునుచూచి తెలుసుకొనలేనట్టి స్థితిలో నున్నది. వాయ్వాకాశభూత స్వరూపము. సూర్యరశ్మికి మార్గము, అలోకమునందు లేదు. లోకాలోక పర్వతావరణముతో నడ్డగింపబడియుండుటచేత సూర్యప్రకాశమున కవకాశము లేదు. ఈలోకాలోక పర్వతము శుద్ధోదక సముద్రమునుండి ఉపరిలో ధ్రువమండలాంతమువరకు వ్యాపించి ఆవరణరూప పర్వతముగ నున్నది. లోకాలోక పర్వతపరిధి ధ్రువునకు సమానముగనున్నది. భూర్భువస్సువర్లోకములు లోకాలోక పర్వతమున కంతరాళ లోకములుగ నున్నవి. ఉదాహరణము:- టెంకాయ దానిపైరంధ్రమే ధ్రువమండలము లోపలిపదార్థములు లోకాదులు. మరొక ఉదాహరణము:- మనముండునింటి ఆవరణప్రాకారపుగోడయే లోకాలోక పర్వతముగను, నింటిలో మధ్యలోగల దీపమే సూర్యుడుగను నింటిగవాక్షమే ధ్రువమండలముగను లోపలిభాగమే లోకాదులుగ సమన్వయముచేసుకొనవచ్చును. లోకమునకును అలోకమునకును మధ్యలో విభాగముగ నీపర్వతమున్నందుచేత ఉభయ నామములతో లోకాలోక పర్వతమని ఖ్యాతిగాంచెను.

పర్వతములుగాని మరియేదియుగాని యనేకయోజనముల దూరమున నున్న నీలరూపాకాశముగను స్నిగ్ధముగను సమముగను మహదాకారముతో నేమియును దోచక కనబడుచుండును, కోట్లయోజనదూరమున భూతభేదములతో నున్నవాటిని

గుఱించి నాలోచింప నక్కరలేదు. పురాణప్రమాణము లటులనే యున్నవి. ఈ పర్వతమునకు చక్రవాళ పర్వతమని నామాంతరముగలదు.

ఈ యండభిత్తికి నూర్ధ్వభాగమునకును క్రిందిభాగమునకును మధ్యలో సూర్యుడుండును. ఈసూర్యుని కేటుచూచినను అండభాగము సమముగనుండును. ఈ యంశము నక్కరమైనది కాన మృతాంశమని పిలువబడుచున్నది. ఈ మృతాండమువలన నైనవాఁడు గాన సూర్యుండు మార్తాండుడని పిలువబడుచున్నాడు ఈ యండమధ్యభాగము హిరణ్మయమైయున్నది. ఈ హిరణ్మయాండ ముత్పత్తిస్థానముగా గలవాడు కావున బ్రహ్మ హిరణ్మయ గర్భుడని చెప్పబడుచున్నారు. సూర్య బ్రహ్మల కీయండమువలననే ఈ రెండు నామములు గలిగినవి. దిగ్విభాగము గూడ సూర్యునివల్లనే గలిగినవి. సూర్యునవధిగాఁ జేసికొనియే ప్రాగాది చతుర్దిక్కులు మూలలు గగనంబు స్వర్గాంతరిక్షమర్త్య పాతాళాదు లేర్పడెను. సూర్యుండు సమస్త జీవరాశికంతయును నేత్రేంద్రియాధిష్ఠాతయై యున్నాడు.

—o—

## లోకాలోకపర్వతమందు శ్రీమహావిష్ణు స్వరూపము.

శ్రీదేవిభాగవతము - అష్టమస్కంధము - అధ్యా, ౧౮.

శ్లో॥ విశుద్ధసత్త్వం చైశ్వర్యం వర్ధయన్భగవాన్హరిః॥ ఆస్తేసిద్ధ్యష్టకోపేతో విష్వక్సేనాది సంవృతః॥ ౧౨ ॥ నిజాయుధైః పరివృతో భుజదండైస్సమంతతః॥ ఆస్తే సకలలోకస్య స్వస్తయే పరమేశ్వరః॥ ౧౩ ॥ ఆకల్పమేవం వేషం సగతో విష్ణుస్సనాతనః॥ స్వమాయారచితస్యాస్యగోపీథాయాత్మసాధనః॥ ౧౪ ॥

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా. ౨౦.

తేషాం స్వవిభూతీనాం మహేంద్రాదీనాం లోకపాలానాం వివిధవీర్యోప బృంహణాయ - భగవాన్ పరమమహాపురుషో మహావిభూతి పతిరంతర్యామ్యాత్మనో విశుద్ధసత్త్వ ధర్మజ్ఞాన మహావైరాగ్యైశ్వర్యా ద్యష్టమహాసిద్ధ్యుపలక్షణం విష్వక్సేనాదిభి స్స్వపార్షద ప్రవరైః పరివారితో నిజవరాయుధోప శోభితైర్భుజదండై స్సంధారయమాణస్తస్మిన్ గిరివరే సమంతాత్సకల లోకస్వస్తయ ఆస్తే॥ ౩౯ ॥ ఆకల్పమేవభగవానాత్మమాయా విరచిత వివిధలోకయాత్రా గోపీథాయేతి॥ ౪౦ ॥

—♦ శ్రీమహావిష్ణుస్వరూపము. ♦—

ఇంద్రాదిదేవతలకు నానావిధ సామర్థ్య మొసంగుచున్నట్టి సర్వోత్కృష్టుండును బరమ పురుషుండును, బ్రకృతిపురుషుల కధిపతియునగు శ్రీవాసుదేవుండు సర్వాంతరాత్మ యై వర్ణాశ్రమాదికర్మయోగముల చేతను ఆధ్యాత్మిక జ్ఞానముచేతను వైరాగ్యము చేతను అనుగృహీతమయి యణిమాద్యష్టైశ్వర్యపర్యంతమగు నుపాసనముచే దర్శ నీయమగు శుద్ధసత్వస్వరూప దివ్యమంగళవిగ్రహమునుదాల్చి తనపరిచారక వరిష్ఠు లగు విష్వక్సేనాదులతోఁ బరివృతుండై భుజాదండములందుఁజక్రాది సాధనములతో బ్రకాశించి తనమాయచేఁ గల్పితమగు లోకముల రక్షణమందు ఆత్యాసక్తుడై సర్వ లోకముల సుఖమును కల్యాణమునుగోరుచు లోకాలోక పర్వతమందు గల్పాంతము వఱకు శ్రీమహావిష్ణుస్వరూపుడు నివసించు చుండును.

—o—

# లోకాలోకపర్వతమున లోకపాలురు.

శ్రీవిష్ణుపురాణము - ద్వితీయాంశము - అధ్యా. ౮.

శ్లో॥ లోకాలోకస్తు యశ్శైలః ప్రాగుక్తో భవతో మయా। లోకపాలాస్తు చత్వారః తత్రతిష్ఠంతి సువ్రతాః॥ ౮౨ ॥ సుధన్వా శంఖపాచ్చైవ కర్దమస్యాత్మ జోద్విజః। హిరణ్యరోమాచైవాన్యశ్చతుర్థః కేతుమానపి॥ ౮౩ ॥ నిర్ద్వంద్వా నిరభి మానానిస్తంద్రా నిష్పరిగ్రహాః। లోకపాలస్థితాహ్యేతే లోకాలోకేచతుర్దిశం॥ ౮౪

శ్రీవాయుపురాణము - అధ్యా. ౫౦ - శ్లో॥ ౨౦౫, ౨౦౬, ౨౦౭.

ఇదేవిధముగనే శ్లోకాదులున్నందుచేత ఉదహరించలేదు. లోకపాలురు ౧ సుధన్వుడు, ౨ శంఖపాదుడు, 3 హిరణ్యరోముడు, ౪ కేతుమంతుడు. వీరలు ద్వంద్వరహితులు. అభిమాన శూన్యులు. పరిగ్రహములేనివారలు నిస్సం కల్పులు భగవదనుగ్రహ మునకు పాత్రులునై భగవదాజ్ఞతో లోకపాలురుగ నీలోకా లోక పర్వతశిఖరమునందు చతుర్దిక్కులయందునున్నారు. వీరలచే నీత్రివర్గమంతయు రక్షింపబడుచున్నది. కాబట్టి లోకపాలురని వీరికి పేరుగలిగెను ఇదంతయు భగవ ద్విభూతిలీలావిశేషముగాఁ దెలియవలెను. భగవంతు డనంతస్వరూపుడు. అన్ని పురాణములందు దీనిననుసరించిన ప్రమాణములేయున్నవి. భేదములులేవు.

# లోకాలోకపర్వతమున కరీంద్రములు.

శ్రీదేవీభాగవతము - అష్టమస్కంధము - అధ్యా. ౧౪.

శ్లో॥ కవిభిస్తుసపంచా శత్కోటిభిర్గణితస్యచ॥ ౪ ॥ భూగోళస్య చతుర్థాంశో లోకాలోకా చలోమునే॥ తస్యోపరి చతుర్దిక్షు బ్రహ్మణా చాత్మయోనినా॥ ౯ ॥ నివేశితా దిగ్గజాయేతన్నామాని నిబోధత॥ ఋషభః పుష్పచూడో౽థవామనో౽థా పరాజితః॥ ౧౦ ॥ ఏతేసమస్తలోకస్య స్థితిహేతవ ఈరితాః॥ తేషాంచ స్వవిభూతీనాం బహువీర్యోప బృంహణమ్॥ ౧౦ ॥

శ్రీమద్భాగవతము - పంచమస్కంధం - అధ్యా, ౨౦.

సతుపంచాశత్కోటి గణితస్య భూగోళస్య తురీయ భాగోయం లోకాలోకాచలః తదుపరిష్టాచ్చ తస్సృష్ట్వాశా స్వాత్మయోని నాఖిలజగద్గురుణాధి నివేశితాయే దిగిభపతయః ఋషభః పుష్కరచూడో వామనోథ పరాజిత ఇతిసకలలోకస్థితి హేతవః॥ 3౮ ॥ ఈలోకాలోక పర్వతోపరిభాగమున నాల్గుదిక్కులందును నిఖిల జగత్సృష్టికర్త బ్రహ్మ ౧ ఋషభము, ౨ పుష్కరచూడము, 3 వామనము, ౪ అపరాజితమని పేరులుగల నాల్గుకరీంద్రములను సకలలోక క్షేమార్థముగ నిలిపెను. ఈ కరీంద్రములు లోకాదుల నియమిత స్థలములందుండునట్లు నాకర్షించి స్వకీయవిభూతిబలముతో మహాబలము గలవైయున్నవి.

—o—

# అ లో క ము.

శ్రీదేవీభాగవతము - అష్టమస్కంధం - అధ్యా. ౧౪.

శ్లో॥ యోంతర్విస్తార ఏతేన హ్యలోక పరిమాణకమ్॥ వ్యాఖ్యాతా యద్బహిర్లోకాలోక ఇతీరణాత్॥ ౧౫॥ తతః పరస్తాద్యోగేశ గతిం శుద్ధాం వదంతిహి॥

శ్రీవాయుపురాణము - భువనలోకము - అధ్యా. ౫౦.

అతః పరమనాలోక్య మగమ్యం సిద్ధసాధుభిః॥ దేవానామప్యవిదితం వ్యవహార వివర్జితం॥ ౫౫ ॥ పృథివ్యగ్న్యంబు వాయూనాం నభసశ్చ ద్విజోత్తమాః మహత్వమేవ మృషిభిర్వర్ణ్యతే నాత్రసంశయః॥ ౫౬ ॥

శ్రీమత్స్యపురాణం - అధ్యాయం ౧౨౩.

శ్లో॥ తథాహ్యలోక ఆకాశో పరిచ్ఛిన్నాని సర్వశః। పాత్రేమహతి పాత్రాణి యథాహ్యాంతర్గతానిచ॥ ౫౭॥ 'ప్రకాశశ్చా ప్రకాశశ్చలోకాలోకః సఉచ్యతే। అలోకస్తత్రచార్వాక్ చనిరాలోకాస్తతఃపరమ్॥ ౬౭॥

## —♦ అ లో క వి వ ర ము. ♦—

భూతాదులతోను గుణాదులతోను వీటిసంబంధేంద్రియాదులకు నతీతమై స్థూలముతో అలోకమనియు అజ్ఞానముతో అవ్యక్తమనియుఁబిలువబడు నదియలోకము. ఇయ్యది అతీంద్రియులకు గోచరము. లోకాదులకుఁ గారణరూపమే అలోకము. అజ్ఞానమునకు కారణరూపమే అవ్యక్తము. ఈ అవ్యక్తమునుగుఱించి యిందులోఁ బూర్వభాగమగు నాధ్యాత్మిక ప్రకరణమున వివరించియున్నాను. సర్వబ్రహ్మాండ ములకును నీలాగుననే అలోకావరణమున్నది. సర్వజీవరాసులకును ద్రిమూర్తులకు సహితము అవ్యక్తమున్నది. ద్వంద్వమునకు నిదేకారణము. మనకు గలవ్యక్త ప్రపంచమంతయును అవ్యక్తావరణమునకులోనైనదే. ఈ అవ్యక్తమునుగాని అలోక మునుగానిఁ ప్రకృతివిజ్ఞానముతో నెంతమాత్రము దెలియజాలము. కేవల స్వరూప జ్ఞానులు, తత్త్వవేత్తలు, అతీంద్రియులు, భూతాతీతులు ద్వంద్వరహితులు మాత్రము దీని తెలిసికొందురు. సంపూర్ణమేకముతో అద్వితీయాత్మయనియు భిన్నముతో రెం డవ దవ్యక్తమనియు బిలువఁబడును. మాయయని అజ్ఞానమని అలోకమని, తమస్సని రెండవదానికిఁ బర్యాయపదములు. ప్రతిదానికిని నీఆవరణ మంత్యములోనున్నది.

—o—

## లో క వి వ ర ము.

శ్రీవాయుపురాణము - అధ్యా. ౫౦ పుట. ౭౩

అండస్యాంతస్త్విమే లోకాః సప్తద్వీపాచమేదినీ। భూర్లోకశ్చ భువశ్చైవ తృతీయః స్వరితిస్మృతః। మహర్లోకో జనశ్చైవ తపఃసత్యశ్చ సప్తమః॥ ౭౫॥ ఏతేసప్త కృతాలోకా శ్ఛత్రాకారావ్యవస్థితాః। స్వైస్వై రావరణైః సూక్ష్మైర్ధార్యమాణ పృథక్ పృథక్॥ ౭౦॥

శ్రీవాయుపురాణము - భువనవిన్యాసము - అధ్యా. ౪౯. పుట. ౭౧

అండస్యాం స్త్విమే లోకాః సప్తద్వీపాచ మేదినీ। భూర్లోకోఽథ భువర్లోకః స్వర్లోకోఽథ మహాస్తథా॥ ౧౪౮॥ జనస్తపస్తథా సత్యమేతావాన్ లోకసంగ్రహః। ఏతావానేవ విజ్ఞేయో లోకాంతశ్చైవచ తత్పరః॥ ౧౪౯॥ కుంభస్థాయా భవేద్యా ద్వృక్ ప్రతీచ్యాం ఉశిచంద్రమాః। ఆదిత్యః శుక్లపక్షస్య వపురండస్య తద్విధం॥ ౧౫౦ అండానా మీదృశానాంతు కోటయో జ్ఞేయాః సహస్రశః। తిర్యగూర్ధ్వమధస్తాచ్చ కారణ స్యావ్యయాత్మనః। కారణైః ప్రాకృతైస్తత్రిహ్యావృతం ప్రతిసప్తభిః॥ ౧౫౧ః దశాధిక్యేవ చాన్యోన్యం ధారయంతి పరస్పరం। పరస్పరావృతాః సర్వే ఉత్పన్నాశ్చ పరస్పరాత్॥ ౧౫౨॥ చంద్రాదిత్యౌ వతప్తాస్తుయేలోకాః ప్రథితాబుధైః। తేలోకా ఇత్యభిహితా జగతశ్చనసంశయః॥ ౧౬౨॥

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా. ౨౦.

లోకాలోక ఇతిసమాఖ్యాయద నేనాచలేన లోకాలోక యోంతర్వర్తి నావ్యవస్థాప్యత ఇతి సలోకత్రయాంతే పరిత ఈశ్వరేణవిహితః యస్మాత్సూర్యాదీనాం ధ్రువాపవర్గాణాం జ్యోతిర్గణానాంగభస్తయోఽర్వాచీనాం స్త్రీన్ లోకానావితన్వానానకదా చిత్పరాచీనా భవితు ముత్సహంతే। ౩౬॥ తావదున్నహానాయామః ఏతావానేవ లోకవిన్యాసో మానలక్షణసంస్థాభిశ్చింతితః కవిభిః॥ ౩౭॥ సతుపంచాశత్కోటి గుణితస్య భూగోళస్య తురీయభాగోయం లోకాలోకాచలః

శ్రీదేవీభాగవతము - అష్టమస్కంధము - అధ్యా. ౧౪.

అండమధ్య గతస్సూర్యో ద్యావాభూర్యోర్యదంతరమ్॥ ౧౬॥ సూర్యాండ గోళయోర్మధ్యే కోట్యస్స్యుః పంచవింశతిః। మృతేఽడఏష ఏతస్మిన్ జాతో మార్తాండ శబ్దభాక్॥ ౧౭॥ హిరణ్య గర్భ ఇతి హిరణ్యాండ సముద్భవః। సూర్యేణహి విభజ్యంతే దిశఃఖం ద్యౌర్మహీభిదా॥ ౧౮॥ స్వర్గాపవర్గౌ నరకారసాతాంసి చ సర్వశః। దేవతిర్యఙ్మనుష్యాణాం సరీసృప సవీరుధామ్॥ ౧౯॥ సర్వజీవనికాయానాం సూర్యఆత్మాదృగీశ్వరః। ఏతావాన్భూమండలస్య సన్నివేశ ఉదాహృతః॥ ౨౦॥ ఏతేనహి దివోమానం వర్ణయంతిచతద్విదః। ద్విదళానాంచ నిష్పావా దినాంచ దళయోర్యథా॥ ౨౧॥ అంతరేణ తయోరంతరిక్షం తదుభయ సన్ధితమ్। యన్మధ్యగశ్చ భగవాన్భానుర్వై తపతాంవరః॥ ౨౨॥ ఆతపేన త్రిలోకీంచ ప్రతపత్యేవభాసయన్॥

దీనియభిప్రాయము లోకాలోక పర్వతమునందే వివరించినందుచేత నిట వ్రాయలేదు.

# శింశుమార వివరము – వేదప్రమాణము,

ఈబ్రహ్మాండాకార విశ్వములో నీశింశుమారమునే సర్వులు ముఖ్యముగ దెలియవలెను. దీనితో ఇహపరసాధన ఫలములను బొంది తుదకు పరాపరమగు ఆత్మను బొందవచ్చును. ఈబ్రహ్మాండాకార విశ్వములో నీశింశుమారము మధ్యలో హృదయస్థాన కేంద్రముగ నున్నది. విశ్వవిరాడీశ్వర శరీరమునకు శింశుమారము హృదయస్థానము. ఆత్మప్రకాశ లోకహృదయ పుండరీకము. ప్రతిజీవశరీరమందును విరాడీశ్వర శరీరమందును నుండును. సమష్టి శరీరము హృదయస్థానము వ్యష్టిశరీరమునకు శిరస్థానము. మనహృదయస్థానమందు ఆదిత్యుడెటులనున్నాడో శింశుమారములోను జగదాదిత్యుడటులనే ప్రకాశించి సర్వాధారాత్మ స్వరూపచైతన్యుడుగ స్వప్రకాశుడై సర్వమూలముగనున్నాడు. శింశుమారములో ముఖ్యముగ గ్రహించవలసినది ఉపాసింపవలసినది నీఆదిత్యునే ఈ ఆదిత్యప్రధానముతో గాయత్రీస్వరూపముగ నీశింశుమారమునే సంధ్యలయందుపస్థానముగ విధిగ నిత్యమును మనవేద ఋషులు బతింపజేసిరి. శింశుమారము సర్వదేవతాత్మకము. సర్వతేజోరూపము. సర్వతారారూపము. దీనికే శ్రీమహావిష్ణు కుండలీభూత దివ్యరూప దేహమని పురాణములందు ప్రధానముగ దెలిపిరి శింశుమారమును నిత్యము సంధ్యలయందు ధ్యానించువారల పుణ్యము మహాతిశయమనిగూడ వాక్రుచ్చిరి. మనమాలోచించి చూడ ప్రత్యక్షప్రమాణముగ నున్నది. ఇది సర్వులకు ధ్యానాదియోగాదులకును తత్త్వస్వరూపులకును, మూలస్థానగమ్యగతిగ కూడనున్నది. దీనియుపాసనా క్రమమును వేదమంత్రములతోను స్తావకములతోను నిందులోనే సహితము వివరించినాను శింశుమారము మొదటిస్వర్గము. ఈ బ్రహ్మాండములో సర్వభ్రమణలకు సృష్టిస్థితిలయాదులకునుగూడ శింశుమారమొక ముఖ్యకారణము. ఇది ప్రకాశముతో నుండు నంతకాలను సర్వమును బ్రకాశింపజేయుచుండును. జీవులహృదయములోనున్న ప్రాణచైతన్యమువలె నీబ్రహ్మాండములో నిదిప్రాణచైతన్య చిత్స్వరూపముగనున్నది. ఇదినేత్రస్వరూపము, జ్ఞానస్వరూపము. రాత్రింబగళ్లకు నిదేకారణరూపము. దీని చలనముతో ధ్రువునికిని ధ్రువాదూర్ధ్వములోగల బ్రహ్మలోకమువఱకు కాలగతికి నిదేకారణము దీనిచలనముతోనే మనుకల్పములు, బ్రహ్మకల్పములు, యుగాదులు పరివర్తనములు, భుక్తములగుచున్నవి. ప్రళయములు సృష్టియును దీనివలననే

గలుగుచున్నవి. ఈ బ్రహ్మాండమను గడియారములోని సెకండ్ల యంత్రము వంటిది. జీవులహృదయములో గుండెవంటిది. ఇది జీవేశ్వర సంబంధైక్య సంధిస్థానము. దీని యాకారము కుండలాకృతిగ నున్నందుచేత కుండలీభూతమని వర్ణించిరి. శ్రీమహావిష్ణు దివ్యదేహమనిన స్థితివ్యాప్తితో బ్రకాశముతో నున్నదని అర్థము. దీనిలో సర్వము ప్రారంభసృష్టిగా గలిగినవెనుక నే మనలోకము ద్వితీయమగు సృష్టిగ నేర్పడెను. ప్రకృతము మనకుగల సర్వాధార విద్యుచ్ఛక్తి శింశుమారములోనిదే ప్రణవస్వరూపమే శింశుమారము. ఇట్టిదివ్యరూపమునకు అధ్యాత్మికోపాసనాది ధ్యానయోగమే ముఖ్యమార్గము. గమ్యము.

శింశుమార నామకరణముతో సర్వులకుభయముగలుగవచ్చును. ఇది సామాన్యార్థముగాని. జ్ఞానార్థమగు వేదార్థముగాదు. శింశుమారమనినను శిశుమారమనినను నొకటే. "సంస్కృత శబ్దార్థకల్పతరు గ్రంథములోను నానార్థ రత్నమాలలో శింశుమారమనే యున్నది. సతీత్రిరూపవిష్ణువని, వంకరగా ధనురాకారముగ నుండుటచేత కుండలీభూత శ్రీమహావిష్ణు దివ్యదేహమని వర్ణించిరి. శిశుమారమనగ పిల్లలను జంపునదని యర్థము. పిల్లలనగ తత్వార్థము అజ్ఞానులని స్పష్టముగాన అజ్ఞానమును బోగొట్టునదనిఅర్థము. శింశుమారము తేజఃప్రధానమైనందుచేత స్వర్గలోకమనబడును. ఇది తేజోరాశిలోకము. శింశుమారము మకరాకారమనియు, వృశ్చికాకారమనియు, మీనాకారమనియు పురాణములందు వర్ణింపబడినది. శింశుమారములో కక్ష్యలు మండలాదులు క్రిందినుండి విశాలములతో వలయములుగ క్రమముగ పైకిపోనుపోను మండలవిస్తారములు చాలచిన్నవిగనూ వంపులుగనుండుటచేత పైఆకారముల కవకాశము గలిగెను.

శింశుమారపుచ్ఛము ధ్రువమునంటి తలక్రిందై వ్రేలాడుచు తిరుగుచుండును. ఇది వంకరగా నుండుటచేత తిరుగుటకు సాధ్యమై అనుకూలముగనున్నది. చక్రానుండి తిరుగుటకంటె మధ్యేవంపులుగ నుండి తిరుగుటలో చాలసులభసాధ్యములుగ మనఅనుభవములోనున్నది. శ్రీమదాంధ్రభాగవతములో శ్రీమహాభక్తపోతనగారు వర్ణించుటలో తలక్రిందై వటువ్రమైయున్నదని పంచమస్కంధములో రెండవఆశ్వాసములో నూర పద్యమున వివరించినారు క్రమముగ శింశుమారములో విషయాదులన్నిటిని ముందువిమర్శించినదానిని చూడవచ్చును.

## —♦ శింశుమార ధ్యానము - వేద ప్రమాణము. ♦—

ఆరణ్యకము, స్వాధ్యాయబ్రాహ్మణము. ఆరణ్యకం; ద్వితీయప్రశ్న రెండవది కడపటి ఖండము ౧౯ ది.

హరిః ఓం భూః ప్రపద్యే భువః ప్రపద్యేస్వః ప్రపద్యే భూర్భువస్స్వః ప్రపద్యే బ్రహ్మప్రపద్యే బ్రహ్మకోశం ప్రపద్యేఽమృతం ప్రపద్యే అమృతకోశం ప్రపద్యే చతుర్జాలం బ్రహ్మకోశం యంమృత్యుర్నావపశ్యతి తంప్రపద్యే దేవాన్ప్రపద్యే దేవపురంప్రపద్యే పరీవృతో వరీవృతో బ్రహ్మణా వర్మణాఽహం తేజసా కశ్యపస్య యస్మై నమస్తచ్ఛిరో ధర్మోమూర్ధానం బ్రహ్మోత్తరాహనుర్యజ్ఞోఽధరావిష్ణుర్హృదయగ్ం సంవత్సరః ప్రజనన మశ్వినౌ పూర్వపాదా వత్రిర్మధ్యం మిత్రావరుణావ పరపాదావగ్నిః పుచ్ఛస్య ప్రథమంకాణ్డం తత ఇన్ద్రస్తతః ప్రజాపతి రభయం చతుర్థగ్ం సవాఏషదివ్యశ్శాక్వర శ్శిశుమారస్తగ్ం హ య ఏవం వేదాప పునర్మృత్యుం జయతి జయతి స్వర్గం లోకం నాధ్వని ప్రమీయతే నాగ్నౌప్రమీయతే నాప్సుప్రమీయతే నానపత్యః ప్రమీయతే లఘ్వాన్నోభవతి ధ్రువస్త్వమసి ధ్రువస్యక్షిత మసిత్వం భూతానా మధిపతి రసిత్వం భూతానాగ్ం శ్రేష్ఠోసిత్వాం భూతాన్యుప పర్యావర్తన్తే నమస్తే నమస్సర్వంతే నమో నమ శ్శిశుమారాయ నమః॥ ౧౯ ॥ ౨౩

ఇందులోపాఠభేదములు. నాప్సుప్రమీయతే నాగ్నౌప్రమీయతే నమస్తే నమస్సర్వంతేనమః ఇత్యేతావదేవ ద్రావిడపాఠః.

దీనిని ప్రధానముగఁజేసుకొని సంధ్యోపస్థానములో దీనికిఅనుగుణముగాఁగల క్రియాకర్మఫలమగు నీక్రింది మంత్రమును ముఖ్యముగా ఁబఠింపఁజేసిరి. శింశుమారములోఁగల సర్వమునుద్దేశించి నమస్కారపూర్వకముగ నిత్యము నాచరింపఁజేసిరి.

ఓం నమః ప్రాచ్యైదిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమోనమో దక్షిణాయైదిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంతి ఏతాభ్యశ్చనమో నమః ప్రతీచ్యైదిశే యాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమోనమ ఉదీచ్యైదిశే యాశ్చదేవతా ఏతస్యా ప్రతివసం త్యేతాభ్యశ్చ నమోనమ ఊర్ధ్వాయైదిశే యాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసం త్యేతాభ్యశ్చ నమోనమోఽధరాయైదిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమో నమోఽవాంతరాయైదిశే యాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసంత్యేతాభ్యశ్చ నమోనమో గఙ్గాయమున యోర్మధ్యేయేవసన్తి తేమేప్రసన్నాత్మానశ్చిరంజీవితం వర్ధయన్తి నమోగఙ్గాయమున యోర్మునిభ్యశ్చ నమోనమో గఙ్గాయమునయోర్మునిభ్యశ్చనమః॥ ౨౦ - ౨౮

దీనిని మనపృథివిలో భారతదేశములోఁగల సర్వమునుగూర్చి పైవిధమునననుసరించు నీలోకములోఁగల సర్వమును స్తుతినమస్కారపూర్వకముతో బ్రతింపఁజేసిరి.

—♦ ధ్యానశ్లోకాదులు. ♦—

శ్లో॥ హిరణ్యయస్యాద్ధరిత్రీ జలధరకలశం లింగభూకాశమూర్తిం నక్షత్రం పుష్పమాలా గ్రహణ కుసుమం నేత్రచంద్రార్కవహ్ని కుక్షేస్సప్త సముద్రం భుజగిరిశిఖరాం సప్తపాతాళపాదం వేదం వక్త్రం షడంగం దిశిదిశివదనం దివ్యలింగం నమామి॥

ఈశ్లోకమును వేదపఠనానంతరము చెప్పవలెను. రాత్రులందు మాత్రము శింశుమార ధ్యానము ముఖ్యమని శ్రీవాయుపురాణమందు ప్రమాణమున్నది. ప్రాచీన సాంప్రదాయమటులనే యున్నది. శింశుమారము ప్రతిభూతములోనున్నది. మన మున్నపృథివీభూత లోకము లో శింశుమారము మన భరతభూమి. శింశుమారమనఁగా సర్వదేవతలు,ఋషులు,నక్షత్రములు.గంగ మున్నగునవికలపవిత్రక్షేత్ర పుణ్యభూమి, ధ్యానభూమి, తీర్థభూమి. దర్శనీయపావనభూమిగాఁ దెలియవలెను. ఇది వేదములు, ఉపాసనలు, కర్మలు, జ్ఞానము, భక్తి యోగాదులన్నిటికి నిలయభూమి. అందుచేత

నిదియే శింశుమారాకారముగఁగూడ నున్నది. ఈలాగుననే శింశుమారమును సర్వత్ర సమన్వయము చేయవలెను.

శ్రీవాయుపురాణము - భువనకోశం - అధ్యా. ౫౨.

ఏవం ధ్రువనిబద్ధోఽసౌ సర్వతేజ్యోతిషాంగణః సైష తారామయో జ్ఞేయః శిశుమారో ధ్రువో దివి, యదహ్నా కురుతే పాపం దృష్ట్వా తం నిశి ముచ్యతే॥ ౯౦॥ యావత్యశ్చైవ తారాస్తాః శిశుమారాశ్రితా దివి, తావంత్యేవతు వర్షాణి జీవంత్యభ్యధికాని తు॥ ౯౧॥ శాశ్వతః శిశుమారోఽసౌ విజ్ఞేయః ప్రవిభాగశః, ఉత్తానపాదస్తస్యాథో విజ్ఞేయో హ్యుత్తరో హనుః॥ ౯౨॥ యజ్ఞోఽధరస్తు విజ్ఞేయో ధర్మో మూర్ధానమాశ్రితః, హృదినారాయణః సాధ్యః అశ్వినౌ పూర్వపాదయోః॥ ౯3॥ వరుణశ్చార్యమా చైవ పశ్చిమే తస్య సక్థిని, శిశ్నః సంవత్సరస్తస్య మిత్రోఽపానే సమాశ్రితః॥ ౯౪॥ పుచ్ఛేఽగ్నిశ్చ మహేంద్రశ్చ మరీచిః కశ్యపో ధ్రువః తారకాః శిశుమారశ్చ నాస్తమేతి చతుష్టయం॥ ౯౫॥ నక్షత్రచంద్ర సూర్యాశ్చ గ్రహాస్తారాగణైః సహ, ఉన్ముఖాభిముఖాః సర్వే చక్రీభూతాశ్రితా దివి॥ ౯౬॥ ధ్రువేణాధిష్ఠితాః సర్వే ధ్రువమేవ ప్రదక్షిణం, ప్రయాంతీహ పరం శ్రేష్ఠమేఢీభూతం ధ్రువం దివి॥ ౯౭॥ ధ్రువాగ్నికశ్యపానాంతు పరశ్చాసౌ ధ్రువః స్మృతః, ఏక ఏవ భ్రమత్యేష మేరుపర్వతమూర్ధని॥ ౯౮॥ జ్యోతిషాంచక్రమేతద్ధి సదా కర్షత్యవాఙ్ముఖః। మేరుమాలోకయత్యేష ప్రయాతీహ ప్రదక్షిణం॥ ౯౯॥ ఇతి మహాపురాణే వాయుప్రోక్తే ధ్రువచర్యానామ ద్విపంచాశోఽధ్యాయః॥ ౫౨॥



## శింశుమారము - పురాణప్రమాణము.

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౯.

శ్రీపరాశరః

తారామయం భగవతశ్శింశుమారాకృతిప్రభోః, దివిరూపం హరేర్యత్తు తస్యపుచ్ఛే స్థితో ధ్రువః॥ ౧॥ సైష భ్రమన్ భ్రామయతి చంద్రాదిత్యాదికాన్ గ్రహాన్, భ్రమంత మనుతం యాంతి నక్షత్రాణిచ చక్రవత్॥ ౨॥ సూర్యాచంద్రమసౌ తారా నక్షత్రాణి గ్రహైస్సహ, వాతానీక మయైర్బంధైః ధ్రువేబద్ధాని తాని వై॥ 3॥ శింశుమారాకృతి ప్రోక్తం యద్రూపం జ్యోతిషాం దివి, నారాయ

ణోఽయనం ధామ్నాం తస్యాధారస్స్వయంహృది ॥ ౪ ॥ ఉత్తానపాదపుత్రస్తు తమారాధ్యజగత్పతిం, స తారా శింశుమారస్యధ్రువః పుచ్ఛేవ్యవస్థితః ॥ ౫ ॥ ఆధారశ్శింశుమారస్య సర్వాధ్యక్షో జనార్దనః, ధ్రువస్యశింశుమారశ్చ ధ్రువేభానుర్వ్యవస్థితః ౬ తదాధారం జగచ్చేదం సదేవాసుర మానుషం. యేన విప్రవిధానేన తన్మమైక మనాశ్శృణు ॥ ౭ ॥ వివస్వానష్టభిర్మాసై రాదాయాపో రసాన్వితాః, వర్షత్యేవత తశ్చాన్నం అన్నాదప్యఖిలంజగత్ ॥ ౮ ॥ వివస్వానంశుభిస్తీక్ష్ణైరాదాయ జగతోజలం, సోమేముంచత్యథేం దుశ్చ వాయునాడీ మయైర్ద్విజ ॥ ౯ ॥ నాళైర్విక్షిపతేఽభ్రేషు ధూమాగ్న్యనిలమూర్తిషు ॥ ౯ ॥ ఇదేవిధముగనే శ్రీదేవీభాగవతములో అష్టమస్కంధం అధ్యాయం ౧౭ లో నున్నది.

శ్రీవిష్ణుపురాణము - ద్వితీయాంశం - అధ్యా. ౧౨.

శింశుమారస్తు యః ప్రోక్త స్సధ్రువో యత్రతిష్ఠతి, సన్నివేశంచ తస్యాపి శృణుష్వమునిసత్తమ ॥ ౨౯ ॥ యదహ్నాకురుతేపాపం దృష్ట్వాతం నిశిముచ్యతే, యావత్యశ్చైవ తారాస్తా శింశుమారాశ్రితాదివి, తావంత్యేవతు వర్షాణి జీవంత్యభ్యధికానితు ॥ ౩౦ ॥ ఉత్తానపాదస్తస్యాధో విజ్ఞేయోహ్యుత్తరోహనుః, యజ్ఞోఽధరశ్చవిజ్ఞేయో ధర్మోమూర్ధాన మాశ్రితః ॥ ౩౧ ॥ హృదినారాయణశ్చాస్తే అశ్వినాపూర్వపాదయోః, వరుణశ్చార్యమాచైవ పశ్చిమే తస్యసక్థినీ ॥ ౩౨ ॥ శిశ్నేసంవత్సరస్త్వ మిత్రోఽపానం సమాశ్రితః ॥ ౩౩ ॥ పుచ్ఛేగ్నిశ్చ మహేంద్రశ్చ కాశ్యపోఽథ తతోధ్రువః, తారకాశింశుమారస్య నాస్తమేతి చతుష్టయం ॥ ౩౪ ॥ ఇత్యేష సన్నివేశోఽయః పృథివ్యా జ్యోతిషాంతథా, ద్వీపానా ముదధీనాంచ పర్వతానాంచ కీర్తితః ॥ ౩౫ ॥ వర్షాణాంచ నదీనాంచ యే చతేషు వసంతివై, తేషాంస్వరూప మాఖ్యాతం సంక్షేపశ్శ్రూయతాం పునః ॥ ౩౬ ॥ యదంబువైష్ణవః కాయస్తతో విప్రవసుంధరా, పద్మాకారాసముద్భూతా పర్వతాబ్ధ్యాది సంయుతా ॥ ౩౭ ॥ జ్యోతీంషి విష్ణుర్భువనానివిష్ణు ర్వనానివిష్ణుర్గిరయోదిశశ్చ, నద్యస్సముద్రాశ్చ సఏవసర్వం యదస్తియన్నాస్తి చవిప్రవర్య ॥ ౩౮ ॥ జ్ఞానస్వరూపో భగవాన్ యతోఽసావశేష మూర్తిర్నతువస్తుభూతః, తతోహిశైలాబ్ధి ధరాదిభేదాన్ జానీహివిజ్ఞాన విజృంభితాన్ ॥ ౩౯ ॥ యదాతుశుద్ధం నిజరూపి సర్వం కర్మక్షయేజ్ఞాన మపాస్తదోషం, తదాహిసంకల్ప తరోః ఫలానిభవంతినో వస్తుషువస్తుభేదాః ॥ ౪౦ ॥ వస్త్వస్తి కింకుత్రచిదాది మధ్యపర్యంతహీనం సతతైకరూపం యచ్చాన్యథాత్వం ద్విజయాతి భూయోన

తత్త్ర ధాతత్రి కథోహిత త్త్వం॥ ౪౧॥ మహీఘటత్వం ఘటితః కపాలికా కపాలికా చూర్ణరజస్తతోణుః, జనైః స్వకర్మస్తిమితాత్మ నిశ్చయైరాలక్ష్యతే బ్రూహి కిమత్ర వస్తు॥ ౪౨॥ తస్మాన్న విజ్ఞానమృతేస్తి కించిత్క్వచిత్కదాచి ద్ద్విజవస్తుజాతం, విజ్ఞాన మేకం నిజకర్మభేద విభిన్న చిత్తైర్బహుధాభ్యుపేతం॥ ౪౩॥ జ్ఞానం విశుద్ధం విమలంచ నిత్యమశేషశోకాది నిరస్తసంగం, ఏకస్సదైకం పరమః పరేశస్సవాసుదేవో నయతో న్యదస్తి॥ ౪౪॥ సద్భావఏవో భవతో మయోక్తో జ్ఞానంయథా సత్య మసత్యమ న్యత్। ఏతత్తు యత్సం వ్యవహారభూతం తత్రాపిభోక్తం భువనాశ్రితం తే॥ ౪౫॥ యజ్ఞః పశుర్వహ్ని రశేషఋత్విక్సోమస్సురా స్స్వర్గమయశ్చ కామః॥ ఇత్యాదికర్మా శ్రిత మార్గదృష్టం భూరాది భోగాశ్చఫలాని తేషాం॥ ౪౬॥ యచ్చైతద్భువనగతం మయాతవోక్తం సర్వత్ర వ్రజతిహి తత్రికర్మవశ్యః। జ్ఞాత్వైతద్ధ్రువ మచలం సదైక రూపం తత్కుర్యాద్విశతిహి యేనవాసుదేవం॥ ౪౭॥ ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే ద్వాదశాధ్యాయః భువనకోశస్స మాప్తః॥

శ్రీమద్దేవీభాగవతము - అష్టమస్కంధం - అధ్యా. ౧౭.

జ్యోతిశ్చక్రం కేచిదేతచ్ఛింశుమారస్వరూపకం, పోవయోగం భగవతో యోగధారణ కర్మణి॥ ౧౧॥ యస్యావాక్ఛిరసః కుండలీభూత వపుషోమునే, పుచ్ఛాగ్రే కల్పితోయోఽయం ధ్రువ ఉత్తానపాదజః॥ ౧౨॥ లాంగూలేఽస్యచ సంప్రోక్తః ప్రజాపతిరకల్మషః, అగ్నిరింద్రశ్చ ధర్మశ్చతిష్ఠంతే సురపూజితాః॥ ౧౩॥ ధాతావిధాతా పుచ్ఛాంతే కట్యాంసప్తర్షయస్తతః, దక్షిణావర్తభోగేన కుండలాకార మీయుమః॥ ౧౪॥ ఉత్తరాయణ భానీహ దక్షపార్శ్వేఽర్పితానిచ, దక్షిణాయన భానీహ సవ్యేపార్శ్వేఽర్పితానిచ॥ ౧౫॥ కుండలాభోగ వేశస్య పార్శ్వయోరుభయో రపి, సమసంఖ్యాశ్చావయవా భజంతికజనందన॥ ౧౬॥ అజవీధిపృష్ఠభాగే ఆకాశ సరిదాదరే, పునర్వసుశ్చ పుష్యశ్చ శ్రోణ్యోర్దక్షిణ వామయోః॥ ౧౭॥ ఆర్ద్రాశ్లేషే పశ్చిమయోః పాదయోర్దక్షవామయోః అభిజిచ్చోత్తరాషాఢా నాసయోర్దక్షవామయోః॥ ౧౮॥ యథాసంఖ్యంచ దేవర్షే శ్రవిశ్చ జలభంతథా, కల్పితే కల్పనా విద్భిర్నేత్రే యోర్దక్షవామయోః॥ ౧౯॥ ధనిష్ఠాచైవ మూలంచ కర్ణయో ర్దక్షవామయోః, మఖాదీన్యష్ట భానీహ దక్షిణాయన గానిచ॥ ౨౦॥ యుంజీత వామపార్శ్వీయ వంక్రిషు క్రమతోమునే, తథైవమృగ శీర్షాదీ న్యుదగ్భానిచయాని హి॥ ౨౧॥ దక్షపార్శ్వీయవం క్రికేషు ప్రాతిలోమ్యేవ యోజయేత్, శతతారా తథా

జ్యేష్ఠాస్కంధయో ర్దక్షవామయోః॥ ౨౨ ॥ అగస్తిశ్చోత్తరహనా వధరాయాం హనౌ యమః, ముఖేష్వంగారకః ప్రోక్తోమన్దః ప్రోక్త ఉపస్థకే ॥ ౨౩ ॥ బృహస్పతిశ్చ కకుది వక్షస్యర్కో గ్రహాధిపః, నారాయణశ్చహృదయే చంద్రోమనసి తిష్ఠతి॥ ౨౪॥ స్తనయోరశ్వినౌ నాభ్యాముశనాః పరికీర్తితః, బుధః ప్రాణాపానయోశ్చ గళేరాహుశ్చ కేతవః॥ ౨౫॥ సర్వాంగేషు తథారోమకూపే తారాగణాస్స్మృతాః, ఏతద్భగవతో విష్ణో స్సర్వదేవమయం వపుః॥ ౨౬॥ సంధ్యాయాం ప్రత్యహంధ్యాయే త్ప్రయతో వాగ్యతోమునిః, నిరీక్షమాణశ్చోత్తిష్ఠే న్మంత్రేణానేన ధీశ్వరః॥ ౨౭॥ నమో జ్యోతిర్లోకాయ కాలాయా నిమిషాం పతయే, మహాపురుషాయాభి ధీమహీతి॥ ౨౮॥ గ్రహర్క్షతారామయ మాధిదైవికం పాపాపహం మంత్రకృతాం త్రికాలమ్, నమస్యతస్స్మరతో వాత్రికాలం నశ్యేత తత్కాల జమాశుపాపమ్॥ ౨౯॥ ఇతి శ్రీమద్దేవిభాగవతే మహాపురాణే అష్టమస్కంధే సప్తదశోధ్యాయః

## — శిం శు మా ర ము —

శింశుమారమును గ్రహనక్షత్ర జ్యోతిశ్చక్రరూప పరమాత్మయని కర్మయోగులు సాధించుచున్నారు. ఇందులోఁగల సూర్యచంద్రులిద్దరు ప్రతిదర్శయందు భిన్నసంవత్సర మాసరాశి చక్రగతులయ్యుఁ గలియుదురు. సూర్యుఁడు సంవత్సరాది వ్యావహారిక పంచసంవత్సరము యుగ సమష్టియుగ కల్పము మొదలు పంచఋత్వాది ఋతుకల్పమువరకేకాక, "యత్పుణ్యం నక్షత్రం, తద్వ్యత్కుర్వీతోపవ్యుషం" "దేవస్య సవితుః ప్రాతః ప్రసవః ప్రాణః, వరుణస్యసాయ మాసవోzపానః"అను ప్రమాణములబట్టియుఁ గాలపంచక విభక్తమగు దినకాలావయవములోని "సమానసాహ్నః పంచపుణ్యానినక్షత్రాణి"యను శ్రుతిప్రమాణమునుబట్టియు నక్షత్రమానపర్యంతము కాదిమావసానక స్పర్శఖండములోఁ బ్రతివర్గములోను వర్ణపంచకరూపుఁడై విభజింపఁబడినట్లే చంద్రుఁడుకూడ మాతృకాద్యంతములందు సాయంమధ్యతం వర్షకల్పాశ్రయముచేఁ ద్విశక్తిరూపుఁడై త్రినాభిచక్రమందు సంచారములుగలిగి ప్రవర్తకుఁడగుచున్నాఁడు. ఇందుఁడు దేవీమాన మానసకల్పములోఁ ద్వరితగతిచే శుక్లకృష్ణగతి భేదములతోఁ దినమాసపూర్ణగతిని మార్పులతో సూర్యునివలెనే తనఋతుకల్పములో ఋత్వయనాది భేదములకుఁదానే హేతుభూతుఁడై దర్శయందు సూర్యునితో ఏకనక్షరాశిగతినిఁబొంది ఏకాకిగాఁజరించుచున్నాఁడు. శ్రుతి "సూర్యఏకాకీచరతి చంద్రమాజాయతేపునః"-(బ్రహ్మోద్యమంత్రము) కర్మసాక్షియు, జగజ్జనకుఁడు, వైదేహుఁడు

డునగు సూర్యునివలన మరల మరల మాసాదియందుఁ బుట్టుచున్నాఁడు. "పూర్వాపరం చరతో మాయయైతౌ మాయయైతౌ, శిశూ క్రీడన్తౌ పరియాతో అధ్వరం, విశ్వాన్యన్యో భువనాభిచష్టే, ఋతూనన్యోవిదధజ్జాయతే పునః" అని సూర్యాచంద్రమససూక్త మంత్రమునందున్నది. నక్షత్ర ధ్రువచక్రమును వేదోక్త యజ్ఞ కాలార్థ సిద్ధికొరకు వ్యావహారికులును, భౌమధ్రువమాత్ర సన్నివిష్టులునగు చంద్రసూర్యులు దివ్యధ్రువమునకుఁ బ్రతిరూపులైనట్లు కొన్నిమతములతో నక్షత్రధ్రువ శింశుమారమునుగూడ ధారణాయోగ సిద్ధికొరకై వర్ణించిరి. ఎటులన దేవ యమ నక్షత్ర చక్రములో దేవనక్షత్రములు దక్షిణముగఁ దిరుగునట్లును, యమనక్షత్రము లుత్తర మార్గములోఁ దిరుగునట్లును, దారుమారుగఁజేసి సృజించుటలో సూర్యవంశపురాజగు త్రిశంకుఁడు విశ్వామిత్రునియొక్క ప్రతిసృష్టిలో దక్షిణధ్రువ సమీపమున అర్వాక్ఛిరస్కునిగ నుంచిరి. అందుచేత నావిశ్వామిత్రసృష్టిలో భూరాది సప్త లోకములు, వైదికసత్యములనుగూడ తలక్రిందులుగా సృజించుట కుద్యమింపఁబడెను. బ్రహ్మాది దేవతల ప్రార్థనలచే నాప్రతిసృష్టి అంతట విరమింపఁబడెను. వసిష్ఠ పుత్రులశాపముతోఁ జండాలుఁడైన త్రిశంకునకిచ్చుటనే ఇంద్రాదిభోగములను, దేవతల సమ్మతితోఁగల్పించినట్టు రామాయణాది పురాణములందున్నది. త్రిఖండ మాతృకాక్షర కుండలీభూత శరీరుఁడగు నీభౌమధ్రువుఁడు భూలోకమం దుత్తానపాదుఁడను పేరుగల తామసమన్వంతరములో మనువంశమందు బుట్టిన రాజకుమారుఁడై దివ్యరూపుఁడై యీదివ్యశింశుమార పుచ్ఛాగ్రమందు నిలిచెను. ఇట్లీనక్షత్ర శింశుమార పుచ్ఛాగ్రమందు నీధ్రువుఁడు మూలాధారుఁడగును. పూర్వమందుఁజెప్పబడిన ధ్రువుఁడు కల్పితధ్రువుఁడు: ప్రజాపతియగుచున్నాఁడు. ఇతనితో సమానముగ అగ్ని, ఇంద్రుఁడు, ధర్మదేవత (యముఁడు) నక్షత్రరూపదేవతలుగ పూజితులగుచున్నారు. శ్రుతిలో "అగ్నిః పుచ్ఛస్యప్రథమం కాణ్డం తతఇంద్రస్తతః ప్రజాపతి రభయం చతుర్థగ్ సవాఏష దివ్యశ్శాక్వర శిశుమారస్తగ్ హాయఏవం వేద" అనియు నక్షత్రధ్రువచక్రమందు శ్రుతిలో "హస్తఏవాస్యహస్తః। చిత్రాశిరః। నిష్ట్యాహృదయం। ఊరూవిశాఖే। ప్రతిష్ఠానూరాధః ఏషవైనక్షత్రియః ప్రజాపతిః। యఏవం వేద। ఉభయోరేనం లోకయోర్విదుః, అస్మిగ్శ్చాముష్మిగ్శ్చ" అనియు ఉపాసకునకి యోగికి బ్రహ్మకపాల మోక్షమని జెప్పఁబడు సూర్యమండల భేదనము కూడ చెప్పఁబడియున్నది.

ధాతయు విధాతాదులు శింశుమార పుచ్ఛాంతమందును గతిప్రదేశమునఁ

కశ్యపాది సప్తర్షులు ఉత్తరధ్రువమునకుఁ బ్రదక్షిణము చేయువిధముగనె దక్షిణ ధ్రువకటిప్రదేశమందుఁగూడ అగస్త్యుఁడని జెప్పఁబడుచున్న త్రిశంకునితోఁగాని భూచ్ఛాయాగ్రహమగు రాహుమండలముతోఁగాని కలసి తీవ్రమధ్యమందగతి భేదములచే వక్రగ్రహములు, గ్రహయుద్ధాదులు మొదలుగ సప్తాష్టగ్రహకూట పర్యంతము దక్షిణధ్రువుని సూర్యాది గ్రహములుగూడ ప్రదక్షిణముగనో, అప్రదక్షిణముగనో తిరుగుచున్నట్లు మాత్రము మనకగపడుచుండుట స్పష్టము. ఇట్లు దక్షిణావర్త భోగముతోఁ దిరుగుచున్న తారాచక్రమంతయు దక్షిణోత్తర దిక్కులయందుఁ దారుమారుగఁ దిరుగుచు పరస్పర సంబంధము కలిగియున్నదని తెలియవలెను. ఈలాగునఁ దెలసి ఆరాధించినవారలకుఁ బుణ్యఫలము వచ్చుచుండును.

ఇట్లు నక్షత్ర విషువచ్చక్రముల సంపాతగతిలో గ్రహస్థానములు కల్పించబడిన, భౌమచంద్రసూర్యులను నితర ఛాయాతారామండల గ్రహములు మండల కల్పనతో వ్యవహారిక దృక్కుచే కల్పించబడినను, పరమార్థదృష్టిచేఁ గృత్తికాది విశాఖాంతము పదునాలుగు నక్షత్రముల చక్రము దేవనక్షత్రములనియు। అనూరాధాది భరణ్యంతముగాఁగల నక్షత్రములన్నియు యమనక్షత్రచక్రమని తెలిపిరి. దేవనక్షత్రచక్రమంతయు మధ్యాక్షమగు ధ్రువమేరువునకు దక్షిణముగాఁ దిరుగుచున్నదనియు, యమనక్షత్ర చక్రమంతయు ఉత్తరపార్శ్వమందు పరిభ్రమించుచున్నదనియు నున్నది. మానుషదినమందు, ప్రాతస్సంగవాది సాయాహ్నాంతముగ పంచకాల పరిమితితో దైవజీవయాత్రను నడుపుకొనఁదలఁచిన స్మార్తులకు నిత్యప్రసిద్ధకర్మలగు పంచయజ్ఞాదులను, దదనుకూలమగు కాలకర్మయోగాదులను విధించి చెప్పిరి. త్రిపాద్విభూతిని జెప్పునపుడు త్రయీవిధ నిషేధములతో వేదమే తైత్తిరీయ సంహితలో 'నివృత్తేష్టక' మాత్రకాండయందును, గీతలో శ్లో॥ సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః, రాత్రింయుగ సహస్రాంతాం తే౽హోరాత్ర విదోజనాః॥ అని చెప్పబడియున్నది. ఒక బ్రహ్మానావన దిన పరిమాణములో (బంచోషస్సులు చెప్పఁబడినవి. అట్టిశాస్త్రీయ వ్యవహారిక పంచోషస్సులయొక్క కాలకర్మవిభాగముచేతనే సృష్టియంతయుఁ బంచీకరింపఁబడి ప్రపంచాకారముగ నిర్మింపఁబడెను. ఈ విషయము "ఇయమేవసాయా ప్రథమావ్యౌచ్ఛత్" అని ఆరంభించిన పదునారు మంత్రములుగల సూక్తములందున్నవి.

పైఁజెప్పిన దేవయమ నక్షత్ర చక్రవిభాగముగూడ తైత్తిరీయ బ్రాహ్మణములోని ప్రథమకాండలో ఐదవప్రపాఠకముయొక్క ద్వితీయానువాకము మొదలుగ

రెండనువాకములందు విస్తరించి చెప్పఁబడినది. గ్రంథవిస్తరభీతితో విడచితిని.

-◆శింశుమారము-వీధీత్రయవిభాగము. దక్షిణోత్తరనక్షత్ర చక్రస్థానముల వర్ణనము.◆-

ఇదివరకుఁ జెప్పిన దక్షిణోత్తర నక్షత్రజ్యోతిశ్చక్ర కుండలీభూత శింశుమారములోఁ గల మధ్యమార్గమే అజవీధి. ఈ అజవీధీ పృష్ఠభాగమందుఁ గలభూమి హరిద్వారమనియు, మాయాపురియనియు, గంగాద్వారమనియుఁ బిలువఁబడును. భౌమ గంగానదియొక్క గర్భమువలెనే ఆకాశగంగా నదీగర్భముగూడనున్నది. దక్షిణధ్రువ శింశుమారమునకుఁ బునర్వసు, పుష్యమి నక్షత్రములు రెండు కుడియెడమ శ్రోణిభాగములు ఆర్ద్రాశ్లేష నక్షత్రములు దక్షిణవామపాదములూ అభిజిదుత్తరాషాఢలు దక్షిణోత్తర నాసాపుటులు శ్రవణపూర్వాషాఢలు దక్షిణవామ నేత్రములు ధనిష్ఠ, మూలనక్షత్రములు, దక్షిణవామ శ్రోత్రములు, మఘ మొదలు నెనిమిది నక్షత్రములు దక్షిణాయనగతములైయున్నవి. ఇవే దక్షపార్శ్వపు టెముకలై వామభాగపుఁ బ్రక్కవీపు వెన్నెముకల నంటియున్నవి. ఇటులనే మృగశీర్షాద్యాశ్లేషాంత పంచనక్షత్రములు దేవనక్షత్రగణసంబంధముగలవిగానున్నను దక్షిణదిక్పక్షపాతముచే మఘాది నక్షత్రత్రయమునకు దక్షిణగతిమార్గముచే. వామపక్షముననున్నటులనే యెడమప్రక్క వీపువెన్నెముకలనంటి గతిప్రాతిలోమ్యము గలిగియున్నవి. శతతార, జ్యేష్ఠలు శింశుమారమునకుఁ గుడియెడమభుజములు. అగస్త్యనక్షత్ర మూర్ధ్వహను ప్రదేశమునను, యముడు అధోహనుప్రదేశమునను, అంగారకుడు ముఖమందును, శనైశ్చరుండుపస్థస్థానమునందును గల్పింపఁబడియున్నారు. బృహస్పతి భుజద్వయమూలమునను, వక్షస్థలమున గ్రహరాజగు సూర్యుఁడును, హృదయమందు నారాయణుండును. మనస్సున చంద్రుడును గల్పింపఁబడియున్నారు. స్తనములందశ్వినీదేవతలును, నాభియందు శుక్రుఁడును, ప్రాణాపానములందు బుధుడును, కంఠమునందు రాహువును, కేతువు ధ్వజాకారముతో సర్వాంగములందునున్నారు. ఇతర తారలన్నియు రోమకూపములందున్నవి. ఈ విధముగ వేదమునందుఁ జెప్పిన ప్రకారము యజ్ఞపురుషుడగు విష్ణుమూర్తియొక్క దివ్యశరీరమే సర్వదేవతానిలయమై శింశుమారచక్రరూపముతో స్వర్గమందున్నవి. సంధ్యాకాలమందుఁ బ్రతిదినమందును వాఙ్నియమముతో నిందులోఁ జెప్పిన వేదమంత్రములతోను ధ్యానశ్లోకాదులతోను నీధ్రువుని నిలబడిచూచుచు నెవఁడు నియమవ్రతుఁడై ధ్యానించునో యట్టివాని పుణ్యమును లెక్కింప శక్యముగాదు.

ప్రారంభమందు వేదమంత్రమును శ్లోకమునుదహరించినాఁడను. చూడవలెను. అదికాకున్న శ్లో॥ నమోజ్యోతిర్లోకాయ కాలాయానిమిషాంపతయే మహాపురుషాయాభిధీమహి॥ అనుశ్లోకమును బఠింపవచ్చును. ఏమియుఁదెలియకపోయినను, భక్తిచేత నమస్కరించి భజించువారలకును, స్మరించువారలకును, కాలజనితదోషములు దొలగును. ఈలాగు మంత్రద్రష్టలగు ఋషులుజేయుచు ధన్యులైరి. ఆగామి సంచిత ప్రారబ్ధ పాపకర్మలుగూడ నశించును.

—o—

## శింశుమారములోగల నవవీధులు.

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా॰ ౮ శ్రీధరభాష్యం.

త్రిభిస్త్రిభిరశ్విన్యాది నక్షత్రైః నాగవీధీ గజవీధీ ఐరావతీ చేత్యుత్తరమార్గే వీధిత్రయం - (ప్రత్యేకం వీధిత్రయేణ) ఆర్షభవీధీ - గోవీధీ - జరద్గవవీధీ చేతి మధ్యమమార్గే వీధీత్రయం - అజవీధీ మృగవీధీ వైశ్వానరవీధీ చేతి దక్షిణమార్గే వీధీత్రియం యదుక్తం తత్రైవ-

### —♦ ఉత్తరమార్గములోఁగల వీధులు. ♦—

నాగవీధి, గజవీధి, ఐరావతవీధి.

అశ్వినీకృత్తికాయమ్యా - నాగవీధీతిశబ్దితా। రోహిణ్యార్ద్రా మృగశిరో గజవీధీ త్యభిధీయతే। పుష్యాశ్లేషేతదాదిత్యవీధీచైరావతీ స్మృతా। ఏతాస్తువీధయస్త్రిస్రి ఉత్తరోమార్గ ఉచ్యతే॥

### —♦ మధ్యమార్గములోగల వీధులు. ♦—

(౧) ఆర్షభవీధి, (2) గోవీధి, (3) జరద్గవవీధి

తథాద్వేచాపి ఫల్గున్యౌ మఘాచైవార్ష భీమతా। హస్తశ్చిత్రా తథాస్వాతీ గోవీధీతిచ శబ్దితా। జ్యేష్ఠావిశాఖానూరాధా వధీప్రోక్తా జరద్గవీ ఏతాస్తువీధయస్త్రిస్రః మధ్యమోమార్గఉచ్యతే॥

—♦ దక్షిణమార్గములోగల వీధులు. ♦—

(౧) అజవీధి (౨) మృగవీధి (3) వైశ్వానరవీధి.

మూలాషాఢోత్తరాషాఢా చా జవీధ్యభిశబ్దితా, శ్రవణంచ ధనిష్ఠాచ మార్గీ శత భిషక్తథా, వైశ్వానరీ భాద్రపదే రేవతీచైవకీర్తితా, ఏతాస్తు వీధయస్త్రిస్రో దక్షిణో మార్గఉచ్యతే॥

యామ్యా=భరణీ, ఆదిత్యా=అదితిదేవతా పునర్వసుః, మార్గీ=మృగవీధి. స్థానం జరద్గవం మధ్యం తథైరావతముత్తరమ్॥౨॥ వైశ్వానరం దక్షిణతో నిర్దిష్ట మతితత్వతం॥

—♦ శింశుమారములోఁగల వీధులవివరము. ♦—

మత్స్యపురాణం.

| | |
|---|---|
| అశ్వని, భరణి, కృత్తిక=నాగవీధి<br>రోహిణి, మృగశిర, ఆర్ద్రి=గజవీధి<br>పునర్వసు, పుష్యమి, ఆశ్లేష=ఐరావతవీధి | ఉత్తరమార్గము<br>ఐరావతవీధి సమష్టినామము. |
| మఖ, పుబ్బ, ఉత్తర=ఆర్షభవీధి<br>హస్త, చిత్త, స్వాతి—గోవీధి<br>విశాఖ, అనోరాధ, జ్యేష్ఠ=జరద్గవవీధి | మధ్యమమార్గవీధి జరద్గవ<br>వీధి సమష్టినామము. |
| మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ=అజవీధి<br>శ్రివణం, ధనిష్ఠ, శతభిషం=మృగవీధి<br>పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి=వైశ్వానరవీధి | దక్షిణమార్గవీధి.<br>వైశ్వానరవీధి సమష్టినామము |

ఉత్తరాయణములో సూర్యుఁడు మండలమధ్యలో సంచరించును.

దక్షిణాయనములో ఈవీధికి వెలుపల సంచరించును.

దక్షిణోత్తరమార్గములకు మధ్యలో ౧౦౦,3౨౧ యోజనములు.

సూర్యమండల విష్కంభము ౯,౦౦౦ వలయం ౨౭౦౦

చంద్రమండలం ద్విగుణము ౧౮,౦౦౦ ,, ౫౪,౦౦౦

సూర్యుఁడు దక్షిణదిశలోఁదిరుగునపుడు సూర్యమండలవైశాల్యము ౧౦,౦౫౮. దక్షిణాయనమున శీఘ్రగతిగాన పగలు ౧౨ ముహూర్తములు. ఉత్తరాయణమున మం

దగతిగాన పగలు ౧౬ ముహూర్తములు.

పుష్కరప్రదేశము = లోకాలోక పర్వతమునకు ఉత్తరమున అగ్నిమార్గమునకు వెలుపలనుండునదని తెలియవలెను. ఈపుష్కరప్రదేశమునకు దక్షిణవీధియందుండు సూర్యునికాంతి వ్యాపించును. లోకాలోకపర్వతము ౧౫,౦౦౦ ఔన్నత్యము ఆదేశములకొకభాగమందుమాత్రము సూర్యుడు గోచరించును.

—♦ సూర్యునితోడ నక్షత్రములు తిరుగును. ♦—

సూర్యుడు పుష్కరద్వీపమధ్యముననున్నపుడు భూమియందు రాత్రిపగలు సమకాలముగనుండును.

దక్షిణదిశయందు సూర్యగతి ప్రతిదినము ౯,౧,౧౪,౫,౦౦౦ యోజనములు ఉత్తరాయణంబున ౩,౦౧౨ ౧౦౨౦ ఈరెంటిమధ్యలో సమగతి. ఇదేవిషుసంజ్ఞ. విషుకాలములో గోమేధిక ద్వీపమందుండును.

—o—

# శింశుమారములోగల దేవయాన పితృయానములు.

—♦ పితృయానవివరము. ♦—

శ్రీవాయుపురాణం - అధ్యా ౫౦ - పుట ౭౫.

ఉత్తరం యదగస్త్యస్య అజవీధ్యాశ్చ దక్షిణం పితృయానః సవై పంథా వైశ్వానరపథాద్బహిః॥ ౨౦౮ ॥ తత్రాసతే ప్రజావంతో మునయోహ్యగ్నిహోత్రిణః। లోకస్య సంతానకరాః పితృయానేపథిస్థితాః॥ ౨౦౯ ॥ భూతారంభ కృతంకర్మ ఆశిషాబుత్విగుచ్యతే। ప్రారంభతే లోకకామాస్తేషాం పంథాః సదక్షిణః॥ ౨౧౦॥ చలితం తే పునర్ధర్మం స్థాపయంతి యుగేయుగే। సంతత్యా తపసా చైవ మర్యాదాభిశ్శ్రుతేనచ॥ ౨౧౧ ॥ జాయమానాస్తు పూర్వేవై పశ్చిమానాం గృహేషుచ। పశ్చిమాశ్చైవ జాయంతే పూర్వేషాం నిధనేష్వపి। ఏవమావర్తమానాస్తే తిష్ఠంత్యాభూతసంప్లవాత్॥ ౨౧౨ ॥

ఇట్లే విష్ణుపురాణ ద్వితీయాంశాష్టమాధ్యాయమందు భాష్యమందునున్నది.

అగస్త్యగోళమున కుత్తరముగను అజవీధికి దక్షిణముగను నున్నట్టి వైశ్వానరవీధికి వెలుపలభాగమందుగల మార్గమే పితృయానమనుచున్నది. ఆపితృయానమార్గమందున్నవారిహలోకమును జయించినవారుగను, అగ్నిహోత్రాది కర్మలచే

దేవఋణ విముక్తులుగను నుండి లోకసంతానము వృద్ధిచేయుచుందురు భూతారంభ కరమగు కర్మను గోరుటచే వారు ఋత్విక్కు లనఁబడుదురు. కావున లోకకాములగు నట్టివారికి దక్షిణమార్గ గతికలవారలగుచున్నారు ఆచరణీయమగు నావైదికధర్మ మును బ్రతియుగమందు సంతతిచేతను తపస్సుచేతను వర్ణాశ్రమ మర్యాదలచేతను వేదనుకూలమాత్రమగు విద్యచేతను బునరావృత్తిగలవారలగుచు, ధర్మస్థాపనమును జేయుచుందురు. పూర్వపితరులు తమ తర్వాతనుండు పుత్రులయొక్క గృహము లందుఁ బుట్టుచుందురు. తమకుఁబూర్వమందుండినవారు తమగృహములయందే పుట్టుచుందురు. కార్యబ్రహ్మప్రళయాంతమువఱకు నిట్లుసంసార చక్రమందు దిరుగు చుందురు.

## —♦ దే వ యా న ము. ♦—

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౦ - భువనవిన్యాసము.

నాగవీథ్యుత్తరే యచ్చసప్తర్షిభ్యశ్చ దక్షిణం। ఉత్తరః సవితుః పంథాః దేవ యానస్తు సస్మృతః॥ ౨౦౮ ॥ యత్రతే వాసినః సిద్ధావిమలాబ్రహ్మచారిణః। సత తంతే జుగుప్సంతే తస్మాన్మృత్యుర్జితస్తుతైః॥ ౨౦౭ ॥

నాగవీథికుత్తరమునను సప్తఋషులకు దక్షిణమునను గల, సూర్యుని ఉత్తర మార్గమే దేవయానమార్గమని చెప్పఁబడుచున్నది. అచ్చటనివసించుసిద్ధులు నిర్మలబ్రహ్మచారులై జననమరణాదులరోసి మృత్యువును జయించియున్నవారు.

## —♦ పి తృ మా ర్గ వి వ ర ము. ♦—

మత్స్యపురాణము.

పితృమార్గమగస్త్యునకును, అగ్నిమార్గమునకును వెలుపలఁగలదు అగస్త్యుఁ డనగా దక్షిణధ్రువుఁడని తెలియవలెను. అగ్నిమార్గమన లోకాలోక పర్వతమున కును శుద్ధోదక సముద్రమునకును మధ్యగల స్వర్ణభూమి. అగస్త్యుఁడీఅగ్నిమార్గము నకును శుద్ధోదక సముద్రమునకునుమధ్య దక్షిణదిశ శింశుమార ముఖమునందొక హానువు నాశ్రయించియున్నాడు. ఈయుభయమధ్యమార్గమే పితృయానమార్గము. ఇచ్చటి అగ్నిహోత్రపరులగు ఋషులు లోకసంతాన వృద్ధికారణభూతులై నివసించి యున్నారు.

—०—

# ధ్రువమండలవిషయము.

ధ్రువమనఁ జ్యోతిలేని మండలము. ఇది వాయుభూత మండలస్థానము. క్రింది లోకాదులకాధారము. ఇది సువర్లోకముపైనగల మహర్లోకస్థానము. ఇదియుభయమధ్యలోకము. దీనికావలిపార్శ్వములో జన తపస్సత్యలోకములున్నవి. క్రింది భాగములో సువర్లోక, భువర్లోక, భూర్లోకములున్నవి. ఈధ్రువమండలమునకే విష్ణుపదమనికూడ పేరు. ఇది త్రివర్గలోకములకుఁ గేంద్రస్థానము. ఈత్రిభువనములంతటిని సూదిని సూదంటురాయివలె నాకర్షించి సప్తవాయుసూత్రములతో సంబంధముగావించి సర్వమును దనకును మేరువునకును జుట్టునుద్రిప్పుచుండును. మేరువునకును సూర్యునికిని తానే యాధారము. ఈవిషయప్రమాణములు శ్రీవిష్ణుపురాణము ద్వితీయాంశము నవమోధ్యాయము శ్లోకముఅయిదునుండి ప్రారంభమున్నది. ఇతర పురాణములందు ననేకప్రమాణములున్నవి.

త్రివిధశరీరములకును అండత్రయములకును త్రివిధ ధ్రువములున్నవి. ధ్రువమునుజేరిన పునరావృత్తిలేదని తెలియవలెను. అందుచేతనే ధ్రువమనిపేరుగలిగెను. ధ్రువమహిమ వర్ణింపజాలని మహాపవిత్రపుణ్యపదలోకము. ఈధ్రువస్థానమునకు సమానపరిధిలో త్రిభువనముల కావరణముగా మహదాకార వాయురూప పర్వతముగ లోకాలోక పర్వతమావరించి లోకమునకును అలోకమునకును సంధిగా లోకాలోక పర్వతమున్నది. అలోకమునుగుఱించియు, నీలోకాలోక పర్వతమును గుఱించియు నిందులో విమర్శించినందుచేత మరల నిచ్చటవివరించలేదు. అలోకమనగా ఆకాశభూతాంశము. జ్ఞానులకు మహాత్ములకు దేవతలకుమాత్రమే గోచరముగాని మానవులకు దుస్సాధ్యము. మనమున్న భూతలోకసృష్టివలె దక్షిణభూతలోకసృష్టులెప్పటికిని నుండఁజాలవు. భూతాదుల ననుసరించి యాలోకాదుల సృష్టియుండును. అంతయునొకేవిధముగ నుండవలెననినచో భూతాదుల భేదములేకయొకే భూతనామముతో నుండెడిది. భూతనామభేదములతో లోకాదులు భేదములుగానుండవలసివచ్చెను. లోకాలోక పర్వతావరణమే లేనిచో లోకమునకు, అలోకమునకు బరస్పర బాధాకరముగనుండెను. పరస్పరగుణభేదము లందుకుఁగారణము. సరిహద్దులులేనిచో సముద్రములో చిన్నచేపలు పెద్దచేపలచేతను, పెద్దచేపలు తిమింగిలాదులచేతను నిటులనే పరస్పరబాధాకరములగుచుండెను. ఈలాగుననే ప్రళయ

ములందుఁగూడ నన్నిటికి నొకేసారి గలుగుచుండెను. సరిహద్దులతో గొంతకాలవ్యవధి కవకాశ కారణములున్నవి. ఇటులనే మనదేహములో కోశములు అంతరాయములుండుటచేత దేహరక్షణ కవకాశములున్నవి. లోకాలోక పర్వతావరణమువలె మనదేహమునకు వాయుభూత సంబంధ చర్మమావరణము. బాహ్యప్రపంచమునకు అంతరశరీర సంబంధ ప్రపంచమునకు ముఖ్యకారణముగ నున్నది. బ్రహ్మాండమునకుఁ పిండాండదేహమునకును సర్వసంబంధములతో సమానముగనున్నది.

ఈధ్రువస్థానమునకుఁ గ్రింద త్రిభువనములలోని మహాతపస్వులుగానున్నవారి లోకమున కధికారులైవత్తురు ప్రతికల్పమునందు నీపదవి మార్పులగుచుండును. ఇదిస్థానపదవిగా సర్వులకు సంబంధ బాధ్యతలుగలదైయున్నది. లోకములోఁ బ్రతి వస్తువునకు నావరణమంతముగానున్నది. ఆవరణమే లేనిచో అనర్థమేయగుచుండెను. కరీంద్రములనుగురించి, లోకపాలురనుగుఱించి, విష్ణుపదదివ్యస్థానమునుగుఱించి ఇందులో వివరించినాను. పాఠకులుచూడగలరు.

ధ్రువుఁడు నక్షత్రగణములకు మూలప్రకాశరూపుఁడు. ఆత్మస్వరూపమే ప్రకృతిలోకములో ధ్రువస్వరూప నక్షత్రరూపముతో మూలాధారముగఁ బ్రకాశించుచు లోకముల కొకమూలమైయున్నాఁడు. శిఖరమే ధ్రువము. ధ్రువస్వరూప ప్రతిబింబమే సూర్యుఁడు. సూర్యస్వరూప ప్రతిబింబమే జలభూతమందు ఁబ్రతిబింబితచంద్రుఁడు. సూర్యప్రతిబింబిత స్వరూపమే అగ్నిస్వరూపము. ఇదే పృథివిగాఁగూడ తలంచవలెను. ఇవన్నియు ఆత్మనుండి పరంపరానుక్రమముతోఁ బృథివీభూతము వఱకు వచ్చినవి. ఈశ్వరుఁడు జీవుఁడుగానైన విధానమువలెఁ దలంచవలెను. ఇప్పుడున్న ఉత్తానపాదపుత్ర ధ్రువుఁడీకల్పాంతములో ముక్తుడై బ్రహ్మస్వరూపుఁడగును. ఉత్తరకల్పములో మరల మరొక తపస్సంపూర్ణుఁడు రాగలడు. పదవులే మండలములగును అధిష్ఠాతలే ధ్రువులగుచుందురు. ఉత్తానపాద పుత్రుండీకల్పములో బాల్యమునందే మహావైరాగ్యతపస్సంపన్నుండై ధ్రువమండలమున కధిపతియయ్యెను.

ఈత్రిభువనములోక కటాహమువంటిది. (గొప్పపాత్రవంటిది) లేక గృహము వంటిది. ఇంటికి గవాక్షరూపమే ధ్రువస్థానము. దీనినే రెండుభాగములతో ఊర్ధ్వకటాహాండభాగముగను గ్రిందిభాగాండ భాగముగను దలంచవలెను. గవాక్షమునుండి గృహములో గవాక్షరూపమునఁబడిన సూర్యతేజస్సునే బింబరూపసూర్యునిగ దలంచవలెను. గవాక్షములోఁగల తేజస్సుకదలినది మనకుఁదెలియకున్నను గవాక్షములోని ప్రతిబింబము ఉదయాస్తములందు భ్రమణతో గతులుగలిగియున్న దానివలె నీసూర్య

బింబమును దెలియవలెను. గవాక్షములోనున్న తేజస్సు తిరుగుటను గనిపెట్టుట యెంత కష్టతరమో యటులనే ధ్రువుని భ్రమణను గనిపెట్టుట అంతకష్టతరము. ఈసూర్య ధ్రువమండల భేదనమే ముక్తిగా వ్రాసిరి. ఇదే బంధముక్తి. బంధమేఅండము, దేహము. "ద్వావిమౌ పురుషౌ సూర్యమండలభేదినౌ" సంరాట్టు స్వరాట్టులే సూర్యమండలమును భేదింతురు. ఈతేజోలోకమగు తారామండల శింశుమార మూలము (పుచ్ఛము) ధ్రువునినంటియున్నది. ధ్రువాధారములో శింశుమారము తిరుగుచున్నది. మనకిదే కాలచక్రముగనున్నది. కేంద్రములో నీధ్రువస్థానము న్నందుచేతనే మహత్తత్వములోనున్న ఆత్మచైతన్య స్వరూపప్రకాశము నీధ్రువమండలరూపముగా మూలముగా నీత్రిభువనములో ఆదిత్యప్రకాశముగా నుండుటకును మరల స్వరూపములో జేరుటకును శరీరమునకు బ్రహ్మరంధ్రమువలె సర్వాధారముగ నున్నది.

జీవునికి ధ్రువస్థానము హృదయమగును. దీనికిఁబైన ఈశ్వరదేహ ధ్రువస్థానము బ్రహ్మరంధ్రముగను దదనంతరము బ్రహ్మాండములోని ధ్రువమండలముగ నీలాగున విరాడ్దేహాంతమగును. మరల నిటులనే సమష్టి మహత్తత్వము విరాట్టు. సంరాట్టు స్వరాట్టుల స్వరూపముతో సమన్వయముగ దెలియవలెను. ఇవి వ్యష్టి సమష్టిరూప దేహాదులతో నాలోచించవలెను.

త్రివిధాదిత్యులను ద్వివిధధ్రువములను అండపిండబ్రహ్మాండములలో వ్యష్టి సమష్టిభేదములతోఁ ద్రివిధములుగఁ దెలియుటమంచిది. ఈవిధానము ఉపాసనాయోగుల కత్యంతావశ్యకము: జ్ఞానులకుఁగూడ ముఖ్యమే. ధ్రువస్థానములు అదిత్యస్థానములు. జీవుడు అగ్నిస్వరూపాదిత్యునితోఁ బ్రారంభించి విరాట్టు బ్రహ్మలతోను దుదకు ఆత్మగను దెలిసి యోగాదులతో బొందవలెను. శ్రీపురుషసూక్తములో "ఆదిత్యవర్ణం తమసఃపరస్తాత్" "సూర్యఆత్మజగతః మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః" యని ప్రమాణము. మరొక ఉదాహరణము ఫలములకుఁ దొటిమ టెంకాయకు రంధ్రమువలె ఊర్ధ్వధ్రువముముక్తికిమార్గము. దక్షిణధ్రువాధోముఖ త్రిశంకు స్వర్గప్రపంచమునకు ఉత్పత్తిమార్గమే దక్షిణధ్రువమని తలంచవలెను. ఇదిప్రవృత్తికిఁ దమోలోకమునకు మూలాధారము ఆధ్యాత్మికదృష్టితో ఊర్ధ్వలోకాదులతోఁ దుదకు ఆత్మస్వరూపములో లీనమార్గ మూర్ధ్వధ్రువము.

మనకు దక్షిణమున అధోముఖముగా మర్త్యలోక సృష్టిధ్రువుఁడైయుండు వాఁడగస్త్యుఁడు. ఇదిరాత్రికాల తమోగుణ స్వరూపాధోలోకసృష్టి ధ్రువము. దీనికి

చంద్రజ్యోతి ర్విధానము మఱియునిది దక్షిణాయనధూమమార్గము. ఇదియే త్రిశంకుస్వర్గము. మిధునమార్గము. అందుచేత నిది దక్షిణధ్రువ సంజ్ఞగానున్నది. "అగస్త్యః ఖనమాన ఖనిత్రైః ప్రజామపత్యంతం బలమిచ్ఛమానా। ఉభావర్ణా వృషిరుగ్రః పుపోష సత్యా దేవేష్వాశిషో జగామ।"

ఈధ్రువ మపసవ్యభ్రమణమార్గము. దీనికి మూలము యమలోకము. దీనికి రాత్రికాల ర్విధానము. మిధునకర్మప్రధానము. దీనికిందగిన నక్షత్రములు తారలునున్నవి. ఇది భూలోకస్వర్గ ధ్రువము. ఇదిమూలాధారమునుండి బాహ్యప్రపంచమునకు బాహ్యదేహమునకు అధోముఖద్వార సృష్టికికారణస్థానము,



# ధ్రువ విషయ ప్రమాణము.

శ్రీవాయుపురాణము అధ్యా. ౫౦ - పుట. ౭౬ - శ్లో॥ ౨౨౧ నుండి.

ఊర్ధ్వోత్తర మృషిభ్యస్తు ధ్రువోయత్రాస్తి వైస్మృత। ఏతద్విష్ణుపదం దివ్యం తృతీయం వ్యోమ్ని భాస్వరం॥ ౨౨౧ ॥ తత్రగత్వా నశోచంతి తద్విష్ణోః పరమంపదం। ధర్మధ్రువాద్యాస్తిష్ఠంతి యత్రతేలోకసాధకాః॥ ౨౨౨ ॥

ఇతి శ్రీమహావాయుపురాణే వాయుప్రోక్తే జ్యోతిషప్రచారోనామ పంచాశోధ్యాయః॥

శ్రీవాయుపురాణం అధ్యాయం ౫౧.

సూతఉవాచ:-

స్వాయంభువే నిసర్గేతు వ్యాఖ్యాతాన్యంతరాణితు। భవిష్యాణిచ సర్వాణి తేషాం వక్ష్యామ్యనుక్రమం॥ ౧ ॥ ఏతచ్ఛ్రుత్వాతుమునయః పప్రచ్ఛుర్లోమహర్షణం। సూర్యాచంద్రమసోశ్చారం గ్రహాణాంచైవ సర్వశః॥ ౨ ॥

ఋషయఊచుః-

భ్రమంతేకథమేతాని. జ్యోతీంషి దివిమండలం। తిర్యగ్వ్యూహేన సర్వాణి తథైవా సంకరేణచ। కశ్చభ్రామయతే తాని భ్రమంతి యదివాస్వయం॥ 3 ॥ ఏతద్వేదితు మిచ్ఛామ స్తన్నోనిగదసత్తమ। భూతసమ్మోహనం హ్యేతద్వోచ్ఛ్రితు మిచ్ఛా ప్రవర్తతే॥ ౪ ॥

శ్రీసూతఉవాచ:-

భూతసమ్మోహనం హ్యేతద్వదతో మేనిబోధత। ప్రత్యక్షమపిదృశ్యం యత్తత్ సంమోహాయతే ప్రజాః। ౫ ॥ యోzసౌచతుర్దిశం ప్రుచ్ఛే శిశుమారో వ్యవస్థితః। ఉత్తానపాద పుత్రోzసౌ మేఢీభూతోధ్రువోదివి॥ ౬ ॥ సహిభ్రమన్ భ్రామయతే చంద్రాదిత్యౌ గ్రహైస్సహ। భ్రమంతమనుగచ్ఛంతి నక్షత్రాణిచ చక్రవత్॥ ౭ ॥ ధ్రువస్యమనసాచాసౌ సర్పతే భగణస్స్వయం। సూర్యాచంద్రమసౌ తారానక్షత్రాణి గ్రహైస్సహ॥ ౮ ॥ వాతానీక మయైర్బంధైర్ధ్రువేబద్ధానితానివై। తేషాంయోగశ్చ భేదాశ్చ కాలచారస్తథైవచ॥ ౯ ॥ అస్తోదయౌ తథోత్పాతా అయనే దక్షిణోత్తరే। విషువద్గ్రహవర్ణాశ్చ ధ్రువాత్సర్వం ప్రవర్తతే॥ ౧౦ ॥ వర్షాఘర్మోహిమం రాత్రిః సంధ్యాచైవ దినంతథా। శుభాశుభం ప్రజానాంచ ధ్రువాత్సర్వం ప్రవర్తతే॥ ౧౧॥ ధ్రువేణాధికృతాంశ్చైవ సూర్యోzపావృత్యతిష్ఠతి తదేష దీప్తకిరణః సకాలాగ్నిర్దివాకరః॥ ౧౨ ॥

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౭.

సౌరిబృహస్పతేశ్చోర్ధ్వంద్విలక్షేసమస్థితః సప్తర్షిమండలం తస్మాల్లక్షమేకం ద్విజోత్తమ॥ ౯ ॥ ఋషిభ్యస్తు సహస్రాణాం శతాదూర్ధ్వంవ్యవస్థితః। మేఢీభూతస్సమస్తస్య జ్యోతిశ్చక్రస్యవైధ్రువః॥ ౧౦ ॥ త్రైలోక్యమేతత్కథిత ముత్సేధేన మహామునే। ఇజ్యాఫలస్యభూరేషా ఇజ్యాచాత్రప్రతిష్ఠితా॥ ౧౧ ॥ ధ్రువాదూర్ధ్వం మహర్లోకో యత్రతే కల్పవాసినః।

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యాయం ౮.

ఆభూతసంప్లవంస్థాన మమృతత్వం విభావ్యతే। త్రైలోక్యస్థితికాలోయ మపునర్మారఉచ్యతే॥ ౯౫॥ బ్రహ్మహత్యాశ్వమేధాభ్యాం పాపపుణ్యకృతోవిధిః। ఆభూతసంప్లవాంతౌ తత్ఫలముక్తంతయోర్ద్విజం॥ ౯౬ ॥ యావన్మాత్రప్రదేశేతు మైత్రేయావస్థితోధ్రువః। క్షయమాయాతి తావత్తుభూమేరాభూతసంప్లవాత్॥ ౯౭॥ ఊర్ధ్వోత్తరమృషిభ్యస్తు ధ్రువోయత్ర వ్యవస్థితః। ఏతద్విష్ణుపదందివ్యం తృతీయంవ్యోమ్నిభాస్వరం॥ ౯౮ ॥ నిర్ధూతదోషపంకానాం యతీనాం సంయతాత్మనాం। స్థానం తత్పరమం విప్రపుణ్యపాప పరిక్షయే॥ ౯౯ ॥ అపుణ్యపుణ్యోపరమే క్షీణాశ్చేషాప్తిహేతవః। యత్రగత్వానశోచంతి తద్విష్ణోః పరమంపదం॥ ౧౦౦ ॥ ధర్మధ్రువాద్యాస్తిష్ఠంతి యత్రవైలోకసాక్షిణః। తత్సార్ష్ట్యోత్పన్నయోగేద్ధా స్తద్విష్ణోః పరమంపదం॥ ౧౦౧ ॥ యత్రోతమేతత్ప్రోతంచ యద్భూతం సచరాచరం। భావ్యంచ

విశ్వంమైత్రియ తద్విష్ణోః పరమంపదం॥ ౧౦౨ || దివీవచక్షురాతతం వితతం యన్మ హాత్మనాం వివేకజ్ఞాన దృష్టంచ తద్విష్ణోః పరమంపదం। ౧౦౩ ॥ యస్మిన్ ప్రతిష్ఠితో భాస్వాన్ మేఢీభూతస్స్వయంధ్రువః, ధ్రువేచ సర్వజ్యోతీంషి జ్యోతిష్షంభో ముఖోద్విజ॥ ౧౦౪ ॥ మేఘేషుసంతతావృష్టి ర్వృష్టే స్సృష్టేశ్చపోషణం। అప్యాయనంచసర్వేషాం దేవాదీనాం మహామునే॥ ౧౦౫ ॥ తతశ్చాజ్యాహుతిద్వారా పోషితా స్తేహవిర్భుజః। సృష్టేః కారణతాం యాంతి భూతానాం స్థితయేపునః॥౧౦౬ ఏవమేతత్పదం విష్ణో స్తృతీయ మమలాత్మకం। ఆధారభూతం లోకానాం త్రయాణాం వృద్ధికారణం॥ ౧౦౭ || తతఃప్రభవతి బ్రహ్మన్ సర్వపాప హరాసరిత్। గంగాదేవాంగనాంగా నా మనులేపనపింజరా॥ ౧౦౮ ॥ వామపాదాంబుజాంగుష్ఠ నఖస్రోతో వినిర్గతాం। విష్ణోర్బిభర్తి యాం భక్త్యాశిరసాహర్నిశంధ్రువః॥ ౧౦౯ ॥

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౯.

శ్రీపరాశరః

తారామయం భగవతశ్శింశుమారాకృతిప్రభోః। దివిరూపం హరేర్యత్తు తస్యపృచ్ఛేస్థితోధ్రువః॥ ౧ ॥ సైషభ్రమన్ భ్రామయతి చంద్రాదిత్యాదికాన్ గ్రహాన్। భ్రమంత మనుతంయాతి నక్షత్రాణిచ చక్రవత్। ౨ ॥ సూర్యాచంద్రమసౌ తారానక్షత్రాణి గ్రహైస్సహ। వాతానీక మయైర్బంధైః ధ్రువేబద్ధానితాని వై॥ ౩ ॥ శింశుమారా కృతిప్రోక్తం యద్రూపం జ్యోతిషాందివి॥ నారాయణోz యనం ధామ్నాంతస్యాzధారస్స్వయంహృది॥ ౪ ॥ ఉత్తానపాదపుత్రస్తు తమారాధ్యజగత్పతిం। సతారాశింశుమారస్య ధ్రువః పృచ్ఛేవ్యవస్థితః॥ ౫ ॥ ఆధారశ్శింశుమారస్య సర్వాధ్యక్షో జనార్దనః। ధ్రువశ్చ శింశుమారశ్చ ధ్రువేభానుర్వ్యవస్థితః॥ ౬ ||

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యాయం ౧౨,

సర్వేధ్రువే మహాభాగ ప్రబద్ధా వాయురశ్మిభిః॥ ౨౪ ॥ గ్రహర్క్షతారాధిష్ణ్యాది ధ్రువేబద్ధాన్యశేషతః। భ్రమంత్యుచిత చారేణ మైత్రేయానిలరశ్మిభిః॥౨౫॥ యావంత్యశ్చైవ తారాస్తాస్తావంతో వాతరశ్మయః। సర్వేధ్రువే నిబద్ధాస్తే భ్రమంతో భ్రామయంతితం। ౨౬ ॥ తైలపీడాయథా చక్రం భ్రమంతో భ్రామయంతివై। తథాభ్రమంతిజ్యోతీంషి వాతవిద్ధాని సర్వశః॥ ౨౭ ॥ అలాతచక్రవద్యాంతి వాతచక్రేరితానితు। యస్మాజ్జ్యోతీంషి వహతి ప్రవహస్తేన సస్మృతః॥ ౨౮ ॥ - శింశుమా

రస్తు యాః ప్రోక్త స్సంధ్రువో యత్రతిష్ఠతి। సన్నివేశంచతస్యాః శృణుష్వమునిసత్తమ॥ ౭౯॥ యదహ్నాకురుతేపాపం దృష్ట్వాతం నిశిముచ్యతే। యావంత్యశ్చైవ తారాస్తా శ్శింశుమారాశ్రితాదివి। తావంత్యేవతు వర్షాణి జీవంత్యభ్యధికానితు॥౩౦ ఉత్తానపాదస్తస్యాథో విజ్ఞేయోహ్యుత్తరోహనుః। యజ్ఞోధర్మశ్చవిజ్ఞేయో ధర్మోమూర్ధానమాశ్రితః॥ ౭౧॥

శ్రీదేవీభాగవతం - అష్టమస్క-ధం - అధ్యాయం ౧౭.

ధర్మేణసహచైవాస్తే సముకాల యుజాధ్రువః। బహుమానం దక్షిణతః కుర్వద్భిః ప్రేక్షకైస్సదా॥ ౩ ॥ ఆజీవ్యః కల్పజీవానా ముపాస్తే భగవత్పదం। జ్యోతిర్గణానాం సర్వేషాం గ్రహనక్షత్ర భాదినాం॥ ౪ ॥ కాలేనా నిమిషేణాయం భ్రామ్యతామవ్యక్తరంహసా। అవష్టంభస్థాణురివ విహితశ్చేశ్వరేణసః॥ ౫ ॥ భాసతేభాసయన్భాసాస్వీయ యాదేవపూజితః। మేధిస్తంభే యథాయుక్తాః పశవః కర్షణార్తాః॥ ౬ ॥ మండలాని చరంతీమే సవన త్రితయేనచ। ఏవంగ్రహాదయస్సర్వే భగణాద్యాయథాక్రమం॥ ౭ ॥ అంతర్బహిర్విభాగేన కాలచక్రేనియోజితాః। ధ్రువమేవావలంబ్యాశు వాయునోదీరితాశ్చరన్॥ ౮ ॥ ఆకల్పాంతం చంక్రమంతి ఖేశ్యేనాద్యాః ఖగాఇవ। కర్మసారధయోవాయు వశగా స్సర్వఏవతే ౯॥ ఏవంజ్యోతిర్గణాస్సర్వే ప్రకృతేః పురుషస్యచ। సంయోగానుగృహీతాస్తే భూమావనిపతంతిచ॥౧౦ భూతలాదోజనలక్షే సూర్యః పంచదశలక్షేధ్రువః॥

—♦ స ప్త వా యు వు లు. ♦—

౧ ప్రవహము = మేఘమండలమందుండును,

౨ పవనము = సూర్యమండలమందుండును,

3 ఉద్వహము = చంద్రమండలమునందుండును,

౪ సంవహనము = నక్షత్రమండలమందుండును,

౫ వివహము = గ్రహమండలమందుండును.

౬ పరివహము = సప్తర్షిమండలమందుండును.

౭ పరావహము = ధ్రువమండలమందుండును.

—♦ ధ్రువపదము - వాయుపురాణము. ♦—

కార్త్యసప్తరుషులకంటె ఊర్ధ్వపదమే దివ్యవిష్ణుపదమనియు నదియేకార్యధ్రువమనియుఁ దెలియవలెను. అప్పటకార్యధర్మదేవతయుఁ దత్కారణ ధ్రువుఁడును

బ్రజాపతియు, అగ్ని, వరుణుడు, ఇంద్రుడు, ఉపేంద్రుడు, వీరలందరు కార్యరూపులుగ నున్నారు. వీరలాయాలోక సాధకులని తెలియవలెను. స్వాయంభువ మన్వంతరముయొక్క స్వాభావిక ఉత్తరమార్గ ఖగోళములు నీలాగునజెప్పబడినవి. రాబోవుస్వారోచిషాది మన్వంతరముల ఖగోళములనుగూడ అనుక్రమముగా చెప్పుచున్నానని చెప్పిన సూతవచనములనువిని మునులు సూర్యచంద్రులయొక్కయు గ్రహములయొక్కయు సంచారములనడిగిరి. సూర్యచంద్రాది గ్రహనక్షత్ర జ్యోతిశ్చక్రములన్నియు అక్షముగానశిచెడుకక్ష్యలమార్గముచే సాంకర్యములులేక నెట్లుతిరుగుచున్నవి? ఈజ్యోతిశ్చక్రముల నెవరైనను త్రిప్పుచుందురా? లేక నవి తమంతకు దామే తిరుగుచున్నవా? అని ప్రశ్నించిరి.

ఈవిషయము ప్రత్యక్షదృశ్యముగానున్నను భూతములను వ్యామోహింపజేయుచున్న విషయమునను విస్తరింతునని సూతుఁడుచెప్పెను. శింశుమారపుచ్ఛమందు ఉత్తానపాదపుత్రుడగు ధ్రువుఁడు తనయోగమహిమచే విష్ణుపదమందుండు ప్రతియొకజ్యోతిర్గోళమునకు మేఢీభూతుఁడైయుండి తాను తిరుగుచున్నవానివలె సూర్యచంద్రులనుగూడ గ్రహములతో సహ త్రిప్పుచున్నాడు. ఇట్లు భ్రమితో ధ్రువుడుగూడ తిరుగుచున్నట్టుగా నక్షత్రమండలములనుసహా త్రిప్పుచున్నాడు. ధ్రువునియొక్క మనస్సుచేతనే నక్షత్రచక్రమంతయు సూర్యచంద్రాదిగ్రహములతో సహా తిరుగుచున్నది. సప్తవాయుసూత్రములచే ఈజ్యోతిశ్చక్రమంతయు ధ్రువునియందుబద్ధమై కాలచారము ఉదయాస్తమయములు దక్షిణోత్తరాయనములు విషువద్గ్రహవర్గములు జరుగుచున్నవి. వర్ష, గ్రీష్మ, హేమంత ఋతుత్రయములు రాత్రింబగళ్ళు సంధ్యలు శుభాశుభములును ధ్రువునినుండి కలుగుచున్నవి. ధ్రువునిచేఁ గర్భోపాసనాది జ్ఞానాధికారులకు సూర్యసావిత్రిశక్తిభిన్నముగా మానభేదములచేఁ దిరుగుచున్నది. కాబట్టి దివాకరుఁడే దీప్తకిరణుడై కాలాగ్నిరుద్రుడని జెప్పబడుచున్నాడు.

— శ్రీవిష్ణుపురాణము —

సప్తఋషులమండలముపైన నూరువేలయోజనముల దూరమున సకలజ్యోతిశ్చక్రమునకు మేఢీభూతుడై ధ్రువుడున్నాడు. ఈప్రకారము త్రిలోకముల ఊర్ధ్వపరిమాణమును జెప్పబడెను. ఈత్రైలోక్యమే యజ్ఞయాగాది కర్మఫలభూమి. కర్మలింతవరకే.

పంచభూతములు నాశనమువఱకు లెక్కింపబడునట్టి కాలముగూడ భూతప్ర

ళయకాలమగుటచే మోక్షస్థానమని చెప్పబడుచున్నది. అనఁగా జ్ఞానులకు జ్ఞానముచే భూతభౌతిక దృష్టివినాశనమునుగలిగించును అజ్ఞానులగు నరకజీవులకుఁ దేజోమయభూత శరీరవినాశమై పాపఫలానుభవమునకుఁ దగిన జడభూతశరీర ప్రాప్తిగలిగించును. ఇది త్రైలోక్యస్థితికాలమై పుణ్యజీవులకుఁ బుణ్యఫలానుభవకాలమును పాపులకుఁ బాపఫలానుభవకాలముగూడ నగును. ఈఅర్థమునే ౫౨ శ్లోకమునఁ జెప్పుచున్నాడు. ఎంతప్రదేశములో శార్యధ్రువుఁడుండునో భూమిమొదలుగా నక్షత్రములకుగల ప్రదేశము ప్రళయకాలములో నశించును. సప్తఋషులకు పైభాగమందు నెచ్చట ధ్రువుడుండునో నదియే మహర్లోకము. ఉత్తరాండము మొదలుగా నిదియే మూఁడవదగు విష్ణుపదమని జెప్పబడును. అచ్చట నిర్ధూతకల్మషులును సంయతాత్ములునునగు యతులకు పుణ్యపాపములరెండు ప్రక్షయమగును.

పూర్వాధ్యాయములోఁ గర్మఫలములకుఁ బరాకాష్ఠగాఁ జెప్పఁబడిన భూమికంటే నీభూమికర్మయోగులకును ఉపాసకులకును స్థానమగుటచే నిచ్చట సుప్రతిష్ఠుఁడగు సూర్యుడే ధ్రువరూపముతో మేధీభూతుఁడైయున్నాఁడు. ఈధ్రువసూర్యునియందే సకలజ్యోతిశ్చక్రమును నాజ్యోతిశ్చక్రము నాశ్రయించి మేఘమండలమును నామేఘమండలమునుండియు సకల కామవర్షమును వర్షమువలన సకలసృష్టిపోషణయును దీనివలన సకలదేవతల కాప్యాయనముఁగలుగును. దీనివలన ఆజ్యాహుతులుగలిగి తద్వారా దేవతలు తృప్తిఁజెందుచుందురు. ఇట్లు భూతములయొక్క పునఃస్థితికొఱకు నిచ్చటదేవత్వమును బొందినవారలే సృష్టికిఁ గారణభూతులగుదురు. ఈప్రకారమీమూఁడవవిష్ణుపదమే లోకములకాధారభూతమై వృద్ధికారణమగును. ఈమూఁడవవిష్ణుపదమువలననే సకలపాపములను బోగొట్టునట్టి ఆకాశగంగ యాయాదేవతాస్త్రీలయొక్క అంగరాగముతో గౌరవర్ణముగలిగి మూఁడవవిష్ణుపదముయొక్క అంగుష్ఠనఖమునుండి ప్రవాహరూపముగఁ బడుచున్నది. ఏగంగను నాధ్రువుఁడు రాత్రింబగళ్ళు శిరసావహించుచుండునో దానియందు సప్తమహర్షులు ప్రాణాయామపరాయణులై తరంగపంక్తులచే ధరింపబడుచున్న జటాజూటములు గలవారలైయుందురు. మరియు నాయుదక ప్రవాహములచే వారివారి కాలమానములో పగటికాలము ముగియఁగనే చంద్రమండలము నా గంగోదకముచేతనే తడుపఁబడుచుండును. మరియు నాచంద్రమండలమునుండి మేరుపృష్ఠమునఁబడి చతుర్దిక్కులందు జంబూద్వీపమునంపఁబడుచు.

ఇట్టిధ్రువస్థానములో ధ్రువునిఁగాని భూమినిఁగాని, సూర్యునిఁగాని గ్రహముల

మధ్యకత్త్యలోనుంచి సర్వపురాణములందు వివరించఁబడెను. ఇట్టిధ్రువుని సాయం కాలమందు ధ్యానించువారల సర్వపాపములు నశించునని ఫలశ్రుతియున్నది. దీనికే గాయత్రీమంత్రోపస్థానములోఁగూడ చెప్పబడెను.

—o—

# ధ్రు వ మం డ ల ము న గ ల వా ర లు.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము ౯ - అధ్యాయం ౨౨

శ్రీశుకః - అథతస్మాత్పరత స్త్రయోదశ లక్ష యోజనాంతరతో యత్తద్విష్ణోః పరమంపద మభివదంతి- యత్రమహాభాగవతో ధ్రువఔత్తానపాదే రగ్నినేంద్రేణ ప్రజాపతినా కాశ్యపేన ధర్మేణచ సమకాల యుగ్భిస్సబహుమానందక్షిణతః క్రియమాణ ఇదానీమపి కల్పజీవినా మాజీవ్యఉపాస్తే తస్యహావా అనుభావ ఉపర్ణితః॥ ౧ ॥

శ్రీదేవీభాగవతము - అధ్యా. ౧౭ - పుట. ౮౨౮.

శ్రీనారాయణఉవాచ:-

అథర్షిమండలాదూర్ధ్వం యోజనానాం ప్రమాణతః। లక్షైస్త్రిత్రయోదశమితైః పరమంవైష్ణవంపదమ్। ౧ ॥ మహాభాగవత శ్శ్రీమా వర్తతేలోకవందితః। ఔత్తానపాదిరింద్రేణ వహ్నినాకశ్యపేనచ॥ ౨ ॥ ధర్మేణసహచైవాస్తే సమకాల యుజాధ్రువః। బహుమానం దక్షిణతః కుర్వద్భిః ప్రీత్యక్తైస్సదా॥ 3 ॥ జ్యోతిశ్చక్రంకేచిదేత చ్ఛింశుమారస్వరూపకం। సోపయోగం భగవతో యోగధారణకర్మణి। యస్యార్వాక్ఛిరసః కుండలీభూతవపుషోమునే। పుచ్ఛాగ్రే కల్పితో యోఽయం ధ్రువఉత్తానపాదజః॥ ౧౨ ॥ లాంగూలేఽస్యచ సంప్రోక్తః ప్రజాపతి రకల్మషః। అగ్నిరింద్రశ్చ ధర్మశ్చ తిష్ఠంత్యే సురపూజితాః॥ ౧3 ॥ ధాతావిధాతా పుచ్ఛాంతే కట్యాంసప్తర్షయస్తతః॥

## —♦ దివ్యధ్రువమండల కత్త్యవివరము. ♦—

సప్తర్షిమండలమునకుపైనను మహర్లోకమునకుఁగ్రిందను దివ్యధ్రువమండల మున్నది. దీనినే విష్ణుపదమందురు. ఇది సప్తర్షిమండలమునకుఁపైన పదుమూడు లక్షల యోజనముల కుపరిలోనున్నది. ఈధ్రువుని సమీపములో తనతోసమాన

ముగ నన్నిటియందునుగల అగ్నీంద్ర, ప్రజాపతి, కశ్యప, ధర్మదేవతలుందురు. వీర లందరును శింశుమారపుచ్ఛమందు అగ్రభాగమున నున్నారు. ధ్రువుడు సర్వాధార మూర్తి. ధ్రువశబ్దముతో సర్వము సమన్వయము.

—♦ వి శే ష వి వ ర ము. ♦—

ధ్రువుడనగా సనకాది పంచనామరూపులలోను సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రరూపాత్మకములోను కాలముతో కాలస్వరూపుడుగ పంచసంవత్సర స్వరూపుడుగను, అహోరాత్రస్వరూపుడుగను శేషించియుండుటచేతను పంచసంవత్సరముల వయస్సుచేతను, పంచబ్రహ్మాధికార పదవియగు విష్ణుపథమందు జేరి సర్వలోకాదుల కుపాస్యుడై స్థిరరూపముతో బ్రహ్మాండములోను సర్వదేహాదులందున్నాడని తెలియవలెను. శ్రీవిష్ణుపదమందు దక్షిణభాగములో శ్రీదక్షిణామూర్తి స్వరూపుడుగ బాలరూపముతో కల్పాయుష్యుడై కల్పాయుష్యులకు సహితము శ్రీగురుస్వరూపుడుగనున్నాడు. పద్మాసనముపైఁగూర్చుండి తపస్సుచేయుచు శుద్ధవిద్యాకూటస్థ జీవరూపమాతృకైౖ ఉపాసించువారలకు పుత్రరూపముతో పున్నామనరకమునుండి కూడ తరింపజేయుచున్నాడనియుఁ దెలియవలెను.

—o—

# స ప్త వా యు సూ త్ర ము లు.

వాయుపురాణము - భువనకోశము - అధ్యా. ౫౨

శ్లో॥ ఏతేవాహగ్రహాణాంవై మయాప్రోక్తారథైఃసహ। సర్వేధ్రువంతి బద్ధాస్తే ప్రబద్ధావాతరశ్మిభిః॥ ౮౩ ॥ ఏతేవైభ్రామ్యమాణాస్తు యథాయోగం భ్రమంతి వై। వాయువ్యాభి రదృశ్యాభిః ప్రబద్ధా వాతరశ్మిభిః॥ ౮౪ ॥ పరిభ్రమంతి తద్బద్ధాశ్చంద్రసూర్య గ్రహాదివి। భ్రమంతమనుగచ్ఛంతి ధ్రువంతే జ్యోతిషాంగణాః॥ ౮౫ ॥ యథానద్యుదకేనౌస్తు సలిలేన సహోహ్యతే। తథా దేవాలయాహ్యేతే ఉహ్యంతే వాతరశ్మిభిః॥ తస్మాత్సర్వేణ దృశ్యంతే వ్యోమ్ని దేవగణాస్తుతే। ౮౬ ॥ యావంతశ్చైవతారాస్తు తావంతో వాతరశ్మయః॥ సర్వాధ్రువనిబద్ధాస్తా భ్రామయంత్యోభ్రామయంతితం॥ ౮౭ ॥ తైలాపీడాకరం చక్రం భ్రమద్భ్రామయతే యథా। తథా భ్రమంతి జ్యోతీంషి వాతబద్ధాని సర్వశః॥ ౮౮ ॥ అలాతచక్రవద్యాంతి వాతచక్రే

రిదానితు। తస్మాజ్జ్యోతీంషి వహతే ప్రవహంస్తేన సస్మృతః ॥ ౮౯ ॥ ఏవం ధ్రువని బద్ధోऽసౌ సర్వతేజ్యోతిషాంగణః॥

సప్తవాయుసూత్రములతో నీబ్రహ్మాండములో ధ్రువుండు సర్వమునకు గతినిఁ గలుగఁజేయుచున్నాఁడు. అవి (౧) ప్రవహము, (౨) ఆవహము, (3) ఉద్వహము, (౪) సంవహము, (౫) వివహము, (౬) పరివహము, (౭) పరావహము.

ఈసప్తవాయువులకు ధ్రువుంజాధారుండుగ నిలచి నీసప్తవాయుసూత్రముల తోఁ గ్రమముగ గతినిఁగలుగఁజేసి నడిపించుచుండును. ఈవాయుసూత్రములతో మండలములన్నియును బద్ధములై ధ్రువాధారముతోఁ దిరుగుచుండును అయస్కాంత మణివలె నాకర్షించి నియమితస్థానమునందుంచి సర్వమునకు మేరువుమధ్యే నాధార భూత స్తంభమువలెనుండి దీనిచుట్టు తిరుగుచుండును. ఒక్కసర్కసుడేరాలో మధ్య లోనున్న పోటిస్తంభమువలె భూమికిని అంతరిక్షమునకునుమధ్య స్వర్గమగు శింశుమా రమునకు ధ్రువునకు సంబంధ సంధిబంధముతో నీమేరువు పంచభూతస్వరూపాత్మక ముగ వాయుతేజఃప్రధానముతోనున్నది. తేజస్సుచేత సూర్యరశ్మికి సంబంధము న్నది. వాయుపురాణములో నీమేరువునకుఁగల ప్రమాణశ్లోకములు. భువనవిన్యా సము. అధ్యాయము 3౪ లోఁ గలదు.

శ్లో॥ తరుణాదిత్యవర్ణాభో హైరణ్యో నిషధస్మృతః॥ ౧౪ ॥ చాతుర్వర్ణస్తు సౌవర్ణో మేరుశ్చోచ్చ్యతమస్మృతః॥ వృతాకృతి ప్రమాణశ్చ చతురస్రః సముచ్ఛ్రితః॥ ౧౫ ॥ నానావర్ణస్తు పార్శ్వేషు ప్రజాపతి గుణాన్వితః॥ నాభిబంధన సంభూతో బ్రహ్మణోऽవ్యక్తజన్మనః॥ ౧౬ ॥ పూర్వతః శ్వేతవర్ణోసౌ బ్రహ్మణస్తస్య తేనతు। పీతశ్చదక్షిణేవాऽసౌ తేనవైశ్యత్వమిష్యతే॥ ౧౭ ॥ భృంగపత్ర నిభశ్చాసౌ పశ్చిమేన మహాబలః। తేనస్యసూత్రతా దృష్టామేరోర్నానార్థ కారణాత్॥ ౧౮ ॥ పార్శ్వముత్తరతస్తస్య రక్తవర్ణం స్వభావతః। తేనస్యక్షత్రతాచస్యా దితివర్ణాః ప్రకీర్తితాః। వ్యక్తః స్వభావతః ప్రోక్తో వర్ణతః పరిమాణతః॥ ౧౯ ॥

## —♦ స ప్త వా యు వు ల వి వ ర ము. ♦—

౧ ప్రవహము=ఈవాయుసూత్రము ధ్రువునినుండి సంబంధముతో మేఘ మండలములో మేఘసమూహములను సంబంధించి వర్షమున కాధారమై వాయువు, అగ్ని, జలధూమ రూపములతో మేఘములను సంచరింపఁజేయుచు వర్షమునుగురిపిం చుచుండ ను.

౨ ఆవహము = సముద్రజలము నావిరిరూపముతో నంతరిక్షమున మేఘమండలమునఁజేర్చి వర్షము నుగురిపించుచుండును.

౩ ఉద్వవహము = సూర్యమండలమున సూర్యునికి సంబంధముగా నుండినదై సూర్యుని సంచరింపఁజేయుచుండును.

౪ సంవహము = ధ్రువసంబంధముతోఁ జంద్రమండలమున (జంద్రునితోఁజేరి త్రిప్పుచు శీఘ్రగతిని ఁగలిగించుచు నక్షత్రములకును సంబంధించియుండును.

౫ వివహము = సర్వగ్రహములకు సంబంధముగలదై సర్వగ్రహములను దిప్పుచుండును.

౬ పరివహము = ఈవాయువు సప్తర్షులకు సంబంధించి ధ్రువునికిని సంబంధించినదై సప్తర్షులను ధ్రువునిఁజుట్టుచు ఁబ్రదక్షిణము చేయుచుండును.

౭ పరావహము = ఇది ధ్రువమండలమున ధ్రువునికిసంబంధించినదై ధ్రువునిఁ దనచుట్టును దాఁబరిభ్రమించుచుండును.

---

## స్వర్గపథగంగవివరము.

కేవల జ్ఞానస్వరూప మూలరూపిణియగు గంగస్పృష్టితో నధోముఖగామినియై ఈశ్వరుఁడే జీవస్వరూపుఁడైన విధానమువలె పంచభూతాత్మిక స్వరూపిణిగఁ బంచభూత గుణానుసారరూపములతో నూర్ధ్వలోకాదులనెల్ల మహాపవిత్రవంతములుగఁ జేసి శ్రీమహావిష్ణుపథము నాశ్రయించి మనకగపడు నీధ్రువమండలములో జలరూప తేజస్సుతోఁగూడి మహాపవిత్రముగఁజేసెను. అందుచేత స్వర్గపథయని, ఆకాశగంగయని, విష్ణుపథగామినియని, యనేక నామాంతరములఁబడసెను. ఇదియే శింశుమారములో దెల్లనిపాలవంటి ప్రకాశరూపముతో నాకాశమున నొకకొననుండి మరొక కొనకు ఁబ్రకాశించుచు ఁగ్రమముగాఁ దిరుగుచుండును. దీనినిరాత్రులందు మనము ప్రతిదినము చూచుచునేయున్నాము. దీననే పాశ్చాత్యులు Milky way యనుచున్నారు. దీని నిజప్రకాశము వర్ణింపరానిదిగనున్నది. ఇది వేదపురాణములందు మహత్తుగా వర్ణింపఁబడినది. శ్రీమహాత్రివిక్రమ స్వరూపుఁడగు విష్ణువు వామనావతారములో భవిష్యదింద్రుడగు శ్రీమహాబలితో మూడడుగుల దానముఁగొని భూమినిఁదన ఏకపాద్విభూతితో నాక్రమించి, రెండవపాదవిభూతితో నీధ్రువమండలమును

స్పృశింపఁబోగా నాపాదాంగుష్ఠ నఖము సోకి దివ్యరూపిణియగు నాగంగ మహాప్రవాహరూపముతో ఆపోజ్యోతిగా క్రమముగా బ్రవహించుటలో సప్తర్షుల మండలమాదిగ శింశుమారములోఁగల సర్వమండలములను మహాపవిత్రవంతములుగఁ జేసినందుచేతనే శింశుమారమునకు మహాచైతన్యరూపత్వము మహాపవిత్రత్వము కలిగి సంధ్యాకాలమందు సర్వులచేత స్తుతింపఁబడుచున్నది. దీనినే మనగాయత్రీ మంత్రానుష్ఠానములో ఉపస్థానములో "ఓంనమః ప్రాచ్యైదిశే"యను మంత్రమాదిగఁ జెప్పుచున్నాము. దీనికిమూలములోఁగల యనువాకమే వేదములోఁగల శింశుమారమంత్రము. వేదములో "నమశ్శిశుకుమారాయ"యని యున్నది. శిశుకుమారమనఁ బిల్లలను జంపునది యని సామాన్యార్థము. వ్యాఖ్యాతలు, అజ్ఞానము శిశుపదవాచ్యమని వివరించిరి. అట్టి జలప్రవాహరూపిణియగు నామహాదివ్య గంగ మేరుపీఠమున మధ్యలోఁగల బ్రహ్మకోలఁకునందుఁబడి, చతుర్ద్వారములందు బయలుదేరి నాల్గుశాఖలుగ బ్రవాహరూపముతో మేరుశిఖరమునుండి జంబూద్వీపములో నలుదిశలందు మహాజలపాతముగఁబడి ప్రవహించి నాలుగుపేరులతో నాయాదిశలందు ప్రఖ్యాతిగాంచి సర్వమును బవిత్రవంతముగఁజేసి తుదకు సాగరమునుజేరెను. ఈమధ్యలో మన భారతభూమిలోఁగల అవిముక్తక్షేత్రమగు శ్రీవారణాసియందు (కాశి) గల బ్రహ్మనాళముగుండా పాతాళముఁజేరి యాలోకాదులను బునీతములుగఁజేసెను. ఈగంగాధార మేరుపర్వతశిఖరమునుండి మనహిమాలయ పర్వత శిఖరమందుఁబడి "అలకనంద"యను పేరుతో హిమాలయప్రాంతములోఁగల దివ్యక్షేత్రములఁదుఁ బ్రవహించి క్రిందికిఁదిగి ప్రయాగలో "యమున, సరస్వతినదులతోఁజేరి, మరలప్రత్యేకించి శ్రీవిశ్వేశ్వర క్షేత్రమగు కాశీపురముఁజేరి తుదకు కాళీఘట్టణపట్టణము (కలకత్తానగరము) ద్వారా తొమ్మిదిశాఖలుగా" నవద్వీపనామముతో సముద్రమునుజేరెను. దీనియందుఁజేయుస్నానమునకే గంగాస్నానమనియందురు. ఈగంగ స్మరణతోనే మహాపాపక్షయమగునని మనవేదశాస్త్రపురాణములు చెప్పుచున్నవి. ఈగంగ వియద్గంగ యగుటచే నెంతకాలము మనముతెచ్చి యింటిలో పెట్టినను గొంచెమైనను జెడకను దగ్గకను గ్రిమికీటకాదులు చేరకను నిరంతరపానయోగ్యమై పవిత్రవంతముగనుండుట స్వానుభవమే. ముందెట్టి విపరీతకాలములు రాఁబోవుచున్నదో తెలియదు. ఇది వర్షసంబంధజలముగాదు. మనదేహములో సహస్రారమందును, వెన్నెముకయందు సుషుమ్నా నాడియందుఁగల సుధాసింధుప్రవాహినిది అమృతస్వరూపిణిగాఁ దలంచవలెను. జల, పృథివిలో దివ్యగంగయనియు స్వర్గ

ములో నాభోజ్యోతిరూపిణియైన స్వర్గపథమనియుఁ దదూర్ధ్వలోకాదులలో శబ్దరూపిణి యగు ప్రణవమనియుఁ దదూర్ధ్వమునఁ గేవల జ్ఞానస్వరూపిణియనియుఁ బిలువఁబడు చుండును.

మన దేహములోఁగూడ మొదట జ్ఞానస్వరూపముగను తరువాత శబ్దస్వరూప ప్రణవముగను మరల తేజోరూపముగను తుదకు నుదరసింధువులో జలరూపముగ (శ్లేష్మ) నున్నది. క్షేత్రాదులందావిధముగను దేహమునందీవిధముగ నున్నది. అందుచేతనే జలరూప క్షేత్రముతో క్షేత్రరూప గంగయందు స్నానముచేసిన నీక్షేత్రరూప దేహము పవిత్రమై క్షేత్రజ్ఞునకుఁ జైతన్యరూప ప్రకాశజ్ఞానోదయము గలుగుచున్నది. అందుచేత క్షేత్రస్వరూపముతో గంగయనియు క్షేత్రజ్ఞస్వరూపముతో జ్ఞానస్వరూపమనియుఁ దెలియవలెను. ఈగంగామహిమ వర్ణనాతీతము. పురాణములందు "గంగాగంగేతి యోబ్రూయా ద్యోజనానాం శతైరపి॥ ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి"యని యున్నది. మనస్సుతో జ్ఞానభావనతోను వాక్కుతో స్తావకమగు శబ్దస్వరూప భావనతోను గాయముతో గంగాస్నానభావముతోను త్రికరణఫలములు సిద్ధించును. ప్రత్యక్షస్నానముతో అనంతఫలము గలుగును. ఈఆకాశగంగ ధారలు జంబూద్వీపములోఁ దూర్పుదిశనుగల భద్రాశ్వవర్షమునందు "సీత"యను నామముతో గంగాప్రవాహముగను, బశ్చిమదిశలోఁ గేతుమాలవర్షములో "చక్షు"అను నామముతో గంగాప్రవాహముగను, ఉత్తరదిశలో "కురు" వర్షమునందు "భద్ర"యను నామముతో గంగాప్రవాహముగఁ బ్రకాశించి నావర్షములను బవిత్రములుగఁ జేసి యాదిశలందుఁగల సముద్రములను జేరెను.

ఈగంగ త్రివిధములగు స్థూల, సూక్ష్మరూపములతోను గారణాతీతముతోఁ దురీయముగను ఆత్మలో జ్ఞానస్వరూపముగనున్నది. ఈ గంగయందు ఆత్మచైతన్యము తేజస్సు, మహాపవిత్రముగ నున్నదని తెలియవలెను. స్మరణతోనే పాపవిముక్తి కావలెననిన సామాన్యముగాదు. శ్రీమహాశివుని జటాజూటములో నొకబిందువు గానున్నగంగ లోకపావనార్థముగ అనంతప్రవాహరూపముతో శివమహిమతో ప్రవహించినట్టుగూడ నున్నది. ఎటుచెప్పినను భగవద్విభూతియేయగును. గంగ శ్రీమహాబలిచక్రవర్తి కారణముగ వామన పాదాంగుష్ఠ నఖస్పర్శచేఁగ్రిందికివచ్చి భగీరథుని ప్రయత్నముతో భారతభూమికివచ్చి జహ్నుమహాముని యాపోశనముగాఁ గొనఁ దదుదరముచేరి యతని కుడిశ్రోత్రమునుండి యావలకువచ్చి ప్రవహించినది. ఇవన్నియు మార్గమధ్యలో లోకభేదములతో నొక్కొక్క కారణాంతరములుగను [illegible]

తోను మన్వంతరభేదములతో ననేకవిధములుగ బ్రతిసృష్టియందొకవిధముగ నుండ వచ్చును. వీటితో నేమియును బ్రమాదములులేవు.

—౦—

# గంగమహిమ.

## శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యాయం ౮

తతఃప్రభవతి బ్రహ్మన్ సర్వపాపహరాసరిత్। గంగా దేవాంగనాంగానామనులేపనపింజరా॥ ౧౦౮ ॥ వామపాదాంబుజాంగుష్ఠ నఖస్రోతో వినిర్గతాం। విష్ణోర్బిభర్తియాం భక్త్యా శిరసాహర్నిశం ధ్రువః॥ ౧౦౯ ॥ తతస్సప్తర్షయోయస్యాః ప్రాణాయామపరాయణాః। తిష్ఠంతివీచీ మాలాభిరూహ్యమాన జటాజలే॥ ౧౧౦ ॥ వార్యోఘైస్సంతతైర్యస్యాః ప్లావితం శశిమండలం। భూయోధికతరాం కాంతింవహత్యే తదహఃక్షయే॥ ౧౧౧ ॥ మేరుపృష్ఠే పతత్యుచ్చైర్నిష్క్రాంతా శశిమండలాత్ జగతః పావనార్థాయ యాప్రయాతిచతుర్దిశం॥ ౧౧౨॥ సీతాచాలక నందాచ చక్షుర్భద్రేతి సంస్థితా। ఏకైవయా చతుర్భేదా దిగ్భేద గతిలక్షణా॥ ౧౧౩ ॥ భేదం చాలకనందాఖ్యం యస్యాశ్శర్వోఽపి దక్షిణం। దధార శిరసాప్రీత్యా వర్షాణామధికం శతం॥ ౧౧౪ ॥ శంభోర్జటాకలాపాచ్చ వినిష్క్రాంతాస్థి శర్కరాః। ప్లావయిత్వా దివం నిన్యే యాపాపాన్ సగరాత్మజాన్॥ ౧౧౫ ॥ స్నాతస్యసలిలేయస్యా స్సద్యః పాపంప్రణశ్యతి। అపూర్వపుణ్యప్రాప్తిశ్చ సద్యోమైత్రేయజాయతే.౧౧౬॥ దత్తాః పితృభ్యో యత్రాపస్తనయైః శ్రద్ధయాన్వితైః। సమాశతం ప్రయచ్ఛంతి తృప్తింమైత్రేయ దుర్లభాం॥ ౧౧౭ ॥ యస్యామిష్ట్వా మహాయజ్ఞై ర్యజ్ఞేశం పురుషోత్తమం। ద్విజభూపాః పరామృద్ధిమవాపుర్దివిచేహచ॥ ౧౧౮ । స్నానాద్విధూత పాపాశ్చ యజ్జలైర్యతయస్తథా। కేశవాసక్త మనసః ప్రాప్తానిర్వాణముత్తమం॥ ౧౧౯ ॥ శ్రుతాభిలషితా దృష్టా స్పృష్టా పీతావగాహితా। యాపావయతిభూతాని కీర్తితాచ దినేదినే॥ ౧౨౦ ॥ గంగాగంగేతి యన్నామ యోజనానాం శతేష్వపి। స్థితైరుచ్చారితం హంతిపాపం జన్మత్రయార్జితం॥ ౧౨౧ ॥ యతస్సాపావనాయాలంత్రయాణాం జగతామపి। సముద్భూతా పరంతత్తు తృతీయం భగవత్పదం॥ ౧౨౨ ।

ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే అష్టమోఽధ్యాయః.

## గంగవిషయము.

శ్రీమహావిష్ణువుయొక్క నిర్మలమగు తృతీయపదమునుండి సర్వపాపవినాశకరమగు గంగపుట్టుచున్నది. ఏగంగదేవతాస్త్రీలయొక్క మైపూతవలన పింజరవర్ణముఁగలిగి త్రివిక్రమునియొక్క వామపాదాంగుష్ఠనఖ శ్రీవాహామువల్ల బయలుదేరెనో యాగంగను శింశుమారపృచ్ఛస్థితుఁడైన ధ్రువుండు భక్తితో శిరసావహించుచున్నాఁడు. గంగయొక్క తరంగపఙ్క్తులచేత వహింపఁబడుచున్న జటాజూటములుగల సప్తమహర్షులు ప్రాణాయామ పరాయణులైయున్నవారు. ఈధ్రువమానముయొక్క పగటిభాగము తీయుంచగా యేగంగానదియొక్క సంతతప్రవాహములచే ప్లావితమగు చంద్రమండలము మిక్కిలి యధికమైన కాంతినివహించెనో దానినే ధ్రువుఁడుకూడ భరించుచున్నాఁడు. చంద్రమండలమునుండి మేరుపృష్ఠమందుఁబడి జగత్తును పావనముచేయుటకొరకు చతుర్దిక్కులందు నాలుగుధారలుగా మేరువునుండి క్రిందికిఁబడుచున్నది. దిక్కులభేదముల ననుసరించి ౧ సిత, ౨ అలకనంద, 3 చక్షుః, ౪ భద్రయనునామములతో జంబూద్వీప వర్షములందుఁ బడుచున్నది. అలకనందయను పేరుగల దక్షిణదిశధారను శివుండు ప్రీతిచే శతాధికవర్షములుగ ధరించుచున్నాఁడు శివునిజటాకలాపములోని ధారకపాలా స్థితోఁగూడి యిసుకరాశ్శతోఁగూడినదై పాపాత్ములగు సగరపుత్రులనుదడిపి స్వర్గమును బొందించుచున్నది. ఆగంగాజలముచేఁబడిన అస్థులవలన సకలజీవులకుఁ దత్కాలమందే పాపమునశించి పుణ్యలోకప్రాప్తిగలుగును ఆగంగాజలముల శ్రద్ధాళువులచే శ్రాద్ధతర్పణములు జేయఁబడినమాత్రమున పితృదేవతలకు నూరుఁన వత్సరములు తృప్తినిచ్చును మఱియు గంగయందు యజ్ఞములచే యజ్ఞపురుషుని యజించిన బ్రాహ్మణాదు లిహాపరలోకములందు శాశ్వతసుఖమును బొందుదురు సన్యాసులుగూడ విష్ణుభక్తులై స్నానమాత్రముచే పాపవిముక్తులగుదురు. వినినను, స్మరించినను, స్పృశించినను, జూచినను పానముచేసినను, స్తుతించినను, దినదినము పవిత్రులగుదురు. గంగా గంగాయని నూరుయోజనములనుండి ఉచ్చరింపఁబడినవారలయొక్క మూడుజన్మముల పాపములుమబోవును. ఏవిష్ణుపదమునుండి మూడుజగత్తులయొక్క పవిత్రతకొఱకు గంగపుట్టెనో యాపదము భగవంతుని మూడవపదము.

# దివ్యస్నానము.

ఆకాశగంగా సలిలం తథావాయుర్గభస్తిమాన్। అనభ్రగతమేఘోర్వ్యాం సద్యః క్షిపతి రశ్మిభిః॥ ౧౨ ॥ తస్యసంస్పర్శ నిర్ధూతపాప పంకో ద్విజోత్తమ। నయాతి నరకం మర్త్యో దివ్యస్నానం హితత్స్మృతం। ౧౩ ॥ దృష్టసూర్యంహి యద్వారి పతత్యభ్రైర్వినాదివః। ఆకాశగంగా సలిలం తద్గోభిః క్షిప్యతేరవేః॥ ౧౪ ॥ కృత్తికాదిషు ఋక్షేషు విషమే ష్వంబుయద్దివః। దృష్టార్కపతితంజ్ఞేయం తద్గాంగం దిగ్గజోజ్ఝితం॥ ౧౫ ॥ యుగ్మర్క్షేషుచ యత్తోయం పతత్యర్కోజ్ఝితం దివః। తత్సూర్యరశ్మిభిస్సమ్యక్సమాదాయ నిరస్యతే॥ ౧౬ ॥ ఉభయం పుణ్యమత్యర్థం నృణాంపాపహరంద్విజ ఆకాశగంగా సలిలం దివ్యస్నానం మహామునే॥ ౧౭ ॥ యత్తుమేఘైస్సముత్సృష్టం వారితత్ప్రాణినాం ద్విజ। పుష్ణాత్యోషధయస్సర్వా జీవయామృతం హితత్॥ ౧౮ ॥ తేనవృద్ధిం పరాంనీతస్సకలో సౌషధీగణః। సాధకః ఫలపాకాంతః ప్రజానాంద్విజజాయతే॥ ౧౯ ॥ తేనయజ్ఞాన్ యథాప్రోక్తాన్ మానవాశ్శాస్త్రచక్షుషః। కుర్వంత్యహరహస్తైశ్చ దేవానాప్యాయయంతిచ॥ ౨౦ ॥

## — దివ్యస్నాన వివరము. —

ఆకాశగంగాజలమును సూర్యుఁడు గ్రహించి ఆకాశమందు మేఘములేని సమయమందు భూమియందు హఠాత్తుగాఁ దనకిరణములచేఁ జిమ్ముచుండును. అట్టిగంగా శీకరస్పర్శచే మానవుఁడు నిర్ధూతపాపపంకము గలవాఁడై నరకమును బొందనేరఁడు. అందుచేత నిది దివ్యస్నానమని చెప్పఁబడును. సూర్యుఁడు చూడఁబడుచుండగా మేఘములు లేకయే ఆకాశమునుండిఁ యేజలముపడనో యది సూర్యకిరణములచే జిమ్మఁబడుచున్న ఆకాశగంగా జలమేయగుచున్నది. విషమములగు కృత్తికాదినక్షత్రములయందు సూర్యుఁడుండగా ఆకాశమునుండి పడు జలము దిగ్గజములుగొని తమ తొండములచే మరల చిమ్ముచుండును, ఈజలముకూడ ఆకాశగంగాజలమని తెలియవలెను. సరినక్షత్రముల యందాకాశమునుండి పడుజలమును సూర్యరశ్ములు గ్రహించి భూమిమీదికి విడుచుచుండును. ఈ రెండువిధములు ఆకాశగంగాజలమనియు వానివలనగలుగు స్నానము దివ్యస్నానమనియుఁ జెప్పఁబడును మేఘములచే వర్షింపబడుచున్న జలము ప్రాణులయొక్క జీవనార్థమై ఓషధులకు బోషకమగు అమృతమగుచున్నది. దానిచే నోషధులు మిక్కిలి వృద్ధినిఁబొందును. మానవులలో

ఫలపాకాంతమగు నోమధుఁగాని వైదికోపాసనా సాధనపరులగువారలు ద్విజులనఁ బడుదురు. అందుచేత శాస్త్రచక్షువులగు నాద్విజులచేఁ జెప్పబడిన యజ్ఞములను బ్రతిదినము జేయ దేవతలు తృప్తినొంది ఫలమునొసంగుదురు.

మనకుఁగనబడుచున్న వ్యావహారిక చంద్రుఁడు భూమికుపగ్రహమై భూమికిఁ దిగ్నాభిచక్రముగఁ జెప్పఁబడుచున్న తపతిగోణ పరిమితిలోనుండుటచేత బీజరేఖా గణితశాస్త్రములో త్ర్యంబకుఁడని చెప్పఁబడియున్నాఁడు. ఆత్ర్యంబకు డీశ్వేతవరాహ కల్పములో అఘోరమంత్రస్వరూప దక్షిణామూర్తి రూపముతోఁ దిగ్శిరస్కుఁడైన విశ్వరూపుఁడుగ వేదపురాణాదులలోఁ జెప్పఁబడిన త్వష్టప్రజాపతికిఁ బుత్రుఁడై జన్మించెను. ఈత్వష్టప్రజాపతియే ఇంద్రుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ప్రపంచ పంచాననుఁడగుశంకరుఁడు బృహస్పతిస్థానములో దేవతాపౌరోహిత్యముఁబొంది తాను అసురులకు దౌహిత్రుఁడైన హేతువుచేఁగొంచెమసురపక్షపాతముగనుండెను. రాక్షస దౌహిత్రుఁడై దేవతల రహస్యమును అసురులకుఁ దెలియజేసినందుచేత ఇంద్రుని వజ్రాయుధముచే హతుఁడై మరల వృత్రాసురుఁడై పుట్టెనని పురాణములందును వేదములందునుగలదు. ఈచరిత్రలోని యింద్రుఁడు మంత్ర యంత్ర తంత్రాగ మాది శాస్త్రములందును అథర్వణవేద పరిభాషతో వేదాంగములందుఁ జెప్పఁబడెను. సద్యోజాతాది పంచాంగమంత్రములుగల పంచాననుఁడగు శంకరునిభార్య తానే త్రిపాద చతుష్పాదాక్షరములు మొదలు అష్టాపదివరకు గాయత్రీరూపములోఁ బెరిగి బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి విశ్వామిత్రరూపమునఁజేసి సాంఖ్యాయన సగోత్రజరాలై ఇంద్రుఁడు వజ్రాయుధముతో అకారణముగ రాక్షస దౌహిత్రరూపుఁడగు తన భర్తను జంపినందుకై ప్రకోపించి "మహాకాళి"నామక మృత్యురూపిణియై అమావాస్యనాఁడు తనభర్తృమహిమచే నాయింద్రునిఁజంపి తనదక్షిణపాదముతో శవప్రాయుఁడైయున్న తనభర్తపై నృత్యముఁజేయ నారంభించెను. అపుడాతఁడు చైతన్యమందెను. త్ర్యంబకుఁడు గంగాభాగీరథీ సమానురాలైన యా "కాళిని" గంగానదీరూపమునఁ దలకెక్కించుకొని మృత్యుంజయుఁడై ప్రకృతికే ప్రాధాన్యమిచ్చినట్లు మంత్రశాస్త్రములందు వర్ణింపఁబడినది. ఆగంగాభవానియే కపిలమహర్షికోపాగ్నికి భస్మీభూతులైన సగరకుమారులపైఁబ్రవహించి యుత్తమగతినిఁ బొందించినది. ఎల్లప్పుడు గంగాస్నానమాచరించువారలఁ బునీతచైతన్యులఁజేయును. కాననే పురాణములందు గంగాస్నానమహిమను జాలవర్ణించియున్నారు. విశ్వామిత్రరూపమునఁ బ్రతిసృష్టినొనర్చి గాయత్రీమంత్రర్షిగ వ్యవహరింపఁబడుటచే నీగంగ గాయత్రీ

సమానమహిమాతిశయశక్తురాలు. ఈ లోకమునం బునీతులైయుష్టులగుటకు గంగా గాయత్రులే సర్వులకు ముఖ్యోపాస్య దేవతలు.

—o—

## సప్తర్షి మండలము.

శ్రీ దేవీభాగవతము - స్కంధము ౮ - అధ్యా, ౧౬.

శ్లో॥ తతఃఉత్తరతః ప్రోక్తమేకాదశ సులక్షకైః॥ . యోజనైః పరిసంఖ్యాతం సప్తర్షీణాంచ మండలం॥ ౩౬ ॥ లోకానాం శంభావయన్తో మునయ స్సప్తతేమునే। యత్తద్విష్ణు పరంస్థానం దక్షిణం క్రియతేచతే॥ ౩౭ ॥

—♦ సప్తర్షి మండల వివరం. ♦—

ఈసప్తర్షిమండలము శింశుమార పుచ్ఛములో ధ్రువమండలముక్రిందనే యున్నది. ఈమండలము పదునొకండులక్షల యోజనములని పురాణములందున్నది. జగత్కల్యాణ నిమిత్తమై సప్తర్షులు ధ్రువునిం బ్రదక్షిణము చేయుచుందురు. "చతుస్సాగర పర్యంత" మను శ్లోకార్థమునను సరించి విష్ణుపదస్థానమగు ధ్రువుని అప్రతిహతభావముతో సత్యసంకల్పులై ప్రదక్షిణము జేయుటే వారినిరంతరకర్తవ్యము.

మంత్రప్రశ్నములో "అధోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి." పురుష సూక్తములో "అత్యతిష్ఠద్దశాంగులం"అనినట్లు ఆకాశస్థ శింశుమారములో దివ్యధ్రువసంబంధ సప్తర్షిమండలాంతరాళ దూరము పదునొకండు లక్షలయోజనములున్నట్లు జెప్పబడినది. దీనినే మన దేహములో నాసాగ్రధ్రువ హృదయాంతరాళమునాలోచించగా మనస్సుతో సహాదశేంద్రియముల శక్త్యులయొక్క లక్ష్యములో బ్రతియొకటి మనకుపకారముగ నేయున్నది. శిరోభాగమందుంగల "సప్తశీర్షణ్యప్రాణరంధ్ర యోజనములతోను, మనోబుద్ధిచిత్తా హంకారముల నెడి అంతఃకరణచతుష్టయ యోజన సంజ్ఞతో సప్తర్షిమండలము సమన్వయమగును. దీనిపైనున్న ధ్రువమండలమగు విష్ణుపదమును బొందవలెననినచో యోగశాస్త్రముల ననుసరించి ఏకాదశేంద్రియములయొక్క సంయమయోగముతోను ధ్యానధారణ సమాధియోగములతోను మనమీస్థూలదేహము పొందవచ్చును. ఈవాసనతో దేహాంతనానంతరమీబ్రహ్మాండములోంగల దివ్యధ్రువము అభ్యాసయోగముద్వారా లభించును.

ఇక్కడలేనిదే అచ్చట లభించుట కవకాశమార్గములులేవు. ఇందుకు గీతలోఁగూడ ప్రమాణములు కొంతసమన్వయములుగనున్నవి "సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి నపండితాః। ఏకమప్యాస్థితస్సమ్యగు భయోర్విందతేఫలం॥" వైదికసాంఖ్య యోగములలో నేయొకదానిని సాధకుడవలంబించినను ముఖ్యఫలము తత్త్వజ్ఞానమే కావున (కప్పకపౌండతీరును మనమిపుడు హారలంబికాదియోగ మార్గములను సాధించుట కష్టతరము అంతటి అనుభవైకవేద్యగురువులు దొరకుట దుర్లభము.

ఈలాటి ప్రమాణములే మిగతపురాణములందున్నవి. కొంచెముశబ్దభేదము లేగాని అభిప్రాయభేదము లేదు.

—o—

## ఊర్ధ్వరేతస్కమునులు.

నాగవీథ్యుత్తరంయచ్చ సప్తర్షిభ్యశ్చదక్షిణం। ఉత్తరస్సవితుః పన్థాః దేవయానస్తు సస్స్మృతః॥ ౯౦ ॥ తత్రతే వశినస్సిద్ధా విమలాబ్రహ్మచారిణః। సంతతిం తేజుగుప్సంతి తస్మాన్మృత్యుర్జితశ్చతైః॥ ౯౧ ॥ అష్టాశీతి సహస్రాణి మునీనామూర్ధ్వరేతసామ్। ఉదక్పంథాన మర్యమ్ణ స్థితాన్యాభూతసంప్లవాత్॥ ౯౨ ॥ తేసంప్రయోగా ల్లోభస్యమైథునస్యచవర్జనాత్। ఇచ్ఛాద్వేషా ప్రవృత్త్యాచ భూతారంభ వివర్జనాత్॥ ౯౩ ॥ పునశ్చాకామ సంయోగా చ్ఛబ్దాదేర్దోష దర్శనాత్। ఇత్యేభిః కారణైశ్శుద్ధాస్తేఽమృతత్వం హిభేజిరే। ౯౪ ॥ ఆభూతసంప్లవంస్థాన మమృతత్వం విభావ్యతే। త్రైలోక్యస్థితికాలోయ మపునర్మారఉచ్యతే ౯౫ ॥

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౮.

బ్రహ్మహత్యాశ్వమేధాభ్యాం పాప పుణ్యకృతోవిధిః। ఆభూతసంప్లవాంతం తత్ఫలముక్తం తయోర్ద్విజ॥ ౯౬ ॥ యావన్మాత్రిపదేశేతుమైత్రేయానస్థితో ధ్రువః। క్షయమాయాతి తావత్తు భూమేరాభూత సంప్లవాత్॥ ౯౭ ॥ ఊర్ధ్వోత్తర మృషిభ్యస్తు ధ్రువోయత్రవ్యవస్థితః। ఏతద్విష్ణుపదం దివ్యం తృతీయంవ్యోమ్ని భాస్వరం॥ ౯౮ ॥ నిర్ధూతదోషపంకానాం యతీనాం సంయతాత్మనాం। స్థానం తత్పరమం విప్రపుణ్యపాప పరిక్షయే॥ ౯౯ ॥ అపుణ్యపుణ్యో పరమేక్షీణాశేషాప్తి హేతవః యత్రగత్వానశోచంతి తద్విష్ణోః పరమంపదం॥ ౧౦౦ ॥

## —♦ ఊర్ధ్వరేతస్కుల స్థానవివరం. ♦—

నాగవీథికుత్తరభాగమున సప్తర్షులకు దక్షిణమున సూర్యునకుత్తరమున (భౌమసూర్యునకు) నున్నమార్గము దేవయానమార్గము. అచ్చటజితేంద్రియులునిర్మలులునగు బ్రహ్మచారులు సంతానవిరక్తులైయున్నారు. అందువలనవారిచేత జనన మరణాత్మకమగు సంసారమృత్యువు జయింపఁబడినది. ఎనుబఁదెనిమిది వేలమంది ఊర్ధ్వరేతస్కులగు మునులు సూర్యునియొక్క ఉత్తరమార్గమునాశ్రయించి (ఆభూతసంప్లవాంతమనగ) కార్యబ్రహ్మప్రళయాంతముండెదరు. వారులోభరహితులు మైథునవర్జితులు, నిస్సంకల్పులు, నిరహంకారులు విరాగులు శబ్దస్పర్శాది విషయవర్గ దోష రహితులునగుట అజన్మగుణులై అమృతత్వమునుఁ బొందిరి. అమృతత్వమనగా కార్య బ్రహ్మవసాన పర్యంతముండునట్టిస్థితియే ముల్లోకములు వాసనాత్మకముగా నుండుటచే నది అపునార్మరస్థానమని చెప్పబడును ఇదియేత్రైలోక్యస్థితికాలము. ఇచ్చట కూడ బ్రహ్మహత్యాశ్వమేధములచేతనైన పుణ్యపాపములయొక్క విధినిషేధ శాస్త్రప్రవృత్తియున్నది. కావున కార్యవిరాట్ప్రళయ మగువఱకు వారలకు బ్రహ్మహత్యాశ్వమేధఫలము లనుభవింపవలసియున్నది. ఏంతప్రదేశములో నీకార్యవిరాడ్భ్రుఁడుండునో అంతప్రదేశమును కార్యవిరాట్ప్రళయ కాలమందు నశించుచున్నది. సప్తర్షులకు ఊర్ధ్వోత్తరమగు ప్రదేశమునందు నెచ్చట దివ్యధ్రువుఁడు వ్యవస్థితుఁడైయుండునో అది మహాకాశమందు విష్ణుపదమని చెప్పఁబడుచున్నది. నశించినదోషములు గలిగి సంయతాత్ములగు యతులకుఁబుణ్యరూప పరిక్షయమైయుండగాఁబరమ పవిత్రమగు నాస్థానము వాసభూమియగుచున్నది. ఇట్లు పాపపుణ్యములయొక్క వినాశమురాగాఁ బొందవఁలసిన క్షేమములేనివారై యేస్థానమును బొందుదురో అదియే శ్రీమహావిష్ణువుయొక్క పరమపదవియని చెప్పఁబడుచున్నది.

ఊర్ధ్వరేతస్సువివరము నాధ్యాత్మికభాగమందు గలదు.

—♦—

## ధూమార్చిరాదిమార్గములు.

---

ఈరెండుమార్గములనే గీతలోఁ జాలముఖ్యముగబోధించిరి, తుదకీరెండు మార్గములే జీవులకుఁబ్రధానములు. ఇవి శింశుమారములోనున్నవి. మనము గీతా

దులను జపించునప్పుడుగాని శ్రవణము జేయునప్పుడుగాని సామాన్యముగ అర్థమునుమాత్రమే గ్రహింతుముగాని దానిస్వరూపమేమి? మార్గమనగేమి? అవియెట్లున్నది? రెంటికినిగలభేదము లెట్లున్నవి? ఏమార్గమెంతదూరము వ్యాప్తమయినది? ఈలోకములవారెట్లా మార్గములననుసరింతురు. ఒకమార్గమునకుఁ బునరావృత్తి కల్గి మరొక మార్గమునకుఁ బునరావృత్తి లేకుండుటెట్లు? అను విషయములు మనమనస్సునకు గోచరించి భావము సుబోధమగువరకు విమర్శించి యాలోచించి వివరముగను సాంతముగా ముఖ్యముగఁ దెలుసుకొనుటకు "శింశుమార" స్వరూపచిత్రమును జూడవలయును. శింశుమారము శిరస్సువంటిది. సర్వసృష్టివిషయ కేంద్రీకరణమే శింశుమారము. సర్వమూలమే శింశుమారము. వేదములో అతిసూక్ష్మతత్త్వస్వరూపముగ నున్నదానిని మనవేదప్రాచీన మహర్షులు తమ తపోయోగబలములచేతఁ దాముస్వయముగాఁజూచి యనుభవించినవాటిని వేదములోనున్నవాటిని స్మృతిపురాణములుగా వ్రాసిరి. అందుకుఁ గర్మలే సహకారములు. ఋణవిమోచనమునకు ఈలోకభూమి కేవలము ప్రథమములోఁ గర్మసాధనాగమ్యము- అవల నితరములు సాధనామార్గములుగావచ్చును. తుదకన్నిమార్గములు కర్మక్రియాసంబంధములతో ఆత్మవరకునున్నవియే. సందర్భానుసారముగ విషయముమార్పులతో అభ్యాసయోగములుగా నున్నవగును. అందుచేత నివన్నియు సూక్ష్మవిధములుగాక నొకక్రియాకర్మాంగము లేయగును. వాయువున్నంతకాలము చలనాదులున్నవి. చలనాదులేకర్మలుగా ప్రారంభమై తుదకు స్థూలభూతముతో స్థూలకర్మలుగను జలభూతముతో జలసంబంధములుగను తేజోభూతముతో తేజస్సంబంధములుగను, వాయుభూతముతో వాయుసంబంధములుగను, ఆకాశభూతముతో ఆకాశసంబంధములుగను, పంచతన్మాత్రలుగా ఆయాభూతగుణ తత్త్వదేహాదుల నాశ్రయించి మనస్సుమిగిలియున్నంతకాలము ద్వంద్వవిధానములతోఁ గ్రియాకర్మాదులు సూక్ష్మముగానైనను మిగిలియుండును. అన్నియును మనస్సునాశ్రయించియుండును. సర్వమునాశ్రయించి మనస్సుండును. ఈరెంటికిని అవినాభావసంబంధము. మనస్సే జీవత్త్వము, మనస్సేవాయుభూతము. మొదటిస్వరూపమును బొత్తిగాఁ దెలియక రెండవదగు మూలప్రకృతి స్వరూపమును బొత్తిగా విమర్శించకయుండుట అనర్థములకు, వివాదములకు, ముఖ్యకారణమగును.

మొదటజీవుఁడు దేహమును విడువగానే దక్షిణదిశలోనున్న యమ సభాద్వారమునుండి పైలోకాదులను బొందవలెను. యమసభలోఁ బుణ్యజీవులకుఁ

పాపజీవులకు మార్గద్వార భేదములు మాత్రమున్నవి. మొత్తముమీద యముని దర్శనముతోనే సర్వలోకప్రాప్తికలుగును. ఈయముఁడు పుణ్యజీవులకు, కేవలశాంతుఁడుగను, ధర్మరాజుగను, నగపడును. వారికి సుస్వాగత మొసఁగి వారి వారి సుకృతమార్గముల దానుఁజూపి ఆదరించి సత్కరించి పంపుచుండును. అంతమాత్రమేకాని అచట నెంతమాత్రము నిలుపుకొనజాలఁడు. పాపులకు ఘోరరూపముతో యముఁడుగానే యగపడుచు వారలపాపములను విచారించి వారలతో వాజ్మూలాదులను గైకొని వారివారి దుష్కృతములనుబట్టి సామాన్యనరకములాదిగా అతిఘోరనరకములవరకు వారికి దండన విధించును. ఇవన్నియు నాలోచించిన మనలోకములోఁగల రాజ్యాంగముననున్న విధానమువలెనే యన్నియును సమన్వయక్రియాకర్మలుగానే శాస్త్రవిధులుగా సర్వమొకవిధముగానే జరుగుచున్నవి. మనలో మహాకోపతాపసమయములందు శాంతులైనవారు సహితము ఘోరరూపులైన విధముగనే యమునికిని రూపభేదము గలుగునని తలంచవలెను.

మహాపుణ్యజీవులాదిగ పాపజీవులు సహితము ఈలోకమును విడువగానే యమపురి సభాద్వారమును జేరి వెనుక సుకృతదుష్కృతముల ననుసరించిన లోకాదులను బొందవలెను. అందుచేత దక్షిణాయనకాలములో గతించిన జీవులకు శింశుమారములోఁగల ధూమాదిమార్గ భాగార్థము నొందవలసియుండును మనకు దక్షిణదిశలో యమపురినాశ్రయించి యీమార్గముండుటచేత దేవతలకు రాత్రికాలము ఆరుమాసములుగను ధూమవర్ణముగ నుండును. ఈమార్గమున సూర్యప్రకాశములేక చంద్రుని ప్రకాశముతో మనకు రాత్రి చంద్రప్రకాశమువలె నుండును. ఈమార్గమునకు చంద్రుఁడధిదేవతగా నున్నందుచేత మనపితరులీలోకమునఁ జేరియుందురు. ఈమార్గము శింశుమారములోఁ బుచ్ఛముకొనవరకు వ్యాపించక కృష్ణమువరకే యుండినందుచేత ఈలోకమును జేరినవారలు మరల వచ్చెదరను ఈఅభిప్రాయమే గీతాదులందుఁ జెప్పఁబడెను. ఈమార్గము, ఈలోకము పునరావృత్తి నొసగుననిస్పష్టము. గీతలో "ధూమోరాత్రిః తథాకృష్ణష్షణ్మాసా దక్షిణాయనం తత్రచాంద్రమసంజ్యోతిః"అనియున్నది అందుచేత దేవలోకమగు స్వర్గమును జేరుటకు వీలుకాలేదు. ఇంతకుఁ గొంతసహాకారముగ మనము గతించినవారలకు జేయుదాన ధర్మాది క్రియాకర్మలతో వారికి ఉత్తమగతు లవకాశమార్గములు గలుగుననియే మన వేదమహర్షులు మనకు విధిగా ఆచరింపఁజేసిరి. ఈలోకములోను నిర్బంధితులను ఇతరవిధములతో శ్రమపడువారలకును మనముచేయు సహాకార

పాకర్యాదులు గలిగినటు లందనుగలుగును. శింశుమారములో ఉత్తరాయణమున నీధూమాది మార్గము ఆవలఅర్థభాగమునఁజేరును. మనదిశకు ఉత్తరాయణ సంబంధార్చిరాదిమార్గ ముండును. ఉత్తరాయణమనిన అర్చిరాదిమార్గమనియు దక్షిణాయనమనిన ధూమాదిమార్గమనియు దెలియవలెను. వీటినేధూమాదిమార్గము రాత్రియనియు, అర్చిరాదిమార్గము పగలనియు దెలియవలెను.

అర్చిరాదిమార్గము శింశుమారములో మిగతభాగార్థమును వ్యాపించియుండి సూర్యసంబంధములకు బ్రకాశముగనుండుటచేత దేవతలకు బగలుగాను స్వర్గసంబంధముగానుండుటచేత శింశుమారపుచ్ఛమువరకు గ్రమముగా వ్యాప్తిగానుండుటచేత ధ్రువునివరకుఁ జేరినదైయుండుటచేత ఇందులో అత్యుత్తమ త్యాగశీల మహాపుణ్యపురుషులు సూర్యమండలమును భేదించుకొని (అనగా మార్గముదాటి అని అర్థము) ధ్రువమును జేరుదురు. ఇట్టివారలకు బునరావృత్తి బొత్తిగా లేదు. సూర్యమండలమును భేదించినవారలకే నీలోకఫలములభించును. సామాన్యముయోగులును త్యాగులు పుణ్యకర్ములు దేహస్వర్గమునఁ బుణ్యమునుసరించి నియమితకాలమువరకు దేవలోకసుఖానందమునుమాత్ర మనుభవించి ఆవల "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి"అను గీతావాక్య ప్రమాణానుసారము దేవలోకములోమాత్రముండునట్టి పుణ్యము క్షీణించగానే మిగతపుణ్యవిశేషముతో జంబూద్వీపములో "ఇలావృత" వర్షములో (ఇదిభూస్వర్గము) మరల కొంత కాలము పుణ్యమనుభవించి పిదుకగీతలోని "శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోభిజాయతే"అను ప్రమాణరీతిగా మనభరతభూమిలో జన్మించి మరల యోగభ్యాసమువలన అతిపుణ్యులై మునుపటికంటె బునరావృత్తిలేని ధ్రువపదమును దప్పక చేరఁగలుగుదురు. ఇంకను సామాన్యపుణ్యకర్మల నాచరించినవారలు పుణ్యఫలానుసారము దేవలోకస్వర్గము ననుభవించి పుణ్యకర్మలఫలమునపేక్షించి చేసినందుచేత మరల మనభూలోకములో (మర్త్య) పుణ్యవంతులుగానే జన్మింతురు. ముఖ్యకర్మల ఫలాపేక్షానుసారముగ అనుభవములు, కర్మలు, యోగాదులు, నిష్కామఫలమును గోరువారలు క్రమప్రాప్తితో అత్యుత్తమపదవివలన ఒకజన్మములోఁ గాకున్నను మరొకజన్మములోనైనను నీవాసనాతిశయముతో ఆచరించి ధన్యులగుదురు.

ధ్రువపదమునుచేరుటకు మధ్యలోఁ దేజోరాశియగు సూర్యమండలమున్నందుచేతఁ దేజోభూమికగాఁగల సూర్యమండల భేదనముచే శాంతశివమగు శాశ్వతవిశాలమగు ధ్రువపదమునుజేరుదురు. ధ్రువసూర్యులకు భేదములులేవని "శ్రీవిష్ణు

పురాణాద్యనేక పురాణములందు బ్రమాణములున్నవి. పుణ్యకర్మలతో అర్చిస్సున కళకాశముగా దేజస్సునిచటనే అనుభవముగా అభ్యాసికిఁదప్పక కాగలదు. ఈ అభ్యాస వాసనాబలమే గతించినను నీలర్చిస్సు జీవునికిగలిగి సహాకారమై అర్చిరాది మార్గమును దప్పక చేరును. పుణ్యకర్మల ఫలమును గూర్చినవారలకుఁ దమ సంకల్పానుసారముగ చంద్రజ్యోతితో మిశ్రమఫలముగను పునరావృత్తిసహితమగు చంద్రసంబంధ ధూమాదిమార్గము చంద్రలోకమేర్పడును. ఇదియునుగూడ స్వర్గలోకసంబంధమే ఫలభేదములుండునేకాని కేవల పుణ్యకర్మలను ధర్మముల నాచరించనివారలకు నీరెండుమార్గముల స్పర్శగలుగదు. రెండును బుణ్యకర్మలమార్గములే. పుణ్యకర్మలు ఫలభేదములతోనుండును. చంద్రలోకమనిన సామాన్యముగాదు. ఉత్తమదేవలోకస్వర్గము. ఇదియు నా శింశుమారములో నేయున్నది. శింశుమార మనిన స్వర్గభూమి.

శింశుమారము తనకుఁదానే సవ్యముగఁదిరుగుటచేత ఈమార్గము లారుమాసములొకదిశను, మరొకదిశ మిగత ఆరుమాసములునుండును. దీనిమధ్యలో సుషుమ్నగామినిగా స్వర్గపథమని (Milk path) వియన్మార్గమని ఈరెంటికి మధ్యలో శింశుమారపుచ్ఛమునుంషి ముఖమువరకునున్నది. దీనినే ఆకాశగంగయనికూడ చెప్పుదురు దీనివిషయము ముందువిమర్శింతును.



# నక్షత్రముల వివరము

శ్రీవాయుపురాణం - అధ్యాయం ౫3 - పుట ౮౦

శ్లో॥ నక్షీయంతే పునస్తాని తస్మాన్నక్షత్రతా స్మృతా॥ ౫౦ ॥ క్షేత్రాణ్యేతాని వైపూర్వమాపతంతి గభస్తిభిః॥ తేషాంక్షేత్రాణ్యథాదత్తే సూర్యోనక్షత్రతాం గతః॥ ౫౧ ॥ తీర్ణానాం సుకృతేనేహ సుకృతాంతే గ్రహాశ్రయాత్। తారాణాం తారకాహ్యేతాః శుక్లత్వాచ్చైవ తారకా॥ ౫౨ ॥ దివ్యానాం పార్థివానాంచ నైశానాంచైవ సర్వశః। ఆదానాన్నిత్యమాదిత్యస్తమసాం తేజసాం మహా॥ ౫3 ॥ సువతిస్పందనార్థేచ ధాతురేష విభావ్యతే। సవనాత్తేజసోऽపాంచ తేనాసౌ సవితా మతః॥ ౫౪ ॥ బహ్వర్థశ్చంద్ర ఇత్యేషహ్లాదనే ధాతురిష్యతే। శుక్లత్వేచామృతత్వేచ

శీతత్వేచ విభావ్యతే॥ ౧౬॥ సూర్యాచంద్రమసోర్దివ్యే మండలే భాస్వరేఖగే। జ్వలత్తేజోమయేశుక్లేవృత్తకుంభ నిభేశుభే॥ ౧౭॥ తారానక్షత్రరూపాణి స్వప్రమంతిహ యాన్తివై। బుధేన సమతుల్యాని విస్తారాన్మండలాదథ॥ ౧౮॥ ప్రాయశశ్చంద్రయోగాని విద్యాదృక్షాణి తత్వవిత్తు తారానక్షత్రరూపాణి హీనానితు పరస్పరం॥ ౧౯॥ శతానిపంచ చత్వారి త్రీణిద్వేచైవ యోజనే। పూర్వాపర వికృష్టాని తారకామండలానితు। యోజనాన్యర్ధమాత్రాణి తేభ్యోహ్రస్వం నవిద్యతే॥ ౨౦॥

నాశనారహితమైనది నక్షత్రమండలము. క్షీణింపనిప్రకాశమే నక్షత్రమని తెలియవలెను. ఈనక్షత్రమండల క్షేత్రములు మొదట తమకిరణములచే ప్రాచీన మార్గము నాశ్రయించును. సూర్యుఁడు నక్షత్రత్వము నుబొంది ఆక్షేత్రముల నాకర్షించును. పుణ్యముచే సంసారమును దాటినట్టివారలు గ్రహములయొక్క ఆశ్రయములవలనఁ దారాగ్రహములకుఁగూడ దారకులై శ్వేతచ్ఛాయగలుగుటవలనఁ దారలనిగూడ చెప్పఁబడుచున్నవి. ఇట్లు దివ్యములగు తమస్సులను పార్థివతమస్సులను, రాత్రితమస్సులను ఆధారముచేయుటవలనఁ (గ్రహించుటవల్ల) దేజస్సులకుఁ దమస్సులకుఁగూడ మహాత్ముఁడగు సూర్యుఁడుఆదిత్యుఁడని చెప్పఁబడుచున్నాఁడు. మరియు యర్ధనిమిషమాత్రకాలమునందే జగత్తును గనుచుండుటచే సవితయగుచున్నాఁడు. ఈవిషయము ధాతయగు బ్రహ్మదేవునికే జూడననువగును మరియు ఆపోదేవతల యొక్క సవనముచే సవితయనికూడఁ జెప్పఁబడుచున్నాఁడు. ఇలాగ నేకార్థములుగలిగి ధాతకు నాహ్లాదకరుఁడగుటచే నీసూర్యుఁడే చంద్రుఁడగుచున్నాఁడు. శుక్లత్వవిషయముగను, అమృతత్వవిషయముగను, శీతత్వవిషయముగనుగూడ సూర్యుఁడే చంద్రుఁడుగ భావింపఁబడుచున్నాఁడు. ఈలాగున సూర్యచంద్రుల దివ్యమండలములు ఆకాశమును బొందినవై వృత్తాకారములగు కుంభములవలెఁ బ్రకాశించుచుఁ దేజోమయములై శుభప్రదములగుచున్నవి. తారాగ్రహరూపనక్షత్రములు యోగ్యమైన శరీరములుగలవై విస్తారముగనున్న మండలాధోభాగమందు సమభావముతో బుధునితోసమముగానున్నవి. బుధుఁడనగా "జ్ఞాతృచాంద్రిసురాబుధాః"యని యమరనిఘంటువు. తత్త్వవేత్తయగువాఁడు తెలియుచుగా గ్రహనక్షత్ర తారాదులన్నియుఁ జంద్రయోగముగలవియనియే తెలియవలెను. తారాగ్రహనక్షత్రములు పరస్పరము ముందుఁజెప్పఁబోవు సంఖ్యాపరిమాణముచే న్యూనాధికములుగానున్నవి. నక్షత్రపరిమాణములు అయిదువందలనియు, నాలుగువందలనియు, మూడువందలనియు, రెండువందలనియు, యోజనపరిమాణములు గలిగి పూర్వ పూర్వ గోళముకంటె

పశ్చిమ పశ్చిమగోళములు తక్కువపరిమాణముగలిగిన తారకామండలములని చెప్పఁబడుచున్నవి. ఒకటిన్నరయోజన పరిమాణముగలిగి కొన్నియున్నవి. అంతకుఁ దక్కువగాఁ దారకామండలమనునదే లేదు.

—♦ మరొక విశేషము. ♦—

మకరుదక్షిణ దిశయందు (కృష్ణపక్షరాత్రి)యందొక తార సీసపులో పాచ్చాయతో చలించునట్లు కనఁబడుచు ననేకచిత్రవర్ణములతోఁ గానవచ్చుచుండును. దానిని లుబ్ధనక్షత్రమని కొందరు చెప్పుదురు. మరికొందరిచే నిది ఏకలవ్య నక్షత్రగోళ మనియును, భూతసంప్లవ నడకనక్షత్రమనియుఁ జెప్పఁబడినది. ఏకలవ్యుని చరిత్ర భారతమునందుఁ గలదు. ఈనక్షత్రములోని సూక్ష్మాంశఖండము మూడువందల మణువుల కధికముగా నుండునని చెప్పుదురు. ఇక నాగోళమెంత పరిమాణముండునో యాలోచించవలెను ఇట్టివెన్నివున్నవో తెలియఁజాలము.

—o—

## దేవతాగణములు.

(౧) ఆదిత్యులు, (౨) విశ్వదేవతలు, (౩) వసువులు, (౪) తుషితులు, (౫) భాస్వరులు, (౬) అనిలులు, (౭) మహారాజికులు, (౮) సాధ్యులు, (౯) రుద్రులనువారలు తొమ్మండుగురు.

(౧) ఆదిత్యులు పండ్రెండుగురు.

(౧) ఇంద్రుఁడు, (౨) ధాత, (౩) పర్జన్యుఁడు, (౪) త్వష్ట, (౫) పూషుఁడు, (౬) అర్యముఁడు, (౭) భృగుఁడు (౮) వివస్వంతుఁడు, (౯) విష్ణువు, (౧౦) అంశుమంతుఁడు, (౧౧) వరుణుఁడు, (౧౨) మిత్రుఁడు.

(౨) విశ్వేదేవతలు అయిదుగురుజంటలు.

శ్రాద్ధాగ్రే విశంతీతి విశ్వేదేవాః = శ్రాద్ధాగ్రమందుఁ బ్రవేశించువారలు, విశ = ప్రవేశనే.

(౧) వసుబంధులు, (౨) క్రతుదక్షులు, (౩) కాలకాములు, (౪) ధురి విలోచనులు, (౫) పురూరవార్ద్రవులు.

(౩) వసువు లెనిమిదిమంది.

వసవః - ఆహత్యవసంతీతి, వసవః=కూడుకొనియుండువారు, వస=నివాసె వీరలెనమండ్రు.

(౧) ఆపుఁడు, (౨) ధ్రువుఁడు, (౩) సోముఁడు, (౪) అధ్వరుఁడు, (౫) అనిలుఁడు, (౬) ప్రత్యూషుఁడు, (౭) అనలుఁడు, (౮) ప్రభాసుఁడు.

(౪) తుషితులు ముప్పదియార్వురు.

తుషితాః - తుష్యంతీతి తుషితాః=సంతోషించువారలు. తుష - తుష్టౌ. వీరలు ముప్పదియార్వురు.

(౫) భాస్వరులు=అఱువదినలువురు.

భాస్వరాః - ఆభాస్వరాః—భాసంత ఇతిభాస్వరా, అంతటఁబ్రకాశించువారు. భాసృదీప్తౌ - వీరలరువదినల్గురు.

(౬) అనిలులు - నలుబదితొమ్మండుగురు.

అనిలాః - అన్యంతే ప్రాణ్యంతే లోకా ఏభిరిత్యనిలాః వీరిచేలోకములు ప్రాణయుక్తములుగాఁ జేయఁబడును. కనుక అనిలులు. అన - ప్రాణనే. ఇలాయాం నచరం తీతివా=భూమియందు సంచరింపనివారలు నలుబదితొమ్మండుగురు.

(౭) మహారాజికులు - రెండువందలయిరువదిమంది.

మహారాజికాః - మహతీరాజిః పఙ్క్తిర్యేషాంతే=అధికమైన పఙ్క్తిగలవారలు. వీరలు రెండువందలయిరువదిమంది మహారాజశబ్దో యేషాంతే=మహారాజులనెడి శబ్దముగలవారు.

(౮) సాధ్యులు - పండ్రెండుగురు.

సాధ్యాః - సాధ్యంతే ఆరాధ్యంత ఇతిసాధ్యాః=ఆరాధింపఁబడువారు. సాధ్యం=సిద్ధిర్యేషా మస్తీతివా=సిద్ధిగలవారు. రాధసాధ సంసిద్ధౌ. వారలు పండ్రెండుగురు. మనుఁడు. హనుమంతుఁడు, విష్ణువు, ధర్ముఁడు, నారాయణుఁడు మొదలుగాఁగలవారలు.

(౯) రుద్రులు - పదునొకండుగురు.

రుద్రా - రోదయంతి దుష్టానితి రుద్రాః=దుష్టుల దుఃఖింపజేయువారు,

రుదిర్ అశ్రువిమోచనే. రుజం=దుఃఖందావయంతీతి వా=దుఃఖమును బోగొట్టువారు. ద్రాకుత్స్నాయాంగతౌ - రుతం - వేదాత్మకంశబ్దం కల్పాదౌ రువంతీతి వా=కల్పాదియందు వేదస్వరూపమై శబ్దమును బలుకువారు. రు - శబ్దే. వీరలు - పదునొకండుగురు. ౧. అజుఁడు, ౨ ఏకపాదుఁడు, ౩. అహిర్బుధ్న్యుఁడు, ౪. త్వష్ట, ౫. రుద్రుఁడు, ౬. హరుఁడు, ౭. శంభుఁడు, ౮. త్ర్యయంబకుఁడు, ౯. అపరాజితుఁడు, ౧౦. ఈశానుఁడు, ౧౧. త్రిభువనుఁడు.

—o—

# గ్ర హ ము ల యు త్ప త్తి వి వ ర ము.

శ్రీవాయుపురాణ - అధ్యా. ౫౩.

వివస్వానదితేఃపుత్రః సూర్యోవైచాక్షుషేంతరే। విశాఖా సుసముత్పన్నో గ్రహాణాం ప్రథమోగ్రహః॥ ౧౦౪ ॥ త్విషిమాన్ ధర్మపుత్రస్తు సోమోవ్య విశ్వావసుస్తథా। శీతరశ్మిః సముత్పన్నః కృత్తికాసు నిశాకరః॥ ౧౦౫ ॥ షోడశార్చిర్భృగోః పుత్రః శుక్రః సూర్యాదనంతరం। తారా గ్రహాణాం ప్రవరస్తిష్యక్షేత్రే సముత్థితః॥ ౧౦౬ ॥ గ్రహశ్చాంగిరసః పుత్రో ద్వాదశార్చి ర్బృహస్పతిః। ఫాల్గునీషు సముత్పన్నః సర్వాసుచ జగద్గురుః॥ ౧౦౭ ॥ నవార్చిర్లోహితాంగస్తు ప్రజాపతిసుతోగ్రహః। ఆషాఢాస్విహ పూర్వాసు సముత్పన్న ఇతిశ్రుతిః॥ ౧౦౮ ॥ రేవతీష్వేవ సప్తార్చిస్తథా సౌరిశ్శనైశ్చరః॥ రోహిణీషు సముత్పన్నౌ గ్రహౌచంద్రార్కమర్దనౌ॥ ౧౦౯ ॥ ఏతేతారాగ్రహాశ్చైవ బోద్ధవ్యాభార్గవాదయః। జన్మనక్షత్రపీడాసు యాంతివైగుణ్యతాంయతః॥ స్పృశ్యంతే తేనదోషేణ తతస్తాగ్రహాభుక్తిషు॥ ౧౧౦ ॥ సర్వగ్రహాణామేతేషా మాదిరాదిత్య ఉచ్యతే। తారాగ్రహాణాం శుక్రస్తు కేతూనాంచైవ ధూమవాన్॥ ౧౧౧ ॥ ధ్రువః కాలోగ్రహాణాంతు విభక్తానాం చతుర్దిశం। నక్షత్రాణాం,శ్రవిష్ఠా స్యాదయనానాం తథోత్తరమ్॥ ౧౧౨ ॥ వర్షాణాంచాపి పంచానామాద్యః సంవత్సరః స్మృతః। ఋతూనాం శిశిరంచాపి మాసానాం మాఘఏవచ॥ ౧౧౩ ॥ పక్షాణాం శుక్లపక్షస్తు తిథీనాం ప్రతిపత్తథా। అహోరాత్రవిభాగానా మహశ్చాపి ప్రకీర్తితం॥ ౧౧౪ ॥ ముహూర్తానాం తథైవాది ర్ముహూర్తో రుద్రదైవతః। అక్షిశ్చాపి నిమేషాదిః కాలః కాలభిదో

వతః॥ ౧౧౫ ॥ శ్రవణాంతం శ్రవిష్ఠాది యుగంస్యాత్ పంచవార్షికం। భానోర్గతి విశేషేణ చక్రవత్ పరివర్తతే॥ ౧౧౬॥ దివాకరః స్మృతస్తస్మాత్కాలస్తం విద్ధి చేశ్వరం। చతుర్విధానాం భూతానాం ప్రవర్తక నివర్తకః॥ ౧౧౭ ॥ ఇత్యేషజ్యోతిషామేవ సన్నివేశోఽర్థనిశ్చయాత్। లోకసంవ్యవహారార్థమీశ్వరేణ వినిర్మితః॥ ౧౧౮ ఉత్పన్నః శ్రవణేనాసౌ సంక్షిప్తశ్చధ్రువే తథా। సర్వతోంతేషు విస్తీర్ణో వృత్తాకార ఇతిస్థితిః॥ ౧౧౯॥ బుద్ధిపూర్వం భగవతా కల్పాదౌ సంప్రకీర్తితః। సాశ్రయః సోఽభిమానీచ సర్వస్యజ్యోతిరాత్మకః। విశ్వరూపః ప్రధానస్య పరిణామోఽయ మద్భుతః॥ ౧౨౦ ॥ నైవశక్యం ప్రసంఖ్యాతుం యాథాతథ్యేన కేనచిత్। గతాగతం మనుష్యేషు జ్యోతిషాం మాంసచక్షుషా॥ ౧౨౧ ॥ ఆగమాదనుమానాచ్చ ప్రత్యక్షాదుప పత్తితః। పరీక్ష్యనిపుణం భక్త్యాశ్రద్ధాతవ్యా విపశ్చితా॥ ౧౨౨॥ చక్షుః శాస్త్రం జలం లేఖ్యం గణితం బుద్ధిసత్తమాః। పంచైతే హేతవో జ్ఞేయా జ్యోతిర్గణ విచింతనే॥ ౧౨౩ ॥ ఇతిమహాపురాణే వాయుప్రోక్తే జ్యోతిః సన్నివేశోనామ త్రిపంచాశోఽధ్యాయః॥

కాలకర్మలచే సృష్టి రెండువిధములుగఁ బరిణమించెను. మొదటిది ఆత్మ నుండి క్రమవిధ విరాట్బ్రహ్మలసృష్టి. రెండవది త్రివిధగుణ బ్రహ్మసృష్టి. ఇవిస్వాభావికములు. సృష్టికిఁ బ్రతిసృష్టిగాఁ గారణాంతములచే, విశ్వామిత్ర మహర్షి తపోబలముచే మఱియు సృష్టిచేసెను. అందుచేత మరల బ్రహ్మసృష్టి, విశ్వామిత్రసృష్టియని సృష్టి రెండువిధములు ఈకారణాంతరములచేత సృష్టివివరమును, గాలవివరమును బ్రారంభక్రమమును దెలియుట బహుకష్టసాధ్యమై యోగదృష్టి లేమింజేసి నేటి శాస్త్రజ్ఞులిష్టానుసారము సిద్ధాంతము చేయఁగలిగిరి. దీనిఁ గనిపెట్టవలసినచో వేదములను, శాస్త్రములను, పురాణములను బూర్తిగా శోధించినఁగాని తెలియనేరము. వేదములను విచారించినచో సృష్టి అనంతపర్వత రాశిగానున్నదందురు. శాస్త్రపురాణాదులం దటులనేయున్నది. ఇవన్నియును కేవల సంస్కృతభాషలో దుర్గ్రాహ్యములుగనున్నవి. దీనిఁగన్గొనఁ దపోబలము, విజ్ఞానబలము శాస్త్ర సాహిత్య జ్ఞానముగావలెను. ఇవన్నియుఁగలుగుటకు మానవాయుస్సెంతమాత్రముజాలదు. అందుచేత నెవరుకాలముచేత ప్రబలులగుదురో వారలసిద్ధాంతము తాత్కాలిక సిద్ధాంతములగుచుండును. ఇవిసిద్ధాంతములుగావని నిరూపించి చెప్పుటకు మన వేదశాస్త్ర పురాణాదులను మనము సంపూర్ణముగఁ దెలిసినవారలముకాకపోయితిమి. ఏస్వల్పమో చదివినంతమాత్రముతో సిద్ధాంతముచేయఁజాలము. ఈలాగున నుండుటచేత

సృష్ట్యాదిని కాలప్రళయాదిని వితరాదులను స్పష్టముగ దెలియుటచాల దుస్తరము. ఇందుకుఁగారణముగా నీక్రింద నొక చారిత్రిక విధానమును దెలియఁజేయుచున్నాను. ఇది ప్రమాణప్రసిద్ధము

ఈబ్రహ్మాండములో నప్పడప్పుడు ప్రజాపతి బ్రహ్మలచేఁ బ్రళయానంతర మందును, కల్పాంతరమందును. మన్వంతరములందును కశ్యపాది బ్రహ్మలచే సృష్ట్యారంభమగుచుండును. అందుచేత సూర్యాది నవగ్రహములు, నక్షత్రతారలు ధ్రువములు సర్వసృష్టియుఁ గశ్యపాది ప్రజాపతులచేఁ బ్రతికల్పమునందును మార్పు లగుచుండును. ప్రకృతము మనకగపడుసూర్యుఁడు కశ్యప ప్రజాపతి సంతతిలోఁ జేరినందుచేత కాశ్యపుఁడైనాఁడు. ఇటులనే నవగ్రహములన్నిటినిఁ దెలియవలెను. నక్షత్రములను, కాలారంభముచు నిటులనే ఊహించి గ్రహింపవలెను

కశ్యపప్రజాపతికి భార్యలనేకులుండిరి. వీరలందరికిని సంతానముగలిగెను. వీరలలో అదితి జ్యేష్ఠపత్ని. ఈమెకుఁ గలిగినవారలు అధికారములనుబట్టి ఆదితేయులని, ఆదిత్యులనియుఁ బిలువఁబడిరి. వీరలేదేవతలై రాక్షసులకు శత్రువులై కలహింపఁదొడఁగిరి. వీరలుభయులు కశ్యపసంతతివారలే. తల్లులుమాత్రము భేదము. ఈఅదితియు, దితియు నామమాత్రభేదములతో వాకశ్యపసూర్యునికి భార్యలైరి. చాక్షుషమన్వంతరమునందు విషువద్భచక్రసంపాతము అశ్వినీ నక్షత్రమాదిగ శ్రవణాంతమువరకుఁ బశ్చిమగతిగ నున్నట్లు దృక్సూత్రమునకుఁ గోచరించుచుండెను.

మన్వంతర సంధిగా శేషించిన వైవస్వత మన్వంతరముగాని, ఈవైవస్వతమన్వంతరములో గతించిన యిరువదేడు మహాయుగములు వెనుక యిరువదెనిమిదవమహాయుగములోని కృతయుగారంభముగాని మన్వంతర మహాయుగ సృష్టులలో నేయొకదానికి నైఁగాని ఆరంభకాలమురాగా ఉత్తరధ్రువమునకు బ్రదక్షిణముగఁ దిరుగుచున్న సప్తర్షిమండలము వైదిక జ్ఞానయోగాది సృష్టకర్మలకు ఆధారములుగా బ్రహ్మచేసృజింపబడును. సృష్టిలో విశ్వామిత్రమహర్షి బ్రహ్మసృష్టికిఁబ్రతిసృష్టి దానికెదురుగా దక్షిణదిక్కునఁ జేయదలంచి వైదికములకుఁగొంత చేరికగాను గొంతసాంకర్యములుగను సర్వవిధకర్మలకును బ్రతిసర్గగాఁ జేసెను. ఇందుకుఁ గారణము:- త్రిశంకునకు స్వర్గమునందధికారనిషిద్ధశాపము. శాపానంతర మాతఁడు విశ్వామిత్రునాశ్రయించి అభయమునుబొందెను త్రిశంకుని నిమిత్తమై ప్రతిస్వర్గమును నిర్మించుటకై విశ్వామిత్రుఁడు తూర్పుదిశఁదపమాచరింపగా అప్సరసలచేఁ దపోభంగముగలిఁగెను. అతఁడుమరల దపమాచరించుటకు పశ్చిమదిశఁ జేరెను. అచ్చటను దపోభంగమప్సరసలచేఁ

గలిగెను. ఈలాగున సర్వదిక్కులందు ననేకభంగములుగలిగియుఁ దుదకతఁడు జయమునుబొంది ప్రతిసృష్టినిఁ జేయఁగలిగెను. అందుచేత రెండువిధముల సృష్టియు వైదికములలో రెండువిధముల కర్మాదులకు నవకాశముగలిగెను. ఇందుకు వేదప్రమాణము "ద్వేసృతీ అశృణవం పితౄణాం। అహం దేవానా ముత మర్త్యానాం" అనియు, "యే దేవయానా ఉతపితృయాణా స్సర్వాన్పథో అనృణా ఆక్షియేమ। బహవో దేవయానాః పంథానః।" అనియున్నది. వేదములలో భిన్నమార్గములతోఁ జెప్పఁబడిన కర్మజ్ఞాన కాండద్వయమార్గమునే స్మృతులయందుఁగూడ శ్లో॥ కాండద్వయోపపాద్యాయ కర్మబ్రహ్మస్వరూపిణే। స్వర్గాపవర్గ రూపాయ యజ్ఞేశాయ నమోనమః॥ అపిస్వర్గాపవర్గ నామభేదములుగ ఇహపరలోకములనెడి భేదములుగ విశ్వామిత్ర బ్రహ్మసృష్టులను రెంటిమధ్య పదంబైన యజ్ఞనారాయణ స్వరూపమం దైక్యము జేసినట్లు స్ఫురించుచున్నది. మూడవది బ్రహ్మసాక్షాత్కారమని తెలియవలెను. ఇది భక్తిజ్ఞానవైరాగ్యయుక్తము ఇట్టిస్థితిలోఁ బూర్వమన్వంతరములో యజ్ఞాదికర్మలచే సిద్ధులగు సప్తమహర్షులు మొదలగువారలు దివ్యాధికార పదవులందు నివృత్తిధర్మ మార్గ తత్పరులైనను, ఉత్తరధ్రువ మండలమునకుఁ బ్రదక్షిణ నమస్కారాదులనాచరించి పూజ్యులగుచున్నట్లున్నది. గీతలో "మహర్షయస్సప్తపూర్వే చత్వారోమునయస్తథా" యనియున్నది. మనుష్యజీవ వాసనాంకురము నశించువరకు దక్షిణధ్రువముతప్పదు. ఇది సర్వదా అధోముఖమార్గ గతిగా నెడతెగని పరంపరాప్రాప్తిగాఁ దమోలోకప్రాప్తిగానుండును. త్రిశంకుసృష్టియనగ వేరుగాజెప్పనేల? మననిత్యానుభవములో రాత్రికాలసృష్టిగానున్నదే మహాశ్మశానభావము నొందువరకు దక్షిణధ్రువము అధోముఖ సహస్రకమలము సర్వవ్యామోహితమైయుండును.

దక్షిణధ్రువమండలమునకుఁ బ్రదక్షిణ నమస్కారాదుల నాచరించుచు కన్పట్టగపడుచున్న గ్రహనక్షత్ర తారాగణములు మనకుఁ బూజనీయమగుచున్నవి. అట్టిమానుషోపాసన కొఱకై చాక్షుషమన్వంతరమునందే సూర్యుఁడు ఇంద్రాగ్న్యుభయ దేవతాత్మకమగు విశాఖానక్షత్రమందనగా తులావిషువదయప రాశియందు ధర్మునకుజనించెను ఆకాలమందే కృత్తికయందు శీతరశ్మియగు నిశాకరుడు పదునారుకళలతోఁ బుట్టెను. సూర్యునితరువాత భృగుపుత్రుఁడగు శుక్రుఁడు తారాగ్రహశ్రేష్ఠుఁడై రాక్షసులకు గురుండై ప్రజ్ఞావంతుఁడై పుష్యమీనక్షత్రమందుఁబుట్టెను, అంగిరసుని పుత్రుఁడగు బృహస్పతి ద్వాదశకళాసహితుడై సర్వప్రజలకు జగద్గురుండై ఉత్తరఫల్గునీ నక్షత్రమున సముత్పన్నుఁడాయెను. ప్రజాపతి సుతుఁడగు అంగార

కుండు నవకళాసహితుఁడై పూర్వాషాఢ నక్షత్రమునందు లోహితాంగుఁడుగ నీనుస్వాంతరములో గ్రహాధిపత్యమునం దభిషిక్తుఁడాయెను. సూర్యపుత్త్రుండగు శనైశ్చరుండు సప్తకళాసహితుఁడై రేవతీనక్షత్రమునం దగ్నితత్త్వరూపుఁడై యుద్భవించెను. రోహిణీనక్షత్రమునందు చంద్రార్కపీడితులై ఛాయాగ్రహ రూపులగు రాహుకేతువు లుత్పన్నులై గ్రహాధికారమునుఁబొందిరి. ఈశుక్రాది గ్రహములు వైగుణ్యములతో జన్మనక్షత్ర వైగుణ్యులై తారాగ్రహములుగఁ జెలియఁదగియున్నారు. దీనిచేతనే ఆయానక్షత్ర గ్రహవైగుణ్య పీడా సమయావస్థానులం దుద్భవించిన ప్రజలుగూడ ఆయాగ్రహభుక్తుల దశలందాయా దోషములచే స్పృశింపఁబడుచుందురు. నవగ్రహములకు మొదటిగ్రహ సూర్యుఁడగుటచేత గ్రహరాజని పిలువఁబడుచున్నాఁడు. ఇటులనే తారాగ్రహములకు శుక్రుఁడును ఛాయాగ్రహములలో ధర్మధ్వజులగువారికి తమోగ్రహమగు రాహుగ్రహమును మొదటిగ్రహములు, గ్రహరాజులు, నగుచున్నారు.

నలుదిక్కులందు విభజింపఁబడిన గ్రహములకుఁ గాలచక్రప్రవర్తకుఁడుగా నున్న ధ్రువసూర్యుఁడే మృత్యురూపుఁడగుచున్నాఁడు. ఇటులనే నక్షత్రములకు ధనిష్ఠయు అయనములకు ఉత్తరాయణము, కాలరూపములుగనున్నవి. (మృత్యు రూపములని) ఇటులనే పూర్వముచెప్పఁబడిన పంచసంవత్సరములకు మొదటచెప్పఁబడిన సంవత్సరము, ఋతువులకు శిశిరఋతువు, మాసములకు మాఘమాసము కాలాత్మకములని తెలియవలెను. ఈలాగునే పక్షములకు శుక్లపక్షమును, తిథులకు ప్రతిపత్తిథియు, రాత్రింబగళ్ల విభాగములకుఁ బగటిభాగమును, మారకములని చెప్పఁబడినది. ముహూర్తములకు రుద్రదైవత్యమగు ఉదిత సూర్యముహూర్తమును నేత్రములయొక్క నిమేషాదికాలమును కాలభేదమునకు మృత్యువును లయమునకు గాని, సృష్టికిగాని మొదటిదిగాఁజెప్పబడుచున్నది.

ధనిష్ఠాది శ్రవణాంతముగా సూర్యగతివిశేషమును. బ్రహ్మాదినవవిధ విరాణ్మానములలో విషువద్భచక్ర సంపాతముయొక్క ప్రత్యగ్గతిచే వ్యావహారిక పితృదేవతాకమగు విరాట్ప్రజాపతి గణిత ప్రకారముగా వచ్చినగతిచేఁగాని, వ్యావహారిక పితృమానగతిచేఁగాని, వేదాంగజ్యోతి రయనోక్త గతిచేఁగాని దృక్సిద్ధగణితాగమ ప్రకారముగా ఁబంచసంవత్సరముల సమాప్తికాలమునకుఁ గొంచెము భేదముతోఁ బ్రభవాది వ్యయాంతములో సకలలోకగురుండగు బృహస్పతియొక్క మధ్యమరాశి భోగముగల రాశ్యంతచక్రము నైనపర్యాయముల పరిమితిగల బృహస్పతిభోగము

చేగాని వెనుకఁ జెప్పిన దివ్యమానసోత్తర ధ్రువమండలమును బరివర్తించుచున్న సప్తర్షి మండల క్రాంతిమానముచేఁగాని, ధ్రువసంవత్సరాది పంచబ్రహ్మల విరాణ్మానము లో సంవత్సరాదులు యుగపద్విధిగాఁ గల్పించుటే కల్పితధ్రువసూర్యునిగతి విశేష మగును. ఇట్టిగతివిశేషముచేఁ బంచసంవత్సర పరిమితిగల వ్యావహారికయుగము కాలచక్రమువలెఁ బరివర్తించుచుండును. ఇట్టిచతుర్విధ భూతములలోఁ బ్రవృత్తి ధర్మరతులకుఁ బ్రవృత్తికరుఁడుగను నివృత్తిధర్మరతులకు నివృత్తికరుఁడుగనగు ధ్రువ దివాకరుఁడే కాలరూపుఁడగునని తెలియవలెను. ఇతనినే ఈశ్వరునిగాఁగూడ తెలియ వలెను. ఈలాగున జ్యోతిశ్చక్ర సన్నివేశమంతయు పరార్థనిశ్చయముతో లోకవ్యవహా రార్థముగ ఈశ్వరునిచే నిర్మింపఁబడెను. ఈచెప్పఁబడిన జ్యోతిశ్చక్ర సన్నివేశమంతయు శ్రుతిగోచరమగు శబ్దమాత్రశ్రవణముచే సర్వమును ధ్రువజ్యోతిస్థానమందే లయింపఁ జేయఁబడుచుండును ఈలాగున సర్వతంత్రములందును పారిభాషిక నామరూప ములతో విస్తారముగఁ జెప్పఁబడినది. ఇదే సంసారవృక్షాకారము గలదైయున్నది. ఇదియే మానుషభువనము.

ఇట్లుకల్పాదియందు భగవానుఁడగు విరాడ్బ్రహ్మచేఁ జెప్పఁబడినందుచేత, జ్యోతిరాశ్రయ సహితుడును, జ్యోతిరాత్మాభిమానియు సర్వజగచ్చక్షువునగు నీ విశ్వరూప సూర్యుఁడు మూలకారణప్రధానమగు అవ్యక్తజ్యోతిస్సుయొక్క యద్భు తమగు పరిణామమని తెలియవలెను ఈలాగున సూర్యధ్రువముల విషయమును బ్రకృతము మనకగపడు ధ్రువసూర్యాదిగా ఉత్తరోత్తర సర్వవిరాడ్బ్రహ్మలయందు స్పష్టముగ అత్యధిక భావగుణలక్షణములతోఁ దెలియవలెను. ఈగ్రహనక్ష త్రాది జ్యోతిస్సులయొక్క నిజమగుదివ్యస్వరూప గమనాగమనమును మాంసమయ దృష్టిమాత్రమేగల మనుష్యులు బ్రహ్మదేవుడింతటివాఁడని స్వానుభవ స్వరూ పము దెలియక లెక్కపెట్టిచెప్పుటకును, జూచుటకును బొత్తిగా శక్యముగాదు, కావున శాస్త్రపురాణాదులవల్లను, నూహలవల్లను బ్రత్యక్షములవల్లను దెలిసికొనుట అద్ద ములందు మనరూపమునుజూడఁగలుగు కుడియెడమభాగ భ్రమవలెనగునే కాని వాస్తవమును దెలియనగుడి. వేదోపనిషత్తులచే ఉపాసనాదియోగయుక్తుఁడై భక్తిజ్ఞానాదులచే విద్వాంసుఁడైనచో విశ్వసించునుగాని తదితరులకు శక్యముగాని దని దెలియవలెను. వేరు ఉపాయమే లేదు.

ఈజ్యోతిర్గణ విషయమై (౧)చక్షుస్సు, (౨) శాస్త్రము, (3) బుద్ధిబలము (౪)చిత్రరచనాజ్ఞానము, (౫)గణితము. అనెడియైదుహేతువులలో ఏయొకటి దుర్బల

మైనను అనుభవమునకురాకేరదు. బుద్ధిబలము ప్రధానము ఇంకను విషయవిస్తార ముతో వేదశాస్త్రముల రహస్యము లనేకములున్నవి. విస్తరభీతితో నవకాశ ము లేదు.



## గ్రహాధిపత్యములు.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫3 - పుట. ౮

నక్షత్రాధిపతిః సోమోగ్రహరాజో దివాకరః। శేషాః పంచగ్రహాజ్ఞేయా ఈశ్వరాః కామరూపిణః॥ ౨౯ ॥ పఠ్యతే చాగ్నిరాదిత్య ఔదకశ్చంద్రమాః స్మృతః। శేషాణాం ప్రకృతిం సమ్యగ్వర్ణ్యమానాంనిబోధత॥ 3౦ ॥ సురసేనాపతి స్కందః పఠ్యతేంగారకో గ్రహః। నారాయణం బుధం ప్రాహుర్దేవం జ్ఞానవిదో విదుః॥ 3౧ ॥ రుద్రోవైవస్వతః సాక్షాద్ధర్మోలోకే ప్రభుస్స్వయం। మహాగ్రహో ద్విజశ్రేష్ఠో మందగామీ శనైశ్చరః॥ 3౨ ॥ దేవాసుర గురూద్వౌతు భానుమంతౌ మహాగ్రహౌ। ప్రజాపతి సుతావేతావుభౌ శుక్రబృహస్పతీ। దైత్యోమహేంద్రశ్చ తయోరాధిపత్యే వినిర్మితౌ॥ 33 ॥

సోముఁడు నక్షత్రాధిపతి సూర్యుడుగ్రహరాజు తక్కువగల మైదును రాజ గ్రహములు. వీరలనే కామరూపులగు పంచబ్రహ్మలుగాఁ దెలియవలెను. వీరలె ఈశ్వరులు. మఱియు అగ్నియే ఆదిత్యుడనియు, ఉదకస్వరూపమే చంద్రుఁడనియు జెప్పఁబడుచున్నది. మిగిలినవారలయొక్క ప్రకృతి చక్కఁగా వర్ణింపఁబడినది. దేవసేనాధిపతి స్కందుఁడనియు, అంగారకగ్రహమనియుఁ జెప్పఁబడినది. బుధగ్రహము నారాయణాంశము వివస్వత్పుత్రుఁడగు శనైశ్చరుఁడు సాక్షాద్ధర్మ స్వరూపదేవత. రుద్రాంశముగలవాఁడు. గ్రహములకందరికి నియామకుఁడు. మందగామియగుటచే ద్విజశ్రేష్ఠుఁడై మహాగ్రహమనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. దేవాసురగురువులగు బృహస్పతి శుక్రులిద్దరును . మహాగ్రహములని చెప్పఁబడుచున్నారు. వీరలిద్దరు ప్రజాపతిపుత్రులు. దైత్యేంద్రుఁడు శుక్రునియొక్కయు, మహేంద్రుఁడు బృహస్పతి యొక్కయు ఆధిపత్యములందు నిర్మితులైయున్నారు.

# గ్ర హ స్థా న ము లు.

---

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫3.

సౌరంసూర్యో విశత్స్థానం సౌమ్యం సోమస్తథైవచ॥ ౫౯ ॥ శౌక్రం శుక్రో విశత్స్థానం షోడశార్చిః ప్రతాపవాన్ బృహద్బృహస్పతిశ్చైవ లోహితశ్చైవలోహితః శనైశ్చరం తథాస్థానం దేవశ్చైవ శనైశ్చరః॥ ౬౦ ॥ ఆదిత్యారశ్మిసంయోగాత్ సంప్రకాశాత్మికాస్స్మృతాః॥

—♦ అ ర్థ ము. ♦—

సూర్యతేజస్సే ప్రజఃకస్థానముగను, సూర్యుఁడుగను, సౌమ్యతేజస్సే సోముఁడుగను శుక్రతేజస్సే శుక్రుఁడుగను, లోహితమగు రక్తతేజస్సే అంగారకుఁడుగను, మందగతితేజస్సే శనైశ్చరుఁడుఁగను, నివేస్థానములుగను, శనైశ్చరుఁడే దేవుఁడనియు నీలాగున సూర్యాదిరశ్మిలసంయోగముతో ప్రకాశస్థానములుగా గ్రహములగుచున్నారు. సూర్యప్రకాశభేదములే సర్వగ్రహరూపములు. గ్రహస్థానములు నగుచున్నవి.

—♦ మం డ ల వి స్తా ర ము. ♦—

నవయోజనసాహస్రో విష్కంభః సవితః॥ ౬౧ ॥ త్రిగుణస్తస్యవిస్తారో మండలంచప్రమాణతః। ద్విగుణః సూర్యవిస్తారా ద్విస్తారః శశినః స్మృతః॥ ౬౨ ॥ తుల్యస్తయోస్తు స్వర్భానుర్భూత్వాధస్తాత్ ప్రసర్పతి। ఉద్ధృత్యపృథివీచ్ఛాయాం నిర్మితో మండలాకృతిః॥ ౬3 ॥ స్వర్భానోస్తు బృహత్ స్థానా న్నిర్మితం యత్తమోమయం। ఆదిత్యాత్తచ్చ నిష్క్రమ్యసోమం గచ్ఛతిపర్వసు॥ ౬౪ ॥ ఆదిత్యమేతి సోమాచ్చ పునఃసోమంచ పర్వసు। స్వర్భానునుదతే యస్మాత్తతః స్వర్భానురుచ్యతే॥ ౬౫ ॥ చంద్రస్యషోడశోభాగో భార్గవస్యః ధీయతే॥ విష్కంభాన్మండలాచ్చైవ యోజనాగ్రాత్తు ప్రమాణతః॥ ౬౬ ॥ భార్గవాత్పాదహీనస్తు విజ్ఞేయోవై బృహస్పతిః। బృహస్పతేః పాదహీనా కుజసౌరావుభౌస్మృతా। విస్తారాన్మండలాచ్చైవ పాదహీనాస్తయోర్బుధః॥ ౬౭ ॥

తొమ్మిదివేలయోజనములు సూర్యవిష్కంభము, దీనికిమూడురెట్లు సూర్యమండలప్రమాణము (౨౭౦౦౦) సూర్యునికంటె రెండురెట్లధికము విష్కంభమండలప్రమాణము సోముఁడుగలవాడనియుఁ (౧౮౦౦౦) జెప్పబడును. వీరిద్దరికి సమానపరి

## (4) గ్రహకక్ష్యలను మండలాదులను దెలుపు చిత్రపటము.

పైనున్న శింశుమారపృచ్ఛ ముత్తరధ్రువమునంటియున్నది. మత్స్యాకార మున నున్నది శింశుమారము. దానిఁజుట్టియున్నవి మేషాది పండ్రెండురాసులు. ఈరాసులు గ్రహములకక్ష్యల వరుస ననుసరించి యిరుపార్శ్వములందు సమానవరుసలుగ నొకదానికొకటికెమరుగ గ్రహసంబంధరాసులు, రాసులనామములు వ్రాయఁబడియున్నవి. శింశుమారగతితో రాసులు సహితము దిరుగుచుండును. రాసులకాధారము నక్షత్రములే. గుండుసున్నలుగానున్నవి గ్రహములనియు. గ్రహములమధ్యలో నుభయపార్శ్వములందు బాణాకారపుగుర్తులున్న దంగారక గ్రహమండలమనియుఁ దెలియవలెను. పృథివి కంగారకుఁడు మధ్యగ్రహము. అందుచేతనే పుణ్యాహవాచనలో శుక్రాంగారక బుధాదిగాఁ జెప్పుట కొకకారణము. దేనిని మధ్యగ్రహముగా నుంచుకొనదలతుమో దానినుండియు నారంభించవలెను. సర్వమూలమాదిత్యుఁడు. ఎటులచెప్పినను సందర్భానుసార మధిదైవతముగా నుంచుకొనవచ్చును. పృథివికిని నంగారకునకిని సంబంధములున్నవి.

(1) శింశుమారగతి దిశను దెల్పును, (2) శింశుమారోత్తరార్ధదిశా (అంతర్వలయము) భాగముత్తరాయణము. ఇది దేవతలకుఁ బగలు. (3) దక్షిణాయన సంధి, (4) రాశిచక్రవలయము. (5) రవిమండలము, (6) గ్రహకక్ష్యల వరుసలను దెల్పును. (7) శింశుమారమధ్యగల వియన్మార్గము, (ఆకాశగంగ) (8] రాహుకేతువుల మండలము గ్రహగతి, (9) శుక్రమండలముగ్రహగతి (10) బుధమండలముగ్రహగతి, (11) శింశుమారార్ధభాగ దక్షిణదిశ (బాహ్యవలయము) దక్షిణాయనము. ఇది దేవతలకు రాత్రిసంజ్ఞ, (12) సోమమండలము గ్రహగతి, (13) భూమికుపగ్రహమై పంచదశకళాత్మకమై వృద్ధిక్షయయుతమైయున్న చంద్రమండలము గ్రహగతి, (14) మనమున్నపృథివి, ఇందులో స్వచ్ఛమైన భాగార్ధముపగలు. ఇదిసూర్యదిశ మలినభాగార్ధము రాత్రి. ఇది వరుణ (అగ్ని) దిశ, (15) మన దక్షిణధ్రువమున కగస్త్యుఁడధిపతి. కల్పములచేఁ గారణాంతరములతో మార్పులగుచుండును. వేదప్రమాణము "అగస్త్యః ఖనమానః ఖనిత్రైః ప్రజామపత్యం బలమిచ్ఛమానః। ఉభావర్ణా వృషిరుగ్రః పుపోష సత్యాదేవేష్వాశిషో జగాయ" ధ్యానశ్లోకములోగూడ 'దక్షిణాశాపతిం' అనియున్నది. ఇందుకుఁ బురాణములలో శివకల్యాణ చరిత్రములో నగస్త్యులవారిని దక్షిణదిశకుఁ బంపినట్లుగను అతఁడచ్చటనే ధ్రువముగానిలిచి భూభారమును వహించి సంరక్షించు చున్నాఁడనియుగలదు. ఇదియొక పురాణగాథ. కొన్నిసందర్భములతోఁ బ్రమాదము

లోకప్పుడు సంభవించును అపుడీలాగున నధికారుల నియమించుట స్వాభావికము. ధ్రువమనునది పదముగాని యధిష్ఠాతల పేరుగాదు. ఇది వాయుభూతాంశము. ఈ వాయువుక్రిందను బైనను సహజముగ సర్వత్ర యావరించియున్నదనుట సర్వవిదితము. నిర్వివాదము. ఇదే మహత్తు. మహర్లోకము. త్రివర్గములకుభయ ధ్రువములుగనున్నది. వాయువే సర్వాధార సర్వాధిష్ఠాన నిలయభూతధ్రువము.

---

మాణముగలిగి భూమికిఁగ్రిందుగా రాహుచ్ఛాయామండలము (స్వర్భాను) తిరుగుచున్నది. పృథివీచ్ఛాయ ననుసరించి మండలాకృతిగా రాహువునిర్మింపఁబడెను. బ్రహ్మస్థానమగు నారాహుమండలమువలన నిర్మింపబడిన యేతమస్సుగలదో యది పర్వములయందు సూర్యునివలన విష్క్రమించి చంద్రునిఁ బొందుచుండును. దీనికే గ్రహణమనెదరు. మఱల సోమునివలన ఆదిత్యునిఁ బొందుచుండును. ఈపరివర్తనముతో నుభయులను బొందుచుండును. స్వయం ప్రకాశముచే నెందువలనఁ బీడించుచుండునో అందుచేత నారాహువు స్వర్భానుఁడని పిలువఁబడుచున్నాడు. శుక్రగ్రహముయొక్క పదునారవభాగమే చంద్రుఁడని విధింపబడుచున్నాఁడు. విష్కంభమునుండియు, మండలమునుండియు ప్రమాణమువలన యోజనాగ్రముగలవాఁడై చంద్రుఁడగుచుండెను. శుక్రునికంటె విష్కంభ మొకపాదము బృహస్పతి తక్కువ పరిమాణముగలవాఁడగుచున్నాఁడు. బృహస్పతికంటె కుజశనైశ్చరులిద్దరును పాదము తక్కువగాఁగల వారలగుచున్నారు. ఆకుజశనైశ్చరులకంటె విష్కంభవిస్తారము మండలాకృతియు పాదముతక్కువగ బుధగ్రహమున్నది. పాదమనగా నాలుగింట నొకభాగము. విష్కంభమనగ విస్తారము.



# మండలాదులు.

శ్రీవాయుపురాణము - అధ్యా, 53 - పుట ౮౦.

సూర్యాచంద్రమసార్దివ్యే మండలే భాస్వరేఖగే। జ్వలత్తేజోమయే శుక్లేవృత్త కుంభనిభేశుభే। ౫౮ ॥ ఘనతోయాత్మకం తత్రమండలం శశినఃస్మృతం। ఘనతేజోమయం శుక్లం మండలం భాస్కరస్యతు। ౫౭ ।

సూర్యచంద్రుల భాస్వరములగు దివ్యమండలములాకాశమందు సంచలించుచున్న తేజోరూపములై వర్తులాకారమగు కుంభాకారముగలిగి శుక్లవర్ణములుగఁ జెప్పఁబడుచున్నవి మేఘజలాత్మకములగునవి చంద్రమండలముగను, మేఘతేజోమయశుక్లవర్ణముగాఁగల మండలము సూర్యమండలముగను నున్నవి.

—o—

# గ్రహమండలములు.

శ్రీవాయుపురాణము - అధ్యా. ౫౩ - పుట ౮౬..

తథాసర్వగ్రహాణాం స సూర్యోఽధస్తాత్ ప్రసర్పతి॥ ౯౫ ॥ విస్తీర్ణం మండలంకృత్వా తస్యోర్ధ్వం చరతేశశీ। నక్షత్రమండలం కృత్స్నం సోమాదూర్ధ్వం ప్రసర్పతి॥ ౯౬ ॥ నక్షత్రేభ్యో బుధశ్చోర్ధ్వం బుధాదూర్ధ్వం బృహస్పతిః। తస్మాచ్ఛనైశ్చరశ్చోర్ధ్వం తస్మాత్సప్తర్షిమండలం॥ ఋషీణాంచైవ సప్తానాం ధ్రువఊర్ధ్వం వ్యవస్థితః॥ ౯౭ ॥ ద్విగుణేషు సహస్రేషు యోజనానాం శతేషుచ। తారాగ్రహాంతరాణి స్యురుపరిష్టాద్యథాక్రమమ్॥ ౯౮ ॥ గ్రహాశ్చచంద్రసూర్యౌతు దివిదివ్యేనతేజసా। నిత్యమృక్షేషు యుజ్యంతి గచ్ఛంతినియమక్రమాత్॥ ౯౯ ॥ గ్రహనక్షత్రసూర్యాస్తు నచోచ్చంమృద్వవస్థితాః। సమాగమేచ భేదేచ పశ్యంతియుగవత్ ప్రజాః॥ ౧౦౦॥ పరస్పరస్థితాః హ్యేతేయుజ్యంతేచ పరస్పరమ్। అసంకరేణ విజ్ఞేయస్తేషాం యోగస్తువైబుధైః॥ ౧౦౧ ॥ ఇత్యేషసన్నివేశోవః పృథివ్యాం జ్యోతిషస్యచ। ద్వీపానాముదధీనాంచ పర్వతానాంతథైవచ। ౧౦౨ ॥ వర్షాణాంచ నదీనాంచ యేషుతేషు వసంతివై। ఏతేచైవ గ్రహాఃపూర్వం నక్షత్రేషు సముత్థితాః॥ ౧౦౩ ॥

సర్వగ్రహములకుఁ గ్రిందుగా సూర్యుఁడు తిరుగుచున్నాఁడు సూర్యుని కుపరి భాగమందు సోముఁడు మండల విస్తీర్ణముతో సంచరించుచున్నాఁడు. సర్వనక్షత్రములు నక్షత్రమండలములు నాసోమునికంటెపైన నడుచుచున్నవి. నక్షత్రములకుఁ బైభాగమందు బుధుఁడును, బుధునికిఁబైన బృహస్పతియు, బృహస్పతికిఁబైన శనైశ్చరుండు, శనైశ్చరునికిఁబైన సప్తర్షిమండలము, సప్తర్షిమండలమునకుఁబైన మూలధ్రువుండును వ్యవస్థితులై యీలాగున శింశుమార చక్రములోఁ దిరుగుచున్నారు. నక్షత్రరూపము గు ఇతరనక్షత్రములు రెండువందల యోజనముల దూరమునఁ దిరుగుచున్నవి. ఈలాగున గ్రహముగ నన్నియును దిరుగుచున్నవి. గ్రహములును జంద్రసూర్యులను ఆకాశమందు (శింశుమారమందు) దివ్యతేజస్సుచే నక్షత్రములందు నిత్యమునుగూడుకొని సంబాధము గలవారలై క్రమనియమముతో నడుచుచున్నారు. గ్రహరూపనక్షత్రసూర్యులు (Solars) నీచోచ్చములు గలుగునట్లుగా మృదుగమనము గలవారలైయున్నారు. గ్రహసమాగమమందును, గ్రహభేదములందును ఒక్కమారుగఁ బ్రజలను జూచుచుందురు. ఇట్లు

పరస్పరము నీగ్రహములు యోగము నొందుచుండును. ఈ గ్రహములయొక్క పరస్పర యోగము విద్వాంసులచే సాంకర్యము లేకయే తెలియఁదగినది. ఈప్రకారము నీసన్నివేశము, బృథివియందున్నవారలకుఁ గనబడుచున్నది. జ్యోతిస్సన్నివేశముచే (ఉనికి) ద్వీప సముద్ర పర్వత వర్షములు ఆయానామ రూపాదులతో నుండు గ్రహములే పూర్వకల్పమందును నక్షత్రరూపస్థానములయందు బయలుదేరినవి. అనఁగానాయాకర్మ ఫలానుసారము అధికారములకు వచ్చుచుండును. అందుచేతనే ప్రతికల్పమునందు నీస్థానాధికారులు మార్పులు చెందుచుందురు. క్రొత్తవారు అధికారులై వచ్చుచుందురు. వీరలే నక్షత్రప్రకాశరూపులు.

—o—

# గ్రహకక్ష్యల వివరము.

శింశుమారములో మనకనంతదూరములోఁగల గ్రహకక్ష్యలను మనమచ్చటినుండిచూచి గ్రహించి నిర్ణయించుటలోఁ జాలభేదములుండును. సర్వమునకు భ్రమణ గొప్పప్రమాదకరమగు అభిప్రాయభేదములకు నొకముఖ్యకారణము ఈబ్రహ్మాండములో సర్వమునకు భ్రమణతప్పనిదై యున్నందుచేత నుభయభ్రమణలతో నూహించి చెప్పినవన్నియు భ్రమణలేయగును. సిద్ధాంతమెప్పటికిఁగానేరదు. సృష్టిస్థితిలయాద్యంతమందును భ్రమతప్పకయుండి సర్వమును భ్రమింపజేయుచున్నది. మూలకారణ ప్రకృతికే భ్రమణయుండగాఁ దజ్జన్యములకెల్లు లేకపోవును. అధ్యారోపాపవాదములతో సర్వదా నిండియున్నది. ఎవరుచెప్పిన నూహించియున్నవారలే గాని ప్రత్యక్షముతోఁజూచి యాస్థలమునుజేరి చెప్పువారలులేరు. కల్పితసాధనాంతరములతో నిచ్చటినుండి భ్రమణదృష్టితో భ్రమణగానున్నవాటిని సిద్ధాంతమని చెప్ప సాహసించుట సామాన్యమగును. మనము స్వయంవేత్తలముకాము. ఇదివరకు గొన్నిశాస్త్రములనుజూచి మనస్సున నిరాధారముగ నాలోచించిచెప్పవలసినవేకాని యచ్చటికిఁబోయి ప్రత్యక్షముగఁజూచి కొంతకాలముండి తెలుసుకొని మరల వచ్చినవారలముగాము. మనశాస్త్రములు అనాదిగ కల్పారంభమునుండి కల్పాంతమువఱకుగూడనుండి శాశ్వతములైనవి వేదములు వానికాధారములు. అపౌరుషేయములగు అట్టివియుండియు మరల నచంచలమగు యోగదృష్టితోఁ గల్పాంతజీవులును, సర్వలోకసంచార వేత్తలునునగు మహర్షులచేఁ గాంచఁబడి వ్రాయఁబడిన

శాస్త్రపురాణాధారములతో నెవరైనను జెప్పవలసినదే. ప్రకృత మీజన్మములో స్వయంవేత్తలెప్పటికినిఁ గానేరరు. వెనుకటిజన్మాంతర వాసనలులేనిదే తుదకు మాటలుగాని క్రియాకర్మాదులుగాని స్వయముగా నెప్పటికిని బొత్తిగా నేర్చుకొనఁ జాలము.

మనమున్న లోకములోని విషయాదుల సిద్ధాంతముచేసి చెప్పలేనివారలు దూరములో నున్నవాటిని సిద్ధాంతముచేసి చెప్పుట యెంతటిదో తెలియనేరము. ఇందుకుఁ గారణము భ్రమయే. ఇందుకుసాధనములగు యంత్రదర్పణాదులు మనచేఁ గల్పితములు. జడములు. వాటికి స్వయంశక్తిలేదు. మరల మనమే చేరి చూచి యూహించి చెప్పవలెనేకాని యవిచెప్పలేవు. విరాడ్బ్రహ్మాండమున మనుజసామాన్య కర్మచక్షువులకుఁ గానరానంత సూక్ష్మాతి సూక్ష్మము లనంతములైయున్నవి. వాని నఖండయోగ చక్షువులుగాన నగునేకాని యితరసాధనాదులతో నశక్యము. మహర్షు లతీంద్రియులై తపోమహిమ యోగశక్తిగల్గి జ్ఞాననేత్రము దెరిచి యున్నచోటినుండియే సమస్తముగాంచఁగలిగినవారలు. కాననే మహర్షుల సిద్ధాంతములు ప్రసిద్ధములై సప్రమాణములైయుండగా వాటియాధారములతో మనముదెలుసుకొన వలయు ననుటే ముఖ్యతీర్మానాంశము. సర్వులకు వేదము మూలము. తరువాత మహర్షుల సిద్ధాంతములు. అట్టిమహర్షులు ఆదిసృష్టిలోఁ జేరిన వారలు మనభరతభూమి నివాసులే. అనాదిసంబంధ సన్నిహితులు. మనకును వారికిని అనాదిగ సర్వసంబంధము లున్నట్టు లనేకచరిత్రములు, పురాణములు, క్షేత్రతీర్థములు, అరణ్యములు, నివాస పర్వతములే అనుభవసిద్ధాంతములుగ నున్నవి.

సర్వమునకుఁ బరమావధిగ సత్య నిత్య శాశ్వత సచ్చిదానందాత్మయుండగా నట్టివిచారములేక అశాశ్వతములు కల్పితములునగు వానితో సిద్ధాంతనిశ్చయ జ్ఞాన దృష్టితో ఆజన్మాదులవధిగా దీనియందే శ్రమించి వృథాకాలహరణముచేసి జన్మాదులవ్యర్థపరచి ఈ వాసనలతో నీలోకమందే మరల పలుమారు పుట్టనేల, కొంతవఱకుఁ దెలిసిఁజాలునని అధ్యాత్మదృష్టితో నేల ధన్యులుగారాదని నావిన్నపము.

శింశుమార భ్రమతోను, గ్రహముల భ్రమతోను, మనభ్రమతోను, గ్రహములు నొకప్పుడు దక్షిణపార్శ్వములందును నొకప్పు డుత్తరదిక్కోర్ధ్వభాగమునను, నొకప్పుడు సమానముగను నీలాగునఁ దిరుగుచుండును గ్రహములన్నిటికిని సమాన స్థిరగతులులేవు. శని ముప్పదిమాసముల కొకరాశియందుండి యన్నిటికంటె

నూర్ధ్వములో నున్నాఁడు. గురువు. సంవత్సరమునకొకరాశి మార్పుతో శనిక్రింద నున్నాఁడు. అంగారకుఁడు మూడుపక్షముల కొకరాశిమార్పుతో గురువునకుఁ గ్రింద నున్నాఁడు. ఈగ్రహములు మనభూమికి నుత్తరపార్శ్వములో నుత్తరదిశన నున్నవి. అంగారకునకి సరిగా సూటిగ మనభూమి మిత్రావరుణుల మధ్యలో నున్నది. దీనినిఁ బట్టియే కుజునికి భూమికిని సంబంధమెక్కువని చెప్పుటకుఁ గారణము. ఈలెక్కలో భూమికి దక్షిణ పార్శ్వమున అంతరిక్షమున శింశుమారములో శుక్ర, బుధ, నక్షత్ర, చంద్రసూర్యమండలాగాఁ లున్నవి. సర్వము ఉత్తర ధ్రువమునుండి దక్షిణధ్రువము వఱకు ఏటవాలుగనున్నవి. ఈలాగున నొకదానిక్రింద మరొకటి కక్ష్యలుగా ఏటవాలుగా నుండుటచేత మనమాపుతో కక్ష్యలను నిర్ణయించి చెప్పలేము. శుక్ర, బుధ, సూర్యులు మాసమున కొకరాశిని దాటుచుందురు. వీటినిఁబట్టి మనశింశుమారములోఁజూచి సిద్ధాంతీకరించలేము. గ్రహసంచారగతులు సమానకాలావధితో లేవు. కాలగతి భేదములుగ నున్నవి. గ్రహగతులు రాశిభేదములనుబట్టి భూమికి దక్షిణదిశలోఁ గ్రిందుగను, ఉత్తరదిశలోఁ బైనను నగపడును. ఈరాసులు ఉత్తరాయణదక్షిణాయన భేదములతో ఉత్తరదిశ నారురాసులును, దక్షిణదిశ నారురాసులున్నవి. గాన గ్రహకక్ష్యలకు గ్రహగతులకును, రాసుల ప్రవేశభేదములతోను, శింశుమార భేదముతోను గ్రహకక్ష్యలు మనము నిర్ణయించి చెప్పలేము. చంద్రకక్ష్యను నిర్ణయించి చెప్పలేము. ఇదిమనకుఁ బ్రతిదినము ప్రత్యక్షముగనుండు గతిక్రమము. మార్పునుగొంతవఱకు సామాన్యముగఁ దెలుసుకొననగును. సుమారు రెండుదినములు నెన్మిది గంటలును ఖాతికకొకతూరి రాశిభేదము గలుగుచుండును. చంద్రగతిని నీరాశిభేదముతోను, నతిసూక్ష్మదృష్టితోను మనము ప్రతిదినము కనిపెట్టి చూచినచో నొకప్పుడు మనకు గ్రిందుగా దక్షిణదిశయందును మరొక్కపుడు మనకుత్తరమున ఊర్ధ్వముననను, మరొకపుడు మనకునేరుగా సంచరించుచున్నట్లుండును మనమున్నభూమి చంద్రునికంటె నతివేగముగ దినమునకొకతూరి స్వప్రదక్షిణము జేయుచుండును. ఈలాగున శింశుమారగతితోను, రాసులగతితోను, అయనభేదములతోను, గ్రహస్థితిగతి భేదములతోను, భూభ్రమణతోను. శింశుమారము ఏటవాలుగానుండుటచేతను, భూమియు నేటవాలుగనుండుటచేతను భేదభ్రమణలతో మన అన్నిటికంటె గ్రిందనుండి పైనున్నవాటిని, అనంతయోజనోన్నతములోనున్న కక్ష్యలను నిశ్చయించుట చాలకష్టముగ నుండును.

చంద్రకక్ష్య నిర్ణయించుటలో జాలయోచన చేయవలయును. కొందఱు

చంద్రకక్ష్యసూర్యునికంటె గ్రిందుగా నున్నదందురు. గీతలో "నక్షత్రాణామహం శశీ"యని యున్నది. నక్షత్రములు సూర్యునిపై కక్ష్యలోనున్నందుచేత చంద్రుఁడు వీటిసంబంధముతో నున్నాఁడని చెప్పవలెను. అప్పుడేచంద్రుఁడగును? ఈచంద్రుఁడు షోడశీకళాత్మక ధ్రువచంద్రుఁడుగా అతీతునిగా గ్రహించినఁగాని గీతావాక్యము సమన్వయముగాదు. మనకు వృద్ధిక్షయాత్మిక నిత్యచంద్రుడు పైషోడశీ ధ్రువకళాత్మిక చంద్రుఁడు సూర్యునియందు బ్రతిఫలించి అంతరమందుఁజేరియుండిన ప్రతిబింబిత రూపకళాత్మిక పంచదశీకళాస్వరూపుఁడను చంద్రుఁడు సూర్యునిక్రిందుగఁ బ్రతిబింబితుఁడై యుండవచ్చునని తెలియవలెనుఁగాని ధ్రువచంద్రునిగా నిశ్చయింపరాదు. షోడశీకళతో సూర్యతేజస్సు మూలములోఁజేరి తేజోభూతసూర్యుని కుపరిలో నున్నదే గీతాప్రమాణచంద్రుఁడు. క్రిందనున్నచంద్రుఁడు జలభూతములో ప్రతిబింబితాంశోభయ మిశ్రిత కళాయుతుఁడై మనకు నిత్యము వృద్ధిక్షయము గనిపించుచున్నాఁడు. అమావాస్యనాఁడీ చంద్రశేషకళాంశములతోఁ సూర్యునియందు శేషించునను ప్రమాణమే ప్రత్యక్షప్రమాణము. ఇదే కుహూకళ. ఇదిసూర్యునిపైనున్న షోడశీకళాంశ ధ్రువకళాంశముగాన సూర్యునియందుండును. ఇంకను దీనివివరములు ప్రత్యేకించి చిత్రపటముతోఁగల వివరములను జూచినఁ దెలియును

మనకుఁ బరిమాణకాలభేదముతో మాసభేదములు సంవత్సరభేదములు లోకాదుల ననుసరించి గ్రహగతిననుసరించిన మానభేదములతో "పంచసంవత్సరమయుం"అని యున్నది. ఆలోచించినఁ బ్రతిదానికిని భ్రమణయుండినగదా కాల పరిణామ గతితో మాససంవత్సర భేదములగును? భ్రమణభేదములే లేనిచో సర్వత్ర సర్వలోకాదుల కొకేకాలపరిమాణ మానమే సమముగా నుండవలెనేకాని భేదములేల యుండవలెను? ఈ ప్రకారము చంద్రునిఁ బ్రతిదినము మాసకాలము చూచినచోఁ గొన్నిగ్రహములకు దక్షిణదిశను, మరికొన్నిగ్రహముల నుత్తరదిశ నున్నట్లు ప్రత్యక్షముగఁ జూడగలము. అన్నిగ్రహములను నీలాగునఁ జూచినఁ గొంతవఱకు విశదముకాఁగలదు. కాని దీర్ఘకాల పరిణామముతోఁ దిరుగుచున్న గ్రహముల చలనమును స్థితిని సవిమర్శగఁ గనిపెట్ట లేనందుచేత నిశ్చయింపఁజాలము. ఒకగడియారములో సెకండ్లముంటి గతిని బాగుగఁజూడగలుగుదుము. నిమిషముల ముంటినిఁ గొంతవఱకు గనిపెట్టసాధ్యమగును. గంటలముఁటిగతినిఁ గనిపెట్టలేనంతటి మందగతితో నది జరుగుచుండును. దీనికిభిన్న దినవారముల ముండ్లగతిని బ్రాంతిగాగని

పెట్టలేము. ఈలాగున గ్రహగతులతో గ్రహకక్ష్యలను విమర్శించి కనిపెట్టుట కష్టతరము.

పంచభూతముల కక్ష్యలుగూడ నీలాగుననే సూటిగ లేక నొకపార్శ్వమునం దొకభూతము మరల మరొకపార్శ్వమునం దొకభూతము నున్నది. పృథివీభూతము మాత్రము అన్నిటికి మధ్యలోనున్నది. దీనికిసూటిగ వాయుభూతధ్రువమున్నది. తూర్పునం దేజోభూతము (సూర్యుఁడు) పశ్చిమమున జలభూతము (వరుణుఁడు) న్నది. ఇవే రాత్రింబగళ్లకు ముఖ్యకారణములు. పృథివి అంత్యభూతమగుటచేత నుభయ మధ్యలో ధ్రువునకు సూటిగనున్నది. దీని కితరభూతములు గ్రహము లిరుపార్శ్వము లందుఁగలవు. సూర్యుఁడే పృథివీరూపము పృథివికిని సూర్యునకిని సంబంధ మెక్కువగా నుండుటచేతనే సూర్యాంశయే పృథివియందు అగ్నిరూపప్రధానముగ నున్నదని వేదశాస్త్రములందుఁగలదు. కాన అగ్నిప్రధానముతో సర్వకర్మల నాచరింపఁజేసిరి. విజ్ఞానశాస్త్రరీత్యా పృథివీభూత మేర్పడుటకు సూర్యుఁడే (అగ్నే) ముఖ్య కారకుఁడు. ప్రాతస్సంధ్యలో మిత్రప్రార్థనయు సాయంసంధ్యలో వరుణప్రార్థనయు నున్నది. తమోలోకమే పృథివీరూపము. అగ్నిప్రధానమైనది. వరుణునితో రాత్రి ప్రధానముగనున్నది. ప్రాతస్సంధ్యోపస్థానములోని ప్రమాణ వేదవచనము "మిత్రో దధార పృథివీ ముతద్యామ్" అని వేదములు బ్రహ్మాండముల సృష్టికిఁబూర్వమే వేద గర్భములో నీసర్వము నిమిడియున్నందుచేత సృష్టికర్త బ్రహ్మకు శబ్దరూపముతోను, తపోరూపముతోను, జ్ఞానరూపముతోను తన అంతరములోనుండి స్ఫురించెను. కావుననే యవి యపౌరుషేయము. "ధాతా యథాపూర్వ మకల్పయత్" ఈ వేదశబ్దోత్పత్త్యనంతరము బ్రహ్మ పంచభూతముల సహకారముతో సూక్ష్మస్థూలసృష్టినిఁ జేసెను. సర్వమునకు వేదము మూలకారణము. వేదములో లేనిదేదియును లేనేలేదు. తక్రమును వాడుటకంటె దీనికి మూలమగు అమృతస్వరూప మాధుర్య క్షీరమును వాడుట మేలుకదా! అందుచేత సర్వమూలమగు వేదమును దెలిసికొనుటే యుత్తమము. ఇట్టిసర్వవేదములను దెలిసి మనమహర్షు లనేక స్మృతిపురాణాదులను లోకహితార్థములుగ వెలయింపఁజేయ నవి రత్నాకరములైయుండగా భ్రమతో ఆధునికములు - ప్రమాణము లెప్పటికైన నగునా? తగునా? కొన్నిసందర్భములలో నెన్నియో అవకతవకలుగా నూహించి తోచినట్టు వ్రాసిన వెన్నిలేవు. వారితత్త్వములో ముఖ్యమైన ఉపాసనలేదు. యోగములేదు. ఆధ్యాత్మికసృష్టిగాని జ్ఞానముగాని బొత్తిగాలేదు. సర్వము కేవల ప్రకృతి ప్రత్యక్ష ప్రమాణమునే

భోగ్యముగా నున్నవారలైరి. ప్రకృతి నిత్యప్రళయ ప్రమాద దుఃఖ స్వరూపమని ఇంతవరకుఁ దెలియరైరి.

శింశుమారము ఈశాన్యదిశనుండి నైరుతిదిశవరకున్నది. ఈలాగున నుండి తిరుగుచుండును జలభూతము వాయువ్యదిశనుండి సంయమివరకున్నది. మనపృథివి వీటికి మధ్యలో ఉత్తరదిశనుండి దక్షిణదిశకు ఏటవాలుగ నున్నది. సప్తద్వీపములు అంతస్థులుగా నొకదానిపైన మరొకటి వరుసగా అధిక వైశాల్యముతో సూర్యమండలమువరకు నున్నవి. ఇవేజలభూత లోకాదులు. ఇవి మనకు అష్టముగాఁ గొంత వరకున్నవి ఈలాగుననుండగా మనమేమిచెప్పినను మనఃప్రధానముతోఁ జెప్పినవిగా నగునేకాని స్థిర సత్యసిద్ధాంతములు గానేరవు. కాబట్టి వేద, శాస్త్ర, పురాణాదుల ననుసరించుటే మేలు.

## —♦ పుణ్యాహవాచనములోఁగల ప్రమాణము. ♦—

"శుక్రాంగారక బుధబృహస్పతి శనైశ్చర రాహుకేతు సోమసహితఆదిత్య పురోగాస్సర్వేగ్రహాః ప్రీయంతాం" దీనిని మనము సర్వకర్మలందు ముఖ్యముగఁ బ్రథమమునఁజేయు పుణ్యాహ స్వస్తివాచకములోఁ జెప్పుచున్నాము. సర్వశాంతి స్వస్తినిమిత్తమై గ్రహతిథికరణ నక్షత్రముహూర్త దిగ్దేవతలాదిగాఁగల వారిలందరి తృప్తికొఱకుఁ జేయుచున్నాము. ఇందులో శుక్రాంగారకాదిగా గ్రహకక్ష్యల వరుసలనుజెప్పిరి. పురాణాగులంథుఁ జెప్పఁబడిన గ్రహకక్ష్యలకిది విరుద్ధముగ నున్నది. అయితే ప్రమాణములను ద్రోసివేయఁజాలము. ఆలోచించినఁగాని దీని విమర్శన దెలియఁజాలము. కొన్నిసందర్భములఁగాలకర్మ గుణప్రయోజన ఫలము లనుబట్టి క్రియాదులనిమిత్తము ఋషులు మధ్యగ్రహములతోఁ బ్రారంభించుటొక ఆచారముగనున్నది. ఈఅండసృష్టికి జలోష్ణములు ముఖ్యకారణములు వీటితో క్షేత్రరూపమేర్పడును. కొన్నిసమయములందు సూర్యచంద్రులాదిగ గ్రహించిరి. శుక్రాంగారకులు జలోష్ణకారణ గ్రహము. కుజుఁడు పృథివీ సంబంధము కలవాఁడగుటచే మధ్యగ్రహముగ గ్రహించు నవకాశమున్నది. అధోలోకదులకు సోమ సూర్యులుముఖ్యము. ఊర్ధ్వలోకముల కుపరిలో సమీపముననున్న శుక్రాంగారకులుత్పత్తికి ముఖ్యులు. అందుచేత సందర్భానుసారము సర్వగ్రహములు నొకే యంశచే నెటులారంభించినను సమష్టిపరిపాకముతో సరిపోవును. సర్వగ్రహముల

ఉపరిలో శని సర్వవిధము లధికముగనున్నాఁడు అందుచేత శనిమహాగ్రహము. ప్రవృత్తికి రెండుగ్రహముల మిథునము ముఖ్యము. దీనిననుసరించియే గోత్రగణములు ముఖ్యములైనవి రెండు. అవి ఆంగీరస (అంగిరస) భృగు (శుక్ర) గణములు. ఈరెంటితోనే జీవదేహముల సృష్టియగుచున్నది. ఆంగీరసగణమే దేహము. శుక్రగణమే వీర్యము, ఒకటి తేజస్సు మరొకటి రససంబంధ దేహము. ఎటుచూచినను ప్రమాణములు మాత్రము విరుద్ధములుగా నేరవు. మనము విమర్శించనిచో విరుద్ధములగును కక్ష్యలను మండలములను బైప్రమాణము ననుసరించి యీక్రింద వివరించుచున్నాము. బ్రహ్మాండమునందు గ్రహముల వరుస రాహుకేతువులాదిగాఁ గ్రిందినుండి (మననుండి, సూర్య, చంద్ర, బుధ, శుక్ర, కుజ, గురు, శనిగ్రహములతో నున్నది. రాసులవరుసలో సింహరాశ్యాదిగా తదూర్ధ్వములో నిటులనే శనిరాశి పర్యంతము (కుంభమీనములు) న్నది శుక్రాంగారకులను మధ్యగ్రహములుగఁ దీసుకొన్నచోఁ బైప్రమాణ ప్రారంభము సరిపోవును. ఇవి కేంద్రగ్రహములు. వీటికి సంబంధావరణకోశ కక్ష్యలుగ ఉపరిలో బృహస్పతియు, అధోభాగములో బుధుఁడును సమీపమున నున్నారు. పైప్రమాణములో శనైశ్చర రాహుకేతువుల వరుసను జెప్పిరి. ఉపరిలో శనైశ్చరుఁడు అధోభాగములో రాహుకేతువులు సంబంధావరణ సమానగ్రహములుగ నున్నారు. సోమసూర్యులను గడపటజెప్పిరి. వీరలు పైశుక్రాంగారకులవలె సృష్టికిఁగారణ గ్రహములైనందుచేత మధ్యగ్రహములుగ జెప్పిరి. రాహుకేతువు లొకట్టే.

మరొకవిధముగ ఈగ్రహరాసుల వరుసగలదు. ఉత్తరాయణములో ఊర్ధ్వవలయమునందు బుధగ్రహరాశియగు మిథునాంతముతోను నూర్ధ్వములో శనిగ్రహరాశియగు మకరాదిగను నున్నది. అందుచేత ఉత్తరాయణ సంజ్ఞతో శుక్రాంగారకులూర్ధ్వలోక సృష్టికిఁ గారణులు. దక్షిణాయన మధోలోకముగ నుండుటచేతఁ జంద్రరాశియగు కటకమునకును రవిరాశియగు సింహరాశికిని సంబంధముకలదు. అధోలోకసృష్టికిఁ దమస్సంబంధ ముండుటచేఁ జంద్రసూర్యులు ప్రకాశించుచు రాత్రింబగళ్ల కధికారులుగనున్నారు. ఇటులనే ఊర్ధ్వలోకాదులకు శుక్రాంగారకులగుదురు. అంగారకునిఁబట్టి మేషరాశినిఁబట్టి కృత్తిక ప్రథమచరణమునుబట్టి ఈత్రివర్గసృష్టియైనది అందుచేఁ బుణ్యాహవాచనములో శుక్రాంగారకాది గ్రహనామోచ్చారణ మొనర్చిరి. వేదములో నక్షత్రేష్టిలోఁగూడ కృత్తికనుండియే ప్రారంభించిరి.

గ్రహదశలఁ గృత్తికాదిగ లెక్కించిరి. కాలకర్మలకు నిదే ప్రారంభము. దీనికుపరి లోకాదు లకృతకలోకాదులగుటచేతఁ గాలకర్మలకంత యవకాశమున్నట్లు నాలోకాదులందున్న వారల విధానములఁబట్టి చెప్పలేరు. త్రివర్గములు కృతకములు. కాలకర్మలతోఁ గూడుకొన్న లోకాదులు. దక్షిణాయన రాసులు ధనురాశ్యంతముతో ముగియును. ఉపరిలో సోమసూర్యులకుఁ గ్రమముగ గ్రహకృత్యలన్నియును వరుసగనుండును. ఉభయత్ర శని ఉపరిలోనుండుటచేత మహాగ్రహమాయెను. శింశుమారములోఁ గూడ శనిగ్రహ ముపరిలోనేయున్నది. దీనిగమనమటులనే మందముగ నున్నందుచేతనే మందగ్రహమనియు శనైశ్చరుఁడనియు పేరు గలిగెను. శనైశ్చరునితో తదూర్ధ్వలోకాదులకు సమీపసంబంధమున్నది.

సర్వగ్రహములకు మూలముగఁ గ్రిందిభాగములో ఆధారభూత తేజోరూపముగ నుండుటచేత "ఆదిత్యపురోగా సర్వేగ్రహాః ప్రియంతాం" అని జెప్పిరి. సూర్యుఁడధోలోకాదులకు శింశుమార వలయమున ముఖ్యుఁడుగ నున్నాఁడు. ఈకారణములచేత సూర్యశనులకుఁ బరస్పర సంబంధమున్నది. శనిరాసులుగూడ సూర్యరాశికి సూటిగనున్నవి. వీరిద్దరికి శత్రుత్వమును జెప్పటకుఁగూడ ఊర్ధ్వముఖాధోముఖములే కారణము.

ఈ కారణాంతములచేత కాలగుణ కర్మల ననుసరించి లోకాదుల ననుసరించి పూర్వాపరసృష్టి ననుసరించి గ్రహకృత్యలారంభములో నొకదానికొకటి భేదములుగ నున్నవి. ఆదినుండి, మధ్యనుండి సమయసందర్భానుసారము కార్యానుకూలముగఁ దాత్కాలికముగ నీలాగునఁజెప్పిరని తలంచవలెను. ఇదిసమన్వయక్రమము. మనస్సృష్టి కారకులగు రవిచంద్రులకుఁ గ్రింద రాహుకేతువులు ఛాయారూపముననున్నారు. ఊర్ధ్వసృష్టిలోఁ దేజోలోకమున సూక్ష్మసత్వచ్ఛాయగా శనియావరణమున్నది. ఛాయయే రాత్రింబగళ్ళకుఁగారణము. మధ్యగ్రహములను గాలకర్మక్రియాకులకుఁ గారణముగాఁ దీసుకొనుటచేత వీటినే ఆదిగాఁ జెప్పవలసివచ్చెను. ఈకారణములచేత శుక్రాంగారక గ్రహములు ప్రధానములాయెను. దీనివివరము ప్రక్కగల చిత్రమునఁ గనఁనగును.

—•—

# గ్రహణముల వివరము.

సూర్యచంద్రులను దమోగ్రహములగు రాహుకేతువు లాచ్ఛాదించి గ్రహించు కాలము గ్రహణమనఁబడును. ఇవి తఱచుగా సందర్భానుసారము గలుగుచుండును. సూర్యచంద్రులిద్దరు సర్వదా స్వప్రకాశ తేజోవంతులు. రాహుకేతువులు సర్వదా తమోరూపవంతులు. వీరలు సహజముగ సర్వదా అపసవ్యముగ శింశుమారకముక్రిందఁ దిరుగుచుందురు. వీరల యపసవ్యగతుల మధ్యలో సూర్యచంద్రులలో నెవరు సమీపములో నుందురో వారికి రాహుగ్రస్తమనిగాని, కేతుగ్రస్తమనిగాని సంజ్ఞతో గ్రహణము సంభవించును. ఈగ్రహణములు, రాహుకేతువు లేనక్షత్రమున నుందురో యానక్షత్రమున సూర్యచంద్రులున్నపుడు సంభవించును. ఉదాహరణము హస్తప్రథమ పాదమందు కేతువును, హస్తద్వితీయ పాదమునందు చంద్రుఁడుండునపుడు చంద్రగ్రహణమగును. చంద్రగ్రహణము కొంతపాడ్యమి ఘడియలుచేరిన పూర్ణిమాంత్య ఘడియలందు సంభవించును. సంపూర్ణచంద్రునకు గ్రహణముగా నేరదు. పూర్ణిమఘడియల యంత్యకాలములోఁ జంద్రకళ కొంచెముతగ్గును. ఈసమయమే గ్రహణము.

అమావాస్యరోజు చంద్రకళాశేషము సూర్యునియందుండుటచేత నాఁడుచంద్రగ్రహణ మసంభవము. సూర్యగ్రహణము అమావాస్యనాఁడు పాడ్యమిఘడియ లారంభముగల యమావాస్యాంత్య ఘడియలందు సంభవించు ప్రతినెలకు గ్రహణముతప్పక గలుగవచ్చునని యడుగుట కాస్పదముండును. ప్రతిపూర్ణిమయందును గల నక్షత్రమందు రాహుకేతువులలో నొకరైననుండి యానక్షత్రము పౌర్ణమనాడే వ్యాప్తిగానుండి చంద్రుఁడానక్షత్ర మందుండినచో గ్రహణముగలుగును. ప్రతిపూర్ణిమకు నక్షత్రము మార్పుచెందుచుండును. ఒకేనక్షత్రమెప్పటికి నుండజాలదు. రాహుకేతువు లొకనక్షత్రమున నెనిమిదిమాసములుండురు నక్షత్రపాదమున రెండు మాసములుండురు ఈవిధమైనచారముతో వీరలు ఒకేనక్షత్రమం దెనిమిదిమాసములుండినను ప్రతిపూర్ణిమకు నీనక్షత్రముండఁజాలదు. చంద్రుఁడు రెండును నొకపాతికదినముల కొకరాశిని మారిపోవుచుండును. దినమున కొకనక్షత్రమును బొందుచుండును. నక్షత్రము లిరువదేడుమాత్రమేయున్నవి. అందుచేత నెలరోజులకు నక్షత్రసంఖ్య సరిపోదు. ప్రతినెల పూర్ణిమనాటికి కొంచెమించుమించు మూడు

నక్షత్రము లెక్కువగా మార్పుచెందును. చైత్రపౌర్ణిమరోజు చిత్తకడనుండును. వైశాఖశుద్ధపౌర్ణిమ విశాఖనక్షత్రముకడ నుండును. ఇటులనే ప్రతిపౌర్ణిమకు మూడునక్షత్రము లధికముగా ముందుకు వెళ్లుచుండుటచేత గతిభేదముతోను నక్షత్ర భేదముతోను ప్రతిపౌర్ణిమయందు గ్రహణము రానువీలుండదు. ఇటులనే సూర్య గ్రహణమునకును సమన్వయము. చంద్రగ్రహణమునకు దిశభేదములు, స్పర్శ, నిమీలనము, మోక్షమునుగురించి ఆలోచింతము చంద్రుడు గ్రహణకాలము నందు శింశుమారములో నేఅయనమును బొందియుండునో యా అయనదిశనుబట్టి చంద్రబింబమునకు గ్రహణస్పర్శ, నిమీలనములు తుదకు మోక్షదిశవచ్చును. చంద్రుడు సహజముగ ప్రతినెలకు పండ్రెండురాసులను దిరిగివచ్చుచుండును. ఒక పక్షమందు ఉత్తరాయణరాసులు పగలు సంచరించి రాత్రికి దక్షిణాయనరాసులు సంచరింపవచ్చును. మరొకపక్షమందు భేదగతులతో అయనభేదములు రాశిభేద ములు గలుగవచ్చును. అందచేత గ్రహణసమయమందే అయనరాసులందుండునో యారాసులనుబట్టి గ్రహణస్పర్శాది విషయములను ఆలోచించి చెప్పనగును. సూర్యునికెదురుగనున్న చంద్రబింబభాగమును విడచి దానికెదురుపార్శ్వములందు గ్రహణ స్పర్శలు గలుగుచుండును ఒకదిశ స్పర్శఅయినచో మరల దానికి సమాన వరుసదిశన మోక్షమగును. ఉదాహరణము:- ఆగ్నేయమున స్పర్శయైనచో మోక్షము నైఋతియందగును. ఈమధ్య కాలగతితో బింబమాదిశకు మోక్షకాల మునకు వచ్చియుండును. కాలగతితో దిశలభేదములు గలుగుచుండును. సర్వ గ్రహములకు గతులుండుటచేత గ్రహణకాలము పరిమితికిలోనై యుండును. రాహు కేతువులగతి కొంచెముదహరింతును. విశాఖ ప్రథమచరణములోనున్న కేతువు తర్వాత వెనుకకు స్వాతి నాలుగవచరణమును ప్రవేశించును. ఈలాగుననే క్రిం దికిదిగునేగాని ముందునక్షత్రమునకుబోదు. వెనుకనక్షత్రముననే గతిగలుగును. ఇందుచేతనే వీరలగతి అపసవ్యగతియని నిర్ణయించిరి. గ్రహగతులిట్లుగాదు. విశాఖ ప్రథమచరణమునుండి క్రమముగ రెండవ మూడవ, నాల్గవపాదములుజేరి తరువాత అనూరాధనక్షత్రము నాశ్రయింతురు. ఇది గ్రహముల సవ్యగతి. ఈరెండుగతుల సంధికాలములో రాహుకేతువులకును, సూర్యచంద్రులకును ఏకకాలములో సంధి గలిగినపుడే గ్రహణమగును. ఈసంధికాలము పౌర్ణమినాడుగాని, అమావాస్యనాడు గాని యుండవలెను సూర్యునికి, చంద్రునికిని మధ్యలో రాహుకేతువు లెవరైన నుం డినంగాని. చంద్రగ్రహణముగలుగనేరదు. సూర్యగ్రహణముగూడ పైవిధముగనే

గ్రహించవలెను. ఇతను సిద్ధాంతభాగములో గ్రహణసాధన లనేకవిధములుగ నుండును. రాహుకేతువులు ఛాయాగ్రహములు. భూచ్ఛాయతోగాని మరేవిధముగనైనను ఛాయమాత్రము తప్పదు. భూమియపసవ్యముగనే తిరుగును. రాహుకేతువు లోకఛాయాసంబంధితులైనను కొనలభేదములతో రెండుగ్రహములుగఁ బ్రతీతికిఁ గారణముగలిగెను. వీరలు మేరువునకు అపసవ్యముగఁ దిరుగుటచేతను వీరిసంధికాలమే సందర్భమునుబట్టి గ్రహణముగను. దీనినే పురాణములందు అమృతమును బంచి యిచ్చుటలో మోసము జరిగినపుడు రాహుకేతువు లదిగ్రహించి దేవతలలోఁ జేరి విష్ణుచక్రహతులైనందుచేత మోక్షమును జెందిరని చెప్పిరి. మనస్సు చంద్రుఁడు. బుద్ధిసూర్యుఁడు. అజ్ఞానమే రాహుకేతువులు ఈ అజ్ఞానము దేనినావరించినను మాలిన్యముచెందును. కేతువు శిరస్సుగను, రాహువు మిగతదేహభాగములుగను దెలియవలెను. శిరస్సు ప్రయత్నముతో జ్ఞానప్రధానము గలదగుటచేత (కేతువు అమృతమునుదెలిసి దేవతలలోఁజేరి అమృతముగ్రహించి దేవత్వమునుజెంది స్వర్గమున నిలిచెను. రాహువునకు అమృతసంబంధములేక క్రిందనే నిలిచెను. ఛాయను సర్పాకారముగ వర్ణించిరి. తమస్సుచేత నిద్రచేతగూఁడ సర్పము సరియగు నుపమానము.

కేతువునుగురించి యనేకరహస్యములు వివరించవలసినవి యున్నవి. కేతువు మహాజ్ఞానియనియు, జాతకాదులలో కేతువు వ్యయమందుండినవారికి మోక్షముండు ననియు ఫలభాగమునందుఁ జెప్పఁబడియున్నది. శరీరభాగ విషయానలు శిరస్సున నున్నంతకాలము అజ్ఞానముదప్పదు. లేకున్న జ్ఞానమునిండియుండును. తుదకువ్యవహార విషయములగూర్చిన యాలోచన తప్పకశిరస్సునందే జరుగును అందుచేత శిరస్సు సర్వప్రధానము. కేతువు నటులనే ప్రధానుఁడు. ఇది ఆధ్యాత్మికభాగ విషయు కేతువు. మనపురాణములందుఁగల రాహుకేతువులు క్రమముగ బ్రహ్మాండ సృష్టికల్పములో సర్వులు జేరినట్టుగనే చేసినవారలై కల్పాంతములో ముక్తులగుదురు. ఇదియొకమార్గము. అధ్యాత్మికము సర్వదా సర్వకల్పములందును మార్పుచెందనిదై జ్ఞానరూపముగ సర్వదాయుండును అట్టిదానినే కేతువుగ గ్రహించవలెను. కేతువన శుద్ధజ్ఞాన స్వరూపమే.

రాహుకేతువుల తమోచ్ఛాయతో నాచ్ఛాదింపఁబడుటచేత చంద్రమఃప్రభావముతోఁజంద్రబింబ మపుడెఱ్ఱవర్ణముగ నుండును. తమస్సే అగ్నివర్ణమునకుఁ గారణము రాహుకేతువులఛాయపరిమితికిలోనై యుండుటచేత సూర్యచంద్రమండలముల

వలయమాత్రమే నాచ్ఛాదించునేకాని తదుపరిగల గ్రహముల నాచ్ఛాదింపదు. అందుచేత నాగ్రహములకు గ్రహణసంజ్ఞ లేదు. గ్రహణకాలమందుఁగల ఛాయ విషసంబంధ తమోచ్ఛాయ యగుటచేతను సూర్యచంద్రుల తేజస్సు ప్రాణులందుఁ బడుటచేత గ్రహణబాధలు సంభవించును. సర్వదా జ్ఞానమువలె సూర్యచంద్రుల తేజస్సు ప్రాణులందుఁ బడుచుండుటచేత సర్వవిధముల ప్రకాశవంతులమై ఆరోగ్యవంతులమై యుందుము. అందుచేత నీతమస్సునకే సూతకమని వైదికపరిభాషగా ధర్మశాస్త్రములందు వ్రాసిరి. ఇట్టి అపవిత్రకాలము జపతప హోమార్చనాదులకును దానధర్మములకు ముఖ్యకాలమని విధించి ఆచరింపఁజేసిరి. దీనితో విషసంబంధ తమోచ్ఛాయబాధను జెందక ధన్యతబడయఁగలుగుదుము. ఈఛాయ గర్భవతులకును, గ్రహణనక్షత్రము జన్మనక్షత్రముగాఁగల వారలకు నెక్కువబాధలకవకాశముండునని మీఁదఁబడనీయకుండఁ గాపాడుదురు. తచ్ఛాంతినిఁగూడఁ జేయుదురు. ఈఛాయతో నొకప్పుడు దైవికముగా గర్భవతులందు బడినచో వికలాంగులుగ జనింతురు. ఇది సర్వులకనుభవమే. గర్భాధానకాల నక్షత్రమునకును గ్రహణనక్షత్రమునకును బరస్పర సంబంధమున్నపుడు దప్పక వికలాంగులు జనించునవకాశముండును. సామాన్యతమశ్ఛాయకును గ్రహణకాలతమశ్ఛాయకును భేదమున్నది. రాహుకేతువులు సర్పరూపులగుటచేత విషపూరితులై యుందురు. ఇదియే ఉభయభేదము. తమస్సెప్పు మాదకరము. విషతమస్సైనచో అత్యంతాధిక్యమగును.



## మేషాదిరాసుల వివరము.

ఖగోళమన మనకంటికిఁ బైన ప్రకాశరూపముతోఁ గనుబడుచున్నదే. దీనికే శింశుమారమనియు, స్వర్గలోకమనియు, ద్యులోకమనియుఁ దేజోలోకమనియు, నామాంతరములు. ఇది మేషరూప పీఠమునుండి మనకుఁగనఁబడుచున్న ధ్రువనక్షత్రమువరకు వ్యాపించి పుచ్ఛము ధ్రువునితో సంబంధము కలదై వర్తులయాకారముతోఁ దలక్రిందుగా సర్వతారాగణ సమూహముతో రాత్రులందుఁ బ్రకాశవంతమై కనఁబడుచున్నది. ఈశింశుమారములో మనకు నిత్యము వాడుకలోఁగల అశ్విన్యాది సప్తవింశతి నక్షత్రములు పండ్రెండు భాగములుగ భాగింపఁబడినవి. అవియే మేషాదిరాసులు.

ఈరాసులు మనకత్యంత మహోపకారులై ప్రతిదినము ప్రతినిమిషమునకు సర్వవ్యవహారములకును, సర్వకార్యములకును ఫలములను నిర్ధారణచేసి తెలుసుకొన ముఖ్యకారణములైయున్నవి. ఈరాసుల హద్దులే లేనిచో ఏగ్రహ మేరాశిలోనున్నదియు గ్రహాదుల బలాబలములను, ధాతువులను, గుణములను, స్థితిని అవస్థను, క్రియను, సంబంధమును, భావమును, ఉచ్ఛనీచస్థితులను, కేంద్రకోణములను, బరస్పరసంబంధ దృష్టులను, మిత్ర శత్రు సమభావములను సమాగమమును ఋజు వక్రగతులను; బక్షమాస ఋత్వయనాదులను గాలమును సంక్రాంతులభేదములను దెలుసుకొనుటకును ముహూర్తములకును జననకాలములకును లగ్ననిర్ణయములకును, బ్రశ్నలకును ఫలితాంశములకును దదితరములగు ననేక కార్యములకును మార్గమే లేకుండెడిది. రాసుల సరిహద్దులే లేనిచో నేమియును గనుఁగొనలేక తారుమారగుచుంటిమి. అనేక విషయాదులతో నిండియుండుటచేత రాసులని నామాంతరమేర్పడెను. సమష్టితేజస్సులో నేమియును గనుఁగొనలేక మననిత్యవ్యవహారములకుఁజాల శ్రమలపాలగుచుంటిమి. ఈరాసులు సర్వాధారములైయున్నవి. ఈరాసులు జాతకభాగమునందు ద్వాదశభావఫలముల కత్యంతావశ్యకములు. ప్రశ్నలకుఁగూడ చాలముఖ్యములు. ఈ రాసులతో మాసములేర్పడి యేమాసమం దేకార్యములుచేయుట ముఖ్యమో వానినిఁదెలుపును. ఈరాసులు శింశుమారములో రాహుకేతువుల మండలము లాదిగాఁగ్రమముగ, సూర్య, చంద్ర, బుధ, శుక్ర, కుజ, గురు, శని మండలముల వఱకు నేకముగ వ్యాపించి సర్వమండలములకు సమానసంబంధము గలదై వలయాకారముగ శింశుమారములోఁ బుష్పమాలవలెనున్నవి. ఈరాసులకుఁ జలనమెటులనిన శింశుమార చలనముతో నక్షత్రములకుఁ జలనమేర్పడి క్రమముగా సూర్యునిసంబంధముతో మార్పులేర్పడుచుండును. ఒక్క ఆధారమునకు జలనము ప్రథమమున గలిగినప్పుడు క్రమముగ దానినాశ్రయించువాటి కన్నిటికినిఁ జలనము సహజముగ గల్గుచుండును. అదియునుగాక మఱియిందులో నున్నవాటికి స్వయముగాఁగూడ గతులుగలుగవచ్చును. ఇందుకు దృష్టాంతములు, యంత్రములు, గడియారములు, మూలమగుజగత్తునకే భ్రమణమున్నపు డందులోఁజేరిన వాటికన్నిటికి భ్రమణ మెటులదప్పును? ఈ భ్రమణయే లేనిచో నన్నియు శాశ్వతములుగనే యుండియుండెడిది. అప్పటికిఁ బ్రళయమే లేదు. అందుచేత సిద్ధాంతములన్నియును భ్రమతోఁజేరినవైయుండును. ఒకదానికొకటి సంబంధముతోఁ బృథివి వఱకు నన్నిటికి భ్రమణలున్నవి. కొన్నిటికి స్వయముగ జలనము కొన్నిటికి

అధిష్ఠానచలనముతో గొన్నిటికి గదాయున్న చోటుననే స్వపరిభ్రమణము గలుగుచుండును. ఈగతులు దూరమువలనను కేవల మందభ్రమణవలనను మనము కనిపెట్టలేనంతటి సూక్ష్మముగఁ గనుపట్టును. కొన్నిమనకుఁ దెలియునట్లుగను గొన్ని తెలిసి తెలియనట్లుగ నుండును. ఇదిప్రకృతిలో సహజమేకాని విపరీతమేమియును లేదు. ప్రకృతితోనే మార్పులు, భ్రమలు సహజములు. గ్రహములన్నియు వాటిగతిక్రమముతో స్వయముగా నడుచుచు నీద్వాదశ రాసులందు సంచరించుచుండును. ఈ గతులతో నేగ్రహ మేరాశియం దేయంశయందుండునది కనుఁగొనఁగలుగుదుము. ఏవేళ కేముహూర్తమును గనిపెట్టవలెనన్న సూర్యగతినిబట్టి ఉదయరాశి మొదలుకొని దానిలోభుక్తి నిఁగనిపెట్టుకొని మఱి కావలసిన కాలమున కారాశిప్రమాణ ఘటికలతో గణించి తెలుసుకొనగలము. గ్రహములకు నిట్లనే గ్రహగతిగల నక్షత్రము దెలుసుకొని యానక్షత్ర మేరాశియగునో యారాశియందు గ్రహమున్నదని తెలిసి ఫలములను నిశ్చయించుకొనఁగలుగుదము. నక్షత్రమునకు నాలుగుపాదములు. ఇరువదేడునక్షత్రములకు పాదములు ౧౦౮. ఒక్కొక్క రాశికి తొమ్మిదిపాదములగును. ఈప్రకారము ౧౦౮ పాదములకుఁ బండ్రెండురాసులు సరిపోవును. నక్షత్రముల భాగములకే రాసులని పేరుగలిగెను. రాసులనునవి ప్రత్యేకించినవిగా లేవు. ఈనక్షత్రరాసుల గతులచే మాసము లేర్పడినవి. ప్రారంభమున మేషరాశియు ముగింపు మీనరాశియునగును. మేషరాశియనగా (అశ్విని నక్షత్రముతో నారంభముగ) అశ్వినిలోని నాలుగుపాదములు, భరణినక్షత్రములోని నాలుగు పాదములు కృత్తికనక్షత్రములోఁ దొలిపాదము చేరి (తొమ్మిదిపాదములు) యగును ఈలాగుననే ప్రతిరాశికిఁ దొమ్మిదిపాదములు క్రమముగ మిగతరాసుల నేర్పరుచుకొనవలెను. ఈ నక్షత్రము లిరువదేడు మరొక ప్రమాణముతో నిరువదెనిమిది. ఎక్కువగాగల నక్షత్రమునకే అభిజిన్నక్షత్రమని పేరు. శ్రవణనక్షత్రోత్తరార్ధము ధనిష్ఠనక్షత్ర పూర్వార్ధమునకు నీసంజ్ఞ అంతర్హితము సర్వగ్రహనక్షత్రసంచారములచేత నానక్షత్రపాద మేరాశికిఁ జేరునో యాగ్రహ మారాశిలో నున్నదని స్పష్టము. నక్షత్రములకును, వీననుసరించిన రాసులకును స్వయముగ గతులు లేవు. ఇవిశింశుమారములో స్థాననియామకములతో వాయుస్థములందున్నవి. శింశుమారగతితో వీటికి గతులుగానున్నట్లగపడుచుండునే కాని యదివాస్తవముగాదు. గ్రహములన్నిటికిఁ గాలగతులు సమానములుగ లేవు. అటులుండినచో నన్నియును, సమానరాశిలో సమానకాలములో భేదములు లేక యుండియుండవలెను.

మనయనుభవ మటులలేదు. చంద్రుఁడొకమాసమునకే పండ్రెండురాసులుతిరుగును. రవి, బుధ, శుక్రు లొక్కొక్క మాస మొకరాశిలో నుందురు. కుజుడొకటిన్నరమాసము గురువొకసంవత్సరము, శనిముప్పదిమాసములు, రాహుకేతువులు పదునెనిమిది మాసములు నొకరాశిలో నుందురు. సూర్యచంద్రులకుఁదప్ప మిగతగ్రహములకు వక్రగతియు ఋజుగతియు స్తంభనముగలదు అందుచేత సమకాలగతిగాఁగల గ్రహములకు రాశిభేదస్థితులు సహజముగఁగొంచెమించు మించు గలుగుచుండును గ్రహణములు సూర్యచంద్రులకుఁదప్ప నితరగ్రహములకుఁ గలుగనేరవు గ్రహమండలముపై నుండుటచేత రాహుకేతువులఛాయ యంతదూరముపోదు. ఇందుకు మరొకకారణము సముద్రమథన చరిత్రలోనున్నది. శింశుమారము సవ్యముగఁ దిరుగుచుండుటచేత సర్వగ్రహములు నక్షత్రములు మనకుఁదూర్పునుండి పశ్చిమము నకు వచ్చునట్లు కనఁబడును ఇందుకుఁగారణము శింశుమారగతిభేదము. ధ్రువాధారముతోనన్నియు నాకర్షింపఁబడి సప్తవాయుసూత్రములతో బద్ధమై స్థూలగోళములో స్థూలాంగలన్నియును దిరుగుచున్నవి. ధ్రువుఁడే సూర్యుఁడు సూర్యుఁడే భూమి. ఈలాగు నన్నియు నొకదానిసంబంధము మరొకదానికిఁగలిగి యాకర్షింపఁబడి తిరుగుచున్నవి. అందుచేతనే భూమిమధ్యభాగములోనున్నది భూమికిఁగుడివైపున శని, గురు, కుజకక్ష్యలును, ఎడమవైపున సూర్యచంద్ర బుధ, శుక్ర కక్ష్యలునున్నవి. అందుచేతఁగొన్ని సమీపములోను మరికొన్నిదూరములోనునున్నవి. శింశుమారముతో సూర్యుఁడును సూర్యునితో శింశుమారమును దిరుగుచున్నది సూర్యగతితోనే మనకుఁగాలగతి ముఖ్యముగఁ దెలియుచున్నది. శింశుమారము విశాలముగ నున్నందుచేతఁ దిరుగుచున్నట్టు మనకు బాగుగ నగపడుచున్నది సూర్యుఁడలాతచక్రము వలె తానున్నచోటుననే తిరుగుచుండుటచేత మనముదెలియలేము. ఈలాగునఁ బన్నెండు మాసములకుఁ బండ్రెండు భేదములుగ సూర్యునిమహిమ కాలగతితో ఫలభేదములతో ద్వాదశాదిత్య సంఖ్యకుఁగారణము నున్నది.

రాసులీప్రకారముగ సర్వసంబంధములతో రాహుకేతు మండలమునుండి శని మండలములవఱకు నున్నందుచేత సర్వవిధముల రాసులకును గ్రహములకును బరస్పర సంబంధములతో ఫలముల కవకాశమార్గము లేర్పడెను. ఈరాసులకు రెండు ముఖ్యసంధులున్నవి. ఉత్తరాయణ సంజ్ఞతో నారు రాసులు. శింశుమారములో ఉత్తరదిశార్థముగను, దక్షిణాయనసంజ్ఞతో నారురాసులు శింశుమారములో దక్షిణ

దిశార్ధముననున్నవి. ఉత్తరాయణము మకరమాదిగా మిథునరాశ్యంతము వఱకును, దక్షిణాయనము కటకరాశ్యాదిగ ధనూరాశ్యంతమువరకు నుండును. ఈరాసులక్రమముతో ననేకాపూర్వవిషయాదులకు మార్గములున్నవి. మకర, కుంభములకు శని యధిపతి. కటక సింహారాసులకు సూర్యచంద్రులధిపతులు. వీరు ముగ్గురు సమానాంశములతో నేకస్వరూపులైయుందురు. అందచేత ఆద్యంతములందున్నారు. గ్రహములు గ్రహశక్తులతోను గ్రహగతులతో నొకరిపైన నొకరును మఱొకప్పుడు నొకరికిక్రింద మఱొకరున్నట్లు మనకు భ్రమణగా నగపడుచుందురు. ఇది సహజము. రాసులు వలయాకారముగఁ గ్రిందనుండి పైవరకుఁ గ్రమముగా అంతస్తులుగా నుండుట చేత గ్రహము లాయారాసులందుఁ బ్రవేశించుటచేత శింశుమారములో నుభయపార్శ్వములందును రాసులుండుటచేతను శింశుమార మేటవాలుగా నుండుట చేతఁ నధోపరిభాగముల గ్రహములున్నట్లగపడుచుండును. మనభూమియు నటులనేయున్నది. గ్రహమండల శక్తులు రాసులననుసరించిన ఆధిపత్యముల వఱుసలతో నొకదానిపైన మఱొకటి యున్నది. సింహరాశినుండి మకరరాశివఱకు క్రిందినుండి పైకిగాని, లేక మకరాదిగ సింహరాశ్యంతము వరకుఁ గ్రిందికిఁగాని యెటుజూచినను గ్రహశక్తుల వరుసలు రాశ్యధిపతులక్రమము సరిపోవుచున్నవి. నక్షత్రములను, గ్రహములను త్రిశంకుస్వర్గమునకును, (దక్షిణమున) స్వర్గమునగల ధ్రువమునకుఁ జేరినవిగా నున్నవి దక్షిణధ్రువ మగస్త్యుఁడే. సూర్యచంద్రులకుఁదప్ప తక్కిన గ్రహములకు రెండేసిరాసుల కాధిపత్యములున్నవి. దక్షిణార్ధగోళములోఁ గొన్నియును, ఉత్తరార్ధగోళములోఁ గొన్నియును, సమానాంశదిశలలో సూటిగనున్నవి. ఉభయపార్శ్వములకు సూర్యచంద్రు లధిపతులుగ నుండుటచేత వారల కేకరాశ్యాధిపత్యముగలిగినది. రాసులవిషయ ప్రయోజనములనుగుఱించి యాలోచించినంత పెరుగుచునేయుండునుగాని అంతముగా నేరదు. నక్షత్రములు కృత్తికాదిగ, విశాఖాంతము దక్షిణగోళధ్రువమునఁగల త్రిశంకుస్వర్గమునకును అనూరాధాదిగ భరణ్యంతమువఱకు ఉత్తరధ్రువగోళ దేవస్వర్గమువరకుఁ జేరినదిగనున్నవి. త్రిశంకుస్వర్గమే మనపితరులది, పురాణములందు వేదములందును దీనిచారిత్రిక ప్రమాణములు చాలయున్నవి. దక్షిణదిశ నక్షత్రములు యమ నక్షత్రములనికూడ కొన్ని మంత్రభాగములందు జెప్పఁబడినవి. మనపుణ్యాహవాచన మంత్రములలో గ్రహములను జెప్పునపుడు "శుక్రాంగారక బుధ బృహస్పతి సోమసహిత ఆదిత్య పురోగాః సర్వే గ్రహాః" యని యున్నది. దీనికారణముల నాలోచించినఁ గొంతస్పష్టమగుచున్నది.

గ్రహములకుచ్చ నీచరాసులను జెప్పునపుడు, ఆ దురాసులు సమానాంశభాగము లుగ ఉచ్చరాశికి యేడవరాశినే నీచరాశిగ (జెప్పిరి. దీనిచేత మేషరాశి సూర్యునికి ఉచ్చరాశిగను తులారాశి నీచరాశిగ నేర్పడినది మేషరాశిలో (గృత్తిక మొదటి పాదము చేరినది. అట్టి మేషరాశిలో సూర్యుడుండిన దేవలోకములో మధ్యాహ్నమగును. తులారాశిలో సూర్యుడుండినవారలకు రాత్రికాలములో అర్ధ రాత్రియగును. సూర్యు(డుదయాస్తమయముల సంధితో( జేరినవా(డగును మధ్యా హ్నసూర్యు డేసంధికిని( జేరక సర్వలోకములను ప్రకాశింప(జేయు వా(డగును. మనకా మేషరాశిలో సూర్యు(డుండు కాలమే సౌరవత్సరారంభమగును. అప్పటికి మనభూభ్రమణతో మనము స్వర్గమునకు నేరుగా సూటిగ నున్నవారలమగుదుము. ఈసూటి నిలులనే యాధ్రువాంతముతోను ఆవలమరల కారణధ్రువాంతముతోను బరాపరాత్మవరకు నీతేజస్సు చేరికగ నేరుగనుండుటచేత నిదిముఖ్యకాల ప్రారంభ ముగ నున్నదగును. మనస్వర్గగోళము కృత్తికాదిగ( బ్రారంభమైనది. మనది అగ్నిప్రధాన దేవతాత్మకలోకము కృత్తిక అగ్నిప్రధానాత్మక నక్షత్రము. మేషరాశి అంగారకాధిపత్యరాశి. కృత్తికప్రథమపాదముతోను మేషరాశ్యంత భాగముతో( గాలము ప్రారంభమైనది. కాననే మేషమాదిరాశి.

క్రింది గ్రహముల మండలములు విశాలముగనుండి క్రమముగ( బైకి పోను పోను గుఱుచయగును విశాలమండలములుగాఁగల గ్రహగతి తీవ్రముగను గుఱుచ గాఁగల మండలముల గ్రహగతులు మందముగ నుండుటచేత గురు, శనుల గతులు మందము. అన్నియు బింబప్రతిబింబములుగ, సర్వమునకు భ్రమణమున్నందుచేత దేనినిశ్చయించుటకుఁ గుదురదు. మనకగపడు సూర్యుఁడు ప్రతిబింబరూపుఁడు. చంద్రుఁడుగూడ ప్రతిబింబరూపుఁడే. అందుచేత మూలమును దెలిసినచో వివాద ముల కాస్పదమేయుండదు. మూలముదెలియనిచో నన్నియును సందేహములు, పూర్వపక్షములు, రాద్ధాంతములేయగును. సూర్యుఁడు గ్రహములకురాజు. చం ద్రుఁడు నక్షత్రములకురాజు. సూర్యచంద్ర సమ్మేళనముతోనే జగత్సృష్టియగును. శింశుమారములో సూర్యుఁడు మధ్యలోనున్నాఁడు. సింహరాశియు మధ్యలోనే యున్నది మనకు వారములుగూడ సూర్యవారముతోనే ప్రారంభముగనున్నది. అంత్యవారము శనివారము. అది ఉభయసంబంధము శని సూర్యునికి (బుత్రుఁడు. గ్రహశక్త్యుల ననుసరించి రాసులును, వారములును అనుకూలములైయున్నవి.

రాసులనిర్ణయముతో గ్రహస్థాననిర్ణయములును, ఫలములకు ముఖ్యావకాశములుగ నున్నవి. ఈరాసుల నిర్ణయమే లేనిచో నేమియు నూహింపరాని వారలమై అంధప్రాయులమై మంచి చెడుగులు దెలియక ప్రాప్తానుసార మనుభవింపవలసియుండెను. నివారణోపాయమే యుండక కష్టపరంపరలకుఁగూడ పాల్పడియుండి యుండెడిది. ప్రతిరాశికి గలప్రమాణ ఘడియలు భేదములుగ నుండుటచేతనే అయనభేదములతో అహోరాత్రముల కాలభేదములుగ దీర్ఘమంద సమకాలగతులతో, శింశుమార ముభయభాగముల నిడివిప్రమాణములు కొంచెము దీర్ఘముగను గుఱుచగనున్నవి.

ఈరాసులలో జలరాసులు, కీటకరాసులు, మనుష్యరాసులు, చతుష్పాద్రాసులుండుటచే భేదసంజ్ఞలతో ఫలములను గనిపెట్టి చెప్పునట్టి యవకాశములుగూడ నున్నవి. వివాహాదులందు దంపతులమైత్రిని గనిపెట్టుట కుపయోగములుగ నున్నవి. వర్షయోగములకును, బ్రశ్నలకును ఇతరానేకవిషయాదులందుఁ జాల ముఖ్యములుగ నున్నవి. శింశుమారముతో నక్షత్రములు, గ్రహములు, రాసులు తిరుగుచుండుటచేత మనపైన ప్రతిదినము కాలానుసారము రాత్రియందుఁగాని పగటియందుగాని వీటితేజస్సు తప్పక మనమీద పడుచుండును. పరస్పరసంబంధముతో వాటిఫలములను మనముతప్పక పొందుచున్నాము. మనజన్మరాశియు నక్షత్రరాశియు నామనక్షత్రరాశియును రాసులలోనున్న గ్రహముల సంబంధముతో మనకు తత్ఫలముల నొసఁగుచుండును. ఇందుకు దృష్టాంతము గ్రహణాదులందు గ్రహణచ్ఛాయలను గర్భవతులయందుఁగాని నక్షత్రరాశితో సంబంధము గాఁగల జాతకులయందుగాని పడనీయక నివారణోపాయములను జేయుచున్నాము. కాలకర్మల ననుసరించి వీటిఛాయలతో శుభాశుభములు తప్పక గలుగుచున్నవి. ఇంకను నక్షత్ర, గ్రహ, జప, దాన హోమాది క్రియలతో శాంతులుగూడ జేయుచున్నాము. వీనినంతయు రాసులయాధారముతోనే తెలుసుకొనఁ గలుగుచున్నాము. సూర్యచంద్రులు రాసులు రాత్రింబగళ్లకు సృష్టిస్థితిలయములకు నివృత్తి ప్రవృత్తి మార్గములకును గారణములగుచున్నవి. గీతలోఁ జెప్పిన ధూమాద్యర్చిరాది, మార్గములకు నీరాసులు ఉత్తరాయణ, దక్షిణాయన, సంజ్ఞతో నారేసి రాసులుగ విభజింపఁబడియున్నవి. ఉత్తరాయణమార్గ మారురాసులు సూర్యజ్యోతితో స్వర్గమున పగలుగను, దక్షిణాయన మారురాసులు చంద్రజ్యోతితో స్వర్గమున రాత్రికాలముగ నున్నవి. మనకు జన్మకాలమునుబట్టి దేహమునకు సంబంధముగ నారురాసులు కుడిభాగాంగములుగను దక్షిణ యారురాసు లెడమభాగాంగములుగ నున్నవి.

సర్వాంగ ఫలములను శాస్త్రముఁ ననుసరించి చెప్పనవకాశము నీరాసులతోనున్నది. ఈరాసులు శీర్షోదయరాసులు పృష్ఠోదయరాసులుగా నున్నవి. మనజన్మకాలము ననుసరించినరాశిఁబట్టి జన్మకాలఫలమును బ్రసవాద్యనేక విషయములఁ జెప్పుట కవకాశమున్నది. జాతకభాగమునకును, ముహూర్తభాగమునకును, సిద్ధాంతభాగమునకును, నీరాసులత్యంతోపయుక్తములుగనున్నవి. కాలస్వరూపమే రాసులుగనున్నవి ఈబ్రహ్మాండములో నంతర్గతముగనున్న ఈరాసులు నక్షత్రగ్రహములేలాగున నున్నవో బ్రహ్మాండస్వరూప పిండాండమగు జీవులదేహాదులందుఁగూడ అంశాంశములు సూక్ష్మరూప, ధాతుగుణములతో నన్నియునున్నవి. అందుచేత ఁబరస్పర సంబంధములుగ బాహ్యములోను అంతరములోనున్నవి. సమష్ట్యనంత స్వరూప ప్రకాశముతోనున్న తేజోరాశిని వేదాంగమగు జ్యోతిశ్శాస్త్రముతో లోకానుభవ ఫలసిద్ధికొరకు యజ్ఞయాగాదిగ సర్వకర్మల కనుకూలముగను, బ్రవృత్తి నివృత్తిమార్గముల కనుకూలముగ ఁగాలస్వరూపముతో ద్వాదశభాగములు సరిహద్దులుగ విభజించినవే రాసులని దెలియవలెను. ఈజ్యోతిశ్శాస్త్రము సర్వదేశములందు ఁబ్రచారములోనున్నదని తప్పకచెప్పవలెను. మనమున్నచోటుననుండి సర్వమును దెలుసుకొనులాగున మనవేదఋషులు తమదివ్యదృష్టితో జ్యోతిశ్శాస్త్రమును వెలువరించి మహోపకారము చేసి పూజ్యులైరి. గణితశాస్త్రముగూడ నిందులో ననేకవిధములుగఁజేరినదై యున్నది. అట్టిగణితప్రసిద్ధిచెందిన లీలావతిగణిత మెల్లరెరిగినదే ఈవర్తమానకాలములో నీగణితశాస్త్రము సర్వదేశ కళాశాలలందుఁ బ్రకాశించుచున్నది. ఈరాసులందు ఁద్రింశాంశములు డిగ్రీలుగా నేటివర్తమానకాల గణిత శాస్త్రములందుఁ బేర్కొనబడినది. శింశుమార మొకచుట్టు తిరిగిన రాసులన్నియు నొకచుట్టుతిరుగును వీటిననుసరించి కాలచక్రస్వరూపుఁడగు సూర్యుఁడొకచుట్టు తిరిగినట్టగును. దీనినే సంవత్సరమందుము. మరలకాలచక్ర మారంభమగును. ఈలాటి సంవత్సర సంజ్ఞతో మనుష్యమానము మొదలు బ్రహ్మమానము వఱకు మధ్యలో ననేకమానభేదములుగ, యుగములు, మన్వంతరములు కల్పములు జరుగుచున్నవి. కాలాత్మకుండగు నా సూర్యస్వరూపము ద్వాదశరూప సూర్యులుగఁ జెప్పఁబడినది. సర్వవిషయములను వేదములందు సవిమర్శముగ గూఢములైయున్నవి. కొందరుచూడక, దెలిసికొనలేక, అందులో లేవని చెప్పుదురు. వేదములనంతములు. ప్రతిబ్రహ్మకల్పమందును వేదములున్నవి. ఇట్టిబ్రహ్మకల్పములు, బ్రహ్మాండములెన్నిజరిగినవో ఎవరూహించిచెప్పువారు అందుచేత వేదములనంతములని తెలియ

వలెను. మనకు ప్రచారములోఁగల వేదభాగ మంశాంశముగ నున్నదేకాని సంపూర్ణముగాదు. దీనిబట్టియే మనువులవలన స్మృతులను, గల్పములను, మహర్షులవలనఁ బురాణములును, సూత్రము లుత్పన్నములైనవి. వీటికిముఖ్యాధారభాష సంస్కృతము. అట్టిసంస్కృతభాషతో సర్వశాస్త్రములందు ప్రావీణ్యతగలిగి మఱియు పూర్వమీమాంసాది శాస్త్రపాండిత్యములుగలిగి .అనుస్వీక సాంప్రదాయ సిద్ధార్థమును గ్రహించినగాని బోధకాఁజాలవు. సులభములుకాఁజాలవు. రాశియనగా దేశకాలపాత్ర మంత్ర తంత్ర వేదశాస్త్ర క్రియాకర్మల సమూహముతోఁజేరిన రాశియని యూహించవలెను.

శింశుమారములోఁగల సమష్టినామాత్మకవీధులు:- (౧) ఐరావతవీధి, (౨) జరద్గవవీధి, (3) వైశ్వానరవీధి. ఈమూడును నక్షత్రరాసుల ననుసరించి యున్నవి. తొమ్మిదినక్షత్రములు నాలుగురాసులుచేరి యొకవీధియగును. రాసుల ననుసరించి షడ్బలసాధనమునకును ముఖ్యాధారములుగ నున్నవి. జాతకభాగములో దశలు కృత్తికాదిగనేయున్నవి. ఈనక్షత్రము మొదటిపాదము మేషరాశిగను సూర్యునకు ఉచ్చరాశిగనున్నది ఇది అగ్నిదేవతా నక్షత్రమగుటచేతను అంగారక రాశియగుటచేతను భూకక్ష్య అంగారకగ్రహ సమీపమగుటచేత పృథివీభాగమునకు నీనక్షత్రముచేఁగాలారంభమయ్యెను. భూకక్ష్యకు రెండవపార్శ్వకక్ష్యలు శుక్ర, బుధ, చంద్ర, సూర్యులు భూగ్రహములకు మధ్యకక్ష్యలో అశ్విని మొదలుగా బైలోకాదుల స్వర్గసృష్టి ప్రారంభమయినది. పృథివీభూతసృష్టి కృత్తికాంత్య పాదములోఁ బ్రారంభమైనది. అందుచేత గృత్తికాదిగఁ గాలమారంభమాయెను. సృష్టిపైనుండి క్రమముగా వచ్చుటతోఁ గొంతకాలము దేవతలసృష్టి, ఋషులసృష్టియు నీత్రివర్గము గడిచినవెనుక పృథివీభూతసృష్టి ప్రారంభమైయున్నది. మనువులసృష్టి దీనికిఁబైనగల లోకములోఁ జేరినది. మనకు సృష్టికర్తలువీరలే వీరలకు సృష్టికర్త హిరణ్యగర్భబ్రహ్మ. వేదనిర్ణయమును, గాలనిర్ణయమును, ఆద్యంతమును గనిపెట్టుట మానవమాత్రసాధ్యముకాదు. అన్నియు నూహలతో నిర్ణయించిన నేమిఫలమగును? ఈసృష్టిభేదములకే కల్పాదులు యుగాదులు మన్వాదులేర్పడినవి. ప్రతిమన్వంతరములో నీత్రివర్గ ప్రళయమగుచు మరల నన్నియు నూతనసృష్టిగఁ బ్రారంభమగుటలో నిపుడున్న అధిపత్యస్థానములకు మరొకరు నియామకులుగఁ గాఁగలరని పురాణములందు భవిష్యదధికారులను గొందఱు ముఖ్యులగువారిని వ్రాసియేయున్నారు. ఇట్టిఅవాంతరములతోఁ గాలనిర్ణయము సులభసాధ్యముగాదు.

ఇవి ఆకాశమును దోటీలతో నంటుకొనునట్లిదగును. గ్రహదశలు గ్రహములవరుస క్రమము లేక కొంతమార్పులతోనున్నది. మేషాద్యచ్చరాసుల ననుసరించిన రాశ్యధిపతుల వరుసలో గ్రహదశక్రమమున్నది.

మనభూమి అగ్నితత్త్వదేవతాధి దైవత్వస్వరూపము. ఈఅగ్నితత్త్వము ఆదిత్యాంశమగుఅగ్నిస్వరూపకము గా మార్పుచెందెను. భూమిలో నీ అగ్నితత్త్వము చేతనే సృష్టి, స్థితిలయాదులు కలుగును. స్వర్గములో సూర్యతత్త్వముగను, త్రివర్గాతీతముగను ధ్రువతత్త్వాత్మక హిరణ్యగర్భ బ్రహ్మతత్త్వముగను సర్వాతీతములో ఆత్మతత్త్వ స్వరూపముగనున్నది. పంచభూతాదుల ననుసరించి ఆత్మచైతన్యముగు తేజస్సులాగున భూతాదులతో ఆవరణములై మార్పులు చెందినది. ఇంద్రియావరణాతములతో నుపరియావరణ స్వరూపమేర్పడుచుండును. ఈలాగున సర్వాంతము వరకు నగుచుండును.

ఈరాసుల విశేషాంశములను మనమూహించి చెప్పలేము. సర్వాభరణములకు బంగారము మూలమువలెనున్నది. రాసులకు రూపములు, వర్ణములు, ధాతువులు, గుణములు, వస్తువులు, ద్రవ్యములు, దేశములుండుటచేత సర్వములను దెలుసుకొను సాధనములుగనున్నవి. విమర్శించుటచేత ప్రయోజనకారియగును.



# శనిమండలకక్ష్య.

శ్రీమద్భాగవతము. - పంచమస్కంధం - అధ్యా. ౨౨

తత ఉపరిష్టాద్యోజన లక్షద్వయాత్ ప్రతీయమానః శనైశ్చర ఏకైకస్మిన్ రాశౌ త్రింశన్మాసాన్ విలంబమానః సర్వానేవానుపర్యేతి తావద్భిరనువత్సరైః ప్రాయేణవా సర్వేషా మశాంతికరః॥ ౧౬॥

—రథవివరము.—

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౨

ఆకాశసంభవై రశ్వైః శబలైః స్యందనం యుతం। సమారుహ్య శనైర్యాతి మందగామీ శనైశ్చరః॥ ౨౦॥

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨ - పుట ౭౯.

తతః శనైశ్చరోఽశ్వైస్తు శబలైర్వ్యోమసంభవైః। కార్‌ష్ణాయసం సమారు

హ్యస్యాదనా యాతివై శనైః॥ ౭౯॥

శ్రీమద్దేవీభాగవతం - అష్టమస్కంధం - అధ్యా. ౧౬

తతః శనైశ్చరో ఘోరోలక్షద్వయ పరోమితః। యోజనైస్సూర్యపుత్రోయం త్రింశన్మాసైః పరిభ్రమః ॥ ౩౮॥ ఏకైకరాశౌ పర్యేతి సర్వానాశీన్మహాగ్రహః సర్వేషామశుభోమందః ప్రోక్తః కాలవిదాంవరైః॥ ౩౯॥

—♦ శ ని మం డ ల క క్ష్య. ♦—

గురుమండలముపైన రెండులక్షల యోజనముల దూరమున శింశుమార పుచ్ఛమందు శనైశ్చర గ్రహమండలమున్నది. ఒక్కరాశియందు శని ముప్పదిమాసములుండును. పండ్రెండురాసులు దిరుగుట కాగ్రహమునకొక్క యనువత్సరమగును. ఆయనువత్సరము తృతీయమానము. సామాన్యముగ నీగ్రహమెల్లరకు నశాంతికరుడు. ఇతడు గగనసంభవంబులు చిత్రవర్ణయుతంబులగు నగు నశ్వంబులు గల నీలరథము నెక్కి మందగమనంబునఁ జరించును. ఈతనిరూపు ఘోరమై నల్లనై యుండును. ఈతఁడొక్క మహాగ్రహంబు. వాతస్వరూపుండగుటచే నీతఁడు ప్రాణికోటి పిండాండదేహమున మణిపూరస్వాధిష్ఠాన కమలమున మధ్యఁ వాతరూపుఁడై యుండును.

—o—

## గు రు మం డ ల క క్ష్య.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధం - అధ్యా ౨౨

తత ఉపవిష్టా ద్విలక్షయోజనాంతరతో బృహస్పతి ర్యేకైకస్మిన్రాశౌ పరివత్సరం పరిచరతి యదినవక్రస్స్యా త్ప్రాయశోనుకూలో బ్రాహ్మణకులస్య॥ ౧౫॥

—♦ ర థ వి వ ర ము. ♦—

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౨

అష్టాభిః పాండురైర్యుక్తై ర్వాజిభిః కాంచనేరథే। తస్మిన్ తిష్ఠతి వర్షంవై రాశౌ రాశౌ బృహస్పతిః॥ ౧౯॥

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨ - పుట ౭౯.

తతస్త్వాంగి రసోవిద్వాన్ దేవాచార్యోబృహస్పతిః। శ్వేతైరశ్వైః కాంచనేన స్యందనేన పరిసర్పతి। ౭౭ ॥ యుక్తస్తు వాజిభిర్దివ్యై రష్టాభిర్వాత సమ్మతైః। నదీ

త్రిజబ్దనివసతి స వేగస్తేన గచ్ఛతి॥ ౭౮॥

శ్రీమద్దేవీభాగవతం - అష్టమస్కంధం - అధ్యా ౧౬.

తతోద్విలక్షమానేన యోజనానాంచ గీష్పతిః॥ ౩౨॥ ఏకైకస్మిన్ హ్యథో రాశౌ భుంక్తే సంవత్సరంచరః యదివక్రోభవేన్నైవానుకూలో బ్రహ్మవాదినాం॥ ౩౩॥

అంగారక గ్రహమండల కక్ష్యకుపరిభాగమున లక్షద్వయ యోజనదూరమున బృహస్పతిగ్రహమండల కక్ష్యగలదు. బృహస్పతియొక్కొక్కరాశి యందొక్కొక్క సంవత్సరకాలముండును. ద్వాదశరాసుల ద్వాదశవత్సరములఁ దిరిగి వచ్చును. ఈకాలమునకు పరివత్సరమాన సంజ్ఞకలదు వక్రగతుండుకాని బృహస్పతి శుభప్రదుండగు ఇతఁడే దేవగురుండు. శోణవర్ణ హయాష్టకబద్ధమగు కాంచనరథంబునెక్కి యాకసమునఁ దిరుగును. తేజోరూపుఁడగు నీతఁడు ప్రాణుల పిండాండదేహంబున మణిపూరానాహత కమలముల మధ్యగల మనఃపీర సామీప్యంబున దక్షిణభాగమునఁ దేజోరూపుఁడై యుపాసనామార్గకారణ భూతుఁడై వెలుఁగుచుండు.



## అంగారకమండలకక్ష్య.

శ్రీమద్భాగవతం - పంచమస్కంధము - అధ్యా. ౨౨

తత ఊర్ధ్వ మంగారకోపి యోజనలక్షద్వితీయ ఉపలభ్యమానః త్రిభిస్త్రిభిః పక్షై రేకైకశో రాశీన్ ద్వాదశానుభుంక్తే యదివక్రేణాభివర్తతే ప్రాయేణాశుభగ్రహోఘశంసః॥ ౧౩॥

—♦ రథవివరము. ♦—

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౨.

అష్టాభిః కాంచనశ్శ్రీమాన్ భౌమస్యాపి రథో మహాన్। బద్మరాగారుణైరశ్వైస్సంయుక్తో వహ్నిసంభవైః॥ ౧౮॥

శ్రీమద్దేవీభాగవతం - అష్టమస్కంధం - అధ్యా. ౧౬.

ఉపరిష్టాత్తతో భౌమో యోజనానాం ద్విలక్షతః॥ ౩౦॥ పక్షైస్త్రిభిః స్త్రిభిః సోయంభుఙ్క్తే రాశీనథైకశః। ద్వాదశాపిచదేవర్షే యదివక్రో నజాయతే॥ ౩౧॥

ప్రాయేణాశుభకృత్సోzయం గ్రహాణాం వసూచకః॥

బుధగ్రహమండలకక్ష్య కుపరిభాగమున లక్షద్వితీయ యోజనదూరంబున నంగారక గ్రహకక్ష్యకలదు. అంగారకుఁడు పద్మరాగారుణాశ్వయుత కాంచన రథమధిరోహించి యొక్కొక్క రాశియందు మూడు పక్షముల (ఒకటిన్నర నెల) కాలము దిరుగుచు ద్వాదశరాసుల నొకటిన్నర సంవత్సరకాలమునఁ జుట్టిరాగలఁడు. ఈతండు వక్రిందుకానిచో నశుభుండు పాపియునగు అగ్నిరూపుండగుటచే నీతఁడు ప్రాణికోటి పిండాండశరీరమున నగ్నిరూపుండై భ్రూద్వయమధ్యమునఁనుండు.

—०—

## బుధమండలకక్ష్య

శ్రీమద్భాగవతం - పంచమస్కంధం - అధ్యా. ౨౨

తత ఉపరిష్టా ద్విలక్ష యోజనతో మేధస్సౌమ్య ఉపలభ్యమానః ప్రాయేణ శుభకృద్యథార్కస్య తిరిచ్యతే- తదాతి వాతాభ్రప్రాయానా వృష్ట్యాదిభయ మాశంసతే॥ ౧౨॥

—♦ రథము వివరము. ♦—

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౨

వాయ్వగ్నిద్రవ్యసంభూతో రథశ్చంద్ర సుతస్యచ। పిశంగై స్తురగైర్యుక్త స్సోప్టాభిర్వాయు వేగభిః॥ ౧౮॥

గతి. శ్రీదేవీభాగవతం - అష్టమస్కంధం - అధ్యా ౨3

శీఘ్రమంద సమానాభిర్గతిభి శ్చక్రవత్సదా॥

రథం. శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨ పుట. ౭౫.

తోయ తేజోమయః శుభ్రః సోమ పుత్రస్యవైరథః॥ యుక్తోహరైః పిశంగైస్తు అష్టభిర్వాతరంహసైః॥ ౭౨॥ సవరూథః సానుకర్షః సూత్రోదివ్యోరథేమహాః సోపాసంగ పతాకస్తు సధ్వజో మేఘసన్నిభః॥ ౭3॥

శుక్రగ్రహమండల కక్ష్యకుపరిభాగమున రెండులక్షల యోజనములదూరమున బుధగ్రహమండలమున్నది. వాయువేగంబుగల పసుపుపచ్చని గుఱ్ఱంబులు నెనిమిదింటిఁ బూన్చిన వాయ్వగ్ని ద్రవ్యజనితంబగు తేరునెక్కి తిరుగుచు దును,

ఒక్కొక్క రాశిలో నొక్కొక్క నెల వసించుచు నొకయేడాదికాలమున ద్వాదశరాసులందిరిగివచ్చు. సామాన్యంబుగ సూర్యునివలె సీతంను శుభుండు. అనావృష్టి సూచకుండు. సూర్యునకు సమానగతి యాతనికున్నది. తేజోరూపుడై ప్రాణిపిండాండ దేహమణిపూరానాహత కమలము మధ్యగల మనఃపీఠసామీప్యంబున వామభాగమున నుండును.

—o—

## శుక్రమండలకక్ష్య.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధం - అధ్యా. ౨౨

తత ఉపరిష్టా దుశనా ద్విలక్షయోజనత ఉపలభ్యతే। పురతః పశ్చాత్సహైవార్కస్య శైఘ్ర్యమాంద్య సామ్యాభిర్గతి భిరర్కవచ్చరతి- లోకానాం నిత్యదానుకూల ఏవప్రాయేణ వర్షం యచ్చారేణాను మీయతే సవృష్టి విష్టంభ గ్రహోపశమనః ఉశన సాబుధో వ్యాఖ్యాతః॥ ౧౧ ॥

—♦ రథవివరము. ♦—

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౨

నవహూధస్సానుకర్షోయుక్తోభూ సంభవైర్హయైః। సోపాసంగ పతాకస్తు శుక్రస్యాపి రథోమహాన్ ॥ ౧౪ ॥

అంశః ప్రజాపత్యంశయు శక్త్యంశయు - శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౩
పుట ౭౯ - శ్లో. ౩౪

గతి, శ్రీ దేవీభాగవతం - అష్టమస్కంధం - అధ్యా. ౧౬

పురః పశ్చాత్సహైవాసా వర్కస్యపరివర్తతే॥ ౨౬ ॥ శీఘ్రమంద సమానాభిర్గతిభిర్విచరన్విభుః లోకానామనుకూలోయం ప్రాయఃప్రోక్తశ్శుభావహః॥౨౭

శుక్ర రథం - శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨ - పుట. ౭౯

భార్గవస్య రథః శ్రీమాన్ స్తే భిస్సూర్య సన్నిభః। పృథివీసంభవైర్యుక్తో నానావర్ణైర్హయోత్తమైః॥ ౭౪ ॥ శ్వేతః పిశంగః సారంగో నీలః పీతోవిలోహితః। కృష్ణశ్చ హరితశ్చైవ పృషతః పృష్టిరేవచ। దశభిస్తైర్మహాభాగైర కృశైర్వాత వేగితైః॥ ౭౫ ॥ అష్టాశ్వః కాంచనః శ్రీమాన్ సోమస్యాపి రథోభవతు। అసృగ్గర్లా

హిత్రైరశ్వైః సర్వైరగ్నిసంభవైః। సర్వతేజసా శుక్రో వై ఋజువక్రానుచక్రగః॥ ౭౬॥

నక్షత్రమండల కక్ష్యకూర్ధ్వభాగమున రెండులక్షలయోజనముల దూరమున శుక్రమండలముండును. శుక్రుఁడు సూర్యసన్నిభంబును బతాకావిరాజితంబును నానావర్ణ విరాజమాన భూసంభవోత్తమాష్ట హయయుతంబునునగు మహారథము నధిష్ఠించి బుధసూర్య సమానవేగంబునఁ దిరుగుచుండును. ఋజువక్రసమములను మూఁడుగతులు గలవాఁడు. సామాన్యముగ లోకహితకారియై వర్తించును. ఈతండు వర్షకారకుఁడు. ఆపోజ్యోతిరూపుండై ప్రాణిపిండాండ దేహమందు మూలాధార స్వాధిష్ఠాన మధ్యమున నున్నవాఁడై శుక్లోత్పత్తికిఁ బ్రధానకారకుఁడైయుండును.

—౦—

## నక్షత్రమండలకక్ష్య.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా ౨౨

తత ఉపరిష్టాల్లక్షయోజనతో నక్షత్రాణి మేరుం దక్షిణేనైవ కాలాయన ఈశ్వరయోజితాని సహాభిజితాష్టావింశతిః॥ ౧౦॥

చంద్రమండలమునకుఁ బైభాగమున లక్షయోజన దూరమున నక్షత్రమండలంబు నొప్పుచుండు. అయ్యది కాలచక్రమున మేరుభూధర దక్షిణభాగంబున నున్నది. అందలి నక్షత్రము లభిజిత్తుతోఁ జేరి యిరువదెనిమిది. ఉత్తరాషాఢా శ్రవణనక్షత్రములసంధిని నయ్యభిజిత్తుకలదు. "అభిజిన్నామ నక్షత్రం ఉపరిష్టాదషాఢానాం అధస్తాచ్ఛ్రోణా"అని శ్రుతిప్రమాణము. ఇరువదెనిమిది నక్షత్రములు తేజోరూపమునఁ బ్రాణికోటి పిండాండ దేహమునందంతట వలయాకారమున వ్యాపించియున్నది.

---

## చంద్రవిషయవిశేషము.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨ - పుట. ౭౮

సోమస్యశుక్లపక్షాదౌ భాస్కరే పురతస్థితే। ఆపూర్యతే పురస్యాంతః సతతం దివసక్రమాత్॥ ౫౫॥ దేవైః పీతం క్షయే సోమమాప్యాయయంతి నిత్యదా।

ఏతంపంచ దశాహంతు రశ్మినేకేన భాస్కరః। ౫౬। ఆపూరయన్ సుషుమ్నేన భాగం భాగమహఃక్రమాత్। సుషుమ్నాప్యాయమానస్య శుక్లావర్ధంతి వైకలాః ౫౭। తస్మాత్ ద్రసంతివై కృష్ణేశుక్ల ఆప్యాయయంతిచ। ఇత్యేవం సూర్యవీర్యేణ చంద్రస్యాప్యాయితాతనుః। ౫౮। పౌర్ణమాస్యాం సదృశ్యేత శుక్లః సంపూర్ణమండలః। ఏవమాప్యాయితః సోమః శుక్లపక్షే దినక్రమాత్। ౫౯। తతోద్వితీయ ప్రభృతి బహుళస్యచతుర్దశీ। అపాంసార మయస్యేందో రసమాత్రాత్మకస్యచ। పిబంత్యంబుమయందేవా మధుసౌమ్యం సుధామయం। ౬౦ ॥ సంభృతంచార్ధమాసేన అమృతం సూర్యతేజసా। భక్షార్థమమృతం సౌమ్యం పౌర్ణమాస్యముపాసతే। ౬౧ ॥ ఏకరాత్రిం సురైః సర్వైః పితృభిశ్చ మహర్షిభిః। సోమస్యకృష్ణ పక్షాదౌ భాస్కరస్యాభిముఖస్యచ। ౬౨। పక్షీయతే పురస్యాంతః పీయమానాః కలాః క్రమాత్। క్షీయంతే తస్మాత్ కృష్ణేయాః శుక్లే హ్యాప్యాయ యంతితాః। ౬౩। ఏవందిన క్రమాతీతే విబుధాస్తు నిశాకరం। పీత్వాఽర్ధమాసం గచ్ఛంతి అమావాస్యాం సురోత్తమాః॥ పితరశ్చోపతిష్ఠంతి అమావాస్యాం నిశాకరం। ౬౪ ।

## —♦ చంద్ర విషయము. ♦—

చంద్రుఁడు పశ్చిమదిశయందత్పత్తియగుచుండును. లీనము. తూర్పుదిశయందగును. శుద్ధవిదియ ఘడియలలో సాయంకాలమందు సూర్యుఁడస్తమించగానే చంద్రుఁడు బాలరూపముతోఁ బశ్చిమదిశయందగపడును. ఇదేచంద్రోత్పత్తి. అమావాస్యయందు తూర్పుదిశఁ జంద్ర శేషకాళాంశము సూర్యునిలోఁ జేరియుండుట చేత నీదిశలో అస్తమయమని చెప్పవచ్చును. ఈ రెంటికి అంతరాయము పదునాలుగురోజులు. చంద్రగతి చారముతో ప్రతిరోజు రెండుఘడియల ప్రకారము క్రమముగ దగ్గుచురాఁగా పదునాలుగురోజులకు సూర్యుడున్నతూర్పుదిశకుఁ గృష్ణపక్షములో అమావాశ్యనాటికి చంద్రుఁడు సూర్యునిఁజేరును ఇటులనేశుక్లపక్షమందుఁ బ్రతిదినము రెండుఘడియల ప్రకారము చంద్రగమనగతి తగ్గుచుండుటచేత శుద్ధపౌర్ణమినాటికి బూర్ణకళాస్వరూపుఁడై రాత్రిప్రారంభ సమయమునకుఁదూర్పుదిక్కునఁబూర్ణచంద్రబింబము మనకుఁ గానవచ్చును. ఈప్రకారము చంద్రుఁడొక్కమాసమునకు సూర్యునిచుట్టు తిరిగివచ్చుటచేతఁ జాంద్రమానముతో నొక్కమాసము. ఇట్టివంద్రెండుమాసము లోక సంవత్సరము. పితృలోకమువారికి శుక్లపక్షకృష్ణపక్ష మొకదినముగనగుచు నీలాగున పంద్రెండు మనచాంద్రమాసములు

చేరి వారలకొకమాస సంజ్ఞగనగును. ఇజేపితరులు దేవత్వమునుబొంది దేవలోక మానుజేసిన శింశుమారసూర్యవిగతితో మనసంవత్సరము వారలకొకదినమగును. మనము పితృకర్మలందు (బ్రేతత్వవిముక్తి వఱకు చంద్రసంజ్ఞగా చంద్రమాసములను మాసికాదులుగాఁజేయుదుము. ఈసంజ్ఞతో సంవత్సరానంతరము పిలోకముతో దేవత్వముతో స్వర్గలోక కాలమాన ప్రకారము మనసంవత్సరము వారలకొకదినముగా నగుచుండును. మనసంవత్సర శ్రాద్ధములు దేవత్వముఁజెందిన పితరులకు దినసంజ్ఞగా నగుచుండును.

చంద్రుఁడు శుద్ధపాడ్యమినుండి పౌర్ణమివఱకు దినదినప్రవర్ధమానము చెందుచుండును. ఇందుకుఁగారణము సూర్యునియందుఁగల సుషుమ్నానాడియే.

## —♦ చంద్రకళలపానవిశేషవిధానము. ♦—

కృష్ణపక్ష పాడ్యమినుండి చంద్రికళలను ద్యులోకము [illegible] వారు [illegible] సర్వులు వారిభాగాంశములుగ నిర్ణయించిన తిథులంగా వరుసప్రకారము [illegible] చేయుదురు. ఇది వారలకుఁ దమపగటికాలములో అయిదుఘడియలకాలముగ [illegible]ను. చంద్రుని మాసము దేవతలకొకదినములో (బం)డ్రెండవభాగము. (అయిదుఘడియలు కాలమగును) ఇట్టివి పంద్రెండుమాసములు పానముజేసినవి దేవతలకొక దినపానము [illegible]నుండును. ఈ అమృతపానముచేతనే దేవతలకు నితరకల్పితాహారాదుల నావశ్యకరములాయెను. మనలోకాదులలోవలె నిరంతరము ప్రయత్నములతోఁ గల్పించబడి తయారుచేయవలసినంత అవసరములు లేదు. మనకున్న వారికిఁ బరిపక్వాదులు కల్పితములుకాని మనయాహార మోషధీకల్పితమగుట నమృతముకాజాలదు. వారలయాహారము సూర్యకృతమగుట నమృతమనబడును. దానిఁద్రావి వారమర్త్యులైరి. అన్నాదులచేత మృతస్వరూపులమై మనము మర్త్యులమైతిమి. ఏలోకములో నుండుటమేలో నెవ్వడైనను దెలిసి ఆశ్రయించవలెను. లోకములే లేవని ఉదాసీనముతోనున్న నేమియు ఫలములేదు. ఇటులనే సర్వవిషయాదులందున తారతమ్యము లనంతములుగనుండును. చంద్రికళల వృద్ధితో శుక్లపక్షమనియు క్షీణతతోఁ గృష్ణపక్షమనియు మనవ్యావహారికము.

చంద్రసూర్యుల అంతరాయకాలమే తిథిసంజ్ఞలు. నక్షత్రములు. ఏమాసముతోనైనను తుదకు సంవత్సర సంజ్ఞతో ముగిసి మరల ప్రారంభమగును. మనుష్యమానము మొదలు బ్రహ్మమానపర్యంతము సర్వులకు ఆయుఃపరిమితి శతసంవత్సర

## (౫) చంద్రకళల చిత్రపటవివరము.

ఈచిత్రపటమునుగురించి అనేక విశేషాంశముల నాలోచించి తెలుసుకొనఁదగినదియున్నది. ఇందులో మధ్యలోఁగల సూర్యుని సమయసందర్భానుసారముదయాస్తమయదిశల భేదములతోను, బూర్వార్ధోత్తరార్ధ గోళములతోను, జంద్రకళలను నుదయాస్తమయ దిశలననుసరించియు నన్వయించవలెను. మనకు సాయంకాలమునఁ బశ్చిమదశలో సూర్యునకుఁ దూర్పునఁ జంద్రోదయమును మనకుఁదూర్పున నుషఃకాలమున సూర్యునకుఁ బశ్చిమములోఁ జంద్రోదయాస్తమయములును గలుగునట్లును (అమావాస్యయందు) సర్వవిషయములందు సూర్యుఁడుభయమధ్యలో నుండునట్లును గ్రహించవలెను. ఈచంద్రుఁడు మనకు నిత్యముగపడు భౌతికజలభూతమగు నిత్యషంచదశ కలాత్మక చంద్రుఁడనియు, సూర్యునికధోభాగమున నున్నచంద్రుని ప్రతిబింబరూపుఁడనియు గ్రహించవలెను మనోకవిధముతో సూర్యాంతరోపరి షోడశీకల సోమముగను, ధ్రువకళతోఁ బరాపరమువరకు నాత్మశాంత శుద్ధసత్త్వ సప్తదశీకళగను దనుపరి నాత్మస్వరూపముగను నన్వయించి యుపాసించవలెను. ధ్రువమును ధ్రువాంశమును గనిపెట్టువారలకే సులభగోచరముకాదు. కేవల ప్రత్యక్ష ప్రతిబింబమునఁ బ్రకృతిలోఁజూచినవన్నియుఁ గల్పితములై యనంత భ్రమలకును, భిన్నములకును గారణమగును. మూలము దెలసినచో విపరీత సంశయముల కాస్పదముండదు. ఆత్మస్వరూప నిశ్చయజ్ఞానముతో సత్యధ్రువము దోచునంతవరకు నీప్రకృతిధ్రువమే ప్రత్యక్షప్రమాణముగఁదోచి బాధించు చుండుటచేతఁ దదుపరిలోఁగల సత్యధ్రువవిషయము బోధకాఁజాలదు. అందుచేత సందేహములు విడవాడవు. సిద్ధాంతము దొరకదు. చుట్టునుగల చంద్రకళల కేంద్రభాగములో భూమిగోళాకారముగనున్నది ఈ భూమిచుట్టును జంద్రకళలు జలభూత భ్రమణతోఁ దిరుగుచుండును. ఈ రెంటికిని భ్రమణాలున్నవి. భూమికెదురుగ లోపలి భాగములోని చంద్రకళలు రాత్రి మనకగపడును. అవలవైపుననున్న చంద్రకళలు పగలుకనఁబడును. అవియే శుక్లకృష్ణపక్షతిథుల సంజ్ఞలు. శ్రీవిద్యలోని యీకళల నామములును, వాటికిసరిగ రాత్రికళలను. బగటికళలను వ్రాయఁబడినవి. భూమికిఁగల యుదయాస్తమయముల సంధ్యలు, మధ్యాహ్నవేళయందు భూమికిసూటిగాఁగల సవితృసంబంధ సావిత్రీకళయుఁ జూపఁబడినవి. దీనినే మన కుపనయనకాలమునందు శ్రీగాయత్రిగా ముఖ్యోపాసనగాఁ బ్రణాదితో బ్రహ్మోపాసనగా నుపదేశించి యుపాసింపఁజేసిరి. ఈచిత్రపటమును సావకాశముతో సవిస్తరముగఁ జూచినచో ననేకవిషయములు తెలియగలవు. ఉత్తరాయణమందు సూర్యుఁడుపరి శింశుమార వలయార్ధభాగములో నుండుటచేతఁ జంద్రుఁడు కృష్ణపక్షమందు దుత్తరాయణ

దిశలో సూర్యుని సమీపించుచు నమావాస్యయందు సూర్యునిజేరును. శుక్లపక్షమందుఁ జంద్రుఁడు శింశుమార దక్షిణార్ధ వలయములో సంచరించుచుండును. ఇటులనే దిశలభేదములతో దక్షిణాయనమందుఁ జంద్రుఁ డుభయభేదములతోఁ ద్వైవిధ్యమునకు వ్యతిరేకమునఁ దిరుగుచుండునని తెలియవలెను. ఇందులోని పెద్దయంకెలు చంద్రకళల సమీపములో నున్నవాటిని శుక్ల కృష్ణపక్ష తిథులుగఁ తెలియవలెను. చంద్రకళలు సూర్యునికి వెనుకపార్శ్వములోఁ గృష్ణపక్షమందు సూర్యుని సమీపించుకొలఁది కళాహీనమగుచుండును. ఈకళలు శుక్లపక్షమందు సూర్యుని ముందుపార్శ్వములో పౌర్ణమాసివరకు దినదిన ప్రవర్ధమానమగుచుండును. పౌర్ణమాసి రోజునకు సూర్యునకు సూటిగాఁ (నెదురుగా) ప్రతిబింబము సంపూర్ణమైనవాఁడగుచుండును. ఇది సూర్యుని మధ్యలోగల యుపరిషోడశీ సోమకళ. దీనిని శుద్ధ సాత్త్వికాంశ శాంతాత్మకళగా నెఱుఁగవలయును. ఈకళయాత్మనుండి యధోముఖముతోఁ గ్రమముగావచ్చి సూర్యునిలోఁజేరి నిలిచినది. అందుచేతనే 'మనకుపనయనములో బ్రహ్మస్వరూపిణిగాఁ బరాపర ప్రకృతియగు సావిత్రిస్వరూపిణిగా నుపదేశించిరి. ఈకళ భూతాదులలో భూతాంశ గుణాదుల ప్రకాశమునను సరించిన తేజస్సుతోను, జీవరాసులలో మనస్సుగను నుభయపక్షముగా సంకల్పవికల్పాత్మకముగనున్నది. ఈ బ్రహ్మాండమునకే పరిభ్రమణయుండుటచేత నందులోని వాటికఁతటికిని గూడ భ్రమణ సహజముగా నుండియేతీరును. బ్రహ్మాండాంతరములో నున్నవాటికుభయ భ్రమణాలుగూడనుండును. మనమున్న పృథివి యంత్యభూతమగుటచేతఁ గడపటి భ్రమణతోనున్నది. మనకుపరిలోఁగల నితరభూతాదులన్నింటికిని భ్రమణాలున్నందుచేత సిద్ధాంతముజేసి జెప్పుటకష్టము. కాబట్టి మనసిద్ధాంతము:న్నియును భ్రమలోని సిద్ధాంతము లేయగును వేదము భగవద్వాక్యముగాన వేదసిద్ధాంతమే ప్రమాణము. తదితరసిద్ధాంతములకు సర్వదా మార్పులుతప్పవు. మనకుపరిలోఁగల జలభూతమునకు భ్రమణయుండుటచేత నిత్యచంద్రకళలు వృద్ధిక్షయాత్మకముతోఁ బ్రతిబింబితమై తదుపరి తేజోభూతరాశియగు సూర్యునికిని మనకును మధ్యలో వెనుకముందుగాఁగల యుభయపక్ష చంద్రకళల కవకాశ కారణములుగల్గెను. ప్రతిభూతమునందు నాత్మచైతన్యతేజస్సు గుణత్రయాదులతోఁ దప్పక కాలకర్మక్రియాదులకై యున్నదని నిశ్చయించి తెలియవలెను. ఈచంద్రకళల చలనము సూర్యస్వపరిభ్రమణ జలభూతభ్రమణ పృథివీభూతభ్రమణ భూతాదులభ్రమణ, దిశలభేదములు నొకదానికొకటి కారణములై యాత్మనుండి బింబప్రతిబింబ న్యాయానుసారమగుచున్నవని తెలియవలెను. మనకుఁబండ్రెండుమాసములు, రెండయనములు, రెండు

పక్షములు ఆరోహణావరోహణ మార్గములు, నూర్ధ్వమధ్యాధోభాగస్థానములు మున్నుగాఁగల భేదము లనేకములున్నవి. ఈ త్రిభువనములకు సూర్యుఁడే మూలాధారభూతుఁడు. సూర్యుననుసరించియే సర్వమున్నది. అందుచేతఁ జంద్రుఁడు, మాసభేదములతో నయనభేదములతో శింశుమారగతి భేదములతోఁ బక్షభేదములతో నారోహణావరోహణ మార్గములతో నూర్ధ్వమధ్యాధోభాగములతో మార్పులుగా మన కుపరిలో మనచుట్టు నిత్యము మాసాధిపతియై దిరుగుచున్నాఁడు. ఈకళయే లేనిచో మనముజీవింపఁజాలము.

ఇందు వెంటగల మరొక చిత్రపటమున (బంచభూతముల పరస్పర సూత్రాకర్షణ సంబధములు, భూతాదుల కక్ష్యలు, చంద్రికక్ష్యలు కలవు. చూచి గ్రహింపవచ్చును. ఆపోభూత (చంద్ర)మండలము తేజోభూతము (సూర్యుని) చుట్టును దిరుగుట కొకమాసము మన మానముతోనగును. ఆపోభూతలోకమున కిదొక దినసంజ్ఞ. దీనినే మనము శుక్లకృష్ణపక్షములందుము. ఈ భూతలోకవాసుల కీయుభయపక్షములు రాత్రింబగళ్లగును. మనదినము వారికి రెండుఘడియలగును. మన మున్న పృథివీభూతము శుక్లపక్షమంతయు సూర్యునకు తూర్పుపార్శ్వములో (మనకు పశ్చిమములో) దినదినాభివృద్ధి గాగల చంద్రికళలు పెరుగుచు సూర్యునికి దూరమగు మనకు రాత్రులందగపడుచుండును. మరల కృష్ణపక్షమందీకళలు సూర్యునకు వెనుక ఉత్తర (పశ్చిమ)దిశగా (మనకు తూర్పున) దినదినము హీనకళలతో నాపోభూతముతో సూర్యునిఁజుట్టు తుదకమావాస్యయందు మనకుఁ దూర్పువ సూర్యోదయముపకుముందే సూర్యునితో సమీపించిచేరును. ఇందుకు గారణమాపోభూత భ్రమణమే. ఇందులోఁ బ్రతిబింబితమే చంద్రుడు. ఈ శుక్ల కృష్ణపక్షము లాపోభూతము. ఇది సూర్యుని సమీపించుటలోఁ గ్రమముగాఁ గృష్ణపక్షముగను, మరల సూర్యునినుండి దూరమగుటలో శుక్లపక్షములుగనునగును. తేజోభూతాధిపతి సూర్యుఁడుగను ఆపోభూతాధిపతి చంద్రుఁడుగను దెలియవలెను. ఈ ఉభయ మధ్యలోనున్నదే మనపృథివీభూతము (అగ్ని) ఈకారణములచేతనే చంద్రికళలకు వృద్ధిక్షయాదులగుచుండును.

సృష్టియనఁగఁ క్రమముగ బింబప్రతిబింబన్యాయము. ఆత్మనుండి ప్రతిభూతావరణమందును వాయూభూతగుణానుసార స్వరూపతత్త్వముతో నాత్మచైతన్య ప్రకాశకళ లాస్వరూపమునకు నామగుణములతో నేర్పడి యాయాకార్యప్రకాశ ఫలానుభవగతి నడుచుచుండును. ఇది యాదిభూతమగు నాకాశములో బ్రహ్మస్వరూపముగను, వాయూభూతములో ధ్రువస్వరూప మేరువుగను. తేజోభూతములో

నాదిత్యుఁడుగను, జలభూతములోఁ జంద్రుఁడుగను, బృథివీభూతములో నగ్నిగను నాయాభూతాధి దైవతములై ప్రకాశించి సృష్టిస్థితిలయాదులకుఁ గారణభూతములై యుండును. ఈ భేదములకొకయుదాహరణము. క్షీరముష్ణగుణముకలది. దధి శీతగుణముకలది. క్షీరమునుండియే దధియుత్పన్నమైనది. భూతగుణావరణ భేదములో నొకటి యగ్నితత్త్వము, మరొకటి జలతత్త్వమునాయెను. ఈ లాగుననే యన్నియు నాద్యంతములందేకాంశమే తత్త్వముతోనగును. మధ్యలోనే భేదములుండును. ఇది ప్రకృతి సహజగుణము. ఊహించినంత ముందుకుబోవుచు నేయుండునుగాని అంతము సిద్ధాంతముగానేరదు. ఇందుకు భ్రమణయేకారణము అందుచేతనే శ్రీమదాదిశంకరులు పర్యాయపదముల జగత్తనుభ్రాంతితో మిథ్యయని చెప్పిరి. ఏమియును లేనిదానిలో నేమియును లేనిదెట్లనేకములకుఁ గారణమాయెనని మూలమునుదెలిసి యాలోచించిన ధీరులు మిథ్యయనక మరేమందురు? వీటినే కారణకార్యములందురు. రెండవదానితోనే భిన్నముగాఁ జూపుగలిగెను. సంపూర్ణములో నేచూపునులేదు. చూపేరెండవది. అందుచేతనే తత్త్వవేత్తలు చూపు చూపులో గలియవలెనందురు. ఇదేమనోలీనము. చూపే ప్రమాదము. చూపుతోనే ప్రత్యేకము. భిన్నము, ననంతము, అభిమానవ్యామోహాదులు, భ్రాంతులు, సృష్టిస్థితిలయాదులు నగుచుండును. ఇందుకు మనసుషుప్తియే యుదాహరణము. మనచూపుకడపటిది. మనకు బాహ్యములో సర్వమ్ము నున్నట్లగపడి భ్రమింపఁజేయుచు. తదుపరి వ్యామోహాతిశయముతో సర్వదా బాహ్యమునే యభిమానింపజేయుచున్నది. ఈ పొరబాటంతరములోని చూపును దెలియునంతవరకును బోఁజాలదు. ఈ పొరబాటునుదెలిసి తన్నుదనలోఁదానేచూచుట తెలిసినచో నిప్రమాదముదొలఁగును. చూచి చూపేలేకజేసుకొన్నచో స్వస్వరూపమేనిలుచును. ఈ చూపునే యనేకవిధములుగజెప్పిరి. ఇది కార్యభేదములతో ననేకములైనది. సర్వప్రమాదములకుఁ జూపె కారణము. చూపుతోనే సర్వావర్ణనములు, గుణాదులు, ద్వంద్వములు, ననంతభిన్నములు, భ్రమణలుగలిగెను. ఆదిలోని చూపెటుల వచ్చెనో మరల నటులనే వెనుకకుమరలి తుదకేమియు లేకపోవుటయే యాత్మస్వస్వరూపము. ఇదితెలిసినచో నన్నియును మిథ్యలగును. తెలియుట బహుదుర్లభము. చూపు సకలకల్పితములకుఁగారణము. చూపే యిహపరసాధనము. చూపేరూపము. రూపమేయాదిత్యుఁడు. చూపేమనస్సు. మనస్సేచంద్రుఁడు. ఒకటి తేజోనేత్రము మరొకటి మనోనేత్రము. విచారమంతయు మానవా వాము, వేదగమ్యము, మరికొన్నివిషయములను జంద్రవిశేష విషయమందుఁ జూడవచ్చును.

## —♦ చంద్రకళల - విమర్శనము - విశేషము. ♦—

చంద్రకళలను విమర్శింప దలంచినచో ననేకవిధములుగ విమర్శించవచ్చును. అది మనస్సునకును దృష్టికిని సమాధానముగ నేయుండి 'వారివారి యోగ్యతకొలది వారికి సత్యముగనే తోచుచుండును. అన్నియుందమతముమార్గములకును సరిపోవు నట్లే తోచుచుండును. అందుచేత ననేకవిధములుగ విమర్శింపవలసివచ్చెను. తుదకు సత్యముచు ధ్రువమును దెలిసినవారలకు వేదమార్గమే ప్రమాణమగును. మిగత మార్గములన్నియు తాత్కాలికములే. ఇపుడు మరొకవిధముగ విమర్శించుచున్నాను. గమనించవలెను

పృథివీభూత భ్రమణనుబట్టి చంద్రకళల నొకవిధముగం బశ్చిమాదిగను మరొకవిధముగ సూర్యోదయ దిశనుబట్టియు నుండును. భూమికి దినమునకొక భ్రమణయు చంద్రలోకమగు జలభూతమునకల మనమాసమునకొక భ్రమణయుం గలుగును. శింశుమారములో సూర్యగతితో మనసంవత్సర మొకదినముగను మన భూభ్రమణగతి ప్రారంభము సాయమాదిగ నేయున్నది. ముందు రాత్రియు మరల బగలును నగుచున్నవి. ఇది తమోలోకము. జలపృథివీభూతములు తమోగుణ ప్రధానములు. శింశుమారము (స్వర్గము) తేజోలోకగుణ ప్రధానమైనది. మహర్లోకాదుత్తర త్రిలోకములగు జన. తపస్సత్యలోకాదులు వాయుభూతలోకాదులగును. ఉభయమధ్యకేంద్రమే మహర్లోకము. ఉపనిషత్తులోం బృథివీ విషయమును జెప్పునపుడు శిక్షావల్లి ప్రథమానువాకమున "అగ్నిః పూర్వరూపమ్ ఆదిత్య ఉత్తరరూపమ్, ఆదిత్యఉత్తరరూపమ్, ఆపః సంధిః వైద్యుతస్సంధానమ్"అని యున్నది. మనకు అగ్న్యధిదేవతాకము ప్రధానముగను ప్రారంభముగను నున్నది. అగ్నితమోలోకమునకే. అగ్నినిని వరుణినిని సన్నిహిత సంబంధముకలదు. మనసృష్టికి)యా కర్మాదుల సాయమాదిగనే ప్రారంభము. శ్రీవేదమాత గాయత్రీ సంధ్యావందనము గూడ సాయమాదిగనే ప్రారంభము. ఔపాసనాదులు సర్వకర్మలు క్రియలు సాయమాదిగనేయున్నవి. అందుచేత నుపనిషత్తులు "అగ్నిః పూర్వరూప"మని జెప్పినవి దీనినింబట్టి సాయమాదిగనే పర్వారంభమున వచ్చును. "ఆదిత్యఉత్తరమ్"అని చెప్పినందుచేత పగలు రెండవదిగా నున్నదనుట స్పష్టము. సాయంకాలమునకు మన భూమి వరుణదిశనుజేరుసు. వరుణుండు మనకును సూర్యునకును మధ్యలో మన కుపరిగ్రహముగ నున్నాండు. కాబట్టి సాయంకాలమునకే చంద్రకళ మనకు ప్రారంభముగనున్నది. ఈ కళలు దినదినాభివృద్ధిం మనకాలమానములో రెండేసియు లధికముగాం జంద్రకళ కాంతులు పెరుగును. మనకును శుక్లపక్షమందు దిన

దినము రెండుఘడియలకాలముచొప్పున కళలప్రకాశమునకు గాలమునకుఁ బెరుగు దలయున్నది. ఈ రెండుఘడియలకుఁ గారణము జలభూత భ్రమణగతి. మన కాలమానముతో రెండుఘడియల కాలముచొప్పున గతితో మన మాస మాలోకమున నొకరాత్రియు బగలునగును. ఈలెక్కతో మరల కృష్ణపక్షమందుగూడ కళలహీనమానములుగూడ సరిపోవుచున్నవి. మన భూభ్రమణగమనవేగముతోఁ బ్రథమ దివసమున రెండుఘడియలుగును మరల క్రమముగా జలభూత గమనముతో ముందుకు వచ్చుటతో వెనుకటిరెండుఘడియలు మరనటిరెండుఘడియలుచేరి రెండవ తిథియందు నాలుగుఘడియలకాలమధికమగును. ఈలాగునఁ బున్నమవరకును ముప్పదిఘడియలుగను మరల నిదేవిధముగనే జలభూతభ్రమణ సూర్యునికిముందు వెళ్ళుటచేతఁ జంద్రకళలు దూరమగుచుఁ గృష్ణపక్షముగ దినదినము కళలు దూరకాలవ్యవధులతో సూర్యునకుత్తరదిశ చేరుటచే మనకుఁగళలు క్రమక్రమముగఁ దగ్గుచూ కృష్ణపక్షమగును. జలభూతము రోజునకు రెండుఘడియలచొప్పున గతితో మనకు ముందుగాఁ బోవుచుండును. మరల జలభూతకాలమాన దినాంతములో మనకుసమీపించుటచేత నెదురుగా శుక్లవిదియకళ మనకు బశ్చిమములోఁ గనిపించును. కృష్ణపక్షకళలు మనకుఁ దూర్పుననుండి యుత్తరదిశకు దూరముగను, మరల సూర్యునికి వెనుకభాగమందు సమీపించి మరలమనదృష్టితో భూభ్రమణతో మనకుఁ దూర్పుదిశ నమావాస్యయందీ చంద్రకళ సూర్యునిఁజేరును. ఉభయదిశలకు ముఖ్యకారణము మన భూభ్రమణ, జలభూతభ్రమణ. సూర్యునికి ముందువెనుకలుగఁ బ్రాక్పశ్చిమములందు దుదయాస్తమయముగా శుక్లకృష్ణ పక్షభేదములతో వృద్ధిక్షయాత్మకముతో జంద్రకళలు దినమునకు రెండేసిఘడియల సంఖ్యతోఁ గ్రమముగాఁ జరుగుచున్నది. లేకున్న వేరుమార్గమే లేదు. ఇదిగూడముఖ్యమార్గమని వివరించితిని. వేదశాస్త్రప్రమాణాదరాభిమాన సంపన్ను లీరహస్యములు తప్పక దెలుసుకొన సమర్థులు. తదితరులు ప్రకృతి ప్రమాణ ప్రత్యక్షముతో భ్రమణ గతిద్వయముతో సత్యమును దెలియరు.

— సీతాల వాచే

పూర్వపశ్చిమ భ్రమణలతోఁ గలిగినదే పైభేదము వేరుగాదు. పశ్చిమమే పూర్వము, పూర్వమేపశ్చిమము. ఎప్పటికిని ఆద్యంతములేకము లేను. భ్రమణలేనిచోఁ బూర్వములేదు. పశ్చిమములేదు. పూర్వపశ్చిమములు రెండును నేకములే. "సవితా పశ్చాత్తాత్సవిపురస్తాత్స వితోత్తరాత్స వితాధరాత్తాత్సవితానో రాసతామ్ అని వేదము. అందుచేత సత్యములేదు. సిద్ధాంతము లేదు. జగత్సత్యమని యెంతవరకుఁజెప్పిరో నిదియు నంతవరకే. జగన్మిథ్యమని యెప్పుడు చెప్పిరో

యప్రపన్నియు మిథ్యలేదు. మూలస్వరూపజ్ఞానము గలుగునంతవరకేమియును నిశ్చయింపఁజాలము. నిశ్చయించినను అనుమానముతీరదు. అందుకే వేదములు పూర్వమే స్వయముద్భవమై సత్యమును ఘోషించినవి. మిగతవన్నియును మధ్యలోఁ గాలముచేత అంతరాంతరములుగా ముందెంతవరకు ఉత్పన్నములగునో తెలియఁజాలరు. వేదముసత్యము. ఋతువులకుఁ జంద్రుఁడే కారణుఁడు. ఇందుకు చిత్తిపన్నమునం దెనిమిదవ అనువాకములో "సువర్ణం గోశగ్ం రజసాపరీవృతం, ్వనాం వసుధానీం విరాజం, అమృతస్యపూర్ణా తామకలాం విచక్షతే, పాదగ్ం షడ్ధోతుర్నలానివిత్సే॥ ౮ ॥"అని ప్రమాణముకలదు.

ఈబ్రహ్మాండాంతరములో షడ్ధోతృరూపముతో సూర్యుఁడు నగ్నిహోత్రుఁడు మొదలగు సర్వదేవతలందుఁ బూర్ణానందామృత స్వరూపముండును. అందుచేతనే యాత్మాంశ కళారూపుడుగా మధ్యలో చంద్రుడు మనస్సుగా సందర్భానుసారముగఁ బ్రకాశించుచు షడ్ధోరూప మంత్రదేవతగానున్నాఁడు "యేనర్త్వః పంచధోతక్లుప్తాః ఉతవాషడ్ధామవసోతక్లుప్తాః తగ్ం షడ్ధోతారమృతుభిః కల్పమానం, ఋతస్యపదే కవయోనిపాంతి॥ ౮ ॥"అని శ్రుతి కాలకర్మల నిమిత్తముగా షడ్ధోతృ దేవతాపక్ష స్వరూపము చంద్రుఁడు. పంచహోతృ దేవతాపక్ష స్వరూపము చంద్రుఁడు చంద్రమండలమును దలంచి యాత్మగాభావించినవారికి మనస్సే తుదకాత్మగా స్వస్వరూపము గానగును. షడ్ధోతృ పక్షమని కొందరందురు. పంచహోతృపక్షమనియు కొందరియభిప్రాయము. ఎటులైనను నొక్కటే. హేమంత శిశిరఋతువులనొక్కటేయని కొందరిమతము.

"ఆతః ప్రవిష్టం శరీరమేతం, అంతశ్ఛంద్రమసి మనసా చరన్తం, సహైవ సన్తం నవిజానన్తి దేవాః, ఇంద్రస్యాత్మానగ్ం శతధాచరన్తం॥ ౧౦ ॥ ఇంద్రో రాజా జగతోయ ఈశే॥ చంద్రుఁడనగా సమస్తజీవరాస్యంతర్యామి స్వరూపుడు, మనస్సు. దీనిఁ దెలియుటే యాత్మస్వరూప వేదవిజ్ఞానము. ఇది భూతాదులను బంచభూతాత్మలకును సమన్వయము. చంద్రుఁడు సర్వజీవరాసులందునుగల సంకల్పమాత్రస్వరూపుఁడే పరమాత్మయే, దీనినే జ్ఞానస్వరూపముతోఁ దెలిసిన ధన్యుఁడగును. అజ్ఞానముతో దేవేంద్రాదులైనను బొత్తిగాఁదెలియఁజాలము. వేదవిజ్ఞానముతో సర్వములభించును.

—•—

## (6) పంచభూతముల పరస్పర సంబంధ వివరములు.

1 ఆకాశములో నుపరిభాగమాత్మ. క్రిందిభాగమాకాశము, 2 వాయుభూతము, 3 తేజోభూతము, 4 జలభూతము, 5 పృథివీభూతము. ఇవి క్రిందినుండి యొకదానికంటె మరొకటి దశాంశాధిక్యములోనున్నదని గ్రహించవలెను. రెండు భూతముల సంధిస్థానమే ధ్రువపదసూత్రసంబంధము. ప్రతిభూతమునకును మిగత భూతములతో సంబంధాకర్షణ లున్నందుచేతనే ఒకదానిచేనొకటి యాకర్షింపఁబడి సృష్టి స్థితిలయాదులతోను, గాలకర్మలతోను బరిభ్రమణలుగలిగి ప్రవృత్తికిని బ్రళయమునకును, లీనమునకును మార్గములైయున్నవి. దీనననుసరించి రాత్రియుఁ బగలునుగూడఁ గలుగుచున్నవి. ఒకభూతార్థభాగ ముపరిభూతార్థభాగదిశలోఁ జేరినపుడు రాత్రికాలముగను, బ్రత్యేకించి తదుపరి తేజోభూతదిశను బొందినపుడు పగలుగను దెలియవలెను. ఈ పంచభూతములే సప్తవ్యాహృతులకుఁగూడ నన్వయము. ఉపరిభూతముతోఁ క్రిందిభూతముల వాయుస్తేజస్సూత్రాకర్షణమే మేరువు. ఈభూతములమధ్యములందుఁగల ఆత్మతేజః ప్రకాశమే యాకాశాదిగ బ్రహ్మ ధ్రువ, సూర్య చంద్రాగ్నులుగ మూర్తీభవించి బింబప్రతిబింబ న్యాయముతోఁ జైతన్యవంతముగ సృష్టి, స్థితిలయాదులతోఁ బ్రకాశించుచున్నారు. మిగత విషయాములనుగూడఁ జైచిత్రపటములోఁ జూడవచ్చును.

### సృష్టిస్థితిలయ పంచభూతాదుల విమర్శ:

సృష్టిపిమ్మట లయముండవలెను. అందుచేతఁ బంచభూతములు రెండువరుసలుగా ననులోమ విలోమములతో నుండియే తీరవలెను. అకాశాది భూతక్రమముతో సృష్టియు, మరలఁ బృథివ్యాదిగా నాకాశాంతముతోఁ బ్రళయము. నొకదానికొకటి వెంటనంటియుండవలెను. ఆత్మస్వప్రకాశ చైతన్యరూప తేజోగ్ని క్రమముగా అన్నిటియందంతర్హితమైయుండి ప్రకాశించుచున్నంతవరకు నీబంచభూతము లతిక్రమించక విరాడ్బ్రహ్మాండములోను జీవదేహములోను "భీషాస్మాద్వాతః పవతే- భీషోదేతిసూర్యః- భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమ ఇతి"అను ఉపనిషత్ప్రమాణానుసారము నడచుచుండును. దీనికంత్యకాలము గలిగినపుడు మొదట నీశ్వరచైతాగ్ని యూర్ధ్వముఖముఁగాగానే పైయుపనిషద్వాక్యమునకు విరుద్ధముగా నతిక్రమించి జలభూతాభివృద్ధితోఁ బృథివియతమగను తేజోభూతాగ్న్యభివృద్ధితోఁ దేజోభూతాంతమై, ఆకాశభూతాభివృద్ధితో వాయుభూతాంతమై, తుదకాకాశము నిశ్శబ్ద నిర్వికారమగును. దీనికిమూలకారణమువాయువు. ఆదిలో

నీవాయువభివృద్ధియై సర్వభూతములను దారుమారుజేయును. మొదటిసృష్టిలోఁ నానాధారముగ నుండినదైనందుచేత మరల నంతములోఁదాను నిలువకపోవుటచేత మిగతభూతాములన్నియు వైపరీత్యమొంది పంచత్వమునొందును. ఈవాయ్వగ్నులే జీవరూపము. ఈరెంటిలోనే యొక్కటి కదలినను రెండును స్థానమువిడుచును. ఈరెంటికిని నవినాభావసంబంధము. సృష్టిలో నుపరిభూతాదు లొకదానికంటె మరొకటి క్రమముగాఁదగ్గుచుఁ గ్రిందిభూత గుణాధిక్యమగుచు స్థూలదేహమగు పృధివివరకువచ్చును. స్థితిలోనన్నియు సమములుగానుండును. అంతములో మరల నుపరిభూతము లాధిక్యతనొంది క్రిందిభూతములను దమలోఁజేర్చుకొనును.

అంతికాలములో మొదట వాతాభివృద్ధితో నుష్ణాభివృద్ధియుఁ (జ్వరము) దర్వాత, శీతాభివృద్ధితోఁ బృధి (స్థూలదేహము) వ్యంతమగును. ఇదేమృత్యువు. వీటినేనాడులననుసరించి మనభిషజ్ఞులుదెలిసి చెప్పుదురు. వీరలు జహద జహల్లక్షణావృత్తిగా నున్నదానిని లేనిదిగను, లేనిదాని నభివృద్ధిగను విపర్యాసభావములతో నీలోకములో వాడుకగాఁ జెప్పుచున్నారు ఈభూతములనే మొదటి సహజస్వభావములుగాఁగల పంచభూతములుగను జెప్పుట లోకములో వాడుకగనున్నది. వీటికనుకరణముగా ఛాందోగ్య తృతీయపాఠక త్రయోదశఖండములో మొదటనే హృత్పుండరీకవిషయము నందీవిధముగనున్నది. "హృదయస్థానమందు నాలుగు సూక్ష్మరంధ్రములున్నవి. వాటియందు నాల్గువిధముల భూతాదుల ననుసరించిన శబ్దోత్పత్తిగలుగుచుండును" వీటిననుసరించి మనహస్తమూలమున నాడులుస్ఫురించుచుండును. వీటినిఁబట్టి ఆయుర్వేదశాస్త్రజ్ఞులు ఫలములను జెప్పుచుందురు. యూలోపతివైద్యులు స్టెతస్కోపుతో హృదయమునందుఁగల నాలుగువిధముల సూక్ష్మరంధ్రములనుండివచ్చు శబ్దములనుగ్రహించి గుణఫలముల నూహించి చెప్పుదురు. ఇదే, ఉభయ తారతమ్యమార్గభేదములు. తుదకు రెండును నేకమార్గఫలయుతములే యగును.

వీటిననుసరించి యాధ్యాత్మిక యోగమార్గముతో నంతరములో నాదానుభవసంధానమును నభ్యాసయోగముతో నిరంతర నాదానుసంధానముతోఁ (దుదకు) నాదలీనముతో నాత్మస్వస్వరూపుఁడగును. బాహ్యములో నీనాద మీవిధిగ దేహమునకు దేహాత్మకును, నంతరములో నాత్మస్వరూపమునకు ఉభయమిశ్రితమార్గముగనున్నది.

—•—

ములే. చంద్రశబ్దమిాలోకవాచకము ఈచంద్రునికి వృద్ధిక్షయాదులున్నవి. వీనినే పంచదశకళలుగాఁ జెప్పిరి. ఇవే తిథులు. ఈపంచదశకళలకతీతముగా షోడశకళ ధ్రువసంజ్ఞగనున్నది దీనికతీతముగ సప్తదశి ధ్రువకళ మరొకటి కేవల శుద్ధముగ ఉపరిలోనున్నది. మనకీచంద్రకళాంశశేషము సూర్యుని సుషుమ్నానాడీద్వారా ఓషధులలోఁ జేరి వీర్యాది రూపములుగ మనలను బోషించుచున్నది. "సోమాధారం జగత్సర్వం"అని యిదివరకే వాయుపురాణ ప్రమాణము లక్షకముల నుదహరించినాను. మన దేహములో సప్తమచరమధాతు రూపము సోమాంశమే. అందుచేతనే ఘృతము సోమాంశము. ఈఘృతము దేవతల యాజ్యాహుతికి ముఖ్యరూపమాయెను. చంద్రుఁడు ప్రతిమాస శుక్లపక్షములలో నుత్పత్తియగుచుండుటచేతనే వేదము "నవోనవో భవతి జాయమానోహ్నాం......... భాగం దేవేభ్యో విదధాత్యాయన్ ప్రచంద్రమాస్తిరతి దీర్ఘమాయుః"అనియున్నది. మనశిరస్సులో సహస్రారము పైనున్నది సోమసంబంధము. ఉత్తమలోకాదులు సోమసంబంధములే. ఉపనిషత్తు "మహాఇతి చంద్రమాః చంద్రమసా వావ సర్వాణిజ్యోతీంషి మహీయంతే"అని. సాయంకాలమునుండి సూర్యునికి చేరుగ సమీపమునుండి క్రమముగ దూరమగుచున్న చంద్రవృద్ధి కళాంశమే శుక్లపక్షము. పౌర్ణమినుండి సూర్యునికి సమీపముగా రాత్రులందుఁ జేరవచ్చు చంద్రకళాహీనతయే కృష్ణపక్షము. సోమోత్పత్తిలో "దేవతానాం కళాపానం"అను శీర్షికలోఁ బ్రథమాంపిబతే వహ్నిః ద్వితీయాం పిబతే రవిః। విశ్వేదేవాస్తృతీయాంతు చతుర్థీం సలిలాధిపః। పంచమీంతు వషట్కారః షష్ఠీంపిబతి వాసవః। సప్తమీామృషయో దివ్యా అష్టమీ మజఏకపాత్। నవమీం కృష్ణపక్షస్య యమః ప్రాశ్నాతి వై కళామ్। దశమీం పిబతే వాయుః పిబత్యేకాదశీముమా। ద్వాదశీం పితరస్సర్వే సమం ప్రాశ్నంతి భాగశః। త్రయోదశీం ధనాధ్యక్షః కుబేరః పిబతే కళాం। చతుర్దశీం పశుపతిః బ్రహ్మాః పంచదశీం కళాం ప్రజాపతిః। పీతోపిబకళ ఏకస్యాత్ చంద్రమాః నప్రకాశతే। సిప్పీతకళావశేషశ్చంద్రమా నప్రకాశతే ॥ కళాషోడశికాయాంతు హ్యాపః ప్రవిశతేసదా। అమాయాంతు సదాసోమ ఓషధీః ప్రతిపద్యతే। తమోషధీ గతాగావః పిబంత్యంబు నగతంచయత్। తత్ క్షీరమమృతం భూత్వామంత్రపూతం ద్విజాతిభిః। హుతమగ్నిషు యజ్ఞేషు పునరాప్యాయతేశశీ। దినేదిన కళావృద్ధిః పౌర్ణమాస్యాంతు పూర్ణతా."

—♦ చంద్రస్థితి. ♦—

"త్రిముహూర్తం వసేదర్కే త్రిముహూర్తం వసేజ్జలే. త్రిముహూర్తం వశప్పలే॥"

—♦ అథ సోమోత్పత్తిః ♦—

కౌతూహల సముత్పన్నా దేవతా ఋషిభిస్సదా। సంశయం పరిపృచ్ఛంతి వ్యాసం ధర్మార్థకోవిదః। కథం వా వర్ధతే సోమః క్షీణో వా వర్ధతే కథం। ఇమం ప్రశ్నం మహాభాగ బ్రూహి సర్వమశేషతః॥ వేదవ్యాస ఉవాచ- శృణ్వంతు దేవతాస్సర్వా యదర్థమిహచాగతాః। తదహం సంప్రవక్ష్యామి సోమస్య గతిముత్తమామ్॥ అగ్నౌ హుతంచ దత్తంచ సర్వం సోమ గతిర్భవేత్। తత సోమ స్సముత్పన్న శ్శీతాంశు హిమలక్షణః। అష్టాశీతి సహస్రాణి విస్తీర్ణం యోజనానితు। ప్రమాణం తత్ప్రవిజ్ఞేయం కళాః పంచదశైవతు। షోడశీతు కలాఖ్యాత్రి ఇత్యేకే విబుధర్బుధాః। తంచ సోమం వపుర్దేవాః పర్యాయేణానుపూర్వశః॥

—♦ చంద్రుఁడు వనస్పతియందుండగాఁ జేయఁగూడని కార్యము. ♦—

సోమోత్పత్తి జ్యోతిశ్శాస్త్రయో ర్విరోధ పరిహారః

నన్వత్ర చంద్రకలానాం సూర్యరశ్మివశే నిర్గమాగమౌ ప్రతీయతే। సోమోత్పత్తౌతు వహ్న్యాది దేవతా అతో విరోధ ఇతిచేత్। నాయం దోషః అస్మదాది దర్శనాపేక్షయా జ్యోతిశ్శాస్త్రస్య ప్రవృత్తత్వాత్। సోమోత్పత్తౌతు వహ్న్యాది దేవతా తృప్తిస్సర్వదాపి కలాప్రయుక్తా ఏవ ప్రతిపదాది తిథయః। ననుసావన దివసేషు సౌర దివసేషుచ తన్నిర్ణయ ముపేక్ష్యచాంద్ర తిథిష్వేవ కుతో నిర్ణయోద్యమ ఇతి చేత్। సందేహ సంభవాదితిబ్రూమః। నఖలు సౌరసావన దివసయో స్సందేహో౽స్తి యత పరిమాణత్వాత్। తచ్చ బ్రహ్మసిద్ధాంతే దర్శితం। సావనం స్యాదహోరాత్రముదయా దుదయోర్రవేః। రవేస్త్రింశత్తు రాశ్యంశ సత్రిథిర్భాగ పిండినమితి ఏకస్మిన్ రాశౌ యావతంకాలం రవిర్వర్తతే తావతః కాలస్య త్రింశో యోయమంశస్స సౌరో దివసః। తిథిశ్చ కలాతత్సంభోగ ఇందోర్యావతా కాలేన నిష్పద్యతే తదేతచ్చాంద్రం దినం। నచాత్ర సౌరసావన యోరివ చాంద్రదినే సందేహాభావ శ్శంకనీయః। హ్రాస వృద్ధివశేన సందేహసంభవాత్ ” అనికలదు.

తా॥ బహుళపాడ్యమియందు అగ్నియు, విదియనాడు రవియు, తదియయందు విశ్వేదేవతలు, చతుర్థియందు వరుణుఁడును, పంచమియందు వషట్కారులును, షష్ఠియందు వాసవులును, సప్తమి దివ్యఋషులును, అష్టమి అజైకపాదులును, నవమి యముండును, దశమి వాయువు, ఏకాదశి ఉమాదేవియును, ద్వాదశి సర్వపితరులును, భాగములపరికారమును, త్రయోదశి కుబేరుఁడును, చతుర్దశి శివుఁడును, పంచదశి బ్రహ్మయుఁ గ్రాసమొనర్తురు.

## — చంద్రకళల పానవిశేషము. —

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨ - పుట ౭౯

పితరశ్చోపతిష్ఠంతి అమావాస్యాం నిశాకరణం తతః పంచదశేభాగే కించిచ్ఛిష్టే కళాత్మకే। అపరాహ్ణే పితృగణా జఘన్యః పర్యుపాసతే। ౬౫॥ పిబంతి ద్వికళాకాలం శిష్టాతస్యతు యాకళా। నిఃస్సృతం తదమావాస్యాం గభస్తిభ్యః స్వధామృతం॥ తాం స్వధాం మాసతృప్త్యై తుపీత్వాగచ్ఛంతి తేఽమృతం॥ ౬౬॥ సౌమ్యా బర్హిషదశ్చైవ అగ్నిష్వాత్తాస్తథైవచ। కవ్యాశ్చైవ తు యేప్రోక్తాః పితరః సర్వ ఏవచ॥ ౬౭॥ సంవత్సరాస్తువైకవ్యాః పంచాబ్దా యేద్విజైః స్మృతాః। సౌమ్యాస్తు ఋతవోజ్ఞేయా మాసాబర్హిషదః స్మృతాః॥ అగ్నిష్వాత్తార్తవశ్చైవ పితృసర్గాహివై ద్విజాః॥ ౬౮॥ పితృభిః పీయమానస్య పంచదశ్యాంకలాతువై। యావన్నక్షీయతే తస్యభాగః పంచదశస్తుసః ౬౯॥ అమావాస్యాంతదా తస్యఅంతమాపూర్యతే పర। వృద్ధిక్షయౌవైపక్షాదౌ షోడశ్యాం శశినః స్మృతౌ॥ ౭౦॥ ఏవం సూర్యనిమిత్తైషా క్షయవృద్ధిర్నిశాకరే।

### అర్థము.

#### సోమపానపితరులవివరము,

పితరులు నాల్గుసంజ్ఞలతోనున్నారు.

౧. సోములు - వీరలుఋతుకాలసంజ్ఞలు.

౨. బర్హిషదులు - వీరలుమాసకాల సంజ్ఞలు.

౩. అగ్నిష్వాత్తులు. వీరలార్తవకాల సంజ్ఞకలవారు.

౪. కవ్యులు - సంవత్సరకాల సంజ్ఞకులనియుఁ బంచసంవత్సర కాలసంజ్ఞకులనియు వీరలు వివరింపబడిరి.

మనపితరులు అమాకళచంద్రుని అపరాహ్ణమందు అరుఘుడియలు కాలమందు మాత్రము స్వల్పముగ ఆస్వాదింతురు. అదిచాలనందుచేతనే మనమిచ్చు తర్పణాదులతో సంపూర్తిగఁ దృప్తులగుదురు. ఇది త్రిశంకుస్వర్గాధోముఖ లోకవాస పితరుల సంబంధముగఁ దలంచవలెను.

చంద్రుఁడు సూర్యునికెదురుగ నున్నభాగమెప్పటికిని కళాంశము క్షీణతగాదు. సూర్యుని కావలివైపుగ నున్నభాగమునకే వృద్ధిక్షయములు. తుదకు చంద్రకళ క్షీణముగాని ధ్రువకళాంశము అమావాస్యనాఁడు మిగిలిన కళయే సూర్యునియందు చేరును. ఇది మరల శుక్లపాడ్యమియందు సూర్యునినుండి బయలుదేరి శుద్ధవిదియ

ఘడియలు రాగానే యీ ధ్రువకళాభాగము అతిసూక్ష్మముగ నగపడును. సూర్యుఁడు అమావాశ్యకు నేదిక్కున అయనభేదముతో నుదయించునో ఆదిశకే చంద్రిగతిఁగయుండును. మరల చంద్రోత్పత్తినాఁడు సూర్యుఁడేదిశ అస్తమించునో ఆదిశనే యుండును. మధ్యలో చంద్రాస్తమయములు ఉదయములు భేదములుగ నుండును.

చంద్రుఁడే శుద్ధమూలప్రకృతిని బ్రకృతిపురుషులకు గారణము.

,, శుద్ధతత్త్వము ఉభయతత్త్వము.

,, క్షీరము శుద్ధజలము

,, సర్వశాంతకళ రజోగుణ తమోగుణకళ

,, కారణబిందువు విమర్శనప్రత్యేకబిందువు

,, శుక్లపక్షవృద్ధికళ కృష్ణపక్షక్షీణకళ.

చంద్రునివృద్ధి క్షీణకళలే జగత్తువృద్ధిక్షీణములు.

చంద్రుఁడే శుద్ధమాయ మనస్సు

,, త్రిగుణకారణుఁడు త్రిగుణకార్యరూపి

,, పరిపూర్ణుఁడు భిన్నముతో అనంతరూపుఁడు

,, శుద్ధవీర్యము రజోగుణ తమోగుణవీర్యము

,, రసస్వరూపము ద్రవ, చలన, దర్పణములు

,, మాతృస్వరూపము సంతానరూపము

,, నిష్కామకళ కామకళస్వరూపము

,, కామేశ్వరుఁడు శివకామేశ్వరి స్వరూపము

,, రుధిరము దేహము

,, సప్తధాతువులు సర్వదేహము

,, సుధాసింధువు సుధాశిఖధార

,, సోమము యజ్ఞము అమృతము

,, ఘృతము దధి

,, సర్వవేదస్వరూపము సర్వవేదక్రియారూపము

,, సర్వమంత్రస్వరూపము సర్వతంత్రస్వరూపము

,, సర్వాధారకారణము సర్వజగదాశ్రయము

,, సర్వామధీశుఁడు సర్వఫలస్వరూపుఁడు

చంద్రుఁడే రజతము సువర్ణము
,, పుష్పము ఫలము
,, జ్ఞానము అజ్ఞానము
చంద్రునితో ఆత్మప్రాప్తి యజ్ఞముతో సోమప్రాప్తి
చంద్రుఁడే తత్పదార్థము అసి, త్వంపదార్థము
,, నేను నీవు
,, ఆత్మ ఈశ్వరుఁడు జీవుఁడు
,, బ్రహ్మాండము అండము పిండాండము
,, బ్రహ్మరంధ్రము కంఠము
చంద్రునిచే సముద్రవృద్ధి సముద్రక్షీణము
,, పూర్ణిమరాశి అమావాస్య కుహూరాశి
,, శుక్లపక్షములో వెలుఁగు కృష్ణపక్షముతో అంధకారము
చంద్రుఁడే సముద్రమునకు అలలకును అలలశాంతమునకుఁ గారణము
,, పంచభూతములు ప్రళయములు
,, సూర్యుఁడు చంద్రుఁడు
,, ద్యులోకములో క్షీరము ఈలోకములో జలము
చంద్రుని ధరించినదేవుఁడే దేవుఁడు ధరించినదేవియే దేవి
చంద్రుఁడే ప్రాణపంచకము ఉపవాయుపంచకము
,, దర్పణము సర్వము ప్రతిబింబితాధారము
,, ఉదానస్వరూపుఁడు ప్రాణప్రధాన మనోరూపుఁడు
,, సహస్రారములో సోముఁడుగను గంఠములోఁ జంద్రుఁడుగను నుండును
,, సత్త్వముగను, రజోగుణముతో సూర్యుఁడుగను, తమోగుణాగ్నిగను నుండును

చంద్రసూర్యుల మధ్యలోని ఘనపదార్థమే భూమి.
చంద్రచలనముచేతనే పృథివికిఁజలనము సర్వమునకుఁజలనము
చంద్రచలనముతోనే సర్వసృష్టి చంద్రునికిఁజలనమే లేనిచో సృష్టియును లేదు
చంద్రునికిఁ గలిగిన స్థితియే జగత్తునకుఁ గలుగుచుండును

చంద్రునికి లయముగలిగినచో జగత్తులయమగును
చంద్రరూపమే దేహములో సోమరూపశ్లేష్మపంచకము
శ్రీవిద్యలో చంద్రకళాంశమే చాలప్రధానముగ నున్నది
శ్రీలలితాదేవి సహస్రారములోఁగల చంద్రమండలమధ్యలోనున్నదనివర్ణించిరి.

సంపూర్ణాత్మక శాంతామృతాంశమే ప్రకృతితో అంశాంశగా సోమ నిత్య కళగా జగదుత్పత్తికిఁ గారణరూపత్వముగ నొప్పును. ఇది కేవల శుద్ధసత్వజ్ఞానాంశము. దీనినే సప్తదశ ధ్రువకళయందరు. ఇది సమష్ట్యంశము. ఈకళను మూల ప్రకృతికిఁగూడ ఆవరించుటకు బాత్రిగ నెంతమాత్రముఁ గానేరదు. ఈకళయే ఈశ్వరాది సర్వజీవరాశియందును వ్యష్టిరూపముతో అమృతాంశముగ నున్నందు చేతనే మరల స్వస్వరూపమగుటకుఁ గారణాంశముగనున్నది. ఇది ప్రకృత్యావరణ కక్ష్యలతో గుణభేదములుగ నున్నది. అందుచేతనే "సోమసూర్యాగ్నిలోచనః" యనిరి. ఇదిసమష్టి ఈశ్వరదృష్టిలోని జగద్రూపము. ఇది ప్రవృత్తితో అధో ముఖధారగను, నివృత్తితో నూర్ధ్వముఖ ధారగను స్థితితో అర్ధచంద్రాకృతిగ నున్న దగును. ఇదేపూర్ణముతో బిందురూపము పొందును. అధోముఖముతో షోడశీ కళగ మార్పుచెందును. ప్రకృత్యావరణముతో బింబ ప్రతిబింబ న్యాయముగ అధోముఖముతోఁ బ్రకృతము మనబ్రహ్మాండములో మనకగపడు చంద్రుఁడుగ అనిత్యపంచదశ కళలతో నున్నది. ఈపంచదశ కళల సంజ్ఞతో దీనిపైలోఁగల కళకు షోడశీకళ తదుపరి సంపూర్ణాత్మలోఁగలది సప్తదశియని నీరెడును ధ్రువ కళలని నివృత్తిమార్గముతో బోధించిరి. ప్రవృత్తిలో పంచదశకళ లనిత్యములనిరి. ఆత్మయొక్క శాంత్యమృతానందకళను సోముఁడనియు చైతన్యప్రకాశాంశమును సూర్యుఁడనియు భూతాంశతో అగ్నియనియుఁ దెలియవలెను. "రసోవైసః" అని శ్రుతిలో ఆత్మరసస్వరూపుఁడని కూడ వర్ణించిరి. దీనికారణము సోమాంశమే. అమృతత్వ రసాంశముతో సోమకళగను, చైతన్యప్రకాశముతో సూర్యుఁడుగను ఉభయసమ్మేళనముతో భూతాంశముగ అగ్నిగ ప్రపంచకారణమయ్యెను. ఈరెండే జగత్తునకు సర్వాధారము. వాయుపురాణములో అధ్యా॥ ౫౧॥ శ్లో॥ ౧౭లో "సోమాధారం జగత్సర్వం"అని కలదు. సోమము శుద్ధసత్వము. రజోగుణమే సూర్యుఁడు. తమోగుణమే అగ్ని. ఇవియే ఈశ్వరత్వము దేవత్వము జీవత్వము.

"చంద్రమామనసోజాతః చక్షోస్సూర్యో అజాయత ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" అని శ్రుతిప్రమాణము. సూక్ష్మాత్మకారణరూపమగు మనోనేత్రము చంద్రుఁడు

గను గార్హపత్యరూపనేత్రము సూర్యుఁడుగను స్థూలరూపముఖము అగ్నిగ ఉపనిష త్తుబోధించెను. మనస్సుసర్వప్రధానముతోఁ (ప్రవృత్తి నివృత్తిమార్గములకు) బం ధత్త్వముగ మూలకారణముగ నున్నది. కార్యముతో సూర్యోత్త్వముగ నున్నది. కర్మలతో స్థూలశరీరమునకు అగ్ని ప్రధానము గనున్నది. ఉపాసనాదులతో సూర్యాస్థానముగను వైరాగ్య శాంత్యనుభవత్వకారణముతో సోమాత్మకానంద మనస్సుగనున్నది. ఇదే మనదేహములోఁ జివరభాగమగు సహస్రారముపైన సోమా మృతాంశ రససింధువుగ బ్రహ్మరంధ్రము క్రిందుగనున్నది. సహస్రారమే సూర్యాం శము. దిక్రిందుగనున్న భ్రూమధ్యమునునే అగ్నితత్త్వాంశమున్నది. లలితాస హస్రనామముతో "మహాపద్మాటవీసంస్థాయైనమః" యని శ్రీపరదేవతకు స్థానముచె జెప్పిరి. కేవల శుద్ధజ్ఞాన మోక్షరూపిణియగు పరాశక్తిస్థానమది. శ్రీవిద్యయనగా సర్వవేదాంత శాస్త్రములు బోధించినదానికి ఉపరిభాగములో దేహాంతభాగములో అనంత తత్త్వమును బోధించిన శుద్ధజ్ఞాన రహస్యవిద్య ఇదేమోక్షవిద్య ఈవిషయ విమర్శనమునకు లలితాసహస్రము చాలును. ప్రకృతియే ప్రపంచము. ప్రకృతి తోనే సోమము. ప్రకృతి క్రియంచను సోమము. ఈమూడును ఏకరూపములే. యజ్ఞ ఫలమునందు "కిసోమం ప్రాప్నువంతి"యని ప్రమాణమున్నది. సోమమున ఆత్మయే సోమస్వరూపిణి శ్రీలలిత పరాశక్తిగాన సోమస్వరూపవిషయము సంపూర్ణమును దెలియుటకు శ్రీవిద్యయే ముఖ్యము. ఈరెంటినిఁ దెలిసిన మహాపురుషుండే సదా శివుఁడు.



## చంద్ర నక్షత్ర రథాదుల వివరము.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨.

పీత్వాతిదేవానమృతేన సూర్యః సోమం సుషుమ్నేన వివర్ధయిత్వా। శుక్లేతు పూర్ణం దివసక్రమేణ తం కృష్ణపక్షే విబుధాః పిబంతి. 32 ॥ పీతంతుసోమం ద్విక శాzవశిష్టం కృష్ణక్షయే రశ్మిభిస్తం క్షరంత । సుదామృతం తత్పితరః పిబంతిదేవాశ్చ సౌమాశ్చ ...దైవకవ్యం॥ 33 ॥ సూర్యాగ్నిభిస్తు సముద్ధతాభిరద్భిః పునశ్చైవ సముద్ధృతా,॥ వృష్ట్యాతి వృద్ధాభిరథా మధిభిర్మర్త్యాః క్షుధం తృష్ణాపాన్నైర్జయం

తి॥ ౩౯॥ అమృతేనతృప్తిస్త్వర్ధమాసం సురాణాం మాసం తృప్తిః స్వధయాపితౄణామ్॥ అన్నేనశశ్వత్తు దధాతిమర్త్యాన్ సూర్యః స్వయం తచ్చబిభర్తిగోభిః॥౪౦ అయం హరిస్తైర్హరిభిస్తురంగైరయం హిమాపోహరతీతిరశ్మిభిః। విసర్గకాలే విసృజంశ్చతాః పునర్బిభర్తి శశ్వత్ సవితాచరాచరమ్॥ ౪౧ ॥ హరిద్భిర్హ్రియతే తురంగమైః పిబత్యథాపో హరిభిః సహస్రధా। తతఃప్రముంచత్యపి తాస్సహారిః సముహ్యమానో హరిభిస్తురంగమైః॥ ౪౨॥ ఇత్యేషఏకచక్రేణ సూర్యస్తూర్ణం రథేనతు భద్రైస్తైరక్షతైరశ్వైః సర్పతేऽసౌ దినక్షయే॥ ౪౩ ॥ అహోరాత్రాద్రథేనాసౌ ఏకచక్రేణ తుభ్రమన్। సప్తద్వీప సముద్రాంతం సప్తభిః సప్తభిర్హయైః॥ ౪౪ ॥ ఛందోభిరశ్వరూపైస్తైర్యతశ్చక్రం తతఃస్థితైః। కామరూపైః సకృద్యుక్తైరమితైస్తైర్మనోజవైః॥ ౪౫ ॥ హరితైరవ్యయైః పింగైరీశ్వరైర్బ్రహ్మవాదిభిః। అశీతి మండలశతం భ్రమంత్యబ్దేన తేహయాః॥ ౪౬ ॥ బాహ్యమభ్యంతరంచైవ మండలం దివసక్రమాత్। కల్పాదౌ సంప్రయుక్తాస్తే వహంత్యాభూత సంప్లవాత్॥ వృతావాలఖిల్యైస్తైర్భ్రమంతే రాత్ర్యహానితు॥ ౪౭ ॥ ప్రథితైస్స్వైర్వచోభిరగ్ర్యైః స్తూయమానో మహర్షిభిః। సేవ్యతే తస్మాద్యైశ్చ గంధర్వైరప్సరోగణైః। పతంగైః పతగైరశ్వైర్భ్రమమాణోదివస్పతిః॥ ౪౮ ॥ వీథ్యాశ్రయాణి చరతి నక్షత్రాణి తథాశశీ। హ్రాసవృద్ధీ తథైవాస్యరశ్మీనాం సూర్యవత్స్మృతే॥ ౪౯ ॥

## —♦ చంద్ర రథము. ♦—

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨ - పుట ౭౮.

శ్లో॥ త్రిచక్రోభయపార్శ్వస్థో విజ్ఞేయశ్శశినోరథః। అపాంగర్భసముత్పన్నో రథః సాశ్వః ససారథిః। శతారైశ్చ త్రిభిశ్చక్రైర్యుక్తః శుక్లైర్హయోత్తమైః॥ ౫౦ దశభిస్తు కృశైర్దివ్యైరసంగైస్తైర్మనోజవైః। సకృద్యుక్తో రథేతస్మిన్ వహంతే చాయుగక్షయాత్॥ ౫౧ ॥ సంగృహీతే రథేతస్మిన్ శ్వేతశ్చక్షుః శ్రవాస్తువై అశ్వాస్తమేవ వర్ణాస్తేవహంతే శంఖవర్చసం॥ ౫౨ ॥ యయుశ్చ త్రిమనాశ్చైవ వృషో రాజీవలోహయాః అశ్వోవామస్తురణ్యశ్చ హంసోవ్యోమీ మృగస్తథా॥ ౫౩ ఇత్యేతేనామభిః సర్వేదశ చంద్రమసోహయాః ఏతేచంద్రమసందేవం వహంతి దివసక్షయాత్॥ ౫౪ ॥ దేవైః పరివృతః సోమ్యః పితృభిశ్చైవగచ్ఛతి॥

---

## — చంద్రకక్ష్య వివరము. —

శ్రీమద్భాగవతం - పంచమస్కంధం - అధ్యా. ౨౨

ఏవం చంద్రమా అర్కగభస్తిభ్య ఉపరిష్టాల్లక్షయోజనత ఉపలభ్యమానో ర్కస్య సంవత్సరభుక్తిం పక్షాభ్యాం మాసభుక్తిం సపాదర్క్షాభ్యాం దినేనైవ పక్షభుక్తి మగ్రచారీ ద్రుతతరగమనో భుంక్తే। ౮॥ అథచాపూర్యమాణాభి రమరాణాం క్షీయమాణాభిశ్చ కలాభిః పితౄణా మహోరాత్రాణి పూర్వపక్షా పరపక్షాభ్యాం వితన్వానః సర్వజీవనివహప్రాణో జీవశ్చైకమేకం నక్షత్రం త్రింశతా ముహూర్తైర్భుంక్తే॥ ౯॥ య ఏష షోడశ కలః పురుషో భగవా న్మనోమయో న్నమయో మృతమయో దేవపితృ మనుష్యభూత పశు పక్షి సరీసృప వీరుధాం ప్రాణాప్యాయన శీలత్వా త్సర్వమయ ఇతివర్ణయంతి

## — చంద్రవిషయము ప్రమాణాధారములు —

విష్ణుపురాణము - ద్వితీయాంశం - అధ్యా. ౭.

శ్రీపరాశరః-

రవిచంద్రమసో ర్యావన్మయూఖై రవభాస్యతే। ససముద్రసరిచ్ఛైలా తావతీ పృథివీ స్మృతా॥ ౩॥ యావత్ప్రమాణా పృథివీ విస్తార పరిమండలాత్। భూమే ర్యోజన లక్షేతు సౌరం మైత్రేయ రవిమండలం లక్షదివాకరస్యాపి మండలం శశినః స్థితం। ౫॥ పూర్ణేశతసహస్రేతు యోజనానాం నిశాకరాత్। నక్షత్రమండలం కృత్స్న ముపరిష్టాత్ప్రకాశతే॥ ౬॥

## — రథవివరము. —

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౨.

శ్రీపరాశరః

రథస్త్రిచక్రస్సోమస్య కుందాభాస్తస్యవాజినః। వామదక్షిణతో యుక్తా దశ తేన చరత్యసౌ। ౧॥ వీథ్యాశ్రయాణి ఋక్షాణి ధ్రువాధారేణ వేగినా। హ్రాస వృద్ధి క్రమస్తస్య రశ్మీనాం సవితుర్యథా॥ ౨॥ అర్కస్యేవహి తస్యాశ్వా స్సకృద్యుక్తావహంతి తే। కల్పమేకం మునిశ్రేష్ఠ వారిగర్భ సముద్భవా॥ ౩॥ క్షీణం పీతం సురైస్సోమ మాప్యాయయతి దీప్తిమాన్। మైత్రేయైక కలంసంతం రశ్మినైకేన భాస్కరః॥ ౪॥ క్రమేణయేన పీతోసౌ దేవైస్తేన నిశాకరం। ఆప్యాయయత్యను దినం భాస్కరో వారితస్కరః॥ ౫॥ సంభృతం చార్ధమాసేన తత్సోమస్థం సుధా

మృతం। పిబంతి దేవామైత్రేయ సుధాహారాయతోఽమరాః॥ ౬ ॥ త్రియస్త్రింశ త్సహస్రాణి త్రియస్త్రింశ చ్ఛతానిచ।

## —♦ చంద్రమండలకక్ష్యవివరము. ♦—

### శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౨.

త్రియస్త్రింశత్తథాదేవాః పిబంతిక్షణదాకరం॥ ౭ ॥ కళాద్వయా వశిష్టస్తు ప్రవిష్ట స్సూర్యమండలం। అమాఖ్యరశ్మౌ వసతి అమావాస్యా తతస్స్మృతా॥ ౮ ॥ అప్సుతస్మిఽ అహోరాత్రే పూర్వంవింశతి చంద్రమాః। తతోవిరుత్సువసతి ప్రయాత్యర్కం తతఃక్రమాత్॥ ౯ ॥ ఛినత్తివీరుధోయస్తు వీరుత్సంస్థే నిశాకరే। తస్య తం పాతయత్యేకం బ్రహ్మహత్యాం సవిందతి॥ ౧౦ ॥ సోమం పంచదశభాగే కించిచ్ఛిష్టే కళాత్మకే। అపరాహ్ణే పితృగణా జఘన్యం పర్యుపాసతే॥ ౧౧ ॥ పిబంతి ద్వికళాకారం శిష్టాతస్య కలాద్యయా। సుధామృత మయీపుణ్యా తామిందోః పితరోమునే॥ ౧౨ ॥ నిస్సృతంతదమావాస్యాంగభస్తిభ్య స్సుధామృతం మాసతృప్తి మవాప్యాగ్ర్యాం పితరస్సంతి నిర్వృతాః। సౌమ్యాబర్హిషదశ్చైవ అగ్నిష్వాత్తాశ్చ తేత్రిధా॥ ౧౩ ॥ ఏవందేవాన్ సితేపక్షే కృష్ణపక్షే తథాపితౄన్ వీరుధశ్చామృతమయైశ్శీతై రప్పరమాణుభిః॥ ౧౪ ॥ వీరుదోషధి నిష్పత్త్యా మనుష్యపశుకీటకాన్। ఆప్యాయయతి శీతాంశుః ప్రాకాశాహ్లాదనేనచ॥ ౧౫ ॥

## —♦ చంద్రగతివివరము. ♦—

### శ్రీమద్దేవీపురాణం - అష్టమస్కంధం - అధ్యా. ౧౬.

ఉపలభ్యమానో మిత్రస్య సంవత్సర భుజంచనః। పక్షాభ్యాం చౌషధీనాథో భుంక్తేమాస భుజంచసః॥ ౧౭ ॥ సపాదాఖ్యాం దివసభుక్తిం సఃభుజంచరేత్। ఏవం శీఘ్రగతిస్సోమో భుంక్తే మాసంభచక్రకమ్॥ ౧౮ ॥ పూర్యమాణ కళాభిశ్చ మరాణాం ప్రీతిమావహన్। క్షీయమాణకలాభిశ్చ పితౄణాం చిత్తరంజకః॥ ౧౯ ॥ అహోరాత్రాణి తన్వానః పూర్వాపర సుపక్షకైః। సర్వజీవనికాయస్య ప్రాణో జీవస్సఏవహి॥ ౨౦ ॥ భుంక్తే చైకైక నక్షత్రం ముహూర్త త్రింశతావిభుః। సఏవ షోడశకలః పురుషోఽనాది రుత్తమః॥ ౨౧ ॥ మనోమయోఽన్నమయోఽమృతధామాసుధాకరః। దేవపితృమనుష్యాది సరీసృపసవీరుధామ్॥ ౨౨ ॥ ప్రాణాప్యాయన శీలత్వాత్స సర్వమయఉచ్యతే। తతోభచక్రం భ్రమతి యోజనానాం త్రిలక్షతః॥ మేరుప్రదక్షిణేనైవ యోజితం చేశ్వరేణతు। అష్టావింశతి సంఖ్యాని గణితాని సహాఽభిజిత్॥ ౨౩ ॥

సూర్యుఁడాకాశమండలమున నేకచక్రరథంబువఁ దిరుగును. ఆరథంబునకు వారిగర్భజనితంబులగు హరిదశ్వంబుఁ (అపోజ్యోతిండ్వాశ్వంబు) లేడుండును. సప్త ద్వీపములను సప్తసముద్రములనుదాటి యయ్యవి తిరుగుచుండును. ఆ హయంబు లొకవత్సరమున కశీతిశత (౧౮౦) మండలములఁ జరించును. ఈ మండలములే డిగ్రీలు. ఈమకరరేఖనుండి కర్కటకరేఖకు ౧౮౦ మండలములు. సూర్యుఁడా రోహణావరోహణములు చేయుటచే 3౬౦ యగును. కల్పాంతమునను ఛందాశ్వ ములగుటచే నీయశ్వములు నశింపవు. సూర్యుఁడు నిజకిరణంబుల మాటిమాటికి నాకర్షించి సుషుమ్నవలన విడిచిన జలంబులఁ జంద్రుండు గ్రహించి రాత్రికాలంబున నోషధుల నమృత కిరణప్రసరణంబుల సంవర్ధన మొనరించుచుండును. ద్విజుల యోషధుల చేతనుఁ దద్బీజముల చేతను జలముల చేతను క్షుత్పిపాసల జయింతురు. చంద్రుఁడు మూఁడు చక్రంబుల రథంబున గగనమునఁ దిరుగును. ఆయరదంబునకు శ్వేతాశ్వంబులు కట్టఁబడియుండును అయ్యవి (౧) యయువు, (౨) త్రిమనము, (3) వృషము, (౪) రాజీవలము, (౫) అశ్వము, (౬) వామము, (౭) తురణ్యము, (౮) హంసము, (౯) వ్యోమి, (౧౦) మృగము. ఈ గుఱ్ఱంబులు దివస క్షీణంబుఁ జంద్రుని వహించును. ఇయ్యవి రథ వామ దక్షిణ పార్శ్వంబుల నుండు చంద్రుఁడు నక్షత్రవీథుల ధ్రువాధారమున రవి కిరణ ప్రసరణమును బట్టి వృద్ధిక్షయములఁ బొందుచుండును. సూర్యచంద్రుల కిరణప్రసరణ మెంతకాలముం డునో యంతవఱకు సముద్ర సరశ్శైలవతియగు పృథివి విస్తరించి వెలయుచుండను. భూమండలమునకు లక్షయోజన దూరమున సూర్యమండలము, తదుపరి లక్షయో జనదూరమునఁ జంద్రమండలముగలదు. చంద్రమండ లోపరిభాగమున లక్ష యోజన దూరమున నక్షత్రమండలమున్నది. క్షీణచంద్రకళను దేవతలు పానమొనరించి తృప్తినందగ మిగిలిన రెండుకళలు సూర్యునాశ్రయించును. ఈ రెం టిలో నొకకళ యమావాస్యకుఁ బూర్వమున నీటను, మరొకటి పితృపానార్థమును విడువఁబడును. జలంబుల విడువఁబడిన కళ యోషధులఁజేరి లోకవృద్ధి కుపయోగ పడును. అందుచే నీదినముల నోషధుల నెంతమాత్రము జిదుమరాదు. ఒక్కయా కును జిదిమినమాత్రమున బ్రహ్మహత్యా దోషంబు వాటిల్లు. కావుననే వైద్యశా స్త్రమునం దీదినములందు నోషధీగ్రహణము నిషేధింపఁబడినది. ఈచంద్రకళతో నోషధులు వృద్ధిపొంది ఫలవంతములై సర్వజీవకోటి కన్నమయ మనోమయ ప్రాణ మయామృత మయమగు చున్నది. పైఁజెప్పిన దినములందేమాత్రము వానిఁద్రుం

చిన (గళానష్టమునొంది ఔషధులు నశించుటచే జీవుల కత్యంతాపకారమగును. కాన బ్రహ్మహత్యాదోషము సంభవించుట సత్యము. చంద్రుఁడు ప్రతినక్షత్రమునఁ జరించుచు భచక్రంబున మూడులక్షల యోజనములు దిరుగును. కేవలసూర్యుఁడే సర్వదాయుండినచో (బ్రపంచ మాసూర్యుని వేడిమికిఁదాళలేక భస్మీభూతమగుచుం డెను. అమృతజల రసస్వరూపుఁడగు చంద్రుండామృతాంశముగ నుండుటచేతనే ప్రపంచము నిలిచియున్నది. సూర్యునివలన ప్రాణవాయువు (Oxygen) పుత్పత్తియగును. దీనివలననే అగ్నిపుట్టుచున్నది. నిశాకరునివలన నత్రజని పుట్టుచున్నది. ఈనత్రజని (Nitrogen) లేకపోయిన ప్రాణవాయు జనితాగ్నిచే సర్వము భస్మమై యుండెడిది. పిండాండ దేహములో శ్లేష్మజల రూపాంశముతో నయ్యాదియున్నది. పృథివీభూతమునకు జలమేయోని. జలాంశమే చంద్రుఁడు. చంద్రుడు పిండాండ దేహమందుఁ గంఠస్థానమున నున్నాఁడు. జలముతో భూమి. మనకుజలమే ప్రధానము. కంఠమెప్పటికిని ద్రవముగ నుండవలెను. కంఠము వాయువు ప్రసరించు మార్గము. వాయుసంచారమువలనఁబుట్టు వేడిమితో శుష్కించును. అందుచం ద్రుఁడు శ్లేష్మజలరూపామృతాంశముతో నుండుటవలన నట్టిప్రమాదముండదు.

—o—

## చాంద్ర సౌర మానములు.

చంద్రచారమునుబట్టి చంద్రమానము వచ్చును. ప్రతిపౌర్ణిమ తిథియందుఁగల నక్షత్రనామము ననుసరించి యాయామాస నామములుగలిగెను. మాసదినసంఖ్య కంటె నక్షత్రములు తక్కువగనుండుటచేత చాంద్రమానమునఁదక్కువగును. అందుచేత సంవత్సరపరిమితికూడ సౌరమానముకంటెఁ దక్కువగానుండును. ఈతక్కువ రోజులు నధికమాసముపేరఁ బ్రతిరెండుసంవత్సరముల యనంతరము మూడవసంవత్సరమందొక మాసము చైత్రాది భాద్రపదమాసమువఱకు మాత్రమే వచ్చుచుండును. అటుపిమ్మటఁగల మాసములందధిక మాసమురానేరదు ఈమాసములందొకానొక శతాబ్దముల సంఖ్యలందొక మాసను క్షయమాసమురాగలదు. అధిక మాసముతో దేశమునకు కొంత మేలుగను క్షయమాసముతో క్షోభగనుండును మనభూమియందు (జాంద్రమానము, సౌరమానముగాక ఉత్తరమున (కాశీప్రాంతము) బార్హస్పత్యమానముగూడ నున్నది. బార్హస్పత్యమానమునకును మనకును వం

డ్రెండు సంవత్సరములు భేదముతో వెనుకముందుగాఁ గాలమానమున్నది. మనకు దినములు మాత్రము భూభ్రమణతోనే కలుగుచున్నది. మనకుఁగల రాత్రింబగళ్లచే సూర్యచంద్రుల మానములు తిథులు ముఖ్యములాయెను. సూర్యసంచార రాశిప్రవేశమునుబట్టి నాయారాశినామముతో సౌరమాసములుగలిగెను. చంద్రచారముతోఁ బ్రతిపౌర్ణిమయందుఁగల నక్షత్రనామము ననుసరించిన నామముతోఁ జైత్రాదిగఁ బండ్రెండు మాసములేర్పడెను. ఈ ఉభయభేదముల సమ్మేళన సవరణకే అధికమాసము నేర్పరిచిరి. ఇట్లేపాశ్చాత్యులు సంవత్సర పరిమితి కొంతతగ్గుటచే నాలుగేండ్లకొకతూరి లీపుసంవత్సరమనుపేర నొకదినమధికముగ లెక్కించిరి. ఫిబ్రవరిలో నప్పుడొకదినమెక్కువ. అందవలనఁ గొంచెమెక్కువగుటచే శతసంఖ్యవత్సరముల నాల్గుమార్లకొకతూరియే లీపుసంవత్సరమువచ్చును. చైత్రశుద్ధపౌర్ణిమయందు (చిత్తానక్షత్రముండుటచేతఁ జైత్రమాసనామముగలిగెను. ఇట్లునే ప్రతిమాసమునకు నక్షత్రనామము లేర్పడెను. మధ్యలోఁ బ్రతిమాసనక్షత్రములు మాసనామమునకు సరిగా మధ్యలోఁగల సంవత్సరములిందుఁ గొంచె మించుమించుగానున్నను అధికమాసమువచ్చిన సంవత్సరములో సరిపోవును. అందులకే అధికమాసమేర్పడెను. చంద్రుఁడొకమాసముననే పండ్రెండురాసులు తిరిగివచ్చును. సూర్యుఁడు పండ్రెండుమాసము లొకసంవత్సరమునకుఁ దిరుగును సూర్యుని సంచారక్రమముతో మనకు సంవత్సరమేర్పడెను. చంద్రచారముతోఁ బండ్రెండుసంవత్సరములుగ నొక సౌరసంవత్సర మయినట్లగును. ఈ భేదములైదు. అందుచే "పంచసంవత్సరమయం"అని వేదము బలికెను. ఈ భేదముల నన్నిటికి సవరణలకు సమానత్వమునకు సంవత్సర సంఖ్య అరువదిగ నేర్పరించిరి. ఇందులో సంవత్సరభేదములన్నియు నిమిడి తుదకు ఆద్యంతములందన్నియు నేకమగును. సంవత్సరభేదములు పంచసంవత్సర సంఖ్యాభేదమునకంటె అధికముగలేవనియే పంచసంవత్సరమయం అని వేదముపలికెను ఈలాగుననే ఆవృత్తులతో మానభేదములతో మనుకల్పములు యుగములు బ్రహ్మమానము అతిదీర్ఘకాలముతో సంవత్సరాత్మకముగనున్నవి. ఇవిపంచభూతముల ననుసరించిన భ్రమణ భేదములతో నాయాభూతగుణానుసార కాలములు లోకములుండును. ఇవేస్థూల సూక్ష్మకారణావస్థలుగఁ దెలియవలెను. వీటిననుసరించి దినమాస ఋత్వయన 'సంవత్సరములను గణించవలెను. ఆదిభ్రమణతో విచిత్ర చిత్రములుగ నూహింపరానిదై మతభేదములుగనున్నది. ఉదాహరణము: సినీమా యంత్రభ్రమణలో ననేక విచిత్రచిత్రములుగ

స్థిరములేనిదై చలనముతో జూచువారల కనేక భ్రాంతిభేదములుగ నున్నది. మూల యంత్రమునకే భ్రమణచలనమే లేనిచో నున్నదున్నట్లుగ, నేవిభేద భ్రాంతులు లేకయుండెడిది. దానకాలగతి కర్మలుండవు. స్తబ్ధముగ నుండెడిది.

ఇట్టిసందర్భముతో బ్రత్యక్షప్రమాణములు స్వసిద్ధాంతములు కుదురవు. ఎవరికివారే యాలోచించి నిశ్చయించవలెను. మనభూమిలోఁగల కాలభేదములనే మనముసరిగఁ దెలియలేము. సిద్ధాంతశిరోమణి గోళాధ్యాయములో "శ్లో॥ లంకాకుమధ్యే యమకోటిరస్యాః ప్రాక్పశ్చిమే రోమక పట్టణంచ। అధస్తథా సిద్ధపురి సుమేరుః సౌమ్యేథయామ్యే బడబానలశ్చ" అనియున్నది. కు=పృథివి, యమకోటి=యమపురి, సిద్ధపురి=అమెరికా. ప్రతిభాగమునకు తొంబది డిగ్రీల ప్రకారము నాలుగుభాగములకు మూడువందల యరువది డిగ్రీలగును. మేరువునకు లంకకు తొంబదిభాగములు, లంకకు దక్షిణమునఁ దొంబదిభాగములు, బడబానల పర్వతమునకు లంకకుదూర్పునఁ దొంబదిభాగములు యమకోటిపట్టణము, పడమర తొంబదిభాగములు రోమకపట్టణమని, లంకకుఁ గ్రింద నూటయెనబదిభాగములు సిద్ధపురియున్నదనిరి. అమెరికా మనమున్న అర్ధగోళమునందేయున్నది. భూభ్రమణతో మనకును అమెరికాకును నొకేసంబంధముతో రాత్రిపగలు భేదములుగ నున్నది. మనకుత్తరములో నుపరిలోనున్నచో, యీభేదముల కవకాశములేక సంబంధములేక యుండెను. ఈ క్రింద, పైన అనుశబ్దముల నన్వయించుటలోఁ గొంతభ్రమణతో భేదార్థములేగాని వాస్తవములో రెండునొకటేయగును. ఉభయులు నొకేభాగార్ధములో గ్రిందను బైనున్నందు చేత భూభ్రమణతో సమముగా నొకసారిగ ఉభయులకు గాలభేదములు సమముగ బగలు రాత్రి భేదములకుఁ గారణముగ నున్నది, ఇది స్థిరసూర్యవిషయము, నిరయనము. మనభూమియు అమెరికాభూమియు నొకభూభాగార్ధముననేయుండి తిరుగుచుండుటచేతఁ గ్రమముగఁ బగలు రాత్రి వరుసలుగ సంబంధములున్నవి. చైత్రశుద్ధపూర్ణిమ చిత్తనక్షత్రయుక్తమయి యుండుటచేతఁ జైత్రమాసమని పేరుగలిగెను. వైశాఖమాస పూర్ణిమ విశాఖానక్షత్ర సంబంధముతో వైశాఖనామ మాసమాయెను. నక్షత్రము లిరువదేడుమాత్రమే యుండుటచేత నక్షత్రముల పరిమితిసంఖ్యమీరి ఉపరిగా రెండవనక్షత్రమగు విశాఖ యేర్పడెను. ఈలాగుననే ప్రతిమాసమునకును రెండేసి నక్షత్రము లెక్కువగాఁ జేర్చుకొన్నచో నాయామాస నామనక్షత్రము లేర్పడును. ఇటులనే పూర్ణిమనుండి అమావాస్యకుఁ బదునైదురోజులగును. అమావాస్యనాటి నక్షత్రము సూర్య

సంచార నక్షత్రమగును. ఇది కొంచె మించుమించుగా పూర్ణిమకును అమావాస్య కును మధ్యలోఁగల రోజులసంఖ్యానక్షత్రము సూర్యసంచార నక్షత్రరాశి మాస ముగూడ ఏర్పడుచుండును. రెండును బరస్పర సంబంధములుగా నుండును. కాల మీవిధముగ సర్వసంబంధములతోఁ బరస్పరము లైయున్నవి. అందుచేత వేదాంగ జ్యోతిష శాస్త్రము చాల ప్రాముఖ్యతగ నన్ని దేశములవారికి ఆవశ్యకతగ నేర్పడెను. అమావాస్యయందు సూర్యుఁడున్న నక్షత్రమునఁగాని సూర్యుఁడున్న రాశియందుఁ గాని సహజముగ చంద్రసూర్య లేకములగుదురు పూర్ణిమయందుభయులు సమ సప్తకరాసులందుందురు. చంద్రమండలమే జలభూతము. మనదిపృథివిభూతము. సూర్యమండలమే తేజోభూతము. ఈభూతములు నొకదానికొకటి ఆకర్షణగలిగి యొకదానిచుట్టు మరొక భూతము క్రిందుగాఁ దిరుగుచుండును క్రిందిభూతమునకుఁ బైనున్న భూతమే మేరువసంజ్ఞగా నగును. మేరువనఁగా అంతరాళ నాళమని తెలియవలెను. అందుచేతఁ దేజోభూతము (సూర్యుని) చుట్టు జలభూతము, (చంద్రుఁడు) జలభూతముచుట్టు పృథివీభూతము. నీమూడునువాయుభూ తాంతర్వర్తి యగు ధ్రువుని చుట్టును, ఆధ్రువుఁడు ఆకాశభూతాంతర్వర్తియగు బ్రహ్మమునకుఁ జుట్టును ఒకదానికొకటి ఆశ్రయములై నొకదానిక్రింద మరొకటి తిరుగుచుండును. ఈభూతాదుల మధ్యలోనున్న ఆకాశావకాశ నాళసూత్రమే మేరువు. అందుచేతనే మేరువు పంచభూతాత్మకమని వాయుపురాణమందుఁ జెప్పబడెను. ఈలాగున నొక దానికొకటి అంతస్థులయి ఆకర్షింపఁబడి బ్రహ్మప్రపంచ వ్యవహారముతోఁ గాలహేతు వై బ్రహ్మాండ మూహింపరానిదై మహాభ్రమణతోనున్నది.



## షష్ఠి సంవత్సరముల విమర్శన.

ఈషష్టిసంఖ్య (౬౦) లిప్తలకు విలిప్తలకు, విఘడియలకు ఘడియలకు, సంవ త్సరములకు సమానవిధమున నున్నది. ఇది మానుషమానము. ఇటులనే దేవఋషి మనుకల్పమానములు దేవఋషి మనుకల్పమానలిప్తలు విలిప్తలు. విఘడియలు ఘడియలు, సంవత్సరము లొకదానికంటె మరొకటధిక పరిమాణముగ నున్నవి. అతీతమాన సంఖ్యాకాలమునే యుగాదులుగ (బరిమితి సాంఖ్యాక్రమముగ యుగముల సంజ్ఞలో మహామాన గణసంఖ్యగల పరిమితి ననుసరించి యుగములతో గణించిరి.

మనది కేవలముతుదిగాఁగల అత్యంతాణ్వల్పకాలమగుచేత విలిప్తలాదిగా సంవత్సర పరిమితితో అంతముగా నిలిపిరి. అందుచేత నీసంవత్సరములను నాయామానానుసార పరిమితి నిర్ణయాను క్రమణికాను సారముగ దిన పక్ష మాస ఋత్వయనాబ్దములను గ్రహించవలెను. అతీతమాన పరిమితిగలవారలకు యుగముల సంఖ్యతో వారి కాలమానములను గణనవాచకములుగ నున్నవి.

ఈ అరువది సంవత్సరముల పరివర్తన సంఖ్య నాలోచించినచో నవగ్రహముల రాశిసంచార పరిమితికిని న్యూనాధికములుగ నున్నవి. గ్రహములగతి ననుసరించి హోరాద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలచేత, నవగ్రహముల రాశి సంచార కాలపరిమితి కలదు. శనికి ద్రింశన్మాసములును, గురువునకు ద్వాదశ మాసములును, కుజునికొక మాసమును మాసార్ధమును బుధ, శుక్ర రవులకు మాసము చంద్రునికి సపాద దినద్వయము భూమికి ముప్పదిరోజులు. ప్రతిరాశికిని ఆద్యంతపరిమితికాలము. అన్నిటికి షష్టిసంవత్సరములు దుడకు సమానపరివర్తన భాగములుగ సరిపోవును. సులభముగ భిన్నములులేక సమానభాగాంశలుగనిమిడి యుండును. ఈకారణాంతరములచేత సంవత్సరపరిమితి సంఖ్యకు అవకాశ కారణముతో వేదాంగ జ్యోతిషశాస్త్రము సమాన సంఖ్యపరిమితిగ నేర్పరిచిరి. ఈ క్రమముతో శని అరువదిసంవత్సరములలో బండ్రెండురాసులు రెండుసారులు చుట్టివచ్చును. గురువు అయిదుసారులు చుట్టివచ్చును. కుజుడు ఒకటిన్నరసంవత్సరమునకు పండ్రెండురాసులు దిరుగటచే నలుబదిసారులు తిరుగను. రవి బుధ శుక్రు లరువది సారులు చుట్టివత్తురు. చంద్రుఁడొక మాసమునకు బండ్రెండు రాసులుచుట్టివచ్చుటచే అధికమాసములతోఁ జేరి అరువది సంవత్సరముల కేడువందల నలువది మారులు చుట్టివచ్చును. భూమి యిరువదొక్కవేలు ఆరువందలుసారులు దిరిగివచ్చును ఈలాగుననే రాహుకేతువులు నలువదిమారులు చుట్టివత్తురు. ఈక్రమముతోఁ బంచసంవత్సరమయముల ననుసరించి ఆయాగ్రహ సంవత్సరములతో గణితప్రకారము మానవమాన సంవత్సరములో రాసులందు ప్రతిరాశికిని నాయా గ్రహగతుల ననుసరించి అల్పాంశమగు భాగలుగ ద్రేక్కాణాదిగ త్రింశాశలు (భాగలు)గ సర్వకార్యములందు షడ్వర్గులుగాఁజూచి సుముహూర్తములను గని పెట్టి యాయాగ్రహముల శుభఫలములకు అంశాంశలతోఁ బొందజేయుబడినది. మనకాలమాన మల్పమయినందుచేత గ్రహగతులకాలము కేవలాల్పాంశములుగ నిమిత్తమేర్పడెను. ఈఅంశాంశలకాలము మంచిదైనచో శుభఫలములను

దోషమైనచోఁ జెడుఫలములు బొందుచున్నాము. దీనినే లగ్నాదులందు శుభపుష్కరాంశగా సాధించుచున్నాము. ఈవిధానమునకే పుష్కరాంశయని నామకరణముచేసిరి. దీనితోఁ బుష్కరద్వీపసంబంధ మధ్యభాగమేర్పడి మనకా గ్రహముల వీక్షణ గలుగుచున్నది. దీని సూర్యసంచారవిషయములో బుష్కరద్వీపగత సూర్యవిషయమునఁ జాలవిమర్శించిరి. పుష్కరమన చివరకే ద్రాంశయని ఉత్తమాంశయని బ్రహ్మాంశయని ప్రకాశాంశయని కాలస్వరూపముతో ఉత్తమకాల సుముహూర్తమని యనఁదగును. ద్వీపములన్నిటికంటెను బుష్కరద్వీపముగూడ శ్రేష్ఠమనికూడఁ దెలియవలెను.

—o—

# సోమసూర్య లకళలు.

సోమసూర్యకళ లాత్మనుండి క్రమముగాఁ బ్రకృతిలోనికి వచ్చినవి అందొకటి శాంతామృతానందనిత్య సత్యకళ. ఇది ఊర్ధ్వములో నుండునది. ఈకళనే సప్తదశీ, షోడశీయని శుద్ధసత్త్వప్రకృతిలోఁ జెప్పుదురు. ఇది మూలబింబస్వరూపము. ఇయ్యదియధోముఖముతోఁ బ్రతిబింబరూపముగఁ బంచదశ కళలతో వృద్ధిక్షయములుగ బ్రహ్మాండత్రివర్గముగాఁ జంద్రరూపముగనున్నది. మరియునిది యధోముఖముతో అనిత్యకళలకుఁ గారణముగనున్నది. ఇదియే శ్రీవిద్యలోఁజాలముఖ్యముగ వర్ణింపఁబడి యుపాస్యముగఁ జేయఁబడినది. ఈ కళలనేయవతంసనామమున నంతరములోను, బాహ్యములోను బ్రముఖ్యముగ శిరస్సునఁ బ్రకాశింపఁజేసిరి దీనిని శుద్ధసత్త్వగుణ ప్రకృతితో ఉపాసించుటే వేదసాంప్రదాయము. (దీనినికేవల మహాశాంతమనస్సుతోనే ఉపాసింపవలెను.) ఇతరగుణ మెంతమాత్రమున్నను బతనమేయగును. ప్రకృత్యుపాసకుడుదీనిని ముఖ్యముగ గ్రహింపవలెను. ఇది వ్యష్టివిషయము. అతీతముతో సమష్టిలో శుద్ధమూల ప్రకృతియగును. అందుచేత విద్యలు రెండువిధములు. ఒకటి సోమోపాసన. రెండవది సూర్యోపాసన. మనకు మొదటి ఉపాసన సూర్యోపాసన. (ఇదియేగాయత్ర్యుపాసన). దీనినిఆత్మస్వరూపముగనే ఉపాసించి తదనంతరము సోమోపాసన చేయవలెను ఈధ్రువసోమకళ సూర్యాంతర్గర్భితమై నిత్యసత్య ప్రకాశముతో ఊర్ధ్వముఖముతో షోడశీ కళగా మహాశాంత స్వరూపానందముతో అమృతస్వరూపముతోనున్నది. సూర్యమండల

భేదనముతో నీకళ దర్శనమగును. సూర్యమండల భేదనమే రజోగుణభేదనము. విరజావిమోచనము. శ్రుతిప్రమాణము. "సూర్యద్వారేణ తేవిరజాః ప్రయంతి సతావత్ క్షీయ్యన్నసావాదిత్యం గచ్ఛతి" అందుచేతనే సూర్యుఁడు రుద్రుఁడు. రుద్రుఁడే ప్రళయమూర్తి. ప్రళయకాలమందు ద్వాదశాదిత్యస్వరూప దివ్య తేజస్సుతో (సంవర్తాగ్ని)నే స్థూలమునంతయు నతఁడు భస్మీభూతముచేయును. తరువాత నీతేజస్సు వాయువునందు లయించి సూక్ష్మకారణముగ మిగులును. ఈ వాయువు ఆకాశమందు లీనమగును. ఆకాశమేమియును లేనిదిగానున్నను సర్వమునకు నాధారమై సర్వమును ధరించియున్నది. (మనస్సు వలె ఉదాహరణము) స్థూలముగఁ గనబడునవన్నియు (బ)మితికిలోనైనవే కాని అపరిమితమెన్నటికినిఁ గాఁజాలదు. భూతముల నీలాగునఁ దెలియవలెను. రజోగుణ నివృత్తితో సత్త్వగుణ సోమకళ మిగులును. ఈయనుభవమునే సోమపానముగఁ జెప్పుదురు. మనదేహములోఁ గూడ సహస్రారమనెడి సూర్యునియందు సోమమున్నదందురు. అదియే తెల్లని స్వాదురసాంశము దీనియందే సుధాసింధురస మున్నది. ఇది అమృతస్వరూపము, ఇది ఆధ్యాత్మికము ఇది మనసహస్రారములో నున్నంతకాలము దేహము అమృతమయమై సర్వనాడులు, కోశములు, ధాతువులు, జీవవంతములై వృద్ధిగా నుండును. ఈ రసక్షీణమే మృత్యుహేతువు. సోమాంశ మూర్ధ్వములో నున్నదనుటకిదే కారణము. సోకళయేలేనిచో శాంతామృతానంద ములుండవు. సూర్యున కధోభాగమున నక్షత్ర పంచదశకళలను, సూర్యగర్భమున షోడశీకళయును, సూర్యునికూర్ధ్వమున కేవల శుద్ధప్రకృత్యంతములో (పరాపదమున) నమృతానంద శాంతాత్మకముగ స్వరూపకారణమై సప్తదశీకళయును నుండును. అందుచేతనే శ్రీవిద్యలో పరాపరవిద్యగ సోమకళను జరమమున నుపాసించునట్లు చెప్పిరి యజ్ఞాంతమున సోమపానంబుగలదు ఈసోమ(పాన)కళాపాన మధ్యాత్మిక శ్రీవిద్యతోఁ బొందునట్టి స్వస్వరూప సోమప్రాప్తి ఈకళావతంసయే పరాశక్తి. ఈవిషయంబు శ్రీలలితా సహస్రనామమునఁ గాననగు.

"సోమ సూర్యాగ్నిలోచన"యని పరబ్రహ్మకు ఆత్మబోధక లక్ష్యవాక్యముగ జెప్పిరి. సోమముతో సచ్చిదానందాత్మ స్వరూపముగను, సూర్యునితో బ్రహ్మాండాంతరాత్మగను, శుద్ధసత్త్వములో రజోగుణముతో జగదాత్మగను, బరబ్రహ్మయుండును. "సూర్యఆత్మాజగతః"అని వేదప్రమాణము. దీనిని మధ్యాహ్నిక సంధ్యోపస్థాన మంత్రముఁజెప్పిరి. దీనినే తమోగుణ స్థూలపృథివీలోక-మందగ్ని గనుజెప్పిరి.

సూర్యునికిని అగ్నికిని ఉష్ణదాహక గుణశక్తులున్నవి. ఈగుణములచేత సూర్యాది రుద్రుఁడనిరి. అతఁడు స్థూలరూపి. కాబట్టి సూర్యాగ్నులు శాశ్వతములుకాక లీనములగుచున్నవి. ఉపరిలోనున్న ఆత్మస్వరూప సోమకళ కేవల శుద్ధజ్ఞానా మృతానందాత్మ కళయనియు, రెండవదిశుద్ధసత్త్వములోఁగల రజోగుణాత్మిక సూర్యుఁడనియు, మూఁడవది శుద్ధసత్త్వములోఁ దమోగుణాత్మి కాగ్ని యనియు దెలియవలెను. సూర్యుఁడేఁ దక్షిణ నేత్రమని చెప్పుటచేఁ గొందరి కీవిషయసందేహముగలుగవచ్చును. గీతలో "ఊర్ధ్వమూల మధశ్శాఖః యను ప్రమాణానుసారము సృష్టియధోముఖము గాన సృష్టిలోని విరాట్టునకు సృష్టి దక్షిణ దిశదేగాన బ్రతిబింబమందు విపర్యాస ముతో దక్షిణనేత్రముగావచ్చును. అనిత్యకళలతోఁ జంద్రుఁడు వామనేత్రముగ గావచ్చును. సోమకళ కేవలాత్మస్వరూపమందు వామనేత్రమునకును దక్షిణ నేత్ర మునకును మధ్యఊర్ధ్వములో మూలకేంద్రస్వరూప సోమాంశగానుండుట నిశ్చ యము. కేవల లోకవ్యావహారికాసత్య ప్రపంచమునఁగల విషయోదాహరణము లతో ఉపమానముగఁదలంచి ఉపాసకులన్వయించరాదు

ఇందులోఁగల దీనివివర చిత్రపటమును విమర్శించినచోఁ దెల్లమగును.

## —♦ రెండవది - సూర్యకళ. ♦—

సూర్యకళ విషయముకొంతవఱకు పైఅంశలో నే సందర్భమునుబట్టి విమర్శిం చితిని. ఇది ప్రకృతితోఁ బ్రకృతిలో బింబ ప్రతిబింబ న్యాయముగ స్థూల కారణ రూపుఁడుగ శుద్ధసత్త్వములో రజోగుణముతో నధోముఖముగ నీబ్రహ్మాండమునందు రజోగుణ సంబంధోష్ణ దాహకశక్తులతో ఆత్మచైతన్య మీలాగున జీవరూపముగ జీవాత్మగ విరాజాదిగ సర్వజీవరాసులందు వ్యవహార హేతుభూతముగ బంచభూత ముల మధ్యలోఁ దేజోంశభూతముతో భూతాధారముగ ఆత్మచిత్స్వరూప చైతన్యాం శముతో సూర్యరూపమై నేత్రాధిష్ఠానమైయున్నది. దీనికాధారముగ శుద్ధసత్త్వ ములోఁ దమోంశగ నధోలోకమున అగ్నిగా నిదేప్రతిబింబ స్వరూపమైయున్నది. ఈఅగ్ని ఉష్ణదాహక గుణాదులు గలిగియున్నది. ఇవియేసృష్టిస్థితిలయాది గుణకార ణశక్తులు. ఇవియేప్రమాదములు, ఆవరణములు. వీటిభేదనమే సూర్యపుటభేద నము. అందుచేత నీలోకమున నిది ప్రథమకారణముగ నుండుటచేత ప్రథమో పాసనగ ఆధారాది ఆజ్ఞాచక్రాంతము వఱకుఁ బ్రధానముగ నున్నది. దీనిపైననే సోమోపాసన. ఈశ్వరవిరాడ్దేహమందీలాగున నున్నందుననే మనదేహమునందుఁ

గూడ దదంశగానున్నది. అందుచేత విరాడాదులుగూడ నీఉపాసనాక్రమముతోనే ఉపాసించి ధన్యులై మరల మనలనుపాసింపఁజేసిరి. మనకేకాదు. విరాడీశ్వరులు సహితము పరాశక్తినుపాసించిరి. మనమెంతటివారలము? సజాతీయత్వము, సమానత్వము వాక్కులతో సులభమగునేమోకాని ఫలానుభవములో నంతలోనేయుండును. పృథివీభూతాదులు తమయందలి యగ్నినశించగానే నశించి యుపరిభూతమగు జలభూతములోఁజేరును. మరల నచటనున్నఅగ్ని నశించగానే తదుపరిభూతమగు తేజోభూతమునఁ జేరును. అచ్చటనున్న సూర్యతేజస్సు నశించగనే వాయువులోఁజేరును. మరల నావాయువాకాశములోఁ జేరును. ఆవలనే ఆత్మానందామృతాంశమగు స్వరూప సచ్చిదానందములోఁజేరును. అందుచేత విరాడీశ్వరులాదిగ బ్రహ్మాదిదేవతలు, ఋషులు, అవతారులు, బ్రహ్మమానసఋషులు మనువులాదిగ సర్వులు శ్రీమహావిద్యోపాసకులై ధన్యులైరి. శ్రీమహావిద్యాంశమే శ్రీవేదమాత గాయత్రీ మంత్రానుష్ఠాన సంధ్యాదేవి. ఈకారణములఁబట్టి మనకు నిత్య నిరంతరోపాస్యముగ ఉపనయనమున సంధ్యాదేవి నుపదేశించి మహర్షులు మనల ధన్యులఁగావించిరి.

కళలో (బ్రకాశము స్వరూపమున్నది. అందుచేత చంద్రకళయు, సూర్యప్రకాశ చైతన్యము నీరెండును విదితముగాబహిఃప్రకాశముతోనే దేవునియందుఁగాని యే దేవియందుగాని ధరింపబడిమనకు దెలియులాగునఁ బ్రకాశించునో యట్టివారలే దేవానదేవతలని పరాపరులని సర్వదా ఉపాస్యులని తెలియవలెను. ఇంతకంటె వేరుదాహరణము లేల.

ఓం తత్సత్.

—♦—

## చంద్రోదయాస్తమయ సంధిపర్వకాలాదుల వివరము,

చంద్రుఁడు మనకుఁ బశ్చిమములో సూర్యునినుండివరుణునిలోఁ (బ్రతిబింబితుఁడగుచున్నాఁడు. వరుణునిలోఁ (జలభూతములో) బ్రతిబింబించుటచేత శీతాంశముతో శీతకరుఁడుగను, జలయోగకారకుఁడుగను నాయెను. ఓషధులకు ముఖ్యాధారము జలముగాన ఓషధీశుఁడాయెను. చరజీవరాసులకు నాఓషధి అన్నరూపముతో ముఖ్యప్రాణాధారమాయెను. ఇటులనే పరస్పరసంబంధములుగా సృష్టికా

ర్యక్రమముండును. పంచభూతములు .తమంతటఁదాము తనచుట్టును బ్రళయము వరకుఁదిరుగుచు రూపనామభేదములతో ఒకదానికొకటి కార్యకారణములుగా ఆధారాధేయములుగా బరిభ్రమణలుగల ప్రళయముతో లీనములగుచుండును స్వపరిభ్రమణ నిలుచుటే ప్రళయమునకుఁగారణము. అంతవరకుఁ గాలకర్మవశమై యుండును.

ప్రతిభూతము తిరుగుటలో నాభూతకాలమాన సంజ్ఞలేర్పడుచుండును. ఈ కాలమానసంజ్ఞ నాయాభూతాదుల గమనకాలమునుబట్టి యొకదానికంటె నొకటి స్థూల సూక్ష్మ కారణాదుల ననుసరించి ఊర్ధ్వమధ్యాధోభాగ స్థానాదులననుసరించి భేదములుగ నుండును. అందుచేతనే పృథివీభూత మతిస్థూలతతో దినసంఖ్యాహోరాత్రముల సంజ్ఞగను, చంద్రుఁడు పక్షములతో అహోరాత్ర సంఖ్యాసంజ్ఞగను, సూర్యుఁడయనములతో అహోరాత్ర సంజ్ఞగను, ధ్రువుఁడు సంవత్సరాత్మక సంజ్ఞగను, దదుపరి బ్రహ్మామనువులయుగ సంజ్ఞతో అహోరాత్రములసంజ్ఞగనునుందురు. కాలమానసంఖ్యాసంజ్ఞ లతిదీర్ఘభేదములుగా నొకదానికంటె నొకటి యతిశయించిన దీర్ఘముగనున్నవి. ఈదినసంజ్ఞతో మిగతకాలసంఖ్యలను పక్షర్త్వయన సంవత్సరాదులను గణింపవలెను.

మనకుఁ జంద్రునిచేఁ దిథులేర్పడెను. ఈతిథులు జలభూత భ్రమణతోఁ జంద్రునకేర్పడిన పంచదశకళల ననుసరించి వృద్ధిక్షయాదులతో శుక్ల కృష్ణపక్షము లేర్పడెను. చంద్రుఁడు మనకుఁదూర్పుదిక్కున అస్తమించును. (సూర్యునితోఁగలియును). చంద్రుని ఉదయాస్తమయములు సూర్యునియందే కలుగుచుండును. ఈ రెండును సంధ్యలు. సంధ్యలేపర్వములు. ఈపర్వములు వేదమాతగాయత్రీదేవికిఁ జాలముఖ్యములగుటచేత గాయత్రీ జపసంఖ్య అంగుళీపర్వసంఖ్యలతో గణించుట ఉత్తమమని శాస్త్రములు శాసించెను. పర్వములైదువిధములు. (౧) ఉదయాస్తమయకాల పర్వములు, (౨) పౌర్ణిమామావాస్యలు, (3) కర్కాటక మకర సంక్రాంతులు, (౪] యుగాదులు, (౫) మన్వంతరములు. ఇవి సంధిపంచ పర్వములు. మహాదీర్ఘసంధులు భూతప్రళయాదులు. వీనికతీతము బ్రహ్మప్రళయము. మిగతవిసంధిపర్వములు సామాన్యములు.

పృథ్వీలోకమునకు భూభ్రమణతో నొకప్రదక్షిణ మొకదినము. వరుణ లోకమునకు జలభూతాధిదైవతమగు చంద్రభ్రమణతో నుభయపక్షములొకదినము. తేజోభూతలోకమునకు సూర్యభ్రమణతో నయనద్వయ మొకదినము. ఇటులనే

తదూర్ధ్వాది లోకాదులకు వాయుభూతము లోకాదులలో మనువులతో దినము బ్రహ్మకుఁ గలుగుచుండును. వీటిననుసరించి మాసములు అయనములు సంవత్సరములు గణనయగును. శుద్ధపాడ్యమ్యనంతరము చంద్రోదయసంధికాలము శుద్ధపూర్ణిమమధ్యకాలము మధ్యాహ్నసంధిపర్వము బహుళామావాస్యనాడు చంద్రుఁడు సూర్యునియందు లయమగుటచే అస్తమయ సంధిపర్వమగును. ఇదివరుణలోకమున నొకదినము. ఇటులనే తేజోలోకములో సూర్యునిఁబట్టి గ్రహించవలెను. ఈసంధులు భూభ్రమణతోఁ బృథివీలోకములో భూభాగార్ధభాగాంతముతో నొకసంధిగను మరొకభాగార్ధముతో మరొకసంధిగను నుండును. ఇటులనే సర్వభూతలోకాదులందును ఊహించవలెను ఇవియే చంద్రసూర్యసంధిపర్వములు. శింశుమారములో గలుగుదశునసంధిపర్వము జలభూత భ్రమణతో జలభూతము సూర్యునిసమీపించుచు ప్రారంభించినదానిలో సూర్యప్రతిబింబిత బింబమే శుక్లపక్ష చంద్రాకారముదినదినము కళలతో అభివృద్ధిగాంచును. సూటిగా జలభూతమధ్యలోఁగల భ్రమణకాలమే సంపూర్ణప్రతిబింబిత పూర్ణిమాచంద్రుఁడు. మరల క్రమముగా భ్రమణతో జలభూతము ప్రక్కకుఁబోయి తిరుగుటలో దానియందు ప్రతిఫలించినదే క్షీణచంద్రుఁడుగ కృష్ణపక్షముగ ఉభయపార్శ్వములుభయ పక్షములాయెను. ఒకభూతముచుట్టు మరొకభూతమధోభాగములో నుండి తిరుగును. ప్రతిభూతమునిటులనే ఇదిసహజము. చంద్రవృద్ధిక్షయములే సముద్రవృద్ధిక్షయములకుఁ గారణము చంద్రచారమే పితృకాలమానము. సూర్యచారమే దేవతలకాలమానము. ఇటులనే ధ్రువునితో మనువులకును, మనువులచారముతో బ్రహ్మకుఁ గాలమానము. ఈత్రివర్గములో సూర్యుఁడే సర్వులకు దిశలకుఁ గారణుఁడు. ఒకభూతమున నొకవిధ భ్రమణయు, మరొకభూతమునకు మరొకవైపు భ్రమణలున్నవి. అన్నిటికి నొకేవిధముగ సమానదిశభ్రమణలు లేవు. అందువేత ఒక్కొక్క లోకమునకు ఉదయాస్తమయములు పూర్వపశ్చిమలు భేదములుగఁ గలుగుచున్నవి.

జలభూతాధి దైవతమగు చంద్రుఁడీలాగునఁ దేజోభూతాధి దైవతమగు సూర్యునిచుట్టు తిరుగుటలో శుక్ల కృష్ణములతో మనపృథివీలోకమునకు రాత్రిలందుఁ బ్రకాశమాన రూపుఁడగుచు తన అమృతకిరణ జాలములచే మనమున్న దిశగాఁ దిరుగుచు ఓషధులకును మనకును అమృతత్వమును గలుగఁజేసి సంరక్షించుచుండును. కృష్ణపక్షములో నాచంద్రుఁడు దేవలోకమునకు స్వర్గమువైపుగాఁ దిరుగుచు నాదిశను దేవతలకు అమృతపానయోగ్యుఁడుగా అమృతరూపుఁడై క్రమముగా నాపక్ష

మంతయు సురలకు వరుసగాఁ పానరూపుఁడగుచుండును. జలభూతార్ధభాగగోళ మొకపక్షము మనకును మరొకగోళార్ధభాగపక్షము దేవలోకనకుఁ దిరుగుటచే ఉభయలోకమునకుఁ జంద్రుఁడమృత కరుఁడగుచున్నాఁడు. ఇదేమనకు మాసముగను, జలభూతలోకరాసులకు దినముగను, స్వర్గలోకవాసులకు దినద్వాదశాంశముగవగును. (అనగా స్వర్గలోకవాసులకు అయిదుఘడియలకాలము.)



# సూర్య త్రివిధ భేదము.

మత్స్యపురాణం.

సూర్యుఁడు మూఁడువిధములుగనున్నాఁడు. పచనముతోఁ బావకుఁడనియుఁ దపింపఁజేయుటచే సూర్యుఁడనియు, పచ్యాగ్నియనియు, జఠరాగ్నిచే వైద్యుతుఁడనియు వైశ్వానరుడనియును జెప్పఁబడుచున్నాఁడు సూర్యతేజస్సు రాత్రులందగ్నియందుండును.



# సూర్యుడు ఉదయాస్తమయములందు అగ్నిరూపుఁడగుటకుఁ గారణము.

ఉదయాస్తమయములకుఁ గారణము తమస్సు. ఉదయమునకుఁబూర్వము తమస్సుచే నావరింపబడియుండును అస్తమయముగూడ తమస్సుచేతనే కలుగును. ఈతమస్సు మనకునుసూర్యునికిని మధ్యలో నీటి(నిడ) యాకృతోనుస్పందుచేతఁ గలుగుచున్నది. ఇదిమనకుఁ బ్రకృతములోఁగలది మొదటితమస్సు. ఆదిలో తమస్సే సర్వజగత్కారణము. ఈతమస్సునందుఁ ద్రివిధములగు సత్వ, రజ స్తమోగుణము లున్నవి. ఈతమోగుణముచేతనే సంపూర్ణాద్వితీయ స్వప్రకాశానందాత్మతేజస్సు క్రమముగ మధ్యలో గల్పనలతో సత్వగుణముతో సోమరూపముగను, రజోగుణముతో బంగారుకాంతితో సూర్యుఁడుగను, తమోగుణముతో అగ్నిరూపముగ నెఱ్ఱగను, నగుచున్నది సూర్యుఁడు త్రివిధగుణములతో నాయాలోకాదుల గుణముల ననుసరించును. మనది తమోగుణప్రధానమైనందుచేత నుదయమునందు

తమస్సునుండి వచ్చినప్పు డగ్నిరూపుఁడుగ సూర్యుఁడు గనఁబడుచున్నాఁడు. మధ్యాహ్నమునఁ దమోగుణము దూరమగుటచేఁ దెల్లగనుండును అస్తమయమందు మరలఁ దమస్సంబంధముతో నెఱ్ఱగఁగాన్పించును. త్రివిధగుణములు రూపములు సృష్టిలో సర్వమునకు నున్నవి. దీనికిఁ బ్రధానమైన మూలప్రకృతి స్వభావమే కారణము. అందుచేత ఉదయాస్తమయములం దగ్నివర్ణముగను నితరకాలమందు స్వచ్ఛముగ నగపడుచున్నాఁడు. ఒకముఖ్యోదాహరణము. మధ్యాహ్నమందు సూర్యబింబము స్వచ్ఛముగనే నగపడుచుండును. గ్రహణాదులం దీబింబమును జూడగోరువారలు ఒకఅద్దమునకు నల్లనిమసిపోగను కల్పించి చూచునపుడు సూర్యుడాయద్దమందు ఎఱ్ఱని అగ్నిరూపుడుఁగనే కానవచ్చుచున్నాఁడు. ఇటులనే శుద్ధశ్వేతముగా నున్నచంద్రుఁడను గ్రహణకాలమందు తమశ్ఛాయతో ఎఱ్ఱగనే యగపడుచుండును. కనుక అగ్నిరూపత్వమునకు తమస్సు నావరణమే కారణము. గుణములు రూపములుమార్పులగుట కిదియేముఖ్యకారణము ఇదిప్రకృతిసృష్టివైచిత్ర్యము. ఇట్టివైచిత్ర్యములేకున్నచో సృష్టిపరిణామ, వికారాదులు, మార్పులుబొత్తిగ కానేరవు. ఈప్రకృతిలేనిచో ఉన్నది ఉన్నట్టుగనే శాశ్వతముగ నుండెడిది. అప్పటికీసృష్టియులేదు. దీనినే ఆత్మస్వరూపమని జ్ఞానశాస్త్రములు నిర్ణయించెను ఈ నిశ్చయజ్ఞానము తెలియకపోవుట సర్వావస్థపరంపర దుఃఖములకుఁగారణము. శుద్ధజ్ఞానముకూడ నీత్రిగుణములతో మార్పులుచెందెను. తమస్సు జ్ఞానముతోఁ జాల ప్రమాదములకుఁ గారణము, ఇందుచేతనే సూర్యునకిఁ త్రిగుణాత్ముఁడని త్రిమూర్తిస్వరూపుఁడని (దీనిననుసరించి) త్ర్యవస్థలకుఁ గారణుడని బోధించిరి. దీనినే మన నిత్యసంధ్యావందనములోఁ దుదకు ఏకరూపునిగఁ బ్రార్థించుచున్నాము. కాలభేదములతో ఉదయమున, మిత్రుఁడనియు మధ్యాహ్నము, సవితృరూపుఁడనియు, సాయంకాలము వరుణరూపుఁడనియుఁ బ్రార్థించుచున్నాము. వ్యష్టిసమష్ట్యాత్మకముగ ఉపాసించుచున్నాము. ఈవిధములుగ సర్వకర్మసాక్షిగను దుదకు ఆత్మస్వరూపుఁడుగనున్నందుచేత జగదాత్మ సూర్యుఁడు ఉదయాస్తమయములందు అగ్నిరూపకారణముగా సర్వదా విశేష ముఖ్యముగ ఉపాసింపఁజేసిరి. సూర్యుఁడు అగ్నిరూపుఁడగుటచేతనే యీభూలోకములో అగ్నిప్రత్యక్షముగ నున్నందుచేత సర్వకర్మలకు అగ్నినిప్రధాన మొనరించిరి. అగ్ని తేజఃప్రధానమగుటచేత సర్వదేవతలు నగ్నిప్రధానములు. "అగ్నిప్రథమోదేవతాః" "అగ్నిముఖావైదేవాః" అని శ్రుతిపురాణములు.

—• మిత్ర వరుణోపాసనలకు వేదప్రమాణము. •—

తైత్తరీయ సంహిత కాండము ౬ - ప్రపాఠకము ౪ - అనువాకము ౮

మిత్రావరుణ గ్రహబ్రాహ్మణము.

నవాఇదం దివాననక్త మాసీ దవ్యావృత్తంతే దేవామిత్రా వరుణా వబ్రువ న్నిదంనో వివాసయతమితితా వబ్రూతాం వరం వృణావహా ఏక ఏవావత్పూర్వో గ్రహోగృహ్యాతా ఇతి తస్మాదైంద్రావాయవః పూర్వోమైత్రా వరుణా ద్గృహ్యా తే పాణాపానా హ్యేతాయదు పాగం శ్వన్తర్యామా మిత్రోzహరజనయ ద్వరు ణోరాత్రిం తతోవా ఇదం వ్యౌచ్ఛద్యన్మైత్రా వరుణో గృహ్యతే వ్యుష్ట్యై ॥ ౩౬ ॥

—•—

## సూర్యునియందుగల రంగులకు గారణము.

సూర్యునియం దనేకరంగులున్నవి. ఈరంగుల నేక గుణ కర్మఫలములకుఁ గారణము. ఈరంగులు ఏడువర్ణములుగనున్నవి. ఈ యేడువర్ణములలో మరల ననేకవర్ణము లుండున్నవి. ఈరంగులు సాత్వికాది గుణయుక్తములుగ నున్నవి. ఈజగత్తునకు సూర్యుఁడు సర్వకార్యకారణ మూలభూతుఁడుగాన సర్వము సూర్యుని యందున్నది. ఈ యేడురంగులకును గ్రహములకును, రూపకారణముగ నున్నవి. సూర్యప్రకాశముతో నీయేడుగ్రహములు ప్రకాశించుచున్నవి. సూర్యునియం దుగల రంగులవరుస ననుసరించి గ్రహకక్ష్యమండలాదులున్నవి. శనినీలవర్ణముగను బృహస్పతి బంగారువర్ణముగను, అంగారకుఁడు ఎరుపుగను, శుక్రుఁడు పీతమిశ్రిత శుక్లముగను, బుధుఁడు కరపుపచ్చగను, చంద్రుఁడు తెల్లగనున్నాఁడు ఈగ్రహ ములుండుస్థలములు అంత్యములుగ నుండుటచే కక్ష్యలనియు, దిరుగుటచేత మండలము లనియుఁ దెలియవలెను. వీటిననుసరించి వారములు, రాసులుఁగూడనున్నవి. ఈరంగుల ననుసరించి గ్రహములు సప్తధాతురూప ఫలములను, పదార్థములను, లోహదులను, రుచులాదిగా సమస్తఫలములను జెప్పునవకాశములున్నవి. రాహు కేతు గ్రహములు ఛాయా రూపులు. ఈ తమస్సుయొక్క చివరభాగము రాహువు

గను, మరొకచివర కేతుసంజ్ఞగనున్నవి. సూర్యునికి క్రిందిభాగములో నుండుట చేత వీటిఛాయ లప్పుడపుడు సూర్యచంద్రుల నాచ్ఛాదించును. రంగులు సూర్యునియందు ఆవరణ కక్ష్యలుగ గుణముల ననుసరించియున్నవి. ఈ సూర్యునిముందు వెనుకభాగములందు ఉపచ్ఛాయ లుండుటచేత వీటిని భార్యలుగఁ జెప్పిరి. మనలో నేడురంగులు ధాతురూపకముగ నున్నందుచేతనే రంగు తగ్గిపోవునో దానిననుసరించి సూర్యాదిగ నారంగుల ననుసరించిన గ్రహములు చాలవవి వానిని జ్యోతిశ్శాస్త్రములో నారాధన తన్నివారణార్థముగఁ జేయమహర్షులు సిద్ధాంతీకరించిరి. సూర్యునారాధించినను అతనియందీరంగులన్నియు నుండుటచేత ఆరోగ్యభాగ్యము గలుగునని గూడ చెప్పిరి. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్"అని ప్రమాణము. ప్రకృతి చికిత్సలో నీరంగుల ననుసరించిన విధానములున్నవి. ఈరంగులే సప్తఛందోరూప సూర్యరథాశ్వములు.

రంగులకుఁగారణము నీరు. ఈరంగులు నీటిలో ప్రతిఫలించి భిన్నరూపములుగ నగపడుచున్నవి. రంగులన్నియు మూలముగ తెలుపునుండియే కలుగుచున్నవి. తేజోభూతములో నీరంగులు స్పష్టముగ నగపడవు. ఇందుకు దృష్టాంతము మణులందును, వజ్రములందును, కిరణప్రకాశములకు అందులోని నీటిగుణమే కారణము. ఇచ్చట తన్మాత్రస్వరూపముతో నున్నవని తెలియవలెను. ఇంద్రధనస్సు గూడ నీరంగులతో నుండును. ఇంద్రధనస్సు వర్షాకాలమునందుఁదప్ప యితరకాలములందగపడదు. రంగులకు జలగుణమే ముఖ్యకారణము. తేజస్సు జలములో ప్రతిబింబితమై జలగుణముతో ననేక వర్ణవిభాగము లగును. ఈజలము సూర్యునియందుఁగూడ సూక్ష్మరూపముతో నున్నందుచేతనే రంగులుండును. "యోపాం పుష్పం వేద"యను మంత్రములో అన్నిటికిని ప్రమాణముగనున్నది. జలబిందువులందు సూర్యప్రకాశముతోఁ జాలరంగులుగ నగుబడుచుండును. తేజోభూతము క్రింద జలభూతముండుట చేతనే రంగులు సూర్యునిక్రిందనే యగుపడును. తేజోభూతమున ఉపరిలోగల వాయుభూతములో రంగులగపడవు. శుద్ధమగు తేజస్సుగూడ నగుపడకపోవచ్చును. భూతగుణముతో స్థూలముతో ప్రత్యేకింపఁబడి కానఁబడుచుండును. రంగులు సర్వదా ప్రధానశ్వేతవర్ణమున నున్న సహజముగ సృష్టితో ననేకరంగు లగుచుండును. ఇందుకు దృష్టాంతము. గ్రుడ్డు తెల్లని కాయయందు పక్వానంతరము క్రమముగ కొంచెము పసుపుఛాయఁదిగ్గ ప్రారంభించినదేమరల యెరుపుగను తర్వాత కేసరివర్ణముగను దుదకు నలుపై ... చుండును. తరాత

నలుపురంగుపోయి మరల పూర్వరూపమును తెలుపునే పొందును- ఈరంగులు పంచభూతాదులలో నుండుటచేత తజ్జన్యములగు తాటియును తప్పకయుండును.

—o—

# మేషాదిరాసుల సంజ్ఞలు పర్వకాలములు దీప్తుల నామసంఖ్యలు ఋతువిశేషాదులు,

(౧) ఇంద్రుఁడు = ఇంద్రియూపముతో స్వర్గమునందుండి దేవతల వైరులను ధ్వంసము జేయుచున్నాఁడు.

(౨) ధాత = సమస్త జీవజంతువులను సృష్టించును.

(3) పర్జన్యుడు= ప్రకాశమండలముతోఁ దనకిరణములచే జలమును ఆరు మాసములు గ్రహించి వర్షమును గురిపించును.

(౪) త్వష్ట=(వనజమిత్రుడు) ఈవృక్షములను ఓషధులనుపెంచిపోషించును.

(౫) పూషన్=అన్నమునందు పుష్టినిఁగలుగజేసి ప్రజలను వృద్ధిబొందించును.

(౬) అర్యమ= అర్యమయను వాయువుతో క్షమను గలుగఁజేయును.

(౭) భగ= త్రిదశతతి నాశ్రయించి పన్మొద మొనగుచుండును. ప్రాణి శరీ బరంబులందుండును.

(౮) వివస్వాన్ =జరరాగ్నియందుఁజేరి జీర్ణపఁజేసి బలమునువృద్ధిజేయుచుండును.

(౯) విష్ణు= దేవతలందుఁజేరి శత్రువులను నాశనముచేయును.

(౧౦) అంశుమాన్= మంచిగాలినిచ్చి ఆహ్లాదము, బలమును గలుగజేయును,

(౧౧) వరుణ= నీటియందుఁజేరి ప్రజలను శక్తిచే వృద్ధచేయుచుండును.

(౧౨) మిత్ర= జగద్ధితమును జేయును.

సూర్యునకు సహస్రాంశుఁడనిపేరు - వెయ్యికిరణములుగలవాఁడు. చంద్ర, మేధ్యకాంత, జ్యోత్స్నలు అను అమృతకిరణములు ౪౦౦ ఇవి వర్షమును గురిపించును. ఇవిచంద్రునియందుండును. చంద్ర, తార, అగ్నులను శీతగుణములు గలిగిన 3౦౦ కిరణములు హిమమును గురిపించును. ఇవిమిగులపవిత్రములు సంతోషకరములు, శుక్లములు, శుభములు, గోవులు, విశ్వభృత్తులు మొదలగునవి 3౦౦ వందలు. ఇవి ఆతపమును గలుగజేయును. ఋతుభేదములచే సూర్యకిరణభేదములు గలుగును. వీటికే త్రినాభిచక్రమనిఅర్థము. త్రికాలములకే త్రినాభులనిపేరు.

| రాసులు. సంజ్ఞలు. | పర్వఘటియలు. | మాసములు. | నామములు. | దీప్తికిరణము. |
|---|---|---|---|---|
| ౧ మేషరాశి విషుసంజ్ఞ | ప్రాగూర్ధ్వ పంచదశ ఘటికా పుణ్యకాలము దశదశేత్యేకే | చైత్రి మాసము. | విష్ణువు | ౧౨౦౦ |
| ౨ వృషభము విష్ణుపదము | పూర్వాః షోడశ | వైశాఖ | అర్యముడు | ౧౩౦౦ |
| ౩ మిధునయు షడశీతి | పరాః షోడశ | జ్యేష్ఠ | వివస్వంతుడు | ౧౪౦౦ |
| ౪ కటకము అయన | పూర్వాస్త్రింశత్ | ఆషాఢ | అంశుమంతుఁడు | ౧౫౦౦ |
| ౫ సింహము విష్ణుపద | పూర్వాః షోడశ | శ్రావణం | పర్జన్యుఁడు | ౧౪౦౦ |
| ౬ కన్య షడశీతి | పరాః షోడశ | భాద్రపద | వరుణుఁడు | ౧౩౦౦ |
| ౭ తుల విషుసంజ్ఞ | ప్రాగూర్ధ్వం చ పంచదశ, దశ,దశేత్యేకే | ఆశ్వయుజము | ఇంద్రుఁడు | ౧౨౦౦ |
| ౮ వృశ్చికము విష్ణుపద | పూర్వాః షోడశ | కార్తీకం | ధాత | ౧౧౦౦ |
| ౯ ధనుస్సు షడశీతి | పరాః షోడశ | మార్గశిర | మిత్రుఁడు | ౧౦౦౦ |
| ౧౦ మకరము అయన | పరాశ్చత్వారింశత్ | పుష్య మాసము | పూష | ౯౦౦ |
| ౧౧ కుంభము విష్ణుపద | పూర్వాః షోడశ | మాఘము | భగుఁడు | ౧౩౦౦ |
| ౧౨ మీనము షడశీతి | పరాః షోడశ | ఫాల్గుణము | త్వష్ట | ౧౦౦౦ |

| కిరణముల నామములు. | వర్ణములు. | ఋతువులు వర్ణములు. | వరా |
|---|---|---|---|
| విష్ణు కిరణములు | | వసంతఋతువు పీతవర్ణములు కపిలవర్ణములు | ఈ కిరణము ఉత్తరాయణములో వృద్ధియగుచుండును. (మకరాది మిథునాంతరాసులు) దక్షిణాయనములోన క్షీణుడగును. సలిలమే పరిధిగా నావహించి సూర్యుడుండును. |
| క్రాంతులు గభస్తులు | | గ్రీష్మఋతువు బంగారువర్ణము | |
| అరుణగభస్తులు కిరణములు | ఎఱుపువర్ణము మయూఖ వర్ణము | వర్షఋతువు శ్వేతవర్ణము | సూర్యుడనిమిది లేక ఆరుమాసములు జలమును గ్రహించును. ఆవల వర్షించును సూర్యుడు తీక్ష్ణకిరణములతో జలమును గ్రహించి చంద్రునికిచ్చును. చంద్రుడు వాయువునాడులతో ఆకసమున విడుచును. |
| రచనలు దీప్తులు | | శరదృతువు పాండువర్ణము | |
| ఘృణులు జ్యోతిస్సులు | వెన్నెల వర్ణము | హేమంత ఋతువు తామ్రవర్ణము | ఈనాడులు, వాతాతివాత దహన జలనాడులు: ఆవిరి, ధూమము, అగ్ని, వాయువులే మేఘములు. జలమును ఆకర్షించి యుంచుకొని ఆవల వాయునాడులతో గాలగుణకర్మానుసారముగ వర్షించును. సూర్యుడు నాలుగువిధములుగ జలమును గ్రహించును. |
| కిరణములు ఘృణులు | మయూఖ వర్ణము. | శిశిఋతువు లోహిత వర్ణము | |

## కొన్ని పదముల విశేషార్థము,

భూతము:- పంచభూతములకును, సత్యమునకును, ప్రాణిమాత్రమునకును, అతీతకాలమునకును, సదృశవస్తువునకును సమర్థ్యయము.

కిరణః:- కిరతి తమఇతి కిరణః=తమస్సును పోగొట్టునది.

గభస్తిః - పోవుచు ప్రకాశించునది.

ఘృణిః - జలమును జారనిచ్చుకాంతి.

మరీచిః - ఈదీప్తిచేత క్షుద్రజంతువులుగాని, అంధకారముగాని నశించును.

మేరు - మినాత్యసురానితి మేరుః — అసురులను హింసించునది. మిఞ్— హింసాయాం మినోతిక్షిపతి శిఖరైర్జ్యోతీంషీతి మేరుః=శిఖరములచే నక్షత్రాదుల వహించునట్టిది. డుమిఞ్ ప్రక్షేపణే. సుష్ఠు మనోతీతి సుమేరుః=మేరుశబ్దము నకు. హేమ మయోద్రిః హేమాద్రిః=బంగారు కొండరత్న మయాస్సానవోయస్య సః=రత్నసానుః. రత్నమయములైన చఱులుగలది. సురాణామాలయ స్సురాలయః=సురులకుస్థానము.

### —• దేవతల ఆధిక్యవివరము. •—

అమరాః=చావనివారలు, నిర్జరాః=ముదిమిలేనివారలు. దేవాః=క్రీడించువారలు, త్రిదశాః=ఉత్పత్తిస్థితి నాశనములేనివారలు, అనగా యెల్లప్పుడును బంచవింశతి వార్షికాః=సర్వదా ౨౫ సంవత్సరముల వయస్సుగలవారుగ నుందురు. త్రిదశాః=ముప్పదేండ్లకులోబడినవారలు.

విబుధాః = విశేషముగా నెఱింగినవారలు. సురాః=ఐశ్వర్యయుక్తులు లేక భక్తిచే నిచ్చిన హవిరాదులను లెస్సగాగ్రహించువారలు, లేక శుభమును జెప్పెడువారలు, లేక సముద్రమునందు బుట్టిన అమృతమును ద్రావినవారలు, లేక లెస్సగా వాంఛిత ఫలములనిచ్చువారు. సుపర్వాణః=లెస్సగా అభీష్టముల నిండించువారలు, శుభకరమైన యుత్సవములు గలవారలు, స్వర్గమునకు ప్రభువులు. లేఖాః—కంఠ హస్తపాదములందు మంచిరేఖలు గలవారలు. ప్రాణులకు శుభఫలమును వ్రాసెడువారలు. ఋభవః=సత్యముతోఁబుట్టినవారలు. అస్వప్నాః= నిద్రలేనివారలు. అమర్త్యాః=చావనివారలు, అమృతము అన్నముగా గలవారలు. బర్హిర్ముఖాః=అనగా అగ్నియందు హోమము చేయబడిన హవిరాజ్యములవలన

దృప్తి జెందువారలు. క్రతుభుజాః=యజ్ఞమందు భుజించువారు. గీర్వాణాః= శాపరూపమైనవాక్కు బాణముగా గలవారు.

శర్వర్యాః=వ్యాపారమునుగాని దినమునుగాని చెరచునది. అన్నిటిని స్వల్పముగా జేయునది రాత్రియందు ప్రథమ యామము జేష్టాసమయము. అంత్యయామము=విబోధకాలము. నీరెంటిమధ్యయామము సగము.

విభావరీ=సూర్యకాంతినిగప్పునది. చంద్రాదులచేఁ బ్రకాశించునది.

అనుమతి=ఒకకళ తక్కువైన చంద్రునిగల వెన్నెల; దీనియందు దేవతలు పితృసహితులై సేవకొఱకుఁ దలఁపఁబడుదురు.

---

# సూర్యుని ఆరోహణావరోహణ క్రమముతో తీవ్రమాంద్య సమగతులకు గారణము.

శింశుమారగతితో సూర్యునికి ఆరోహణావరోహణ క్రమముతో తీవ్రమంద సమగతులేర్పడుచున్నవి శింశుమారమర్ధ చంద్రాకృతిగల రెండుభాగములుగ. నున్నది. దీనినే బాహ్యావలయమనియు అంతర్వలయమనియు నందురు. బాహ్యవలయము మనదృష్టిలో ఈశాన్యమున నుండి కర్కటక రాశ్యాదిగ నారురాసుల వరకు అవరోహణక్రమముతో క్రిందికి దిగుచు తుదకు ధనూరాశ్యంతమగునప్పటికి ఆగ్నేయభాగమునకువచ్చి చేరును. శింశుమారముయొక్క యీభాగార్ధము నిడివి కొంచెమెక్కువగ అవరోహణ క్రమముగనుండును. అందుచేత నీరాసుల ప్రమాణ ఘటియలు ఉత్తరాయణరాసులకంటె నధికముగ నున్నవి. ఈదిశలో డిగ్రీలుగూడ నూటయెనుబదారున్నట్లు పురాణములందుఁ జెప్పఁబడినది. ఇదిమనలెక్కతో నారుమాసముల కాలమగును. మనదేశములో సహజముగ రైతులు దీనినే దిగుపొద్దుకాలమని యందురు ఈమాసములు పగలు పొద్దుతక్కువగను, రాత్రి అధికముగనుండును. రాసులఘడియలధికములుగ నుండినను దిగుడుచే తీవ్రగతిగ నుండుటచేత సరిపోవును. దీనినే దక్షిణాయనమనెదరు. ఈమార్గమధ్యలోఁ దులారాశియున్నది. ఈరాశియందుమాత్రము సమగతిగ సూర్యుఁడుండును. అప్పటికిఁ బగటిభాగము, రాత్రిభాగము సమానఘడియలుగ నుండును. అందుచేత

సమగతియని విషుసంజ్ఞగఁజెప్పబడెను. కటకము, సింహము, కన్య, వృశ్చికము, ధనస్సులలో సూర్యుఁడున్నప్పుడు ఒక్కొక్క ఘడియప్రకారము పగలు పొద్దు తగ్గుచుండును. దీనికిఁబంచాంగములందు అహఃప్రమాణమునఁ దెలుపుచుందురు. దీనినిఁబట్టియే సూర్యుని ఉదయాస్తమయకాలమును గని పెట్టు నవకాశము న్నది. సూర్యుఁడు శింశుమారచక్రములోఁ దిగుటచేతఁబగలు పొద్దుతీవ్రగతితో తక్కువగను రాత్రియెక్కువగను నుండును మనలోకానుభవములోఁ గూడ సూర్యుడు ఈశాన్యదిశనుండి క్రమముగఁ గ్రిందికిదిగివచ్చుచు తుదకు ధనురాశ్యంతమునకు ఆగ్నేయదిశకు వచ్చుట చూచుచున్నాము. శింశుమారచక్రము యొక్క నీయీభాగార్థము ధనురాకారముగ నుండుటచేత పైనుండి క్రిందికి వచ్చుటలో త్వరగా దిగుటచేత తీవ్రగతి గలిగియుండును. ఈగతి సూర్యబింబము యొక్క భాగార్ధమునకు మాత్రమే సూర్యుఁడు తానున్నచోటునసే స్వపరిభ్రమణ కలిగియుండును. దీనిని, ఇతరులు సామాన్యముగ గ్రహించుట కష్టతరము. సూర్యుడుగూడ ధ్రువసంజ్ఞతో జేరినాడు. ధ్రువుడన్నను సూర్యుఁడన్నను నొకటే సమగతిమాత్రము శింశుమారముయొక్క యితరభాగార్ధవలయములోఁగల మేషరాశియందునను నుండును. శ్రీభాగవతములోఁగూడ శ్రీభక్త పోతనగారు పంచమస్కంధము అధ్యా. ౨. ఆ. మేషతులలయందు మిహిరుండహోరాత్రులందుఁ దిరుగు సమవిహారములను, బరగ వృషభమాది పంచమాసముల నొక్కొక్క గడియరాత్రి దక్కనడుచు॥ ౭౭ ॥ ఆ॥ మించివృశ్చికాది పంచమాసముల నొక్కొక్కగడియరాత్రి నిక్కనడచు దివసములందు నెల్లఁదిగజాఱు నొక్కొక్కగడియ నెలకు దప్ప్రకారమునను॥ ౭౮ ॥

## —♦ ఆరోహణవిషయము. ♦—

సూర్యారోహణము నుత్తరాయణమందురు. ఆరోహణ యనగా క్రిందినుండి పైకెక్కుమార్గమని తెలియవలెను. ఎక్కుడుమార్గ మేదానికైనను మందగతిగనే యుండును. ఇదిసర్వులకుఁదెలసినదే. ఇది శింశుమారముయొక్క అంతర్వలయ భాగార్ధ దిశయని తెలియవలెను. ఈ భాగము నిడివివెనుకటిభాగమునకంటెఁ గొంచెము తక్కువగనుండును మందగతిని, మార్గము కలుచకును దగినట్టు లీభాగమున మకరరాశినుండి మిథునాంతమువఱకు గలనారురాసుల ప్రమాణఘడియలు తక్కువకరిమికిగలవి. ఇదిగాక ఆరోహణకుఁ దగినట్టుగా అహఃప్రమాణ మధిక

ముగ ఒక్కొక్క గడియ క్రమముగాఁ బగలు మిథునరాశివరకు హెచ్చుచుండును. రాత్రిఘడియలు తగ్గుచుండును. సూర్యుఁడారోహణవలన మందగతిగలిగి యుండుటచేఁ బగటిరాసు లారునుగాక యేడవరాశినిఁ బగలేపొందును కాన అహఃప్రమాణ మధికమై మిగిలిన యైదురాసులే రాత్రిమిగిలి కాలముతక్కువగును. హెచ్చుతక్కువలచే నన్నియుఁ దుదకు సరిపోవును. ఈమార్గమధ్యలో మేషరాశి యున్నదికాన నీమేషరాశియందు అహఃప్రమాణ తులారాశివలెనే సమగతితో నున్నది. అందుచేతనే యీరాశికి విషుసంజ్ఞ యేర్పడినది. ఈఉత్తరాయణములో సూర్యుఁడు ఆగ్నేయదిశనుండి ఈశాన్యదిశకు దినదినము క్రమముగ నెక్కుచున్నట్లుగఁ గనఁబడుచుండును. సూర్యుఁడుత్తరదిశకుఁ బోవుటచేత ఉత్తరాయణమని చెప్పఁబడెను. ఈ ఉత్తరాయణము దేవతలకుఁ బగలుగను, దక్షిణాయనము రాత్రిగనున్నది. ప్రతిరాశిని ముప్పదిభాగములప్రకారము పండ్రెండురాసులు మూడువందలఱువదిభాగములగును. ఇవియే సంవత్సరములో దినములు. రాసుల ముప్పదిభాగములే ముప్పది దినములై మాసముగనేర్పడెను. రాశిద్వయముతో ఋతువులుగను రాశిషట్కముతో అయనముగ కాలసంజ్ఞ యేర్పడెను. శింశుమారగతితో ఆరోహణముతో సూర్యబింబము మిగతభాగార్ధముదిరుగును. శింశుమారచక్రసంపూర్ణగతితో సూర్యబింబ మచ్చటనే గడియారములో మధ్యలోనున్న చక్రము మూలములోనే తిరిగినట్లు సంవత్సరాంతమున కొకచుట్టు సంపూర్ణముగఁ దిరుగును మకరాదిగనున్న యారురాసులఘడియల ప్రమాణ మిరువదేడున్నరఘడియలగును. తుదకు అహఃప్రమాణ మిరువదేడున్నర ఘడియలకేనిలుచును కటకాదిగఁగల యారురాసుల సూర్యుడున్నపుడు ముప్పదిరెండున్నర ఘడియల అహఃప్రమాణముండును. ఈరాసులే అయనభేదములతోను, ఆరోహణావరోహణ భేదములతో రాత్రింబగళ్ల పరివర్తన భేదములతోనొకటి అహస్సుగను మరొకటి రాత్రికాలముగ నుండును. కాలభేదములు, గతిభేదములు, అహోరాత్రుల ఘడియలభేదములు. నన్నిటికిని ముఖ్యకారణము శింశుమార చక్రగతియే. ఇది ద్యులోకసంజ్ఞ.

ఇక మనలోక సంజ్ఞతో దక్షిణాయనములో సూర్యుఁడు కర్కటక రాశ్యాదిగ ఈశాన్యదిశనుండిఁ క్రిందికి వచ్చుటచేతఁ గర్కటకరాశి మన కువరిలో నున్నందుఁజేత మనభూభ్రమణతో సూర్యుని వేడిమి తక్కువగుచున్నది. ఇది క్రమక్రమముగా దిగుటచేత మకరరాశికి వచ్చునప్పటికి దక్షిణదిశయగును. ఈరాశిమనకు దక్షిణమున నున్నదగుటచేత నీరాశినుండి సూర్యుఁడారోహణముతో నుత్తరమునకుఁ

బోనుపోను సూర్యుని వేడిమి క్రమక్రమముగ నెండలతిశయించు చుండును.

ఈకాలభేదములచేతను భూభ్రమణ చేతను, శింశుమార భ్రమణచేతను, సూర్యుని ఆరోహణావరోహణములచేతను, సమీపదూరములచేతను, సూర్యరథ చక్ర త్రినాభి చేతను, త్రికాలములేర్పడెను. ఇదియునుగాక శింశుమారము తేజో రాశిభూత దిశభేదముచేతను మన కుపరిలో జలభూతరాశిదిశభేదముచేతను మన పృథివీభూతమున్న దిశభేదము చేతను వీటిభ్రమణలచేతను భగవన్నియామకముతో నీకాలచక్ర మీలాగునఁ గాలత్రయ గుణభేదములతో నడుచుచుండును. దీనిని మనము మార్పులెంతమాత్రము జేయలేము. కాలములుమూడు. అవి (౧) ఎండ కాలము, (౨) వర్షాకాలము, (3) చలికాలము, గాలి సర్వదాయుండును. జ్యేష్ఠాషాఢాదులం దతిశయించును. దీనిని ఋతుకాలముక్రిందఁ జేర్పఁలేము రాత్రిలందు చలువదనముండుట సహజము. మనమున్నభూభాగము రాత్రిలపాం పతియగు వరుణదిశను బొందును. శింశుమారములో సహజక్రమముగా వృశ్చికాది నాలుగురాసులు స్వర్గలోకముంనుకూడ రాత్రికాల సంబంధరాసులై యుండుటచేత చలువగుణముతో మనకు నీకాలము హిమ శశిఋతువులుగా నున్నవి ఈ రాసుల కాలమంతయును శింశుమారమునుగూడ అపాంపతియగు వరుణదిశను జేరియుండుట చేత శీతకాలము అచ్చటివారలకును మనకును అది స్వర్గలోకములవారికి రాత్రికాలములోని భాగముగను మనకు నాలుగుమాసముల కాలముగను నుండును. ఈ లాగుననే ఎండకాలము ద్యులోకమునఁ బగటికాలమగునప్పుడు మనకు నాలుగు మాసములకాల మెండకాలముగనుండును. ఈ కాలము ద్యులోకమునం దుత్తరాయణ కాలమగును. వారికిదే పగలు మనమున్న భూభాగము సూర్యుఁడున్నదిశకు భ్రమణతో జేరుటచేఁ బగళ్లయందు ఎండలతివేడిమిగా సూర్యప్రకాశముతోఁ గలుగుచుండును. మకరాది నాలుగురాసులు ద్యులోక వాసులకు ఒక్కపగటి భాగకాలమగుటచేత మనకీనాలుగురాసులకాలములందు నెండలతిశయించి వేడిమిని గలుగజేయును మనభూభ్రమణతోఁ గాలమానమును గణించినచోఁ బ్రతిదినము నందీమూడుకాలములు మార్పులఁజెంద సర్వదాయుండెడిది. మనయనుభవమట్టుల లేదు. ద్యులోకము ననుసరించి కాలవిడంబనము కాలభేదములు జరుగుచున్నవి.

—o—

# సూ ర్య చం ద్రు ల గ తి వి శే ష ము.

---

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౦

అతఊర్ధ్వం ప్రవక్ష్యామి సూర్యాచంద్ర మసోర్గతిం। సూర్యాచంద్రమసా వేతౌ భ్రమంతౌ యావదేవతు। ప్రకాశతః స్వభాభిస్తౌ మండలాభ్యాం సమాస్థితౌ॥ ౫౭ ॥ సప్తానాంచ సముద్రాణాం ద్వీపానాంతు సవిస్తరః। విస్తరార్థం పృథివ్యాస్తుభ వేదన్యత్ర బాహ్యతః॥ ౫౮ ॥ పర్యాసపారిమాణ్యాంతు చంద్రాదిత్యౌ ప్రకాశతః। పర్యాసపారిమాణ్యేన భూమేస్తుల్యః దివంస్మృతం॥ ౫౯ ॥ అవతిత్రీన్ మాన్ లోకాన్ యస్మాత్తు సూర్యః పరిభ్రమన్। అవధాతుః ప్రకాశాఖ్యోహ్యవనాత్స రవిఃస్మృతః॥ ౬౦ ॥

—♦ సూర్యచంద్రమండల విస్తారగతి ♦—

అతః పరం ప్రవక్ష్యామి ప్రమాణం చంద్రసూర్యయోః। మహితత్వాన్మహీశబ్దో హ్యస్మిన్ వర్షే నిపాత్యతే॥ ౬౧ ॥ అస్యభారత వర్షస్య విష్కంభంతు సువిస్తరం మండలం భాస్కరస్యాథ యోజనానాం నిబోధత॥ ౬౨ ॥ నవయోజన సాహస్రో విస్తారో భాస్కరస్యతు। విస్తారాత్రిగుణశ్చాస్య పరిణామోఽథ మండలం। విష్కంభో మండలస్యైవ భాస్కరాద్ద్విగుణః శశీ॥ ౬౩ ॥

—♦ పృ థి వి వి స్తా రః. ♦—

అతః పృథివ్యాం వక్ష్యామి ప్రమాణ యోజనైః సహ। సప్తద్వీప సముద్రాయా విస్తారో మండలంచయతు॥ ౬౪ ॥ ఇత్యేతదిహ సంఖ్యాతం పురాణం పరిమాణతః। తద్వక్ష్యామి ప్రసంఖ్యాయ సాంప్రతైరభిమానిభిః॥ ౬౫ ॥ అభిమానివ్యతీతా యేతుల్యాస్తే సాంప్రతైరిహ। దేవాయేవై హ్యతీతాస్తే రూపైర్నామభిరేవచ॥ ౬౬ ॥ తస్మాత్తు సాంప్రతైర్దేవైర్వక్ష్యామి వసుధాతలం। దివస్తుసన్నివేశోవై సాంప్రతైరేవ కృత్స్నశః॥ ౬౭ ॥ శతార్థకోటివిస్తారా పృథివీకృత్స్నశస్స్మృతా తస్యావార్ధ ప్రమాణేన మేరోర్వై చాతురంతరం॥ ౬౮ ॥ పృథివ్యావార్ధవిస్తారో యోజనాగ్రాత్ప్రకీర్తితః। మేరుమధ్యాత్ ప్రతిదిశం కోటిరేకా దశస్మృతాః॥ ౬౯ ॥ తథాశత సహస్రాణి ఏకోనన వతిఃపునః। పంచాశచ్చ సహస్రాణి పృథివ్యావార్ధ విస్తరః॥ ౭౦ ॥ పృథివ్యా విస్తరం కృత్స్నం యోజనైస్తన్నిబోధత। తిస్రఃకోట్యస్తు విస్తారః సంఖ్యాతః సచతుర్దిశం॥ ౭౧ ॥ తథాశత సహస్రాణా మేకోనాశీతి రుచ్యతే।

సప్తద్వీప సముద్రాయాః పృథివ్యాస్తే వ్యవిస్తరః॥ ౨౨ ॥ విస్తారాత్ త్రిగుణం చైవ పృథివ్యాంతస్య మండలం। గణితం యోజనాగ్రంతు కోట్యస్త్వేకాదశ స్మృతాః॥ ౨౩ ॥ తథాశత సహస్రాంతు సప్తత్రింశాధికానితు। ఇత్యేతద్వై పరిసంఖ్యాతం పృథివ్యాం తస్యమండలం॥ ౨౪ ॥ తారకా సన్నివేశస్య దివియావద్ధిమండలం। పర్యాసః సన్నివేశస్య భూమ్యస్తావత్తు మండలం॥ ౨౫ ॥ పర్యాసపారిమాణ్యేన భూమేస్తుల్యం దివంస్మృతం। సప్తానామపిలోకానా మేతన్మానం ప్రకీర్తితం॥ ౨౬ ॥ పర్యాసపారిమాణ్యేన మండలానుగతేంచ। ఉపర్యుపరిలోకానాం ఛత్రవత్పరిమండలం॥ ౨౭ ॥ సంస్థితిర్విహితాసర్వా యేషుతిష్ఠంతి జంతవః। ఏతదండ కటాహస్య ప్రమాణం పరికీర్తితం॥ ౨౮ ॥

అండస్యాం తస్త్విమే లోకాః సప్తద్వీపాచ మేదినీ। భూర్లోకశ్చ భువశ్చైవ తృతీయః స్వరితిస్మృతః। మహర్లోకో జనశ్చైవ తపఃసత్యశ్చ సప్తమః॥ ౨౯ ॥ ఏతే సప్త కృతాలోకాశ్ఛత్రాకారావ్యవస్థితాః। స్వకైరావరణైః సూక్ష్మైర్ధార్యమాణాః పృథక్పృథక్॥ ౩౦ ॥ దశభాగాధికాభిశ్చ తాభిః ప్రకృతిభిర్బహిః। ధార్యమాణా విశేషైశ్చ సముత్పన్నైః పరస్పరమ్॥ ౩౧ ॥ అస్యాండస్య సమంతాశ్చ సన్నివిష్టో ఘనోదధిః। పృథివీమండలం కృత్స్నం ఘనతోయేన ధార్యతే॥ ౩౨ ॥ ఘనో దధిపరేణాథ ధార్యతే ఘనతేజసా। బాహ్యతో ఘనతేజస్తు తిర్యగూర్ధ్వంతు మండలం॥ ౩౩ ॥ సమంతాద్ఘనవాతేన ధార్యమాణం ప్రతిష్ఠితమ్। ఘనవాతాత్తథాకాశ మాకాశంచ మహాత్మనా॥ ౩౪ ॥ భూతాదినావృతం సర్వం భూతాదిర్మహతావృతః। వృతో మహాననంతేన ప్రధానేనావ్యయాత్మనా॥ ౩౫ ॥ పురాణిలోకపాలానాం ప్రవక్ష్యామి యథాక్రమం। జ్యోతిర్గణ ప్రచారస్య ప్రమాణం పరివక్ష్యతే॥ ౩౬ ॥

## —◆ సూర్యచంద్రుల మండలము ◆—

ఈజగత్తులో సూర్యచంద్రుల భేదముతో రాత్రింబగళ్లని విపరీతవ్యవహార భేదములుగ మూలప్రకృతిమాయతో నజ్ఞానలోకమునందు ఉదయాస్తమయములతో పూర్వపశ్చిమ దిగ్భేదములుగ గల్పింపబడిన దేగాని సత్యమగు జ్ఞానదృక్కుతో నంతమాత్రమును భేదములేదు. దీనిననుసరించియే కాలభేదములున్నవి. శ్రుతిప్రమాణము తైత్తరీయం "పూర్వాపరంచరతో మాయయైతౌ। శిశూక్రీడంతౌ పరియాతో అధ్వరం। విశ్వాన్యన్యోభువనాఽభిచష్టే। ఋతూనన్యో విదధజ్జాయతేపునః" ఇది. ఈవాయు పురాణమందుఁ జెప్పఁబడియున్నది.

సూర్యచంద్రులు భగవన్మాయచేఁ దమకాంతితో నెంత తిరుగుచున్నారో ముందు జెప్పబడినది. ఈఅండ కటాహములో సప్తద్వీప సప్తసముద్రము లందును సీవ్యవహారిక స్వర్గమని జెప్పబడుచున్న యీయాకాశమంయను మండలమాకముతో దిరుగుచు ప్రకాశింపఁజేయుచున్నాడు. ఈలాగుననే పార్థివాండమగు జీవదేహ పిండాంశములందును జఠరాగ్నిగా మండలముతో త్రికరణములను బొంది హృదయాకాశాదిత్యుఁడై ప్రకాశించి సర్వవ్యవహారాదులను జేయుచున్నాఁడు.

అవతీతిజం - అని అవధాతువు ప్రిణవార్థకమై అటులనే రాతీతిరవిః - అని రవధాతువు నాదార్థకమై సకలజగద్రక్షక మగుచుండుటచే ప్రణవార్థకమగు మనోమయుఁడే రవిశబ్దార్థమగు సూర్యుడని గ్రహకోష్ఠములోఁ జెప్పబడుచున్నాడు.

సూర్యచంద్రుల మనోవాక్కుల మండల ప్రమాణమెటులన, సకలదేవ తిర్యఙ్మనుష్యాది మహాత్మ్యమునకు గుణభేదములతో మహీశబ్దము భూవాచకమగుచు. జంబూద్వీపములోఁగల నవవర్షములోఁ పాతపదము యొక్క ప్రతిసర్గార్థము ననుసరించి వాగర్థ శక్తిపాత న్యాయముచే భూమధ్యాక్షమగు నీభరతవర్షమే మహీశబ్దార్థమగును. భూమండల త్రినాభిచక్ర విష్కంభమునకు భారతవర్షము స్థానమగుటచే దీనివిస్తారము ననుసరించి సూర్యమండల విస్తారమును ముందుగాఁ దెలియవలెను.

భామసూర్యమండలవిస్తారము తొమ్మిదివేల యోజనములు. దీనికంటె మూడంతల పరిమాణము అంతరిక్ష సూర్యమండల పరిణామమున్నది. ఈ అంతరిక్ష సూర్యునికి భామసూర్యమండలము విష్కంభస్థానమగునట్లే, అంతరిక్షసూర్యుఁడు కూడ తనకంటె మూడవస్థానములో ఉపరిలోనున్న సత్యలోక చంద్రమండల విస్తారమునకు రెండంతలధిక పరిమాణమున్నందుచేత నీమండలమునకు అంతరిక్షసూర్య మండలము విష్కంభముకాగాఁ బ్రకాశించుచున్నాడు. పృథివి ప్రమాణము యోజనములను సప్తద్వీప సముద్రావధిగా మండలవిస్తారమును లెక్కించవలెను

శాస్త్రపురాణము లందుఁ జెప్పిన పరిమాణము కేవల పరమార్థతత్వ జిజ్ఞాస చింతతో కర్మయోగాదులతో దేవత్వ మన్వంతర కల్పపరిమాణమునకు ఆధునిక కేవల ప్రకృతి ప్రత్యక్ష ప్రమాణకాల పరిణామములకును అభిప్రాయభేదము లుండును.

ఈలాగున పృథివీవిస్తారము యేబదికోటుల యోజనములున్నది. ఇందులో కొంతభాగము మేరుపుయొక్క చతుర్దిగంత రాశమని జెప్పఁబడుచున్నది. మేరువ

నుండి ప్రతిదిక్కునకు పదునొకండు కోటుల యోజనవిస్తారము పృథివ్యర్థవిస్తారము. ఈప్రకారము మరికొందరు శతసహస్ర యోజనములనియు, యెనుబదితొమ్మిది యనియు, గొందరు పంచాశత్కోటియని చెప్పుచున్నారు. ఇది సమస్తభూగోళ ఘనపరిమాణము. కడపటచెప్పినవారల గణితప్రకారము ధ్రువస్థానమునకు నలు దిక్కులయందు, ఒక్కొక్కదిక్కునకు మూడుకోట్ల విస్తారమనియుఁ జెప్పబడినది. ఈవిధముగ మరికొందరు నూరువేల డెబ్బదితొమ్మిదియనియు భౌమమేరుమండలము మేరువకంటె త్రిగుణవిస్తారమనిరి.

ఈలాగున భిన్నమతములతోఁగాక సాంఖ్యశాస్త్రము ననుసరించియు యోగ తంత్రముల ననుసరించియు, శివునితోఁజెప్పఁబడినవిగాక, యోగతారావళిలో శ్రీ శంకరభగవత్పాదాచార్యులును, శ్రీమద్భాగవతములోను, భారతములో అష్టావక్రు నికివందిఅను పేరుగల వరుణపుత్రునకు, సౌందర్యలహరిలో ౧౪-వ శ్లో॥ క్షితౌష ట్పంచాద్ద్విసమధిక పంచాదశ దుదకే హుతాశ ద్వాషష్టిశ్చతురధిక పంచాశదనిలే దివిద్విష్షట్త్రింశ న్మనసిచ చతుష్షష్టిరితియే మయూఖాస్తేషా మప్యుపరి తవపాదాం బుజయుగం" అనియు పృథివి మొదలుజేసి మనఃపర్యంతముగ ప్రసంఖ్యానము వర్ణించి చెప్పిరి. తత్కాలీన జ్యోతిర్మయూఖములును ప్రణవమందే నామరూపాంశములతో సుప్రతిష్ఠములై యున్నవనియు, ఆప్రణవమును, వేదాంతములం దేకరూపమై ప్రకాశించుచున్న ఆత్మప్రకృతియందే లీనములైయున్నవి. ఇట్టిపరమార్థరూపుఁడే మహేశ్వరుఁడు. శ్రుతిప్రమాణం "యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః। తస్యప్రకృతిలీనస్యయః పరస్సమేశ్వరః" శ్రీమన్నారాయణోపనిషత్తు.

మండలత్రయ సన్నివేశముగల తారకాసన్నివేశమంతయు భూమశబ్దార్థమగు బ్రహ్మస్వరూపమే గావున తారకామండలమంతయు ప్రస్తుత వైవస్వత మన్వంతర ములోనిదే. ఈభూగోళము చిత్త, స్వాత్యంతరాళ కన్యారాశిలోనేయుండి ఉద యించుచున్నట్టు అథర్వణవేదాంగ జ్యోతిష్యములోని శ్లో॥ శ్రవణస్యోదయే ప్రాచి కృత్తికాయాస్తథోదయే। చిత్రాస్వాత్యంతరే ప్రాచీనప్రాచీ చంద్రసూర్యయోః" అనువచనములోనున్నది. ఈవ్యవహారిక భూరాది సత్యలోకాంతము అలౌకిక బ్రహ్మాత్మార్థరూపముతో మూలప్రకృతి సంబంధమగు నీలోకాదుల ఉదయాస్త మయములు నీవ్యవహారిక చంద్రసూర్యులననుసరించి నిర్ణయింపఁగూడదని నిషేధ మునుజెప్పెను. ఇంకను యజ్ఞసంబంధ శాలవేదికల దిఙ్నిర్ణయము లనంతములై యున్నవి. భూమరూపము తారకామండలముగల సన్నివేశమెంత పరిమితిగలదో

ఆకాశమండల పరిమితికూడ సమానమనియే యున్నది. ఇట్లుభూరాదిసప్తలోక పరిమాణముగూడ సమానమనియే తెలియవలెను. పృథివీలోకము నందును ద్యావా భూముల పర్యాస పరిమాణ్యముగల మండలాదులు ఉపర్యుపరిభాగములుగ ఛత్రా కారమువలె సున్నట్లుగ గణితముజేసి లెక్కించినను మిగిలియేయుండును. ఈలాగున నాయాలోకామలందున్న జీవరాసులు, వారిలోకసంస్థితి సమానముగనే యుండును. మాయాపరిమాణాండకపాలము లోపలనే భూరాదిసప్తలోకాదులున్నవి. ఈసప్తలోకములు పృథివీలోకమునకు సూక్ష్మములగు సప్తావరణములతో నావృతములై అనంతమూలప్రకృతిచే ధరింపబడియున్నవి. బ్రహ్మాండమున కావల మాత్రము నీసప్తావరణములు మహదావరణములుగాఁ బదిరెట్లధికముగ నున్నవి.

ఈభూమండల ముప్పనీటిని బోలిన ఘనోదధి ఆవరణముగనున్నది. దీనిని విద్యున్మయమగు మేఘతేజస్సుచే నాక్రమించియున్నది. ఈ ఆగ్నేయ విద్యున్మండలము తిర్యగూర్ధ్వగతితో నున్నది. తరువాత జలవాయువుచేనరగా క్షుత్పిపాసలుగల ప్రాణవాయువుచే ధరింపఁబడి యాదివ్యమేఘ తేజస్సున్నది దీనిపైనఆకాశము. భూతములకాదియగు అహంకారమును దీనికుపరిభాగముగ మహత్తత్వము; దానిపైన అనంతమగు అవ్యక్తము ఆవరించియున్నది.

—o—

## సూర్యోదయాస్తమయముల వివరము.

శ్రీవాయుపురాణం అధ్యా. ౫౦ - పుట. ౭౩.

శ్లో॥ లోకపాలో పరిష్టాత్తు సర్వతో దక్షిణాయనే। కాష్ఠాగతస్య సూర్యస్య గతిర్యాతాం నిబోధత॥ ౯౨ ॥ దక్షిణేప్రక్రమే సూర్యః క్షిప్తేషు రివసర్పతి। జ్యోతిషాం చక్రమాదాయ సతతం పరిగచ్ఛతి॥ ౯౩ ॥ మధ్యగశ్చా మరావత్యాం యదాభవతి భాస్కరః। వైవస్వతే సంయమనే ఉదయస్తత్ర ఉచ్యతే॥ ౯౪ ॥ సుఖాయా మర్ధరాత్రించ మధ్యగః స్యాద్విభావర్యదా। సుఖాయామథవారుణ్యా ముత్తిష్ఠ సతుదృశ్యతే॥ ౯౫ ॥ విభాయామర్ధరాత్రిం స్యాన్మాహేంద్ర్యా మస్తమేతిచ। తదాదక్షిణ పూర్వేషా మపరాహ్ణో విధీయతే॥ ౯౬ ॥ దక్షిణాపరదేశ్యానాం పూర్వాహ్ణః పరికీర్త్యతే। తేషామపర రాత్రించ యేజనా ఉత్తరాపథే॥ ౯౭ ॥

దేశాదుత్తరపూర్వాయాం పూర్వరాత్రింతు తాఃపత్రి। ఏవమేవాత్ర శేషేషు భువనేషు విరాజితే॥ ౯౮ ॥ సుఖాయామథవారుణ్యాం మధ్యాహ్నేచార్యమాయదా। విభావర్యాం సోమపుర్యాముత్తిష్ఠతి విభావసుః॥ ౯౯ ॥ రాత్ర్యర్ధం చామరావత్యామస్తమేతి యమస్యచ। సోమపుర్యాం విభాయాంతు మధ్యాహ్నే స్యాద్దివాకరః౧౦౦ మహేంద్రస్యామరావత్యాముత్తిష్ఠతి యదారవిః। అర్ధరాత్రం సంయమనే వారుణ్యామస్తమేతిచ॥ ౧౦౧ ॥ సశీఘ్రమేతి పర్యేతి భాస్కరోzలాతచక్రవత్। భ్రమన్ భ్రమమాణాని బుక్షాణి గగనేరవిః॥ ౧౦౨ ॥ ఏవంచతుర్షుద్వీపేషు దక్షిణాంతేన సర్పతి। ఉదయాస్తమనే నాసావుత్తిష్ఠతి పునః పునః॥ ౧౦౩ ॥ పూర్వాహ్ణే చాపరాహ్ణేతు ద్వాద్వా దేవాలయా తుసః। తపత్యేకంతు మధ్యాహ్నే తైరేవ తుసరశ్మిభిః॥ ౧౦౪ ॥ ఉదితోవర్ధమానాభి రామధ్యాహ్నం తపన్రవిః॥

దక్షిణాయనమార్గమందు సూర్యుఁడు విడిచిపెట్టిన బాణమువలె జ్యోతిశ్చక్రమునుగూడ పరిగ్రహించి వేగముగఁబోవును. తూర్పునఁగల ఇంద్రపురియగు అమరావతియందు సూర్యుఁడు మధ్యాహ్నకాలమందుండునపుడు దక్షిణమునగల యమపురియగు సంయమనీపురమున ఉదయకాలమని చెప్పఁబడును. పశ్చిమమున వారుణపురియగు సుఖపురియందర్ధరాత్రియగును. ఆసుఖపురియం దుదయించునపు డుత్తరమునగల కుబేరపురియగు విభావరియందర్ధరాత్రికాలమున ఇంద్రపురియగు అమరావతియం దస్తమయకాలమునగును. అపుడు దక్షిణపూర్వమగు ఆగ్నేయదిక్కునందుండువారి కపరాహ్ణమని చెప్పఁబడుచుండును అటులనే దక్షిణాపరదేశీయులగు నిర్ఋతిదిక్కునందుండువారికి పూర్వాహ్ణమైయుండును. ఉత్తరాపథమందు అనగా విభావరినగరమందుండు వారికి అపరరాత్రిమగుచుండును ఉత్తరపూర్వపుదిక్కగు ఈశాన్యదిక్కునందుండు వారలకుఁ బూర్వరాత్రమగును. ఇది దక్షిణాయనగతివిషయము. ఇటులనే ఉత్తరాయణగతియందుగూడ సూర్యుఁడు భువనములందుఁ బ్రకాశించును. ఎటులనగా వారుణపురియగు సుఖపురి మధ్యాహ్నమునుబొందినపుఁడు సోమపురియగు విభావరినగరమందు ఉదయమగును. అమరావతినగరమందర్ధరాత్రమును యమపురియగు సంయమనీపురియం దస్తమయకాలమునగును సోమపురియగు విభావరియందు మధ్యాహ్నమగునపు డమరావతియందుదయమగును. యమపురియగు సంయమనీపురి యందర్ధరాత్రమగుచో వారుణపురియగు సుఖపురియందస్తమయమగును. ఇట్లుసూర్యుఁడు అలాతచక్రమువలె గగనమందుఁ దిరుగుచున్న నక్షత్రములను జుట్టివచ్చుచున్నట్లు కనఁబడు

చుండును. (ఈసూర్యగతి మానుషసూర్యగతిమొదలుగా దివ్యసూర్యగతివఱకు నీయుదయాస్తమయాదిగతులు సరిగనేయుండును.) ఇట్లునాలుగు ద్వీపములయందును దక్షిణాంతగతిచే నడచుచున్నవాఁడై ఉదయాస్తమయగతిచే మరల మరల సూర్యుఁడుదయించుచుండును. మఱియు పూర్వాహ్ణాపరాహ్ణములందు రెండురెండేసి దేవలోకములందు (బ్రకాశించుచు మధ్యాహ్నమందు నారశ్ములచేతనే శిరోగతుఁడగుటచే నిశ్చయుఁడై యొక్కలోకమును మాత్రమే ప్రకాశింపఁజేయుచుండును. ఉదయించునపుడు వృద్ధినిఁబొందుచున్న రశ్ములచేత మధ్యాహ్నమువఱకుఁ బ్రకాశించుచు మధ్యాహ్నాత్పరమందు క్షయించుచున్న రశ్ములచే అస్తమయమును బొందుచుండును. సూర్యుని యుదయాస్తమయములచేతనే దిక్కులు చెప్పఁబడుచున్నవి.

విశేషము.

సూర్యుని నిశ్చయమే మధ్యాహ్నము. ఇదిసావిత్రీస్వరూపము. శుద్ధసత్త్వము. తమోసంబంధమగు ఉదయాస్తమయ సంధివర్జితము. అందుచేత ఉభయచ్ఛాయా వర్జితము. కేవల సవితృరూపము. ఈరూపతేజస్సు నేరుగా ధ్రువమండలముద్వారా ఊర్ధ్వలోకాదులగుండా హిరణ్యగర్భ బ్రహ్మలోకముచేరి తదుపరి స్వస్వరూపాత్మబ్రహ్మమునుజేరును. అందుచేతనే ఉపనయనమందు నీ సావిత్రీస్వరూపము శుద్ధసత్త్వబ్రహ్మస్వరూపమగుటచేత బ్రహ్మప్రాప్తిగాఁగల సావిత్రీస్వరూపమును బ్రధానముగఁ బరాపరప్రకృతిగా "భోసావిత్రీం అనుబ్రూహి"యని ప్రార్థింపఁజేయుదురు. గాయత్రీసత్యస్వరూపమే సావిత్రీస్వరూపము. మిగత రెండుభయపార్శ్వ సంధిస్వరూపములు. ఈరెంటికావలనున్నదే తమోరూపము. అందుచేత సంధ్యాప్రారంభము సాయమాదిగను నిర్ణయించి ఉపాసింపఁజేసిరి. సాయం సంధ్యోపాసనమందు రాబోవు (రాత్రి)యనే, తమస్సు నడ్డగించుటకును ఉదయసంధ్యతో మనము తమస్సు (రాత్రి) లోనుండి వచ్చినందుచేత నివారణార్థముగను, మరల స్వరూపధ్యాన జ్ఞానమునకును, గారణములుగనున్నది. కేవల సత్యస్వరూపమే మధ్యాహ్న సవితృసంబంధ సావిత్రీస్వరూపము. అందుచేతనే సావిత్ర్యుపదేశము బ్రహ్మోపదేశమనికూడ పిలువఁబడుచున్నది. మధ్యాహ్న సంధ్యోపస్థాన మంత్రమందీవిషయము వివరింపఁబడియున్నది. తురీయాశ్రమమగు సన్న్యాస స్వీకారమందు మరల "అహం సావిత్రీం ప్రవేశయామి"యని చెప్పుదురు. ఇదిచెప్పినఁగాని తాను బ్రహ్మీభూతుండుగాఁజాలఁడు. సవితృరూపము పురుషవాచకముతోను సావిత్రీరూపము కేవలశుద్ధజ్ఞానమోక్షరూపిణియగు వంగాలప్రకృతిగనున్నది.

# ఉదయాస్తమయ రూపవర్ణ వివరము.

---

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౦.

ఉదితో వర్ధమానాభి రామధ్యాహ్నం తపన్రవిః॥ అతః పరం హ్రసంతీభిర్గోభిరస్తం సగచ్ఛతి॥ ౧౦౫ ॥ ఉదయాస్తమయాభ్యాం హిస్మృతే పూర్వాపరేదిశౌ యావత్పురస్తాత్తపతి తావత్ పృష్ఠేతు పార్శ్వయోః॥ ౧౦౬ ॥ యత్రోద్యన్దృశ్యతే సూర్యస్తేషాం సఉదయః స్మృతః। యత్రప్రణాశమాయాతి తేషామస్తః సఉచ్యతే। ౧౦౭ ॥ సర్వేషాముత్తరే మేరుర్లోకాలోకస్తుదక్షిణే। విదూరభావాదర్కస్య భూమేర్లేఖావృతస్యచ॥ హ్రియంతే రశ్మయో యస్మాత్తేనరాత్రౌ నదృశ్యతే॥౧౦౮ గ్రహనక్షత్ర తారాణాం దర్శనం భాస్కరస్యచ। ఉచ్ఛ్రాయస్య ప్రమాణేన జ్ఞేయ మస్తమానోదయం॥ ౧౦౯ ॥ శుక్లచ్ఛాయోగ్ని రాపశ్చ కృష్ణచ్ఛాయా చమేదినీ। విదూరభావాదర్కస్య ఉద్యతస్య విరశ్మితా। రక్తభావో విరశ్మిత్వాద్రక్తత్వాచ్చాప్యనుష్ణతా॥ ౧౧౦ ॥ లేఖయావస్థితః సూర్యోయత్ర తత్రతుదృశ్యతే। ఊర్ధ్వంగతః సహస్రంతు యోజనానాం సదృశ్యతే॥ ౧౧౧ ॥ ప్రభాహిసౌరీపాదేన అస్తంగచ్ఛతి భాస్కరే। అగ్నిమావిశతేరాత్రౌ తస్మాద్దూరాత్ ప్రకాశతే। ౧౧౨॥ ఉదితస్తు పునః సూర్యః అస్తమాగ్నేయమావిశత్। సంయుక్తో వహ్నినా సూర్యస్తతః సతపతేదివా॥ ౧౧౩ ॥ ప్రకాశ్యంచ తథౌష్ణ్యంచ సూర్యాగ్నేయాచ తేజసీ। పరస్పరానుప్రవేశా దాప్యాయేతే దివానిశం॥ ౧౧౪ ॥ ఉత్తరేచైవభూమ్యర్ధే తథా తస్మింశ్చదక్షిణే। ఉత్తిష్ఠతి తథాసూర్యే రాత్రిరావిశతేత్వపః। తస్మాత్తామ్రా భవంత్యాపో దివారాత్రి ప్రవేశనాత్॥ ౧౧౫ ॥ అస్తంయాతి పునఃసూర్యేదినంవై ప్రవిశత్యపః। తస్మాచ్ఛుక్లా భవంత్యాపో నక్తమహ్నః ప్రవేశనాత్॥ ౧౧౬ ॥ ఏతేన క్రమయోగేన భూమ్యర్ధే దక్షిణోత్తరే। ఉదయాస్తమానేzర్కస్య అహోరాత్రం విశత్యపః॥ ౧౧౭ ॥ దినంసూర్య ప్రకాశాఖ్యం తామసీరాత్రిరుచ్యతే। తస్మాద్వ్యవస్థితారాత్రిః సూర్యాపేక్ష్యమహః స్మృతం॥ ౧౧౮ ॥

ఉదయము సూర్యుఁడు మధ్యాహ్నపర్యంతము వృద్ధినిఁబొందుచున్న కిరణములచేఁ బ్రకాశించుచుండును. రవిమధ్యాహ్నానంతరము మరల నికిరణహ్రాసమునుబొందుచు తుదకస్తంగతుఁడగును. సూర్యోదయాస్తమయములచే పూర్వాపరదిక్కులు చెప్పఁబడును. ఎంతవఱకు సూర్యుఁడు ప్రకాశించుచుండునో యంత

వఱకు పృష్ఠపార్శ్వములందున్న వారికి సూర్యోదయమని చెప్పఁబడుచున్నది. క్రమాక్రమును బొందినట్లగపడు వారి కదియే అస్తమయమని చెప్పఁబడును. సర్వదిక్కుల వారికిని మేరుపర్వతముత్తరమందును లోకాలోక పర్వతము దక్షిణమున నుండును. భూరేఖతో నావరింపఁబడిన సూర్యుని దూరభావము ననుసరించి సూర్యరశ్మిల హ్రాసమున సూర్యుఁడు కనఁబడని వారికది రాత్రియగును. భూచ్ఛాయయే రాత్రికిఁగూడ కారణము. గ్రహనక్షత్ర తారల దర్శనము, భాస్కరోచ్ఛాయ ప్రమాణము, అస్తమయోదయములు. అగ్ని అప్పులు శుక్లచ్ఛాయ యనియుఁ, బృథివి కృష్ణచ్ఛాయయనియుఁ దెలియవలెను. ఉదయించుచున్న సూర్యునికి దూరభావమున విరశ్మితయు, (పోయినరశ్ములు) విరశ్మితనుబట్టి రక్తభావమును, రక్తత్వమునుబట్టి అనుష్ణతయుఁగలుగుచున్నది. భూరేఖలో సూర్యుఁడూర్ధ్వ దిగ్గతుఁడై యోజన సహస్రదూరము చూడఁబడుచుండును. పార్శ్వగతితో (భూరేఖ) సూర్యుఁడస్తమయమును బొందినవాఁడగుచుండగా, రాత్రియందు సూర్యకాంతి అగ్నియందావేశించుచుండును. మరల ఉదయమును బొందినవాఁడగుచుండగా నాసూర్యునియందీయగ్ని తేజస్సావేశించుచుండును. ఈలాగున వహ్నియుక్తుఁడై సూర్యుఁడు పగటిభాగమందు ప్రకాశించుచుండును, ఇట్లు ప్రకాశమాత్ర తేజస్సు సూర్యతేజస్సనియును, దాహకగుణముగు తేజస్సు అగ్నియనియు, రాత్రింబగళ్లయందు పరస్పరానుప్రవేశమువలన జగత్తును తేజస్సు తృప్తిపరచుచున్నది భూమియొక్క ఉత్తరార్ధమందును, దక్షిణార్ధమందును, సూర్యుఁడుదయించుచు రాత్రులందు అప్పులను ప్రవేశించును. అందుచేత ఉదయాస్తమయములందు నాఅప్పులు, తామ్రవర్ణములుగలవియై కనఁబడుచుండును. సూర్యుఁడస్తమయమును బొందినవాడగుచుండగా దినభాగము అప్పులందుఁ బ్రవేశించినదగును. అందువలన రాత్రిభాగము అహార్భాగముతో మిశ్రమమైనందుచేత అప్పులు శుక్లవర్ణముగ నగపడును. ఈక్రమయోగముచే భూమ్యర్ధభాగములగు, దక్షిణోత్తరధ్రువములు. సూర్యుని ఉదయాస్తమయములయందు, అప్పులయందుండును అనగా భూభాగార్ధము నొకభాగము అస్తమయందును నొకభాగార్ధము సూర్యుని దిశయందును మఱలనీభాగము అప్పులయందున అప్పులయందుండినభాగము సూర్యదిశయందు నీలాగున విపర్యాసముతో రెండుభాగములగు నహోరాత్రములు అప్పులందు ప్రవేశించు చుండును.

"వేదప్రమాణము: సంహితసోమయాగము - ఆరవకాండ - నాలుగవపన్నము రెండవఅనువాకములోచివర" వరుణేనాస్య యజ్ఞం గ్రాహయేద్యద్వైదివాభవత్య

హోరాత్రిః ప్రవిశతి తస్మాత్తామ్రా ఆపోదివా దదృశ్రే యన్నక్తం భవత్యపోఽహః ప్రవిశతి తస్మాచ్చన్ద్రా ఆపోనక్తం దదృశ్రే ఛాయాయై చాతపతశ్చ స్వస్థాగృహ్ణాత్య హోరాత్రయో రేవాస్మై వర్ణం గృహ్ణాతి హవిష్మతీరిమా అపఇత్యాహ హవిష్కృతానామేవ గృహ్ణాతి హవిష్మాగ్ం అస్తు ॥ ౯ ॥ సూర్యఇత్యాహ సశుక్రాణామేవ గృహ్ణాత్యనుష్టుభా గృహ్ణాతి॥

అందువలన సూర్యప్రకాశమే దినమనియు, నాసూర్యుని దర్శనము లేకపోవుటే రాత్రియనియుఁ జెప్పఁబడును.



## ఉదయాస్తమయ సూర్యబింబావలోకన నిషేధకారణము.

ఉదయాస్తమయములందు రౌద్రరూపముతో సూర్యుఁడుండును. కారణమే మన సూర్యోదయాస్తమయములందు మందేహాసురాక్షసులడ్డగించుటచేత వారలను ప్రతిఘటించి ఉదయించుటకై మహాక్రోధముతో ఉగ్రరూపుఁడైయుండును తేజస్సున కంధకారము సర్వదావిరుద్ధము, తేజోంధకారములే సూర్యమందేహారుణులు పై రెండువేళలలో నొకటి ప్రళయోదయకాలము, మరొకటి ప్రళయ (అస్తమయ) కాలము. అందుచేత నీరెండువేళల రౌద్రరూపముతో సూర్యుఁడుండును. అట్టితరి సూర్యబింబదర్శనము బాధలకుఁ గారణమగును. కాన దాని నిషేధించిరి. ఇట్టిసమయములందు గ్రశాంతి నివృత్తికిని సుముఖతకును బ్రవృత్తికిని (సంధ్యాకాలమున) ధ్యానోపాసనాది యోగాదులకు ముఖ్యపర్వకాలసంధులని తెలిపి మనమహర్షులు పరమోపకారమును జేసిరి. దీనిననుసరించినవే గ్రహణాదులు. మరియు నీవేళలుకూడ శివతాండవసమయము. శివుఁడే ప్రళయరుద్రమూర్తి ఈ సమయమునఁ బ్రకించక ప్రవృత్తి నిషేధ ధర్మముల నాచరింపఁ బ్రమాదములు కలుగును. కాన నివృత్తిధర్మములగు ధ్యానోపాసనాది యోగాదులచే ధన్యులుకావలయును లేకున్న నారుద్రునికిఁ గోపముగలుగునని కొన్నిపురాణములందుఁగలదు.

ఎటులనైన నీరెండుకాలములు ప్రాణులకు ముఖ్యోపాసనాది యోగకాలములని తెలియవలయు. అందుచేతనే సూర్యుఁడీరెండు కాలములందును రౌద్రరూపమగు అగ్నిరూపుఁడుగ మనకగపడుచుండును. ఇదిచూచుటకుగూడ మిక్కిలి భయంకరాకారాగ్నివలె నిజముగఁ దోచుచుండును దీని ననుసరించినవే సంధ్యావందనాదులు లోకములో సమస్త జీవరాసులు జన్మాస్తమయ కాలములందుఁ బ్రమాదములకు లోనై భయకంపాదులతో నేమియునుదోచక నీకాలముగడుపును ఆసమయములందు సర్వులుచూచి సహించఁజాలక తద్బాధానివృత్తికై శ్రీభగవద్ధ్యానమునే చేయుచుండుట మననిత్యానుభవము. అల్పజీవరాసులకే యిటులుండగ జగదాత్మగా జగజ్జనకుఁడుగా సర్వసృష్టికిఁ గారణభూతుఁడుగా అనంతానంతాంశములతో నుండు నీమహాతేజోమూర్తి యుదయాస్తమయకాలములలో మన మామహోగ్ర తేజస్సును జూచుటకంటె ధ్యానోపాసనాది యోగాదులఁజేయుటే పరమధర్మము గాని బింబమునుజూఁచుట ప్రమాదము. కేవల ప్రకృతి ప్రత్యక్షప్రమాణ ధర్మములు నిరంతర ప్రమాదములకే కారణము.

పృథివీభూతమునకు అపోభూతమునకుఁగల ఉభయసంధ్యయే సంధ్యాపర్వము. ఈరెండుసంధ్యలుగూడ ఉగ్రప్రమాదకరములు. జలభూతములో (రాత్రి) సూర్యుఁడగపడఁడు సూర్యునికిబదులుగాఁ దత్స్వరూపముగా లోకశాంతికొరకు నీప్రళయకాలరాత్రియందుఁ జంద్రుఁడు శాంతిరూపముతో మనకగపడుచున్నాఁడు. మరల పగటికాలమందుఁ దేజోభూతములో సూర్యుఁడుగానే యుండును. ఈ రెండుభూతములే దితియు అదితియు. తత్పుత్రులే దైతేయాదితేయులు. ఇదికేవల తమోప్రకృతి ప్రపంచయుగధర్మము. లోకములో జన్మకాలసమయమందును అస్తమయమగు ప్రాణోత్క్రాంతి సమయమందునఁ జూచి సహించలేరు. అది మహాభయకంపాదుల సమయమైనందుచేత నెట్టివారుగాని భగవంతునిఁ దలంతురేగాని ధైర్యముతోఁజూడఁజాలరు. సూర్యుఁడు రాత్రిప్రళయములోనుండి విరోధించి వచ్చుసమయములో మహోగ్రరూపముతోనున్నఁగాని తమస్సువిడువఁజాలదు. ప్రళయమందుఁ బ్రవేశించునప్పుడుగూడ ఉగ్రరూపమునేబొందును. లోకములో కోపతాప సమయములందు నెవరుకాని అట్టివారికెదుటనిలచి చూడఁజాలరు. శ్రీలక్ష్మీనృసింహావతారమునందు దేవతలు స్వామిని శాంతింపజేయఁజాలని వారలై భయకంపితులై సంధిమాత్రుఁడు, సంధ్యారూపుఁడు మహాప్రశాంతుఁడు ఉభయాతీతానందరూపుఁడునగు ప్రహ్లాదునిఁబంపి శాంతింపఁజేసిరి ఇతఁడు రాక్షసులకును దేవతలకు

నుభయసంధియైన సంధ్యామూర్తి. ఆహ్లాదకరుఁడు. మహాపరమభాగవతోత్తముఁడు. అందుచేత వృథాగా సూర్యబింబమునుజూచి ఉగ్రప్రమాదమునుబొందక ధ్యానోపాసనాది యోగాదులతో ఉపాసకుఁడై లోకకల్యాణ మొనరించుట వేదవిధి ఉత్తమ ధర్మమార్గము.

విశ్వరూపమును అర్జునునికి దివ్యదృష్టినిఁ గలుగజేసినను జూడఁజాలక భయకంపితుఁడయ్యెను. అట్టిచో సామాన్యమానవ చర్మ చక్షువులతో నెవఁడారుద్రమూర్తియగు సూర్యునిఁజూచి ఉగ్రప్రమాదముల ననుభవించఁ గలఁడు అసమయమందు విశ్వరూపునే తలంచి ధ్యానాదులతో నుండుటే పరమోత్తమధర్మము, వేదవిహితము. మందేహాది రాక్షసులనగా అంధకారామయాకారులు. అంధకారమునకును దేజస్సునకును సర్వదా పరస్పరవిరుద్ధము. అదియే యుద్ధముగా భావింపవలెను. ప్రకృతిలో నొకదానికొకటి భిన్నము విరుద్ధము ప్రమాదము. సంధి పర్వసంజ్ఞ. అందుచే గాయత్రీజపమును అంగుళీపర్వగణనవిధానముఁ జేయుట ముఖ్యముగ విధింపఁబడినది.



## నక్షత్రధ్రువసూర్యుని త్రింశాంశగతి విశేషము.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౦

ఏవంపుష్కరమధ్యేన యదాసర్పతి భాస్కరః। త్రింశాంశకంతు మేదిన్యా
ముహూర్తేనైవగచ్ఛతి। ౧౯ ॥ యోజనాగ్రాన్ముహూర్తస్య ఇమాం సంఖ్యాం
నిబోధత। పూర్ణం శత సహస్రాణా మేకత్రింశత్తుసాస్మృతాః।౨౦ ॥ పంచాశత్తు
తథాన్యాని సహస్రాణ్యధికానితు। మౌహూర్తికీ గతిర్హ్యేషా సూర్యస్యతు విధీయ
తే। ౨౧ ॥ ఏతేన గతియోగేన యదాకాష్ఠాంతు దక్షిణాం। పర్యాగచ్ఛేత్తదాది
త్యో మాఘేకాష్ఠాంతమేవహి। ౨౨ ॥ సర్పతే దక్షిణాయాంతు కాష్ఠాయాంత
న్నిబోధత। నవకోట్యః ప్రసంఖ్యాతా యోజనైః పరిమండలం॥ ౨౩ ॥ తథాశత
సహస్రాణి చత్వారింశచ్చ పంచచ। అహోరాత్రాత్పతంగస్య గతిరేషా విధీయ
తే। ౨౪ ॥ దక్షిణాద్వినివృత్తోఽసౌ విషువస్థో యదారవిః। క్షీరోదస్య సముద్ర
స్య ఉత్తరాంతా దశశ్చరః। ౨౫ ॥ మండలం విషువచ్చాపి యోజనైస్తన్ని
బోధత। తిస్రః కోట్యస్తు విస్తీర్ణా విషువచ్చాపి సాస్మృతా। ౨౬ ॥ తథాశతసహ




7. సూర్యుని, ఆరోహణావరోహణ ఉదయాస్తమయాది విషయాదులను తెలుపు చిత్రపటము.

## (7) సూర్యుని, ఆరోహణావరోహణ ఉదయాస్తమయాది విషయాదులను తెలుపు చిత్రపటము.

సూర్యునిచే దిశలను, ఆరోహణావరోహణములను దీవ్రమాంద్యసమగతులను, రాసులభేదములను, నయనములనుఁ వీనినిఁబట్టి యుదయాస్తమయ దిశలభేదములను, సూర్యసంచారగతి మార్గములను దెలియనగును. మధ్యలోనున్నదిభూమి. దీనిమధ్యలో చతురస్రముగనున్నది. యొకగృహము. ఆయింటిలోని గవాక్షముననుండి సూర్యప్రకాశముత్తర దక్షిణాయనములలోఁ గ్రమముగా ఆరోహణావరోహణములతో నింటిలోసి కుడ్యముపైఁబడుటనుబట్టి రాశిసంక్రాంతి ప్రవేశకాలములు నయనభేదములు దెలుసుకొనఁ గలుగుదుము. పశ్చిమములోనున్నది రాత్రికాలమగుటచేత నలుపుగానున్నది. దానినిఁబట్టి సూర్యాస్తమయ దిశలభేదములను దెలియఁగలము. తూర్పుదిశఁగలది పగటికాలము. అందుసూర్యోదయాది దిశలను దెలియఁగలము. చుక్కలుచుక్కలుగానున్న గీతలు సూర్యసంచార దిశామార్గములు. ఇవి తూర్పుననుండి బశ్చిమమునకుఁ బోవుమార్గములు.



స్రాణా మశీత్యేకాధికాపునః। శ్రవణేచోత్తరాం కాష్ఠాం చిత్రభానుర్యదాభవేత్॥ శాకద్వీపస్యషష్ఠస్య ఉత్తరాంతాం దిశశ్చరన్॥ ౧౨౭ ॥ ఉత్తరాయాంచ కాష్ఠాయాం ప్రమాణం మండలస్యచ। యోజనాగ్రాత్ప్రసంఖ్యాతా కోటిరేకా తుసాద్విజైః॥ ౧౨౮ ॥ అశీతిర్నియుతానీహ యోజనానాం తథైవచ। అష్టపంచా శతంచైవ యోజనాన్యాధికానితు॥ ౧౨౯ ॥ నాగవీథ్యుత్తరావీథీ అజవీథీ చ దక్షిణా। మూలంచ తథాషాఢో ద్వ్యజవీథ్యుదయాస్త్రయః। అభిజిత్పూర్వతః స్వాతిర్నాగవీథ్యుదయాస్త్రయః॥ ౧౩౦ ॥ కాష్ఠయోరంతరం యచ్చ తద్వక్ష్యేయోజనైఃపునః। ఏతచ్ఛత సహస్రాణా మేకత్రింశోత్తరం శతం॥ ౧౩౧ ॥ త్రయస్త్రింశాధికాశ్చాన్యే త్రయస్త్రింశచ్చ యోజనైః। కాష్ఠయోరంతరంహ్యేత ద్యోజనాగ్రాత్ప్రతిష్ఠితం॥ ౧౩౨ ॥ కాష్ఠయోర్లేఖ యోశ్చైవ అంతరే దక్షిణోత్తరే।

## —♦ నక్షత్రధృవసూర్యుని త్రింశాంశగతి విశేషము. ♦—

నక్షత్రచక్రమునకు ధృవునివలన గతికలుగుచున్నది. ధృవునియందుఁగల ఆగ్నేయతేజస్సు భూమియందు ప్రసరింపఁజేయుటచేత సూర్యుఁడు కూటగ్రహనక్షత్రమని వర్ణించుచు నరుణమంత్రప్రపాఠకమున నూటయిరవై తొమ్మిదిపనసలున్నవి. ద్వాదశరాశి చక్రముయొక్క విషువదయనాంత సంపాతగతిని భూమియందుండి చూచువారల భౌమదృష్టికి (త్రింశాంశకాంతివి మాత్రమే భాగించగా పుష్కరమధ్యమునకు మూలాధార సర్పరూపుఁడై వచ్చుచున్నట్లగపడుచుండును. దక్షిణోత్తర ధృవములయొక్క సమానాంతరాళములో నారాశి విషువదయన గతిభేదముచేఁ దిరుగుచున్నది భూమియేగాని ధృవసూర్యుఁడు గానేరఁడు. అట్టిభౌమనక్షత్రగతియే గ్రహమను పేరుతో సూర్యునియందారోపింపఁబడినట్లు చెప్పఁబడుచున్నది. ఈవిధముగా నీచక్రగతిని అవగాహనముచేసుకొనవలెను. ఇటులాసూర్యుఁడు పుష్కర మధ్యవీధిగతితో సర్వదా ప్రతిరాశియొక్క మధ్యకేంద్రమునకు వచ్చి తానే మూలాధార సర్పిణివలెఁ గనపడును. ఇడాపింగళలోని సుషుమ్నా నాడీచక్రమే త్రినాభిచక్రమని చెప్పఁబడునట్లుగ అనుభవములో ప్రత్యక్షముగఁ దెలియఁబడుగతియే భౌమసూర్యుని ముహూర్తగతిరూపముగ లెక్కించఁబడును. అట్టిముహూర్తములు పదునైదుపగటిభాగము సూర్యగతి. మందుఁడని చెప్పఁబడుచున్న శనిగ్రహమే చంద్రరాశియగు కటకముమొదలుగ సమసప్తకస్థానమగు మకరరాశివరకుఁగల రాశిషట్కములో ఉచ్చయగు తులా రాశితో ప్రకాశించి వక్రాదిగతివిశేషములతో నుండుటచే

సూర్య సంవత్సర చక్రములో నది యతనికి రాత్రికాలమగును. అట్టిరాత్రికాలములో సూర్యునకు బగటిభాగముగ ఉత్తరాయణగతి మాంద్యము బొందును. ఈ శనైశ్చరుడు నిజరాసులగు మకరాది మిథునాంత రాసులవరకు, మేషరాశిలో నీచుఁడై నిశాకరుఁడనికూడ చెప్పఁబడును. అహోరాత్రములలోఁ బగటి పదునైదు ముహూర్తములను దివాకరుఁడను పేరునను రాత్రిముహూర్తములను నిశాకరుడను పేరునను, అనుభవించుచున్నట్లు ప్రభవాది క్షయసంవత్సరాంతములు గణింపఁబడుచుండును.

ఈషష్టిసంవత్సరముల క్రాంతిచక్రమందుఁగూడ ముప్పదిసంవత్సరములు సూర్యభాగము. తక్కినముప్పదిసంవత్సరములభాగము శనిభాగము. భరణీనక్షత్రమునకు అధిదేవతయగుచు వివస్వత పుత్రుఁడగుటచే శనియోగులకు మన్వంతరాధిపతియుఁ దదితరులకు వారికర్మఫలవశానుసారముగ బక్షపాతములేక ఈశ్వరాజ్ఞ ప్రకారము ఫలమునిచ్చుటకై తననక్షత్రమగు భరణికి "అపభరణి"యనియు యముఁడనియు నామరూపములనుగూడ మార్చుకొన్నాఁడు. భూచ్ఛాయాది ఛాయాగ్రహ సహకారముతో నిశాకరుఁడుగ బ్రతికల్పితుఁడై గ్రహనక్షత్రరాశ్యంత త్రినాభిచక్రమంతయు దనతండ్రియగు సూర్యునివలె భూమికి అతిదూరములోనుంకినను గ్రహశ్రేష్ఠమును జేరి పూజింపఁబడుచున్నాఁడు. అందుచేత షష్టిసంవత్సరాంత క్రాంతిచక్రములో అరువదిరోజులు పరిమితిగల క్రాంతిఋతుచక్రములో ముప్పదిరోజులు గల ఋతుసంఖ్యార్ధముతో మాసముగను, నీమాసములో మరల ముప్పదివగళ్ళుగను ముప్పదిరాత్రులుగను తదర్ధముగాను, శుక్లకృష్ణపక్షభేదములాయెను. దీనిననుసరించి భౌమచంద్రునిగతితోఁగూడ మాసముపూర్తియగుచున్నది కనుక భూమియొక్క ముప్పదంశల దూరము పాశ్చాత్యగణిత శాస్త్రప్రకారముగ ముప్పది డిగ్రీలని చెప్పబడుచున్నది. డిగ్రీయనగా రమారమి డెబ్బదిమైళ్ళదూర మగుచున్నది. దీనినే ముప్పదితో గుణించగా రెండువేలు ఒకవందయు. దీనిని మరల దశాంశ, ద్వాదశాంశలచే గుణించినచో భూమియొక్క పుచ్ఛాత్మ (సంపూర్ణగతి)కూడ వచ్చునని వేదమందు మహావ్రతప్రకరణములో "పంచవిగ్ంశ ఆత్మాభవతి। ఏకలిగ్శం పుచ్ఛం।" అనియున్నది.

పాశుపతక్రాంతిగల భౌమసూర్యగతినిఁ జెప్పుటయేకాక యీభూమి ముప్పది యోజనముల క్రాంతిపరిమితిగల క్రాంతియోజనముల ప్రదేశమందు మాత్రమే వేదోక్త యజ్ఞయాగాది కర్మలకు వేదరూపముగా బవిత్రప్రదేశ మగుటచే "ఇంద్ర

యోని"యను పేరుతో మరొక శ్రుతిచే స్తుతింపబడుచున్నది. "త్రిగ్ంశదస్యాజఘునం యోజనాని। ఉపస్థఇన్ద్రిగ్ స్థవిరంభిభర్తి। సేనాహనామ పృథివీధనంజయా। విశ్వవ్యచా అదితిస్సూర్యత్వక్। ఇంద్రాణీదేవీ ప్రాసహాదదానా।" ఇట్టిపృథివియొక్క నూ ప్పది అంశలదూరము ఒకముహూర్తకాలములో నడచుచున్నట్లు గణితశాస్త్రి దృక్కుచేఁగనబడును. ఈగతిభూమియొక్క గతియేగాని ధ్రువసూర్యునిగతిగాదు.

ఒక క్రాంతి ముహూర్తముయొక్క యోజనాగ్రమును లెక్కకట్టుకొని ఆలెక్కవలన నీసంఖ్యను దెలియవలెను. ఇందులో భౌమగతి నూరువేలయోజనములపైన ముప్పదియొక యోజనములగతి సంఖ్యయని తెలియవలెను. ఇట్టిభౌమగతినిఁబట్టి భూసూర్యుఁడని చెప్పఁబడుచున్న గ్రహసూర్యునిగతి కొంచెమధికముగ నేబదివేల యోజనములనియు, ఇదిగ్రహసూర్యునికి ముహూర్తగతి కాలమనియు వేదముచే విధింపఁబడుచున్నది.

ఇట్టిగతియోగముతో గ్రహసూర్యుఁ డెంతకాలములోఁ గటకరాశ్యాదిగా దక్షిణాయన దిగ్గతికలిగి కటకరాశివరకుఁ దిరిగి పోవుచున్నట్లగుబడునో తదాదిగ మాఘమాసమునం దుత్తరాయణగతిలో రెండుముహూర్తములు విషువద్గతితోఁ దిరిగి స్వస్థానముజేరును. ఈ భేదమునీయ ఉత్తరాయణమందుఁ దక్కువగను, కటకాది దక్షిణాయనమం దెక్కువగ నుండును. గతిఉత్తరాయణమం దెక్కువగను, దక్షిణాయనమందుఁ దక్కువగనుండును. దీనికారణము ఆరోహణ అవరోహణ మార్గమే.

దక్షిణదిగ్గతిగల మండలముల పరిమాణము తొమ్మిదికోటుల యోజనములు. ఒక అహోరాత్రమునకు నలుబదియెనిమిదివందలవేల యోజనములగతి యనియు, నీగతిమనచర్మచక్షుస్సునకే కనబడుచున్న కాశ్యపసూర్యునిగతిగాక నేడు గురుసూర్యులకు తండ్రియగు కశ్యపునకు నీభౌమనక్షత్ర ధ్రువసూర్యునకు మధ్యకేంద్రమగు మహర్లోకమందుఁగల పతంగుఁడనుపేరుగలసూర్యుని గతిపరిమాణమేయనియు వేదముచే విధింపఁబడినది. క్షీరసముద్రముయొక్క ఉత్తరాంతదిక్కునుండి తిరిగి దక్షిణ విషువస్థానము నకు రవిగ్రహమువచ్చుదూరము మూడుకోట్ల విస్తీర్ణమని చెప్పఁబడుచున్నది. ఈప్రకారము శ్రవణమందనగా మకరరాయనమం దుత్తర దిక్కును సూర్యుఁడెపుడు పొందునో యప్పటి కొక్కలక్షయెనుబదియొక భాగములనుబొందును. అప్పటికి శాకద్వీపముయొక్క ఉత్తరదిగంతగతియు పూర్తియగును. ఈఉత్తరదిగ్గతసూర్యమండలముయొక్క పరిమాణమును లెక్కించుటలో దాశ్యనకు

లగు ద్విజులచే మతభేదమును ననుసరించి కొందరు యోజనాగ్రము మొదలు ఒక్కకోటి యని జెప్పుచున్నారు. మఱికొందరు ఎనుబదివేలయోజనముల పరిమాణమనియు, కొందరు కొంచమధికముగ ఏబదియెనిమిదివందల యోజనపరిమాణమనియు ననేకవిధములుగ తమగణితశాస్త్రజ్ఞత్వాహంభావముతోఁ జెప్పుచున్నారు. ఇదంతయు భూమియందుండిచూచుచున్న విషయిక చర్మచక్షుస్సంబంధ మగుటచేత బాహ్యగణిత ఫలములన్నియు సత్యములుగావని తెలియవలెను.

ఈలాగునఁ దొమ్మిదేసి నక్షత్రములతో నొకవీథిప్రమాణముగల నక్షత్రనాభి చక్రమందుఁగూడ, మధ్యలోనున్న ఐరావతవీథికి నిరుపార్శ్వములందు (దక్షిణోత్తరములందు) అజ నాగవీథులున్నవి. వీటిలో మూలనక్షత్రము మొదలు ఉత్తరాషాఢవరకుగల నక్షత్రదయములు అజవీథియనియు, దీనితరువాత, అభిజితు మొదలు స్వాతినక్షత్రమువరకుగల నక్షత్రములు ముందు దక్షిణోత్తర వీథిదిగంతరమును యోజనములతోఁ జెప్పుచున్నారు.

ఇది నూరువేలయోజనములపై ముప్పదియొకవందల యోజనముల లంబ పరిమాణము. మరికొందరు యోజనాగ్రప్రతిష్ఠితమైన దిగంతరాళమునే ముప్పది మూడువందలనియు, వేలనియు, ముప్పదిమూడు మాత్రమేయనియు మతభేదములుగ జెప్పుచున్నారు.

—o—

## ధ్రువసౌరాది నక్షత్ర ధ్రువాంతమండల క్రాంతివిశేషము.

శ్రీవాయుపురాణం - అధ్యాయం ౫౦

కాష్ఠయోర్లేఖయోశ్చైవ అంతరే దక్షిణోత్తరే। తేతువక్ష్యామి సంఖ్యాయ యోజనైస్తన్నిబోధత ॥ ౧౩౩ ॥ ఏకైకమంతరం తస్యా నియుతాన్యేక సప్తతిః। సహస్రాణ్యతిరిక్తాశ్చ తతోఽన్యాపంచ సప్తతిః॥ ౧౩౪ ॥ లేఖయోః కాష్ఠయో శ్చైవ బాహ్యాభ్యంతరయోః స్మృతం। అభ్యంతరంతు పర్యేతి మండలా న్యుత్తరాయణే॥ ౧౩౫ ॥ బాహ్యతో దక్షిణేచైవ సతతంతు యథాక్రమం। మండలానాం శతంపూర్ణమశీత్యధిక ముత్తరం॥ ౧౩౬ ॥ చరతే దక్షిణేచాపి తావదేవ విభావసుః। ప్రమాణం మండల స్యాథ యోజనాగ్రన్నిబోధత॥ ౧౩౭ ॥ ఏకవింశద్యోజనానాం సహస్రాణి సమాసతః। శతేద్వే పునరప్యన్యే యోజనానాం ప్రకీర్తితే॥ ౧౩౮ ॥

ఏకవింశతిభిశ్చైవ యోజనైరధికైర్వృతే। ఏతత్ప్రమాణమాఖ్యాతం యోజనైర్మండలం హితతత్ ॥౧౩౯॥ విష్కంభో మండలస్యైష తిర్యక్ స తు విధీయతే। ప్రత్యహం చరతే తాని సూర్యో వై మండలక్రమం ॥౧౪౦॥ కులాలచక్రపర్యంతో యథా శీఘ్రం నివర్తతే। దక్షిణే ప్రక్రమే సూర్యస్తథా శీఘ్రం నివర్తతే ॥౧౪౧॥ తస్మాత్ప్రకృష్టాం భూమిం చ కాలేనాల్పేన గచ్ఛతి। సూర్యో ద్వాదశభిః శీఘ్రం ముహూర్తైర్దక్షిణోత్తరే ॥౧౪౨॥ త్రయోదశార్ధమృక్షాణామహ్నను చరతే రవిః। ముహూర్తైస్తావదృక్షాణి నక్తమష్టాదశైశ్చరన్ ॥౧౪౩॥ కులాలచక్రమధ్యస్తు యథా మందం ప్రసర్పతి। తథోదగయనే సూర్యః సర్పతే మందవిక్రమః ॥౧౪౪॥ త్రయోదశార్ధమర్ధేన ఋక్షాణాం చరతే రవిః। తస్మాద్దీర్ఘేణ కాలేన భూమిమల్పాం నిగచ్ఛతి ॥౧౪౫॥ అష్టాదశ ముహూర్తైస్తు ఉత్తరాయణపశ్చిమం। అహర్భవతి తచ్చాపి చరతే మందవిక్రమః ॥౧౪౬॥ త్రయోదశార్ధమర్ధేన ఋక్షాణాం చరతే రవిః। ముహూర్తైస్తావదృక్షాణి నక్తమష్టాదశైశ్చరన్ ॥౧౪౭॥ తతో మందతరం తాభ్యాం చక్రం భ్రమతి వై యథా। మృత్పిండ ఇవ మధ్యస్థో ధ్రువో భ్రమతి వై యథా ॥౧౪౮॥ త్రింశన్ముహూర్తానేవాహు రహోరాత్రం ధ్రువో భ్రమన్। ఉభయోః కాష్ఠయోర్మధ్యే భ్రమతో మండలాని సః ॥౧౪౯॥ కులాలచక్రనాభిస్తు యథా తత్రైవ వర్తతే। ధ్రువస్తథా హి విజ్ఞేయస్తత్రైవ పరివర్తతే ॥౧౫౦॥ ఉభయోః కాష్ఠయోర్మధ్యే భ్రమతో మండలాని తు। దివా నక్తం చ సూర్యస్య మందా శీఘ్రా చ వై గతిః ॥౧౫౧॥ ఉత్తరే ప్రక్రమే త్విందోర్దివా మందగతిః స్మృతా। తథైవ చ పునర్నక్తం శీఘ్రా సూర్యస్య వై గతిః ॥౧౫౨॥ దక్షిణే ప్రక్రమే చైవ దివా శీఘ్రం విధీయతే। గతిః సూర్యస్య నక్తం వై మందా చాపి తథా స్మృతా ॥౧౫౩॥ ఏవం గతివిశేషేణ విభజన్ రాత్ర్యహాని తు। తథా విచరతే మార్గం సమేన విషమేణ చ ॥౧౫౪॥ లోకాలోకే స్థితా యే తే లోకపాలాశ్చతుర్దిశం। అగస్త్యశ్చరతే తేషాముపరిష్టాజ్జవేన తు। భజన్నసావహోరాత్రమేవం గతివిశేషణైః ॥౧౫౫॥ దక్షిణే నాగవీథ్యాయాం లోకాలోకస్య చోత్తరం। లోకసంతారకో హ్యేష వైశ్వానరపథాద్బహిః ॥౧౫౬॥ పృష్ఠే యావత్తు ప్రభాసారీ పురస్తాత్ సంప్రకాశతే। పార్శ్వయోః పృష్ఠతస్తావల్లోకాలోకస్య సర్వతః ॥౧౫౭॥ యోజనానాం సహస్రాణి దశోర్ధ్వం తూచ్ఛ్రితో గిరిః। ప్రకాశశ్చాప్రకాశశ్చ సర్వతః పరిమండలః ॥౧౫౮॥ నక్షత్రచంద్రసూర్యాశ్చ గ్రహాస్తారాగణైః సహ। అభ్యంతరం ప్రకాశం తే లోకాలోకస్య వై గిరేః ॥౧౫౯॥ ఏతావానేవ లోకస్తు నిరాలోకస్తతః పరం। లోకాలోక

ఏకధాతు నిరాలోకస్స్వనేకధా॥ ౧౬౦॥ లోకాలోకఁతు సంధత్తే యస్మాత్ సూర్య్యః పరిగ్రహం। తస్మాత్సంధ్యేతి తామాహురుషావ్యుష్ట్యోర్యదంతరం। ఉషారాత్రిఃస్మృతా విప్రైర్వ్యుష్టిశ్చాపి త్వహః స్మృతం॥ ౧౬౧॥ సూర్యంహిగ్రసమానానాం సంధ్యాకాలేహి రక్షసాం। ప్రజాపతినియోగేన శాపస్తేషాం దురాత్మనాం। అక్షయత్వంచ దేహస్య ప్రాపితా మరణంతథా॥ ౧౬౨॥

ధ్రువ, సూర్యమండలాది నక్షత్రపర్యంతరము, దినము, ఋతువు, అయనము మొదలు మాసాంతక్రాంతిగల మానభేదములకుఁ గారణభూతమగు దిక్కు దృగ్ గ్రాహ్య గణిత విశేషములను శ్లో॥ ౧33 మొదలు ౧౬౨ శ్లోకములవరకు జెప్పుచున్నాడు.

దిక్కులయొక్కయు, తూర్పు, పశ్చిమ, దక్షిణోత్తర నిడివిరేఖల అంతరసామ్యవైషమ్యములకు, మూలాధారములగు మండలచక్రగతిని తెలియుటకొరకై యోజనసంఖ్యలతో సంఖ్యాకాలమానముగ రెంటినిఁజేర్చి జెప్పఁబడుచున్నది.

దీర్ఘవిషువద్వృత్తాకృతిగల దక్షిణోత్తర దిగంతరము డెబ్బదియొక్కలక్ష సంఖ్యయు (నియుతం) మిగత సౌర, సావన, దిగంతరము మొదలు నక్షత్రసావనము వరకుగల నాయాసావనమాన దిగంతరము డెబ్బదియొక్కవేలసంఖ్యయనియు, దెలియవలెను. అన్నిటికినిఁ గ్రిందుగాగల నక్షత్ర, సావన దిగంతరము డెబ్బదియైదు యోజనమాత్రసంఖ్యయని స్మృతులచేఁ జెప్పఁబడుచున్నది. ఇట్లుజెప్పిన, దిగ్రేఖాంతరాళసంఖ్యలో దక్షిణోత్తర దిగంతరాళమండలగతి, అయనాంతిగతిమాత్రమే యగును. దిగంతరాళసంఖ్య తక్కువపరిమితియనియు, క్రాంతిగతి సంవత్సరాంత కిరణవ్యాప్తిగల దగుటచేత లోకాలోకావధిగా నధికపరిమాణము గలదనియుఁజెప్పబడుచున్నది. సూర్యుఁడుత్తరాయణమును బొందినప్పుడు మధ్యాహ్నము (అనగ భూమికి భూమధ్యమువలెనున్న లంకాగ్రహోదయస్థానము) మనభారతకర్మభూమికి ధనుష్కోటినిగాని, కన్యాకుమారీఅగ్రమునుగాని, మొదలుచేసికొని కొలతవేశినచో నూరుయోజనముల దూరముండుటచే మనకర్మభూమికి మిక్కిలిదగ్గిరగును, గనుకనే ఉత్తరాయణములో యజ్ఞయాగాద్యభ్యుదయిక జన్మవృద్ధి కామ్యకర్మలును, ముముక్షువులకు నిష్కామకర్మయోగాదులను జేయఁబడుచున్నవి. ఉత్తరాయణమున భూమికినమీపించి అంతరాళమండలములందే తిరుగుచు సూర్యుఁడు తపించుచున్నట్లు మనదృష్టికిఁగూడ ప్రత్యక్షమగుచుండును ఇటులనే దక్షిణాయనమందు శీతమధిక

ముచే భూమికి వెలుపలగ దూరస్థుడగుచున్నట్లగపడుచు సర్వదా నూటయెనుబదొక్క యోజనములుగల మండలగతితో తిరుగుచుండును. ఇటులనే దక్షిణగతితో వాస్తవమగు మండలపరిమితి యోజనాగ్రమును, మొదలును దెలియవలెను. ఈ లాగున భారతభూమియందు పావన సూర్యధ్రువమండల పరిణామమువలెనే మిగిలిన చాంద్రమాన ధ్రువుని, నక్షత్రధ్రువుని మండలపరిమాణము, సంక్షేపముగ ఒక్కొక్కటి యిరువదియొక్క వేల యోజనములుపైన రెండువందల యోజనములని జెప్పఁబడుచున్నది. ఈజెప్పఁబడిన యోజనమానము నాయాధ్రువస్థానములతోఁగల మండలయోజనములని తెలియవలెను. ఆ మూమండల స్థానములయొక్క తిర్యగ్విష్కంభమును( లేక మండలవ్యాసమని అర్థము) ఆమండల స్థానములను సూర్యుఁడు ప్రతి దినము తనమండలకాంతితో కిరణప్రసారముచే సంచరించుచుండును. దక్షిణోత్తరధ్రువములచే ఉత్తరమున్నతాక్షముగను, దక్షిణాక్షము నిమ్నముగా నగుటచే కుమ్మరివానిచక్రము నిమ్న భాగమునకెట్లు శీఘ్రముగా ప్రవృత్తిగాననగునో నటులనే సూర్యునిగతి దక్షిణాయనములో అవరోహణతో గతిశీఘ్రమునుగను నగపడుచుండును. అందుచేత స్వల్పకాలములో మిక్కిలిదూరమగు భూవలయమును దిరిగివచ్చునట్లగపడుచుండును. వాస్తవములో పండ్రెండు ముహూర్తములలోనే దక్షిణోత్తరగతిగల వాఁడగుచున్నాఁడు.

పదుమూఁడున్నరరోజులుగా కార్తిప్రవేశ కాలపరిమాణము నక్షత్రాహః పరిమాణముతో ఉత్తరాయణవిషురాశి పగటియందుఁ బురుషనక్షత్రమండలము మఘాది విశాఖాంత దేవనక్షత్ర సప్తకమేగాక శ్రవణోదయమగువరకుఁ (అనగ మకరాయనమువరకు)గల నక్షత్రమండలము లన్నియు, (మఘాది పదుమూఁడునక్షత్రములవరకని) స్త్రీనక్షత్రములైన మకరాదిగా, "శ్లో॥ పంచసంవత్సరమయం యుగాధ్యక్షం ప్రజాపతిం" అని వేదాంగ శిక్షలోజెప్పిన ప్రకారము యుగాయనకాలమందు పంచఋతుపక్షమునే గ్రహించినపుడు, పూర్వముజెప్పిన ప్రాతస్సంగమాదికాల పంచకములనుగాని, లేక కర్మమాత్రాధికారమేగల పంచ ఉషస్సులనుగాని పూర్వ నక్షత్ర పరిమాణముతోఁగలిపి కూడినయెడల కొంచెమధికముగా పదునెనిమిది ముహూర్తములుగా నక్షత్రధ్రువమండలగతితో సరిపడును. అందుచేత దక్షిణాయనరాత్రియందు పదునెనిమిది ముహూర్తములుగ నక్షత్రమండలము సంచరించును లేక రాత్రియామములనెడి నామాంతరములుండుటచేత నక్తంచరులగు రాక్ష

సులభ్యముతో ఉత్తరాయణమే నక్తశబ్దముచే వాడుటచే, "శ్లో॥ యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ" యను గీతావాక్యప్రమాణానుసారముగ, ఉత్తరాయణగతియే నక్తశబ్దమగును. అందుచేత పదునెనిమిది ముహూర్తముల కాలము రాత్రియందు ధ్రువసూర్యునికి మండలగతియని ౧౪౩-వ శ్లోకార్థము.

దీనినే దక్షిణాయనమందు శనైశ్చరుని, సూర్యగతిగా ముందుశ్లోకమందు జెప్పుచున్నాఁడు. కుమ్మరిసారె మధ్యలోఁ దిరుగుచున్న చీమ మొదలగు జంతువులెట్లు మందగతితో తిరుగుచుండునో యటులనే ఉదగయనమును పొందిన నక్షత్ర ధ్రువుఁడగు శనియు మందగతిగలవాఁడే యగును.

పైనజెప్పబడిన పదుమూఁడు ముహూర్తములలోని సగముకాలములో ఊర్ధ్వోచ్చగల నక్షత్రమండలము తిరుగునటులనే అధోనీచగల భూమండలాల్పభాగమును అధికకాలముచే పదునెనిమిది ముహూర్తముల కాలములో దిరుగును. పదునెనిమిది ముహూర్తములలో నాఁ ఉత్తరాయణములోఁగూడ పశ్చిమముగా సూర్యోదయమగుచుండును. దానికిఁకూడ శనియే తిరుగుచుండును. సూర్యపుత్రుఁడగు శని పదునెనిమిదిముహూర్తముల కాలములో రాత్రినక్షత్రచక్రమును తిరిగివచ్చుకొలఁది, నక్షత్ర ధ్రువచక్రసూర్యుఁడు తనధ్రువముయొక్క శీఘ్రగతిని పొడిగించుకొని పైనజెప్పిన పదుమూఁడు ముహూర్తముల అర్ధకాలములోనే భూమిసమీపమునకువచ్చి శీఘ్రముగ తిరుగుచుండునట్లగపడుచుండును. శని పూర్వపుశీఘ్రమందోచ్చ నీచగతులకంటె మందగతిగలిగి చరించుచుండునటుల నంతకంతకు భౌమధ్రువమును సమీపించి కుమ్మరసారెయొక్క మధ్యకేంద్రమందుండు మృత్పిండమువలె అత్యంతమందగతితో అండమున గూఢచారివలె సూర్యుఁడు సంచరించుచుండును. ఇట్లహోరాత్రములయందు ధ్రువసూర్యుని, అహోరాత్రసమగతికాలమును త్రింశన్ముహూర్తాత్మకముగనె జెప్పుచున్నారు. ఈలాగునఁ దిరుగుచున్న ధ్రువుడును తూర్పు పశ్చిమ, దక్షిణోత్తర ధ్రువాయత (మండల) రేఖలను తప్పక తిరుగుచున్నాడు.

కుమ్మరిసారెయొక్క నాభి (అక్షము) యెట్లుధ్రువస్థానమును విడువక యచ్చటనే తిరుగుచుండునో, ధ్రువమునఁగూడ నటులనే దెలియవలెను. ఉభయదిగ్గత గ్రహరాశి నక్షత్రమండలముల తిరుగుచున్న ధ్రువసూర్యుని శీఘ్రమందోచ్చ, నీచగతి సామ్యవైషమ్యముల నిట్లుదెలియవలెను.

ఉత్తరాయణమందు చంద్రునికి మందగతి పగటియందును, శీఘ్రగతి రాత్రులందెటులనో, నటులనే సూర్యునికి అహోరాత్రగతి విపరీతమగును. ఈలాగున

సూర్యునికి దక్షిణాయనమందుఁ బగటిగతి శీఘ్రముగను, రాత్రిమందముగనుండును. ఇట్లు సమవిషమ గతివిశేషముతో నక్షత్రాది బ్రహ్మాండము వరకుఁగల నవమానములయందును అహోరాత్ర కల్పములను విభజించుచు, సూర్యుఁడే సంచరించుచున్నాఁడు. మనకంటికగపడుచున్న దివ్యధ్రువకిరణమే ఈవ్యావహారిక సూర్యుఁడనియు, ఆదివ్యధ్రువుఁడు మానచర్మచక్షుస్సునకు కానరాని సహస్రకిరణుడనియు, జెప్పఁబడినది. "నసందృశే తిష్ఠతి రూపమస్య నచక్షుషాపశ్యతి కశ్చనైనం" అని నారాయణోపనిషత్తులోఁగలదు.

లోకాలోకాచలమునకు లోనగు మానసోత్తర గిరిపైన నలుప్రక్కలందుఁగల పురములందుండిన లోకపాలురకుఁ బైమార్గములో దక్షిణాగస్త్య ధ్రువమందు సప్తర్షిమార్గములో నీసూర్యునికంటె వెయ్యిరెట్లధిక శీఘ్రగతితో అగస్త్యధ్రువుఁడు తిరుగుచున్నాఁడు. ఇతనిగతితో నీసూర్యుని మహాయుగ మొకఅహోరాత్ర పరిమితిగల దగును.

ఈఅగస్త్యుని స్థానమేదియనగా నాగవీధికి దక్షిణముననున్న లోకాలోకాచలమున కుత్తరమందు మధ్యలోనున్న ఐరావతవీధికి బహిర్భాగమునగల వైశ్వానర పథమునుకూడ దాటియుండునది.

సూర్యకిరణక్రాంతి సూర్యుఃపృష్ఠపార్శ్వ పురస్తాద్భాగములయందు సూర్యుని నలుదిక్కులందు లోకాలోకాచలమునుదాటక యెంతదూరము వ్యాపించుచున్నదో దీనికావల (యనగ లోకాలోకాచల పర్వతమునకావల) అగస్త్యునికాంతి కిరణము ప్రకాశించుచుండును. ఆలోకాలోక పర్వతము పదివేలయోజనముల యెత్తుగలిగి నలుదిశలందు సిద్ధులకు యోగులకు జ్ఞానులకుమాత్రమే కనబడుచుండును. ఇతరులకు మండలాకృతిగ తమస్సుతో పరివేష్టితమయి యుండును. కాబట్టి నక్షత్ర, చంద్ర, సూర్యాది గ్రహములు, తారాగణములతోసహా నీలోకాలోక పర్వతాంతరాళము లోనే ప్రకాశించుచున్నవి. ఇంతవరకే సాధులకు లోకమనియు, దీనిపైన నిరాలోకమనియుఁ జెప్పఁబడును. లోకాలోకముమాత్ర మేకాకృతిగలది. నిరాలోకమనేక ప్రకృతులతో అర్థానర్థముల రెంటినిదెలియని సాధకదృక్కునకు వికారమును గలిగించును. సూర్యుఁడాలోకాలోకమున ననుసంధించుట రాత్రింబగళ్ళంతకాళమగు సంధికాలమని జెప్పుచున్నారు. అట్టిసంధికాలమందు సూర్యుని మ్రింగుటకు ప్రయత్నించు మందేహాదిరాక్షసులు బ్రహ్మశాపముచే దేహమునకు మూర్ఛగలిగి ప్రాణములకు

మరణసంజ్ఞగా అధోదృష్టిగలిగి పతనమునొందుచున్నారు. అజ్ఞానులు తమస్సులోనే జననమరణప్రవాహమగు సంసారమును ఇహమును సత్యమని తలతురు. మందేహాది రాక్షసులన అజ్ఞానులనేఅర్థము. వారలు సంధ్యోపాసనాది సత్కర్మలను విడచి నిరంతరము దుష్కర్మలందే యాసక్తిగలవారలగుచున్నారని తాత్పర్యము.



## మం దే హా ది రా క్ష సు ల వి వ ర ము.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౦ - పుట ౭౪.

శ్లో॥ లోకాలోక ఏకధాతు ర్నిరాలోకస్త్వనేకధా॥ ౧౬౦॥ లోకాలోకం తు సంధత్తే యస్మాత్ సూర్యః పరిగ్రహం। తస్మాత్సంధ్యేతి తామాహు రుషావ్యుష్ట్యోర్య దంతరం। ఉషా రాత్రిః స్మృతా విప్రైర్వ్యుష్టిశ్చాపిత్యహః స్మృతం॥ ౧౬౧॥ సూర్యంహి గ్రసమానానాం సంధ్యాకాలే హిరక్షసాం। ప్రజాపతి నియోగేన శాపస్తేషాం దురాత్మనాం। అక్షయత్వంచ దేహస్యప్రాపితా మరణం యథా।౧౬౨॥ తిస్రః కోట్యస్తు విఖ్యాతాః మందేహా నామరాక్షసాః। ప్రార్థయంతి సహస్రాంశు ముదయంతి దినేదినే। తాపయంతో దురాత్మనః సూర్యమిచ్ఛంతి బాధితుం॥౧౬౩॥ అథ సూర్యస్యతేషాంచ యుద్ధమాసీత్ సుదారుణం। తతోబ్రహ్మాచ దేవాశ్చ బ్రాహ్మణాశ్చైవ సత్తమాః। సంధ్యేతి సముపాసంతః క్షేపయంతి మహాజలం॥ ౧౬౪ ఓంకార బ్రహ్మసంయుక్తం గాయత్ర్యాచాభి మంత్రితం। తేనదహ్యంతి తేదైత్యాః వజ్రభూతేనవారిణా॥ ౧౬౫॥ తతఃపునర్మహాతేజా మహాద్యుతి పరాక్రమః। యోజనానాం సహస్రాణి ఊర్ధ్వముత్తిష్ఠతేశతం॥ ౧౬౬॥ తతఃప్రయాతి భగవాన్ బ్రాహ్మణైః పరివారితః। వాలఖిల్యైశ్చమునిభిః కృతార్థైః సమరీచిభిః॥ ౧౬౭॥

ఇట్లే విష్ణుపురాణ ద్వితీయాంశం - అధ్యా. ౮౫ శ్లో॥ ౫౫ నుండి ౮ వరకు ప్రమాణములున్నవి.

మనలోకమున కవ్వలిభాగము నిరాలోకము లోకాలోక మొక్కటిగను నిరాలోకమనునది యనేకములుగను నుండును. లోకాలోకమును సూర్యుడు పొందును. నిరాలోకమును బొందడు. లోకాలోకమును బొందుటచేత

నాభాగము సంధ్యయనిచెప్పఁబడును. దానిని రాత్రింబగళ్ల మధ్యభాగముగ చెప్పు చున్నారు. ఉషయనఁ బ్రాతస్సంధ్య వ్యుష్టియనఁ బగలనియు బ్రాహ్మణులచే నామకరణము చేయఁబడినది. ఇట్టిసంధ్యాకాలమందు సూర్యునిమ్రింగబోవుచున్న మందేహులనురాక్షసులు బ్రహ్మదేవుని శాపముచే మరణముకలిగినను మరల అక్షయత్వముకూడ పొందియున్నారు. ఆమందేహాదిరాక్షసులు మూడుకోట్లసంఖ్య గలవారు. ప్రతిదినము నుదయించుచున్నసూర్యుని మ్రింగుసంకల్పముతో నెదుర్కొని యతనిని దహింపఁజేయుచుందురు. తర్వాత సూర్యునకు వారలతో దారుణమగు యుద్ధము సంభవించును. అందుచేత బ్రాహ్మణులు, దేవతలు, బ్రహ్మదేవుఁడు సత్పురుషులు సంధ్యోపాసనయను పేరుతో మహాజలమును ఓంకారగాయత్రీమంత్ర ముతో అభిమంత్రించి యాజలము నూర్ధ్వముఖముగ జల్లుదురు. ఆజలము వజ్ర యుధముగ పరిణమించి వారలఁగూల్చుచుండును. తర్వాత నాసూర్యుఁడు మహాతే జశ్శాలియై యనేక శతసహస్రయోజనములను ఊర్ధ్వముఖుడై ఆక్రమించుచుండును. "తాపతా ఆపోవజ్రీభూత్వా తాని రక్షాగ్ంసి మందేహారుణేద్వీపే ప్రక్షిపంతి యత్ప్ర దక్షిణం ప్రక్రమంతితేన పాప్మానమ వధూన్వన్ ఉద్యన్తమస్తం యంతమాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి యఏవం వేద" అని వేదప్రమాణము. తర్వాత బ్రాహ్మణులతోనున్న మరీచితోఁగలసి కృతార్థులైన వాలఖిల్యాది మునులతోను గలసి సూర్యుఁడు నడుచుచుండును.

మందేహాది రాక్షసులు సూక్ష్మశరీరులగుటచేత వారలకు మరణములేదు. వీరలు తమోరూపులు. ఆదిరాక్షసులు. వీరిపేరులనుబట్టి వీరున్నద్వీపముల కా పేరుగలిగెను. వీరలను మనమిచ్చు శాపోదకములు వజ్రాయుధములై మూర్ఛ పొందించును. అందుచేతసూర్యునికి మార్గమేర్పడును. వీరలు ప్రళయాంతము వఱకునుందురు. వీరు తేజస్సును బ్రకాశింపకుండ జేయువారలు.

మనదేహములో వీరలను మనస్సునకు సమన్వయించవలెను. మనస్సుఅరూ పము, జడము, తమోరూపము. వీరలసంఖ్యమూడుకోట్లని చెప్పుటచేత అనంత సంఖ్యయని భావన. మనస్సుయొక్క సంకల్పములు వికారములు అనంతసంఖ్యలుగా నున్నవి. ఇవికోట్లకొలదియుండి బుద్ధిని అడ్డగించి ప్రకాశింపజేయదు. ఆవిమనస్సుకు మరణములేక ఉన్నంతకాలము నిత్యమైశాశ్వతముగనుండును. దేహాదులే కల్పములు. సృష్టియున్నంతకాలము మనస్సుండును. దేహాదులనాశము ప్రళయబుద్ధియనగా

సూర్యుఁడు సంధ్యయనగా దీనికి సంబంధించినదేవు. అజ్ఞాననివృత్తికే సంధ్యోపాసన. ప్రకృతిధ్యానమే సంధ్య. అర్ఘ్యమే తేజస్సు, అస్త్రము, నివృత్త్యుపాయము.

—o—

## సూర్యమార్గమధ్య పర్వతశృంగములు.

శ్రీవాయు పురాణం - అధ్యా ౫౦

శ్వేతస్యోత్తరతశ్చైవ శృంగవాన్నామ పర్వతః। త్రీణితస్యతు శృంగాణి స్పృశంతీవ నభస్తలం॥ ౧౫౮ ॥ తైశ్చాపి శృంగవాన్నామ సర్వతశ్చైవ విశ్రుతః। ఏకమార్గశ్చ విస్తారో విష్కంభశ్చాపి కీర్తితః॥ ౧౫౦ ॥ తస్యవై సర్వతః శృంగం మధ్యమంతద్ధిరణ్మయం। దక్షిణం రాజతంచైవ శృంగంతు స్ఫాటికప్రభం॥ ౧౫౧ ॥ సర్వరత్నమయంచైకం శృంగముత్తరముత్తమం। ఏవంకూటైస్త్రిభిః శైలైః శృంగవానితి విశ్రుతః॥ ౧౫౨ ॥ యత్తద్విషువతం శృగం తదర్కః ప్రతిపద్యతే। శరద్వసంతయోర్మధ్యే మధ్యమాంగతిమాస్థితః॥ అహస్తుల్యామథోరాత్రిం కరోతి తిమిరాపహః॥ ౧౫౩ ॥ హరితాశ్చ హయాదివ్యాస్తేనియుక్తా మహారథే। అనులిప్తా ఇవాభాంతి పద్మరక్తైర్గభస్తిభిః॥ ౧౫౪ ॥ మేషాంతేచ తులాంతేచ భాస్కరోదయతః స్మృతాః। ముహూర్తా దశపంచైవ అహోరాత్రిశ్చ తావతీ॥ ౧౫౫ ॥

సూర్యమార్గమున నుత్తరమున శృంగవాన్ అను పర్వతమున్నది. దానికి మూడుశృంగములు నాకాశమును దగులుచున్నట్లున్నవి. దానిచేత శృంగవాన్ అనుపేరు సార్థకమైయున్నవి. ఇది సూర్యచంద్రులకు మార్గమనియు దీనివిస్తారమునకే విష్కంభమనియు ఇదివరకే చెప్పఁబడియున్నది. ఆశృంగపర్వతముయొక్క మధ్య శృంగముత్తరదిశ బంగారుకాంతితోఁ బ్రకాశించుచున్నది॥ దక్షిణశృంగము స్ఫటిక కాంతిగలదై రాజతశృంగమనుపేరఁ బ్రకాశించుచున్నది. మూడవశృంగము రత్నమయమై అద్వితీయ ప్రకాశముతో నుత్తరదిశయందున్నది, ఈలాగున మూడుశిఖరములచే శృంగవంతమని యాపర్వతము జెప్పఁబడెను. ఈశృంగములు తత్త్వముతో సోహమ్మనియు, ప్రణవమనియు, హంసయనియు, అక్షరములతో శ, మ, స, హ, లనియుఁజెప్పుదురు. దానిలో విషువత్తని పేరుగల శృంగమేది గలదో దానిని భాస్కరుఁడు పొందచుండును. ఎట్లనగా శరద్వసంతముయొక్క మధ్యయందీ మధ్యగతిని బొందినవాఁడై రాత్రిపగలుకాలము సమానపరిమాణము

గలదాని నొనర్చుచు, రాత్రులందు నిశాకరరూపముతోఁ దిమిరమును బోఁగొట్టు చున్నవాఁడగుచుండును. సూర్యరథమునకుగల ఛందోశ్వములు అక్షవచ్ఛరంగు గలిగి దివ్యములగు అశ్వములుగాఁ జెప్పఁబడి రథమునకుముందు నియోగింపబడి యుండును. ఈ అశ్వము లెఱ్ఱనిపద్మములకాంతిగల కిరణములచే పూయఁబడినట్లు ప్రకాశించుచుండును. ఈప్రకారము మేషతులాసంక్రమణములందు సూర్యోదయమున నగపడుచుండును. రాత్రింబగళ్ళు సమకాలమగుటచే విషుసంజ్ఞగాఁ జెప్పఁబడెను.



## సూర్యచంద్రులతో జలోష్ణకారణ మేఘోత్పత్తివివరము.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౧

సూర్యః కిరణ జాలేన వాయుయుక్తేన సర్వశః। జగతో జలమాదత్తే కృత్స్నాద్విజసత్తమాః॥ ౧౩ ॥ ఆదిత్య పీతం సూర్యాగ్నేః సోమం సంక్రమతేజలమ్। న్యడీభిర్వాయు యుక్తాభిర్లోకాధానం ప్రవర్తతే॥ ౧౪ ॥ యత్సోమాత్ స్రవతే సూర్యస్తదభ్రేష్వవతిష్ఠతే। మేఘావాయు నిఘాతేన విసృజంతి జలంభువి॥ ౧౫ ॥ ఏవముత్క్షిప్యతే చైవ పతతేచ పునర్జలం। నానాప్రకారముదకం తదేవ పరివర్తతే।౧౬॥ సంధారణార్థం భూతానాం మాయైషా విశ్వనిర్మితా। అనయా మాయయావ్యాప్తం త్రైలోక్యం సచరాచరమ్॥ ౧౭ ॥ విశ్వేశో లోకకృద్దేవః సహస్రాంశుః ప్రజాపతిః। ధాతాకృత్స్నస్యలోకస్య ప్రభుర్విష్ణు ర్దివాకరః॥ ౧౮ ॥ సర్వలౌకిక మంభోవై యత్సోమాన్నభసః స్రుతమ్। సోమాధారం జగత్సర్వమే తత్తథ్యం ప్రకీర్తితమ్॥ ౧౯ ॥ సూర్యాదుష్ణం నిస్రవతేసోమాచ్ఛీతం ప్రవర్తతే। శీతోష్ణవీర్యాద్వావేతౌ యుక్తౌధారయతోజగత్॥ ౨౦ ॥ సోమాధారా నదీగంగా పవిత్రా విమలోదకా। సోమపుత్రి పురోగాశ్చ మహానద్యోద్విజోత్తమాః॥ ౨౧ ॥ సర్వభూతశరీరేషు ఆపోహ్యనుగతాశ్చయాః। తేషుసందహ్యమానేషు జంగమస్థావరేషుచ। ధూమభూతాస్తుతాఆపో నిష్క్రామంతీహ సర్వశః॥ ౨౨ ॥ తేనచాభ్రాణి జాయంతే స్థానమభ్రమయం స్మృతమ్। అర్కతేజో హిభూతేభ్యోహ్యాదత్తే రశ్మిభిర్జలం॥ ౨౩ ॥ సముద్రాద్వాయుసంయోగా ద్వహన్త్యాపోగభస్తయః। యతస్త్వృతు వశాత్కాలే పరివర్తోదివాకరః। యచ్ఛత్యపోహి మేఘేభ్యః శుక్లాః శుక్లగభస్తిభిః॥ ౨౪ ॥ అభ్రే

స్థాపితంత్వాపో వాయునాసముదీరితాః। సర్వభూతహితార్థాయ వాయుభిశ్చర మంతతః॥ ౨౭ ॥ తతో వర్షతి షణ్మాసాన్ సర్వభూతవివృద్ధయే। వాయవ్యం స్తనితంచైవ వైద్యుతం చాగ్నిసంభవమ్॥ ౨౮ ॥ మేహనాచ్చ మిహేర్ధాతోః మేఘత్వం వ్యంజయంతిచ। నభశ్చ్యాతి యతస్తాపస్తదభ్రం కవయోవిదుః। మేఘానాంపునరుత్పత్తి స్త్రివిధాయోనిరుచ్యతే॥ ౨౯ ॥

సూర్యుఁడు వాయువుతోఁగూడిన తనకిరణజాలముచే జగత్తునందలి జలము నాకర్షించును. ఈలాగున నాసూర్యుని తేజస్సుచే నాకర్షింపఁబడిన సంతప్తజలము సూర్యునియందుఁజేరి తర్వాత శీతవీర్యముగల జలాంశభూత చంద్రునియందు జేరును. వాయుయుక్తనాడులచే సూర్యచంద్రుల సంబంధముతో లోకమునకు వర్షపతన మాధానమై సర్వసృష్టికిఁ గారణమగును. ఈజలమే కాలక్రమమునఁ బర్జన్యరూప ముతో మేఘములందు చంద్రునిచే విడువఁబడుచుండును. ఆదిత్యుఁడీలాగున మన లోకమునకు వర్షముగను ఉపరిలోకాదులకు శీతగుణముగను లోకాదులననుసరించిన గుణాదులతో జల, రస శీతాదులను భూరాది జనలోక పర్యంతము తదనుసార గుణ ఫలాది రూపకముగఁ గలుగజేయుచుండును. ఈపంచలోకాదులనే అధ్యాత్మిక దృష్టియోగముతో ఉపాసనాదులతో భూరాదిగ జనలోక పర్యంతము వ్యాహృతి పంచకముగ వేదమంత్రరూపముగ యజ్ఞములుగఁ బలికిరి. అందుచేత సర్వవ్యా హృతులందును భూరాది జనలోక పర్యంతముగల లోకనాథులందును లోకాదులం దును లోకాదుల చివరభాగములందును సూర్యుఁడు సర్వవ్యాపిగనుండును. "తదగ్రే వ్యవతిష్ఠతే"అని ప్రమాణము. మేఘములకుఁగూడ సూర్యుడేఁకారణము. వర్షము పడుటకుఁగూడ ఉష్ణశీతములు ప్రధానములు. సూర్యచంద్రులు జగత్తునకు సర్వ కార్యకారణులుగ నున్నారు. దీనిననుసరించియే కాలఋతువులతో సూర్యచం ద్రులప్రధానముతో జలచంద్రయోగాదులుగను వాతముతో నాడులుగను (వాతా తిదహన నాడులగ) భూసంబంధముతో అంగారక చలనముతోను గ్రహాదులనేర్ప రచి లోకహితార్థము కొఱకు భావికాలఫలమును దెలుసుకొనుటకై కాలారూప జ్యోతిశ్శాస్త్రముగ వేదాంగములో నొకయంగముగ నిర్ణయించిరి. ఈలాగుననే సర్వశాస్త్రములో కొక్కొక్క విధానదృష్టితో ఫలసాధనములుగాఁగల శాస్త్రరూప ములుగ నిర్ణయించిరి. వేదప్రమాణం నారాయణప్రశ్నలో ఉపాంత్య ఖండలో "యూనదాదిత్యస్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి పర్జన్యేనౌషధి వనస్పతయః

ప్రజాయన్తే"

ఈలాగున సర్వదా జగత్తున్నంతవరకు జరుగుచుండును. ఈప్రకారము నానా జలమనగా దివ్యగంగాజలము మొదలు చండాలవాటీజల పర్యంతము ఉచ్చనీచ జాతిమతకుల గోత్రాదులతో సంబంధములేకయే సర్వము నాకర్షింపఁబడును. "నానాప్రకార"శబ్దార్థము సర్వానుభవము. ఈప్రకారము సర్వజలము కాలకర్మ గతి ననుసరించి క్రిందినుండి పైకిని మరల పైనుండి క్రిందికిని పరివర్తనములగుచుండును. కనుకనే శ్రీజగద్గురు శంకరవిజయములో వేదవ్యాసమహర్షికిని ఆచార్యుల వారికిని గలిగిన సంభాషణలో "శ్లో॥ కిం గంగాంబు నిబింబితేఽం బరమణౌ, చండాలవాటీ పయఃపూరే వాఽన్తరమస్తి, కాంచనఘటీ మృత్కుంభ యోర్వాఽమ్బరే ప్రత్యగ్వస్తుని నిస్తరంగ సహజానందావ బోధాంబుధౌ విప్రోఽయం శ్వపచోఽయ మిత్యపి మహానోఽయం విభేదభ్రమః॥" అని జెప్పగా శ్రీశంకరాచార్యులు భావద్వైతము నంగీకరించి "చండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ"యని మనీషా పంచకమును వ్రాసిరి.

దీనికే భూరాద్యాకాశాంత భూతసంధారణకొరకును భౌతిక గుణాదులస్థితి కొఱకును నీవిశ్వమందీశ్వర నిర్మిత సర్వమును మాయయని యనఁబడుచున్నది. ఇట్టి మాయచే భూరాది స్వర్గాంతము చరాచర సృష్టిజాల త్రైలోక్యమంతయు వ్యాపింపబడియున్నది. అందుచేత ఆదిత్యుఁడే విశ్వేశ్వరుఁడని సృష్టికర్తయని, సహస్రాంశుఁడని, ప్రజాపతియని, విధాతయని విష్ణుశబ్దమువఱకు పర్యాయ పదవాచకములుగఁ జెప్పఁబడుచున్నాఁడు.

సర్వలోక ప్రాణ్యాధార జీవభూతమగు జలము వర్షరూపముతోఁ జంద్రుని వలన వాతనాడులచే నేహేతువువలన స్రవించుచున్నదో యాహేతువుచే జగత్తంతయు సోమాధారమై సత్యమని పురాణములచేఁ జెప్పఁబడుచున్నది. ఈలాగున సూర్యునివలన ~~ఉష్ణవీర్యుఁడగును~~ సోమునివలన శీతవీర్యుఁ డగను నీయుభయసంయోగముచే జగత్తుగా పరిణామాదులు జెందినందుచే [illegible] నాగాగులవి [illegible] బడుచున్నారు. [illegible] చకోణములును, త్రినాభియునుగల

మహాపవిత్రవంతమై స్వచ్ఛమగు గంగమును బోగొట్టునట్టి షట్ప్రకృతులు ర్యాది పుణ్యనదులన్నియు సోమపుత్రుఁడగు బుధగ్రహము నెక్కి భాస్కరుఁడు స్వప్ర వనియుఁ జెప్పఁబడుచున్నవి. ఈలాగు సర్వభూతము పెసల్పు పదివేల యోజనముల తాపత్రయముతోఁ దపింపఁబడునపుడు స్థావర క్షప్రమాణము రెండురెట్లధికము

ధూమరూపములతో (అనగా) ధూమాదిమార్గములతోఁ గ్రిందిలోకమునుండి పైలోకమునకు, యాతాయాతములగుచుండును. ఈలాగున వర్షోదకప్రధానములై మేఘములు పుట్టిఆకసమున వ్యాపించి మనకగపడుచున్నవి. అందుచేత మేఘములందుఁగల జలము ఆపోజ్యోతీస్వరూపముగ సంధ్యావందనాదులందుఁ దురీయపాదముగఁ జెప్పఁబడినది.

వర్షఋతువులందు ఆదిత్యుఁడే ఋతువశముచే శరత్కాలచంద్రునివలె తెల్లని శుక్లకిరణములచే మేఘములవలన శుక్లరూపముగ జలమును దనతపోబలముచే వర్షించుచున్నాఁడు. ఈలాగున వాయువుచే మేఘములు ప్రేరేపింపఁబడినవై అంతటను సర్వభూతహితము కొఱకు వర్షరూపముగ స్రవించుచున్నవి. ఈలాగు దేవతలకు రాత్రికాలమగు నాలుమాసములు సూర్యుఁడు వర్షింపజేయుచున్నాఁడు. మేఘములందుఁగల స్తనిత. నిర్ఘోషాదికములు వాయుసంభవమనియు, వైద్యుత, తేజస్సంతయు అగ్నిసంబంధమనియుఁ జెప్పబఁడుచున్నవి. "ఏతద్వా అహ్నోరూపం యద్రాత్రిః సూర్యస్యరశ్మయో వృష్ట్యా ఈశతే" అనియు "సత్యంవా ఏతత్। యద్వర్షతి అనృతం యదాతపతివర్షతి" అనియు శ్రుతివాక్యములు "మిహ" ధాతువు మేహనార్థము కలదిగ యగుటచేత మేఘములనియు, అకాలమునందు జలములు మేఘములనుండి భ్రంశనుజెందక పోవుటచే అభ్రములనియుఁ జెప్పఁబడినవి.

—o—

# సూర్యరథవివరము.

శ్రీవాయుపురాణము - అధ్యా. ౫౧

అథ సూర్యరథస్యాథ సన్నివేశం నిబోధత। సంస్థితేనైకచక్రేణ పంచారేణ త్రినాభినా। ౫౮ ॥ హిరణ్మయేన భగవాన్ పర్వణాతు మహౌజసా। నష్టవర్ణాంధకారేణ షట్పరికారిణా ?? భాసంబంధమక్రేణ భాస్వతా సూర్యః స్యందనేన ప్రసర్పరచి లోకహితార్థము కొఱకు భావిస్తారా యామతః స్మృతః। ద్విగుణోఽస్య రథో జ్యోతిశ్శాస్త్రముగ వేదాంగములో సతస్యబ్రహ్మణాసృష్టో రథోహ్యర్థవశేనతు। సర్వశాస్త్రములో కొన్ని విధానపరమగ్ర ర్ణ్యమైః ౫౭.॥ ఛందోభిర్వాజిరూపైస్తు ములుగ నిర్ణయించిరి. వేదప్రోదనస్యైహఃతు క్తైః సమ్యక్తస్తుతః తేనాఽసౌ సర్పతి "యావదాదిత్యస్తపతి రశ్మిభిస్తా॥ ౫౯ ॥ అథేమానితు సూర్యస్య ప్రత్యంగాని

రథస్యతు। సంవత్సరస్యావయవైః కల్పితాని యథాక్రమం॥ ౫౯ ॥ అహస్తునాభిః సూర్యస్య ఏకచక్రస్సవైస్మృతః। ఆరాః పంచర్తవస్తస్యనేమిః షడృతవః స్మృతాః॥ ౬౦ ॥ రథనీడః స్మృతోహ్యబ్దస్త్వయనే కూబరావుభౌ। ముహూర్తా బంధురాస్తస్యశమ్యా తస్యకలాః స్మృతాః॥ ౬౧ ॥ తస్యకాష్ఠాః స్మృతాఘోణా ఈషాదండః క్షణాంస్తువై। నిమేషాశ్చానుకర్షోఽస్య ఈషాచాస్యలవాః స్మృతాః॥ ౬౨ ॥ రాత్రిర్వరూథోధర్మోఽస్యధ్వజ ఊర్ధ్వసముచ్ఛ్రితః। యుగాక్షకోటీ తేతస్య అర్థకామావుభౌస్మృతౌ॥ ౬౩ ॥ సప్తాశ్వరూపాశ్ఛందాంసి వహంతే వామతోధురాం। గాయత్రీచైవ త్రిష్టుప్చ అనుష్టుప్జగతీతథా॥ ౬౪ ॥ పఙ్క్తిశ్చ బృహతీచైవ ఉష్ణిగేవతుసప్తమం। అక్షే చక్రం నిబద్ధంతుధ్రువే త్వక్షః సమర్పితః॥ ౬౫ ॥ సహచక్రో భ్రమత్యక్షః సహాక్షో భ్రమతిధ్రువః। అక్షః సహైవ చక్రేణ భ్రమతేఽసౌ ధ్రువే స్థితః॥ ౬౬ ॥ ఏవమర్థ వశాత్తస్య సన్నివేశో రథస్యతు। తథాసంయోగభాగేన సంసిద్ధో భాస్వరోరథః॥ ౬౭ ॥ తేనాఽసౌ తరణిర్దేవస్తరసా సర్పతేదివి। యుగాక్షకోటి సంబద్ధారశ్మీ ద్వౌస్యందనస్యహి॥ ౬౮ ॥ ధ్రువేణభ్రమతోరశ్మీ విచక్రియుగయోస్తువై। భ్రమతో మండలానిస్యుః ఖేచరస్య రథస్యతు॥ ౬౯ ॥ యుగాక్షకోటీ తేతస్యదక్షిణే స్యందనస్యతు। ధ్రువేణ సంగృహీతేవై ద్విచక్రే శ్వేతరజ్జువత్॥ ౭౦ ॥ భ్రమంతమనుగచ్ఛేతాం ధ్రువం రశ్మీతు తావుభౌ। యుగాక్షకోటీ తేతస్యవాతోర్మీస్యందనస్యతు॥ ౭౧ ॥ కీలాసక్తా యథారజ్జుర్భ్రమతే సర్వతోదిశం। హ్రసతస్తస్యరశ్మీతౌ మండలేషూత్తరాయణే॥ ౭౨ ॥ వర్ధతే దక్షిణేచైవ భ్రమతో మండలానితు। ధ్రువేణ సంగృహీతౌతు రశ్మీవై నయతోరవిం॥ ౭౩ ॥ ఆకృష్యేతే యదాతౌవైధ్రువేణ సమధిష్ఠితౌ। తదాసోఽభ్యంతరం సూర్యోభ్రమతే మండలానితు॥ ౭౪ ॥ అశీతిమండలశతంకాష్ఠయో రుభయోశ్చరన్। ధ్రువేణ ముచ్యమానాభ్యాం రశ్మిభ్యాం పునరేవతు॥ ౭౫ ॥ తథైవ బాహ్యతః సూర్యోభ్రమతే మండలానితు।

త్రిపంచరూపముతో సంస్థితమగు పంచకోణములును, త్రినాభియునుగల బంగారుకాంతితో మహాతేజోవంతము అంధకారమును బోగొట్టునట్టి షట్ప్రకృతులు గలిగి యొకే అంచుగలిగిన చక్రముతో గూడిన రథమునెక్కి భాస్కరుండు స్వప్రకాశ రూపుండై తిరుగుచుండును. ఆరథము నిడివి వెడల్పు పదివేలయోజనముల ప్రమాణము గలిగియుండును. వెడల్పునకంటె నొకప్రమాణము రెండురెట్లధికము

(లంబము ౨౦,౦౦౦). ఆరథము బ్రహ్మచే స్వర్ణమయకాంతిచే పరమగతిగలిగి యసంగమై యోగయుక్తమై యుండు ఛందాశ్వములతో సృజింపబడియున్నది. అశ్వరూపములు బొందిన శుక్రుడెట్టులైవుండునో యావైపునకే అశ్వములు లాగుచుండును. ఇదివ్రివృత్తిధర్మమని సృష్టికిఁగారణ కార్యముగా లాగునని తెలియవలెను. వారుణరథముయొక్క లక్షణములతో సమానలక్షణములుగలిగి సూర్యరథము ప్రకాశించుచుండును. ఇట్టిరథముతో సాయంకాలము రాత్రివేళయందు పశ్చిమదిశలో నీరథముతో నాకాశమందు దివాకరుఁడు సంచరించుచుండును. ఈ సూర్యరథమునకుఁ బ్రత్యంగములన్నియును సంవత్సరాత్మక కాలచక్రముయొక్క అవయవములచే యథాక్రమముగాఁ గల్పింపఁబడినవి. సూర్యనాభి ఏకచక్రమై అహోరాత్రరూపముగఁ జెప్పబడుచున్నది. దానికిఁ బంచఋతువులే నేమి. ఇవేచాంద్రమానముతో షడృతువులుగా నిందులోనే భాగింపఁబడినవి. నేమియన చక్రమునకుఁగలకమ్మి. ఇదేఋతుభాగసంజ్ఞగఁ జెప్పఁబడుచున్నది. ఆరథముయొక్క మూతయే అబ్దముగను దీనివిభాగములు రెండును దక్షిణోత్తరాయణములని తెలియవలెను. వరూధమన రథముయుక్క పార్శ్వములందుఁగల నొగల నాల్గుపార్శ్వములందమర్చఁబడిన గుంజలు (చిన్నకొయ్యలు) ముహూర్తములని యర్థము. రథచీలలు కలలనియు, కాష్ఠలనియు, రథాశ్వముయొక్క నాసికము ఈపాదండమనియు, వాయుసంచారమార్గమనియు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు నిమిషములనియు దెలియనగును. వీటిచేఁగాలమాకర్షింపఁబడుచున్నది. నొగయొక్కరంధ్రములు లవములుగను, (నొగ=లాంగలదండము) రాత్రిభాగము తెరయనియు, పగటిభాగము ధ్వజమనియు, నీరాత్రింబగళ్లే అర్థకామములనియు దక్షిణోత్తర ధ్రువములు కోటులనియుఁ జెప్పబడుచున్నవి. ఛందస్సులు: ౧ గాయత్రి, ౨ త్రిష్టుప్, 3 అనుష్టుప్, ౪ జగతి, ౫ పఙ్క్తి, ౬ బృహతి. ౭ ఉష్ణిక్, ఈ ఛందాశ్వములేడు నేకరూపముగనున్నది. రథముయొక్క యిరుసు చక్రాక్షమం దమర్చఁబడియున్నది. దీనికి ధ్రువసంబంధముగలిగియున్నది. అందుచేతఁ జక్రముతోఁగూడి అక్షమును అక్షముతోఁగూడి ధ్రువము దిరుగుచుండును. ఇట్లుధ్రువముచేఁ ద్రిప్పఁబడుచున్న అక్షము, చక్రముతోఁకలసియే భ్రమించుచుండును లేక భ్రమింపజేయుచుండును. ఈలాగున "తరణి యను పేరుగల నీసూర్యుఁడు వేగముగ నాకాశమందు పరస్పరగతితో ధ్రువునితోఁగూడ తిరుగుచుండును. ఇట్లాకాశమందు సంచరించుచు తాను భ్రమించుచున్నట్లగపడుచున్న యాసూర్యరథమునకు మండలములు బహుసంఖ్యలతో

విరాజిల్లుచుండును. ఆరథమునకు దక్షిణాక్షమందు రెండుయుగాక్షకోటులు ధ్రువముచే సంగృహీతములై రెంటుచక్రములవలె భ్రాంతితోఁ డెల్లవిపగ్గములవలె భ్రాశించుచుండును. ఇట్లుభ్రమించుచున్న యాధ్రువము ననుసరించి, ముందురెండు రశ్ములును, వెనుకరెండు రశ్ములును, మధ్యేసూర్యుడుగనుండును. ఆరథముయొక్క వాయుమయములగు నారశ్ములే యుగాక్షకోటులని పేర్కొనఁబడుచున్నవి. సూర్యరథము కాడిమానుపకుఁగల చీలకుఁగట్టిన పక్షిడవలె నారశ్ములు సర్వదిక్కులకు ననుకూలముగఁ దిరుగుచుండును. ఈవాతరశ్ము లుత్తరాయణమందుఁగల మండలములందు హ్రాసమును జెందుచుండును. దక్షిణాయనమందుగల మండలములందు హ్రాసమును జెందుచుండును. దక్షిణాయనమందుగల మండలము లందు వృద్ధినిఁ బొందించుచుండును. ఇట్లుధ్రువునిచే సంగ్రహింపఁబడిన నారశ్ములు సూర్యుని నడుపుచున్నవి. ధ్రువునిచే అధిష్ఠింపఁబడిన యారశ్ములెపుడు ధ్రువునిచే నాకర్షింపఁబడునో యపుడాసూర్యుఁడు అంతరములోఁగల మండలములోఁజేరి ఆరోహణ మార్గమునఁ దిరుగుచుండును. శింశుమారములోగల అంతర్వలయము నే, ఉత్తరాయణమని తెలియవలెను. ఈలాగున దక్షిణోత్తర దిక్కులందు (అనగా అయనములని) నూటయెనుబదివందల మండలములను దిరుగుచున్నవాఁడై మరలధ్రువునిచే విడువఁబడుచున్న రశ్ములచేఁ దిరిగి బాహ్యమండలమగు దక్షిణాయనమున అవరోహణమార్గమునఁ దిరుగుచుండును. ఈలాగున నుభయపక్షములందు మహావేగముతో కాలచక్రముగఁ దిరుగుచున్నాఁడు.



# సూర్యరథసమీపపరివారగణములు.

శ్రీవాయుపురాణం - అధ్యాయం. ౫౨.

సూతఉవాచ-

సరథోzధిష్ఠితోదేవై రాదిత్యైఋషిభిస్తథా। గంధర్వైరప్సరోభిశ్చ గ్రామణీ సర్పరాక్షసైః ౧॥ ఏతేవసంతివై సూర్యేద్వాద్వామాసౌ క్రమేణతు। ధాతార్యమా, పులస్త్యశ్చ పులహశ్చ ప్రజాపతిః ౨॥ ఉరగోవాసుకిశ్చైవ సంకీర్ణారస్చతావుభౌ। తుంబురు ర్నారదశ్చైవ గంధర్వౌ గాయతాంవరౌ॥ 3॥ క్రతుస్థల్యప్సరశ్చైవ తథావై పుంజికస్థలీ। గ్రామణీరథ కృచ్ఛ్రేశ్చ తపోర్యశ్చైవతా

ఉభౌ॥ ౪ ॥ రక్షోహేతిః ప్రహేతిశ్చ యాతుధానావుదాహృతౌ। మధుమాధవయో
రేష గణోవసతిభాస్కరే॥ ౫ ॥ వాసంతౌ గ్రైష్మికౌ మాసౌ మిత్రశ్చ వరుణ
శ్చహ। ఋషిరత్రిర్వసిష్ఠశ్చ తక్షకోరంభ ఏవచ॥ ౬ ॥ మేనకాసహజన్యాచ గంధ
ర్వాచ హాహాహుహుః। రథస్వనశ్చ గ్రామణ్యోరథ చిత్రశ్చతావుభౌ॥ ౭ ॥ పౌరు
షేయో వధశ్చైవ యాతుధానా వుదాహృతౌ। ఏతేవసంతి వై సూర్యే మాసయోః
శుచిశుక్రయోః॥ ౮ ॥ తతఃసూర్యే పునస్త్వన్యా నివసంతీహ దేవతాః। ఇంద్ర
శ్చైవ వివస్వాంశ్చ అంగిరాభృగురేవచ॥ ౯ ॥ ఏలాపర్ణస్తథాసర్పః శంఖపాలశ్చ
తావుభౌ। విశ్వావసూగ్రసేనౌచ ప్రాతశ్చైవా రుణశ్చహ॥ ౧౦॥ ప్రమ్లోచేతి
చవిఖ్యాతా నిమ్లోచేతిచ తేశుభే। యాతుధానస్తథాసర్పో వ్యాఘ్రః శ్వేతశ్చతా
వుభౌ॥ నభోనభస్యయోరేష గణోవసతి భాస్కరే. ౧౧ ॥ శరదృతౌ పునఃశుభ్రా
వసంతి మునిదేవతాః। పర్జన్యశ్చాథ పూషాచ భరద్వాజః సగౌతమః॥ ౧౨ ॥ విశ్వా
వసుశ్చ గంధర్వాస్తథైవ సురభిశ్చయః। విశ్వాచీచ ఘృతాచీచ ఉభేతే శుభలక్ష
ణే॥ ౧౩ ॥ నాగఐరావతశ్చైవ విశ్రుతశ్చ ధనంజయః। సేనజిచ్చ సుషేణశ్చ సేనా
నీర్గ్రామణీశ్చతౌ॥ ౧౪ ॥ ఆపోవాతశ్చ తావేతౌ యాతుధానా వుభౌస్మృతౌ।
వసంత్యేతే తు వైసూర్యే మాసయోశ్చ ఇషోర్జయోః॥ ౧౫ ॥ హైమంతికౌతు
ద్వౌమాసౌ వసంతితు దివాకరే। అంశోభగశ్చద్వావేతౌ కశ్యపశ్చ ఋతుశ్చహ॥ ౧౬
భుజంగశ్చ మహాపద్మః సర్పః కర్కోటకస్తథా। చిత్రసేనశ్చ గంధర్వఊర్ణాయుశ్చైవ
తా ఉభౌ. ౧౭ ॥ ఊర్వశీవిప్రచిత్తశ్చ తథైవాప్సరసౌశుభే। తార్క్ష్యశ్చారిష్టనే
మిశ్చ సేనానీర్గ్రామణీశ్చతౌ॥ ౧౮ ॥ విద్యుత్స్ఫూర్జశ్చ తావుగ్రౌ యాతుధానా
వుదాహృతౌ। సహేచైవ సహస్యేచ వసత్యేతే దివాకరే॥ ౧౯ ॥ తతఃశైశిరయో
శ్చాపి మాసయోర్నివసంతి వై। త్వష్టావిష్ణుర్జమదగ్ని ర్విశ్వామిత్రస్తథైవచ॥ ౨౦ ॥
కాద్రవేయౌ తథానాగౌ కంబళాశ్వతరావుభౌ। గంధర్వో ధృతరాష్ట్రశ్చ సూర్యవ
ర్చాస్తథైవచ॥ ౨౧ ॥ తిలోత్తమాప్సరాశ్చైవ దేవీరంభా మనోరమా। ఋతజిత్స
త్యజిచ్చైవ గ్రామణ్యౌ లోకవిశ్రుతౌ॥ ౨౨ ॥ బ్రహ్మోపేతస్తథారక్షో యజ్ఞో
పేతశ్చస స్మృతః। ఏతేదేవా వసంత్యర్కే ద్వౌమాసౌ తుక్రమేణతు॥ ౨౩ ॥ స్థానాభి
మానినోహ్యేతే గణాద్వాదశ సప్తకాః। సూర్యమాప్యాయయంత్యేతే తేజసా తేజ
ఉత్తమం॥ ౨౪ ॥ గ్రథితైస్తైర్వచోభిస్తు స్తువంతి మునయోరవిం। గంధర్వాప్సరస
శ్చైవ గీతనృత్యైరుపాసతే। ౨౫ ॥ గ్రామణీయక్షభూతాస్తు కుర్వతేభీషుసంగ్రహం।
సర్పావహంతిసూర్యంచ యాతుధానానుయాంతిచ। వాలఖిల్యానయంత్యస్తం పరి

చార్వేదయాద్రవిం॥ ౨౬ ॥ ఏతేషామేవ దేవానాం యథావీర్యం యథాతపః। యథాయోగం యథాసత్త్వం యథాధర్మం యథాబలం॥ ౨౭ ॥ యథా తపత్యసౌ సూర్యస్తేషాం సిద్ధస్తు తేజసా। ఇత్యేతే వై వసంతీహ ద్వౌద్వౌమాసౌ దివాకరే॥ ౨౮ ॥ ఋషయో దేవగంధర్వాః పన్నగాప్సరసాంగణాః। గ్రామణ్యశ్చ తథాయక్షా యాతుధానాశ్చ ముఖ్యశః॥ ౨౯ ॥ ఏతే తపంతి వర్షంతి భాంతి వాంతి సృజంతి చ। భూతానామశుభం కర్మవ్యపోహంతీహ కీర్తితాః, ౩౦ ॥ మానవానాం శుభం హ్యేతే హరంతి దురితాత్మనాం। దురితం హి ప్రచారాణాం వ్యపోహంతి క్వచిత్ క్వచిత్ ॥౩౧ ॥ విమానే చ స్థితా దివ్యే కామగే వాతరంహసి। ఏతే సహైవ సూర్యేణ భ్రమంతి దివసానుగాః॥ ౩౨ ॥ వర్షంతశ్చ తపంతశ్చ హ్లాదయంతశ్చవై ప్రజాః। గోపాయంతీతు భూతాని సర్వాణీహ మనక్షయాత్॥ ౩౩ ॥ స్థానాభిమానినామేతత్ స్థానం మన్వంతరేషు వై। అతీతానాగతానాంవై వర్తంతే సాంప్రతంతు యే॥ ౩౪ ॥ ఏవం వసంతి వై సూర్యే సప్తకాస్తే చతుర్దశం। చతుర్దశ సుసర్గేషు గణామన్వంతరేషుచ॥ ౩౫ ॥ గ్రీష్మేహిమేచ వర్షాసు ముంచమానాఘర్మం హిమంచవర్షంచ దినం నిశాంచ। కాలేనగచ్ఛత్యృతువశాత్। పరివృత్తరశ్మిర్దేవాన్ పితౄంశ్చ మనుజాంశ్చ తర్పయన్ వై॥ ౩౬ ॥ ప్రీణాతి దేవానమృతేన సూర్యః సోమం సుషుమ్నేన వివర్ధయిత్వా శుక్లేతుపూర్ణం దివసక్రమేణ తం కృష్ణపక్షే విబుధాః పిబంతి॥ ౩౭ ॥

దీనిననుసరించియే శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౧
శ్లో॥ ౧ ౨౩ వరకునున్నది.

వెనుక వర్ణింపఁబడిన సూర్యరథ మదితిపుత్రులగు దేవతలచేతను, ఋషులచేతను, గంధర్వులచేతను, అప్సరసలచేతను, గ్రామనాయకులగు సర్పరాక్షసాదులచేతను, అధిష్ఠింపఁబడియుండును. వీరలందరు రెండేసిమాసములు క్రమముగానుందురు. దేవగంధర్వులు, తుంబురుఁడు, నారదుఁడు, గాయకశ్రేష్ఠులు, రథకృచ్ఛ్రిఁడు తపోర్యుఁడు గ్రామనాయకులు, రక్షోహేతి, ప్రహేతియనువారలు యాతుధానులు. క్రతుస్థితియు, పుంజకస్థలియు అప్సరసలు. ధాత, అర్యముఁడు పులస్త్యుఁడు, పులహుఁడు, ప్రజాపతులు, వాసుకి, సంకీర్ణారుఁడు ఉరగులు. వీరలందరు చైత్రవైశాఖ మాసగణములు. వీరలు భాస్కరుని రథసమీపమును బొందియుందురు. ఈ రెండుమాసములు మధుమాధవ మాసములు. ఇదియే వసంతఋతువు.

ఇటులనే-గ్రీష్మఋతుమాసములగు శుచిశుక్రమాసములందు మిత్ర, వరుణులు

దేవతలును, అత్రి, వసిష్ఠులు, ఋషులును, తక్షకుఁడు రంభుఁడనువార లురగులు, మేనక, సహజన్యలనువారప్సరసలు, హాహా, హుహూ యనువారలు గంధర్వులు; రథస్వనరథ చిత్రులు గ్రామణులు; పౌరుషేయుఁడు, ధవుఁడనువారలు యాతుధానులు;

వర్షర్తుమాసములగు నభోనభస్యమాసములందు ఇంద్రుఁడు, వివస్వంతుఁడనువారు దేవతలు; అంగిరస భృగులు ఋషులు. ఏలాపర్ణుఁడు, శంఖపాలుఁడనువార లిద్దరు సర్పరాజులును విశ్వావసూగ్రసేనులు ప్రాతఃకాలారుణ స్వరూప గంధర్వులు. ప్రమ్లోచన నిమ్లోచనులు అప్సరసలు. సర్పుఁడు, వ్యాఘ్రుఁడనువారలు యాతుధానులు.

శరదృతుమాసములగు ఇషోర్జమాసములందు మునిదేవతాదులందరును, పర్జన్యపూషలు దేవతలు. భరద్వాజ, గౌతములు ఋషులు; విశ్వావసువు సురభుఁడు గంధర్వులు. విశ్వాచియు ఘృతాచియు నప్సరసలు. ఐరావత, ధనంజయులు నాగరాజులు. సేనజిత్సుషేణులు గ్రామనాయకులు ఆపోదేవతయు వాయుదేవతయు యాతుధానులు.

హేమంతఋతు మాసములగు సహాసహస్యలందు, అంశుఁడు, భగుఁడనువారలు ఆదిత్యులు. కశ్యపుఁడు ఋతుఁడనువారలు ఋషులు. భుజంగ, మహాపద్మ కర్కోటకులు సర్పరాజులు. చిత్రసేనోర్ణాయువులు గంధర్వులు. ఊర్వశీ, విప్రచిత్తు లప్సరసలు. తార్క్ష్య. రిష్టనేము లిద్దరు సేనానాయకులు. విద్యుత్స్ఫూర్జులుగ్రలగుయాతుధానులు.

శశిఋతుమాసములగు తపోఫాల్గునికములందు, త్వష్టయు విష్ణువును ఆదిత్యులు; జమదగ్ని, విశ్వామిత్రులు ఋషులు; కంబళాశ్వతరులిద్దరు నాగరాజులు; ధృతరాష్ట్రసూర్యవర్చసు లిద్దరు గంధర్వులు; తిలోత్తమారంభ లిద్దరు అప్సరసలు. ఋతజిత్సత్యజితు లిద్దరు గ్రామనాయకులు; బ్రహ్మోపేయుఁడు, యజ్ఞోపేతుఁడు యాతుధానులు.

ఈగణదేవతలు ద్వాదశసప్తకములై స్థానాభిమాన దేవతలై సూర్యునిఁదృప్తిపరచుచున్న వారలై తేజస్సుచే నుత్తమమగుదివ్యతేజస్సు నిచ్చుచుందురు. ఇట్లు వేదప్రసిద్ధములగు స్తుతివాక్యములచేత మునులు సూర్యుని స్తుతించు చుందురు. గంధర్వాప్సరసలు గీతనృత్యములచే నుపాసించుచుందురు. గ్రామనాయకులు, యక్షస్వరూపులై భయంకరతేజస్సును సంగ్రహించుచుందురు. సర్పరాజులు పగ్గములై

యుందురు. యాతుధానులు సూర్యరథమును అనుగమించుచుందురు. వాలఖిల్య మహర్షు లుదయము మొదలస్తమయపర్యంతము సూర్యమండలమును నడపుచుందురు. ఈదేవతల వీర్యమును తపస్సననుసరించి యోగబలము సత్యము, ధర్మము మొదలగు వాటితో నెట్లు ప్రకాశింపుచున్నవో అట్టితేజస్సుతో సూర్యుఁడుస్థితుఁడగుచున్నాఁడు.

ఈప్రకారము రెండేసిమాసము లీచెప్పినవారలందరు సూర్యుని నుపాసించు చుందురు. వర్షమును కురిపించుచుందురు; నక్షత్రరూపులై ప్రకాశించుచుందురు. వాయురూపులై వీచుచుందురు. సృష్టినిఁజేయుచుందురు. భూతముల పాపకర్మ లనుబోఁగొట్టి శుభముల నిచ్చుచుందురు. జన్మాంతరపాపములను సహితముబోఁగొ ట్టుచుందురు.

ఈలాగున దివ్యవిమానమందు కామగమనమును వాయువేగమును గలవారై వీరలందరు సూర్యునితోఁగలసి సూర్యుని పగటిభాగముల ననుసరించి తిరుగుచుం దురు. వర్షింపఁజేయుచు తపింపఁజేయుచు ఋతుధర్మానుసార గుణఫలములతోఁ బ్రజలను సంతోషపరచుచున్నవారలై యుందురు. సర్వభూతములు ప్రజలున్నంత కాలము ప్రళయమువరకు రక్షించుచుందురు. ఈలాగున మన్వంతరములందు స్థానములనభిమానించుచున్న వీరికి నీసూర్యుఁడే పరమగతి. అతీతులకును, రాబోవు వారికిని వర్తమానులకునుగూడ నీసూర్యుఁడేగతి. ఈచెప్పఁబడిన సప్తగణములు సూర్యునికి నలుదిశలందు విపసించియుందురు. మన్వంతరములందు సర్గప్రతిసర్గల యందు చతుర్దిక్కులందీగణములే గ్రీష్మ, వర్ష, హిమవంతఋతువులయందు ఘర్మ మును (వేడిమిని) వర్షము హిమమును (మంచును) పగటిని, రాత్రిని గలుగజేయు చున్నవారలై యుందురు. కాలకర్మలచే ఋతుధర్మములచేఁ బరివృత్తరశ్ములు గల వారలై తిరుగుచుందురు. దేవతలను, పితురులను, ఋషులను, మనుష్యులను దృప్తినిబొందించుచున్నారు. సుషుమ్నద్వారా శుక్లపక్షమందు అమృతమును వృద్ధి గావించి కృష్ణపక్షమందు దినక్రమముతో సర్వదేవతలకును అమృతపానముఁజేయిం చుచు అంత్యకళతో ఓషధీరూపములో పృథివియందుగల సర్వజీవరాసులను వ్రీహ్యా దిఫలరూపములతోఁ దృప్తినిఁ బొందించుచున్నారు. ఈలాగున సర్వకార్యకార ణుఁడు నాసూర్యుఁడే యగుచున్నాఁడు. సూర్యమహిమ వర్ణనాతీతము.

—। వి శే షాం శ ము. ।—

ఈలాగుననే మనదేహమునందు సమన్వయ క్రమముతో నన్నియును సరిపో వును. సహస్రారమే సూర్యస్థానము, సప్తగణములే మూలధాతువులు. శబ్దస్పర్శ

రూప రసగంధాదులే ఫలములు. మనస్సే మన్వంతరము. అధోముఖ గమనముతో సహస్రారము నాశ్రయించిన వాడులే వాలఖిల్యఋషులు. ఋతువులే గణాదులు. కామరూపత్వమే మనదేహరథము. కాలకర్మల ననుసరించి చేయుటచేత సర్వము శాంతినిఁబొంది అప్యాయమానమగును. త్రికాలములందు మనమేయుందుము. గాన మనశుభకర్మలతోనే సహస్రారము వృద్ధిచెంది త్రికాలఫలమునిచ్చును. మూలాధారాది షట్కమలము లేటవదగు సహస్రారముతోఁగూడి యేఁడురశ్ములుగా నెంచవలెను. ద్వాదశాంతమే ద్వాదశసంఖ్యసూర్యులు ఈలాగు నెంతకాలముండినను జననమన్వంతరము లనేకములు గడచినను నీస్థితితప్పదు. కామరూపభావదేహమును (సూర్యుం) విడిచి స్వస్వరూపాత్మభావముతో నిష్కామకర్మలతో జ్ఞానవైరాగ్యములతో నున్నవార లీకామరూపాదిత్యునిద్వారా అతీతాదిత్యుఁడగు నాత్మనుబొందుదురు. ఈలాగు లేకున్న నీయాదిత్యుఁడు తప్పఁడు. ప్రళయములు రాత్రింబగళ్ళు తప్పవు. ఇందులో నియామకులుగనున్న సప్తగణదేవత లాయాకార్యమును జేయనిచో నాయాఫలములులేక యెట్లుతపించి ఋతుధర్మములు నిలిచిపోయి శ్రమలు బాధలుగలుగునో యటులనే మనదేహములోఁగూడ దీనికి సూటిగనే మనమనుభవింతుము.

ఈలాగున స్థూలదేహకర్మలతోను సూక్ష్మదేహ తపస్సుతోగల తేజస్సుతోను కారణముతో శాంతిగలిగిన ధన్యతగలుగును. ఇంద్రియాదులే దేవతలు కర్మస్వరూపులు. శమదమాదులే ఋషులు, సాత్వికశాంతియుత నిష్కామకర్మలతో బాహ్యబ్రహ్మాండమును జయించి అంతరములో ధ్యానయోగముతో గ్రంథిభేదనముతో కపాల కటాహస్ఫోటనముతో సర్వాతీతముతో స్వస్వరూపుడగు నేకాని స్ఫోటకముతో రాబడినది మరల స్ఫోటముతోనే మోక్షముగావలెను. అన్నియును ఆత్మపరముగను దేహపరముగను సమన్వయములగును. ఇచ్ఛానుసారము తిరుగుచుండును.

—o—

## సూర్యాధిక్యత.

శ్రీవాయుపురాణం - అధ్యా ౫3 - పుట ౮౦.

భవత్యస్య జగత్కృత్స్నం సదేవాసుర మానుషం॥ 3౮॥ రుద్రేంద్రో

పేంద్ర చంద్రాణాం విప్రేంద్ర త్రిదివౌకసాం। ద్యుతిర్ద్యుతిమతాం కృత్స్నా యత్తేజః సార్వలౌకికం॥ ౩౫॥ సర్వాత్మా సర్వలోకేశో మూలం పరమదైవతం। తతః సంజాయతే సర్వం తత్రైవ ప్రలీయతే॥ ౩౬॥ భాహిభావౌ హిలోకానా మాదిత్యాన్నిః సృతౌ పురా। జగజ్జ్ఞేయో గ్రహావిప్ర దీప్తిమాన్ సుగ్రహో రవిః॥ ౩౭॥ యత్ర గచ్ఛంతి నిధనం జాయంతే చ పునః పునః। క్షణా ముహూర్తా దివసా నిశాః పక్షాశ్చ కృత్స్నశః। మాసాః సంవత్సరాశ్చైవ ఋతవోఽబ్ద యుగాని చ॥ ౩౮॥ తదాదిత్యాదృతే తేషాం కాలసంఖ్యా న విద్యతే। కాలాదృతేన నిగమో నదీక్షా నాహ్నిక క్రమః॥ ౩౯॥ ఋతూనాము విభాగశ్చ పుష్పమూల ఫలం కుతః। కుతః సస్యాభి నిష్పత్తి ర్గుణౌషధి గణాదివా॥ ౪౦॥ అభావో వ్యవహారాణాం దేవానాం దివి చేహ చ। జగత్ప్రతాప నమృతే భాస్కరం వారితస్కరం॥ ౪౧॥ సఏవ కాలశ్చాగ్నిశ్చ ద్వాదశాత్మా ప్రజాపతిః। తపత్యేష ద్విజశ్రేష్ఠా స్త్రైలోక్యం సచరాచరం॥ ౪౨॥ సఏవ తేజసాం రాశిః సమస్తః సార్వలౌకికః। ఉత్తమం మార్గ మాస్థాయ వాయోర్భాభిరిదంజగత్। పార్శ్వమూర్ధ్వ మధశ్చైవ తాపయత్యేష సర్వశః॥ ౪౩॥

సూర్యుని యాధిక్యతచే, దేవాసుర మనుష్యులతోఁ గూడుకొనిన సకలజగత్తు రుద్రేంద్ర విష్ణు, చంద్రులయొక్కయు, దేవతలయొక్కయు, దేవాసుర విభూతిగల యితర దేవాసుర యోనులయొక్కయు ప్రకాశతేజస్సులు సర్వలోకవ్యాపకమై సూర్యునితోఁ బ్రకాశించుచున్నది. అందుచేతనే సర్వలోక సమష్ట్యాత్మక సకల లోక స్వరూపుఁడైన పరమదైవముగ సూర్యుఁడున్నాఁడనియు నతనివలననే యీ సర్వము సృష్టి స్థితిలయము లతనియందే యగుచున్నవనియు జెప్పబడుచున్నవి. పురా కల్పమందుఁగూడ సకలలోకముల భావాభావములు రెండును ఆదిత్యునివలననే ఆవిర్భావ తిరోభావములు గలుగుచున్నవి. కావున ప్రకాశయుక్తుఁడును, గ్రహరాజునగు సూర్యుఁడే సర్వజగత్తని తెలియవలెను. సకలభూతము లెవనియందు లయముగు బొందుచున్నవో మఱల నతనివలననే ఆవిర్భవించుచున్నవి. క్షణముహూర్త దివారాత్రి పక్షమాస ర్త్వయన సంవత్సర యుగాదులకుఁ గారణ మాదిత్యుఁడే. సూర్యునిఁబట్టి నిగమాగమ దీక్షాహ్నిక పారాయణాదులు జరుగుచున్నవి. అతఁడులేమి ఋతువిభాగములు, సస్యౌషధీ పుష్పఫలాదులు, జీవరాసులెట్లుసంభవించును? స్వర్గమందు దేవతలయొక్కయు, భూమియందు మనుష్యుల

యొక్కయు, సర్వవ్యవహారముల కభావమే. అందుచేత సూర్యుఁడే కాలమనియు, అగ్నియనియు, ద్వాదశాత్మకుఁడనియు ప్రజాపతియనియు పిలువఁబడుచున్న వాఁడై చరాచరాత్మకమగు నీత్రైలోక్యమును బ్రకాశింపఁజేయుచున్నాఁడు. సూర్యుఁడే సర్వతేజోరాశియై సర్వలోక ప్రకాశుఁడగుచున్నాఁడు. సూర్యుఁడున్నత సుగుమార్గము నధిష్ఠించి వాతకిరణములచే నీజగత్తును పార్శ్వములందును ఊర్ధ్వాధోమధ్యభాగములందునుఁ బ్రకాశించుచుండుటచే సర్వాధికుఁడని మహిమాతిశయుఁడని మహాదేవుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

—o—

## సూర్యరథము.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౨

ఇత్యేష ఏకచక్రేణ సూర్యస్తూర్ణం రథేనతు। భద్రైస్తైరక్షతైరశ్వైః సర్పతేఽసౌదివిక్షయే॥ ౪౩ ॥ అహోరాత్రాద్రథేనాసౌ ఏకచక్రేణ తుభ్రమన్॥ సప్తద్వీపసముద్రాంతం సప్తభిః సప్తభిర్హయైః॥ ౪౪ ॥ ఛందోభిరశ్వరూపైస్తైర్యతశ్చక్రం తతః స్థితైః। కామరూపైః సకృద్యుక్తైరమితైస్తైర్మనోజవైః॥ ౪౫ ॥ హరితైరవ్యయైః పింగైరీశ్వరైర్బ్రహ్మవాదిభిః। అశీతిమండలశతం భ్రమం త్వబ్దేన తేహయాః॥ ౪౬ ॥ బాహ్యమభ్యంతరంచైవ మండలం దివసక్రమాత్। కల్పాదా సంప్రయుక్తాస్తే వహంత్యాభూతసంప్లవాత్। ఆవృతా వాలఖిల్యైస్తే భ్రమంతే రాత్ర్యహానితు॥ ౪౭ ॥ గ్రథితైర్వచోభిరగ్ర్యైః స్తూయమానో మహర్షిభిః। సేవ్యతే గీతనృత్యైశ్చ గంధర్వైరప్సరోగణైః। పతంగః పతగైరశ్వై ర్భ్రమమాణో దివస్పతిః॥ ౪౮ ॥ వీథ్యాశ్రయాణి చరతి నక్షత్రాణి తథా శశీ। హ్రాసవృద్ధీ తథైవాస్య రశ్మీనాం సూర్యవత్ స్మృతే॥ ౪౯ ॥

సూర్యుఁడేకచక్రమును నక్షత భద్రాశ్వములుగల రథమునెక్కి యాకాశమందు సప్తద్వీప సప్తసముద్రాంతము అహోరాత్రములు చుట్టుచుట్టి తిరుగుచున్నాఁడు ఈలాగున తనరథచక్రమేవైపునకుండునో ఆవైపునకే నడచుచు కామరూపములుగలిగి మనోవేగముతోను, ఆకుపచ్చనిరంగులుఁగలిగి వేదములను పఠించుచున్న ఛందోఽశ్వములచేఁ దిరుగుచుండును. ఈ ఛందోఽశ్వములు నూటయెనుబది

మండలములు నొకసంవత్సరకాలములోఁ దిరిగివచ్చుచుండును. ఈమండలముల బాహ్యాంతరములందుండి క్రమానుసారము తిరుగుచుండును. ఈఛందోఽశ్వములు కల్పాదియందుఁ గట్టఁబడియున్నందుచేత మఱలభూతప్రళయమగువఱకు నీలాగుననే నిలువక తిరుగుచునేయుండును. మఱియు నీఛందోశ్వములఁజుట్టుచుట్టి అఱువదివేల వాలఖిల్యాది మహర్షులు తిరుగుచుందురు. సూర్యరథమునకు ముందుభాగమున ప్రసిద్ధములు అపౌరుషేయములునగు వేదవాక్యములచే మహర్షులు స్తుతించుచుందురు. సూర్యుఁడు గంధర్వాప్సరోగణములచే గీతనృత్యాదులచే సేవింపఁబడుచున్నవాఁడగుచుండును. ఈలాగున దివాకరుఁడగు నాసూర్యుఁడు పతంగుఁడను పేరుగలవాఁడై గాలిపడగలవంటి పతంగములగు అశ్వములచే శింశుమారములోఁగల అజ గజ, వైశ్వానరవీధుల నాశ్రయించిన నక్షత్రముల నాశ్రయించి తిరుగుచుండును. ఇటులనే చంద్రుఁడుగూడ తిరుగుచుండును. సూర్యునికి అహర్భాగములందుండు హ్రాసవృద్ధులవలెనే చంద్రునికిగూడ తనకళారశ్మలకుఁగల హ్రాసవృద్ధులు తిథిక్రమములుగ నగుచుండును ఇందుకు వేదములందుఁబ్రమాణములు 'సువర్ణంఘర్మ' మనువాకమునందును, ఛాందోగ్యము మొదలుగా ననేకస్థలములందు సుప్రసిద్ధములుగ నున్నవి

—o—

## సూర్యరశ్మలవివరము,

---

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౩ - పుట. ౮౦.

సాహస్రపాదః సోఽగ్నిస్తు వృత్తః కుంభనిభః శుచిః। ఆదత్తే తత్తురశ్మీనాం
సహస్రేణ సమంతతః॥ ౧౮ ॥ నాదేయీశ్చైవ సాముద్రీః కౌప్యాశ్చైవ సధాన్వ
నీః। స్థావరా జంగమాశ్చైవ యశ్చసూర్యో హిరణ్మయః। తస్యరశ్మిసాహస్రంతు
వర్షశీతోష్ణనిః స్రవం॥ ౧౯ ॥ తాసాంచతుశ్శతా నాడ్యోవర్షంతి చిత్రమూర్తయః
వందనాశ్చైవ వంద్యాశ్చ ఋతనా నూతనస్తథా। అమృతానామతః సర్వారశ్మయో
వృష్టి సర్జనాః॥ ౨౦ ॥ హిమవాహాశ్చ తాభ్యోఽన్యా రశ్మయస్త్రిశతాః పునః।
దృశ్యామేధ్యాశ్చ వాహ్యాశ్చ హ్రాదినోహిమసర్జనాః॥ ౨౧ ॥ చంద్రాస్తానామ
తః సర్వాః పీతాభాస్తు గభస్తయః। శుక్లాశ్చ కకుభశ్చైవగావో విశ్వభృతస్త
థా॥ ౨౨ ॥ శుక్లాస్తానామతః సర్వాస్త్రిశతా ఘర్మసర్జనాః। సమంబిభర్తి తాభిస్తు

మనుష్యాః పితృదేవతాః॥ ౨౩ ॥ మనుష్యానౌషధేనేహ స్వధయాచపితౄనపి। అమృతేన సురాన్ సర్వాన్ త్రీం త్రిభిస్తర్పయత్యసౌ॥ ౨౪ ॥ వసంతేచైవగ్రీష్మేచ సతైః సుతపతేత్రిభిః। వర్షాస్వథో శరదిచ చతుర్భిః సంప్రకర్షతి॥ ౨౫ ॥ హేమంతే శిశిరేచైవ హిమం సస్పృజతే త్రిభిః। ఓషధీషు బలంధత్తే స్వధయాచ పితౄనపి। సూర్యోఽమరత్వ మమృత త్రయం త్రిషునియచ్ఛతి॥ ౨౬ ॥ ఏవంరశ్మి సహస్రంతత్ సౌరం లోకార్థసాధకం। భిద్యతేఋతుమాసాద్య జలశీతోష్ణనిస్రవం॥ ౨౭ ॥ ఇత్యేతన్మండలం శుక్లం భాస్వరం సూర్యసంజ్ఞితం। నక్షత్రగ్రహ సోమానాం ప్రతిష్ఠాయోనిరేవచ। ఋక్ష చంద్రగ్రహాః సర్వేవిజ్ఞేయాః సూర్యసంభవాః॥ ౨౮ ॥

సహస్రకిరణుఁడగు నాసూర్యుఁడు కుంభమువలె వృత్తాకృతిగలిగి శుచియని పేరుగలవాఁడై నాఁడు. ఆయఁగ్నిమండలరూపమే సహస్రకిరణముల నన్నివైపుల నుండి సమస్తమును నాకర్షించుచున్నది. ఆరశ్మలభేదములు నాదేయములు అనగా నదీనదసంజ్ఞలుగను సముద్రసంబంధములుగను కూపసంబంధములుగను సుధన్యసంజ్ఞలుగను స్థావరజంగమములుగను నుండును. వీనిమూలము సువర్ణమయసూర్యుఁడే సూర్యసహస్రరశ్మలు వర్షశీతోష్ణములను బ్రసరింపఁజేయుచున్నవి. వాటిలో నాలుగువందల కిరణనాడులు చిత్రమూర్తులుగలవై వర్షించుచున్నవి. మరికొన్ని వందలసంజ్ఞగలవియై నమస్కరింపఁబడుచు నవీనములగు కర్మఫలములనుసృజించుచు అమృతసంజ్ఞగలిగి వర్షమునుసృజించుచున్నవి. తక్కిన మూడువందల రశ్మలు మంచును వహించుచున్నవి. అవి త్వగింద్రియములకు స్పర్శనీయములై హ్రాదినులను సంజ్ఞతో హిమమును సృజించుచున్నవి ఆకిరణములు చంద్రసంజ్ఞఁబచ్చని కాంతిగలవగుచున్నవి. తెల్లరశ్మలు డిక్కులనెడి పేరుతో విశ్వమును భరించుచున్నవి. మూఁడువందల రశ్మలు శుక్లసంజ్ఞచే వేడినిసృజించుచున్నవి. రశ్మలచేతనే సూర్యుఁడు మనుష్యులను బితృదేవతలను సమముగా భరించుచున్నాఁడు. మనుష్యుల నోషధులచేతను, స్వధాశక్తిచేఁబితృదేవతలను అమృతముచే సురలను దృప్తినొందించుచున్నాఁడు. వసంతగ్రీష్మర్తువులందు నామూఁడువిధముల రశ్మలచే నధికముగఁ దపింపఁజేయుచున్నాఁడు. వర్షశరదృతువులయందు నాలుగు విధములగు రశ్మలచే నాకర్షించుచున్నాఁడు. హేమంతశిశిరఋతువులందు మూఁడువిధములగు రశ్మలచే మంచును సృజించుచున్నాఁడు. స్వధాశక్తిచేఁబితరుల నుద్దేశించి ఓషధులకు బలమునిచ్చుచున్నాఁడు. ఇట్లుసూర్యుఁడు దేవపితృమనుష్యులఁ దృప్తి

నొందించుచున్నాఁడు. ఈప్రకారము సూర్యరశ్మిసాహస్రము లోకులకు అర్థసాధకమగుచున్నది. సూర్యుఁడే నక్షత్రములకు, గ్రహములకు చంద్రునకు సృష్టిస్థితి కారణుఁడగు చున్నాఁడు.

రవేరశ్మి సహస్రం యత్తుప్రాఙ్మయా సముదాహృతం। తేషాం శ్రేష్ఠాః పునః సప్తరశ్మయోగ్రహ యోనయః॥ ౪౪ ॥ సుషుమ్నో హరికేశశ్చ విశ్వకర్మాతథైవచ। విశ్వశ్రవాః పునశ్చాన్య, సంపద్వసురతః పరం। అర్వావసుః పునశ్చాన్యో మయాచాత్రి ప్రకీర్తితః॥ ౪౫ ॥ సుషుమ్నః సూర్యరశ్మిస్తు క్షీణం శశినమేధయత్ తిర్యగూర్ధ్వప్రభావోऽసౌ సుషుమ్నః పరికీర్త్యతే। ౪౬ ॥ హరికేశః పురస్త్వాద్యా ఋక్షయోనిః ప్రకీర్త్యతే। దక్షిణేవిశ్వకర్మాతు రశ్మిర్వర్ధయతేబుధం॥ ౪౭ ॥ విశ్వశ్రవాస్తు యఃపశ్చాత్ శుక్రయోనిః స్మృతోబుధైః। సంపద్వ సుశ్చయోరశ్మిః సయోనిర్లోహితస్యచ॥ ౪౮ ॥ షష్ఠస్త్వర్వావసు రశ్మియోనిస్తు సబృహస్పతేః। శనైశ్చరం పునశ్చాపి రశ్మిరాప్యాయతే స్వరాట్॥ ౪౯ ॥ ఏవంసూర్యప్రభావేణ గ్రహనక్షత్రతారకాః। వర్ధంతే విదితాః సర్వా విశ్వం చేదం పునర్జగత్॥

సూర్యరశ్మిసహస్రములలో శ్రేష్ఠములగు నేడురశ్ములే గ్రహయోనులు. అవి ౧ సుషుమ్న, ౨ హరికేశము, 3 విశ్వకర్మ, ౪ విశ్వశ్రవసువు, ౫ సంపద్వసువు, ౬ అర్వావసువు, ౭ స్వరాట్టు అనఁబడును. ౧ సుషుమ్నయనుపేరుగల సూర్యరశ్మి క్షీణుఁడగుచంద్రుని వృద్ధినొందించుచున్నదై తిర్యగూర్ధ్వగతి ప్రభావుఁడుగఁ జెప్పఁబడుచున్నాఁడు. దీనినిఅగ్నిప్రధానోర్ధ్వగతిగను, సూర్యప్రధానతిర్యగ్గతిగను దెలియవలెను. ౨ హరికేశమనుపేరుగల సూర్యరశ్మి నక్షత్రయోనియని చెప్పఁబడుచున్నది. 3 దక్షిణభాగమందు విశ్వకర్మయను పేరుగల మూఁడవరశ్మి బుధుని సంబర్ధజేయుచున్నది. ౪ విశ్వశ్రవసువను నాలుగవరశ్మి పశ్చిమభాగమందు శుక్రయోనియని చెప్పఁబడుచున్నది. ౫ సంపద్వసువను అయిదవరశ్మి అంగారక గ్రహమునకు యోనియగుచున్నది. ౬ అర్వావసువను నారవరశ్మి బృహస్పతిగ్రహయోనియనియు. ౭ స్వరాట్టనెడు నేడవనూర్యాత్మరశ్మి శనైశ్చరుని ఆప్యాయనము చేయుచున్నది. ఇట్లుసూర్యప్రభావ రశ్ములచేత నే గ్రహనక్షత్రతారలన్నియు ప్రకాశింపఁజేయఁబడుచు వృద్ధినిఁబొందుచు కల్పాద్యంతములయందు విశ్వజగత్త్రయముఁ జెప్పబడుచున్నవి.

---

# సూర్యునియందుగల విష్ణుశక్తి ఇతరవిషయాదులు.

---

శ్రీవిష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యా. ౧౧

మాసిమాసి రవిర్యోయ స్తత్రతత్ర హిసాపరా। త్రయీమయీ విష్ణుశక్తి రవస్థానం కరోతిహి॥ ౯ ॥ ఋచస్తువంతి పూర్వాహ్ణే మధ్యాహ్నేచ యజూంష్యథ। బృహద్రథంతరాదీని సామాన్యహ్నః క్షయేరవిం॥ ౧౦ ॥ అంగమేషా త్రయీవిష్ణోః ఋగ్యజుస్సామ సంజ్ఞితా। విష్ణుశక్తిరవస్థానం సదాదిత్యేకరోతిసా॥ ౧౧॥ నకేవలం రవేశ్శక్తి ర్వైష్ణవీ సాత్రయీమయీ। బ్రహ్మాధపురుషో రుద్రస్త్రయమేతత్త్రయీమయీ॥ ౧౨॥ సర్గాదావృఙ్మయో బ్రహ్మాస్థితౌ విష్ణుర్యజుర్మయః। రుద్రస్సామ మయోంతాయ తస్మాత్తస్యాశుచి ర్ధ్వనిః॥ ౧౩ ॥ ఏవం సాసాత్వికీ శక్తిర్వైష్ణవీ యా త్రయీమయీ। ఆత్మసప్తగణస్థంత భాస్వంతమధి తిష్ఠతి॥ ౧౪ ॥ తయాచాధిష్ఠితస్సోపి జాజ్వలీతి స్వరశ్మిభిః॥ తమస్సమస్తజగతాం నాశంనయతి చాఖిలం॥౧౫॥ స్తువంతి చైనంమునయో గంధర్వైర్గీయతే పురః। నృత్యం త్యప్సరసోయాంతి తస్యచాను నిశాచరాః॥ ౧౬ ॥ వహంతిపన్నగాయక్షైః క్రియతే భీసుసంగ్రహః। వాలఖిల్యాస్తథైవైనం పరివారత్యమాసతే॥ ౧౭ ॥ నోదేతానాస్తమేతా చకదాచిచ్ఛక్తిరూపధృత్। విష్ణుర్విష్ణోః పృథక్తస్య గణస్సప్త విధోవ్యయం॥ ౧౮ ॥ స్తంభస్థదర్పణస్యైతియోయ మాసన్నతాంపరః। ఛాయాదర్శన సంయోగం ససప్రాప్నోత్యథాత్మనః॥ ౧౯ ॥ ఏవంసావైష్ణవ శక్తిర్నైవాపైతి తతోద్విజ। మాసాను మాసం భాస్వంతం మధ్యాస్తె తత్రసంస్థితం॥ ౨౦ ॥ పితృదేవ మనుష్యాదీన్ ససదాప్యాయ యన్ ప్రభుః। పరివర్తత్యహోరాత్రకారణం సవితాద్విజ॥ ౨౧ ॥ సూర్యరశ్మి సుషుమ్నాయా స్తర్పితస్తేన చంద్రమాః। కృష్ణపక్షేzమరైశ్శశ్వ త్పీయతేవై సుధామయః॥ ౨౨ ॥ పీతం తం ద్వికలం సోమం కృష్ణపక్షక్షయేద్విజ। పిబంతి పితరస్తేషాం భాగధేయం తథా॥ ౨౩ ॥ ఆదత్తే రశ్మిభిర్యంతు క్షితిసంస్థం రసం రవిః। తముత్సృజతి భూతానాం పుష్ట్యర్థం సస్యవృద్ధయే॥ ౨౪ ॥ తేనప్రీణా త్యశేషాణి భూతాని భగవాన్ రవిః। పితృదేవ మనుష్యాదీనేవ మాప్యాయయత్యసౌ॥ ౨౫ ॥ పక్షతృప్తింతు దేవానాం పితౄణాం చైకమాసికీం। శశ్వత్తృప్తించ మర్త్యానాం మైత్రేయార్కః ప్రయచ్ఛతి॥ ౨౬ ॥

ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే ఏకాదశోధ్యాయః.

ప్రతిమాస ఋతువులందును మార్పుజెందుచున్నట్లగపడుచున్న సూర్యుడె చ్చటుండినను త్రియీగుణాత్మకమగు విష్ణుశక్తియు నచ్చటనేయుండి ప్రకాశించుచుండును ఋగ్వేదమంత్రములు ఉదయమునను, మధ్యాహ్నమందు యజుర్వేద మంత్రములును బృహద్రథంతరాది సామములు సాయంకాలమునను, త్రివేద స్వరూపుడగు నీసూర్యుని స్తుతించుచుండును. ఈ వేదత్రయాత్మక సూర్యస్వరూప విష్ణువనకు అంగరూపకముగా మణివలెశక్తియు బ్రకాశించుచుండును. త్రిమూర్తి స్వరూపుడనగ బ్రహ్మ, విష్ణు, రుద్రస్వరూపుడని తెలియవలెను.

సృష్టియందు ఋగ్వేదమయుడగు బ్రహ్మగను, స్థితియందు యజుర్వేదాత్మక విష్ణుమూర్తిగను. సంహారమందు సామవేదాత్మక రుద్రుడుగను నీసూర్యుడేయగుచుండును. మాసాంతమందురుద్రదైవత్య పితృకల్పమగు దర్శయందువలె నవవధూ గృహప్రవేశాది కార్యములు నిషేధింపబడి పితృకార్యాదులు చేయబడుచున్నవి. మనుస్మృతియందు అనధ్యాయ ప్రకరణములో బైకారణములచే సామములు నైమిత్తికముగా నితర వేదవాక్కులకు లయమగుటచే అశుచియని చెప్పబడుచున్నవి. త్రియీమూర్తియగు నీసూర్యునియందు సప్తలోకపాలగణములుగూడ అధిష్ఠించియున్నందుచేత తనరశ్మలచే దానును స్వయంప్రకాశుండై సకలలోకములను బ్రకాశింపజేయుచుండును.

సూర్యుని ముందుభాగమున, మునులుస్తుతించుచుందురు. గంధర్వులుగానము చేయుచుందురు. అప్సరసలు నృత్యములుచేయుచుందురు. వెనుకపార్శ్వమున నిశాచరులచే అనుగమింపబడుచుండును. పన్నగములు వాజులపగ్గములుకాగా యక్షులు రశ్మలధరింపగ వాలఖిల్యాదిమహర్షి పరివారములతో రథము నడుచుచుండును విష్ణుశక్తిచే అధిష్ఠింపబడిన సూర్యుడు ఉదయాస్తమయములులేక అనంతరూపుడైయున్నాడు. సూర్యునకు భిన్నముగ మరియొకసప్తవిధ గణముగలదు. ఈ సప్తగణములు స్తంభమునకు వ్రేలాడగట్టిన అద్దమువలె వికృతిగనుండును. వీరలను దర్శించువారలు ఆత్మచ్ఛాయా దర్శనమగు రోగమును బొందుదురు. ఈవికృతి సప్తకమందుగూడ నీవైష్ణవీశక్తి అధిష్ఠించియుండును. ఈలాగు నాసూర్యుడు అహోరాత్రి కాలకర్మాత్మక కారణభూతుడైనందుచేత సవితయనికూడ జెప్పబడుచున్నాడు. సూర్యరశ్మియగు సుషుమ్నా నాడివలననే చంద్రుడు సంపూర్ణుడై శుక్లమందంతయు సుధామయుడై కృష్ణపక్షమునందు దేవతలచే పానముచేయబడును. మిగిలిన కళాద్వయమును పితరులుపానముచేయగ శేషకళ మరల సూర్యునిచే

ఆప్యాయితమై వృద్ధినిఁబొందును. ఈలాగున వృద్ధిపొంది భూమియందుఁగల సర్వరసములను తనరశ్మిలచే నాకర్షించుచు మరల నారసముసే భూతముల పుష్టికొరకు సుషుమ్నా నాడిద్వార విడుచుచు నోషధీపోషణ మొనరించును. అందుచేత సర్వజీవరాశికి పోషకుఁడై పితృ, దేవమనుష్యాదులకుగూఁడ ఆప్యాయనము చేయుచుండును. దేవతలకు ఁబక్షతృప్తిగను, పితురులకు మాసతృప్తిగను మర్త్యులకు సర్వదాతృప్తి కరుఁడుగనున్నాడు.

—o—

## హిరణ్యగర్భ మార్తాండ వివరము.

శ్రీమద్భాగవతం - స్కంధం ౫ - అధ్యా. ౨౦.

అండమధ్యగత స్సూర్యోద్యావా భూమ్యోర్యదంతరం। సూర్యాండగోళయోర్మధ్యే కోట్యస్స్యుః పంచవింశతిః॥ ౪౨ ॥ మృతేండ ఏష ఏతస్మిఁ యత్తో మార్తాండ ఉచ్యతే హిరణ్యగర్భ ఇతియద్ధి రణ్యాండ సముద్భవః॥ ౪౩ ॥ సూర్యేణహి విభజ్యాన్తే దిశఃఖం ద్యౌర్మహీభిదా। స్వర్గాపవర్గ నరక రసౌకాంసిచ సర్వశః॥౪౪॥ దేవతిర్యఙ్మనుష్యాణాం సరీసృప్ససవీరుధామ్। సర్వజీవనికాయానాం సూర్యఆత్మా దృగీశ్వరః॥ ౪౫ ॥

మనస్సృష్టికి ఆకాశమందగపడుచున్న సూర్యుఁడు తనమాయచే రచింపఁబడిన నానాలోక పరిణామ ప్రవృత్తిననుసరించి లోకసంరక్షణార్థముగఁ బ్రకాశించుచున్నాఁడు. వేదప్రమాణము "ఉతైనంగోపాలదృశన్న దృశన్నుదహార్యః। ఉతైనం విశ్వాభూతాని సదృష్టోమృడయాతినః।" అని శ్రీరుద్రప్రపారకమంత్రి మీయర్థముసే తెలుపుచున్నది. దీనిచేఁబ్రకాశశూన్యమగు అలోకమునుగూడ జెప్పఁబడినది. అనఁగా ఆత్మానుభవములేని జన్మమే అలోకమనిస్పష్టము.

భూరాది సత్యలోకాంతము సప్తవ్యాహృతులతోఁగలదు. మధ్యలోనున్న మహర్లోకము సర్గప్రతిసర్గ వైభవముచే నొకబ్రహ్మాండమని చెప్పఁబడుచున్నది. ఈ బ్రహ్మాండమధ్యలో మార్తాండుఁడని చెప్పఁబడుచున్న ఈవ్యవహారసూర్యుఁడు శాస్త్రములకంతకుఁ బరమార్థసూర్యుఁడై పంచాశత్కోటి యోజనవిస్తారమగు నీబ్రహ్మాండమునులో అర్థమాత్రమేబ్రకాశింపఁ జేయుచున్నాఁడు. ఇతఁడు హిరణ్యగర్భసంజాతుఁడైనందుచేతఁ దనప్రకాశముచే గైరికమగుబంగారు పుటములతో నెట్లుపరిశుద్ధ

మగునో యటులనే యీద్యావాపృథ్వ్యులనంతయు హిరణ్యరూపము నొందించును. ఈసూర్యునిచేతనే దిక్కులు, ద్యావాభూమ్యంతరాళములు, స్వర్గ, నరకలోకాదులును మోక్షమును మర్త్యపాతాళాదులును ద్వంద్వాదులగు సర్వమును గలుగుచుండును. ప్రమాణము "దీర్ఘస్స్వప్న స్ఫురంత్యేతే స్వర్గమోక్షాది విభ్రమాః। స్వప్నస్థరాజ్యభిక్షాభ్యాం యోగీనస్పృశ్యతేసదా॥"

సర్వలోకాదులకును సర్వజీవరాసులకును సత్యమగు మహల్లోకసూర్యుఁడే ఆత్మయనియు, దృక్కనియు, ఈశ్వరుఁడనియు దెలుసుకొనునంతవఱకు నీసూర్యుఁడుపాస్యుఁడై యున్నాఁడు. ప్రమాణము "సూర్యఆత్మాజగతః"

—o—

# సూర్యగతి కాలగతి విశేషము.

శ్రీమద్భాగవతం - స్కం. ౫ - అధ్యా. ౨౧.

శ్రీశుకః- చూ॥ ఏతావానేవ భూవలయస్య సన్నివేశః ప్రమాణలక్షణతో వ్యాఖ్యాతః ఏతేనహిదివోమండలమానం తద్విద ఉపదిశంతి యథాద్విదళయో ర్నిష్పావాదీనాం తదంతరేణాంతరిక్షం తదుభయసంధితం యన్మధ్యగతో భగవాం స్తపతాంపతిస్తపన ఆతపేన త్రిలోకీం ప్రతపత్యవభాసయత్యాత్మభాసా॥ ౧ ॥ సఏష ఉదగయన దక్షిణాయన వైషువత సంజ్ఞాభిరారోహణావరోహణాభ్యాం మందశీఘ్రసమానాభిర్గతి భిరారోహణా వరోహణ సమస్థానేషు యథాసవనమభిపద్యమానో మకరాదిషు రాశిష్వహోరాత్రాణీ దీర్ఘహ్రస్వ సమానాని విధత్తే॥ ౨ ॥ యదా మేష తులయోర్వర్తతే తదాహోరాత్రాణి సమానిభవంతి॥ 3 ॥ యదావృషభాదిషు పంచసు రాశిషుచరతి తదాహాన్యేవ వర్ధంతే హ్రసతిచ మాసిమాస్యేకా ఘటికా రాత్రిషు యదావృశ్చికాదిషు పంచసువర్తతే తదాహోరాత్రాణి విపర్యయాని భవంతి॥ ౪ ॥ యావద్దక్షిణాయన మహానివర్ధంతే యావదుదగయనం రాత్రయః ఏవంనవకోటి య ఏకపంచాశల్లక్షాణిచ యోజనానాం మానసోత్తరగిరి పరివర్తన స్యోపదిశంతి॥ ౫ ॥ తస్మిన్నైంద్రీం పురీం పూర్వస్మాన్మేరో ర్దేవధానీం నామ దక్షిణతో యామ్యాం సంయమనీం నామ- పశ్చాద్వారుణీ నిమ్లోచనీం నామ- ఉత్తరతస్సౌమ్యాం విభావరీం నామ॥ ౬ ॥ తాసూదయ మధ్యాహ్నాస్తమయ నిశీ

ఘానీతి భూతానాం ప్రవృత్తి నివృత్తి నిమిత్తాని- సమయవిశేషేణ మేరోశ్చతుర్దిశం తత్రత్యానాం దివసమధ్యగత ఏవ సదాదిత్యస్తపతి- సవ్యేనాచలం చలన్ దక్షిణేన కరోతి॥ ౭। యతోద్రేతి తస్యహిసమాన సూత్రనిపాతే నిమ్లోచతి- యత్రక్వచన స్యందే నాభితపతి తస్యహ్యేష సమానసూత్ర నిపాతే ప్రస్వాపయతి- తత్రగతం నపశ్యంతి- యేతమనుపశ్యేరన్॥ ౮ ॥ యదాహైంద్ర్యాః పుర్యాః ప్రచలతి- పంచ దశ భిర్ఘటికాభిర్యామ్యాం- సపాదకోటిద్వయం యోజనానాం సార్ధద్వాదశ లక్షాణి సాధికానిచోపయాతి- ఏవం తతో వారుణీం సౌమ్యామైంద్రీం చ పునః తథాన్యేచ గ్రహాస్సోమాదయో నక్షత్రైస్సహజ్యోతిశ్చక్రే సమభ్యుద్యంతి సహ వాభినిమ్లోచంతి॥ ౧౦ ॥ ఏవం ముహూర్తేన చతుస్త్రింశల్లక్షయోజనాన్యష్ట శతాధి కాని సౌరోరథ స్త్రయీమయశ్చతసృషు పరివర్తతే పురీషు- యస్యైకంచక్రం ద్వాదశారం షణ్ణేమిత్రినాభి సంవత్సరాత్మకం సమామనంతి॥ ౧౧ ॥ తస్యాక్షో మేరోర్మూర్ధనికృతో మానసోత్తరే కృతేతర భాగోయత్ర ప్రోతం రవిరథచక్రం తైలయంత్ర చక్రవన్మానసోత్తర గిరౌ పరిభ్రమతి॥ ౧౨ ॥ తస్మిన్నక్షేకృతమూలో ద్వితీయోక్షస్తురీయమానేన సంమితస్తైలయంత్రాక్ష వద్ధ్రువేకృతో పరిభాగః॥౧౩ రథనీడస్తు షట్త్రింశల్లక్షయోజనాయతస్తురీయభాగ విశాలస్తు తావాన్ రవిరథ యుగః॥ యత్రహయాశ్ఛందో నామాన స్సప్తారుణయోజితావహంతి- దేవమా దిత్యం పురస్తాత్సవితు రరుణః పశ్చాచ్చనియుక్తస్సౌత్యకర్మణి కిలాస్తే॥ ౧౪ ॥ తథావాలఖిల్యా ఋషయోంగుష్ఠ పర్వమాత్రాః షష్టిసహస్రాణి పురతస్సూర్యం సూక్తవాకాయ నియుక్తాస్సంస్తువంతి॥ ౧౫ ॥ తథాన్యేచర్షయో గంధర్వాప్సరసో నాగాగ్రామణ్యో యాతుధానాదేవా ఇత్యేకైకశోగణాస్సప్త చతుర్దశ రథస్థో మాని మాసిమాసి భగవంతం సూర్యమాత్మానం నానా నామానః పృథజ్నానః పృథక్కర్మభిః ద్వంద్వశఉపాసతే॥ ౧౬ ॥ లక్షోత్తర సార్ధనవకోటియోజన పరిమం డలం భూవలయం యస్యక్షణేన ద్విశత గవ్యూత్యుత్తర ద్విసాహస్రయోజనాని సభుఙ్క్తే॥ ౧౭ ॥

ఇతి శ్రీమద్భాగవతే - పంచమస్కంధే - ఏకవింశోధ్యాయః.

రాజా యదేతద్భగవత ఆదిత్యస్య మేరుంధ్రువంచ ప్రదక్షిణేన పరిభ్రమతో రాశీనామభిముఖం ప్రచలితం భవతోక్తం వర్ణితం అముష్యవయం కథమను మిమీ మహీతి॥ ౧ ॥ సహోవాచ యథాకులాలచక్రేణ పరిభ్రమతా సహ భ్రమతాంత దాశ్రయాణాం పిపీలికాదీనాం గతిరన్యైవ ప్రదేశాంతరేష్వప్యుపలభ్యమానత్వాత్

ఏవంనక్షత్రరాశిభి రుపలక్షితేన కాలచక్రేణ ధ్రువం మేరుంచ ప్రదక్షిణేన పరిధావతా సహపరిధావమానానాం తదాశ్రయాణాం సూర్యాదీనాం గ్రహాణాం గతిరన్యైవ నక్షత్రాంతరే రాశ్యంతరే చోపలభ్యమానత్వాత్ ॥ ౨॥ సఏషభగవానాది పురుషఏవ సాక్షాన్నారాయణో లోకానాం స్వస్తయ ఆత్మానం త్రయీమయం కర్మవిశుద్ధి నిమిత్తం కవిభిరపి వేదేన జిజ్ఞాస్యమానో ద్వాదశధా విభజ్య షట్సు వసంతాదిషు ఋతుషు యథోపజోషం ఋతుగుణాన్ విదధాతి॥ 3 ॥ తమేనమిహపురుషా స్త్రయ్యా విద్యయా వర్ణాశ్రమాచారానుపథా ఉచ్చావచైః కర్మభిరామ్నాతైర్యోగ వితానైశ్చ శ్రద్ధయా యజంతోఞ్జసా శ్రేయ స్సమధిగచ్ఛంతి॥౪

శ్రీధరవ్యాఖ్యానము:-

తమితి వర్ణాశ్రమాచా రానువర్తినః పురుషాః త్రయ్యా ఆమ్నాతైః కర్మభిః ఇంద్రాదిరూపం యోగవితానైశ్చ ధ్యానాదిభిః అంతర్యామిరూపం పూజయంతః

అథఏష ఆత్మలోకానాం ద్యావాపృథివ్యోరంతరేణ నభోవలయస్య కాలచక్రగతో ద్వాదశమాసాన్ భుఙ్క్తే రాశిసంజ్ఞాన్ సంవత్సరావయవాన్ మాసం పక్షద్వయం సపాదఋక్షద్వయం దివానక్తం చేతివదంతి॥ ౫ ॥ యావతాకాలేన షష్ఠమంశం భుంజీత సవాఋతు రిత్యుపదిశంతి సంవత్సరావయవః అథ యావతార్ధేన నభోవీథ్యాం ప్రచరతి తంకాల మయన మాచక్షతే॥ ౬ ॥ అథచయావన్నభో మండలం సహద్యావాపృథివ్యోర్మండలాభ్యాం కార్త్స్న్యేన సహభుంజీత తంకాలం సంవత్సరం పరివత్సర మిడావత్సర మనువత్సర మిద్వత్సర మితిభానో ర్మాంద్య శైఘ్ర్యసామ్యగతిభిస్సమామనంతి॥ ౭ ॥

ద్విదళబీజముల ద్విదళసంధియందు ద్విదళయుతమగు, అంకుర, పత్రపుష్పాదులవలె నాయాలోకాంతరాళములున్నవి. అంతరిక్షము నాయాలోక సంధినిహిత ధ్రువోదయరూపముగ ఉపసంధితమైయున్నది. ఆయాలోకముల అంతరిక్ష మధ్యగతుఁడై సర్వప్రకాశాధిపతియు, షడ్గుణైశ్వర్య సంపన్నుఁడగు సూర్యభగవానుఁడు, తనఆతపముచేఁ దాఁబ్రకాశించుటయేకాక తనకాంతిచే సర్వమును బ్రకాశింపఁ జేయుచున్నాఁడు. ఈ సూర్యుఁడు ఉత్తరదక్షిణ విషువాఖ్యయన పారిపద, విష్ణుపద సంజ్ఞలచే సంక్రాంతములగు నెనిమిది విధములగు గతులచే మందక్షిప్ర సమానములనెడి స్ఫుటాస్ఫుట మధ్యమ పరిమాణముగల దృగ్గోచర గతివిశేషముచే ఆరోహణావరోహణ గతులచేఁ దిక్కూటకాలచక్రముగఁ జెప్పబడుచున్నాఁడు త్రినాభిచక్ర

త్రివిధములగు గతిస్థానములయందు యథాసవనముగఁ బ్రాతర్మాధ్యందిన తార్తీయాకములనడి సవనత్రయ మతిక్రమించక మకరాదిగ వెనుకఁజెప్పిన లోకసంధి విహిత ధ్రువోదయము మొదలుగా నాయాద్వాదశ రాశిచక్రములం దహోరాత్రములను దీర్ఘహ్రస్వ సమమానములు కలుగఁజేసెను. గీత శ్లో॥ "సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః। రాత్రింయుగ సహస్రాంతాం తేఽహోరాత్ర విదో జనాః" ఈ విరాడ్బ్రహ్మ మానముయొక్క అహోరాత్ర పరిమాణము మొదలు మానుషాహోరాత్ర పర్యంత పరిమాణములవలె సర్వమానములున్నవి
శ్లో॥ బ్రాహ్మందివ్యం తథాపిత్ర్యం ప్రాజాపత్యం గురోస్తథా। సౌరంచసావనం చాన్ద్రమార్క్షం మానానినైవవ"అని జ్యోతిస్సిద్ధాంతములో నవమానములు చెప్పఁబడినవి. పారమార్థిక బ్రహ్మదైవత్యముగఁ బ్రద్యుమ్న ద్విజరాజగోళమని పిలువఁబడుచున్న కార్యబ్రహ్మమగు అభిజిన్నక్షత్రమానము మొదలు వ్యావహారిక నక్షత్రమానము వరకుఁగల నవవిధకాలమానముల ననుసరించి తాత్కాలిక దృగ్విపర్యయ శబ్దమాత్రము గ్రాహ్యములగు అహోరాత్ర పరిణామాదులు విపర్యయమునొందినవి. ఆయాలోక లోకాధిపతులకుఁ దదుపాసకులకుఁ దనదర్శనా దర్శనముల నిమిత్త మహోరాత్రములను సృజించినాఁడని "విధత్తే" శబ్దమునకర్థము.

ఇట్లు ద్వాదశమాస మాసాత్మకరాశి రశ్మికాలచక్రమందు దీర్ఘహ్రస్వాహోరాత్రముల భేదములు సామాన్యాకారముగఁ జెప్పఁబడినవి. ఇట్టికాలావయవ రాశిచక్రమందు సమవిషువ దహోరాత్ర సామ్యము మొదలు రాశ్యాదిగ మధ్యాంతములయందుండి దృగ్గోచరమగుచున్న సూర్యగతి ప్రకాశ ప్రకారమహోరాత్ర భేదమునుగూడ చెప్పచున్నాఁడు. ఎటులన దృగ్గతిననుసరించి, మేషతులారాసులందు సూర్యుడుండునది సమకాలము. "శ్లో॥ మహాయుగో వాస్తవసౌరవర్షః"అను జ్యోతిశ్శాస్త్రము ననుసరించి సూర్యుని సంవత్సర పరిమాణము ౪౩ ౨౦,౦౦౦. మానుషాబ్దములుగల దివ్యమహాయుగమే పారమార్థిక సౌరవర్షమానము. భౌమ మానవుని దృక్సూత్ర కాలచక్రమునం దగపడుచున్న శుక్లకృష్ణపక్ష భేదముననుసరించి కర్మచక్ర నితరదృష్టికిని మూడువందల యరువది సావనాహోరాత్ర పరిమాణముచేఁ గర్మదేవతలగు త్రైవర్ణికుల యజ్ఞార్థసిద్ధికొరకై ప్రతిమాస సంక్రాంతియందును నక్షత్రదైనందిన వృద్ధిహ్రాసాదుల ననుసరించి మేషాద్యయన సంక్రాంత్యాదులున్నవి. దీని ననుసరించియే పంచాంగములలో "మేషేరవిః, వృషభేరవిః"యని వ్రాయుచున్నారు. ఇట్టుదశాంశగల భౌమాక్షగతినే సూర్యునియందారోపించి పంచాంగములలో

వంద్రాదిధురాసుల సంక్రాంత్యాదులు మనదృష్టికి (మంచజనుల) గోచరించు చుండుట చేత అసూర్యుఁడే మేషతులారాసులయందుండి ప్రత్యక్షమగుచుండుటట్లు మానుషా హోరాత్రసంవత్సర మానపరముగ అర్థముచేయుచున్నారు. "వర్తతే"అను పదమున కీలాగున అర్థమును మార్పుచేయవలసియుండును. ఇట్లునవాంశ, ద్వాద శాంశ, త్రింశాంశలుగల రాశ్యంత చక్రభేదము ననుసరించి "వర్తతే"యను ధాత్వ ర్థములో జ్యోతిర్వ్యత్పత్త్యంశలుకూడ సృష్టిలో వృద్ధిని, సంహారముగా క్షయమును బొందుచుండునని తెలియవలెను. అటుల మేషతులారాసులయందుండునపు డహో రాత్రములు సమపరిమాణముగలవైయుండును.

ఈ ప్రకారము వృషభాది పంచ రాసులయందు సూర్యుఁడు సంచరించునపు డంతయు నొక్కొక్క ఘడియ పగలు పెరుగుటయు, రాత్రులందు దగ్గిపోవుటయుఁ దటస్థించును. ఇటులనే మరల వృశ్చికాది పంచరాసులయందు సూర్యుఁడు సంచ రించునపుడంతయు నొక్కొక్క ఘడియప్రకారము పగలు తగ్గుటయు, రాత్రులందు వృద్ధియగుటయుఁ దటస్థించును. భాగవతములో పోతనభాగవతోత్తముడు, "పంచ మస్కంధం రెండవఆశ్వాసమున 22-23 పద్యములందు"మేషతులలయందు మిహిరుం డహోరాత్రులందుఁ దిరుగు సమవిహారములను బరఁగ వృషభమాది పంచమా సముల నొక్కొక్క గడియరాత్రి దక్కునడచు 22. అది మొదలు వృశ్చికాది పంచ మాసముల నొక్కొక్క గడియ రాత్రి నిక్కనడచు దివములందు నెల్లదిగజారు నొక్కొక్క గడియ నెలకుఁదప్ప్రకారమునను 23."

ఇట్లు మానుషాబ్దముల కాలములననుసరించి కర్మదేవతలు మొదలుగా ఇం ద్రాది దేవతలవరకుఁగల దేవయుగములందుండువారల ననుసరించి మానభేదముల ప్రకారము కాలమునడచు చుండును.

## —♦ విశేషార్థము - అధ్యాత్మికము. ♦—

సూర్యుని మానసోత్తరగిరి ప్రవర్తనము నవకోటిసంఖ్యాకముగనున్నది. నవ విధ వర్గఖండాంత గుణిత మాతృకాక్షరములుగల వాస్తుమండప గృహరూపమునకు మూలాధారమగు ప్రణవాక్షరము ప్రకృతిరూపము. యోజనములతో ఏకపంచా శల్లక్షసంఖ్యయని అక్షరసాంఖ్య తత్వజ్ఞులు చెప్పుకొనుచున్నారు. పార్థివమాతృకాక్షర పీఠము సోమసూర్యాగ్ని దైవతముగ త్రిఖండోపేతమైయున్నది. ప్రతిఖండము త్రివృత్కరణముతో గుణకారముచేయఁగాఁ బ్రతిఖండమమందును, నవఖండాత్మకముగ

మాతృకావాస్తు మంటపరూపముగఁ బ్రణవాత్మక నక్షత్రసప్తవింశతి (3×9=27) రహస్యదశారూపముతో (బ్రణవదశాత్మక మాత్రమేయగును. అట్టిప్రణవ దశా రశ్మి చక్రము పద్మవ్యూహమును భేదించిన మహావీరునకు మాతృకావాస్తుమంటపమున నొకపార్శ్వమున ఆదిక్షాంతైక పంచాశన్మాతృకాక్షర రశ్మిరూపముగ సాత్త్వికప్రకాశ దివ్యకిరణములతో దేవతాపీఠముండును. మరొకపార్శ్వమునందు సామవేదమయమగు అవ్యక్తనాదమండలము ఏకాశీతిశాక్త పదపరిమాణముగల మాతృకావాస్తు మండపములో సగుణమాత్రమే తమోగుణ ప్రధానముతో లోకాలోకాచలము, చక్రవాళనామాంతరముతో నుండును. మానుషరశ్మిమండలాత్మకముగ భూచ్ఛాయా గ్రహమండలమగు రాహుకేతుమండలములు రెండుకోనలతో ఏకశరీరముగ శిరము రాహువుగను కబంధము కేతువుగను, ఏకశరీర సమనస్కగ్రహాష్టక సమష్టితో (బ్రణవాకృతిగ నవకోటియనంబడును వ్యష్టిరూపముతో ఏకపంచాశన్మాతృకాక్షర సముదాయయోగమందు (అక్షరసాంఖ్యయోగమందు) లక్ష్యశుద్ధినిఁగాని, తత్సిద్ధినిఁగాని సాధించిన సాధకుఁ సిద్ధియౌగిక యోగసిద్ధి. ఇది ఏకపంచాశల్లక్షయోజన శబ్దార్థరహస్యము. "శుక్రంతే అన్యద్యజతంతే అన్యత్" అనెడి శుక్రగ్రహ మూలమంత్ర వేదప్రమాణముచేతను, భగవద్గీతయందలి అక్షరపరబ్రహ్మయోగాష్టమాధ్యాయము, మరికొన్ని ఆప్తప్రమాణవచనములు బహుళముగనున్నవి.

ఆమానసోత్తర గిరియందే మేరువునకుఁ దూర్పుభాగమున "దేవధాని"యను పేరుగల ఇంద్రపురము, దక్షిణదిశయందు యమునిపట్టణమగు "సంయమినీ" పురియుఁ బశ్చిమమున "నిమ్లోచని"యను వరుణపురియు, ఉత్తరమున "విభావరీ"యను కుబేర పురియుఁగలవు. వీటికి సాంప్రదాయరహస్యార్థములున్నవి. ఇందులో ఉపదిశంతి యనుపదమీవిధమునే బోధించుచున్నది.

సూర్యుఁడింద్రపురమగు దేవధానినుండిక్రమముగ సంచరించుటలో, ఇంద్రపురమం దుదయించిన మనకుదయకాలమగును. యమపురియగు సంయమిలోనున్న మధ్యాహ్నమగును. పశ్చిమమునఁగల వరుణపురి నిమ్లోచనియందున్న సాయంకాలమగును. ఉత్తరదిక్కునున్న నడురాత్రియగును. భౌమగతియందుమాత్రమే యీలాగుననుండును. ప్రజలయొక్క అధికార తారతమ్యానుసారముగ మేరువునకుఁ జతుర్దిక్కులందున్నవారలకుఁ బ్రవృత్తి, నివృత్తి విశేషకర్మలుండును. మేరుమధ్యయందు మాత్రమచలగతిగనుండుటచేత అచ్చటనున్నవారలకు పూర్వముచెప్పిన "సహస్రయుగపర్యంత" ప్రమాణముగ బ్రహ్మదినమందుఁగూడ దివసమధ్యగతుండై

సదాప్రకాశించుచుండును. సూర్యుఁడుత్తరమార్గములో నున్నపుడు మానసోత్తర పర్వతము (చక్రవాళము) దక్షిణముగనున్నట్లును, సూర్యుఁడు దక్షిణమార్గమున నున్నపుడు మానసోత్తరపర్వత ముత్తరదిశనున్నట్లు గోచరించు. అంతరదృష్టి నెఱుఁగక బాహ్యప్రకృతిదృష్టితోమాత్రమే చూచుచుండితమ్మన్యులకు సూర్యుఁడింద్రజాలమువలెఁ జలనములేకపోయినను, జలనమున్నట్లు తనమాయచే లోకములను భ్రమపెట్టుచున్నాఁడు. దేవ, యమ, నక్షత్ర చక్రవిభాగము వేదప్రమాణములేకాక "శ్లో॥ అనులోమగతిర్నాస్థః పశ్యత్యచలావిలోమగం యద్వత్। అచలానిభానితద్వత్సమపశ్చిమగాని లంకాయాః॥" అని జ్యోతిశ్శాస్త్ర ప్రమాణవచనములున్నవి.

సూర్యుఁడుదయించునట్లగపడు స్థానమున కెదురుగ సమానస్థానమం దస్తమించునట్లగపడుచుండును. సూర్యుఁడే పురములోఁ దనరథముచే శిరోగతుఁడై తపింపఁజేయుచున్నట్లగపడునో యాదిక్కున కెదురుగానున్నవారిని గాఢసుషుప్తిలో నిద్రింపఁజేయుచుండును. ఈనలుదిక్కులలోఁదను తన ప్రాగ్దిక్కుయందుఁగాని పార్శ్వములందుఁగాని సూర్యునిఁజూడఁ గలిగినవారలు, ప్రత్యగ్గతుఁడైన యీసూర్యుని(ప్రత్యగాత్మను) సుషుప్తిదశలోఁ జూడలేవట్టే ప్రత్యగాత్మనుగూడ చూడలేనివారలగుదురు.

సూర్యుఁడు ఇంద్రపురినుండి బయలుదేరి పదునైదుఘడియలకు యమపురియందగపడును. దీనిప్రమాణయోజనములు పంద్రెండులక్షలు యేబదివేలు. ఇదిత్రినాభిచక్రోపాత్తరమార్గము. ఇంతదూరముగాని కొంచెమధికముగఁగాని సూర్యుఁడునడుచుచుండును. దినినే సపాదకోటిద్వయపరిమాణముగల అవ్యక్తప్రణవ ప్రకృతిగాఁ దెలియవలెను. ఈప్రకారగమే మరలయమపురినుండి వారుణపురివరకు నైప్రమాణయోజనసంఖ్య కాలఘడియలను ఇంద్రపురమువరకు వరుసగ గుర్తించవలెను. సూర్యునివలెనే సోమాదిగ్రహములన్నియును నక్షత్రములతోసహా జ్యోతిశ్చక్రమగు శింశుమారమందు గలసియే - ఉదయాస్తమయములతో నగపడుచుండును. "సూర్యఏకాకీచరతి చంద్రమాజాయతేపునః "నక్తందదృశ్రిరుహాచిద్దివేయుః" అని తారాగ్రహనక్షత్రాదుల గమనమునుగూర్చి వేదప్రమాణములుగలవు.

ఇట్లుసూర్యుని త్రియీజ్యోతిర్మయ రథగతి ముహూర్తకాలములో ముప్పదినాలుగులక్షలు యెనిమిదినూర్లయోజనములు. ఆసూర్యరథమున కొకేచక్రము, పంద్రెండంచులు, నారునేములు (ఇవేఋతుమాసములు) త్రినాభులు- (కాలత్రయ

ములు) ఇట్టివలయమునే సంవత్సరాత్మక చక్రమని వైదికులు చెప్పుచున్నారు. త్రినాభియును నానాంతరములుగల త్ర్యక్షచక్రము గలదగుటచే నారథము న్నతమగు ఉత్తరాక్షము మేరుశిఖరమందును; దక్షిణాక్షము మానసోత్తర పర్వత మందును గాలకర్ణంతోను, ఉభయత్రి తైలయంత్రమువలె మానసోత్తర పర్వత మందే తిరుగుచున్నట్లు లోకమున కగపడి పరిభ్రమింపఁజేయుచున్నది.

ఇట్లుభ్రామధ్రువాక్షమందు దీనికిమూలమగు రెండవఅక్షము, తురీయమాన పరమితమై ఉపరిభాగమందుఁగల తైలయంత్రమూర్ధ్వములోఁగలదానివలె దివ్యధ్రువ మందుఁ గృతోపరిభాగమందు సంబంధముగలదానివలె నిర్మింపఁబడినది. వివరము: తైలయంత్రమధ్యలోఁగల పెద్దరోలి మేరువు. ఈ భ్రమణమూలనుచుట్టు అర్ధభాగను నంటి తిరుగుచున్నదే మేరువునకును బంధముగల సూర్యరథాక్షము, ఈ పెద్దరోటిలో మధ్యలో ఎత్తుగాఁగల స్తంభముకొనయే ధ్రువమూలము దీనినంటి సంబంధముగ నున్నదేమరియొకఅక్షము. పెద్దమానురోలునకంటి అర్ధవలయముగ అవల నిడుపుగా నున్న కొననంటియున్నదే మానసోత్తరము.

ఇట్టిరవిరథనీడము (రథికుడు కూర్చుండదగినగూడు) ముప్పదియారులక్షల యోజన పరిమాణముగలది. ఆరథయుగము (కాడిమాను) తొమ్మిదిలక్షల యోజన పరిమాణముకలది. ఆరథమునకు ఛందస్సులనెడి పేరుగల యేడుముఖములుగాఁగల యొకేగుఱ్ఱము, అరుఁణుఁడను సారథిచే గట్టిబడినదై రథమును లాగుచుండును. ఈ అరుణుఁడు సూర్యుని రథసారథి. ఇతనే అనూరుడనికూడ బిలుతురు సూర్యుని ముందుభాగమందు అరువదివేలమంది వాలఖిల్యాదులంగుష్ఠపర్వపరిమాణులై సార సూక్తములను జెప్పుచుందురు. ఇటులనే యితరఋషులును గంధర్వాప్సరసలును, నానాగ్రమ నాయకులగు దేవయోని విశేషులును, యాతుధానులును మొదలగు పదునాలుగు గణములు గణదేవతలుగఁ బ్రతిమాసమందును రథభేదములతోను పరివార గణభేదములతోను స్తుతులతోను సకలజగదాత్మకుఁడగు సూర్యునిద్వాదశ మాసరూపభేదములుగఁగర్మభేదములతో ద్వంద్వభావములతో ఉపాసించుచున్నారు. ఆసూర్యుఁడు లక్షోత్తరసార్ధనవకోటి (౯,౫౧,౦౦,౦౦౦) యోజనపరిమండల మాన ముగల త్రిభువన భూవలయమును క్షణకాలములో ద్విశతగవ్యూత్యుత్తర ద్విసాహ స్రియోజనములను(౨౦౦౦ యోజనములు-౮౦౦ క్రోసులని) ఆక్రమించుచున్నాఁడు.

కుమ్మరివాని సారెవలె సృష్టిచక్రము కాలముతోఁజేరి పరిభ్రమించు చుండఁగాఁ గుమ్మరివానిచక్రమునాశ్రయించి అనులోమ ప్రతిలోమగతిగాఁ దిరుగు

చున్న పిపీలకాదులవలెనే సృష్టిస్థితిసంహారముల నిడి త్రినాభిగలజ్యోతిఃష్కాలచక్రము నాశ్రయించి గతిద్వయభేదములతోఁ బ్రవృత్తినివృత్తి ధర్మాధర్మగతి భేదముచేఁ బర్యాయపరివర్తనులగుదురు. ఈప్రకారజీవులగతి కాలచక్రముయొక్క మూఁడవ గతికంటె వేరుగనుండును. కాలచక్రము నాశ్రయించిన పిపీలికాదులవలె జీవు లీకాలచక్రము నాశ్రయించి స్థలభేదముచేతను గాలభేదముచేతను గతిభేదములతో నీస్థూలదేహమును మాత్రమే కాలాధీనముచేసి సూక్ష్మతైజసదేహముతో లింగభంగ మగువరకు నీకాలమునకు స్వాధీనులైయున్నారు. సూర్యుఁడును ఉదయాస్తమయాది గమనాగమనాభాసలచే సముద్రములోఁ బడవలను నడుపువానివలె నక్షత్రరాశ్యాదులతోను శింశుమారముతోనుగూడి వ్యావహారిక కాలచక్రముచేదివ్యధ్రువమును, మేరువును, బ్రదక్షిణముగఁ దాను దిరుగుచున్నట్లు గనుబడుచు లోకములను బరిభ్రమింపఁజేయుచున్నాఁడు. ఇటులనే యాదివ్యసూర్యజ్యోతిశ్చక్రము నాశ్రయించి తిరుగుచున్న భౌమ సూర్యచంద్ర నక్షత్రగ్రహ తారాదులగతియుఁ, పిపీలికాదులవలెను, జీవులగతివలెను, దనగతికంటె వేరుగానున్నదని తెలుసుకొనుటకు సంశయములేదు. జీవులయొక్క భిన్నదేశ కాలావస్థలవలెనే యాభౌమ సూర్యచంద్ర నక్షత్రగ్రహ తారాదుల ఉచ్చనీచ, ఋజు, వక్రాది గతిభేదములతోఁ గల్పితనక్షత్ర రాశ్యాదికాలచక్రములో నొకకాలమందు అశ్విన్యాది నక్షత్రములతో మేషాది రాసులలోఁ జూడబడుచుండును. ఈలాగునఁ జూడబడువానిని నక్షత్రరాశ్యాది భేదములతోఁ గాలగతితో ఋజు, వక్రగతులతోను దృగ్గోచరముగఁ జూచుచున్నాము. సంశయమే లేదని శుకయోగీంద్రులు విస్తరించి ప్రత్యుత్తరమిచ్చిరి.

అదివ్యధ్రువసూర్యుఁడు షడ్గుణైశ్వర్య సహజసంపన్నుఁడైన సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడై సకలలోక కల్యాణముకొరకు త్రయీవిహిత కర్మకాండ విశుద్ధ్యర్థమై గుణభేదములతో త్రిమూర్తిస్వరూపుఁడుగఁ దత్త్వజిజ్ఞాసులకును, గర్మకులకును, వేదములకును, సర్వదా ఉపాస్యుఁడగుచు త్రయీమయమగు తనమండలమునే పండ్రెండు మాసములుగ రాశిచక్రమును విభజించి నారుఋతువులందు వసంతాదిగ ఋతుగుణములతో సకలసృష్ట్యాదికమును జేయుచున్నాఁడు. ఇట్టిసూర్యునికర్మభూమిలోఁ (బుధశ్రేష్ఠులందరు) త్రయీవిద్యచేతను, వర్ణాశ్రమాచారమార్గములచేతను. పాకహవిస్సోమాది యజ్ఞత్రయాది యోగముతోను, వేదవిహిత ప్రకృతివిభాగముతోఁగూడిన వైతానికసప్తతంతువులచే శ్రద్ధతో జయించినవారలు స్వధర్మములతో సులభమార్గముతో శీఘ్రగతితో అవిద్యనువదలి జ్ఞానముతో

మోక్షసామ్రాజ్యమును బొందగలరు.

గ్రహమండలములో సూర్యస్థానమునందుఁ గల్పితభూస్థానములో త్రిణాభిచక్రమధ్యవర్తిగాఁ గల్పింపఁబడి (మనస్సుగా) వేదాంగ జ్యోతిర్విహిత యజ్ఞకాలార్థసిద్ధికై పంచసంవత్సర మయయుగ సముష్ట్యాత్మక బ్రహ్మసావన దినమానము మొదలుగ "దినర్త్వయనమాసాంగం" అని చెప్పిన శ్రుతి ప్రమాణానుసారము శుక్లకృష్ణ పక్షయోగముగల యోగసంబంధ మాసాంతమువరకుఁ గల సర్గప్రతిసర్గ విధులచేఁ గల్పింపఁబడిన గ్రహసూర్యుని భౌమసూర్యునిగఁ దెలియవలెను. అట్టి యీభౌమసూర్యుఁడు లౌకికుఁడగుటచే భూరాదిసత్యలోకాంత సప్తలోకములయొక్క ద్యావాభూములమధ్యభాగమందైన నభోవలయముయొక్క కాలచక్రమును బొందెను. ఈవిధముగ పండ్రెండుమాసములను రాశిసంజ్ఞలను సంవత్సరావయవములుగను బక్షద్వయములు రాశిలోని నవాంశములను, రాత్రింబగళ్లనెడు కాలావయవములను, అయనద్వయ ప్రతినిధిగనుగూడ అనుభవించు చుండునని పెద్దలు చెప్పుచున్నారు. ఎంతకాలము కల్పితద్వాదశార కాలచక్రములోని యారవాంశము ననుభవించునో యదియే ఋతువనియు అర్ధభాగముచే నభోవీధియందు సంచరించుకాలమును అయనమని (ఆఱుమాసములు)యుఁ జెప్పుచున్నారు. ఆకాశమందు శింశుమారమును బూర్తిగఁదిరిగిన సంవత్సరమనిరి. సంవత్సర, పరివత్సరే, దాదావత్సరే నువత్సద్వత్సరములుగ అఱువది సంవత్సరములను విభజించిరి. సూర్యుని తీవ్రమందసామ్యగతిభేదముచే సృష్ట్యాదినుండి త్రివృత్కరణముతో విభజింపఁబడిన పంచోష్మస్సులకుఁ బ్రతినిధిగాఁ బంచభేదములుగాఁ బంచసంవత్సరములుగ వేదములో వ్యష్టేష్టకా మంత్రములో "వధూర్జజాన నవగజ్జని త్రిత్రయ ఏనాం మహిమానస్సచంతే" అనియు "పంచభిర్ధాతా విదధా విదం యత్తాసాగ్ స్వసౄరజనీయత్పంచపంచ। తాసాగ్ త్వసార ఉపయంతి నిష్కృతగ్ సమానం కేతుం ప్రతిముంచమానాః। ఋతూగ్ స్తన్వతేః కవయః ప్రజానతీర్మధ్యే ఛందసః పరియంతి భాస్వతీః।" అని విస్తారముగనున్నవి.

కాప్రునమహాగ్నిచయన యోగముగల యాగములందుఁగూడ పురుషప్రమాణము నూటయిరువది అంగుళములుగల షట్పదమాత్రమానమై సార్ధసప్తమను పేరుతో ఏకశతవిధ శుల్బభేదములకును బ్రకృతియగుచు గణితశాస్త్రపరిభాషకుఁ గూడ సరిపడుచున్నది.

—•—

# సూర్యోదయాస్తమయాది విషయ వివరము.

సూర్యోదయాస్తమయములు సర్వదా మనభ్రమతోఁ గాలభేదములుగ నగుచుఁడును. ఉదయాస్తమయములసంధి నిరంతరము ప్రతిక్షణమందును, భ్రమయున్నంతకాలము ముందుకుఁ బెరుగుచు వెళ్ళుచునే యుండునుగాని నిలువఁజాలదు. ఇది నిలుచుటే ప్రళయము. అందుచేత సంధ్యలు నిత్యనిరంతరములు. పరిభ్రమణ లేనిచో సంధ్యలుండవు. సర్వదా ప్రకాశమే యున్నదానిలో మధ్యేకల్పితములుగా (బగలు, రాత్రియని విభేదము గలిగినందుచేత నీరెండు ముఖ్యములైన సంధ్యలేర్పడెను. మధ్యాహ్నసమయమునుగూడ సామాన్యసంధ్యగా వచింతురు. ధ్రువకిరు పార్శ్వములం దుభయకాల భేదగుణములు లేనందుచేతను ఉభయపార్శ్వములందుఁ బ్రకాశమే యున్నందుచేతను సూర్యుఁడు ధ్రువమునకు సూటిగాఁ దనస్వప్రకాశమందే యున్నందుచేతను ఛాయ యుభయపార్శ్వములందు బొత్తిగా లేనందుచేతను, సూర్యుఁడు స్వస్వరూప తేజోరాశి మధ్యభాగ కేంద్రమందుండుటచేత ఆధిక్యతగా సంధ్యలు కొంతవఱకు లేవని చెప్పఁదగును. ఒకవేళ చెప్పినను నది ఉభయతేజోమయ మధ్యసంధిగాఁ జెప్పవలెనేకాని, కేవలాంధకారమునకును బ్రకాశమునకును మధ్యలోఁగల సంధివంటి సంధ్యగాఁ జెప్పఁజాలము. అందుచేతనే ఉపనయనమందు శ్రీవేదమాతయు, సవితృసంబంధ సావిత్రియు నుభయమధ్యస్వరూపిణియు నగు గాయత్రీమంత్రోపదేశమునే ప్రధానముగ వేదఋషులేర్పరచిరి. వారిఆదేశముతో మనము దాని జపించుచున్నవారలమైతిమి. మనయుభయపార్శ్వములం దుఁగల ఛాయ (నీడ) మనయందే అంతర్హితమై లీనమైయుండును. రాత్రింబగళ్ళ సంధ్యలే ప్రమాదములు. మధ్యాహ్నసంధ్య ప్రమాదములేనిది. అధ్యాత్మిక దృష్టితో నాలోచించిన నీకాలము సవితృస్వరూపము సూటిగ మూలస్వరూపమునకును, ధ్రువమునకును, సత్యలోకబ్రహ్మకును, బ్రహ్మనాడిగ సుషుమ్నతో సంబంధించియున్నదిగాఁగూడ నుండును.

విష్ణుపురాణము ద్వితీయాంశము అష్టమోధ్యాయము, పదునాలుగవ శ్లోక భాష్యమున- ముఖ్యౌ ఉదయాస్తమయౌ సర్వదా మధ్యాహ్నఏవ సతతత్వోక్తేస్తస్య నస్తఏవ- ఇదికాలమును జ్యోతిశ్శాస్త్రరీత్యా అభిజిన్ముహూర్తము, సర్వదోషఘ్నము. ప్రాతస్సాయం సంధ్యలందాదిత్యుఁడు రజస్తమోగుణములతో అగ్నిరూపుఁడుగఁగానవచ్చును. మధ్యాహ్నమందు సత్వగుణముతో సాత్వికము (తెలుపు)

గాఁ గానవచ్చు చున్నాడు. జ్ఞానాజ్ఞానములఁ బ్రాతస్సాయఁ సంధ్యలుగ తత్త్వ శాస్త్రములందుఁ గైకొని, ఇందులకొక ఉదాహరణ ప్రమాణము "మమమోహ మయీ మాతా మృతా- జ్ఞానసుతోత్పన్నా। సూతకద్వయసంప్రాప్తౌ కథం సంధ్యా ముపాసీత యని యొకవిషయముఁగఁ జెప్పిరి తత్త్వభావముతో రెండునొకటియే. ఈ ద్వంద్వవిధానములు సర్వత్ర బ్రహ్మాండములో నవ్వులకున్నది. ఇందులోఁ గల కేవల శుద్ధమగు పగలెంతమాత్రముగాదు. తమస్సు మిశ్రితమగునగలే, సృష్టికిఁ గారణ మట్టితమస్సే. తమస్సు(అజ్ఞానము)న్నంతకాలము సంధ్యలు తప్పవు. సత్య సూర్యుని కెంతమాత్రము ఉదయాస్తమయ సంధ్యలు లేవు.

విష్ణుపురాణము, ద్వితీయాంశము, అష్టమాధ్యాయము శ్లో॥ ౧౫.

నైవాస్తమయమర్కస్య నోదయస్సర్వదా సతః।
ఉదయాస్తమయాఖ్యంహి దర్శనా దర్శనం రవేః॥ ౧౫॥

వీటినే ఉపచ్ఛాయలుగ పురాణములందు వ్రాసిరి. సూర్యుని వెనుకఛాయయు, సూర్యుని ముందుభాగమున ఉషయు మధ్యవరుణుఁడు నున్నట్లుగఁ దెలిపిరి. ఇవి క్రమముగ నీభౌమసూర్యుఁడున్నంతకాల ముండును. గతితోఁ గాలముగను, గాలగతితో ఉపచ్ఛాయలును నిరంతరము సంధ్యలుగ సూర్యుని వెంబడించి యెడతెగనివిగాఁ బరిభ్రమణయున్నంతకాలము పరివర్తనములుగ నుండును. జ్ఞానోదయముతో నివి నశించును.

మొదట సంధ్యలు లేనిదియు శుద్ధస్వరూపముగలదియు స్వరూపమునకుఁ బ్రకాశిగ నూటిగనున్నదియునగు సావిత్రీమంత్రోపదేశముతో స్వప్రకాశమును గలుగఁజేసి తపస్స్థానముతో సాయంకాలము వచ్చుచుచే ప్రారంభమందు సంధ్య నుపాసింపఁజేయుదురు. తమోరూపమగు అజ్ఞాన రాత్రి వీని నీబ్రహ్మాండముతో సంబంధముగా నున్నంతకాలము విడువదని తెలిసి నివారించుటకై అహస్థానోపాస్యములుగ ప్రసంగముతో బ్రహ్మోగపూరిత విధిగా మనమహర్షులు విధించి యాచరించి ధన్యులై మనకుమార్గదర్శకులైరి. సంధ్యాదేవిని ప్రార్థనాది జపాదులతో ఉపాసించి తదనుగ్రహమును బొందినయెనను ధన్యులనుదురను మహదుద్దేశ్యముతో దేవతాస్వరూపముగ ధ్యానింపఁజేసిరి. మరల నీప్రళయనిశీథిని గడవగానే ప్రళయనిమగ్నులై పారబాటుతో మరచి ప్రమాదము నొందియుండునని మరల రాత్ర్యంతము దివసాదియునగు ఉదయకాలమునఁ (జ్ఞానోదయము) ప్రాతస్సంధ్య నుపాసింపఁజేసిరి. అంధకారతమస్సునకు బ్రాహ్మముహూర్తమునను దమోంతమునను బ్రమా

దముల కాస్పదములేకుండా నీసంధ్యల నుపాస్యములుగ మనవేదమహర్షులు నిత్యములుగ విధివిహితాచారములుగ విధించి యాచరింపఁజేసిరి.

ఉపనయనమన సమీపనయనమనియు, నయనమన మనస్సుగాన సమీప మనస్సనియు, నూతనవికాసనేత్రము దెరవఁబడుటయనియు యన్వయింపఁదగును. ఈకర్మతోఁ దొంటి యజ్ఞానాంధకారము తొలఁగి నూతన జ్ఞానతేజస్సామీప్యగతుఁడగుట. వటువున కీయది ద్వితీయ జన్మప్రారంభము. ఉపనయన మహిమ వర్ణనాతీతముగాన దెలియక ఉదాసీనులై దూరస్థులై తుదకు ధూర్తులగుచున్నారు. మరల నేనాటికి సమీపింతురో తెలియరాదు. బ్రాహ్మీసరస్వతులుభయ పార్శ్వజ్ఞలు. వీనినే మరొకవిధముగ శ్రీపురుషసూక్తమందు "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ। అహోరాత్రే పార్శ్వే"యనిరి. సావిత్రీస్వరూపము సవితృంతర్గత సుషుమ్నశక్తి స్వరూపము, ప్రణాడి, గమ్యము. ఈ సవితృసంబంధ సావిత్ర్యుపాసనతోనే భూరాది సప్తలోకములు, భూరాదివ్యాహృతులతోఁ బ్రథమముగఁ దనలోఁ జేరును. తరువాత తనపిండదేహము బ్రహ్మాండస్వరూపత్వమునొంది నీవ్యాహృతులతో సమష్టిగా సర్వముఁ లీనమగును. దీని అర్థమును, ఉపాసనను, విధానమును, వేదమును, దెలియక ఉదాసీనులగుచున్నారు. సత్యమును దెలిసిన నేనాటికైనను భారతీయు లుపాసకులగుదురు అట్టికాలము రాకతప్పదు. మనలనుజూచి తుదకు సర్వదేశస్థులుగూడ నీమార్గమునే యనుసరింతురు. ఇదితప్పదు.



## యమపురి మార్గ వివరము.

యమపురి మనకుఁ బైన నెనుబదియారు వేలయోజనముల దూరముననున్నది. భూమేరుపురవీధికి సమానముగ దక్షిణదిశనుండును. గతించగనే జీవుఁడు యమపురి మార్గమున నించుమించు దినమునకు రెండువందల నలుబదేడు యోజనములదూరము పోవుచుండును. మార్గమధ్యలోఁ బదునారుపురములున్నవి. ఈపురములగుండా యమభటులు జీవునిఁదీసుకొని వెళ్ళుదురు. జీవునికిది యాతనాశరీరము. మాతా పితరులచే జనింపని దేహము. దైవనిర్మితమైనది. యమభటులు మహాభయంకర రూపులు.

పురములు:- ౧ సౌమ్యపురము, ౨ సౌరిపురము, 3 నాగేంద్రపురము,

౪ గంధర్వనగరము, ౫ శైలాగమపురము, ౬ క్రౌంచనగరము, ౭ క్రూరపురము, ౮ విచిత్రభవనము, ౯ బహ్వాపదపురము, ౧౦ దుఃఖదపురము, ౧౧ నానాక్రందపురము. ౧౨ సుతప్తభవనము, ౧౩ రౌద్రపురము, ౧౪ పయోవర్షణపురము, ౧౫ శీతాఢ్యపురము, ౧౬ బహుభీతిపురము.

మార్గములో విశేషముచలియు, ముండ్లు, విషసర్పములు, సింహములు, పులులు, కుక్కలు, తేళ్ళు, అగ్నియు నుండును అసిపత్రవనముగూడ నీమార్గమధ్యలో నేయున్నది. దీనిలో నాకులు వాడియైనకత్తులవలె నుండును. ఈ పత్రములు దేహమునకుఁ దగులుచుండుటచేత దేహము ముక్కలు ముక్కలుగాఁదెగుచు రక్తధారలు స్రవించుటచేత జీవుఁడు పరితపించుచుండును. ఈలాగున యమభటు లీడ్చుచు నీవనముగుండా తీసుకొనిపోవుచుందురు. ఈవనవిస్తీర్ణము రెండువేల యోజనములు. ఈ వనమందు కాకులు, గూబలు, గ్రద్దలు, తేనెటీగలు, దోమలు మొదలుగాగలవి, వాడిగలముక్కులతోను గోళ్లతోను మార్గమునడచుచున్న జీవుని మిక్కిలిబాధించుచుండును ఇంకను వేడియిసుకయు, బూడిదయు, నిప్పులు సహితము మార్గమధ్యములో నున్నవి. మరల విశేషవర్షమును, పిడుగులుబడుటయు, శిలావర్షములు, రక్తవర్షముపడుచుండును. మార్గములో అంత్యములోఁగల బహుభీతిపురమునకు యమపురి నలువదినాలుగుయోజనముల దూరమున నుండును. ఈ మార్గమధ్యలో అయిదుయోజనముల విస్తారముతోను ఒకయోజనమెత్తుగల అగ్నివృత్తమొకటియున్నది. జీవుఁడు దీనిబాధయు ననుభవించవలెను.

జీవుఁడు వాయువేగముతోఁబదునేనిమిది దినములకు మొదటిపురమగు సౌమ్యపురముచేరును. ఊర్ధ్వలోకమునకుఁ బోవువారలకు శరీరము సూక్ష్మరూప మేర్పడును. ఈస్థూలదేహము స్థూలలోకమునకు మాత్రమే. ఈ దేహమిక్కడనే విడుచును. మనకుపైన ప్రేతపిశాచాదిలోకములున్నవి జీవునికి ప్రేతదేహ మేర్పడియుండును. ఈ ప్రేతదేహము నిరంతరము అమిత క్షుత్పిపాసాదులతో బహు బాధపడుచు. అందుచేఁ గర్మలలో క్షుత్పిపాసాది నివృత్తిక్రియ ముఖ్యముగాఁ జేయబడుచున్నది. యమపురిచేరువఱకు మార్గమధ్యదేహమిది. యమపురిచేరగానే యీప్రేతదేహము మార్పుచెందును. ఇదిదైవనిర్మిత యాతనాదేహము. ప్రేతత్వనివారణార్థముగను, మార్గములోఁ జీవునికి ఆకలిదప్పులబాధానివృత్తికిని ప్రారంభకర్మలుముఖ్యములు. ఈ సౌమ్యపురమందు పుష్పభద్రనదియు, విశ్రమించుటకు నొకమఱ్ఱిచెట్టున్నది ఇచ్చట జీవుఁడు మహాచింతతోను మార్గా

యాసముతోను దన దేహబంధువులను స్మరించుచు దనకేమియు నుపకారములు చేయ లేదని పరితపించుచుండును. ఇచట మొదటి మాసిక పిండ దానముతోఁ దృప్తినిఁ జెందును. లేకున్న ఉపవాసమేగతి.

జీవుఁడా కమాసమునకు రెండవదియగు సౌరిపురము చేరును. ఈపురమునకు జంగముఁడు రాజు. త్రైపక్షిక శ్రాద్ధ పిండదానముతోఁ దృప్తిచెంది బయలు దేరును. ప్రేతశరీరులు పిండము నే భుజింతురు. ఇదివారికి ముఖ్యము. అందులకే ప్రేత పిండము నెదరు.

రెండవమాసములో మూడవదియగు నాగేంద్రపురమును జేరును. అసిపత్రా రణ్యమిచ్చటనున్నది, రెండవమాసిక పిండదానముతో నిచ్చట తృప్తి చెంది ముందుకు వెళ్ళును.

మూడవమాసమున నాలుగవదియగు గంధర్వనగరము చేరును. ఇదిగంధర్వ లోకము. యమపురిమనకు దక్షిణములోనున్నది. ఈమార్గము బహుకష్టతరము. మృతిచెందిన పాపులగువారికిమాత్రమే యీమార్గగమనము. మిగిలినవారలు ఊర్ధ్వలోకాదులకు వెళ్ళుమార్గములు వేఱుగనున్నవి. యమపురి దక్షిణద్వార మార్గము ప్రేతజీవుల మార్గము. ఇచ్చట మూడవమాసిక పిండదానముతోఁ దృప్తి చెంది ముందుకు వెళ్ళును.

నాలుగవ మాసమున అయిదవదియగు శైలాగమపురము చేరును. ఇచ్చట శిలావర్షము నిరంతరము కురుచుండును. ఈబాధ లనుభవించకతప్పదు. ఇచ్చట నాలుగవమాసిక పిండదానముతోఁ దృప్తి చెందును.

అయిదవమాసమున ఆరవదియగు క్రౌంచనగరము చేరును. ఇది హింసా పురము. ఇచ్చట అయిదవమాసిక పిండదానముతోఁ దృప్తిజెంది ముందుకువెళ్ళును.

ఆరవమాసమున నేడవదియగు క్రూరపురము చేరును. ఇచ్చట ఊనషాణ్మా సిక పిండానముతోఁ తృప్తిచెందును ఇప్పటికి నూటడెబ్బదియొక్క రోజులగును. ఉదకుంభదానముతో మధ్యలోదప్పిదీరును, లేకున్న బాధననుభవించవలెను. ఇచ్చట విశ్రాంతి రెండుఘడియలకాలము మాత్రమే.

ఏడవమాసమున నెనిమిదవదియగు విచిత్రభవనము చేరును. ఈపురమునకు యమునిసోదరుఁడు ప్రభువు. ఇతనిదర్శనము మహాభీతికరముగనుండును. ఇచ్చట మహావైతరణినదియున్నది. దీనిని దాటవలెను, ఇది నూరుయోజనముల వైశాల్యము. ఇందులోఁ జీము, రక్తము, నెమళ్ళు, మాంసము, వెంటుకప్పలు, నీటికోతులు,

చేపలు, తాఁబేళ్లు చాలయుండును. వీటిబాధల ననుభవించుట కష్టతరమగును. గోదానఫలముతో దీనిదాటునవకాశ మేర్పడును. గోదానముచేయకపోయిన యమభటులు ప్రేతజీవ్రనినాలుకకు గొళ్ళెముల్లుగుచ్చి ఈడ్తురు. ఇదిమహాఘోరము. ఇచ్చట ఆరవమాసిక పిండదానముతోఁ దృప్తిచెందక యింకను ఆకలిబాధతో ఁజింతించి బయలుదేరును.

ఎనిమిదవ మాసమున ఁదొమ్మిదవదియగు బహ్వాకదపురముచేరును. ఇచ్చట నేడవమాసిక పిండదానముతోఁ దృప్తిచెందును. ఇచ్చటినుండి ఆకాశగమనమే.

తొమ్మిదవమాసమున పదియవదగు దుఃఖదపురముచేరును. ఎనిమిదవ మాసిక పిండదానముతోఁ దృప్తినిఁజెందును.

పదియవమాసమునఁ బదునొకొండవదియగు నానాక్రిందపురము నుజేరును. ఇచ్చటి ప్రేతగణము లనేకవిధములుగ దుఃఖబాధలనుభవించు చుందురు ఈ పుర నామము సార్థకముగనున్నది. ఇదికొంతమించుమించు జనరల్ ఆస్పత్రివలెనుండును. ఇదిచూచిన యమలోకానుభవము స్ఫురించును. ఈదుఃఖధ్వనులు వినఁగనే జీవుఁడు తాను భయకంపితుఁడై ఏడ్వనారంభించును. ఇచ్చట తొమ్మిదవ మాసికపిండ దానముతోఁ దృప్తిచెందును.

పదునొకొండవ మాసమున ఁబన్రెండవదియగు సుతప్తభవనముచేరును. ఇచ్చట పదియవమాసిక పిండదానముతోఁ దృప్తిచెందును. పిదప పదునైదుదిన ములకు, ఁబదుమూడవదియగు రౌద్రిపురమునుజేరును. ఇది మహాభీకరముగ నుండును. ఁబదునొకొండవమాసిక పిండదానముతోఁ దృప్తిచెందును.

పన్రెండవమాసమున పదునాలుగవదియగు పయోవర్షణపురమునుజేరును. ఇచ్చట మహాఘోరవర్షముతో బాధచెందును. ఇచ్చట ఊనాబ్దికమాసిక పిండ దానముతోఁ దృప్తినిఁ జెందును.

సంవత్సరము పూర్తికాగానే పదునైదవదియగు శీతాతుథ్యపురమునుజేరును. ఇచ్చట నెండకాయుచున్నను చలిబాధ సహింపరాక నూరంతఁ ధికముగనుండును. ఈ చలిబాధ ననుభవింపలేక తనబాంధవులను మాటిమాటికిఁదలంచి ఉపకారులు కారైరని పరితపించుచుండును. ప్రథమాబ్దిక పిండదానములోఁ గొంచెము తృప్తినిఁ జెంది ధైర్యమును దెచ్చుకొని పదునారవదియగు బహుభీతిపురమునుజేరును. ఇది బహుభీతికరముగ నుండును. ఇచ్చటికి యమపురి సమీపముగనుండును. ఇచ్చటికి నీ ప్రేతదేహము హస్తమాత్రి (మూరెడు) ప్రమాణమై ప్రేతదేహత్యాగమగును.

ఇచ్చటినుండి లింగశరీరమగు సూక్ష్మదేహముకలవాడగును. ఈలింగశరీరము అంగుష్ఠమాత్రప్రమాణ దేహము. ముందుప్రారబ్ధానుభవ నిమిత్తముగా స్వప్నానుభవ శరీరమువలె నగును. యాతనాశరీరము నధిష్ఠించును. ఇది దుఃఖానుభవ దేహము. ఇచ్చటనుండి పాపులతోగలసివెళ్ళును.

## —♦ పిండ వృద్ధి క్రమము. ♦—

ప్రారంభ కర్మలతో (బిండప్రదానములతో (బిండదేహమునకు,

| | | |
|---|---|---|
| మొదటిరోజు | పిండముతో | =శిరస్సేర్పడును |
| రెండవరోజు | " | =కంఠమేర్పడును |
| మూడవరోజు | " | =హృదయమేర్పడును |
| నాలుగవ | " | =పృష్ఠమేర్పడును |
| అయిదవ | " | =నాభియేర్పడును |
| ఆరవ | " | =గుహ్యమేర్పడును |
| ఏడవ | " | =ఊరువులేర్పడును |
| ఎనిమిదవ | " | =పిక్కలేర్పడను |
| తొమ్మిదవ | " | =పాదములేర్పడును |
| పదియవ | " | =ఆకలిదప్పులభాధలు వ్యక్తముగాప్రారంభమగును |

ఏకాదశ, ద్వాదశ పిండములను స్వీకరించి యమభటులచే బాశబద్ధుడై మహాశైల, దుర్గమ, కంటకా, సిపాతమ్ముగ, పక్షి కీటకాదులమార్గమున వెళ్ళును. మొదటిదేహము నశించుటచేత మరల నూతనదేహమేర్పడవలెను. ఇటులనే మనజన్మము మాతృగర్భములోగూడ మాసముల ననుసరించియే దేహావయవములు ఆకలిదప్పులేర్పడును. విధానమంతయునొక్కటే. ఆయాలోకానుసారమనుభవ భూతదేహములు మొదటి దేహము నశించగానే రెండవదేహ ముత్పత్తిక్రమముగా నేర్పడవలెను.

## —♦ య మ పు రి వి వ ర ము. ♦—

ఈపురము సురాసురులకును ఛేద్యముగానిది. దీనిప్రాకారములలోహమయములు. యమపుర మేడంతస్థుల మేడలతోను, ఉద్యానవనములతోను దేవగంధర్వుల సంగీతాది ధ్వనులతోను అప్సరస్త్రీల నాట్యములతోను మణిమయఖచిత దివ్యసింహాసనముతోను మహాజన సభతోను నిండియుండును.

యమపురి పూర్వద్వార మతిమనోహరమగు మణిరత్న ఖచితముగనుండును.

సర్వభోగములకు గల్పవృక్షముండును విమానములు రాజహంసలుండను. అమృత సరోవరముండును. ఈద్వారమున మహాపుణ్యాత్ములును, బ్రహ్మర్షులును, నిర్మల రాజర్షులును, శివభక్తులును, దానధర్మాది కార్యములనొనరించిన ధర్మాత్ములును, ఉష్ణకాలమునందును, శీతకాలమందును, వర్షాకాలమందును, క్షామములందు సౌకర్యములు గలుగఁజేసినవారలును గానాదిగుణవర్జితులును, గురుశుశ్రూషలు, భూదానములు, గృహదానములు, గోదానములు, విద్యాదానములును, యజ్ఞాదులను జేసిన మహాపుణ్యపురుషులు యమపురమును బ్రవేశింతురు. వీరలకు యముఁడు కేవలశాంతుఁడుగను ధర్మస్వరూపుఁడుగనుండి యెదుర్కొని ఆహ్వానించి ఉపచారములనొనర్చును.

యమపురోత్తరద్వారము అనేకరథములతో ఆవరించి నిండియుండును. నరయానములుగూడనుండును. సుగంధచందనాదుల నదియుండును. హంస, చక్రవాకములతోనుండు సరస్సులును, శుకపికాది ధ్వనులును, అమృతసరస్సులుండును. వేదవిహితకర్మరతులు, సూర్యోపాసకులు, శ్రీవిద్యోపాసకులు, ధర్మయుద్ధమున మృతిజెందినవారలు, అనశనవ్రతముతో మృతులైనవారలు, కాశ్యాది తీర్థంబులందు మృతులు. యోగముతో దేహమును త్యాగమొనర్చినవారును, మహాదాతలు నీద్వార ప్రవేశమునందుందురు వీరలకుసహితము యముఁడు బహు శాంతస్వరూపముతో స్వాగతమిచ్చును. పైలోకములకు వెళ్ళువారలు నీద్వార మార్గమున వెళ్లవలెను. అందులకే యానములు రథములు సిద్ధముగనుండును. ఇచ్చట ఘంటానాదము నిరంతరము మ్రోగుచుండను.

పశ్చిమద్వారము, రత్నఖచితము, అమృతానందరసయుక్తము, ఐరావత, మత్త మాతంగ, ఉచ్చైశ్రవహయములున్నవి. ఆత్మజ్ఞానులు విష్ణుభక్తులు, గాయత్ర్యుపాసకులు, స్వదారరతులు, జితేంద్రియులు, నిత్యాగ్నిహోత్రులు, వేదపాఠకులు, బ్రహ్మచారులు, వానప్రస్థాశ్రమవాసులు, తపస్వులు, సన్యాసులు, జ్ఞానవైరాగ్యాదిసంపన్నులు, బ్రహ్మవిదులు, ఋణత్రయవిముక్తులు, పంచమహాయజ్ఞములనుజేసినవారలు, సకాలనిరంతర సంధ్యోపాసకులు, విమానారూఢులై, అమృతపానముచేసి అప్సరస్సేవితులై యీ పశ్చిమద్వారమున యమపురమును బ్రవేశింతురు. యముఁడు మహాశాంతస్వరూపుఁడై యెదుర్కొని స్వాగతమిచ్చును. వీరలు తనపురమునందుండువఱకు అతిథిసత్కారముల నొనర్చుచుండును. శ్రద్ధాభక్తి పరమాదరణతో ఉపచరించును. వీరలు సూర్యలోకమును భేదించుకొని విష్ణు

పథమగు ధ్రువమునుజేరి ముందులోకాదులకు వెళ్ళుదురు.

యమపురి దక్షిణద్వారము మహాఘోరరూపమునఁ బాపుల కగుపించుచుం డును దీనిఁజూడగనే జీవులు మహాభయకంపితులగుదురు. ఇది మహానీలవర్ణ ముతోఁ బ్రకాశించుచుండును. జీవుని నీద్వారముచెంతఁ జేర్చగానే చారులు వీనివిష యము యమధర్మరాజునకుఁ దెలుపుదురు. ధర్మధ్వజులు ద్వారపాలకులు. ఈ ద్వారపాలకులద్వారా జీవునిఁ జిత్రగుప్తులవద్దకుఁ బంపుదురు. చిత్రగుప్తులు వీనిఁ జూడగనే పాపుఁడనిగ్రహించి వీనిపాపకృత్యములను దెలుసుకొని త్రికరణములతోఁ జేసిన పాపములన్నిటిని యమునికెఱింగింతురు. వానిపాపములనుబట్టి నరకలోకము లకు (దో)యింతురు. మానవులుగాని దేవతలుగాని యారాత్రివర్గములో నెవరుగాని త్రికరణములతోఁ జేసినవియును రహస్యకృతములునగు పాపములనుసహితము నచ్చటినుంచియే గ్రహించుచుందురు. దీనికిమన టెలిఫోనులే నిదర్శనము. వారలకు ఈశ్వరబలముతో సర్వశక్తులునుండును. మనది ప్రకృతిబలము వారలదాధ్యాత్మిక బలము. పాపజీవులకు యముఁడు మహాఘోరవికృతాకారముతోను నీలవర్ణుఁడుగను మహిషవాహనుఁడుగను, బ్రళయాగ్నినేత్రస్వరూపుఁడును, దండధరుఁడునై ముప్ప దిరెండుభుజములు కలిగి, మూడుయోజనములు పొడవుగను దీర్ఘనాసికుఁడుగను నగపడును.

తర్వాత వెనకజెప్పిన అగ్నిహోత్రి వృత్తమునకు జీవుని వ్రేలాడగట్టి కొట్టు దురు. యమపురి సింహాసనముందిరమునందు (చిత్రగుప్త లోకపార్శ్వమునందును, ఉగ్రతపంబుజేసినవారలును, సువ్రతులును, సత్యవ్రతులును, సన్యాసులును, సిద్ధులును, మహాపుణ్యకర్మరతులును, మరొకపార్శ్యమునందును ఇంకొకపార్శ్వ మున (బాశదండధరులగు యమభటులునుందురు. మరొకపార్శ్వమునందు అగ్నిష్వా త్తాది పితృగణములు, సోమపాయులు, అర్యమాదిపితరులు, మునులగు అత్రి, వసిష్ఠుఁడు పులహుఁడు, దక్షుఁడు, క్రతువు; అంగీరసుఁడు, జమదగ్ని, భృగువు, పులస్త్యుఁడు, నారదుఁడు మొదలగువారలుందురు. ఇంకను ననేకులుందురు. వీరలందరు ధర్మము లనుజెప్పచు ధర్మనిర్ణయమును జేయుచుందురు. మరొకపార్శ్వమునందు మనువు, దిలీపుఁడు, మాంధాత, సగరుఁడు, భగీరథుఁడు. అంబరీషుఁడు, ముచికుందుఁడు, నిమి, పృథువు, యయాతి, నహుషుఁడు, పురూరవుఁడు, దుష్యంతుఁడు శిబి, నలుఁడు భరతుఁడు, శంతనుఁడు, పాండురాజు, కార్తవీర్యార్జునుఁడు, సూర్యచంద్రవంశరాజ శ్రేష్ఠులు, అశ్వమేధములనుజేసిన రాజన్యులు, ఆర్యముఁడు మొదలగువారలందరును

నీసభనలంకరించి సేవించుచుందురు. ఈసభయందు కేవలధర్మపరులు, పక్షపాతములులేనివారలు, సత్యవాదులు, పుణ్యపురుషులు, యమునినుపాసించుచుందురు. ఈసభవారలు దక్షిణద్వార దిశలందుండు పాపులనుగాని దక్షిణాయనమార్గముగ వచ్చువారలనుగాని చూడరు. వీరలకు పాపులదర్శనమే లేదు.

చిత్రగుప్తుని గృహమునకుఁ దూర్పుదిశ జ్వరాదిగృహములు, దక్షిణమున శూలాదిరోగ గృహములు పశ్చిమమున యమపాశాజీర్ణరోగ గృహములు, ఉత్తరమున రాజయక్ష్మరోగ గృహములు, ఆగ్నేయమున మూర్ఛాదుల గృహములు, నైరృతి అతిసారాదులరోగ గృహములు, వాయుదిశ శీతాదులరోగ గృహంబులు, ఈశాన్యమున శిరోరోగగృహములు వెయ్యియోజనముల విశాలముతోఁ జౌకముగ నుండును.

ఈచిత్రగుప్త పురమునకు నిరువదియోజనములపైన యమధర్మరాజమందిరము మహామణుల కాంతితోఁ బ్రకాశించుచుండును. ఈపురము రెండువందల యోజనములపొడవును, రెండువందలయోజనముల వెడల్పును, బదియోజనముల యెత్తునుండును. వెయ్యిస్తంభములతోను సమస్తాభరణములతోను, మహాసూర్య ప్రకాశముగను, సమశీతోష్ణంబుగను, ఆహ్లాదకరంబుగను, బాల్యాద్యవస్థలు లేకను, ఇష్టాభీష్టసిద్ధిగను, శీతోష్ణోదక కుండములతోను, మహాపుణ్యశ్రవణంబుగను, షడ్రసోపేత పదార్థములు మొదలగువానితో సర్వానుకూలంబై యుండులాగున విశ్వకర్మచే సాటిలేనిపురముగ దైవముచేనిర్మింపబడినది.

యముఁడు పితృగణములలో నొకగణమునకుఁ జేరినవాఁడు. నరకములు దీని క్రిందుగ బాతాళమున నున్నవి. నరకలోకములకు రాకపోకల సంబంధములున్నవి. నరకలోకమనగా అంధకారలోకములు, అధోలోకములు. పాపము లధికములై పుణ్యమల్పమైనచో పుణ్యానుభవానంతరమే పాపానుభవము. పాపముస్వల్పమై పుణ్యమతిశయించినచో మొదటనే పాపానుభవమగును పితృలోకము మనకుపైనున్నది. అందుచేతమనముచేయు పండ్రెండురోజులకర్మలు ప్రేతలకు పండ్రెండుమాస సంఖ్యలకు సరిపోవును. ప్రారంభ కర్మలలో నీలాగునఁజేయుచు, మరలఁ గ్రమముగ శ్రద్ధాభక్తులుకల అస్తికులు, మాతాపితృభక్తి పరాయణులు క్రమముగ పండ్రెండుమాసములందు మాసికశ్రాద్ధాదులను ఊనత్రయాదులను చేయుదురు. కొందఱుచేయుటకు దేశకాలభేదములతోను ఇతరవైపరీత్యములతోను అసందర్భములతో జరుగునో లేదోయని ముందుగా అపకర్షించి పండ్రెండురోజులలో

నే యాబ్రశార్ధములఁ జేయుచురు. మరలఁజేయకపోయినను దీనితోనే సరిపడును. లేక మరల ఉపరిగాఁజేసిన అధికఫలమే యగునుగాని వృథాకానేరదు. పదిరోజుల కర్మలు ప్రేతకు స్థూలదేహసంబంధ దహనాదులనిమిత్తము శాంత్యర్థముగను, దేహ దహనతాపోపశాంత్యర్థముగను తృప్తి పాప నివృత్తికిని నీసంకల్పాదులతోనే కర్మలు జేయుదురు. ప్రేతత్వ విముక్తికర్మలుగూడ నిందులోనే మిశ్రితములై యున్నవి. ప్రారంభమునుండి పదిరోజులకర్మలవరకు మృతిచెందినవారలిచ్చటనే వాసనారూపముతోనుండుటచేతనే, నీక్రియాకర్మలుచేయవలెను. సంవత్సరాంతముతో విమోకము సాపిండ్యముతో వసురుద్రాదిత్యరూపము చెందుదురు. ముందుగానే అపకర్షించి చేయుటచేత మాసికాదులందు వసురుద్రాదిత్య రూపములను జెప్పుటకు వీలగును. ఆవల ప్రతిసంవత్సరమున నొకసారిచేయు కాలశ్రాద్ధము పితరులు దేవత్వమును బొందుటచేత నిత్యశ్రాద్ధములగును. ప్రతిరోజును భుజించుచున్నవారలవలె నుందురు. దానాదుల ఫలములతో జనిపోయినవారలకు మార్గ మధ్యమునఁగలబాధలు నివారితములై అనుకూలములగును. పరోపకారములు, దానధర్మములు. క్రియాకర్మలెప్పటికిని నిష్ప్రయోజనములుగాక ఫలమునే తప్పక పలోకములందైనను నీయగలవు. ఎప్పటికివృథాగానేరవు. ఈపితృకార్యక్రియా కర్మలు ప్రతిమతములవారును ప్రతిదేశములవారలును వారలకుఁ దోచినంతచేయుచునేయున్నారుగాని బొత్తిగా విడచినవారలెవరును లేరుకాన సంశయమే లేదు. ఈసంవత్సరాశౌచమునుగూడ విదేశీయులుసహిత మాచరించుచునేయున్నారు. స్వర్గాది పుణ్యలోకములున్నవని సర్వులు వదించుచునేయున్నారు.



## పితరులచరిత్రవిశేషము.

మనపుట్టుకకు మూలకారణము పితరులు. పితరులు స్వర్గలోకములోను, ధ్రువాదూర్ధ్వలోకములోను నీలోకములోను మూడువిధములుగనున్నారు, ధ్రువా దూర్ధ్వలోకమగు, బ్రహ్మలోకములోని వారలు నిత్యశాశ్వత పితరులు; పునరావృత్తి రహితులు; ఊర్ధ్వరేతస్కులు, బ్రహ్మతో సాయుజ్యమును జెందువారలు. స్వర్గలోకములోనివారలు దేవాంశ సంభూతులు. దేవతలతో సమానులై యజ్ఞాదులందు హవిర్భాగములనొందువారలు. మననిత్యకర్మాదులలోను జయాది స్వాహా

మూడులందును వీరికి ఆజ్యభాగములున్నవి. వీరలలోఁగొందఱు మనవంశపితరులు. వీరలు చంద్రలోకము నాశ్రయించినవారలై శ్రాద్ధాదులచే సంతృప్తులగుచుందురు. మరల వీరలు పుణ్యక్షీణముతో మనలోకములో జననమొందుదురు. దేవలోక పితరులు కొంతకాలమునకు మన్వంతరముతో ఋషివాదూర్ధ్వలోకాదులను బొందుదురు. చంద్రలోకములోని మనవంశపితరులు పుణ్యాతిశయవిహితమగు కర్మలతోను జ్ఞానముతోను దేవత్వ ఋషిత్వముల నొందుచు ఊర్ధ్వలోకములగు బ్రహ్మలోకాదులను సహితము పొందుదురు. పై త్రివిధ పితరులయనుగ్రహము మనజన్మాదులకు ముఖ్యకారణము. ఉత్పత్తి పైనుండియే క్రమముగా మనవరకువచ్చినది. అందుచేత వారికిమనకు సర్వసంబంధములున్నవి.

మనకీలోక జన్మాదులు లభింపఁ బంచాగ్నిహోత్రవిద్యననుసరించిన విధానముతో మన తండ్రిదేహము మనఉత్పత్తికిఁగారణము. ఈవిద్యావివరము ఈప్రథమ భాగములో వివరించఁబడినది. సృష్టిలోఁబ్రతివిషయమునకు నొక మూలకారణముండితీరును. లేకున్నఁబరంపరాప్రాప్తిగా రానేరదు. లోకాదులుసహితమిటులనే ఊర్ధ్వలోకాదులనుండియేపుట్టును, ఆలోచించినచోఁ దుదకు పరాపరము రెండునైక్యమునొందియే సర్వమూలమైయున్నది. ఇది తెలియకను దెలుసుకొన నిచ్ఛలేకను నీలాగుననే భిన్నపరంపరలతో లోకాదులలోఁబుట్టి గిట్టుచుందురు. ఇవే బంధములు వాసనలు.

శింశుమారములోఁబితరుల సంబంధ విషయాదులనేకములున్నవి. శింశుమారములోఁ బితృయానమార్గములుగూడ నున్నవి. శింశుమారములోఁగల చంద్రసూర్యాదులతోను బితరులకనేక సంబంధములున్నవి. మనఋషులు మనగోత్రాదులకు సంబంధులై నిరంతరముమనకు క్షేమాభివృద్ధులు గలుగులాగున ఆశీర్వదించుచుందురు. ఇంకను బ్రహ్మాండాధారమూర్తియగు శ్రీఆదిశేషుని సహితము నిరంతరము స్తుతించుచుందురు. తమసంతతివారలు నీబ్రహ్మాండములో నున్నారనియు వారలను జక్కఁగాఁగాపాడుభారము నీది. నీవు సంకర్షణుండవు; కాలాగ్నిరుద్రుండవు. నీయనుగ్రహముండవలెనని సర్వదా అనంతరూపుఁడగు ఆదిశేషునిఁ గూర్చి స్తుతించుచుందురు. పురాణములలో ఆదిశేషాంశ ప్రసిద్ధప్రమాణములున్నవి. మనపితరులకును సర్వలోకసంచారాది సర్వశక్తులును దేవతలతో సమానముగనున్నవి. ఇతరదేవతలవలెఁగ్రామాదులతోఁబరస్పర యుద్ధములతో లోకాదులను జయింపవలెనని యుద్దేశముగలవారలుగారు వారు.

భూతాదిబ్రహ్మాండ భువనకోశ విన్యాసము - శింశుమారము.

—♦ భవిష్యత్పురాణ - ప్రటము ౬౬౫. ♦—

పితరులు సప్తవిధరూప గణములుగనున్నారు. వీరలు, సోమ, పితృ, యమాంగీరసాగ్న్యగ్ని ష్వాత్తకవ్యవాహనులు. మరల నీయేడుగణములలో నొక్కొక్కగణ మేడువిధములుగనున్నది. వీరలు మొత్తము నలుబదితొమ్మిది సంఖ్యలుగ నున్నారు. ఈపితరులగ్నులతో యజ్ఞయాగాది కర్మలతో సాగ్నులుగను అనగ్నులుగను యజ్వలుగనున్నారు. శ్రీవిష్ణుపురాణ ప్రథమాంశము దశమా ధ్యాయములో ౧౬, ౧౭, ౧౮ శ్లోకములందు జూడవచ్చును. శ్రుతిప్రమాణము "యేవాఅయజ్వానోగృహమేదినస్తే పితరోగ్నిష్వాత్తాః। యేచైయజ్వానస్తే పితరో బర్హిషదఇతి" ఈయజ్ఞము సప్తపాకయజ్ఞములు, సప్తహవిర్యజ్ఞములు, సప్తసోమ యజ్ఞ విశేషాదులుగనున్నవి.

సప్తపితృగణములలో ధ్రువాదూర్ధ్వములో బ్రహ్మలోకాదులందుఁ సోమ గణము, పితృగణము, యమగణములనువారలు ముగ్గురున్నారు. వీరలీబ్రహ్మలో కాదులలో వాయురూప భూతదేహాదులతో నిరంతరధ్యానయోగాదులతో తృప్తి పాసాదులు లేనివారలలై పునరావృత్తిలేని ఊర్ధ్వరేతస్కులైయున్నారు. ఈకల్ప ములో బ్రహ్మతో ముక్తులగుదురు.

మిగతనాలుగుగణములు, అంగీరసగణము, అగ్నిగణము, అగ్నిష్వాత్తగణము, కవ్యవాహన గణములనువారలు ఈ త్రివర్గమగు కర్మలోకాదుల సంబంధములుగల వారలై స్వర్గముననుందురు. వీరలీ మన్వంతరముతో పైవరిబ్రహ్మలోకాదులను బొందుదురు కొందరు తైత్తిరీయ భృగ్వానందవల్లిలోఁ జెప్పిన చిరలోకపితరులను గుఱించిన ఆనందమును బొందునట్లు వివరింపఁబడెను.

పితరులు మూర్తామూర్తులుగఁగూడ నున్నారు. దీనివివరము శ్రాద్ధమంత్ర మునఁగూడనున్నది. మూర్తులందరును దృశ్యరూపములో స్వర్గమును జంద్రలోకము నాశ్రయించి తేజస్స్వరూపములతో నుందురు. ఈనాలుగు గణములవారలు నాలుగువర్ణములతోను రూపములతోను నుందురు.

పితరులకు వసురుద్రాదిత్యరూపములున్నవి. వసులోకసంబంధపితరులు వసు రూపులుగను, రుద్రలోకసంబంధ పితరులు రుద్రరూపులుగను, ఆదిత్యలోకసంబం ధము పితరులాదిత్యరూపులుగను ధ్రువాదూర్ధ్వలోకముల నుందురు. పరిపక్వదశతో నీరూపాదులను బొందునవకాశములు వర్గసంబంధముండుటచేత ఏనాటికైనను దపో బలముతో అచ్చటనుండి తమపైలోకాదులను బొందవచ్చును.

ఇంకను మనలోకములో స్వర్గపాథేయ శ్రాద్ధమునొకదానిని ఆచరింతురు. ఈ శ్రాద్ధాది దేవత పితురుఁడు. ముందు తమజ్ఞాతులలో నెవరికిఁగాని త్రివర్గ రూపాదులలో సంబంధముండని యతఁడు అతని నుద్దేశించి చేయుకార్యజ్ఞ మీస్వర్గ పాథేయము.

—o—

## పి తృ శ్రా ద్ధ ము లు య జ్ఞ తు ల్య ము లు.

సర్వదేవతలకు హావిర్భాగముల నిచ్చుకర్మయే యజ్ఞము. వేదమంత్రము లతో సామముతో వషట్కారములతో ఆహ్వానించి నియమానుసారము గ హావిర్భా గములను సర్వదేవతా స్వరూపమగు అగ్నియందు వ్రేల్చుట యందలి ముఖ్య కర్మాంగము. ఈయజ్ఞములైదువిధములు. అందుఁబితృయజ్ఞమొకటి. దీనిని ప్రథమ భాగములోఁజాలావివరించియున్నాను. "దేవయజ్ఞః పితృయజ్ఞో భూతయజ్ఞస్తథై వచ। మనుష్యబ్రహ్మయజ్ఞాచ పంచయజ్ఞాః ప్రచక్షతే।" స్మృతిముక్తాఫలము వివ రము "యత్పితృభ్యః స్వధాకరోత్యప్యస్తత్పితృ యజ్ఞస్సంతిష్ఠతే" పితృయజ్ఞస్తుతర్ప ణమ్। పితృశ్రాద్ధాదులందు మన సంబంధ పితృలకేకాక అసంస్కారులై నరకలోక ములోఁ జాలకాలమునుండి పరితపించుచున్నవారలనుగూడ తృప్తిపరచు విధానాది క్రియలున్నవి. మనకర్తవ్యములోఁ బిండతర్పణాదుల నొసగఁబడని యితరపితరు లనేకులున్నారు. వారలకు సంతతివారలుండవచ్చును లేకపోవచ్చును. దీనిని మనము నిశ్చయించలేము. సంవత్సరమున కొకసారి మహాలయశ్రాద్ధమున సట్టి సర్వపితరులకు సంబంధములు గలుగఁజేసి వారందరిని దృప్తిపరచులాగున నేర్పరచిరి. దేవమానముతో మనసంవత్సరకాలమువారల కొక్క దినమగును కాబట్టి మన సంవత్సర శ్రాద్ధములవారలకు నిత్యశ్రాద్ధములగును. ఇంకను గయాది మహాశ్రా ద్ధములతో మనకుజ్ఞాపకము గలిగిన వారలెవ్వరైనను మృతిచెంది ప్రేతవిముక్తి లేక కర్మలులేకయున్నవారలకు సహిత ముద్దేశించి పిండదానము చేసినచో వారలకుప్రే తత్వవిముక్తి తత్క్షణమేయగునని వేదప్రమాణములున్నవి. ఇదెంతసూక్ష్మమైనను ప్రేత త్వ మనుభవించువారలకు మనమెంత ఉపకారులమైతిమో వర్ణనాతీతము. "అనాథ ప్రేతసంస్కారాత్ కోటియజ్ఞఫలం లభేత్" అని యున్నది. ఈసంస్కారమన్నివిధ ముల నాచరింపఁదగును. శ్రాద్ధము నెంతశ్రద్ధతోఁజేసిన నంతఫలవంతమగును.

ఈపితృకార్యములు సర్వదేశములవారికిని సర్వమతములవారికి నున్నవి. శ్రాద్ధము పితృగణములందరిని మనమారాధించు విధానమగుటచేత యజ్ఞమనఁదగను. యజ్ఞమనగా సమష్టిరూపము. వీనినాచరించుటవలన దేవతలకును, పితరులకును, ఋషులకును, భూతములకును, మనుష్యులకును మనమెంత మహోపకారులుగ నున్నామో తెలియవలెను. ఇట్టిమనము నాస్తికులమైనచో మనజన్మమెంత నిరర్థకమగునో యెంతఋణములపాలగునో తెలియదు. ఋణములనుదీర్చినఁగాని బంధవిముక్తులము జ్ఞానులము గానేరము. వేదముల విమర్శించిన మనకన్నివిషయములు తేటతెల్లమగును. దానమన విధ్యుక్తముల నాచరించి సుకృతి గననగు. కాన వేదము మనల నుద్ధరించు నననచ్చును.

గంధముతీయునపుడు క్రిందపడు గంధపుబిందువులు నరకలోకములోనున్న మనసంతతివారలను గొందరినిఁ దృప్తిపరచుచున్నవి. పిండప్రదానసమయములో క్రిందపడు జలబిందువులతో నరకలోకవాసులగు మనసంతతివారలు కొందరు తృప్తులగుచున్నారు. కర్మానంతరము సమార్జనముతోఁ గ్రిందఁబడిన జలబిందువులతో నరకలోకవాసులగు మనసంతతివారలు కొందరు తృప్తులగుచున్నారు.

బ్రాహ్మణశుద్ధాచమనీయముతోను, పాదప్రక్షాళన జలబిందువులతోను, నిమంత్రిత బ్రాహ్మణ జలాన్నవిక్షేపముతోను గొందరు తృప్తులగుచున్నారు. వికిరాన్నప్రదానకర్మలతోను, వికిరపిండ ప్రదానముతోను, మనవంశములో అసంస్కారులు, కులత్యాగులును, యజ్ఞభాగములులేని దేవతలు అగ్నిదగ్ధులు అనగ్నిదగ్ధులునై గతించినవారలు సంతృప్తులగుచున్నారు. ఈ క్రియామంత్రములందే అర్థవిమర్శనలున్నవి. ఇట్టిసంపూర్ణ శ్రాద్ధమహిమను దెలియకను దెలిసికొనలేకను సంపూర్ణశ్రాద్ధములను విడనాడి తుదకు సంకల్పశ్రాద్ధములను బ్రహ్మార్పణములను మాత్రము కాలమహిమతోఁ జేయుదురు. ఇంకను దర్పణానంతరము యజ్ఞోపవీతసూత్రనిష్పీడనోదకముతోను, ఆవలఁగొన్ని తర్పణాదులతోను బంధువులకును, బంధువర్గముగానివారలకును, సర్వులకును దృప్తికలుగును. ఇదియుఁగాక స్నానాదులందు వస్త్రనిష్పీడనోదకముచేతను, ఉత్తరాపోశనమందు హస్తగతశేషోదకము విడుచుటచేతను గొందరు తృప్తిపడుచుందురు. అందుచేతనే సంధ్యావందనాదిసర్వకర్మల నాచరించుట యెల్లరకు మరవరానిది. తప్పక శ్రద్ధాభక్తులతో శ్రాద్ధముల నాచరించుట చాలముఖ్యము. కలికాలమున సర్వధర్మములకు గ్లానిగలిగినది. మనమున్నంతలో విడువక యాచరించితీరవలెను. కాలమునకు మార్పురాఁగలదు.

కాలము శాశ్వతముగాదు.

శ్రాద్ధమున బ్రాహ్మణులకు నిష్టాపూర్తి భోజనముతో బ్రదక్షిణనమస్కార ముతో అర్ఘ్యపాద్యాచమనాదులతో పాదప్రక్షాళనముతో, అర్చనాదులతో, వస్త్రములతో, నూతనపదార్థములతో, బహువిధపాక పరిపక్వపదార్థములతో, సంపూర్ణతృప్తికాములుగఁ జేయుచున్నాము. యజ్ఞదక్షిణసహిత తాంబూలాదుల తోను ఔపచారికముఁలతోను వాహనాదుల సౌకర్యములఁగావించి సంపూర్ణతృప్తి పరచి అనుగ్రహపాత్రులగుచున్నాము. తుదకు మనతలిదండ్రులు, గురువులుఁ పండితులు, అభ్యాగతాతిథులు సహితము మనయింటికివచ్చినచో నిట్టిశ్రద్ధతో బూజించవలెను. తలిదండ్రులు తీర్థయాత్రలుచేసి తీర్థమును దెచ్చినను వారలను మన యింటికి రాగానే యీవిధముగా అర్చింతుము. ఇవన్నియు గ్రమముగా నిత్యకృత్య ములుగాఁ జేయవలసినవి.

తుదకు దగినయోగ్యులు, మహనీయులు, లభించినరోజునఁ బ్రత్యేకించి శ్రాద్ధమును దప్పక చేసిన నధికఫలమున్నదని ప్రమాణములున్నవి. ఇట్టివారలు లభించుట అరుదు. ల భిం చి న రో జు మహాపర్వముగా భావించి చేయుట ఉత్తమధర్మమనిరి. శ్రాద్ధకాలమందు గర్త చాలానియమాదులతో నిగ్రహశక్తి యుక్తుఁడై యుండవలెను. భోక్తలుగూడ పూర్వమందును భోజనానంతరమందును నియమాదులతో నుండవలెను. ఉభయులు భోజనానంతరము మరిదేనిని ఆశించి భుజించరాదు. నీరుమాత్రము విధిలేక తీసుకొనవచ్చును. మరుసటిరోజు "పరేహణి" స్నానముతో విముక్తియగును. బ్రాహ్మణులు నిమంత్రితస్నానముతో, మరుదినము ఉదయముననే స్నానముచేసి, గాయత్రీమంత్రముతో నెనిమిది మారులు అభిమం త్రిత హస్తోదకపానమును ముమ్మారు ప్రాశనము చేసినగాని పరిశుద్ధులుకారు. అవలఁ బ్రత్యేకించి శతగాయత్రీ మంత్రజపమును దప్పక చేయవలెను. సంధ్యావం దనమును సంక్షేపముగా కర్తచే నీయఁబడిన దర్భాంకురములను భద్రపరచుకొని చేయువలెను. మన పితృశ్రాద్ధములేకాక అనేక విధములగు శ్రాద్ధములున్నవి. మన్వాదులందును, యుగాదులందును, సంక్రమణములందును, పర్వము లందును, అష్టకాదుల నిత్యశ్రాద్ధములు ననేకవిధములుగఁ జేయవలసినవి యున్నవి. నక్షత్రశ్రాద్ధములును, మఘానక్షత్రయుత శ్రాద్ధమును గయాశ్రాద్ధము కన్యారాశిలో సూర్యుడుండు మహాలయశ్రాద్ధము, భాద్రపద బహుళపక్షమున గ్రమముగ అన్నితిథులను నక్షత్రములననుసరించి శ్రాద్ధములను

ధనుర్మాసశ్రాద్ధములును, అత్యుత్తమములు. యోగిగాని జ్ఞానిగాని నిమంత్రణకు లభింపఁజేసిన శ్రాద్ధము మహిమ వర్ణనాతీతము.

వృద్ధిశ్రాద్ధములు గొన్నియున్నవి. సర్వశుభకార్యములందు నివి ముఖ్యముగఁ జేయవలెను. ఇవి ఉభయవర్గములకుఁ (సపత్నీకముగా) జేయవలెను. తిర్యగ్యోనియందు జన్మించినవారలు, వృక్షరూపమునొందినవారలు స్నానకాలమందు వస్త్రమును సమచెరుగులతో నాలుగుమడతలతో నుందుగా మలినముపోవులాగున ఉదకము వేసి పిండినవారలు మరల జలమును వేసి ఉపరివస్త్రముతోఁ బిండినఉదకముతోఁ దృప్తులగుదురు, "ఏకవాససోననిమజ్జేత్" అను గౌతమసూత్రప్రకార మొంటి వస్త్రముతో స్నానముచేయరాదు. అట్లుచేసి కట్టుకొన్నవస్త్రమును బిండిన బైవారికి రేతఃపానమగును అందుచే ఉపరివస్త్రోదకము నీయవలెను.

సంతానార్థముగ మధ్యమపిండమును మాతృపూర్వకముతో భార్యకు నీయవచ్చునని శాస్త్రము బోధించును. కొన్నిదేశములందీయాచారమున్నది. పూర్వము ఛాయయను భూపత్ని మధ్యమపిండమును దినినందుచేత నరకాసురుఁడుపుట్టెను.

సింధునదికుత్తరమున, నర్మదానదికి దక్షిణభాగములోఁగల కరతోయనదివద్ద తీర్థశ్రాద్ధము నిష్ఫలమగును.

నిత్యశ్రాద్ధముల దైవంబులు, నైమిత్తికముల సద్దేవతములు. కామ్యశ్రాద్ధములు ప్రతిసంవత్సరమునందును శ్రాద్ధకర్తయొక్క కోరిక వేదావిరుద్ధమైనయెడల దప్పక చేయవచ్చును.

శ్రాద్ధములో "ఊర్జంవహంతీ రమృతంఘృతం పయఃకీలాలమ్"అను మంత్రక్రియాకర్మలున్నవి

ఊర్ధ్వచంద్రుణికుమార్తె. ఈమెనుమనపితరులు మోహించుటచేత శాపదగ్ధులై భూమిలోజన్మించిరి. విశ్వేదేవతలు మోహించక ధన్యులై స్వర్గమున నిలిచిరి. అనిపౌరాణిక చరిత్రకలదు. ఈమెతండ్రి కోపముతో హిమాలయపర్వతమునందుఁ "గోక"యనునదిగాఁ బుట్టెను. కొంతకాలమునకు దైవికముగఁ బితరులీనదిలో స్నానముచేయుసమయములో శ్రీయజ్ఞస్వరూప వరాహమూర్తి చిమ్మివేయగాఁ బితరులు, ఆనదియును శాపవిముక్తులైరి. వరాహరోమములే దర్భలు. స్వేదోదక బిందువులే తిలలయ్యెను. అందుచేత నివిముఖ్యములు. మరల శ్రాద్ధాదులందు విశ్వేదేవతలరక్షించి మొదటఁపూజించుటచేత (బితరులు ధన్యులైరి. అందుచేత శ్రాద్ధాదులందు విశ్వేదేవతలు ముఖ్యులైరి. ఊర్జంవహంతీ అనుమంత్రములో,

వేయుదురు "కోకనదీ" తీర్థమనెడి భావముతోఁ బిండప్రదానము చేయుటచేతఁ బితరులకుఁ దృప్తికరములగును. ఈఅర్థమునే "తిలోసిసోమదేవత్యః" అను మంత్రము కూడచెప్పుచున్నది. దీనరాక్షసులు రాకుండ నివారణయగును. పిండములకు నిది యొక యావరణమగును. కీలాలం=నీళ్లకును, అగ్నిజ్వాల నడ్డగించుటకును అర్థముగనున్నది. బంధనమనిగూడ అర్థమున్నది. ఊర్జయనగా=ఉత్సాహమను అర్థము. ఛాయయను భూపత్నిచేతను సోముఁడధిదేవత యగుటచేతను స్వధాయను నామముగలిగెను.

అగ్ని=పితృనివాస స్థానము. సప్తపితృగణములలో అగ్నియొక పితృగణము. వాయువు, సూర్యుఁడును బితరులకు నివాసస్థానములు. దక్షపుత్రికలు, ఊర్జ, కీలాల, మధు స్వధాయనువారలు. కోకమును నది జలముగను, అగ్నిసంబంధముగ నుండుట చేతఁ బితరులప్రీతికై చేయుదురు. మధుపీనదీజలమే శ్రాద్ధములకు, మధువు, తిలలు, దర్భలు, రజతము, గయాగదాధరుడు, మధ్యమ, స్వధాకారము, పిండము, ముఖ్యములు.

మహాలయమందును, గయాశ్రాద్ధమందును ధర్మపిండములనేకములువేయ తగినవియున్నవి. ఇది సర్వులకు మహోపకార క్రియాకర్మ.

ఈకారణములతో శ్రాద్ధము యజ్ఞవరాహ రూపముదాల్చినదై యజ్ఞమాయెను. దేవతాగణసమూహముతో దేవయజ్ఞము పితృగణసమూహముతోఁ బితృయజ్ఞమగును.

(౧) అష్టకాదులు, మన్వంతరములు. అన్వష్టకములు మాతృపూర్వకములు. (౨) గ్రహణ, వ్యతీపాతామావాస్యా, జన్మనక్షత్ర గ్రహశాంతులందు శ్రాద్ధములు పితృపూర్వకములు. (3) అయన, విషువద్వయబిందు, సంక్రాంతులు మంత్రవిధిగను బిండరహితముగఁ జేయవలెను.

శ్లో॥ ప్రత్యబ్దాబ్దానుమాసికే త్రిపురుషం తీర్థేగయాయాం సకృత్పుష్టే తత్స్వహ దైవతం ప్రతిదినం శ్రాద్ధం త్వమంత్రంతత॥ షడ్దైవత్యము మాసునై మనుయుగ క్రాంతేషు పాతేధృతె। వృద్ధ్యష్టగ్రహణే నవాత్మకమిదం అన్యేషు షడ్దైవతం॥

పిండసంబంధులు; పితృ, పితామహ, ప్రపితామహులు, దేవసంబంధులు పితామహ, ప్రపితామహ, ప్రప్రపితామహులు మాతృపూర్వక శ్రాద్ధములలోఁ బంచముఁడును బితృపూర్వక శ్రౌతశ్రాద్ధాదులలో సప్తముఁడనియూ సాపిండ్య నివృత్తినిఁగూర్చి చెప్పుటలో నిర్ణయసింధుగ్రంథమందు కమలాకరుఁడు, శ్లో॥ కవా

పత్ర ప్రమాణేనఅని స్మృతివచనము నుదహరించి వ్యాఖ్యానించినాఁడు గ్రంథవిస్తర భీతిచే వ్రాయలేను. అచ్చటఁజూచుకొనవలెను.

యజమానుఁడు మొదలుగా సప్తర్షులు పూర్వాపరపంక్తిలోఁ బిండభాక్కు లగుటచే నొకేపురుషరూపముగా లెక్కింపఁబడెదరని తెలియవలెను.

యజ్ఞయాగాదులలోను దేవతాపూజలందును సర్వకర్మలందును మధ్యలోఁ గ్రిందఁబడు జలబిందువులు, నాజ్యబిందువులు హవిస్సంబంధమైన మెతుకులు వృథాకాక యజ్ఞభాగములులేనివారలకుఁ దృప్తినిఁగలిగించును. ఆకారణంబుగఁ యజ్ఞశేషములన్నియూ వేదినతిక్రమించకుండ పృథివిపైఁబడిన వేవియుఁగాని యొంతమాత్రము వృథాఁకాజాలదు. ఏదోయొకవిధమగు జీవరాశి దానినిగ్రహించును. తుదకు (బృథివికూడ నాసారమునులాగును. అందుచేతనే మనధర్మములలోఁ గ్రిందఁబడినవాటిని మరలగ్రహించరాదని ధర్మజ్ఞులైన మనపెద్దలుచెప్పుదురు. ఇప్పటి వైజ్ఞానికులు ప్రకృతిప్రత్యక్ష దృష్టిలో నిలాగుననే గ్రహింపఁగూడదని చెప్పుదురు. మనవారలు క్రిందఁబడిన వుచ్ఛిష్టములనికూడఁ జెప్పుదురు. ఈలాగున సర్వమును ప్రకృతిదృష్టిలో విమర్శించి నన్నియును ఆధ్యాత్మికదృష్టితోను విమర్శించవలెను. ప్రకృతిదృష్టిలో దేహసంబంధముగను ఆధ్యాత్మదృష్టిలో ఆత్మసంబంధములుగ నగును. అభిమాన మనస్సుల నాశ్రయించి భేదములుగ నుండును.

—♦ శ్రాద్ధదినేదాతృ భోక్తృనియమః. ♦—

బృహస్పతిః- తాం నిశాం బ్రహ్మచారీస్యాచ్ఛ్రాద్ధకృచ్ఛ్రాద్ధికస్సహ। అన్యథావర్తమానౌ తౌస్యాతాం నిరయగామినౌ॥ మత్స్యః - పునర్భోజనమధ్వానం యానమాసనమైథునే। శ్రాద్ధకృచ్ఛ్రాద్ధభుక్చైవ సర్వమేతద్వివర్జయేత్॥ స్వాధ్యాయం కలహంచైవ దివాస్వాపంచ స్వేచ్ఛయా॥ యమః - పునర్భోజనమధ్వానం భారాధ్యయనసంగమాః। సంధ్యాం ప్రతిగ్రహం హోమం శ్రాద్ధభుక్త్వష్టవర్జయేత్॥ దంతధావన తాంబూల క్షౌరాభ్యంగన భోజనమ్। రత్యౌషధ పరాన్నాని శ్రాద్ధకర్తా వివర్జయేత్॥ సంధ్యాహోమయోః ప్రతిషేధస్స్వకృత ప్రాయశ్చిత్తస్య, కృతేప్రాయశ్చిత్తేకుర్యాత్॥ అతఏవ భవిష్యత్పురాణమ్ - దశకృత్వః పిబేచ్చాపో గాయత్ర్యా శ్రాద్ధభుగ్ద్విజః। తతస్సంధ్యాముపాసీత జపేచ్చజుహుయాదపి. ఇతి॥ జుహుయాదిత్యేత దన్యస్య హోమాతురలాభే ద్రష్టవ్యమ్ తల్లాభేతు తేనైవహావయేత్। యదాహ కాత్యాయనః - సూతకేచ ప్రవాసేచవ్యాశక్తౌ శ్రాద్ధభోజనే। ఏవమాదినిమిత్తేషు హావయేద్వేతి యోజయేత్॥ ఇతి హావయేద్వేతి

యజ్ఞోభిలాది భిరుక్తం తదేవమాది నిమిత్తేషు రోజయేదిత్యర్థః॥ పరేద్యురపి తత్ప్రీత్యై బ్రాహ్మణాన్ భోజయేద్ద్విజః। అనపేత్యస్థతస్యైవ శాపం దత్వాప్రజంతి తే॥

శ్రాద్ధంబుచేయుట ముఖ్యకర్తవ్యములలోనొకటి. ఇందుభోక్తలు కర్తయుఁ గొన్ని నియమములఁ బాటించవలయును. కృచ్ఛ్రములతోను, బ్రహ్మచర్యముతోను శ్రాద్ధదివస రాత్రిము గడపవలయును. అట్లుగావింపనివాఁడు నిరయంబునందును. నాఁడుపునర్భోజనము, త్రోవనడచుట, మైథునము వర్జింపవలయును. మరియు నధ్యయనకలహ దివానిద్రల వర్జింపవలయును. పునర్భోజనాధ్వగమన భారవహనాధ్యయన సంగమ సంధ్యావందన ప్రతిగ్రహ హోమాంతాష్ట కర్మలవిడువవలయునని యముఁడుపలికెను. శ్రాద్ధకర్త దంతధావన తాంబూలక్షౌరాభ్యంగ భోజన రత్యౌషధ పరాన్నభోజనకర్మల నాచరింపరాదు. (భోజనమనశ్రాద్ధకర్మమునకు ముందువెనుకల నేవిధమైన యాహారము గొనరాదనిభావము) కర్తకు నిషేధింపఁబడిన అభోజనము ఏకాదశ్యాది వ్రతాంగోపవాస విషయమని తెలియతగినవి. సంధ్యాహోమనియమముగలవారలు ప్రాయశ్చిత్తంబుగ స్నానమాచరించి గాయత్రీ మంత్రంబుచే నభిమంత్రించిన జలములఁబదితడవలు పానముచేసి యాచరింపవచ్చును. నియమరహితులాచరించరాదు. ఆచరించిన నిష్ఫలంబగు మృతాశౌచ జాతాశౌచ ప్రవాసగతాశక్తులు హోమక్రియ కనర్హులు. శ్రాద్ధదినమునకు మరుసటిదినమున భోక్తల భోజనాదుల సంతృప్తుల నొనర్పవలయును.

—o—

## అపరాహ్ణకాల మెట్లు పితరులకు ముఖ్యము.

మనకుఁగల పగటికాలము నయిదుభాగములుగ జేయఁగ నందు (౧) ప్రాతఃకాలము, (౨) సంగమకాలము, (౩) మధ్యాహ్నకాలము, (౪) అపరాహ్ణకాలము, (౫) సాయంకాలము. మనకుఁగావలసిన తిథియందు, అపరాహ్ణకాల మెంతయధికవ్యాప్తిగా నేదినముందుండునో ఆనాఁడు తిథినిర్ణయము చేయవలెను. రెండుదినములందు సమముగ వ్యాప్తిగానున్నచో మొదటిరోజు తిథినేగ్రహించి పితృకార్యాదులను జేయువలెను. ఏలననగా మొదటిరోజునందు మనకుఁగావలసిన తిథి దీర్ఘకాలవ్యాప్తితో మరుసటిరోజున అపరాహ్ణములో గొంతవఱకు వ్యాప్తిగా

నుండును.

పితృలోకము స్వర్గలోకములో (శింశుమారములో) దక్షిణదిశలో యమపుర మునకుఁ బశ్చిమదిశ సమీపమునను న్నది. అన మానసోత్తర పర్వతమునకును లోకాలోకపర్వతమునకును మధ్యలో శింశుమారములో మృగవీధియందుఁ బితృ లోకమున్నది. కాబట్టి మనకు అపరాహ్ణకాలమునకుసరిగా పితృలోకములో సూర్యసంచార మేర్పడి వారికి సంగమకాలముగా నేర్పడును. ఈకాలము మనకును బితృలోకమునకును కర్మసాక్షియగు సూర్యసంబంధముకలది. సూర్యోదయముతో నే కర్మలకు ముఖ్యావకాశము, రాత్రికాలము తమస్సుతోఁ బ్రళయకాలముగ నుండుటచేత గర్మలకు నిషిద్ధము. మనము పితరుల నుద్దేశించిచేయు దానధర్మా దులు శ్రాద్ధాది కార్యములు పగటికాలములోఁ బితరులకుఁ జెందినచో వారికి, నివి భోగ్యములుగానుండును. రాత్రికాలములో నెవరికిని బ్రయోజనములుగావు. మనముచేసినవి ఉపకారములుగాక ప్రళయములోఁ జేరినవగును. వృథాశ్రమ యగును. ప్రార్థనలు, హోమాదులందు ఆహుతులు, నైవేద్యములు, అర్చనాదులు, ధ్యానాదులు మనసంకల్పానుసారము మనస్సంబంధముతో మనస్సులో నాయామూ ర్తిని నిలిపి తదాకార చిత్తవృత్తితోఁ జేయ దేవతలు వేదమంత్రావాహనతో నాశ్రుతిను లందును, గార్హ్యస్థలమందును అర్చించుమానవులందును ఆవహించియుండును. మనముగూడ ఆరాధన కాలాంతమువఱకును దదేకధ్యానభావముతోఁ దత్స్వరూప ముగను మనత్రికరణములు నుండునేకాని యితరభావముతో సహజముగ నుండదు. మనము మనస్సులో కోరికలను సంకల్పములతో ముందుగా నాలోచించనిదే యేకా ర్యము స్థూలములో సిద్ధించదు. ఈలాగుననే మనస్సంకల్ప భావనలతోఁ గార్యముల నీలోకములో మరల బ్రత్యక్షఫలముగాంచి అనుభవింతుము. కోరికలు నెరవేరును. అనుకొన్నది ప్రత్యక్షానుభవములే భావనయు, మనస్సు సంకల్పములు లేనివారి విషయమును గుఱించి ఆలోచింపఁబనిలేదు. మనకర్మలన్నియును అగ్నిసా క్షిగను, సూర్యచంద్రాదులసాక్షిగను, అఖండజ్యోతిరూప దీపసాక్షిగను శ్రీగణపతి దేవతాసాక్షిగ వేదమంత్రోచ్చారణతోఁ బ్రతికార్యములను జేయుచున్నాము. శూన్యముగ శూన్యరూపముతో రిక్తహస్తములతో వస్తుహీనముగ జేయము. ఇవ న్నియు మనకర్మలకు సాక్షిగానుండును. ఇందులకు మనకర్మలలోఁ గడపటివాక్యము మంత్రహీనము, క్రియాహీనము, భక్తిహీనము, పొరపాటున జరిగినచో సర్వము జనార్దనస్మరణచేఁ బరిపూర్ణమగు గాతయని. తెలియనిలోపాదులను గుఱించి సమ

సాకారరూపముతో బ్రార్థించి ఈశ్వరార్పణము చేయుదుము. సర్వదేశమతముల వారందరును దమకార్యముల నీలాగుననే చేయుచున్నను మన నుమాత్రము తృణీకరింతురు. మనయొక్క భిన్నభావము, అభిమానహీనత స్వధర్మత్యాగము మనల నిట్టిస్థితికిఁ దెచ్చినవి. ఇతరదేశీయులు తమస్వధర్మమును, మతమును త్యాగమెవ్వరు నింతవరకుఁ జేసినది లేదు. తమ మతములో మనలను జేర్చుచుండుటసత్యము ప్రత్యక్షానుభవము. ఎవరేమిచేసినను పైవిధానము ననుసరించియే చేయవలెనుగాని, మరేవిధానముగాని మార్గముగాని లేదు. సర్వమతములీవిధానమార్గముననే నడువవలెను.

సూర్యుఁడు జగదాత్మగాఁ దనతేజస్సుతో సృష్టిస్థితిలయాదులతో జగత్ప్రభువుగను లోకభర్తగను నుండుటచేతను బరిపాలనతో సర్వులకును అందఁజేయుభార మాయనయందున్నది. మనరాజ్యములో మన సర్వవ్యవహారాది కార్యములను ఎవరెవరికిఁ జెందవలసినవి మనము చిరునామా చక్కగా వ్రాసినచో టపాలాశాఖద్వారా యెట్లు వారలకుఁ జెంది ఫలానుభవములుగా నగుచున్నవో యటులనే మహాశక్తి సంపన్నుఁడగు త్రిమూర్తిస్వరూపుఁడగు సూర్యునిగుఱించి చేయుక్రియ లాతనిఁజెంది ఫలవంతములగును.

దీనినాలోచించి మనపితృశ్రాద్ధములను ద్వివిధకర్మలుగాఁ జేసిరి. ఏలననగా మనపితరులు, పితృలోకములో నుండవచ్చును, పుణ్యక్షీణముతో మర్త్యలోకమగు నీలోకములో మానవులుగను లేక యితర జీవరాసులుగను వారికర్మానుసారము జన్మించియుండవచ్చును. అందులకే శ్రాద్ధమును అగ్నౌకరణముతో యజ్ఞేశ్వరుని యందు ఆహుతులతో దేవలోకములందుండినచో అచ్చటికి చేరులాగునను, బ్రాహ్మణభోజనాదులతో నీలోకములో మానవాకృతితో సజాతీయ సంబంధులైన వారికిఁ జేరులాగునను, పిండప్రదానముచ నితరజీవరాసులలో జన్మించినచోఁ జెందులాగున నియమించిరి.

అగ్నియందుఁజేసిన ఆజ్యాద్యాహుతులు, కర్మలును దేజోరూపములై ఆదిత్య ప్రకాశ సుషుమ్నాదులతో ఆదిత్యునిఁజేరును. ఆదిత్యుఁడు జగత్ప్రభువుగాన ఆయాలోకముల వారలకుఁ గర్మరూపఫలము లందఁజేయును. ఈ ఫలములతో లోకానుసారసుఖము లనుభవింతురు. మనరాజ్యములో ప్రభువులకు విన్నవించి మనకార్యసాధనములను జేసుకొన్నవిధానముగను దపాలు, రైళ్లద్వారా పంపినవి మనవారలకెట్లు చేరగలవో అటులనే విధానము: సమన్వయము.

మనకు ఁబూర్వదిశన సూర్యోదయమైనచో నన్ని దిక్కుల వారికిని ఁబూర్వన సూర్యోదయముగా నేరదు సూర్యగమనసంచారక్రమముతో నాయాదిశలలో ము లను సూర్యుఁడు బొడఁచునపుడే సూర్యోదయమగును. మనసూర్యోదయము దక్షిణదిశలోఁగల సంయమనీపుర వాసులకు రాత్రికాలమగును, మనకుమధ్యాహ్నము వారలకుదయకాలముగను, మనకపరాహ్ణము వారికి సంగమ మధ్యాహ్నముగను గొంచెమించుమించుగా నగుచుండును మన కపరాహ్ణము వారికి సంగమ మధ్యాహ్నమిశ్రిత సకాలమగును. సూర్యోదయము సర్వులకు నొకేవిధముగ మనలోకమునఁగాని మరేయితరలోకములవారికిఁగాని, యొకేకాలముగ నుండదు. సూర్యోదయాదినుండి మనకు మధ్యాహ్నమగుటకు ఁబదునైదుఘడియల కాలము పట్టును. మరల పదునైదుఘడియల కాలము అస్తమయమగును ఉదయదిశనుండి దక్షిణదిశకుఁ బదునైదుఘడియలకాల దూరముననున్నది. దక్షిణదిశనుండి పశ్చిమము అస్తమయదిశనుఁ బదునైదు ఘడియలకాల దూరముననున్నది. దీనినే శింశుమారముతో సూర్యసంబంధముగా మనభూమికి దినమొక డిగ్రీప్రకారము సంవత్సరమునకు మూడువందల అఱువది అంశలుగా (డిగ్రీలుగ) విభజించిరి, ఇవే మనకు దినసంజ్ఞలుగను, మనసంవత్సరము స్వర్గలోకములవారి కొకదినముగ (అరువదిఘడియలు) నేర్పడెను.

కాబట్టి పితృకార్యములు అపరాహ్ణములోఁ జేయుట పితరులకు ముఖ్యకాలమగును. విపరీతములుగఁ జేసిన అకాలకార్యములగును. ఈలోకములో ఒకరి కొకరు పరోపకారములు చేయుచున్నట్లుగ మనము పితరులసంతతిలోఁ జేరినవారలగుటచేతను, పితరులుండు లోకములో, గర్మల కవకాశమార్గము లేనందుచేతను, మనము వారిసంపాదనతో భోగ్యవర్గములోఁ జేరి కొంతకాలము వృద్ధియైనందుచేతను, వారల యనుగ్రహాశీర్వాదములను బొందుటకును శ్రాద్ధాదులను దర్పణాదులను జేయుట ధర్మము.

మనము సంకల్పరూపముతో నామగోత్రోచ్చారణతో మంత్రరూపముతోఁ జేయుట వారిచిరునామావలెనగుచు వారికే తప్పక పొందును. ఉదకరూపముతోఁ దర్పణాదులు చేయుటచేత నాశీవకములు రథరూపములై వారిలోకమునఁ జేర్చును. ఇందుకు మంత్రవిశేషమున్నది. "దేవస్యత్వా సవితుః ప్రసవే. అశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాం రాజాత్వావరుణో దేవిదక్షిణే హిరణ్యం" ఈ పృథివిలోని సర్వవస్తువులు మనకు పైలోకమునుండియే క్రమముగా వచ్చుటచేత మరల

వహ్నియును అంత్యమునఁ బైలోకమునే చేయును. సూర్యరశ్మియగ్నిటిని ఆకర్షించుచుఁ బైలోకమునుజేర్చును. సూర్యునియందు సర్వశక్తులున్నవి, పితృలోకమునకును త్రిశంకుస్వర్గమునకు సంబంధముగలదు. పితృలోకదిశయుబట్టి యమధర్మరాజు పితృలోకాధిపతిగనున్నాఁడు. అందుచేతఁ బితరులకును యమధర్మరాజునకు సంబంధము కలదు. త్రిశంకుస్వర్గ మధోముఖముగ నున్నది. (అధోముఖసృష్టికి స్థానముగ నున్నది.) ఇదియే పితృలోకము పితృకర్మలు అపసవ్యములుగా నుండుటకుఁ గారణము. పితృకర్మలుగూడ నిత్యకర్మల యనంతరముచేయవలెను. పితృకర్మల నాచరించినవెనుక మరేకర్మలను జేయరాదు. చేసినచోఁ బితరులకు విరుద్ధముగాఁ జేసినట్లగును. వారలు తృప్తినొందరు. పితృలోకము దక్షిణదిశతోను, అపరాహ్ణకాలముతోను పితరకర్మలు మధ్యాహ్నమునకే ముగించవలసినవిగా నుండుటచేతను కాలభేదముచేతను లోకభేదముచేతను వీరలనుగురించిజేయు కర్మలంత్యములుగా నేర్పడెను. అపరాహ్ణానంతరము సాయాహ్నమే మిగులును. పితృకార్యానలం దితర సంబంధములే యుండరాదు. పితరులకుమాత్రమే సంబంధించినవై యుండవలెను. ఇతరస్పర్శలు పితరులకు సరిపోవు.



## విషుసంజ్ఞ అమావాస్య విశేషము పితరులసంబంధము.

శ్లో॥ కృత్తికానాం యదాసూర్యః ప్రథమాంశ గతోభవేత్। విశాఖానాం తథాజ్ఞేయ శ్చతుర్థాంశే నిశాకరః॥ ౧౯౬ ॥ విశాఖాయాం యదాసూర్యశ్చరతేంఽశం తృతీయకంతదా చంద్రం విజానీయాత్ కృత్తికాశిరసి స్థితం॥ ౧౯౭ ॥ విషువంతం తదావిద్యాదేవమాహుర్మహర్షయః। సూర్యేణవిషుదం విద్యాత్ కాలం సోమేనలక్ష్యతే॥ ౧౯౮ ॥ సమారాత్రిరహశ్చైవ యదాతద్విషు వద్భవేత్। తదా దానాని దేయాని పితృభ్యో విషువత్యపి। బ్రాహ్మణేభ్యో విశేషేణ ముఖమేతత్తు దైవతం॥ ౧౯౯ ॥ ఊనరాత్రాధి మాసాచ వలాకాష్ఠా ముహూర్తకాః। పౌర్ణమాసీ తథాజ్ఞేయా అమావాస్యా తథైవచ। సినీవాలీ కుహూశ్చైవ రాకాచానుమతిస్తథా॥ ౨౦౦ ॥ తపస్తపస్యౌ మధుమాధవౌచ శుక్రః శుచిశ్చాయన ముత్తరాస్యాత్। నభోనభస్యోఽథ ఇషః సహోర్జః సహః సహస్యావితి దక్షిణాస్యాత్॥ ౨౦౧ ॥ సంవత్సరాస్తత్రోజ్ఞేయాః పంచాబ్దా బ్రహ్మణః సుతాః। తస్మాత్తు

ఋతవో జ్ఞేయా ఋతవో హ్యంతరాః స్మృతాః॥ ౨౨ ॥ తస్మాదనుముఖా జ్ఞేయా అమావాస్యస్య పర్వణః। తస్మాత్తు విషువం జ్ఞేయం పితృదైవహితం సదా॥ ౨ 3 ॥ ఏవం జ్ఞాత్వా నముహ్యేత దైవే పిత్ర్యే చమానవః। తస్మాత్ స్మృతం ప్రజానాం వై విషువత్సర్వగం సదా॥ ౨౪ ॥

సూర్యుఁడు కృత్తికల ప్రథమాంశ మెప్పుడుపొందునో యపుడు విశాఖ చతుర్థాంశయందు చంద్రుఁ డుండును. విశాఖయం దెప్పుడు సూర్యుఁడు మూఁడవ యంశమును బొందియుండునో యప్పుడు చంద్రుడు కృత్తికకు శిరోగతుఁడై యుండునని తెలియవలెను. అనఁగా వైశాఖ కార్తికమాసములని యర్థము. ఇవి చంద్ర సూర్యుల యుచ్చరాసులు. చంద్రసూర్యులకు విషువత్కేంద్రములని మహర్షులు చెప్పిరి. ఇట్లు సూర్యునిచే విషువత్సంజ్ఞయనియుఁ విశాఖాగాధిపుఁడగు సోమునిచే జాంద్రమానకాలమనియుఁ దెలియవలెను. ఎపుడహోరాత్రులు స్వస్వమాసారంభచక్రము మొదలు యుగాదిచక్రమువరకూ సమపరిమాణ కాలములోనుండునో యపుడు విషువత్పుణ్యకాల మగుచుండును. అపుడు చాతుర్వర్ణ్యాకర్మ దేవతలగువారు తమతమ స్వధర్మముల నతిక్రమించక అధికారిక గణములోని పితరులకొఱకు బ్రాహ్మణులకు దానములనిచ్చుట శ్రేష్ఠము. బ్రాహ్మణుఁడే దేవపితరులకు ముఖమని చెప్పఁబడుచున్నాఁడు.

ఇట్లుక్షయాధిక మాసములును గలాకాష్ఠా ముహూర్తముల నెడి కాలావయవములును, సినీవాలి, కుహూ అమావాస్యయనియు రాకానుమతులు పౌర్ణమాస్యఅనియుఁ దెలియవలెను. మాఘఫాల్గుణములును, చైత్రవైశాఖములును, జ్యేష్ఠాషాఢములును, ఉత్తరాయణమగును. శ్రావణభాద్రపదములును, ఆశ్వీజ కార్తీకములును, మార్గశీర్ష పుష్యములును దక్షిణాయనసంజ్ఞకలవియగును. ఇటులనే అయిదుసంవత్సరములుకూడ కార్యబ్రహ్మకు పుత్రులగుచూ ఆపంచసంవత్సరముల సమష్టివలన పంచర్తువులు లేక షడృతువులని కాలావయవములే సంతానముగాఁ జెప్పఁబడుచున్నవి. అందువలన నీపంచసంవత్సర సమష్ట్యాత్మకమగు కార్యమానమువలననే కార్యమాన కాలముయొక్క పర్వమునకు అమావాస్యఅనునది ఏకాష్టకాపౌర్ణమాస్యలతోఁగూడ సంవత్సరానిముఖ మదియు నాపర్వము పితృదేవహితమగుటచే ఁబంచర్తుపంచమాస కంచోషస్సుల పర్యంతముగా ఁబారమార్థిక విషువనియుఁ దెలియవలెను. అధికమాసములతోఁగూడి పంచసంవత్సరయుగములో అరువదిరెండమావాస్యలు భూతాగ్నిచక్రములో సంభవించును గనుకనే సౌందర్యల.

హాలో శంకరాచార్యులు, శ్లో॥ "త్రి.తౌషట్పంచాశతీ"అను శ్లోకములో తైజస శుష్మూఖులు అర్తైరెంతని కంఠోక్తిగాఁజెప్పిరి. ఇట్లు కార్యవిరాడ్బ్రహ్మమానమును దెలుసుకొనిన మానవుఁడు దైవకర్మయందును పితృకర్మయందును మోహమునుబొందరు. అందువలన ప్రజలకు విషువత్పుణ్యకాలమగును.

వేదాంగజ్యోతిషములో నీవిషయమంతయు సూత్రప్రాయముగ వివరింపఁబడియున్నది.

పితృప్రసూః=పితౄన్ ప్రసూతఇతి పితృప్రసూః, షూఙ్ప్రాణిగర్భవిమోచనే=పితృదేవతలను బుట్టించునది. సంధ్యాయాః బ్రహ్మశరీరత్వాత్ పితృప్రసూరితి పురాణప్రసిద్ధిః - సంధిబ్రహ్మశరీరము గనుక పితృలోకమును బుట్టించుటచేత పితృప్రసువనఁబడును. (సూర్యోదయమునకు వెనుక మూడుఘడియలు, సూర్యాస్తమయమునకు ముందు మూడుఘడియలు).

ప్రాహ్ణ, అపరాహ్ణ; సాయాహ్నములు త్రిసంధ్యలు. అహ్నః ప్రారంభః ప్రాహ్ణఃఅహస్సుయొక్క మధ్యభాగము మధ్యాహ్నః అపరాహ్ణము అహస్సుయొక్క కడపటిభాగమే సాయాహ్నమగును. ఇట్లుమానుషాహోరాత్రిసావనతిథి మొదలు సహస్రయుగ ద్వయాత్మక బ్రాహ్మసావనాహోరాత్రము వరకు త్రిభాగములు చేయగా ఇరవైయేడు సంఖ్యతో ఇరవైయెనిమిదవదగు అభిజిన్నక్షత్రమే నక్షత్రధ్రువము లేక ధ్రువనక్షత్రమని తేలును. "బ్రహ్మణో వా అష్టావిగ్ం శోనక్షత్రాణి; అని వేదముకూడ చెప్పుచున్నది.



## అమావాస్యకును పితరులకునుగల సంబంధవిశేషము.

పితరులకు చంద్రలోకసంబంధముండుటచేతను, చంద్రవిశేషకళను అమావాస్యయందు పితరులల్పకాలము పానముచేయుటచేతను, అమావాస్యయందు చంద్రుఁడు సూర్యునియందు చేరుటచేతను, పితరులకమావాస్య ముఖ్యము. చంద్రశేషకళాంశపానముతోఁ పితరులకుసంతృప్తికానందుచేత మనముచేయు శ్రాద్ధతర్పణాదులును పితృప్రీతిగాఁజేయు దానధర్మములును వారికిఁజెంది సంపూర్ణతృప్తులగుదురని మునిమహర్షులు తమదివ్యదృష్టితోఁదెలిసి నిర్ణయించిరి. ఇందుకుఫలము పితరులు సర్వతృప్తులై మనకుక్షేమము శుభము గలుగునట్లుగా ఆశీర్వదించుటయే

పితరులకును మనకును నెడతెగని సంబంధములు సర్వదాయుండుటచేత శ్రాద్ధతర్ప ణాదు లాచరించుట మనకర్తవ్యము.

మనమాసము వారలకొకదినమగును. వారున్నది చంద్రలోకముగాన చాంద్రమాన మాససంజ్ఞయు మననిత్యవ్యవహారములోనిదే మనకృష్ణపక్షము వారికిఁ బగలుగను, శుక్లపక్షమువారికి రాత్రిగనున్నది. చాంద్రమానము పూర్ణి మాదిగఁ బూర్ణిమవఱకును కృష్ణపక్షాంత్యము పగటికాలములోఁ బితృలోకమునకు చంద్రసంచారమార్గము అపరాహ్ణ సాయాహ్న సంధిరూపముగఁ గాలగతికలదై యుండును. శుక్లపక్షములో సూర్యునివెనుక చంద్రసంచారగతియు ఁకృష్ణపక్ష ములో నిత్యాభిజిన్ముహూర్తమందు శిరోగతుఁడైన సూర్యస్థానమునకుఁగృష్ణాష్టమినా సూర్యాస్తమయకాలమునకు ఁజంద్రుఁడు కాంతిమంతుఁడై తదాదిగాఁగలాక్షీణ్యము క్షీణచంద్రుఁడైనను అమావాస్యనాటి సూర్యసంయోగమును గోరినవానివలె ప్రా గ్గతితోఁ ఁదూర్పుదిక్కునందె పూర్ణముగా కళంకనాశనముకాగా ఁదిరిగి శుక్లపక్షమా సాదియందుఁబశ్చిమదిక్కునందు ఁబుట్టినవానివలె జగత్పూజ్యుఁడగుచున్నాఁడని "సూ ర్యఏకాకీచరతి చంద్రమాజాయతేపునః" అనెడి బ్రాహ్మ్యాద్యమంత్రలింగములో వేదముకూడ చెప్పుచున్నదిగావున సూర్యాస్తమయానంతరము చంద్రసంచారమార్గ ము పితరులలోకమునకు ఁదగిలి రాత్రియగును శుక్లాష్టమినుండి బహుళాష్టమివఱ కుఁబూర్ణచంద్రుఁడని బలవంతుఁడని సర్వకార్యములకు ఉత్తమకాలమని పూర్ణచంద్ర బలముతో మనకును మనకార్యాదులకును సంపూర్ణబలముయుండునని జ్యోతిశ్శాస్త్ర వేత్తలు నిర్ణయించిరి. మిగతకాలమున క్షీణచంద్రుఁడని ప్రశస్తముగాదని సామా న్యమని తెలిపిరి. చంద్రసంబంధము మనకును మనపితరులకును సర్వదాయున్నది నీచ చంద్రుఁడును, అష్టమరాశిలోనున్న చంద్రుఁడును మనకు సర్వకార్యములందును వర్జితుఁడని జ్యోతిశ్శాస్త్రవేత్తలు తెలిపిరి. దీనిననుసరించి ఆయుర్వేదశాస్త్రమునఁ గూడ ఓషధు లౌషధములకు ముఖ్యకారణమనియు ఓషధులకుఁ జంద్రకళాసంబంధ మున్నదనియు వ్రాయఁబడినది. ఓషధులను గ్రహించుట జ్యోతిశ్శాస్త్రము ననుసరించియే ఓషధులగ్రహించుటకు బహుళామావాస్యను జతుర్దశిని నిషేధించిరి. చంద్రుని కళాపానమును గుఱించి చంద్రకళ విషయములో నిందుకు సంబంధించిన కొన్నివిషయాదులను జూడవలెను.

—o—

# గ్రహణములందు పితృతర్పణము లెందుకు చేయవలెను.

---

చంద్రగ్రహణము పూర్ణిమాంత్యఘడియలకును కృష్ణపాడ్యమీ ప్రారంభ ఘడియలకును మధ్య ఉభయతిథుల సంధిఘడియలతోఁ జేరిన కాలమందగును. సూర్యగ్రహణ మిటులనే అమావాస్యాంత్యఘడియలు శుక్ల ప్రతిపదాది ఘడియలు చేరిన కాలములో గ్రహణకాలము పదిఘడియలను సహజముగ మించదు. ఇంతకులోపల సందర్భానుసారముగ గ్రహణకాలముండును. దీనిననుసరించియే శ్రీచక్రముయొక్క మధ్యస్థితిచక్రములో మంత్రయంత్ర తంత్రభాషాసంకేతముతో మధ్యకేంద్రమందైన దశారద్వయమును అంతర్బహిర్భేదముచే దశారద్వాదశార రూపముగా అంతర్మాతృకాన్యాసమందు డఫకశాక్షర సాహిత్యముతోఁ గూడ గుర్తుతో తమోగ్రహైక్యమే వర్ణింపఁబడి ప్రత్యక్షరేఖాత్మకముగాఁ గూడ లిఖింపఁబడుచున్నది. గ్రహణము కేవల తమస్సంబంధమగు రాహుకేతువులతోఁ దమశ్ఛాయతో ఆచ్ఛాదించుటచేత అపవిత్రదోష మేర్పడుటచేత లోకాదులకును లోకస్థులకును మాలిన్య దోషసంబంధము గలిగినందుచేత, జపతప దానధర్మాదులకును శ్రాద్ధదేవపూజాదులకును ముఖ్యావకాశముగలిగెను. చంద్రసూర్యగ్రహణానంతరము మరల పూర్ణిమవఱకు నీదోషముండును. కాబట్టి మనముచేయు తర్పణాదులన్నియు పితరులకు దృప్తికారకములగును. ఈశుక్లకృష్ణపక్షమంతయు శుభకార్యములు చేయరాదు. అమృతస్వరూపులగు చంద్రసూర్యులను రాహుకేతువు లాచ్ఛాదించుటచే జరుపఁగూడదు.

సూర్యచంద్రులతోఁ బితరులకుసంబంధముగూడ నుండుటచేతను అమావాస్య తర్పణములును, తర్వాత గ్రహణతర్పణాదులనుగూడ జేయవలెను.

దీనిననుసరించియే సూర్యునిఉదయాస్తమయములందు మందేహులనెడి ఆదిరాక్షసులు, పదివేలసంఖ్యగలవారలు అడ్డగింతురని దీని నివారణకొఱకే మననిత్య సంధ్యావందనము అర్ఘ్యప్రదాన మంత్రోచ్చారణతో జలముదివ్యాస్త్రమయములై వారలను సంహరించును. సంధ్యావందనములో అర్ఘ్యప్రదానమును ముఖ్యముగ జాతాశౌచమందును, మృతాశౌచమందును విడువక చేయునట్లుగా వేదఋషులు తీర్మానించిరి. ఈరాక్షసులు కేవల-కారణరూపదేహులగుటచేత అస్త్రములతో మృతిఁజెందక మూర్ఛఁజెందుదురు.

మృతులుకానందుచేతనే మరల ప్రతిరోజు ఉదయాస్తమయములందు మా

మూలుగనే సూర్యునద్దగి చుచుండురు. వీరలు తమోరూపులు సూర్యతేజస్సు వీరికి విరుద్ధము. తిమిరమే ప్రధానము. సంధ్యలోని అర్ఘ్యప్రదానముతో మరల సూర్యప్రకాశము లోకమునకు కాంతిగలుగును. వీరలు మందేహారుణ ద్వీపము లందుందురు. ఇవి ఉదయాస్తమయ దిశలందున్నవి.

—o—

# భాద్రపద కృష్ణపక్షము పితరులకెట్లు ముఖ్యకాలము.

పితరులలోకము దక్షిణదిశలో మృగవీథియందున్నది. దీనికి సంబంధముగ మఘనక్షత్రము సింహరాశిలోనిది. శింశుమారములో నీరాశియు నక్షత్రము దక్షిణ దిశయందే ధూమాదిమార్గమున నున్నది. రవికన్యారాశిగతుఁడుకాగానే పితరులకు మధ్యాహ్నము దేవతలకు మధ్యరాత్రి కాలమునగును. మహాలయసంకల్పముతో "కన్యాగతే సవితరి ఆషాఢ్యాది పంచమహా పరపక్షేయని" చెప్పుచున్నారు. "వృశ్చికే సమతిక్రాంతే పితరో దైవతస్సహ" అని ధర్మశాస్త్ర ప్రమాణములున్నవి. కావున దేవపితరులు మనమిచ్చునట్టి శ్రాద్ధమును గ్రహించి దీపావళిరోజున వారిలోకమార్గ దర్శనముకొరకై చూపబడునట్టు ఉల్కాప్రదర్శనముతో వారిలోకమునకుఁబోగా బలిప్రతిపత్తుకు రెండవదగు యమ ద్వితీయదినముస (బితృపతియగు యముఁడు యమునానదీ గృహద్వారమున భూలోకములోదిగుననియు (దదాదిగ మూఁడుపక్షములు యమదంష్ట్రాధీనములగుటచే యమకాలమనియు వేదపురాణాదులయందు ఋషివచనములు ప్రమాణము పైలోకవ్యవహారముచేఁగూడ ప్రసిద్ధిచెందియున్నది కావున అప్పుడు మనచేఆచరింపఁబడిన మహాలయశ్రాద్ధ శరన్నవరాత్రివ్రత పూజా జపహోమయాగాదులచే తృప్తులై మనము తమసంతతివారమైనందుచేత నీకార్యమును జేసిరని ఆనందించి ఆశీర్వదించి వృశ్చికమాసాంతములో (దమలోకమును జేరుదురు. అందుచేత (బితరులు మనలోకమునకు వచ్చుటచేత భాద్రపద బహుళ పక్షము మహాలయశ్రాద్ధాదులకు ముఖ్యము.

ఈపక్షములో మనము మహాలయాదిశ్రాద్ధాదులను జేయనిచో (బితరులు దారుణశాపములనిత్తురు. మనలోకములో సర్వవర్ణములవారును నీరూపముతో నొకదినమందు (దప్పకశ్రాద్ధమును జేయుచున్నారు. ఈపక్షమునకుఁ బితృపక్షమని వాడుక. ఈపక్షము శ్రాద్ధాదులకుఁదప్ప శుభకార్యములకు నింద్యము. తుదకు

మహాప్రమాదీయులు సహితము పెద్దలపండుగయని ప్రత్యేకించి ఒకమాసమందాచరింతురు. వారును రాత్రికాలమునే ముఖ్యముగఁ జూతురు. పగటియందు ఆచరించరు. పితరులు కార్త్తికమాసమువఱకును కాచుకొనియుందురు. ఇతవఱకుఁగూడ నెవరైనను శ్రాద్ధాదులను జేయనిచో సిట్టూర్పులు విడిచి వేసరి తమసంతతివార లిట్టివారగలైరని నిరాశచెంది దారుణశాపము లిచ్చి తమలోకమునకు వెళ్లుదురు వారికిఁ జీకటిగానుండునని మార్గదర్శననిమిత్తముగ మనము కార్త్తికమాసములో ఆకాశదీపములు పెట్టి దేవాలయాదులలో కార్త్తికదీపోత్సవాదులను ముఖ్యముగాఁ జేయుదుము. మనలోఁగొందఱు వైష్ణవమతస్థులు పితృకార్యములను రాత్రియందే ముఖ్యముగా ఆచరింతురు. కొందఱితరవర్ణస్థులు రాత్రికాలమందే పితృకార్యములాచరింతురు. దేవతలకు రాత్రికాలమగు ఆశ్వీజమాసము సర్వదేవతలకును, శక్తులకును జపపారాయణాదులకును హోమాదులకును అర్చనాదులకును ముఖ్యమగుపండుగలు వేడుకలు: ముఖ్యకాలము. ప్రదోషపూజాదులకును శివవిష్ణు దేవపూజలకును, పితరులకును సర్వదేవతలకును ముఖ్యముగనున్నవి. ఈ ఆరుమాసములు స్వర్గలోకములో రాత్రికాలము మనకారుమాసములు. తొలిమూడుమాసములు దేవతలకు పూర్వరాత్రియగుటచేత మనకు సర్వపూజాది కార్యములకు ముఖ్యము.

శ్రాద్ధములందు అగ్నౌకరణము, బ్రాహ్మణభోజనము పిండదానము తర్పణాదులు ముఖ్యములు. వీటితోసంతృప్తులై మరల వృశ్చికమాసాంతములో నిజనివాసలోకమును జేరుదురు. మనమిచ్చుదీపాదుల వెలుతురు మనలోకము దాటువరకే. ఆవల వారికి చంద్రలోకతేజస్సు సహాకారముగ నుండును. పితరులలోకము ద్యులోకమునకుఁ జేరినది. ఇచ్చట నక్షత్రప్రకాశముగూడ అతిశయించియుండును. పితరులు ప్రకృతము నీమూడుమాసములు మనలోకములో నున్నందుచేత ఔపచారికముగ మనము దీపములతో మార్గదర్శనము గావించినవారలగుదుము. చాంద్రమానము ననుసరించి మనుష్యపితరుల కాలమానము మాసముగను దేవపితరులు బార్హస్పత్యమానాబ్ద సంబంధులగుటచే వారికి శుక్లకృష్ణపక్ష సంధియగు పూర్ణమావాస్యాదిగా మరల పౌర్ణమి వరకు మాససంజ్ఞయు అగుచున్నది. అందుచేత మన కృష్ణపక్షము పితరులకు శుక్లపక్షమగును. స్వర్గలోక సాయంకాలము పితరులుండులోకమునుబట్టి ప్రాతఃకాలమగును. మనలోకములోఁగల ఉదయాస్తమయకాలభేదములు దిశలనుబట్టి యెటులభేదములుగనున్నవో యటులనే శింశుమారములోఁ

గల సాయంకాలము పితరులుండు లోకదిశనుబట్టి వారికిఁ బగలుగ అపరాహ్ణముగఁ గూడ నుండును.

—o—

# సంకల్పము లేల చెప్పవలెను.

మనస్సున్నంతకాలము సంకల్పములుండును. ఇవే కోరికలు. సంకల్పమునకుమూలమే మనస్సు. ఇవి రెండువిధములు. నిష్కామముతో నివృత్తిధర్మముగను, కామముతోఁ బ్రవృత్తిధర్మముగను నున్నవి. మనము మొదలేవిధముగ నుంటిమో తెలియదు. ప్రకృతము మాత్రము కామములతో నిరంతర సంకల్పరూపులై యున్నాము. మనము ప్రారంభముతో వ్యష్టిగనున్నందుచేత సంకల్పపూర్వకముగ సర్వకర్మలు ప్రారంభించినఁగాని యేకార్యదీక్షఫలము తుదముట్టఁజాలదు. మధ్యలో భంగములు గలుగకుండుటకై దీక్షతోఁ బ్రారంభమందు సంకల్పాదులతోనే కార్యములుచేయుట ప్రథమాంశము. ఈలాగున గొంతకాలమునకు మన మీవ్యష్టిత్వమును విడిచి సమష్టికి రాఁగలుగుదుము. వ్యష్టిసంకల్పములో బ్రహ్మకల్పము, మన్వంతరము, యుగము, పాదము, క్షేత్రము, ఖండము వర్తమాన సంవత్సర ర్తుమాసపక్ష, తిథి, వారనక్షత్రములు గూడియుండుటచే తాను ఫలానివాఁడని గోత్రనామోచ్చారణ చేయుటచేత నాకర్మలఫలములు తనకుఁజెంది స్థూలదేహపాతానంతరముత్తరదేహ ఫలములును, లోకాదులును, ఉత్తరజన్మాదులును నొందుచుండుచు.

ఈలాగున గొంతకాలమునకుఁ బరిపక్వముతో జ్ఞానోదయముగలిగి సాత్త్విక నిష్కామకర్మలకవకాశము గలుగును. సంకల్పములతోఁ గర్మఫలములు దేవలోకములో నియామకముగానిలిచి తానుస్థూలదేహపాతానంతరము సూక్ష్మశరీరము తేజోలోక శరీరముతో దీర్ఘకాలము కేవలసుఖానందమునే యనుభవించి స్వర్గలోక నివాస పుణ్యక్షీణముతో మరల నీలోకములో ఉత్తమజన్మమును జెందుచు. సహజముగ మానవరాజ్యములోను మనపేరుతోఁ జేయఁబడిన కార్యవ్యవహారము లన్నియును మనకే సంభవించినవై మనలచే ననుభవింపబడుచున్నట్లు లోకాంతరమందుఁ గూడ జరుగును. సందేహమే లేదు. సంకల్పము సంపూర్ణమగు చిరునామువంటిది. వీటిచేత నెవరికొఱకు గర్మలఁ జేయుదురో, వారెందున్నను తత్ఫలములననుభవింతురు.

సంకల్పములులేనిచో దదితరులాకర్మఫలము ననుభవించవచ్చును. ఇది ప్రమాదకరమగును. నియమములేనిదగును. ఈలాగైనచో మరెవ్వరును నేవిధకర్మలు చేయునవకాశముండదు. చేయనివారును జేసినవారును సమానులగుదురు. విమర్శలులేక విపరీతముల కవకాశములుగలుగును. సంకల్పముచేత నెవరెవరి కర్మఫలముల వారువారనుభవించు నవకాశములుగలిగి ముందు ఋజుమార్గులగుదురు. ఈలాగునఁజేయఁగ మనస్సు పరిపక్వదశకు వచ్చి నివృత్తివైరాగ్యాదులతో ధన్యులగుదురు. సమష్టివిరాడీశ్వర దేహములోఁజేరి నిస్సంకల్పులగువరకు నీలాగునఁజేయుచుండవలెను. అంతేకాని సంకల్పములు శాశ్వతములని చెప్పఁజాలము. మనస్సు, గుణములు, వ్యష్టిత్వము, కామాదులున్నంతకాలము ప్రవృత్తిధర్మముతో సంకల్పాదులుండును. క్రమముగా వివేకవిచారముతో సంశయనివృత్తిగలిగి సంకల్పములు లేనివారలై ముక్తులగుదురు.

బంధముతో మనము నిరంతరమున్నాము. బంధరూపమే దేహము. బంధమే ఆవరణము. బంధమేసంకల్పము. బంధమేమనస్సు. అన్నియును దత్త్వదృష్టితోఁ బరస్పరసంబంధములుగనున్నవి. స్థూలదృష్టితో నన్నియును బరస్పర భిన్నముగ నగపడును. ఇట్లగపడుటకు తమోగుణమే హేతువు తమోగుణముతో భిన్నములు. ప్రత్యేకము, స్థూలము, దుఃఖముకలుగును, మనస్సుతోఁ బరస్పర భిన్నసంకల్పములుగను, వాక్కుతో భిన్నశబ్దముగను బాహ్యములోఁ బ్రత్యేకింపఁబడియున్నది. ఈలాగున అహంకారాజ్ఞానాదులుండును. కాబట్టి సంకల్పముతో గర్మలాచరించి మధ్యలో వివేకవిచారములతో జ్ఞానోదయముతో సంకల్పరహితుఁడగును. దురితక్షయాదుల కొఱకే సంకల్పముతోఁ బ్రారంభముచేసి తద్ద్వారా చిత్తశుద్ధిగలిగి మంచిదేహమును సంపాదించి దీనిద్వారా సంకల్పరహితుడై ద్వంద్వాతీతుఁడై ఊర్ధ్వముఖ గమనముతో ఏకాగ్రచిత్తవృత్తితో శాంతిసమాధిసిద్ధుఁడగును.

సంకల్పములకుఁ గర్మలకు సంబంధముగలదు. సంకల్పరూపమేకర్మ. కర్మలున్నంతకాలము సంకల్పములుదప్పవు. సంకల్పములేనిదే యేకర్మయుఁజేయఁజాలము. వీటినే త్రివిధములుగ "మనోవాక్కాయకర్మ"లని చెప్పిరి. ఈమూడును దేహసంబంధములై దేహమునాశ్రయించి యున్నవి. కర్మలకు ఫలములున్నవి. ఫలమున్నంతకాల మనుభవింపవలయును. ఫలమునిశ్శేషముకాగానే మరల సంకల్పరూపముతోఁ గర్మలు ప్రారంభములగును. ఈలాగున నెడతెగనివై పరంపరలుగా

నుండును. అందు చేత వీటిని దాటుట చాలదుర్లభము.

ధ్యానాదియోగాదులట్లుగాపు. వానికిస్థూలదేహకర్మలులేవు సూక్ష్మదేహాకృతితోను లేక మానసికముగధ్యానించుచు రూపదర్శనమును జేయవచ్చును. లేక కేవల రూపదర్శన విధానముతోనే యుండవచ్చును. సందర్భానుసార మాయాదేహాదుల సంబంధముతోనుండును. కారణదేహముతో నిష్సంకల్ప సమాధినిం బొందవచ్చును.



## జలతర్పణాదుల ప్రాముఖ్యత - తిలాదులప్రాముఖ్యత - పాలాశపత్రి ధర్భలప్రాముఖ్యత.

పితరులున్నది జలభూతలోకమగు చంద్రలోకము. ఇది చంద్రాధిదైవత్యము, కాబట్టి పితరులకెక్కువగం దర్పణాదుల విధుమనస్సిర్వరచిరి. పృథివి యోషధీమయమగుటచే నన్నరూప పిండప్రదానము తరువాత పితరులు అగ్నిముఖులగుటచే అగ్నౌకరణ బ్రాహ్మణభోజనములును విధానములని ముఖ్యతవహింపంజేసిరి. ద్యులోకము తేజోసంబంధమగుటచే నందాపోజ్యోతి ప్రాధాన్యత వహించినది. అందలి పితరులకు ఆజ్యయుక్త హావిర్హోముంబుగల యగ్నౌకరణము ముఖ్యము.

"ఆపఃపునంతుపృథివీ"అను వేదప్రమాణానుసారముగ మొదటంబృథివి నిజాధిదైవతమగు జలముచేం బవిత్రమగును పృథివినుండి చంద్రలోకమున కేగిన పితరులకు మనమిచ్చుట నిచ్చుజలతర్పణము తృప్తిపరచును. "ఆపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్"అను వేదవచనానుసారము ద్యులోక పితరుల కగ్నౌకరణముతోం దృప్తికలుగును. దీనిననుసరించియే మొదటిది జలతర్పణము రెండవది అగ్నౌకరణము. మూడవది పిండప్రదానము. ఇవియే కర్మత్రయమన నొప్పును.

### —• తిలాదుల ప్రాముఖ్యత •—

తిలాదు లోషధీజన్యములు. ఇవిజలప్రధాన దైవతమగు చంద్రాంశతోను, తేజఃప్రధానదైవతమగు సూర్యాంశతోను, స్వరూపాంశమగు స్థిత్యంశముతోను వ్యాప్తిగా విష్ణువుతోను దండుల గోధూమతిలలు కర్మత్రయమునకుం బ్రశస్తములు.

"తిలాః కృష్ణాస్తిలాశ్శ్వేతా స్తిలాస్సౌమ్యావశానుగాః। తిలాఃపునంతుమేపాపం య
త్కించిద్దురితం మయిస్వాహా। చోరస్యాన్నం నవశ్రాద్ధం బ్రహ్మహాగురుతల్పగః।
గోస్తేయగ్ం సురాపానం భ్రూణహత్యా తిలా శాంతిగ్ం శమయతు స్వాహా। శ్రీశ్చ
లక్ష్మీశ్చ పుష్టిశ్చకీర్తించా నృణ్యతామ్। బ్రహ్మణ్యంబహుపుత్రతామ్। శ్రద్ధామేధే
ప్రజ్ఞాతు జాతవేదస్సం దదాతుస్వాహా॥"అను వేదప్రమాణమునుబట్టి తిలకుఁ దర్ప
ణాదులం దతిప్రశస్త్యముగలిగెనని "శ్లో॥ తిలోసిసోమదేవత్యో"అను స్మృతివచ
నమునుజెప్పుచున్నదిగాని ఆతిలలు బొత్తిగాచిక్కనియెడల సర్షపములచేగాని
ఇతర నల్లధాన్యములచేఁగాని వ్రీహ్యాదికాదుల నిర్వాహముకొరకు యథాసంభవ
ముగాఁ గైకొనందగు. ఇవి సూర్యసంబంధాంశము; తండులములు చంద్రాంశ
సంబంధములు. శనిగ్రహాది దైవత్యముగల తిలలు విష్ణుసంబంధాంశము.
ఈమూడును శ్రాద్ధాదులందతి ప్రాముఖ్యము గలవైయున్నవి. మాషాముద్గములు
వీర్యవత్తరములగుటచేత వీటికిసహకారములు.

దర్భలు కన్నగాడినివారణార్థ ముపయోగకరము. గరుడుడమృతకలశము వీని
పైనుంచుట కిదియేకారణము. కుశపవిత్రోదకము సోమపానసమము. "కుశంపూతం
తోయం కుశాగ్రమిశ్రితంతోయం సోమపానసమం"అని గౌతమధర్మసూత్రప్రమా
ణము. పలాశపత్రమన్నాది పదార్థక్షేపణకుఁ బ్రశస్తము. దీనిచే రాక్షసబాధా
నివృత్తియగును. ఇదిగాయత్రీస్వరూపము. ఒకప్పుడు శ్రీగరుడుఁడు రాక్షసులచే
బాధగలిగినపుడు నీపలాశ వృక్షముక్రిందఁజేరగా వారలు సమీపించక పలాయనమై
నందుచే దీనికానామముగలిగెను. శ్రాద్ధములందును యజ్ఞములందును రాక్షసా
దులబాధలు సహజము, అందుచేతనివి ముఖ్యాంశములుగఁ గైకొనిరి.

—o—

## మ ను యు గ క ల్ప  జ యం త్యా దు లు,

సప్తకల్పాదయః — ధర్మసింధు - పుట ౫౭.
వైశాఖశుక్లతృతీయా ఫాల్గునకృష్ణ తృతీయా శుక్లాచైత్రపంచమీ మాఘే

త్రయోదశీ కార్తికేసప్తమి మార్గశీర్షేనవమీ ఇత్యాదికల్పాదయో బోధ్యాః। అమ శ్రాద్ధాత్పితృతృప్తిః॥

౧ చైత్రశుద్ధపాడ్యమి = శ్వేతవరాహకల్పాది
౨ చైత్రశుద్ధపంచమి = కూర్మవరాహకల్పాది
౩ వైశాఖశుద్ధతదియ = పాద్మవరాహకల్పాది
౪ కార్తికశుద్ధసప్తమి = సావిత్రీవరాహకల్పాది
౫ మార్గశిరశుద్ధనవమి = ఉదయవరాహకల్పాది
౬ మాఘశుద్ధత్రయోదశి = వరాహకల్పాది
౭ ఫాల్గుణబహుళతదియ = బ్రహ్మవరాహకల్పాది

—♦ చతుర్దశమన్వాదయః - ధర్మసింధు. ♦—

చైత్రశుక్లతృతీయా పౌర్ణమాసీచ। జ్యేష్ఠేపౌర్ణమా। ఆషాఢ శుక్లదశమీ పౌర్ణమాసీచ। శ్రావణస్యకృష్ణాష్టమీ। భాద్రపదస్య శుక్లతృతీయా। ఆశ్వినస్య శుక్లనవహీ। కార్తికస్య శుక్లద్వాదశీపౌర్ణమాసీచ పౌషేశుక్లైకాదశీ మాఘేశుక్ల సప్తమీ। ఫాల్గునస్య పౌర్ణమాస్యమావాస్యాచేతి చతుర్దశజ్ఞేయాః॥ మన్వాదిషు పిండరహితం శ్రాద్ధం కార్యం అత్రశ్రాద్ధే ద్విసహస్రవర్షం పితౄణాం తృప్తిః। మన్వాదిశ్రాద్ధంచనిత్యం। ఏతదకరణే "త్వంభువః ప్రతిమాగమితి" ఋఙ్మంత్రస్య శత వారం జలేజపః ప్రాయశ్చిత్తంకార్యం.

—♦ మ న్వా దు లు. ♦—

౧ చైత్రశుద్ధతదియలు = ఉత్తమమన్వాది
౨ చైత్రశుద్ధపౌర్ణమి — రౌచ్యమన్వాది
౩ జ్యేష్ఠశుద్ధపౌర్ణమి = భౌచ్యమన్వాది
౪ ఆషాఢశుద్ధదశమి = చాక్షుషమన్వాది
౫ ఆషాఢశుద్ధపౌర్ణిమ = రుద్రసావర్ణికమన్వాది
౬ శ్రావణబహుళాష్టమి = అగ్నిసావర్ణికమన్వాది
౭ భాద్రపదశుద్ధతదియ = తామసమన్వాది
౮ ఆశ్వజశుద్ధనవమి = సార్వోచిషమన్వాది
౯ కార్తికశుద్ధద్వాదశి = స్వాయంభువమన్వాది
౧౦ కార్తికశుద్ధపౌర్ణమి = దక్షసావర్ణికమన్వాది

౧౧ పుష్యశుద్ధైకాదశి = రైవతమన్వాది

౧౨ మాఘశుద్ధసప్తమి = వైవస్వతమన్వాది

౧౩ ఫాల్గుణశుద్ధపౌర్ణమి = బ్రహ్మసావర్ణికమన్వాది

౧౪ ఫాల్గుణబహుళామావాస్య = సూర్యసావర్ణికమన్వాది

## —♦ యుగాదులు. ♦—

వైద్యనాథీయే యుగాదిశ్రాద్ధనిరూపణమ్.

వైశాఖశుక్లపక్షస్య తృతీయాయాం కృతంయుగమ్। కార్తికేశుక్లపక్షే చత్రేతాతు నవమేహని। అథభాద్రపదే కృష్ణేత్రయోదస్యాం ద్వాపరంయుగమ్। మాఘేతుపౌర్ణమాస్యాంతుఘోరం కలియుగంతథా॥ యుగారంభాస్తిథయో యుగాద్యాస్తేన విశ్రుతాః

కృతయుగాది = వైశాఖశుద్ధతదియ

త్రేతాయుగాది = కార్తికశుద్ధనవమి

ద్వాపరయుగాది = భాద్రపదబహుళత్రయోదశి

కలియుగాది = మాఘశుద్ధపౌర్ణమి

## —♦ యుగాంతములు. ♦—

వైద్యనాథీయం.

యుగాంతేష్వేవం శ్రాద్ధముక్తం స్మృత్యంతరే॥

శ్లో॥ సూర్యస్యసింహసంక్రాంత్యామంతః కృతయుగస్యతు। తథావృశ్చిక సంక్రాంత్యామంతస్త్రేతాయుగస్యతు। జ్ఞేయస్తువృషసంక్రాంత్యాం ద్వాపరాంతశ్చ సంజ్ఞయా। తథాచకుంభసంక్రాంత్యా మంతఃకలియుగస్యతు॥ యుగాదిషుయుగాంతేతు శ్రాద్ధమక్షయ్యముచ్యతే॥

కృతయుగాంతము సూర్యుఁడు సింహరాశినిఁ బ్రవేంచువాఁడగును.

త్రేతాయుగాంతము సూర్యుడు వృశ్చికరాశినిఁ బ్రవేశించునాఁడగును.

ద్వాపరయుగాంతము రవి వృషభరాశినిఁ బ్రవేశించు దినముననగును.

కలియుగాంతము రవికుంభరాశిఁజేరు నాఁడగును.

## —♦ అష్టకాదులు. ♦—

ధర్మసింధు పుట ౧౫౭

మార్గశీర్షాది మాసచతుష్టయస్య కృష్ణాష్టమీ ష్వష్టకశ్రాద్ధాని। తత్పూర్వ

సప్తమీషు పూర్వేద్యుః శ్రాద్ధాని। తదుత్తరనవమీషు చాన్వష్టక్యశ్రాద్ధాని కర్తవ్యాని॥

మార్గశిరబహుళసప్తమి - అష్టమి - నవమీ
పుష్యబహుళసప్తమీ, అష్టమీ, నవమీ
మాఘబహుళసప్తమి అష్టమి, నవమీ
ఫాల్గుణబహుళసప్తమీ, అష్టమి, నవమి.

—♦ షణ్ణవతి శ్రాద్ధములు. ♦—

(౧) అమావాస్యలు పండ్రెండు, (౨) యుగాదులునాలుగు, (3) మనువులుపదనాలుగు, (౪) సంక్రాంతులుపండ్రెండు, (౫) ధృతులుపండ్రెండు (౬) పాతలుపండ్రెండు, (౭) మహాలయాదులుపదునైదు, (౮) అష్టకాదులైదు, పూర్వేద్యుపులైదు. శ్రాద్ధైర్నవతిశ్చషట్॥

ఇవన్నియుఁగలసి తొంబదియారు శ్రాద్ధములగును.

—♦ జయంతులు. ♦—

ధర్మసింధు పుట ౫౯.

౧ చైత్రశుక్ల తృతీయామపరాహ్ణే = మత్స్యోత్పత్తిః
౨ చైత్రశుక్లనవమ్యాం మధ్యాహ్నే = దాశరథిరామవ్యక్తిః
3 చైత్రకృష్ణద్వాదశ్యాం = వరాహోత్పత్తిః
౪ వైశాఖశుక్ల చతుర్దశ్యాంసాయాహ్నే = నారసింహావతారః
౫ వైశాఖశుక్ల పూర్ణిమాయాంసాయాహ్నే = కూర్మోత్పత్తిః
౬ వైశాఖశుక్లతృతీయాయాం మధ్యాహ్నే = పరశురామోద్భవః
ప్రదోషేఇతిబహవః
౭ శ్రావణకృష్ణాష్టమ్యాం నిశీథే = శ్రీకృష్ణావిర్భావః
౮ శ్రావణశుక్లషష్ఠ్యాం సాయాహ్నే = కల్కిర్జాతః
౯ భాద్రపదశుక్లద్వాదశ్యాంమధ్యాహ్నే = వామనప్రాదుర్భావః
౧౦ ఆశ్వీజశుక్లదశమ్యాంసాయాహ్నే = బుద్ధోzభూత్॥

—♦ ఇతర జయంతులు. ♦—

వైశాఖశుక్లపంచమీ = శ్రీఆద్యశంకరభగవత్పాదోత్పత్తిః
వైశాఖశుక్లసప్తమీ = గంగోత్పత్తిః

వైశాఖశుక్లద్వాదశి = శంకరభగవత్పాదారాధనము
జ్యేష్ఠశుక్లదశమి = దశహరా
ఆషాఢశుక్లఏకాదశి = విష్ణుశయనైకాదశి
శ్రావణశుక్లపౌర్ణిమా = ఉపాకర్మ
శ్రావణకృష్ణపాడ్యమి = హయగ్రీవావతారము - సహస్రగాయత్రీజపము
శ్రావణకృష్ణామావాస్య
భాద్రపదకృష్ణామావాస్య } కుశగ్రహణము.
ఆశ్వీజకృష్ణచతుర్దశి = నరకచతుర్దశి
కార్తీకశుక్లపాడ్యమి = బలిపాడ్యమి
కార్తీకశుక్లద్వాదశి = విష్ణూత్థానద్వాదశి బృందావనపూజ
మార్గశిరశుక్లత్రయోదశి = హనుమజ్జయంతి
మార్గశిరశుక్లపౌర్ణిమ = దత్తాత్రేయజయంతి
మార్గశిరకృష్ణపాడ్యమి = బలరామజయంతి
పుష్యశుక్లైకాదశి = ముక్కోటైకాదశి
మాఘశుక్లసప్తమి = రథసప్తమి
మాఘశుక్లాష్టమి = భీష్మాష్టమి
మాఘశుక్లనవమి = మధ్వనవమి
మాఘకృష్ణచతుర్దశి = మహాశివరాత్రి
ఫాల్గుణశుక్లపౌర్ణిమ=కామదహనం హోళికోత్సవము కార్తవీర్యార్జునజయంతి
జ్యేష్ఠశుక్లత్రయోదశి – శ్రీవిద్యారణ్యస్వామి, శ్రీరామానుజాచార్యారాధనము
ఆషాఢశుద్ధపౌర్ణిమ – శివపవిత్రారోపణము
శ్రావణశుద్ధద్వాదశి = విష్ణుపవిత్రారోపణము

—o—

## శ్రా ద్ధ ప్ర శం స.

వైద్యనాథీయము.

సుమంతుః- శ్రాద్ధాత్పరతరం నాన్యచ్ఛ్రేయస్కరముదాహృతమ్। తస్మాత్సర్వప్రయత్నేన శ్రాద్ధంకుర్యాద్విచక్షణః॥ దేవలః॥ ఆరోగః ప్రకృతిస్థశ్చ చిరా

యః ప్రపౌత్రవాన్। అక్షయానర్థకామీంచ శ్రాద్ధకామో భవేదిహ॥ పరత్రచ పరాం తుష్టిం లోకాంశ్చ వివిధాంశ్శుభాన్। శ్రాద్ధకృత్సమవాప్నోతి యశశ్చవిపులంనరః॥ యమోపి। యేయజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్। సర్వభూతాంతరాత్మానం విష్ణుమేనజయంతి తే। ఆయుః పుత్రాన్ యశస్స్వర్గం కీర్తిః పుష్టిం బలంశ్రియమ్। పశూన్ సుఖం ధనంధాన్యం ప్రాప్నుయాత్పితృపూజనాత్। బృహస్పతిః॥ యఏవం వేత్తి మతిమాన్ స తస్య శ్రాద్ధఫలంభవేత్। ఉపదేష్టానుమంతాచ లోకేతుల్య ఫలౌస్మృతౌ। హారీతోపి॥ ఇమం శ్రాద్ధవిధింపుణ్యం కుర్యాద్వాపి పఠేత్తుయః। సర్వకామైస్సమృద్ధస్సన్న మృతత్వంచగచ్ఛతి॥ అకరణేపి దోషస్తేనైవదర్శితః॥ నతత్రవీరాజాయంతే నారోగాన శతాయుషః। నచశ్రేయోఽధిగచ్ఛంతి యత్రశ్రాద్ధం వివర్జితమ్॥ ఆదిత్యపురాణేపి। ననంతిపితరశ్చైతి కృత్వా మనసియోనరః। శ్రాద్ధం నకురుతేతత్ర తస్యరక్తం పిబంతి తే॥ మార్కండేయః॥ అన్యాయోపార్జితద్రవ్యైర్య చ్ఛ్రాద్ధం క్రియతే నరైః। తృప్యంతితేన చండాలాః పుల్కసాద్యాశ్చ యోనయః॥ నను ప్రాప్తిస్వీయ శుభాశుభ కర్మవశేన స్వర్గనరకాది గతానాం దూరస్థత్వభోక్తృత్వ సామర్థ్య రహితానాం మనుష్యాణాం పుత్రాదిభిర్దత్తైరన్నపానాది భిస్తృప్త్యసంభవాత్సం భవేపి స్వయమాత్మనా మప్యసీశానాః కథం స్వర్గాదిఫలం ప్రయచ్ఛంతి తత్రాహ యాజ్ఞవల్క్యః॥ శ్లో॥ వసురుద్రాదితిసుతాః పితరశ్శ్రాద్ధదేవతాః ప్రీణయంతి మనుష్యాణాం పితౄన్ శ్రాద్ధేన తర్పితాః॥ ఆయుః ప్రజ్ఞాం ధనంవిద్యాం స్వర్గంమోక్షం సుఖానిచ। ప్రయచ్ఛంతి తథారాజ్యం ప్రీతానౄణాం పితామహాః॥ అత్రవిజ్ఞానేశ్వరః॥ నహ్యత్రదేవదత్తాదయఏవ శ్రాద్ధకర్మణి సంప్రదానభూతాః పిత్రాదిశబ్దై రుచ్యంతే। కింత్వధిష్ఠాతృవస్వాదిదేవతా సహితాఏవ, యథాదేవదత్తాది శబ్దైర్న శరీరమాత్రం నాప్యాత్మమాత్రం కింతు శరీరవిశిష్టాఆత్మాన ఉచ్యంతే ఏవమధిష్ఠాతృదేవతా సహితాఏవ దేవదత్తాదయః పిత్రాదిశబ్దైరుచ్యంతే. అతశ్చాధిష్ఠాతృదేవతా వస్వాదయః పుత్రాదిభిర్దత్తాన్నపానాదితృప్తాస్సంతస్తానపి దేవదత్తాదీం స్తర్పయంతి, కర్తౄంశ్చపుత్రాదీన్ ఫలేన యోజయంతి॥ శాతాతపః॥ శ్లో॥ వసవః పితరోజ్ఞేయా రుద్రాజ్ఞేయాః పితామహాః ప్రపితామహాస్తథాదిత్యా ఇత్యేషా వైదికీ శ్రుతిః॥ పైఠీనసిః॥ వసవః పితరోరుద్రాః పితామహా ఆదిత్యాః ప్రపితామహాయ ఏవం విద్వాన్ పితౄన్ యజతే వసవో రుద్రాఆదిత్యాశ్చాస్య ప్రీతాభవంతి॥ మనురపి॥ వసూన్ వదంతితు పితౄన్

రుద్రానేన పితామహాః । ప్రపితామహాం స్తథాదిత్యా శ్రుతిరేషా సనాతనీం వ్యాసః॥ శ్లో॥ యథాగోషు ప్రణష్టాస్వైవత్సో విందతి మాతరమ్। ఏవం శ్రాద్ధేన్న ముద్దిష్టం మంత్రః ప్రాపయతే పితౄన్॥ మత్స్యేపి॥ నామగోత్రం పితౄణాం తు ప్రాపకం హవ్యకవ్యయోః। నామమంత్రాస్తథాఽఽదేశా భవాంతర గతానపి ప్రాణినః ప్రీణయంత్యేతే తదాకారత్వమాగతాన్। దేవోయదిపితా జాత శ్శుభకర్మానుయోగతః। తస్యాన్నమమృతం భూత్వా దేవత్వేప్యనుగచ్ఛతి। దైత్యత్వే భోగ్యరూపేణ పశుత్వేతు తృణంభవేత్॥ శ్రాద్ధాన్నం వాయురూపేణ నాగత్వేప్యుపతిష్ఠతి। పానంభవతి యక్షత్వే గృధ్రత్వేచ తథాఽఽమిషమ్। దనుజత్వే తథా మాంసం ప్రేతత్వే రుధిరోదకమ్। మానుషత్వేన్నపానాది నానాభోగకరం తథా॥ రతిశక్తిః స్త్రియః కాంతా భోజ్యం భోజనశక్తతా। దానశక్తి స్సవిభవా రూపమారోగ్యమేవచ॥ శ్రాద్ధపుష్పమిదం ప్రోక్తం ఫలం బ్రహ్మ సమాగమః॥ నామాని - దేవదత్తయజ్ఞదత్తాదీని. మంత్రాః - "శృధిపితె వాత్రం" ఇత్యాదయః, ఆదేశాః - ఇదమన్నోదకమముష్మై భవత్విత్యేవమాది నిర్దేశాః, పుష్పం - అవాంతరఫలా, బ్రహ్మసమాగమః బ్రహ్మప్రాప్తిః పరమఫలం ప్రోక్తమిత్యర్థః॥ హారీతః॥ కాలేప్యథాగతం పాత్రే విధినా ప్రతిపాదితమ్। ప్రాప్నోత్యన్నం తథాదత్తం జంతుర్యత్రోపతిష్ఠతే। యన్నామ్నా పారయే త్పిండం తంనయేద్బ్రహ్మ శాశ్వతమ్॥ ఇతి ॥

శ్రాద్ధకర్మంబుకంటె శ్రేయస్కరంబగు కర్మంబు లేదు కానదానిం జేయ నన్నివిధంబుల యత్నంబుగావించి నెరవేర్పవలయు. శ్రాద్ధంబుసేయువాఁడు చిరాయుః పుత్రపౌత్రానామైశ్వర్యంబు లిహంబునను బరంబునఁ బరాతుష్టియు వివిధ శుభంబులను, యశంబునందు. "దేవపితృబ్రాహ్మణుల హుతాశనసహితంబుగఁ దృప్తిపఱచు నతండు సర్వభూతాంతరాత్ముండగు విష్ణునిం జయించియాయుః కీర్తి యశోబల స్వర్గ పశుపుత్ర ధనధాన్య సుఖశ్రీలఁ బడయు"నని యముండు తెల్పియున్నాఁడు. "ఎవ్వఁడు నిర్మలమనంబున శ్రాద్ధంబుసేయనెంచునో యాతఁడు శ్రాద్ధఫలముల బొందుననియు, శ్రాద్ధంబొనర్పఁ బ్రేరేపించువాఁడు, నమస్కరించువాఁడు తుల్యంబుగఁ దత్ఫలంబుఁ గాంచు"నని బృహస్పతిచెప్పియున్నాఁడు. దీనిఁజేయని వానికులంబున వీరులు, నారోగ్యవంతులు, శతాయుష్మంతులు జనింపరు. అట్టివాని రక్తంబును బితృదేవతలు పానమొనర్తురు. అన్యాయార్జితంబగు విత్తంబునఁ జేయఁబడు శ్రాద్ధంబువలనఁ జండాల పుల్కసులమాత్రము తృప్తినొనర్చినట్లగును.

"శుభాశుభకర్మలచే స్వర్గనరకంబులనున్న పితరులెట్లు కవ్యభోక్తృత్వసమర్థులగు దురు? పుత్రపౌత్రాదిదత్తాన్నపానాదులచే వారెట్లుతృప్తినందగలరు?" యని శంక వొడమవచ్చును. అదిసహజము. మనము శ్రాద్ధములందు పితృపితామహ ప్రపితామహుల నావాహనగావించి వారికై ఆసనభోజన పిండప్రదానము లొనర్తుము. తండ్రి పంచభూత స్థూలదేహమును విడిచి వసురూపమంది ద్యులోకమున నుండును. పితామహుండు రుద్రరూపంబును, బ్రపితామహుండాదిత్యరూపంబును బొందియుం దురు. వారలదేహంబులు తేజోవాయురూప భూతంబులైయుండు, మనముచేయు శ్రాద్ధాదికర్మ లీలోకసంబంధముచే స్థూలములు. శ్రాద్ధమునకై బ్రాహ్మణుల నిమంత్రించి వారియందు పితృపితామహ ప్రపితామహాదుల స్థూలరూప నామము లకు వసురుద్రాదిత్యరూపములఁజేర్చి యుచ్చరించి యావాహన మొనర్తుము. ప్రతి మానవునియందును బ్రాణశక్తియుండును. దాఁశక్తియఖండము. దీని నే (Personal Magnetism) అనియందురు. యోగాభ్యాసమున నీశక్తినివృద్ధిబొందించిన జగ త్త్రయముగూడ జేయవచ్చును. అట్టిమనశ్శక్తిచేతను మంత్రబలముచేతను నావాహనింపఁబడిన పితరులు తమతేజోవాయురూపమునవచ్చి యాబ్రాహ్మణులం బ్రవేశించి తృప్తినందుదురు. అట్టిశక్తిద్వయముచే నొసంగు తిలాంజలులు మున్న గునవి వారినిఁగూడచేరును. శబ్దవిస్తారకయంత్రముకడ మనముచ్చరించు శబ్దపు గాలులు విద్యుల్లీనమై వాయువుంజేరి తత్తరంగములలోవచ్చి శబ్దగ్రాహక యంత్రపుఁ దంత్రిచే లాగఁబడి యంత్రమున శబ్దతరంగములుగమారి యందున్న జనులచెవుల బడునట్లే మనుజ మనోగతంబులగు భావనలు ప్రాణమంత్రశక్తులతోఁగూడి పితరు లెందున్న నటకేగి వారిఁజేరును. శిలాదుల మనముచేయు విష్ణ్వాద్యావాహనా దులు, మనమొసగు షోడశోపచార పూజాదులు సఫలంబులికైయగును. నిమంత్రి తులగు బ్రాహ్మణులను నీలోకస్థూలదేహ ధారులైనను శ్రాద్ధకర్మాంతమువరకుఁ బితృభావనతోఁ ద్రికరణశుద్ధితోఁ జూతుము 'యద్భావం తద్భవతి' ఇందుమనో దృఢభావమే ప్రధానము.

ఇట్టిదిభారతీయులకు జననపరంపరాదిగ స్వాభావికము. పితరు లేలోకమున నేరూపమున నుందురో నాలోకగుణానుసార రూపముతో మనమిచ్చు భోజనాదులు చేరును. వారు దేవత్వమందిన యమృతరూపముననుు, నాగలోకముననున్న వాయు రూపముననుు, నీలోకమున మనుష్యరూపముననున్న మనమిచ్చు స్థూలాన్నరూపము నను, పశుపక్షి జలచరాదుల రూపముననున్నఁ దత్తదాహార రూపముననుు, ప్రేత

త్వమునుబొందియున్న రక్తరూపమునను వారిఁజెందును. అందుచే శ్రాద్ధాదుల, దగ్నౌకరణ బ్రాహ్మణభోజన పిండప్రదానమనెడి కర్మక్రియముల నాచరింపజేసిరి దీనివలన పితరులెందున్నను వారిజేరు ముఖ్యావకాశముండును. శ్రాద్ధఫలమనంతమ నక్షయము.

—o—

# గయా క్షేత్ర ప్రశంస.

శ్రీమహాగరుడ పురాణం పూర్వఖండం - అధ్యాయం ౮౧

— సంక్షేపతో గంగాది సర్వతీర్థ వర్ణనమ్. —

సూతఉవాచ॥ సర్వతీర్థానివక్ష్యామి గంగా తీర్థోత్తమోత్తమా। సర్వత్ర సులభా గంగా త్రిషుస్థానేషు దుర్లభా॥ ౧॥ గంగాద్వారే ప్రయాగేచ గంగాసాగర సంగమే। ప్రయాగం పరమం తీర్థం మృతానాం భుక్తిముక్తిదం॥ ౨ ॥ సేవనాత్కృత పిండానాం పాపచిత్కామదం నృణాం। వారాణసీ పరంతీర్థం విశ్వేశో యత్రకేశవః॥ 3 ॥ కురుక్షేత్రం పరంతీర్థం దానాద్యైర్భుక్తి ముక్తిదం। ప్రభాసం పరమంతీర్థం సోమనాథోహి తత్రచ॥ ౪ ॥ ద్వారకాచపురీరమ్యా భుక్తిముక్తి ప్రదాయికా॥ ప్రాచీ సరస్వతీపుణ్యా సప్తసారస్వతం పరం॥ ౫ ॥ కేదారం సర్వపాపఘ్నం సం(శం) బలగ్రామ ఉత్తమః। నగనారాయణం తీర్థం ముక్త్యైబదరి కాశ్రమః॥ ౬ ॥ శ్వేతద్వీపంపురీ మాయానైమిషం పుష్కరం పరం। అయోధ్యాచార్ఘ్యతీర్థంతు చిత్రకూటంచ గోమతీ॥ ౭ ॥ వైనాయకం మహాతీర్థం రామగిర్యాశ్రమం పరం। కాంచీపురీ తుంగభద్రా శ్రీశైలం సేతుబంధనం॥ ౮ ॥ రామేశ్వరం పరంతీర్థం కార్తికేయం యథోత్తమం। భృగుతుంగం కామతీర్థం తీర్థం చామర కంటకం॥ ౯ ॥ ఉజ్జయిన్యాం మహాకాలః కుబ్జకే శ్రీధరోహరిః। కుబ్జామ్రకం మహాతీర్థం కాలసర్పిశ్చకామదం॥ ౧౦ ॥ మహాకేశీచకావేరీ చంద్రభాగా విపాశయా॥ ఏకామ్రం చ తథాతీర్థం బ్రహ్మేశ దేవకోటకం॥ ౧౧ ॥ మధురాచ పురీరమ్యా శోణశ్చైవ మహానదః। జంబూసరో మహాతీర్థం తానితీర్థాని విద్ధిచ॥ ౧౨ ॥ సూర్యః శివోగణోదేవీ హరిర్యత్రచ తిష్ఠతి ఏతేషుచ యథాన్యేషు స్నానం దానం జపస్తపః॥ ౧౩ ॥ పూజా శ్రాద్ధం పిండదానం సర్వంభవతి చాక్షయం. శాలగ్రామం సర్వదం స్యాత్తీర్థా పశుపతేః పరం॥ ౧౪ ॥ కోకాముఖంచ వారాహం ఛాం

(భుం) డీరం స్వామి సంజ్ఞికం। లో(మో)హదండే మహావిష్ణుర్బ్రందరే మధుసూద
నః॥ ౧౫ ॥ కామరూపం మహాతీర్థం (కామాఖ్యా త్రా)యత్ర తిష్ఠతి। పుండ్రి
వర్ధనకం తీర్థం కార్తికేయశ్చ యత్రచ॥ ౧౬ ॥ విరజస్తు మహాతీర్థం తీర్థం శ్రీ పురు
షోత్తమం మహేంద్రపర్వతస్తీర్థం కావేరీచ నదీపరా॥ ౧౭ ॥ గోదావరీ మహా
తీర్థం పయోష్ణీవరదా నదీ। వింధ్యః పాపహరం తీర్థం నర్మదాభేద ఉత్తమః॥ ౧౮ ॥
గోకర్ణం పరమాతీర్థం తీర్థం మాహిష్మతీపురీ। కాలంజరం మహాతీర్థం శుక్లతీర్థ మను
త్తమం॥ ౧౯ ॥ కృతే శౌచేముక్తిదంచ శార్ఙ్గధారీ తదంతికే। విరజం సర్వదం తీర్థం
స్వర్ణాఖ్యం తీర్థ ముత్తమం॥ ౨౦ ॥ నందితీర్థం ముక్తిదంచ కోటితీర్థ ఫలప్రదం।
నాసిక్యంచ మహాతీర్థ గోవర్ధనమతః పరం॥ ౨౧ ॥ కృష్ణవేణీ భీమరథీ గండకీ యా
త్విరావతీ॥ తీర్థం బిందుసరః పుణ్యం విష్ణుపాదోదకం పరం॥ ౨౨ ॥ బ్రహ్మధ్యానం
పరం తీర్థం తీర్థమింద్రియ నిగ్రహః। దమస్తీర్థంతు పరమం భావశుద్ధిః పరం
తథా॥ ౨౩ ॥ జ్ఞానహ్రదే ధ్యానజలే రాగద్వేష మలాపహే। యఃస్నాతి మానసే
తీర్థ సయాతి పరమాంగతిం॥ ౨౪ ॥ ఇదం తీర్థమిదం నేతి యె నరాభేద దర్శినః।
తేషాం విధీయతే తీర్థగమనం తత్ఫలంచయత్॥ ౨౫ ॥ సర్వం బ్రహ్మేతి యోఽ
వేత్తి నాతీర్థం తస్యకించన। ఏతేషు స్నానదానాని శ్రాద్ధం పిండమథాక్షయం॥ ౨౬ ॥
సర్వానద్యః సర్వశైలాఃతీర్థం దేవాదిసేవితం। శ్రీరంగం చ హరేస్తీర్థం తాపీశ్రేష్ఠా
మహానదీ॥ ౨౭ ॥ సప్తగోదావరం తీర్థం తీర్థం కోణగిరిః పరం। మహాలక్ష్మీర్యత్ర
దేవీ ప్రణీతా పరమానదీ॥ ౨౮ ॥ సహ్యాద్రౌ దేవదేవేశ ఏకవీరః సురేశ్వరీ। గం
గాద్వారే కుశావర్తే వింధ్యకే నీలపర్వతే॥ ౨౯ ॥ స్నాత్వా కనఖలేతీర్థే సభవేన్న
పునర్భవే। సూతఉవాచ॥ ఏతాన్యన్యాని తీర్థాని స్నానాద్యైః సర్వదానిహి॥ ౩౦ ॥
శ్రుత్వాఽబ్రవీద్ధరేర్బ్రహ్మ వ్యాసం దక్షాదిసంయుతం। ఏతాన్యుక్త్వాచ తీర్థాని పున
స్తీర్థోత్తమోత్తమమ్॥ గయాఖ్యం ప్రాహసర్వేషా మక్షయం బ్రహ్మలోకదం॥ ౩౧ ॥
ఇతి శ్రీగారుడే మహాపురాణే పూర్వఖండే ప్రథమాంశాఖ్యే ఆచారకాండే సర్వతీర్థ
మాహాత్మ్యం నామైకాశీతి తమోఽధ్యాయః॥

గంగాతీర్థము, గంగాద్వారము, ప్రయాగ, గంగాసాగర సంగమమను మూడు
చోట్ల గంగదుర్లభము. అచ్చటిగంగ సులభంబుగ ముక్తినిచ్చును. మృతులగు
వారికి భుక్తిముక్తుల నిచ్చుటలోఁ బ్రయాగ శ్రేష్ఠమైనది. కాశికాపురియందు శివ
కేశవులుందురు. అయ్యదియు శ్రేష్ఠమైనతీర్థము. కురుక్షేత్రమున దానాదులు

చేయు భుక్తియు ముక్తియునబ్బు. ప్రభాసము, సోమనాథపురము, ద్వారక, ప్రాచీ సరస్వతి, సప్తసారస్వతము, కేదారము, శంబలగ్రామము, బదరికాశ్రమము, శ్వేతద్వీపము, మాయానైమిషము, పుష్కరము, అయోధ్య, చిత్రకూటము, గోమతి, వైనాయకము, రామగిర్యాశ్రమము, కాంచి, తుంగభద్ర, శ్రీశైలము, సేతువు, రామేశ్వరము, కార్తికేయము, భృగుతుంగము, కామతీర్థము, ఉజ్జయిని, కుబ్జకము, కుబ్జామ్రకము, కాలసర్పి, మహాకేశి, కావేరి, చంద్రభాగా, విపాశ, ఏకామ్రము, బ్రహ్మేశము, దేవకోటకము, మధుర, శోణనది, మహానది, జంబూసరస్సు, శాలగ్రామము, కోకాముఖము, వారాహము, భాండీరము, లోహదండము, మందరము, కామరూపము కామము, పుండ్రవర్ధనము, విరజ, మహేంద్రపర్వతము, గోదావరి, వింధ్యము, గోకర్ణము, మాహిష్మతి, కాలంజరము, శుకతీర్థము, స్వర్ణాక్షము, నందితీర్థము, కోటితీర్థము, నాసిక్యము, గోవర్ధనము, కృష్ణవేణీ భీమరథి, గండకి, ఇరావతి, బిందుసరము, విష్ణుపాదోదకము, అను తీర్థములు శ్రేష్ఠములై భుక్తియు, ముక్తియు, నొసంగును. వీనికన్న బ్రహ్మధ్యానముత్తమము, దానికన్న నింద్రియనిగ్రహము, దానికన్న దమము, అంతకన్న జ్ఞానసిద్ధియు, నుత్తమములు. మానసతీర్థంబున ధ్యానజలంబుచే రాగద్వేషమలములను గడిగినవాఁడే యుత్తముఁడు, దుఃఖాతీతుఁడు. పైతీర్థంబుల స్నాన, దాన శ్రాద్ధ, పిండప్రదానమొనరించిన ముక్తిగలుగును. అన్నిటికన్న గయాక్షేత్రతీర్థంబుత్తమంబు. దీనిసేవింప బ్రహ్మసాయుజ్యంబు ప్రాప్తించును.

## శ్రీగరుడ మహాపురాణం పూర్వఖండం - అధ్యాయం ౮౨.

బ్రహ్మోవాచ - సారాత్సారతరం వ్యాసగయామాహాత్మ్యముత్తమం। ప్రవక్ష్యామి సమాసేన భుక్తిముక్తిప్రదం శృణు॥ ౧ ॥ గయాసురోఽభవత్పూర్వం వీర్యవాన్పరమశ్చ సః। తపస్తప్యన్మహాఘోరం సర్వభూతోపతాపనం॥ ౨ ॥ తత్తప సంతాపితా దేవాస్తద్వధార్థం హరిం గతాః। శరణం హరిరూచే తాన్భవితవ్యం శివాత్మభిః॥ 3 ॥ పాత్యతేఽస్య మహాదేహో తథేత్యూచుః సురా హరిం। కదాచిచ్ఛివపూజార్థం క్షీరాబ్ధేః కమలాని చ॥ ౪ ॥ ఆనీయ కీకటే దేశే శయనం చాకరోద్బలీ। విష్ణుమాయావిమూఢోఽసౌ గదయా విష్ణునా హతః॥ ౫ ॥ అతో గదాధరో విష్ణుః గయాయాం ముక్తిదః స్థితః। తస్య దేహో లింగరూపీ స్థితః శుద్ధో పితామహః॥ ౬ ॥ జనార్దనశ్చ కాలేశస్తథాన్యః ప్రపితామహః। విష్ణునా హాథ మర్యాదాం పుణ్యక్షే

త్రిం భవిష్యతి॥ ౭ ॥ యజ్ఞం శ్రాద్ధం పిండదానం స్నానాది కురుతే నరః। స స్వర్గం బ్రహ్మలోకం చ గచ్ఛేన్న నరకం నరః॥ ౮ ॥ గయాతీర్థం పరం జ్ఞాత్వా యాగం చక్రే పితామహః। బ్రాహ్మణాన్పూజయామాస ఋత్విగర్థముపాగతాన్॥ ౯ ॥ మహానదీం రసవహాం సృష్ట్వా వాప్యాదికం తథా। భక్ష్యభోజ్యఫలాదీంశ్చ కామధేనుం తథాసృజత్॥ ౧౦ ॥ పంచక్రోశం గయాక్షేత్రం బ్రాహ్మణేభ్యో దదౌ విభుః। ధర్మయాగేషు లోభాత్తు ప్రతిగృహ్య ధనాదికం॥ ౧౧ ॥ స్థితా విప్రాస్తదా శప్తా గయాయాం బ్రాహ్మణాస్తతః మా భూత్త్రిపురుషీ విద్యా మా భూత్త్రి పురుషం ధనం॥ ౧౨ ॥ యుష్మాకం స్యాద్వారివహా నదీ పాషాణ పర్వతాః। శప్తైస్తు ప్రార్థితో బ్రహ్మానుగ్రహం కృతవాన్ప్రభుః॥ ౧౩ ॥ లోకాః పుణ్యా గయాయాం హి శ్రాద్ధినో బ్రహ్మలోకగాః। యుష్మాన్యే పూజయిష్యంతి తైరహం పూజితః సదా॥ ౧౪ ॥ బ్రహ్మజ్ఞానం గయాశ్రాద్ధం గోగృహే మరణం తథా। వాసః పుంసాం కురుక్షేత్రే ముక్తిరేషా చతుర్విధా॥ ౧౫ ॥ సముద్రాః సరితః సర్వా వాపీకూపహ్రదాస్తథా। స్నాతుకామా గయాతీర్థం వ్యాసయాంతి న సంశయః॥ ౧౬ ॥ బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః। పాపం తత్సంగజం సర్వం గయాశ్రాద్ధాద్వినశ్యతి॥ ౧౭ ॥ అసంస్కృతా మృతా యే చ పశుచోర హతాశ్చ యే। సర్పదష్టా గయాశ్రాద్ధాన్ముక్తాః స్వర్గం వ్రజంతి తే॥ ౧౮ ॥ గయాయాం పిండదానేన యత్ఫలం లభతే నరః। న తచ్ఛక్యం మయా వక్తుం వర్షకోటి శతైరపి॥ ౧౯ ॥ ఇతి శ్రీగారుడే - మహాపురాణే పూర్వఖండే ప్రథమాంశాఖ్యే ఆచారఖండే గయామాహాత్మ్యం నామద్వ్యశీతితమోఽధ్యాయః॥

## —♦ గయా శ్రాద్ధ మహిమ. ♦—

తొల్లి గయుఁడను రాక్షసుండు మహాబలపరాక్రమవంతుఁడుగలఁడు. అతండు శివునిఁగూర్చి ఘోరతపంబుచేసెను తత్తపోగ్నిజ్వాలలు స్వర్గలోకంబువరకు వ్యాపించినవి. దానితాపాధిక్యమునకు ముల్లోకంబులు తల్లడిల్లినవి. దేవతలప్పుడు శ్రీమహావిష్ణువుకడకేగి మొరలిడిరి. విష్ణువంతట వారికభయమిచ్చి పంపెను. గయుండు క్షీరాబ్ధియందలి కమలములఁ దెచ్చుచు విష్ణుమాయా మోహితుఁడై కీకటదేశంబున (గయ) శయనించియుండెను. అట్టిసమయమున విష్ణువు వానిఁ దనగదచే సంహరించెను. అతని మృతకళేబరము పంచక్రోశప్రమాణ దూరదేశము నావరించి పడియుండెను. అదియే గయాక్షేత్రము. (కీకటదేశము) అందు గదాధరుండై

విష్ణుండు ముక్తినొసఁగు నిమిత్తము నిలిచెను. గయుని దేహంబంత లింగరూపంబు నందెను. హరిహర బ్రహ్మలందే నిలిచిరి. విష్ణుప్రసంశట నాక్షేత్రమున యజ్ఞ శ్రాద్ధపిండప్రదాన దానంబులొనరించువారు బ్రహ్మలోకంబు బొందుదురని మర్యాదావాక్యంబులఁ దెలిపెను. బ్రహ్మయు నందు యజ్ఞంబు గావించి బ్రాహ్మణుల నర్చించి ఋత్విజుల నర్థతృప్తులఁగావించె. పితామహుఁడందు భక్ష్యభోజ్య ఫలాదులను గామధేనువును సృజించి ద్విజుల కైదుక్రోసుల దూరక్షేత్ర మొసఁగెను. అధర్మయజ్ఞంబున బ్రాహ్మణులు లోభంబున నత్యధికధనాదుల గ్రహించియుఁ దృప్తిఁ జెందనివారగుట వలన నజుండు వారివంశములు మూఁడుతరములు విద్యాధన హీనగఁ బొందునట్లును వారిదేశము నదీపాషాణపర్వత మయముగునట్లును శపించెను. అంత విప్రులు ప్రార్థింప శాపంబు మరలింపఁబడెను. గయ యందెవరు శ్రాద్ధంబు చేయుదురో వారు బ్రహ్మలోకంబుఁ జేరుదురు. అందలివిప్రుల నెవరుపూజింతురో వారలందు బ్రహ్మపూజకర్తలగుదురు ముక్తి నాల్గువిధంబులు, (౧) బ్రహ్మజ్ఞానము, (౨) గయాశ్రాద్ధము, (3, గోశాలయందలి మరణము, (౪) కురుక్షేత్రనివాసము. సముద్రనదీ సరోవాపీ కూపప్రవాద స్నానఫలంబులన్నియు గయాతీర్థంబునఁగలుగును. బ్రహ్మహత్య సురాపాన చౌర్య గురుపత్ని సంగమాది పాతకంబులు సహితము గయాశ్రాద్ధంబు చేయుటచే నశించును. గయాశ్రాద్ధంబుచే మృతులైె సంస్కారములేనివారు, చోరహతులు, సర్పదష్టులుకూడ స్వర్గముం జేరుదురు, గయలోఁబిండప్రదానంబుచేయుటచేఁ గలుగు సుకృతంబు కోటిసంవత్సరములు వర్ణించి చెప్పుటకును సాధ్యముకాదని బ్రహ్మ వ్యాసులకుఁజెప్పెను.

శ్రీమహాగరుడపూరాణం - పూర్వఖండ - అధ్యా. ౮౬

బ్రహ్మోవాచ- యేయం ప్రేతశిలాఖ్యాతా గయాయాం సాత్రిధాస్థితా। ప్రభాసే ప్రేతకుండే చ గయాసుర శిరస్యపి॥ ౧ ॥ ధర్మేణధారితా భూత్వా సర్వదేవమయీ శిలా। ప్రేతత్వం యేగతా న్యూణాం మిత్రాద్యా బాంధవాదయః॥ ౨ ॥ తేషాముద్ధరణార్థాయ యతః ప్రేతశిలాశుభా। అతోఽత్రమునయో భూపా రాజపత్న్యాదయఃసదా॥ 3 ॥ తస్యాం శిలాయాం శ్రాద్ధాదికర్తారో బ్రహ్మలోకగాః। గయాసురస్యయన్ముండం తస్యపృష్ఠే శిలాయతః॥ ౪ ॥ ముండపృష్ఠో గిరిస్తస్మాత్సర్వదేవమయోహ్యయం। ముండపృష్ఠస్య పాదేషు యతో బ్రహ్మ సరోముఖాః॥ ౫॥ అరవిందవనం తేషు తేనచైవోపలక్షితః। అరవిందో గిరిర్నామ క్రౌంచపాదాంకితో

యతః॥ ౮ ॥ తస్మాన్నిః క్రౌంచపాదః పితౄణాం బ్రహ్మలోకదః। గదాధరాదయో దేవా ఆద్యాఆదావ్యవస్థితాః॥ ౯ ॥ శిలారూపేణ చావ్యక్తా స్తస్మాద్దేవ మయీ శిలా। గయాశిరశ్ఛాదయిత్వా గురుత్వాదాస్థితాశిలా॥ ౮ ॥ కాలాంతరేణవ్యక్తశ్చ స్థితఆదిగదాధరః మహారుద్రాది దేవైస్తు అనాదినిధనోహరిః ౯ ॥ ధర్మసంరక్షణార్థాయ అధర్మాది వినష్టయే। దైత్యరాక్షసనాశార్థం మత్స్యఃపూర్వం యథాభవత్.౧౦॥ కూర్మోవరాహో నృహరిర్వా మనో రామపూర్జితః, యథా దాశరథీ రామః కృష్ణోబుద్ధోఽథ కల్క్యపి ౧౧ ॥ తథావ్యక్తోఽవ్యక్తరూప ఆసీదాదిగదాధరః॥ ఆదిరాదౌ పూజితోత్రి దేవైర్బ్రహ్మాది భిర్యతః ౧౨ ॥ పాద్యా ద్యైర్గంధ పుష్పాద్యైరత ఆదిగదాధరః। గదాధరం సుసైః సార్ధమాద్యం గత్వాదదాతి యః ౧౩ ॥ అర్ఘ్యం పాత్రించ పాద్యంచ గంధపుష్పంచ ధూపకం। దీపం నైవేద్యముత్కృష్టం మాల్యాని వివిధానిచ॥ ౧౪ ॥ వస్త్రాణిమకుటం ఘంటాచామరం ప్రేక్షణీయకం। అలంకారాదికం పిండమన్నదానాదికం తథా॥ ౧౫ ॥ తేషాం తావద్ధనం ధాన్యమాయురారోగ్య సంపదః। పుత్రాదిసంతతిశ్శ్రేయోవిద్యార్థం కామయాప్సితః॥ ౧౬ ॥ భార్యాస్వర్గాదివాసశ్చ స్వర్గాదాగత్యరాజ్యకం। కులీన సత్వసంపన్నో రణేమర్దిత శాత్రవః॥ ౧౭ ॥ వధబంధవినిర్ముక్తశ్చాంతే మోక్షమవాప్నుయాత్। శ్రాద్ధపిండాదికర్తారః పితృభిర్బ్రహ్మలోకగాః॥ ౧౮ ॥ జగన్నాథం యేఽర్చయంతి సుభద్రాం బలభద్రకం। జ్ఞానం ప్రాప్య శ్రియం పుత్రాన్ వ్రజంతి పురుషోత్తమం॥ ౧౯ ॥ పురుషోత్తమరాజస్య సూర్యస్యచ గణస్యచ। పురతస్తత్రి పిండాది పితౄణాం బ్రహ్మలోకదః॥ ౨౦ ॥ నత్వా కపర్ది విఘ్నేశం సర్వవిఘ్నైః ప్రముచ్యతే। కార్తికేయం పూజయిత్వా బ్రహ్మలోక మవాప్నుయాత్ ॥ ౨౧ ॥ ద్వాదశాదిత్య మభ్యర్చ్య సర్వరోగైః ప్రముచ్యతే. వైశ్వానరం సమభ్యర్చ్య ఉత్తమాం దీప్తిమాప్నుయాత్ ॥ ౨౨ ॥ రేవంతం పూజయిత్వాథ అశ్వానాప్నోత్యనుత్తమాన్। అభ్యర్చ్యేంద్రం మహైశ్వర్యం గౌరీం సౌభాగ్యమాప్నుయాత్ ॥ ౨౩ ॥ విద్యాం సరస్వతీం ప్రాచ్యలక్ష్మీం సంపూజ్యచ శ్రియా। గరుడం చ సమభ్యర్చ్య విఘ్నవృందాత్ప్రముచ్యతే॥ ౨౪ ॥ క్షేత్రపాలం సమభ్యర్చ్య గ్రహ వృందైః ప్రముచ్యతే, ముండపృష్టం సమభ్యర్చ్య సర్వకామ మవాప్నుయాత్ ॥ ౨౫ ॥ నాగాష్టకం సమభ్యర్చ్య నాగదష్టో విముచ్యతే। బ్రహ్మాణం పూజయిత్వా చ బ్రహ్మలోక మవాప్నుయాత్ ॥ ౨౬ ॥ బలభద్రం సమభ్యర్చ్య బలారోగ్య మవాప్నుయాత్। సుభద్రాం పూజయిత్వాతు సౌభాగ్యం పరమాప్నుయాత్ ॥ ౨౭ ॥

సర్వాన్ కామానవాప్నోతి సంపూజ్య పురుషోత్తమం। నారాయణంతు సంపూజ్య నరాణామధిపోభవేత్॥ ౨౮ ॥ స్పృష్ట్వానత్వా నరాసింహం సంగ్రామే విజయీభవేత్। వరాహం పూజయిత్వాతు భూమిరాజ్యమవాప్నుయాత్॥ ౨౯ ॥ మాలా విద్యాధరో స్పృష్ట్వా విద్యాధరపదంలభేత్। సర్వాన్కామానవాప్నోతి సంపూజ్యాది గదాధరం॥ ౩౦ ॥ సోమనాథం సమభ్యర్చ్య శివలోకమవాప్నుయాత్। రుద్రేశ్వరం నమస్కృత్య రుద్రలోకే మహీయతే॥ ౩౧ ॥ కామేశ్వరం నరోనత్వా రామవత్సుప్రియోభవేత్। బ్రహ్మేశ్వరం నరః స్తుత్వాబ్రహ్మలోకాయ కల్ప్యతే॥ ౩౨ ॥ కాలేశ్వరం సమభ్యర్చ్య నరః కాలంజయోభవేత్। కేదారం పూజయిత్వాతు శివలోకే మహీయతే॥ ౩౩ ॥ సిద్ధేశ్వరం చ సంపూజ్య సిద్ధసిద్ధిపురం వ్రజేత్। ఆద్యైరుద్రాదిభిః సార్ధం దృష్ట్వా హ్యాదిగదాధరం॥ ౩౪ ॥ కులానాం శతముద్ధృత్యనయే ద్బ్రహ్మపురం నరః। ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మ మర్థార్థీ చార్థమాప్నుయాత్॥ ౩౫ ॥ కామాన్ సంప్రాప్నుయాత్కామీ మోక్షార్థీ మోక్షమాప్నుయాత్। రాజ్యార్థీ రాజ్యమాప్నోతి శాంత్యర్థీశాంతి మాప్నుయాత్॥ ౩౬ ॥ సర్వమాప్నోతి సంపూజ్యాదిగదాధరం। పుత్రాన్ పుత్రార్థినీ స్త్రీచ సౌభాగ్యం చతదర్థినీ॥ ౩౭ ॥ వంశార్థినీ చ వంశాన్వైప్రాప్యార్చ్యాది గదాధరం। శ్రాద్ధేన పిండదానేన అన్నదానేన వారిదః॥ ౩౮ ॥ బ్రహ్మలోక మవాప్నోతి సంపూజ్యాదిగదాధరం। పృథివ్యాం సర్వతీర్థేభ్యో యథాశ్రేష్ఠా గయాపురీ। ౩౯ ॥ తథాశిలాది రూపశ్చ శ్రేష్ఠశ్చైవగదాధరః॥ తస్మిన్దృష్టే శిలాదృష్టా యతఃసర్వం గదాధరః॥౪౦

ఇతిశ్రీగారుడే మహాపురాణే పూర్వఖండే ప్రథమాంశాఖ్యే - ఆచారకాండే

గయామాహాత్మ్యం నామషడశీతి తమోఽధ్యాయః.

శ్రీమహావిష్ణుహస్తస్థిత గదాహతుండగు గయుని ప్రేతదేహము శిలారూపమంది త్రిభాగములఁ బ్రసిద్ధికెక్కెను. ఆతనిశిరము ప్రభాసప్రేతకుండమయ్యెను. సర్వదేవమయంబై యాశిల భూతములకొఱకు ధర్మయుతంబైయున్నది. ఆప్రేతశిల ప్రేతత్వమందిన జనులనుద్ధరించును. అందుమునులు, రాజులు రాజపత్నులు మున్నగువారలు శ్రాద్ధమొనరించి బ్రహ్మలోకమునందిరి. శిరసునకు గ్రిందిభాగమగు వక్షస్థలము శిలారూపమై గిరిరూపమందెను. అదియు సర్వదేవతా మయంబై వెలసె. దీనికధోభాగము (పాదము) శిలారూపమై బ్రహ్మసరోవశాదులకు నెలవయ్యెను. ఆసరస్సులలోఁ గమలమండంబులు కమలవందువుసేయుచుండు,

అందరవింద గిరియొందు క్రౌంచపదచిహ్నితమై పితరులకు బ్రహ్మపదము నొసంగు నదై యొప్పును. శిరసుకడ గదాధరాది దేవతలు నిలిచియున్నారు. గదాధరుండగు విష్ణుండు ధర్మసంరక్షణార్థము నధర్మనాశనార్థము తొలినుండి నిలిచి యుండియున్నాఁడు అతండు సృష్ట్యాదినుండియు రాక్షస సంహరణార్థము మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణ, బౌద్ధ, కల్క్యవతారంబులంది వ్యక్తావ్యక్తరూపుఁడైయున్నవాఁడు. అతఁడు బ్రహ్మదులచేఁ బూజింపఁబడెను.

ఎవఁడు గదాధరునకర్ఘ్యపాద్యాద్యాచమనీయ స్నాన గంధపుష్పాక్షత ధూప దీపనైవేద్య తాంబూల నీరాజన మాల్యవస్త్ర కిరీట ఘంటాచామరాదుల షోడశోపచారంబులనర్చించి పిండప్రదాన మాచరించునో యతఁడు ధనధాన్యాయురారోగ్య పుత్రాదుల నందఁగలఁడు కోరినకోరికలన్నియు నందు గదాధరునర్చింప నెరవేరును జగన్నాథ బలభద్ర సుభద్రలఁ బూజించిన జ్ఞానంబు లభించు. సూర్యగణ పురుషోత్తముల నెదుట పిండప్రదానముసేయ బ్రహ్మసాయుజ్యంబుగలుగు. కపర్ది విఘ్నేశ కార్తికేయులఁ బూజింప విఘ్నములుదొలఁగి బ్రహ్మలోకంబు సిద్ధించు ద్వాదశాదిత్యార్చనంబున సర్వరోగములు దొలఁగు వైశ్వానరు నర్చింప. గాంతి మంతుండగు. రేవంతుని, మహేంద్రుని, గౌరిని, లక్ష్మిని, సరస్వతిని, గరుడ క్షేత్రపాలక నాగాష్టక బలభద్రుల నర్చింప అష్టైశ్వర్యసౌభాగ్యవిద్యా సంపదవిఘ్న గ్రహభయ వాగాభయ బ్రహ్మలోకారోగ్య బలములబ్బును. దశావతారముల నర్చింప సంగ్రామ విజయరాజ్యాధిపత్య విద్యాధర పదములబ్బును. నారాయణు నర్చింప నరాధిపత్యము గలుగు. ఏయేదేవత నర్చించిన నేయేఫలములబ్బునో యాయాఫలముల నాదేవతల గదాధరునందావహించి యర్చించినఁ బొందుదురు.



# గయాక్షేత్ర యాత్రా వర్ణనము — తత్ఫలము.

—♦ పంచకోశపరిమితి గయాక్షేత్రస్థిత యాత్రావర్ణనం. ♦—

శ్రీగరుడమహాపురాణం పూర్వఖండం అధ్యాయం ८3.

బ్రహ్మోవాచ॥ కీకటేషు గయా పుణ్యా పుణ్యం రాజగృహం వనం। విషయశ్చారణః పుణ్యో నదీనాంచ పునః పునా॥ ౧ ॥ ముండపృష్టంతు పూర్వ

స్మిన్పశ్చిమే దక్షిణోత్తరే। సార్ధక్రోశద్వయంమానం గయాయాం పరికీర్తితం॥ ౨ ॥
పంచక్రోశం గయాక్షేత్రం క్రోశమేకం గయాశిరః। తత్రపిండ ప్రదానేన తృప్తిర్భ
వతి శాశ్వతీ॥ ౩। నాగాజ్జనార్దనాచ్చైవ కూపాచ్చోత్తరమానసాత్॥ ఏతద్గయాశిరః
ప్రోక్తంఫల్గుతీర్థం తదుచ్యతే॥ ౪॥ తత్రపిండప్రదానేన పితౄణాం పరమాగతిః। గయా
గమనమాత్రేణ పితౄణామనృణోభవేత్॥ ౫॥ గయాయాం పితృరూపేణ దేవదేవో
జనార్దనః। తందృష్ట్వా పుండరీకాక్షం ముచ్యతేవైఋణత్రయాత్॥ ౬॥ రథమార్గం
గయాతీర్థే దృష్ట్వారుద్రపదాదికే। కాలేశ్వరం చ కేదారం పితౄణామనృణో భవే
త్॥ ౭ ॥ దృష్ట్వాపితామహం దేవం సర్వపాపైః ప్రముచ్యతే। లోకం త్వనామయం
యాతిదృష్ట్వాచ ప్రపితామహం॥౮॥ తథాగదాధరం దేవంమాధవం పురుషోత్తమం॥
తంప్రణమ్య ప్రయత్నేన నభూయో జాయతే నరః॥ ౯॥ మౌనాదిత్యంమహాత్మా
నం కనకార్కం విశేషతఃదృష్ట్వామౌనేన విప్రర్షే పితౄణా మనృణోభవేత్॥౧౦॥
బ్రహ్మాణం పూజయిత్వాచ బ్రహ్మలోక మవాప్నుయాత్। గాయత్రీం ప్రాతరు
త్థాయ యస్తు పశ్యతిమానవః॥ ౧౧ ॥ సంధ్యాం కృత్వా ప్రయత్నేన సర్వవేద
ఫలంలభేత్। సావిత్రీంచైవమధ్యాహ్నేదృష్ట్వా దానఫలంలభేత్॥౧౨॥ సరస్వ
తీంచ సాయాహ్నే దృష్ట్వాదానఫలం లభేత్। నగస్థమీశ్వరందృష్ట్వా పితౄణామనృ
ణో భవేత్॥ ౧౩ ॥ ధర్మారణ్యం ధర్మమీశం దృష్ట్వా స్యాదృణనాశనః। దేవం
గృధ్రేశ్వరం దృష్ట్వాకోన ముచ్యేతబంధనాత్॥౧౪॥ ధేనుందృష్ట్వా ధేనువనేబ్రహ్మ
లోకం నయేత్పితౄన్। ప్రభాసేశం ప్రభాసేచ దృష్ట్వాయాతి పరాంగతిం। ౧౫ ॥
కోటీశ్వరం చాశ్వమేధం దృష్ట్వాస్యాదృణనాశనః। స్వర్గద్వారేశ్వరందృష్ట్వా ముచ్య
తే భవబంధనాత్। ౧౬ ॥ కామేశ్వరం గదాలోలం దృష్ట్వా స్వర్గమవాప్నుయాత్
బ్రహ్మేశ్వరం తథాదృష్ట్వాముచ్యేత్బ్రహ్మహత్యయా॥౧౭॥ ముండపృష్ఠే మహా
చండీం దృష్ట్వాకామానవాప్నుయాత్ ఫల్గ్వీశం ఫల్గుచండీంచగౌరీం దృష్ట్వాచ మంగ
లామ్॥౧౮॥ గోమంతం గోపతిందేవంపితౄణా మనృణోభవేత్। అంగారేశంచ సిద్ధే
శం గయాదిత్యం గజంతథా॥౧౯॥ మార్కండేయేశ్వరందృష్ట్వా పితౄణామనృణో
భవేత్। ఫల్గుతీర్థేనరః స్నాత్వా దృష్ట్వా దేవం గదాధరం॥ ౨౦ ॥ ఏతేన కిం న
పర్యాప్తంనృణాం సుకృతకారిణాం। బ్రహ్మలోకం ప్రయాంతీహ పురుషా ఏకవిం
శతిః॥ ౨౧ ॥ పృథివ్యాం యాని తీర్థానియేసముద్రాః సరాంసిచ। ఫల్గుతీర్థంగ
మిష్యంతి వారమేకం దినే దినే॥ ౨౨ ॥ పృథివ్యాంచ గయా పుణ్యాగయాయాంచ
గయాశిరః। శ్రేష్ఠంతథా ఫల్గుతీర్థం తన్ముఖంచ సురస్యహి॥ ౨౩ ॥ ఉదీచీ కన

కానద్యోనాభితీర్థంతు మధ్యతః। పుణ్యం బ్రహ్మసదస్తీర్థం స్నానాత్స్వర్బ్రహ్మ లోకద ॥ ౨౪ ॥ కూపే పిండాదికం కృత్వా పితౄణా మనృణో భవేత్। తథా క్షయవటే శ్రాద్ధీ బ్రహ్మలోకం నయేత్పితౄన్॥ ౨౫ ॥ హంసతీర్థేనరః స్నాత్వా సర్వపాపైః ప్రముచ్యతే। కోటితీర్థే గయాలోలే వైతరణ్యాంచ గోమకే। ౨౬ ॥ బ్రహ్మలోకం నయేచ్ఛ్రాద్ధీ పురుషానేక వింశతిం। బ్రహ్మతీర్థే రామతీర్థే ఆగ్నేయే సోమతీర్థకే। ౨౭ ॥ శ్రాద్ధీ రామహ్రదే బ్రహ్మలోకం పితృకులం నయేత్। ఉత్తరే మానసే శ్రాద్ధీ నభూయో జాయతే నరః॥ ౨౮ ॥ దక్షిణే మానసే శ్రాద్ధీ బ్రహ్మలోకం పితౄన్నయేత్। స్వర్గద్వారే నరః శ్రాద్ధీ బ్రహ్మలోకం నయేత్పితౄన్। భీష్మతర్పణ కృత్తస్యకూటే తారయతే పితౄన్। గృధ్రేశ్వరే తథాశ్రాద్ధీ పితౄణా మనృణో భవేత్॥ ౨౯ ॥ శ్రాద్ధీచ ధేనుకారణ్యే బ్రహ్మలోకం పితౄన్నయేత్। తిలధేనుప్రదః స్నాత్వా దృష్ట్వాపి ధేనుం నసంశయః॥ ౩౦ ॥ ఐన్ద్రోవా నరతీర్థంచ వాసవే వైష్ణవేతథా। మహానద్యాం కృతశ్రాద్ధో బ్రహ్మలోకం నయేత్పితౄన్॥ ౩౧ ॥ గాయత్రే చైవసావిత్రే తీర్థే సారస్వతే తథా। స్నానసంధ్యాతర్పణకృచ్ఛ్రాద్ధీ చైకోత్తరం శతం। ౩౨ ॥ పితౄణాంతు కులం బ్రహ్మలోకం నయతి మానవః। బ్రహ్మయోనిం వినిర్గచ్ఛేత్ప్రయతః పితృమానసః॥ ౩౩ ॥ తర్పయిత్వా పితౄన్దేవాన్ నవిశేద్యోని సంకటే। తర్పణే కాకజంఘాయాం పితౄణాం తృప్తిరక్షయా॥ ౩౪ ॥ ధర్మారణ్యే మతంగస్య వాప్యాం శ్రాద్ధాద్దివం వ్రజేత్। ధర్మయూపేచ కూపేచ పితౄణా మనృణో భవేత్॥ ౩౫ ॥ ప్రమాణం దేవతాః సంతు లోకపాలాశ్చ సాక్షిణః। మయాగత్యమతంగేఽస్మిన్పితౄణాం నిష్కృతిః కృతా॥ ౩౬ ॥ రామతీర్థే నరఃస్నాత్వా శ్రాద్ధం కృత్వా ప్రభాసకే। శిలాయాం ప్రేతభావాత్స్యుర్ముక్తాః పితృగణాః కిల॥ ౩౭ ॥ శ్రాద్ధకృచ్చ స్వపృష్ఠాయాం త్రిఃసప్తకుల ముద్ధరేత్। శ్రాద్ధకృన్ముండ పృష్ఠాదౌ బ్రహ్మలోకం నయేత్పితౄన్॥ ౩౮ ॥ గయాయాం నహితత్స్థానం యత్ర తీర్థం నవిద్యతే పంచక్రోశే గయాక్షేత్రే యత్రయత్రతు పిండదః। ౩౯ ॥ అక్షయం ఫలమాప్నోతి బ్రహ్మలోకం నయేత్పితౄన్। జనార్దనస్య హస్తేతుపిండం దద్యాత్స్వకంనరః॥ ౪౦ ॥ ఏషపిండో మయాదత్త స్తవ హస్తే జనార్దన। పరలోకం గతేమోక్ష మక్షయ్యముపతిష్ఠతామ్॥ ౪౧ ॥ బ్రహ్మలోక మవాప్నోతి పితృభిః సహానిశ్చితం। గయాయాం ధర్మపృష్ఠేచ సరసిబ్రహ్మణస్తథా। ౪౨ ॥ గయాశీర్షేఽక్షయవటే పితౄణాందత్త మక్షయం। ధర్మారణ్యం ధర్మపృష్ఠం ధేనుకారణ్యమేవచ॥ ౪౩ ॥ దృష్ట్వైతాని

పితౄంశ్చాన్యవంశ్యాన్వింశతిముద్ధరేత్। బ్రహ్మారణ్యం మహానద్యాః పశ్చిమో
భాగ ఉచ్యతే॥ ౪౪ ॥ పూర్వో బ్రహ్మసదో భాగో నాగాద్రిర్భరతాశ్రమః। భరత
స్యాశ్రమే శ్రాద్ధీ మతంగస్య పదే భవేత్॥ ౪౫ ॥ గయాశీర్షాద్దక్షిణతో మహానద్యా
శ్చ పశ్చిమే। తత్స్మృతం చంపకవనం తత్ర పాండుశిలాస్తి హి॥ ౪౬ ॥ శ్రాద్ధీ తత్ర
తృతీయాయాం నిశ్చిరా యాశ్చ మండలే। మహాహ్రదే చ కౌశిక్యా మక్షయం ఫల
మాప్నుయాత్॥ ౪౭ ॥ వైతరణ్యాశ్చోత్తర తస్తృతీయాభ్యో జలాశయః। పదాని
తత్ర క్రౌంచస్య శ్రాద్ధీ స్వర్గం నయేత్పితౄన్॥ ౪౮ ॥ క్రౌంచపాదాదుత్తరతో నిశ్చి
రాభ్యో జలాశయః। సకృద్యాత్రాభిగమనం సకృత్పిండ ప్రపాతనం॥ ౪౯ ॥ దుర్ల
భం కిం పునర్నిత్య మస్మిన్నేవ వ్యవస్థితిః। మహానద్యా ముపస్పృశ్య తర్పయేత్పితృ దే
వతాః॥ ౫౦ ॥ అక్షయాన్ప్రాప్నుయాల్లోకాన్కులం చాపి సముద్ధరేత్। సావిత్రే
పఠ్యతే సంధ్యా కృతాస్యా ద్వాదశాబ్దికీ॥ ౫౧ ॥ శుక్లకృష్ణావుభౌ పక్షౌ గయాయాం
యో వసేన్నరః। పునాత్యాసప్తమం చైవ కులం నాస్త్యత్ర సంశయః॥ ౫౨ ॥ గయా
యాం ముండపృష్ఠం చ అరవిందం చ పర్వతం। తృతీయం క్రౌంచపాదం చ దృష్ట్వా
పాపైః ప్రముచ్యతే॥ ౫౩ ॥ మకరే వర్తమానే చ గ్రహణే చంద్రసూర్యయోః।
దుర్లభం త్రిషులోకేషు గయాయాం పిండపాతనం॥ ౫౪ ॥ మహాహ్రదే చ కౌశి
క్యాం మూలక్షేత్రే విశేషతః। గుహాయాం గృధ్రకూటస్య శ్రాద్ధం దత్తం (సప్త)
మహాఫలం॥ ౫౫ ॥ యత్ర మాహేశ్వరీధారా శ్రాద్ధీ తత్రానృణో భవేత్। పుణ్యాం
విశాలామాసాద్య నదీం త్రైలోక్య విశ్రుతాం॥ ౫౬ ॥ అగ్నిష్టోమ మవాప్నోతి
శ్రాద్ధీ ప్రాయాద్దివం నరః। శ్రాద్ధీ మాసపదే స్నాత్వా వాజపేయ ఫలం లభేత్॥ ౫౭ ॥
రవిపాదే పిండదానాత్పతితోద్ధారణం భవేత్। గయాస్థో యో దదాత్యన్నం పితర
స్తేన పుత్రిణః॥ ౫౮ ॥ కాంక్షంతే పితరః పుత్రాన్నరకాద్భయభీరవః। గయాం
యాస్యతి యః కశ్చిత్సోఽస్మాన్ సంతారయిష్యతి॥ ౫౯ ॥ గయాప్రాప్తం సుతం
దృష్ట్వా పితౄణాముత్సవో భవేత్। పద్భ్యామపి జలం స్పృష్ట్వా అస్మభ్యం కిల దాస్య
తి॥ ౬౦ ॥ ఆత్మజో వా తథాన్యో వా గయాకూపే యదా తదా। యన్నామ్నా పాత
యేత్పిండం తం నయేద్బ్రహ్మ శాశ్వతం॥ ౬౧ ॥ పుండరీకం విష్ణులోకం ప్రాప్ను
యాత్కోటితీర్థగః। యా సా వైతరణీ నామ త్రిషు లోకేషు విశ్రుతా॥ ౬౨ ॥ సావతీ
ర్ణా గయాక్షేత్రే పితౄణాం తారణాయ హి। శ్రాద్ధదః పిండదస్తత్ర గోప్రదానం
కరోతి యః॥ ౬౩ ॥ ఏకవింశతి వంశ్యాన్సంతారయేన్నాత్ర సంశయః। యది పుత్రో
గయాం గచ్ఛేత్కదాచిత్కాల పర్యయే॥ ౬౪ ॥ తానేవ భోజయేద్విప్రాన్ బ్రా

హ్మణాయే ప్రకల్పితాః। తేషాంబ్రహ్మపదః స్థానం సోమపానం తథైవచ॥ ౬౫ ॥ బ్రహ్మప్రకల్పితం స్థానం విప్రబ్రహ్మప్రకల్పితాః। పూజితైః పూజితాః సర్వే పితృభిః సహదేవతాః॥ ౬౬ ॥ తర్పయేత్తు గయావిప్రాన్ హవ్యకవ్యైర్విధానతః। స్థానం దేహపరిత్యాగే గయాయాంతు విధీయతే॥ ౬౭ ॥ యఃకరోతి వృషోత్సర్గం గయాక్షేత్రే హ్యనుత్తమే। అగ్నిష్టోమశతం పుణ్యం లభతే నాత్రసంశయః॥ ౬౮ ॥ ఆత్మనోఽపి మహాబుద్ధిర్గయాయాంతు తిలైర్వినా। పిండనిర్వాపణం కుర్యాదన్యేషామపిమానవః॥ ౬౯ ॥ యావంతో జ్ఞాతయః పిత్ర్యా బాంధవాః సుహృదయస్తథా తేభ్యోవ్యాస గయాభూమౌ పిండోదేయో విధానతః॥ ౭౦ ॥ రామతీర్థే నరః స్నాత్వాగోశతస్య ఫ్నుయాత్ఫలం। మతంగవాప్యాం స్నాత్వా చ గోసహస్రఫలం లభేత్॥ ౭౧ ॥ నిశ్చిరాసంగమేస్నాత్వా బ్రహ్మలోకం నయేత్పితౄన్। వసిష్ఠస్యాశ్రమే స్నాత్వా వాజపేయుంచ విందతి॥ ౭౨ ॥ మహాకౌశ్యాం సమావాసా దశ్వమేధ ఫలంలభేత్। పితామహస్య సరసః ప్రసృతా లోకపావనీ॥ ౭౩ ॥ సమీపే త్వగ్నిధారేతి విశ్రుతా కపిలాహిసా। అగ్నిష్టోమఫలం శ్రాద్ధీస్నాత్వాతత్రకృతకృత్యతా॥ ౭౪ ॥ శ్రాద్ధీకుమారధారాయా మశ్వమేధఫలం లభేత్। కుమారమభిగమ్యాథ నత్వాముక్తిమవాప్నుయాత్॥ ౭౫ ॥ సోమకుండేనరఃస్నాత్వా సోమరోమే చగచ్ఛతి। సంవర్తస్య నరోవాప్యాం సుభగః స్యాత్తుపిండదః॥ ౭౬ ॥ ధౌతపాపోనరో యాతి ప్రేతకుండే చ పిండదః। దేవనద్యాం లేలిహానే మథనే జానుగర్తకే॥ ౭౭ ॥ ఏవమాదిషు తీర్థేషు పిండదస్తారయే త్పితౄన్। నత్వాదేవా న్వసిష్ఠేశ ప్రభృతి న్నృణసంత్సయం॥ ౭౮ ॥ ఇతి శ్రీగారుడే మహాపురాణే పూర్వఖండే ప్రథమాంశాఖ్యే ఆచారకాండే గయామాహాత్మ్యం నామత్ర్యశీతి తమోఽధ్యాయః॥

గయాక్షేత్రము కీకటదేశంబునఁ గలదు. అయ్యది పుణ్యతమంబు అందలి వనంబు రాజగృహంబై యొప్పుచుండు. తద్విషయంబులు పుణ్యప్రదములు. అందు జరించువారలు పుణ్యాత్ములు. అందలినదులు పుణ్యప్రదములు. గయాముండ పృష్ఠప్రదేశములకు నాల్గుదిశలందు నర్ధక్రోశప్రమాణ దూరదేశంబు గయాక్షేత్రం బనంబడు. అయ్యది పంచక్రోశ విస్తృతిఁ గలిగియుండు. గయాశిరవ్యాప్త ప్రదేశ మొక్క క్రోసుదూరంబు వ్యాపించినది. అందుఁ బిండంబిడ ఁబితరులు తృప్తిఁ జెంది శాశ్వత బ్రహ్మలోకం బందఁగలరు. నాగజనార్దన మానస సరస్తీరముల కుత్తరమున గయా శీర్షంబుగలదు. అయ్యదియే ఫల్గుతీరము. గయ కేగిన మాత్రి

మునఁ బితరుల ఋణంబుదీరును. అందుఁ బితృరూపమున జనార్దనుఁడుండును. కాన నాతనిం గన్న నరుఁడు ఋణత్రయ విముక్తుండగును. గయాతీర్థమున రుద్రపద మందు రథమార్గమును గాలేశ్వర కేదారేశ్వరులఁ గాంచఁ బితృఋణంబుదీరును. వేదమయుండగు పితామహుంగన్న సర్వాఘరోగంబు లడఁగును. గదాధరుండగు మాధవుని కొలంగినఁ బునర్జననంబులేదు. మానాదిత్యుఁడగు కనకార్కునిం జూచిన మాత్రనఁ బితృణవిముక్తి కలుగును. బ్రహ్మనర్చింప బ్రహ్మలోకప్రాప్తి కలుగును. అందు బ్రాహ్మ ముహూర్తంబున లేచి సంధ్యావందన గాయత్రిజపంబులు సేయ సర్వవేదఫలంబును, సాయాహ్నంబున సరస్వతింగన్న సర్వదానఫలములు గలుగును. తన్నగస్థుఁడగు నీశుదర్శనమునఁ బితరులఋణంబుపోవును. ధర్మారణ్యంబున నీశ్వరుంగన్న సర్వఋణంబులు సమయును. గృధ్రేశుంగాంచిన నరుండు సర్వబంధముక్తుఁడగును. అందలి ధేనువనమున ధేనువుందిలకింప బ్రహ్మలోకము లభించును. ప్రభాస తీర్థంబునఁ బ్రభాసుని దర్శనమునఁ బరాంగతిఁ బొందనగు. కోటీశ్వరు నాలోకింప ఋణవిముక్తియు నశ్వమేధ ఫలప్రాప్తిఁ బొందఁదగును. స్వర్గద్వారేశ్వాలోకనమున భవబంధభయంబులు వాయు. గదాలోలుండగు రామేశ్వరుంగనిన స్వర్గమొందనవును. బ్రహ్మేశ్వరుఁదిలకింప బ్రహ్మలోకంబుకూడ బోవును. గయాముండపృష్ఠంబునంగల మహాచండీ దర్శనమునఁ గామక్రోధాదు లడంగును. ఫల్గ్వీశుని ఫల్గుచండిని గౌరిని విలోకింప సర్వమంగళములబ్బు. గోమక గోపతులఁ జూచినఁ బితృణంబు సమయు. ఫల్గుతీర్థమునఁ దానమాడి, గదాధరు, మార్కండేయేశ్వరు, సంగారేశు, సిద్ధేశ్వరు, గయాదిత్యు, గజంబును విలోకనమొనర్పఁ బితృణ విముక్తిసిద్ధించు. దీనివలనఁజాల పుణ్యప్రాప్తికలిగి యిరువదొక్కతరముల పితరులు పుణ్యలోకమున కరుగుదురు. పృథ్విం గల సర్వతీర్థాంభోనిధి సరస్సులన్నియు ఫల్గుతీర్థంబున నిలిచియుండు. భూమండలమున గయయు, గయలో గయాశిరంబును, గయాశిరంబున, ఫల్గుతీర్థంబును బ్రశస్తంబులు. తత్తీర్థము సురలకుఁ బ్రియంబగు వాసస్థానము. కనకనదికుత్తరదిశఁగల నాభితీర్థము, బ్రహ్మతీర్థము పుణ్యప్రదంబులు. అందుస్నానంబుచేసిన బ్రహ్మపదలాభంబును; కూపంబునఁ బిండంబువేయఁ బితృణముక్తియుఁ గలుగు. అక్షయవటవృక్షచ్ఛాయ శ్రాద్ధంబుగావింప బ్రహ్మలోకంబు కరతలామలకంబగు. హంసతీర్థస్నానమున సర్వపాప పరిహారంబగు కోటితీర్థ గయాలోల వైతరణీ, గోమకంబుల స్నానపిండదానంబులు గావింప నిరువదొక్కతరములవారు తరింతురు. బ్రహ్మతీర్థ, రామతీర్థాగ్ని,

సోమతీర్థ. రామహ్రదంబుఁగావించు జలకేళీశ్రాద్ధంబులవలనఁ బితృకులంబు బ్రహ్మస్థానముచేరు. మానసోత్తర ప్రదేశమునఁజేయు శ్రాద్ధంబు భవబంధముల సడలించు మానస దక్షిణతీర కృతశ్రాద్ధంబు పితరుల సత్యలోకంబుఁజేర్చు కూటంబున భీష్మతర్పణమొనరింపఁ బితృవర్గంబు తరించు. గృధ్రేశ్వరములోని శ్రాద్ధము బ్రహ్మప్రాప్తినిచ్చు. అందు ధేనువుఁజూచి తిలధేను దానంబునుచేయఁదరింపవచ్చును. ఐంద్రినదీతీర్థ. వాసవ, వైష్ణవ, మహానదీతీర్థంబులఁ జేయుశ్రాద్ధము పితరుల బ్రహ్మపదస్థులంజేయు గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ తీర్థంబుల స్నానసంధ్యాతర్పణశ్రాద్ధంబులు సేసిన నూటొక్కమంది పితృలు తరింతురు. పితృభక్తియుతుండగు మనుజుండు పవిత్రుఁడై సంకటక్షేత్రమున దేవపితృతర్పణములఁజేయ బ్రాహ్మణజననంబే కలుగుచుండును. కాకజంఘాక్షేత్రమునఁ దర్పణమొనరింపఁ బితరులతిప్రీతిఁజెందుదురు. ధర్మారణ్యమున మతంగవాపిఁజేయు పితృకార్యము పితౄణముక్తిహేతుభూతంబగు. రామతీర్థమునఁ బ్రభాసమున నరుండు స్నానమాడి శ్రాద్ధముసేయఁ బితృలు ముక్తులగుదురు. స్వపుష్టా తీర్థకృత పితృకార్యం బిరువదొక్కతరములవారిఁ దరింపజేయు. పంచక్రోశవ్యాప్త గయాతీర్థంబున నేచోటఁ బిండంబిడినను బ్రహ్మలోక ప్రాప్తి తప్పదు. నరుఁడు జనార్దను హస్తంబునఁ దనకుఁదానే పిండంబిడ మోక్షంబు లభించు నిస్సంశయంబు. దానఁబితరులుకూడ తరింతురు. గయాశీర్ష దక్షిణదిశను మహానదికిఁ బడమటిదిశనుగల చంపకావనమునఁ బాండుశిల కలదు. అందు శ్రాద్ధముసేయువాఁడు పుణ్యపురుషుండగు. వైతరణి కుత్తరమునఁ దృతీయ నామకజలాశయంబునఁ గ్రౌంచపదమునఁ జేయుశ్రాద్ధమవ్యయపదంబునిచ్చు. క్రౌంచపాదమున నుదగ్దిశ నిశ్చిరమను జలాశయమున్నది దానఁబిండంబిడ పుణ్యంబాడగూడు. గయాక్షేత్రమునఁ బండ్రెండేడులు వసింప నక్షయలోకంబు గలిగి వంశంబంతయు నుద్ధరింపఁబడును. శుక్లకృష్ణపక్షంబులందుండ నేడుతరములవారుద్ధరింపఁ బడుదురు. గయాముండపృష్ఠమును, నరవిందపర్వతమును దృతీయ క్రౌంచపాదముంగన్న నఘము లెల్లఁబాయు. మకరసంక్రాంతియందును సూర్యచంద్రోపరాగ పర్వకాలంబులందును గయలోఁబిండప్రదానముసేయఁగలుగు సుకృతము నిరుపమంబు. మాహేశ్వరీధారయందుఁ జేయుశ్రాద్ధంబున సర్వఋణంబులు నశియు. పుణ్యప్రదమగు విశాలనదికేగ నగ్నిష్టోమ ఫలంబును మానసపదంబున స్నానమొనర్ప వాజపేయ ఫలంబును గలుగఁగలదు. రవిపాదకృత పిండదానము పితరులనుద్ధరించు. గయకేగు పుత్రుంగని పితరులత్యుత్సాహ మందుదురు. అందుఁ

బిండంబిడి గోదానంబుసేయ నూరునొక్క వంశంబులు తరించు. అందు హవ్యకవ్య విధానంబున విప్రులఁదృప్తిసేసినను దేహత్యాగమైనను, వృషోత్సర్జనము చేసినను నగ్నిష్టోమ ఫలములభించు. మానవుఁడు గయలోఁ దనకుఁదానే నువ్వులులేక పిండంబువేసుకొనవలయు. వ్యాసగయయందుఁ బిండంబిడుట ముఖ్యంబు. గాయతీర్థస్నానము గోశతదాన ఫలంబును, మతంగవాపీస్నానంబున సహస్రగోదాన ఫలంబును, నిశ్చిరాసంగమస్నానమున బ్రహ్మలోకప్రాప్తియు, వసిష్ఠాశ్రమ తీర్థస్నానంబున వాజపేయఫలంబును, మహాకౌశికీస్నానమున నశ్వమేధఫలమును, గుమారధారకృత శ్రాద్ధంబున నశ్వమేధఫలమునుగలుగు. నరుఁడు సోమకుండమున మజ్జనమొనరించిన సోమలోకంబులభించు. సంవర్తవాపియందుఁబిండమిడ సుభగుఁడగు. ప్రేతకుండముననిడ పాపంబు నమసిపోవు. వైపుణ్యతీర్థములఁ బిండమిడఁ దత్ఫలంబులుతప్పవు। తద్దేవతాస్మరణంబు, వసిష్ఠేశ ప్రభృతిస్మరణంబు సర్వఋణంబుల సమయఁజేసి నరుఁని దరింపఁజేయుచుండును.

—o—

## గయా శ్రాద్ధ మహిమ.

శ్రీమహాగరుడపురాణం - పూర్వఖండం ప్రథమాంశం - గయామాహాత్మ్యం -
అధ్యాయం ౪.

బ్రహ్మోవాచ-

ఉద్యతస్తు గయాం గంతుం శ్రాద్ధం కృత్వావిధానతః। విధాయకార్పటీవేషం గ్రామస్యాపి ప్రదక్షిణం॥ ౧ ॥ తతో గ్రామాంతరంగత్వా శ్రాద్ధశేషస్యభోజనం। కృత్వాప్రదక్షిణంగచ్ఛే త్ప్రతిగ్రహ వివర్జితః॥ ౨ ॥ గృహాచ్చలితమాత్రస్య గయాయాం గమనంప్రతి। స్వర్గారోహణ సోపానం పితౄణాంతు పదేపదే॥ 3 ॥ ముండనం చోపవాసశ్చ సర్వతీర్థేష్వయంవిధిః। వర్జయిత్వా కురుక్షేత్రం విశాలాం విరజాంగయాం॥ ౪ ॥ దివాచసర్వదారాత్రౌ గయాయాం శ్రాద్ధకృద్భవేత్। వారాణస్యాం కృతంశ్రాద్ధం తీర్థేశోణనదే తథా॥ ౫ ॥ పునః పునమహానద్యాం శ్రాద్ధీ స్వర్గం పితౄన్నయేత్। ఉత్తరం మానసంగత్వా సిద్ధింప్రాప్నోత్యనుత్తమాం॥ ౬ ॥ తస్మిన్నివర్తయేచ్ఛ్రాద్ధం స్నానంచైవ నివర్తయేత్। కామాన్సలభతే దివ్యాన్మోక్షోపాయంచసర్వశః ॥ ౭ ॥ దక్షిణంమానసం గత్వామౌనీపిండాదికారయేత్।

ఋణత్రయాపాకరణం లభేద్దక్షిణ మానసే॥ ౮ ॥ సిద్ధానాం ప్రీతిజననైః పాపానాం
చ భయంకరైః। లేలిహానైర్మహాఘోరై రక్షితైః పన్నగోత్తమైః॥ ౯ ॥ నామ్నా
కనఖలం తీర్థం త్రిషులోకేషు విశ్రుతం। ఉదీచ్యాం ముండపృష్ఠస్య దేవర్షిగణసేవి
తం॥ ౧౦ ॥ యత్రస్నాత్వా దివంయాతి శ్రాద్ధందత్త మథాక్షయం। సూర్యంనత్వా
త్వాదంకుర్యాత్ కృతపిండాది సత్క్రియః॥ ౧౧ ॥ కవ్యవాహస్తథా సోమో యమ
శ్చైవార్యమాతథా। అగ్నిష్వాత్తా బర్హిషదః సోమపాః పితృదేవతాః॥ ౧౨ ॥ ఆగ
చ్ఛంతు మహాభాగా యుష్మాభీ రక్షితాస్త్విహ। మదీయాః పితరోయేచ కులేజా
తాః సనాభయః॥ ౧౩ ॥ తేషాంపిండ ప్రదానార్థ మాగతోఽస్మి గయామిమాం।
కృతపిండః ఫల్గుతీర్థే పశ్యేద్దేవం పితామహం॥ ౧౪ ॥ గదాధరం తతఃపశ్యేత్త్రిస్రా
ణామనృణోభవేత్। ఫల్గుతీర్థే నరఃస్నాత్వా దృష్ట్వాదేవం గదాధరం॥ ౧౫ ॥ ఆత్మా
నం తారయేత్సద్యో దశపూర్వాన్దశాపరాన్। ప్రథమేహ్నివిధిః ప్రోక్తో ద్వితీయదివ
సే వ్రజేత్॥ ౧౬ ॥ ధర్మారణ్యం మతంగస్యవాప్యాం పిండాదికృద్భవేత్। ధర్మా
రణ్యం సమాసాద్య వాజపేయఫలంలభేత్॥ ౧౭ ॥ రాజసూయాశ్వమేధాభ్యాం
ఫలం స్యాద్బ్రహ్మతీర్థకే। శ్రాద్ధం పిండోదకం కార్యం మధ్యేవై కూపయూప
యోః॥ ౧౮ ॥ కూపోదకేన తత్కార్యం పితౄణాందత్తమక్షయం। తృతీయేఽ
హ్ని బ్రహ్మసదో గత్వాస్నాత్వాథతర్పణం॥ ౧౯ ॥ కృత్వాశ్రాద్ధాదికం పిండం
మధ్యేవై యూపకూపయోః। గోప్రచార సమీపస్థా ఆబ్రహ్మబ్రహ్మకల్పితాః॥ ౨౦
తేషాంసేవన మాత్రేణ పితరోమోక్షగామినః। యూపం ప్రదక్షిణీకృత్వ వాజపేయ
ఫలంలభేత్॥ ౨౧ ॥ ఫల్గుతీర్థే చతుర్థేఽహ్నిస్నాత్వా దేవాదితర్పణం। కృత్వాశ్రా
ద్ధం గయాశీర్షే కుర్యాద్రుద్రపదాదిషు। ౨౨ ॥ పిండాన్దేహిముఖేవ్యాసే పంచాగ్నౌ
చ పదత్రయే। సూర్యేందు కార్తికేయేషు కృతంశ్రాద్ధం తథాక్షయం॥ ౨౩ ॥
శ్రాద్ధంతు నవదైవత్యం కుర్యాద్ద్వాదశదైవతం। అన్వష్టకాసువృద్ధౌచ గయాయాం
మృతవాసరే॥ ౨౪ ॥ అత్రమాతుః పృథక్ శ్రాద్ధమన్యత్ర పతినాసహ। స్నాత్వా
దశాశ్వమేధేతు దృష్ట్వాదేవం పితామహం॥ ౨౫ ॥ రుద్రపాదం నరః స్పృష్ట్వా న
చేహావర్తతే పునః। త్రిర్వృత్తపూర్ణాం పృథివీం దత్త్వాయత్ఫలమాప్నుయాత్॥ ౨౬ ॥
సతత్ఫలమవాప్నోతి కృత్వాశ్రాద్ధం గయాశిరే। శమీపత్రప్రమాణేన పిండం
దద్యాద్గయాశిరే॥ ౨౭ ॥ పితరోయాంతి దేవత్వం నాత్రకార్యా విచారణా। ముండ
పృష్ఠే పదంన్యస్తం మహాదేవేన ధీమతా॥ ౨౮ ॥ అల్పేన తపసాత్ర మహాపుణ్య
మవాప్నుయాత్। గయాశీర్షేతు యః పిండాన్నామ్నా యేషాంతు నిర్వపేత్॥ ౨౯ ॥

నరకస్థా దివంయాంతి స్వర్గస్థా మోక్షమాప్నుయుః। పంచమేహ్ని గదాలోలే స్నా
త్వావటతలే తతః॥ ౩౦ ॥ పిండాన్దద్యాత్పితౄణాం చ సకలం తారయేత్కులం।
వటమూలం సమాసాద్య శాకేనోష్ణోదకేనవా॥ ౩౧ ॥ ఏకస్మిన్ భోజితే విప్రేకోటి
ర్భవతి భోజితా। కృతే శ్రాద్ధేఽక్షయవటే దృష్ట్వాచ ప్రపితామహం॥ ౩౨॥ అక్ష
యాల్లభతే లోకాన్ కులానాముద్ధరేచ్ఛతం। ఏష్టవ్యా బహవః పుత్రా యద్యే
కోఽపి గయాం వ్రజేత్॥ ౩౩॥ యజేతవాశ్వమేధేన నీలంవా వృషముత్సృజేత్।
ప్రేతః కశ్చిత్సముద్దిశ్య వణిజం కించి దబ్రవీత్॥ ౩౪ ॥ మమనామ్నా గయాశీర్షే
పిండనిర్వాపణం కురు। ప్రేతభావా ద్విముక్తః స్యాంస్వర్గదో దాతురేవచ॥ ౩౫॥
శ్రుత్వావణిగ్గయాశీర్షే ప్రేత రాజాయ పిండకం। ప్రదదావనుజైః సార్థం స్వపితృ
భ్యస్తతోదదౌ॥ ౩౬ ॥ సర్వేముక్తా విశాలోఽపి సపుత్రోఽభూచ్చపిండదః। విశా
లాయాం విశాలోఽభూద్రాజ ప్రష్టోఽబ్రవీద్ద్విజాన్॥ ౩౭॥ కథం పుత్రాదయః
స్యుర్మేవిప్రాః ప్రోచుర్విశాలకం। గయాయాం పిండదానేన తవసర్వం భవిష్యతి॥ ౩౮॥
విశాలోఽథ గయాశీర్షే పిండదోఽభూచ్చపుత్రవాన్। దృష్ట్వాకాశే సితం రక్తం కృష్ణం
పురుషమబ్రవీత్॥ ౩౯॥ కేయూయం తేషు చైవైకః సితః ప్రాహ విశాలకం।
అహంసితస్తే జనక ఇంద్రలోకం గతః శుభం॥ ౪౦॥ మమపుత్రః పితారక్తో బ్రహ్మ
హాపాపకృత్పరః। అయం పితామహః కృష్ణ ఋషయోఽనేన ఘాతితాః॥ ౪౧ ॥ అవీ
చిం నరకంప్రాప్తౌముక్తౌజాతౌ చ పిండద। ముక్తీకృతాస్తతః సర్వేవ్రజామః స్వర్గ
ముత్తమం॥ ౪౨॥ కృతకృత్యో విశాలోఽపి రాజ్యంకృత్వా దివంయయౌ। యేఽ
స్మత్కులే తు పితరోలుప్త పిండోదకక్రియాః॥ ౪౩॥ యేచాప్యకృత చూడాస్తు
యే చ గర్భాద్వినిస్సృతాః। యేషాం దాహాదిక్రియాచ యేఽగ్నిదగ్ధాస్తథా
పరే॥ ౪౪ ॥ భూమౌదత్తేన తృప్యంతు తృప్తాయాంతు పరాంగతిం। పితాపితా
మహశ్చైవ తథైవప్రపితామహః॥ ౪౫॥ మాతా పితా మహీచైవ తథైవ ప్రపితా
మహీ। తథా మాతామహశ్చైవ ప్రమాతా మహఏవచ॥ ౪౬॥ వృద్ధప్రమా
తామహశ్చ తథామాతామహీపరం। ప్రమాతామహీతథా వృద్ధప్రమాతా మహీ
తివై॥ ౪౭ ॥ అన్యేషాంచైవపిండోఽయ మక్షయ్యముపతిష్ఠతాం॥ ౪౮ ॥

ఇతిశ్రీగారుడే మహాపురాణే పూర్వఖండే ప్రథమాంశాఖ్యే ఆచారకాండే
గయామాహాత్మ్యం నామ చతురశీతి తమోఽధ్యాయః

గయాక్షేత్రమునకేగఁదలఁచినవాఁడు స్వగృహమునుండి విధివిధానమున

నాందీశ్రాద్ధమొనర్చి, కార్పటీవేషధారియై స్వగ్రామప్రదక్షిణ మొనరించి బయలు దేరి శ్రాద్ధశేషభోజనమును గ్రామాంతరమునఁ జేయవలయును. అటనుండి గయ కేగవలయును. త్రోవలో దానాదులఁగొనరాదు. గయ కేగ గృహమునుండి వెడలినమాత్రాన పితృలు ప్రతిపదమందును స్వర్గసోపానముఁ జేరుచుందురు. ఎల్ల పుణ్యక్షేత్రములఁ జేరఁగానే నాటిరాత్రి యుపవసించి మరునటిదినమున క్షౌరముఁ జేసుకొనుటవిధి. కురుక్షేత్రము విశాల అనగా ఉజ్జయినీ, విరజా, గయాక్షేత్ర ములయందుమాత్రము శ్రాద్ధమే మొదటిదగుటచే శ్రాద్ధమునుజేయక ముండనా దులను చేయరాదుగావున గయ కేగి యందుశ్రాద్ధమొనర్పవలయును. వారాణసి యందును. శోణనదీతీర్థంబునను, మహానదీతీర్థంబులందును, శ్రాద్ధమొనర్పఁ బితృ వులు స్వర్గమున కేగుదురు. మానస సరోవరోత్తరభాగమున స్నానంబు సేసి శ్రాద్ధం బొనర్పఁ గోరికలీడేరి మోక్షంబు లభించు. దానిదక్షిణతీరంబున శ్రాద్ధముఁజేసిన బుణత్రయంబుతీరును. సిద్ధులకుఁ బ్రీతిదమును, పాపులకు భయంకరము పన్నగ రక్షితమునగు కనఖలతీర్థము ముల్లోకప్రసిద్ధము. గయాశీర్షముండ పృష్ఠోత్తరభాగ మునందు సర్వదేవర్షి గణంబులుందురు. అందుశ్రాద్ధమాచరించిన నక్షయంబగు. సూర్యునారాధించి పిండప్రదానం బొనరింపవలయును. కవ్యవాహన, సోమాంగి రోగ్నిష్వాత్త, బర్హిషద యమనామక పితృదేవతలారా! మీచేరక్షితులగు మత్కు లజపితరులు నిర్భయులైయున్నవారలు. వారికిఁ బిండప్రదానమొనరింప నీగయకు వచ్చితిని. అనిఫల్గుతీర్థమునఁ బితామహునిసన్నిధిఁ బిండప్రదాన మొనర్పవలయును. నరుఁడు ఫల్గునీతీర్థమున స్నానముచేసి గదాధరుఁగని తన్నుఁదనకు ముందు వెనుకలఁ బదితరములవారినిఁ దరింపజేయఁ బ్రార్థింపవలయును.

తీర్థప్రదేశముఁజేరిన తొలిదివసంబు నియమయుక్తంబుగఁ గడపి ద్వితీయదివ సమున ధర్మారణ్యమున కేగుటచే వాజపేయఫలంబును, బ్రహ్మతీర్థగమనంబున రాజ సూయాశ్వమేధ ఫలంబులను, లభించును. వీని కేగుత్రోవను కూపయూపంబుల శ్రాద్ధపిండోదకములఁ జేయవలయు. కూపోదకంబులఁ జేయుటచేఁ బితరుల కక్షయ పుణ్యలోకంబుగలుగు.

మూడవదివసంబు బ్రహ్మసదస్సున కేగి మజ్జనమొనరించి శ్రాద్ధపిండప్రదాన తర్పణంబులఁ జేయవలయును. ఆతీర్థసేవవలనఁ బితరులు మోక్షమున కేగుదురు. అందుఁబ్రదక్షిణచేయుటవలన వాజపేయఫలంబు లభించు.

నాలవదినంబున ఫల్గుతీర్థమున స్నానముచేసి పితృతర్పణ మొనరింపవలయు.

గయాశీర్షమున రుద్రపదాదులందు శ్రాద్ధమొనర్చి వ్యాసముఖమునఁ బిండమొసఁగి పదత్రయమునఁ బంచాగ్నులందు, సూర్యేందు కార్తికేయక్షేత్రముల శ్రాద్ధము సేయ నక్షయమగును. పితృమృత దివసమున గయయందు నవదైవత్యముగను, ద్వాదశదైవత్యముగను శ్రాద్ధంబుఁ జేయవలయు. అన్వష్టకాదులు వృద్ధిశ్రాద్ధము చేయుట ప్రశస్తము. ప్రత్యేకించి మాతృశ్రాద్ధము పిత్రాదివర్గముతోను నితర స్త్రీలకుఁ బతియుతముగ శ్రాద్ధముఁ జేయవలయును. స్నానముచేసి పితామహుని దర్శించినను, రుద్రపాదము స్పృశించినను బునర్జనంబు లేదు. శమీపత్రప్రమాణముతో గయాశిరమునఁ బిండప్రదాన మొనర్పఁ బితరులు దేవత్వమందుదురు. ఇంద నుమానమే లేదు. గయాశీర్షమున నెవరిపేరుచ్చరింపఁబడి పిండములు వేయఁబడునో వారు నరకమున నున్నను మోక్షపద మందుదురు.

ఐదవదినమున శుచిస్నానముఁ జేసి వటతటమునఁ బిండమిడఁ బితరులందరుఁ దరింతురు. ఆవటంబుకడ శాకపాకాదులతో నొక్క బ్రాహ్మణుకు భోజనంబిడ కోటిబ్రాహ్మణ సంతర్పణ సమంబగు. వటతటమున శ్రాద్ధముఁగావించి పితామహుఁ గన్న నక్షయంబగు. కులమందొకండు గయ కేగిన కులముద్ధరింపఁబడును. ఒక ప్రేతకార్పటవేషధారియగు వణిక్కును దనపేర గయాశీర్షంబునఁ బిండంబునిడఁ గోరెను. వణిజుండు తనపితరులకు నాప్రేతకుఁ బిండంబిడ నెల్లరు స్వర్గస్థులైరి. విశాలపురియందలి విశాలనామక రాజకుమారుండై పుట్టిన నావణిజుడు ప్రేతతోఁ దనపితృశ్రాద్ధమొనర్చిన దోషముచే పుత్రహీనుండై బ్రాహ్మణులతో పుత్రులెట్లు కల్గుదురనినవారు పితరులకుఁ బిండంబు గయాశీర్షంబున నిచ్చిన గల్గుదురనిరి, అతఁ డట్లొనర్చి పుత్రవంతుఁడయ్యెను. విశాలకుండొకసమున సితరక్తనీలవర్ణులగు పురుషులంగాంచి వారేల యట్లుండిరో తెలుపఁగోరెను. అంతసితవర్ణుండు "నేనునీజనకుఁడను స్వర్గమున నున్నాఁడ. ఈరక్తవర్ణుండు నాజనకుఁడు. బ్రహ్మహానిగావించె. కృష్ణవర్ణుఁడగు నీతండు నాపితామహుఁడు; ఋషిఘాతకుఁడు. గయాశీర్షమునఁ బిండమువీరికిడ, మేమెల్లరము స్వర్గమున నుందుము" అనెను. అంతవిశాలకుండట్లొనర్ప వారు త్రిదివంబునందిరి. లుప్తపిండోదక క్రియులు, చూడాకర్మమునకుమునుపే గతించినవారలు, గర్భమున గతించినవారు, అనగ్నిసంస్కారులు, అగ్నిసంస్కారులయ్యు నుత్తరక్రియావిహీనులు, పితృ పితామహ ప్రపితామహులు, మాతాపితామహీప్రపితామహులు, మాతామహ, మాతుఃపితామహ, మాతుః ప్రపితామహులు, మాతామహీ, మాతుఃపితామహీ మాతుః ప్రపితామహులు, వృద్ధ

ప్రమాతామహులు, తదితరులు గయాశీర్షమునఁ బిండప్రదానంబు సేయుటంజేసి మోక్షపదవిం గందురు.

—౦—

## ధర్మ పిండములు.

శ్రీ మహాగరుడపురాణం పూర్వఖండం అధ్యాయం ౮౫.

బ్రహ్మోవాచ-స్నాత్వా ప్రేత శిలాదౌతు వరుణాస్థామృతేనచ। పిండందద్యాత్తత్రో మంత్రైరావాహ్యాచ పితౄన్ పరాన్॥ ౧ ॥ అస్మత్కులే మృతాయేచ గతిర్యేషాంన విద్యతే। ఆవాహయిష్యే తాన్ సర్వాన్ దర్భపృష్ఠే తిలోదకైః॥ ౨ ॥ పితృవంశే మృతాయేచ మాతృవంశేచ యేమృతాః। తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం॥ ౩ ॥ మాతామహకులే యేచ గతిర్యేషాం నవిద్యతే। తేషాముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహం॥ ౪ ॥ అజాతదంతా యేకేచిద్యేచ గర్భప్రపీడితాః। తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం॥ ౫ ॥ బంధువర్గాశ్చయే కేచిన్నామగోత్ర వివర్జితాః। స్వగోత్రే పరగోత్రే వా గతిర్యేషాం నవిద్యతే। తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం॥ ౬॥ ఉద్బంధన మృతాయేచ విషశస్త్రహతాశ్చయే। ఆత్మోపఘాతినో యేచ తేభ్యః పిండం దదామ్యహం॥ ౭ ॥ అగ్నిదాహేమృతాయేచ సింహవ్యాఘ్రహతాశ్చయే। దంష్ట్రిభిః శృంగిభిర్వాపి తేషాం పిండం దదామ్యహం॥ ౮ ॥ అగ్నిదగ్ధాశ్చయే కేచిన్నాగ్నిదగ్ధాస్తథాపరే। విద్యుచ్చోరహతా యేచ తేభ్యః పిండం దదామ్యహం॥ ౯ ॥ రౌరవే చాంధతామిస్రే కాలసూత్రే చ యేగతాః॥ తేషాముద్ధరణార్థాయ ఇమం పిండందదామ్యహం॥ ౧౦ ॥ అసిపత్రవనే ఘోరే కుంభీపాకే చ యేగతాః। తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం॥ ౧౧ ॥ అన్యేషాం యాతనా స్థానాం ప్రేతలోక నివాసినాం। తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం॥ ౧౨ ॥ పశుయోనిం గతాయేచ పక్షికీట సరీసృపాః। అథవా వృక్షయోనిస్థాస్తేభ్యః పిండందదామ్యహం॥ ౧౩। అసంఖ్యయాతనా సంస్థాయేనీతా యమశాసనైః। తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం॥ ౧౪ ॥ జాత్యంతర సహస్రేషు భ్రమంతి స్వేన కర్మణా। మానుష్యం దుర్లభం యేషాం తేభ్యః పిండం దదామ్యహం॥ ౧౫ ॥

యే బాంధవాఽబాంధవా వాయేఽన్య జన్మని బాంధవాః। తేసర్వే తృప్తిమా యాంతు పిండదానేన సర్వదా॥ ౧౬ ॥ యేకేచిత్ప్రేతరూపేణ వర్తంతే పితరోమమ। తేసర్వే తృప్తిమాయాంతు పిండదానేన సర్వదా। ౧౭ । యేమే పితృకులే జాతాః కులే మాతుస్తథైవచః గురుశ్వశురబంధూనాం యే చాన్యే బాంధవామృతాః॥ ౧౮ ॥ యేమే కులేలుప్తపిండాః పుత్రదారవివర్జితాః। క్రియాలోపహతాయేచ జాత్యంధాః పంగవస్తథా॥ ౧౯ । విరూపా ఆమగర్భాశ్చ జ్ఞాతాజ్ఞాతాః కులేమమ తేషాంపిండమయా దత్తోఽప్యక్షయ్య ముపతిష్ఠతాం॥ ౨౦॥ సాక్షిణః సంతు మే దేవా బ్రహ్మేశానా దయస్తథా। మయాగయాం సమాసాద్య పితౄణాం నిష్కృతిఃకృతా॥ ౨౧ ॥ ఆగతోఽహం గయాం దేవ! పితృకార్యే గదాధర। తన్మేసాక్షీ భవత్వద్య అనృణోఽహ మృణత్రయాత్॥ ౨౨ ॥ మహానదీ బ్రహ్మసరో ఽక్షయో వటః ప్రభాస ముద్యంతమహో! గయాశిరః సర్వతీ ధర్మకధేను పృష్ఠా ఏతే కురుక్షేత్రగతా గయాయాం॥ ౨3 ॥

ఇతి శ్రీ గారుడే మహాపురాణే పూర్వఖండే ప్రథమాంశాఖ్యే ఆచారకాండే గయామాహాత్మ్యం నామ పంచాశీతి తమోఽధ్యాయః

గయాది శ్రాద్ధకర్మలయందును మహాలయ శ్రాద్ధమందును గడపట మృతులై యజ్ఞాతులై గతులులేని వారలకుఁగూడ పిండదానము చేయుటచేత ననేక సంవత్సరములు ప్రేతత్వవిముక్తిఁజెందని వారలుకూడ సద్గతి నందుదురు. గయాశ్రాద్ధ మన్నిటికన్న చాలయుత్తమము.

దనగోత్రమునఁ దనమాతామహగోత్రమున గతులులేనివారలకును, గర్భములోనే మృతులైనవారికిని, దంతములు మొలవకముందుగనే గతించినవారికిని, బంధువులలో నామగోత్రవిసర్జన మొనర్చినవారికిని, బంధనమునను, విషశస్త్రములవలనను, గతించినవారలకును, ఆత్మహత్యాపరులకును, నగ్నిదగ్ధులై గతించినవారలకును, సింహవ్యాఘ్రాది మృగదంష్ట్రములచేతను, పశుశృంగములచేతను హతులైనవారికిని మృతులై యగ్నిలో దహింపఁబడి కర్మలులేనివారికిని, గతించినవెనుక నగ్నిదహింపఁబడనివారికినిఁ బిడుగువలన గతించినవారికిని, రౌరవాది నరకములఁ బడినవారికిని, పశుపక్షి మృగకీటక సరీసృపాది యోనులందును, వృక్షాది యోనులందును జన్మించినవారికిని, యమశాసనంబున మితిలేని యాతన ననుభవించువారికినిఁ దమపూర్వకృత దుష్కర్మలచే జాత్యంతరమున జనించినవారికిని, మానుషజన్మమును మరల బొందఁజాలనివారలకును ఈజన్మమునఁ బూర్వజన్మముల సంబంధముగల బాంధవులకును,

ప్రేతత్వముఁబొందిన తనగోత్రజులకును, దనగోత్రమునందును, మాతృవంశమునందును గురువంశమునందును, శ్వశురవంశమునందును, బంధువర్గగోత్రములందును గతించి పుత్రదారాదులు లేక కర్మలు లేకున్నవారలకును జాత్యంధులకును, గుంటివారలకును విరూపులకును, వంధ్యులకును, గోత్రమునఁ దెలిసియుఁ దెలియనివారలకును, గురుక్షేత్రమున సర్వతీర్థాత్మక ధేనుపృష్ఠమున బ్రహ్మేశానుల సాన్నిధ్యమున, నక్షయ వటవృక్షచ్ఛాయ యందుఁ బంచక్రోశ గయాశీర్షమున ఫల్గునీమహానదియందును, బ్రహ్మసరస్సునందును, బ్రభాసతీర్థమందును, బిండప్రదానముపై నెవరెవరికిఁ గ్రమముగఁ జెప్పఁబడిన మంత్రశ్లోకములచు జెప్పుచుఁ దానుగయాక్షేత్రమున గదాధరాదిక్షేత్ర దేవతాసాక్షిభూతముగఁ దనసర్వపితరుల ఋణత్రయ విమోచనముకై పిండప్రదానముఁజేయవలయును. దానివలన పైఁ బేర్కొనఁబడిన వారలు తక్షణమే సద్గతినంది సంతసించి కర్తనాశీర్వదింతురు. ఈలాగున బంధవిముక్తిఁ జేయుటకై తనజన్మములో గయయందు శ్రాద్ధముచేయుట ప్రధానానుష్ఠేయకార్యము. తుదకు వంశజులుగాని మఱియేయితరులుగాని తనసంతతి తరములలో నెవరైన నొక్కరు మాత్రమైనవెళ్లి గయయందుఁ గ్రమముగ నన్ని శ్రాద్ధములైనను తుదకుఁ గొన్నిముఖ్యములైనవి మాత్రముగానిఁ జేసిన తనవారల యొక్కయు నితరులయొక్కయు ఋణత్రయములు దీరును. గానవారు ధన్యులగుదురు. ఇంతకంటె నుత్తమమగు ఋణత్రయ విమోచనమార్గము లేదు. గయా శ్రాద్ధ మాహాత్మ్యము వర్ణనాతీతము. సర్వోత్కృష్ట మహాఫలదము. జ్ఞానులు వేదాంతులుసహిత మీవిధముగఁ బితృవంశ ఋణత్రయ విమోచనమార్గముఁగఁ జేయవలెఁగాని వేరుమార్గము లేదు.

—o—

## త్రిశంకసృష్టి వివరము.

మనసృష్టి దక్షిణధ్రువము నాశ్రయించి దానిమూలమునుండి యధోముఖముగా దక్షిణములోనున్న అంత్యక్షేత్రమగు అంత్యభూతపృథివియందు అధోముఖయోనినై అధోముఖములో ఊర్ధ్వములోనునఁ తేజము నధోముఖనాడిగా ననుభవించవలెనను కోరికతో త్రిప్పుచుఁద్రిశంకునికొఱకై విశ్వామిత్రకృతసృష్టిస్వరూపము

తోఁగానసగును. ఈసృష్టిక్రమము ఉత్తరములో ఊర్ధ్వలోకములుగలిగి క్రిందికి దిగుచు ననేక ధ్రువసూర్యులనుదాటి వచ్చినది. ఇది మొదట శబ్దస్పర్శరూపరస గంధసూక్ష్మ తత్వములలో శబ్దాదిగాఁ బ్రారంభమై మరల స్థూలాంగములతో స్థూల రూపమై "అధోగచ్ఛంతి తామసాః"యను ప్రమాణానుసారము కేవల కులధర్మముకు బదులు మలాతిశయపూరితమై సర్వమును మలరూపము నేచేయుచున్నదాయెను. అధోముఖనాడిద్వారా దిగినతేజ మగ్నిరూపమగుటచే బుభుత్సుత్వముకు బదులు బుభుక్షుత్వమతిశయించి నిరంతర తత్స్వరూపావస్థతోఁ గాలమును గడుపుచున్నది. ఇదే యధోముఖ పతనహేతుమూల చండాలత్వము ఈరహస్యమునే వేదపురాణాదులందు త్రిశంకచరిత్రముగ గురుశాప కారణమున చండాలత్వ ప్రాప్తియు నధోముఖముగ స్వర్గపతనము సూచించుచున్నది. ఉత్తరమే ఊర్ధ్వము. దక్షిణమే అధోముఖము. ఇదిపటవాలు చలనముతో గతితోఁగాలముతో నగుచున్నది. ఇదే భూతాంశము. స్థూలము. ఇదేమర్త్యలోకము. దీనికిఁ గార్యమే త్రిశంకు స్వర్గ నిర్మాణముచరిత్రద్వారా యిదిగలుగుచున్నది. దీనిని పూర్ణపతనము జేపుసకుగాకుండ నివారించినవాఁడే విశ్వామిత్రుఁడు. దీనికిఁబైనున్నవాఁడే వసిష్ఠుఁడు. విశ్వామిత్రుఁడు వసిష్ఠుఁడు కావలెనన్నచో బ్రహ్మతపస్సుఁ జేయవలెను. క్షాత్రమే విశ్వామిత్ర తపము. క్షాత్రముతోఁ బతనమును నిగ్రహించి వసిష్ఠుతో స్పర్ధచేసి బ్రహ్మవిద్యను సంపాదించి బ్రహ్మమును నిలిపెను. తానుగూడ బ్రహ్మత్వమును పొందెను. ఇవే "నర, ఋషి, దేవ ద్రావిణ, విష్ణు రుద్రాద్యుదీరితం, ఉత్తరోత్తరశ్రేష్ఠత్వాత్పూర్వ పూర్వ ప్రబాధరమ్" అను ప్రమాణము ననుసరించును. కర్మజ్యేష్ఠుఁడై సంసారనివృత్తిని బొందవలెను. కనిష్ఠమాదిగఁ గ్రమముగ జ్యేష్ఠమగు అంగుష్ఠమువరకు కర్మజ్యేష్ఠత్వమును సంపాదించినపిమ్మట, జన్మమే ఐదవలోకమో లేక మరణమే ఐదవలోకమో యను విషయమును (వేదాంతములందు చెప్పఁబడిన) గ్రమసృష్ట్యక్రమసృష్టుల తత్త్వవిమర్శతోఁ బంచపదక్రమముల బాధితములను విషయము దెలిసి నిజమగు రుద్రపదము (మరణము) ప్రాప్తించిన వెనుక సాధకుఁడీ రహస్యమును దెలియగలఁడు. ఇదే "నారుద్రః క్రమపాతకః" యని యందురు. దీనిని ఊర్ధ్వలోకాదుల విశేష వివరమున నింకాలో నుదహరించిన దానినిఁ జూడ వచ్చును. క్రిందినుండి దేహేంద్రియాహంభావమరణమే జీవన్ముక్తి అను పేరుతో సృష్ట్యాది కృత్యపంచకములో ఐదవదగు దైవానుగ్రహమై ప్రకాశించి స్వరూప తత్త్వము తెలియగలఁడు. అందుచేత ఏనాటికైనను మరణమే అంత్యము. ఇదియే

రద్రస్వరూపమని మృత్యుంజయత్వమనియుఁ జెప్పఁబడును.

చండాలత్వమనిన నరజన్మమే. ఇది అయిదవవర్ణము, కనిష్ఠవర్ణము. ఇది గురుదేవశాపపాపాదులకు ఫలరూపమై పాపకర్మలచేతను బతనజన్మము. అనఁగాఁ దలక్రిందై దక్షిణదిశాంతములో (విరాట్ఛరీరమునఁగాని జీవశరీరమునఁగాని ఊర్ధ్వరేతస్క-ధర్మమునకు వ్యతిరేకముగా) అధోరేతోగామినిగ అధోముఖముగఁ (తలక్రిందుగా) బడుటే త్రిశంకుస్వర్గసృష్టియని అర్థము. ఆస్థానమే త్రిశంకుస్థానము. త్రిశంకాశ్రయక్షేత్రమే. భూతములలో నధోముఖముతో అంత్యభూతభూమియందైన పార్థివాన్నమయశరీరయోని. దీనిస్థానమే దక్షిణదిశ. ఇదిమలాదుల కాశ్రయభూమి. మలాదులే చండాలస్వరూపము. పృథివియే భూతకనిష్ఠాంశము. కనిష్ఠశబ్దముగూడ నీయర్థమునే తెలుపును. వర్ణభేదములు, చండాలత్వము, నరకాదులు, కేవల మలాదులీలోకముననేయున్నవి త్రిశంకునిచేతనే నీలోకాదులు గలిగినవి. అందుచేత మనము త్రిశంకుసృష్టితో విశ్వామిత్రానుగ్రహమున గలిగిన వారలమని తెలియవలెను. ఇదేసృష్టికి ప్రతిసృష్టియని యందురు. ఇంద్రియస్థానము పితృలోకస్థానము, ఇంద్రియపతనమే పితృలోకస్థానభ్రంశము. మనము మనలోకము త్రిశంకుసృష్టికిని దక్షిణధ్రువమునకుఁజేరియున్నట్లు తెలియవలెను. అందుచేత అధోముఖత్వము, చండాలత్వము. త్రిశంకుస్వర్గమును బోగొట్టుకొనుప్రయత్నము జేసుకొని పైక్రమమునుబొందవలెను. అందుచేతనే మంత్రానుష్ఠాన న్యాసక్రియలందు ఉపాసనాదులుగాఁగల యోగములతో నీసర్వమును దాటవచ్చును. అంగన్యాసములతో మొదటివ్యష్ట్యాత్మకముగను కరాంగుళీయన్యాసముగను మరల సమష్ట్యాత్మకదేహన్యాసముగ మనయందే చూపి తద్ద్వారా నిబంధముక్తియగు మార్గమును మంత్రయోగమందుఁగూడజూపిరి. ఈన్యాసమునందు ప్రణవమాదిగ నమోంతముతో వ్యాహృతులుగను, న్యాసములుగను, ఉపాసనలుగనుఁబ్రతిమంత్రానుష్ఠానమందు ముఖ్యముగ విధివిహితాచార సాంప్రదాయానుసారము వైదికములుగాఁ ద్రిచతుఃపంచ షట్కాంతము పాత్రమగు ఉపాసనాక్రమము "పృథివ్యంతరిక్షం ద్యౌర్దిశోవాంతరదిశాః" అని తైత్తిరీయశిక్షావల్లిలో అధిభూతాధ్యాత్మ భేదముతోఁ గూడఁ జెప్పఁబడుచున్నది. దీనినే తంత్రాగమాదులయందుఁగూడ నవనాథ సంప్రదాయముగాఁ జూపిరి. ఇది కనిష్ఠాది మధ్యమాంగుళీయమువఱకు హుం, ఫట్, స్వాహాదులతో ఁద్యాగముగను, కర్మాంగలోకత్రయములకును, కృతకములుగను, త్యాగములుగను దరువాత లోకత్రయాదులగు జనతపస్సత్యలోకాదులను బొందఁ

దగినవిగను. జరాంతముతో సర్వాంతముగను మరణమే లేని అమృతత్వముగను నుండును. కడపటి వాటిని బ్రహ్మవిష్ణు రుద్రత్రయాత్మకాది విద్యాదైవతములుగఁ ద్రివృత్కరణముతో ముగించిరి. కాబట్టి మనము త్రిశంకుసృష్టిలోఁ దుదకు పితృలోకమునుగూడ బొందనట్టివారమైతిమి. పితృలోకము మనకుఁ బైనున్నలోకము. తదుపరిలోనే యితరలోకాదులు. అందుచేతనే మనసృష్టికిఁ గారణలోకమగు పితృలోకము క్షేత్రోపాసనాక్రమములోను బితరులు క్షేత్రజ్ఞోపాసనలోను ముఖ్యములైరి. త్రిశంకుసృష్టితోనే మనకు నరకలోకసంబంధముకూడనున్నదని తెలియవలెను. ఇవిమనకు సమీపములుగఁగూడ మనదిశయందేయున్నవి. నరకములు మనకు నిత్యస్వాభావికములుగ నంటియున్నవి. పితృలోక ఋణవిముక్తిద్వారముగాఁదదుపరి లోకాదులను బొందువరకు మనకివి తప్పనివేయగును. ఇ దేధూమాది మార్గము పునరావృత్తిమార్గము. పితృకర్మలు మనకు నిరంతరము తప్పవు. కాబట్టి పితృఋణమును ముందుదీర్చి దేవఋషుఋణములనుదీర్పవలెను. ఈవిషయాదులను దెలిసియే మనమహర్షులు ఋణత్రయవిమోచనకర్మలుగా నన్నిటిని సంపుటీకరణముగ బ్రహ్మయజ్ఞముచేయ నియమించిరి. తదాచరణతో మనము కృతార్థులమై ధన్యులగుచున్నాము. మనమెంతటివారలమో మనస్థితియెంతటిదో యాలోచించి యేమిచేయవలెనో తెలియవలెను. మనముత్రిశంకుసృష్టికిఁజెందిన మర్త్యులమే (మరణముకలవారమే)కాని అమృతజన్మముకలవారముకాము. మనకూర్ధ్వలోకమగు జనలోకమందున్నవారలే అట్టిఅమృతజన్ములని మనము తెలుసుకొని తుదకేమొదటిక్లాసుసర్టిఫికేటునైనను బొందినయెడల వైదిక విశ్వవిద్యాలయములోఁ దరువాతశాస్త్రవిద్యాపీఠమున కర్హులమగుదుమేమో. లేనియడల విశ్వవిద్యకుఁగూడ మనమే నాశకులమై ఇప్పుడు మనకున్నస్థితికంటెకూడ అథఃపతితులమగుదుమేమో అను భీతితో ఇంతదూరమువ్రాసినందుకు క్షంతవ్యుఁడనని విజ్ఞాపించుకొనుచున్నాను.

—o—

## రాహుకేతు మండలములు.

కేతు రథ ప్రమాణము. శ్రీవిష్ణు అంశం ౨ అధ్యా. ౨౨.

తథా కేతూరథస్యాశ్వా అష్టౌ వాతరంహసః। పలాలధూమ్ర వర్ణాభా లాక్షారసనిభారుణాః ॥ ౨౩ ॥ సర్వేధ్రువే మహాభాగ ప్రబద్ధావాయురశ్మిభిః॥

తైల యంత్రనిభం చక్రం భ్రమంతో భ్రామయంతి వై॥ తదాభ్రమంతి జ్యోతీంషి వాత విద్ధాని సర్వశః॥ ౨౭ ॥

శ్రీ వాయుపురాణం అధ్యా. ౫౨ పుట ౭౯.

(తథా)

అథకేతు రథస్యాశ్వా అష్టాష్టౌ వాతరంహసః। పలాల ధూమ సంకాశాః శబలా రాసభారుణాః॥ ౮౨ ॥ శ్రీదేవీభాగవతములో కేతువిషయములు లేదు.

రాహుమండలమున కెదుట కేతుమండల ముండును. అతని రథాశ్వము లెని మిది. అయ్యవి. రక్తలాక్షారసవర్ణముతో నలరుచుండును.

శ్రీ దేవీభాగవతములో అష్టమస్కంధం అధ్యా ౧౮

—♦ శ్రీ నారాయణ ఉవాచ. ♦—

అధస్తాత్సవితుః ప్రోక్తమయుతం రాహుమండలం। నక్షత్రవచ్చరతిచ సైంహికేయోఽతదర్హణః॥ ౧ ॥ సూర్యాచంద్రమసో రేవంమర్దన స్సింహికా సుతః। అమరత్వంచ ఖేటత్వం లేభేయో విష్ణ్వనుగ్రహాత్॥ ౨ ॥ యదధస్తరణేర్బింబం తపతో యోజనాయుతమ్। తచ్ఛాదకోఽసురోజ్ఞేయోఽప్యర్క సాహస్ర విస్తరం॥ 3 ॥ త్రయోదశ సహస్రాతు సోమస్యాచ్ఛాదకో గ్రహః। యఃపర్వ సమయే వైరానుబంధీచ్ఛాదకోఽభవత్॥ ౪ ॥ సూర్యాచంద్రమసోర్హ్యా రాద్భవే చ్ఛాదన కారకః। తన్నిశమ్యోభయతాప్రపి విష్ణునా ప్రేషితం స్వకం॥ ౫ ॥ చక్రం సుదర్శనం నామ జ్వాలా మాలాతి భీషణం। తత్తేజసా దుస్సహేన సమంతాత్పరి వారితం॥ ౬ ॥ ముహూర్తోద్విజమానస్తు దూరాచ్చకిత మానసః। ఆరాన్నివర్తతే సోఽయ ముపరాగ ఇతీహయః॥ ౭ ॥ ఉచ్యతే లోకమధ్యేతే దేవర్షే అవబుధ్యతాం। తతోఽధస్తాత్సమా ఖ్యాతాలోకాః పరమ పావనాః॥ ౮ ॥ ఇదే విధముగ వాయుపురాణమున ౫౨-వ యధ్యాయమునను విష్ణుపురాణమందలి ద్వితీయాంశమున ౧౨ వ యధ్యాయమున గలదు.

సూర్యమండలమునకుఁ గ్రిందుగానున్న రాహుమండలము పదుమూడు వేల యోజనములు. సూర్యచంద్రమండలములకంటె రాహుకేతువుల మండలము విశాలముగనుండుటచే నొకప్పుడు నారెంటినాచ్ఛాదించును ఆరాహుకేతువు లమృత పాన సమయమున దేవతల నడుమనుండి సూర్యచంద్రులచేఁ జూపఁబడుటవలన గలిగిన వైరానుబంధమున నాసూర్యచంద్రుల పయికి వ్యాపించి ఆచ్ఛాదించిన వార

లైరి. వీరలు తమోరూపులగు నసురులు, సూర్యచంద్రుల రక్షణార్థమై ఈ తమో గ్రహములను బరమ పురుషుండగు భగవంతుఁడు తన సుదర్శనంబనెడి చక్రమును బ్రయోగించి ఆచ్ఛాదింపబడిన తమస్సును లోకహితార్థము నాశనము చేయు చున్నాఁడు. సహింపరాని యీసుదర్శనము వారిచుట్టును దిరుగుచుండగా దీని కెదు ఱుగఁ గొంతసేపుండి వారుభయకంపితులై తొలఁగిపోవుదురు. అట్లు ఈ తమోగ్రహ ములగు రాహుకేతువులు సూర్యచంద్రులను సమీపించి తమ తమస్సుచే సూర్య చంద్ర మండలముల నాచ్ఛాదించుట నే శాస్త్రమందుఁగూడ గ్రహణమని చెప్పు చున్నారు. రాహుమండలము సూర్యమండలమున కధోభాగముననున్నది రాహు రథాశ్వములు తమోమయంబులు. ఆయశ్వంబు లెనిమిది.



## దే వ తా యో ని భే ద ము లు.

(౧) విద్యాధరులు, (౨) అప్సరసులు, (3) యక్షులు, (౪) రక్షస్సులు, (౫) గంధర్వులు, (౬) కిన్నరులు, (౭) పిశాచములు, (౮) గుహ్యకులు, (౯) సిద్ధులు, (౧౦) భూతములు.

(౧) విద్యాధరః=మూలికాంజనాది విద్యాః ధరంతీతి, విద్యాధరాః= మూలకాంజనాది విద్యలను ధరించిన జీమూతవాహనుఁడు మొదలగువారలు ధృ ధాఞ్ ధారణ పోషణయోః

(౨) అప్సరసలు. వీరలు ఊర్వశీప్రభృతులు నఱువదివేలు.

(3) యక్షులు—కుబేరానుచరులు.

(౪) రక్షస్సులు=విభీషణాదులు.

(౫) గంధర్వులు=హాః, హూః, హూహా, హూహూ, ప్రభృతులు.

(౬) కిన్నరులు=అశ్వముఖంబును, నరశరీరంబును గలవారలు.

(౭) పిశాచాదులు=పిశితమశ్నంతీతి పిశాచాః మాంసమునుభుజించువారు, కుబేరానుచరులు, అశ=భోజనే, ధూమ్రవర్ణముగలవారు, శివభక్తులు.

(౮) గుహ్యకః=నిధీన్గూహంతీతి గుహ్యకాః నిధులనుగాంచువారు. గుహూ=సంవరణే ప్రాయేణగుహ్యం కుత్సితంకారయంతి వదంతీతివా, తఱుచుగా గుత్సితములు పలికెడువారు. మణిభద్రుఁడు మొదలగువారు నిధిపాలకులు. కైశబ్దే.

(౯) సిద్ధః=అణిమాదిసిద్ధిర్యేషామస్తీతిసిద్ధాః=అణిమాది సిద్ధులుగలవారలు. విశ్వావసు ప్రభృతులు.

(౧౦) భూతః=ఇష్టంప్రాప్నువ తీతి భూతాః బాలగ్రహాదయః - ఇష్టము నొందెడి బాలగ్రహాదులు. భూప్రాప్తావాత్మనేపదీ.

—o—

# సి ద్ధా ది లో కా దు లు.

శ్రీదేవి భాగవతం - అధ్యా. ౧౯ - పుట. ౩౩౦

తతోఽధస్తాత్సమాఖ్యాతా లోకాః పరమపావనాః ॥ ౮ ॥ సిద్ధానాం చారణాంచ విద్యాధ్రాణాంచ సత్తమ। యోజనాయుతవిఖ్యాతాలోకాః పుణ్యనిషేవితాః॥ ౯ ॥ తతోఽప్యధస్తాద్దేవర్షే యక్షాణాంచ సరక్షసామ్। పిశాచప్రేతభూతానాం విహారాజిర ముత్తమం॥ ౧౦ ॥ అంతరిక్షంచ తత్ప్రోక్తం యావద్వాయుః ప్రవాతిహి। యావన్మేఘాస్తతోద్యంతి తత్ప్రోక్తంజ్ఞానకోవిదైః॥ ౧౧ ॥ తతోధస్తాద్యోజనానాంశతం యావద్విజోత్తమైః। పృధివీపరిసంఖ్యాతా సుపర్ణశ్యేనసారసాః॥ ౧౨ ॥ హంసాదయః ప్రోత్పతంతిపార్థివాః పృథివీభవాః। భూసన్నివేశస్థానం తత్ యథావదుపరిస్థితం॥ ౧౩ ॥ అధస్తాదవనేస్సప్త దేవర్షే వివరాస్స్మృతాః। ఏకైకశోయోజనానామాయా మోచ్ఛ్రాయతఃపునః॥ ౧౪ ॥

వైదికతత్వజ్ఞానము దెలియక దుష్కర్మలనుజేయక, విద్యలనుదాచిపెట్టక యితరులకు తమకుఁదెలిసినవాటిని బోధించి సంసారములందున్నవారలే సిద్ధచారణగంధర్వాదులు. వీరలు ధ్రువాదూర్ధ్వమునుబొందనేరరు. ఇట్టివారలు సామాన్యవైరాగ్యముతో నీలోకమును బొందుదురు. ఈలోకము పదివేలయోజనవిస్తారముతోనున్నది.

వీనిక్రిందనే యక్షరాక్షస పిశాచాదులలోకములున్నవి. ఇవియు విస్తారమునందు పైపరిమితికిఁ జేరినలోకాదులే. దీనిక్రిందనే మేఘమండలాదులున్నవి ఇవి శతయోజనవిస్తారముకలవి.

సిద్ధాదిలోకలోకేశచరిత్రము - దేవీభాగవతం - అధ్యా. ౧౯ - పుట. ౩౩౦.

రాహుమండలముక్రింద యక్షరాక్షసాది దేవయోనుల లోకములున్నవి. వీరలకు సంబంధముగ పిశాచప్రేత భూతగణముల లోకాదులున్నవి. వీరలనే

అమరకోశములో "విద్యాధరోప్సరోయక్ష రక్షోగంధర్వకిన్నరాః। పిశాచోగుహ్యకఃసిద్ధో భూతోమీ దేవయోనయః।"అని వివరించిరి. మఱియు వేదములో అరుణ ప్రపాఠకమునఁ దొమ్మిదవ అనువాకములో అంతరిక్షమునుగురించియున్నది. పైదేవయోని పదవివరములను అర్థమును ముందుచూడవచ్చును

భూసంబంధవాయువులెంతవరకు ప్రసరింపుచుండునో యంతవరకు చెప్పఁబడిన ధ్రువసంబంధ సప్తవాయువులతో నాహవమనెడి వాయువుచేరినదై మేఘములను వర్షింపఁజేయుచుండును. ఈలోకమంతయు అంతరిక్షమని పండితులచేఁ జెప్పబడుచున్నది. దీనికి నూరుయోజనములు క్రిందుగ గ్రద్దలు, హంసలు, సారసపక్షులు మొదలుగాఁగలవి తిరుగుచుండును. పై మేఘములే కాలానుసారమంతరిక్షమునుండి మనకుసమీపములోనికి దిగివచ్చునవకాశములుగూడనుండును.

శాస్త్రదృష్టితో భూరాదిలోకత్రయను వ్యాహృతి త్రయముచేఁజెప్పఁబడు భూమిఅంతయును అవధాతుప్రవణార్థకమగుటచేఁ బ్రార్థప్రవణమునకు బదులుగా అవనియేగావున అట్టిఅవని కధోభాగమంతయును, విజ్ఞానప్రణవరూపుఁడగు అష్టావక్రమహామునియొక్క ఏడువంకరలవలె సప్తపాతాళాదులుగను, సప్తవ్యసనములుగనున్నవి. ఇట్టి ఈభూమియే రామాయణేతిహాసములో మందరఅనుపేరుగల కేకయరాజపుత్రియొక్క సైరంధ్రి (దాసి)గను శ్రీమద్భాగవతము మొదలగువాటిలోఁ ద్రివక్రకుబ్జనామముగల కంసుని సైరంధ్రిగను వర్ణింపఁబడి తుదకు భగవదనుగ్రహపాత్రరాలుగఁగూడఁ జెప్పబఁడెను కావున మనపార్థివాన్నమయ కోశగతవక్రతలు మొదలుగాఁ బ్రార్థివప్రణవాద్యష్టాక్షర దృగ్గతవక్రతలవలె మనమానసికవక్రతలతో సహా మహాకాల ప్రవాహములో నెప్పటికి శూన్యమగునో అప్పటికిఁగాని మనకు మహాశూన్యమగు మనస్వరూపతత్వము గోచరించి ముక్తికాంతయొక్క స్వయంవరము ప్రాప్తించదని ముఖ్యముగా తెలియతగ్గినది.

—o—

# మే ఘో త్ప త్త్యా దు లు.

శ్రీ వాయుపురాణం అధ్యాయం ౫౧

ఆగ్నేయా బ్రహ్మజాశ్చైవ పక్షజాశ్చ పృథగ్విధాః। త్రిధాఘనాః సమాఖ్యాతాస్తేషాం వక్ష్యామి సంభవం॥ ౨ ॥ ఆగ్నేయాస్త్వర్ణజాః ప్రోక్తాస్తేషాం

తస్మాత్ ప్రవర్తనం। శీతదుర్దిన వాతాయే స్వగుణాస్తే వ్యవస్థితాః॥ ౨౯ ॥ మహిషాశ్చ వరాహాశ్చ మత్తమాతంగ గామినః। భూత్వాధరణి మభ్యేత్య విచరంతి రమంతిచ॥ 3౦ ॥ జీమూతానామతే మేఘా ఏతేభ్యో జీవసంభవః। విద్యుద్గుణ విహీనాశ్చ జలధారా విలంబినః॥ 3౧ ॥ మూకాఘనా మహాకాయాః ప్రవహస్య వశానుగాః। క్రోశమాత్రాచ్చ వర్షంతి క్రోశార్ధా దపివాపునః॥3౨॥ పర్వతాగ్రనితంబేషు వర్షంతిచ రమంతిచ। బలాకా గర్భదాశ్చైవ బలాకా గర్భధారిణః॥ 33 ॥ బ్రహ్మజానామతే మేఘా బ్రహ్మనిశ్వాస సంభవాః। తేహివిద్యుద్గుణోపేతాః స్తనయంతి స్వనప్రియాః॥ 3౪ ॥ తేషాం శబ్ద ప్రణాదేన భూమిః స్వాంగరుహోద్గమా। రాజ్ఞేరాజ్యాభిషిక్తేవ పునర్యౌవనమశ్నుతే తేష్వేయం ప్రీతిమాసక్తా భూతానాం జీవితోద్భవా॥ 3౫ ॥

మేఘములు గౌణనామములతో మూడువిధములుగ శ్రేత్రములని చెప్పఁబడుచున్నవి. మేఘములు: (౧) ఆగ్నేయములు, (౨) బ్రహ్మజన్యములు, (3) పక్ష జన్యములు. తరువాత వేర్వేరునామరూపములతోఁబుట్టి భూమియందువర్షించుచున్నవి.

(౧) ఆగ్నేయమేఘములు ప్రాకృతవర్ణముగలిగి శీతదుర్దినవాతములు కలవై తమగుణములకుఁదగినట్లు మహిషములవలెను, వరాహములవలెను, మదగజములవలెను, నడుచుచు భూమికేవచ్చి స్వేచ్ఛగాసంచరించుచుండును. ఈ మేఘములకే జీమూతములనిపేరు. వీటివల్లనే జీవులకు జీవనములుగలుగుచున్నవి. ఇవి మెరుపులులేక నిరంతరము ధారాసంహితముగఁ గురియును మరియు నురుములు లేకపోవుటచే మూగవానివలె మహాకాయముగలవైనను, కాలప్రవాహమునుబట్టి పోవుచు పాత్రాపాత్ర మెరుఁగక దానముజేయు దాతవలె భూమియందుఁ గ్రోసు దూరమునఁగాని అర్ధక్రోసుదూరమునఁగానియుండి వర్షముకురియుచుండును. మిగిలిన వర్షముపయోగములేని పర్వతాగ్ర నితంబములందు వర్షించును. బెగ్గురుపక్షులకు (సారసపక్షి) తనదర్శనమైనంతమాత్రముననే గర్భధారణ యగునట్లుచేసి ప్రబలమైన మైథునేచ్ఛగల భూములయందే స్వల్పవర్షము గురియుచుండును. ఇదిఆగ్నేయ మేఘస్వభావము. ఈమేఘములు ఆవహమనువాయువు నాశ్రయించియుండును.

(౨ బ్రహ్మజములగు మేఘములు బ్రహ్మనిశ్వాస సంభూతములై మెఱుపులసమూహముతోఁగూడి సామవేద ధ్వనివలెనురుముచుండును. వీటియుఱుమును వినినంతమాత్రముచేతనే, సత్కులీన యగుకన్యక రాజ్యాభిషిక్తయగు రాణి

వలె తనయందిమిడియున్న సత్సంతాన బీజముతో గర్భోత్పాటుగలిగి, ఉత్తమ కులీనుఁడగు యువరాజునకు రాజ్యపట్టాభిషేకమైనపుడు రాజమహిషియగు భార్య వలె యౌవనమును బొందినదగును. ఇట్లా మేఘములందుఁ బ్రీతిగల సీభూమియు, భూతములకుఁదగిన ఓషధులను గనుచుండును. ఈ మేఘములు జీమూతములను పేరుతో ప్రవహమను వాయువు నాశ్రయించి నడుచును. ఇవి యోజనదూరముగాఁగాని, క్రోసు లేక రెండుక్రోసులదూరముగఁగాని దానకగ్నునివలె ధారాసంపాతముతో జీవనమిచ్చుచుండును. ఇదియే యాగాదులందు యజింపఁబడి స్తుతింపఁబడుచు యాగాదిస్తుతులతో సంతృప్తి చెంది యజించినవారలకు వర్షప్రదానము చేయుచుండును. ఇది బ్రహ్మమేఘములచరిత్ర.

నక్షత్రగ్రహ చక్రముయొక్క భౌమధ్రువాయనమెట్లన, సూర్యుఁడు తన రాశిగృహమునుండి బయలుదేరి రాశ్యంతమును బొందుటకు రమారమి పదుమూడురోజులుపట్టును. వారాంతమునకు, ధ్రువునిచేఁ బరివేష్టింపఁబడిన యా నక్షత్రధ్రువము భూమధ్యకువచ్చి సూర్యునిఁబ్రవేశించినట్లు గణితముచేతఁ దెలియఁ దగును. కావున నదియే నక్షత్రధ్రువమని చెప్పబడుటచేఁ గర్మదేవతలగు త్రైవర్ణికులకు దేవప్రాచీ దిక్సాధనతో నిరయన సూర్యానీతతిథియే శ్రౌతస్మార్తాది నిత్యకర్మలయందును వ్యావహారిక చాంద్రసౌరమానానీతతిథి నైమిత్తిక కర్మలయందను గ్రాహ్యమగుచున్నది.



## మేఘనామములు - తద్వర్ష వివరము.

మత్స్యపురాణము - అధ్యాయం ౧౨౫ - పుట. ౪

జీమూతా నామ తే మేఘా యదేభ్యో జీవసంభవః ॥ ౧ ॥ ద్వితీయ ఆవహ వాయుర్మేఘాస్తే త్వభిసంశ్రితాః। ఇతో యోజనమాత్రాచ్చ అధ్యర్ధవికృతా అపి ॥ ౧౦ వృష్టిసర్గస్తథా తేషాం ధారాసారః ప్రకీర్తితః। పుష్కరావర్తకా నామ యే మేఘాః పక్షసంభవాః ॥ ౧౧ ॥ శక్రేణ పక్షాశ్ఛిన్నా వై పర్వతానాం మహౌజసా। కామగానాం సమృద్ధానాం భూతానాం నాశమిచ్ఛతాం ॥ ౧౨ ॥ పుష్కరా నామ తే పక్షా బృహంతస్తోయధారిణః। పుష్కరావర్తకా నామ కారణేనేహ శబ్దితాః ॥ ౧౩ ॥ నానారూపధరాశ్చైవ మహాఘోరస్వరాశ్చ తే। కల్పాంతవృష్టేః కర్తారః కల్పాంతాగ్నే

ర్నియామకాః॥ ౧౪ ॥ వాయ్వాధారావహంతే వై సామృతాః కల్పసాధకాః।
యాన్యస్యాండస్య భిన్నస్య ప్రాకృతాన్య భవంస్తదా। ౧౫ ॥ యస్మిన్ బ్రహ్మా
సముత్పన్నశ్చతుర్వక్త్రః స్వయంభువః। తాన్యేవాండకపాలాని సర్వే మేఘాః ప్రకీ
ర్తితాః॥ ౧౬ ॥ తేషామాప్యాయనం ధూమః సర్వేషామవిశేషతః। తేషాం శ్రేష్ఠశ్చ
పర్జన్యశ్చత్వారశ్చైవ దిగ్గజాః॥ ౧౭ ॥ గజానాం పర్వతానాంచ మేఘానాం భోగి
భిః సహ। కులమేకం ద్విధాభూతం యోనిరేకాజలం స్మృతం॥ ౧౮ ॥ పర్జన్యోదిగ్గ
జాశ్చైవ హేమంతే శీతసంభవం। తుషారవర్షం వర్షంతి వృద్ధ్యా హ్యన్నవివృద్ధయే। ౧౯
షష్ఠః పరివహోనామ వాయుస్తేషాం పరాయణః। యోఽసౌ బిభర్తి భగవాన్ గంగా
మాకాశగోచరం॥ ౨౦ ॥ దివ్యామృతజలాం పుణ్యాం త్రిపథామితి విశ్రుతామ్।
తస్యా విష్యందితం తోయం దిగ్గజాః పృథుభిః కరైః॥ ౨౧ ॥ శీకరాన్ సంప్రముం
చంతి నీహార ఇతి స స్మృతః। దక్షిణేన గిరిర్యోఽసౌ హేమకూట ఇతి స్మృతః॥ ౨౨ ॥
ఉదగ్ధిమవతః శైలస్యోత్తరేచైవ దక్షిణే। పుండ్రంనామ సమాఖ్యాతం సమ్యగ్వృష్టి
వివృద్ధయే॥ ౨౩ ॥ తస్మిన్ ప్రవర్తతే వర్షం తత్ తుషార సముద్భవం। తతోహిమ
వతో వాయుర్హిమం తత్ర సముద్భవం॥ ౨౪ ॥ ఆనయత్యాత్మవేగేన సించయానో
మహాగిరిం। హిమవంత మతిక్రమ్య వృష్టిశేషం తతఃపరమ్॥ ౨౫ ॥ ఇభాస్యేచ
తతః పశ్చాదిదం భూత వివృద్ధయే। వర్షద్వయం సమాఖ్యాతం సమ్యగ్వృష్టి వివ
ర్ధయే॥ ౨౬ ॥ మేఘాశ్చాప్యాయనం చైవ సర్వమేతత్ ప్రకీర్తితమ్। సూర్య
ఏవతు వృష్టీనాం స్రష్టాసముపదిశ్యతే। ౨౭॥ వర్షం ధర్మం హిమం రాత్రిం సంధ్యే
చైవ దినంతథా। శుభాశుభఫలానీహ ధ్రువాత్ సర్వం ప్రవర్తతే। ౨౮ ॥ ధ్రు
వేణాధిష్ఠితాశ్చాపః సూర్యోవై గృహ్యతిష్ఠతి। సర్వభూతశరీరేషు త్వాపో హ్యను
సృతాశ్చయాః॥ ౨౯ ॥ దహ్యమానేషు తేష్వేవ జంగమస్థావరేషుచ। ధూమ
భూతాస్తు తాహ్యాపో నిష్క్రామంతీహ సర్వశః॥ ౩౦ ॥ తేన చాభ్రాణి
జాయంతే స్థాన మభ్రమయం స్మృతం। తేజోభిః సర్వలోకేభ్య ఆదత్తే రశ్మిభిర్జ
లం॥ ౩౧ ॥ సముద్రాద్వాయు సంయోగాద్వహం త్యాపో గభస్తయః తతస్త్వృతు
వశాత్ కాలే పరివర్తన్ దివాకరః॥ ౩౨ ॥ యచ్ఛత్యాపోన్య మేఘేభ్యః శుక్లాః
శుక్లాస్తు రశ్మిభిః। అభ్రస్థాః ప్రపతంత్యాపో వాయునా సముదీరితాః॥ ౩౩ ॥ తతో
వర్షతి షణ్మాసాన్సర్వ భూతవివృద్ధయే। వాయుభిః స్తనితం చైవ విద్యుతస్త్వగ్నిజాః
స్మృతాః॥ ౩౪ ॥ మేహనాచ్చ మిహేర్ధాతోర్మేఘత్వం వ్యంజయంతిచ। నభ్ర
శ్యంతే తతో హ్యాపస్తస్మా దభ్రస్య వై స్థితిః॥ స్రష్టాఽసౌ వృష్టిసర్గస్య ధ్రువేణా

ధిష్ఠితో రవిః॥ ౩౫ ॥ ధ్రువేణాధిష్ఠితో వాయుర్వృష్టిం సంహరతే పునః। గ్రహా
న్నివృత్యా సూర్యాత్తు చరతే ఋక్షమండలమ్॥ ౩౬ ॥ చారస్యాంతే విశ
త్యర్కం ధ్రువేణ సమధిష్ఠితమ్। అతసూర్య రథస్యైవ సన్నివేశం ప్రచక్షతే॥ ౩౭ ॥
ఇతిపై విషయమే శ్రీ వాయుపురాణము అధ్యాయము ౫౧ లో ౩౬ శ్లోకమునుండి
౫౩ శ్లోకమువరకు నున్నది.

భూలోకమున మనకగపడు మేఘములు ఆహావమను వాయువును యోజన దూరమునఁగలసి వర్షించును పుష్కరా(లా) వర్తకములనెడి మేఘములు పర్వత పక్ష జనితములు. పుష్కల జలధరములగుటచే వీనికాపేరు సార్థకమైనది. ఇందుఁగొన్ని ప్రళయ వృష్టినిఁ గురిపించును. కొన్ని ప్రళయాగ్నినిఁ జనింపఁజేయును కొన్ని యమృతసహిత కల్పసాధకములై సృష్టిని వహించుచుండును ధ్రువునినుండి వచ్చిన పరివహామను నారవ వాయువుచే మేఘములు రక్షింపఁబడుచుండును. అండకపాల భిన్నసమయమున నభిన్నముగనున్న కపాలావయవములు ప్రాకృత మేఘములుగనే యున్నవి. బ్రహ్మాయండకపాలమందు వేదచతుష్టయాత్మక ముఖచతుష్కముగ జనించినట్లు మేఘములు(పైవివరింపఁబడినట్లు) నాల్గువిధములయ్యెను వీనికాహ్వాయన కారి ధూమము. ఆనాల్గువిధంబులగు మేఘస్తోమంబులలో నాల్గుమేఘంబులు శ్రేష్ఠంబులు. దిగ్గజంబులు తత్తుల్యంబులు. దిగ్గజమేఘంబులు హేమంతఋతువునందు తుషారంబు వర్షించును ఆరవదగు పరివహవాయువు పర్జన్యాదుల జన్మభూమి. అయ్యది దివిజగంగను ధరించియున్నది. ఆకాశగంగ త్రిపథగామిని కాగాఁ దజ్జలముల దిగ్గజములుగొని శీకరంబులఁ జల్లుచున్నవి. ఆశీకరములే నీహారమను పేర వ్యవహృతమైనవి. హిమశైల దక్షిణోత్తరదిశలగల హేమకూట పుండ్రపర్వత జనిత మేఘపఙ్క్తులఁ బుట్టిన హిమముతోఁ గూడిన వాయువు వీచును. అది యాత్మ వేగమున హిమగిరినిఁ దడిపి తదుపరి తుషారవృష్టి శేషమును వర్షించును. ఈతుషారవృష్టి భూతవృద్ధికొరకును సత్కాననలకొఱకును గురియుటచే రెండు విధములయ్యెను. సకల వర్షములకు సూర్యుఁడే సృష్టికర్త. వర్షము, ప్రవృత్తి ధర్మము హిమము, రాత్రిందివములు, సంధ్యలు శుభాశుభాదులు సారధ్రువమువలనఁ గలుగును ధ్రువాధిష్ఠిత జలమును సర్వ భూతములనుండి సూర్యుఁడుగ్రహించి ధ్రువస్థానమందుంచుచున్నాఁడు. ప్రళయమున భూతస్థితజలము ధూమ రూపమున నిష్క్రమించును. ఆధూమమునుండి మేఘములు జనించును. సూర్యుఁడు సర్వలోక

సముద్రములనుండి జలములను గ్రహించి వాయు సంయోగముచే వహించును. అతఁడే నిశాకరరూపముతోఁ బరివర్తమానుఁడగును. ఆయాఋతువశమునఁ గాల కర్మ పరివర్తకుఁడుకూడ నగును. మేఘమండలమున వాయువుచే నురుములును, విద్యుదగ్నిచే మెఱుపులును, పిడుగులును నాకసమున జనించును.

కింపురుషాద్యష్ట వర్షంబులందు మేఘములు వర్షింపవు. ప్లక్ష ద్వీపాది ద్వీప షట్కములందుఁగూడ వర్షింపవు. ఇవి జలభూత లోకాదులగుటచేత జలభాగ మతిశయించియే యుండును. మనభూమి కేవలపృథివీభూతమగుటచేఁ బ్రత్యేకించి జల మావశ్యకమైయున్నందున వర్షమావశ్యకము. కావ మేరువునకు దక్షిణదిశలోనే మేఘసంచారమున్నది.

—o—

## జంబూద్వీపాదివిషయ విమర్శనము.

ఈబ్రహ్మాండాంతర్వర్తులగు సప్తద్వీప సముద్రాదులు వేదవాఙ్మయమందు "సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్సప్తార్చిష స్సమిధ స్సప్తజిహ్వాః" అను కొన్ని మంత్రములతో మూడవదగు ఆగ్నేయప్రాణనేత్రమును విప్పుకొని తపోబలముచే విషయాభిముఖములగు కామక్రోధాద్యంతశ్శత్రుగణమును భస్మముచేసుకొనుటకును, వైదికమగు శమదమాది మిత్రవర్గమును మిత్రలాభముతోఁ బూజించుకొరకును, "యో వేదాదౌ స్వరః ప్రోక్తః" అని వేదాద్యంతములయం దేకరూపముగను, శ్లో॥ వాచకః ప్రణవో యస్య క్రీడా వస్త్వఖిలం జగత్" అని వాచ్యవాచకా భేదరూపముగను వర్ణింపఁబడిన ప్రణవాత్మతత్త్వమును సాక్షాత్కారముతో అనుభవించి ముక్తినిఁ జెందుటకును, అధ్యారోపాపవాద న్యాయముగా లేక అన్యోన్యాధ్యాసరూపముగాఁ జెప్పఁబడిన పాంచభౌతిక భ్రామధ్రువమే ఛత్రాకారముగాఁ దామరపద్మమువలె ఛాయలతోఁగూడ నవవర్షఖండాంత విరాజితవాస్తుమండప రూపముగాను విరాడ్బ్రహ్మరూపముగాను, ఛాయాగ్రహములను మినహాయించిన సప్తద్వీప సముద్రవ్యాహృతి ఛందోమయ యజ్ఞవాహనమూర్తియగు గరుత్మంతుని స్వరూపముతోఁ ద్రిసువర్ణకాల కర్మత్రయాత్మకముగాను, పురాణవాఙ్మయమంతయు అర్థప్రధానమై చరిత్రాత్మకమగుటచే దివ్యావతార పురుషులు మొదలు మాయామానవ లీలావతారపురుషుల వరకుఁ జరిత్రరూపముగా, ద్రివర్గఫలాపేక్షులకుఁ ద్రివర్గఫల లాభముకొరకును

ముముక్షువులకు మోక్షలాభముకొఱకును, పురాణములయందే కాక ధ్వన్యర్థజీవిత మగు కావ్యవాఙ్మయమందుఁగూడ మహాకవులచే అధ్యారోపాపవాద న్యాయముచేఁ దత్త్వమును దెలుసుకొనిన మానవజన్మధన్యతకొఱకును, కృతార్థతకొఱకును, అనేక ప్రకారములవర్ణింపఁబడినదంతయు జంబూద్వీపవర్ణనమే. కావునఁజివరకు మేరుపర్వతమంతయు జంబూద్వీపముగాఁ దిగ్నాభిచక్రరూపముగ వర్ణింపఁబడియున్నది. ఇందుకు "యద్వేదాత్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానాచ్చిరం యచ్చార్థప్రవణాత్పురాణవచనాదిష్టం సుహృత్సమ్మితాత్ । కాంతాసమ్మితయా యయా సరసతామాపాద్య కావ్యశ్రియాఽకర్తవ్యేఽకుతుకీబుధో విరచితస్తస్యై స్పృహాంకుర్మహే" అని చెప్పిన మహాకవిసూక్తికూడ సాక్ష్యమిచ్చుచున్నది. ఈకవిసూక్తియందు నాల్గవ పాదములోఁ గర్తవ్యేకుతుకీ అనుస్థలమందు అకార ప్రశ్లేషతోను రెండవపాదములోఁ పురాణవచనాదిష్టం అనుస్థలమందుఁ పురాణవచనాత్ + ఇష్టంఅను పదచ్ఛేదముతోను పురాణవచనాదిష్టంఅను ఏకపదాన్వయమందు శబ్దప్రాధాన్యముచే ప్రభుసమ్మితమగు వేదార్థము శబ్దమునకు అర్థముకూడ శబ్దమేఅయి రాజాజ్ఞవలె హేతువాదమునకుఅనగా ప్రశ్నించుటకు అవకాశములేకుండజేసి లోకదృష్టిలో శబ్దార్థములకుఁగల వికల్పముచేఁ బరస్పరశబ్దార్థ పరివర్తనమును సహించుచు సుహృత్సమ్మితమగు పురాణవచనము "శత్రువదాదాదేశోఽనల్విధా" అనునట్లు పాణినీయ న్యాయప్రకారము శబ్దప్రధానమగు వేదార్థస్థానమందుఁ జరిత్రాత్మకార్థ ప్రాధాన్యముచే ఆదిష్టమగు పౌరాణికార్థము లోకదృష్టిగల స్త్రీ శూద్రద్విజ బంధ్వాదులు ఆధిదైవిక భక్తిశాస్త్రప్రామాణ్యముచేఁ జరిత్రమాత్రదృష్టిగలవారేగావున వారి కొఱకై మంత్రార్థవాదాదులవలె వైదికార్థస్థానములోఁ బౌరాణికార్థము ఆదిష్టమైనదనియే విశేషార్థలాభముతో విచ్ఛిత్తివిశేషమును అందుచే అపౌరాణికార్థమే కావ్యవాఙ్మయములో 'గాంతాసమ్మితమై ధ్వన్యర్థమే "జీవితం వ్యంగ్యవైభవం" అనునట్లు కావ్యమునకు ప్రాణమువంటిదగుటచే బుధుఁడనగా విద్వాంసుఁడు. కర్తవ్యాకర్తవ్యములలోఁ దనకర్తవ్యములోఁ గౌతుకముకలవాఁడగునట్లే అకర్తవ్యమందు అకౌతుకము కలవాఁడగునను విశేషార్థము లభించును.

ఈబ్రహ్మాండాంతర్భాగమునఁగల సప్తద్వీపాదుల కంతర్వర్తియై మధ్యలోఁ గోళంబువలెఁ బద్మాకారముతో ఒకలక్షయోజన విస్తారముతోఁ దామరాకువలె సమవర్తులమై జంబూద్వీపమున్నది. ఈబ్రహ్మాండములోనాభివలె సర్వద్వీపము

లకును ఊర్ధ్వాదిలోకావ లకు, అధోలోకాదులకును ఆధారపద్మమై మనదేహములోఁ గల వేణుదండమునకు మూలాధారచక్రమువలె నీబ్రహ్మాండములోఁగల మేరుపర్వతమునకును మూలాధారమా అనునట్లు నామరూపములచే మనవలెనే బంధింపబడి యున్నది. ఈ మేరుపర్వతాధారముతో జంబూద్వీప భూపద్మము సర్వలోకాదులకు అంతరములో మూలాధారమై సర్వప్రభ్రమణలకుఁ గారణమై సర్వద్వీపముల నాకర్షించి అంతస్థులుగా స్థాయిగానిలిచి సర్వవ్యవహారహేతుభూతమై పద్మము వలెయుండుటచే ఆధ్యాత్మదృష్టిననుసరించి వేదాంతములయందు అధ్యారోపాసనాదులచే అన్యోన్యాధ్యాసయని చెప్పఁబడుచున్నది. ఈ జంబూద్వీపము ననుసరించి దీనిఉపరిభాగములో సముద్రములును నితరద్వీపములును అంతస్థులుగ ఒకదానిపైనొకటినిలిచి మేరువును దమఅంతరాళములోఁజేర్చుకొని మేరువునుగూడ దానుచుట్టునట్లు అవకాశములు గలిగించుకొనియున్నవి. ఇట్లుగస్తావయవములుగల ప్రణవరహస్యతత్త్వమే "యోవేదాదౌస్వరః ప్రోక్తో వేదాంతేచప్రతిష్ఠితః అను మంత్రములోను "సప్తప్రాణాః ప్రభవంతి"అను మంత్రములోను ఇంకననేకస్థలములలోఁగూడ వేదముచేఁజెప్పబడుచున్నది. సప్తద్వీప సముద్రములు సప్తరసధాతువులు మనదేహములోనున్నట్టుగా బ్రహ్మాండముననున్నవి. ఈసప్తధాతుగుణరూప రసములే శుద్ధోదకాది లవణసముద్రమువరకుఁగల సముద్రములుగాఁ దత్త్వముతో గ్రహించవలెను పురాణములలో స్థూలముగఁ దలంచవలెను. స్థూలములో సర్వము భిన్నములుగనేయుండును. సూక్ష్మములో ఏకములుగనేయుండును. జ్ఞానముతో నేమియునుండఁజాలవు. ఇవే వేదశాస్త్రపురాణముల రహస్యములు.

సృష్టిలోఁ బంచభూతములకంటె ఆరవదగు భూతాదితపోవ్యాప్త్యర్థమగు స్వరూపతపస్సుచేరక్షణ గుణములేక నిలిచినపుడే క్షీరసముద్రమగును దానికాధారమగు సోహంమంత్రార్థ విమర్శయే ప్రణవార్థరూపముతోఁ బుష్కరద్వీపమగును. కడపటిజలభాగమే లవణసముద్రము. ఇది తపోబలముచే క్షారగుణము నశించి క్షీరముగాను మంచినీటిసముద్రముగను మార్పుచెందును. ఒకదానికొకటి ద్విగుణీకృత విస్తారాతిశయముతోనున్నవి. ఈద్వీపములలోని నదులు క్రిందఁగల సముద్రములందే చేరునట్లుగఁ బ్రవహించును. ఈద్వీపాదులలో సర్వదా కృతయుగధర్మకాలమునడుచును. యుగభేదములేదు. వీరలకు వర్షముతోఁబనిలేదు. నీరు భూమిపైకుబికి పారుచుండును. తఱచుగాదేవతలునహా నిచ్చటకువచ్చు నవకాశములున్నవి. ఇచ్చటిప్రజలఆయువు పదివేలవత్సరములు. ఈద్వీపములో ఆరాధనలు

పంచభూతాత్మకోపాసనలుగ మనకు పంచాయతన దేవతోపాసనలవలెనున్నవి. మనకు సమష్టిపంచాయతన దేవతామూర్తులున్నవి. వీరలకు ఒక్కభూతాది దేవతాత్మికముగా ఉపాసనాదులున్నవి. ఇందలినదీజలపానంబు లమృతపానములు. దీన దేహారోగ్యములనొంది వలీపలితములులేక దేహసౌఖ్యముతో నిరంతర సత్యధ్యాన యజ్ఞతపోయోగాదులతో సంతుష్టిమానసులై యిందలివారలుందురు. వర్ణింప నలవిగాని అత్యుత్తమాధిక సుఖసుందరులు వీరు. మనభూమివలె నాభూమికఠినగుణాధిక్య భూప్రదేశముకాదు. ఇట్టిమహాభూములనువిడిచి మనమున్నలోకాదులే శాశ్వతములని అధికములనితలంచి అభిమానించుటెట్టిదో తెలియదు. ఈలోకాదులచరిత్రలవినుట కెంతో ఆశ్చర్యానందకరముగనున్నది. అనుభవించినచో మరెంత యతిశయముగ నున్నదో తెలియరాదు. మనభారత భూప్రదేశమే అంత్యభూమి. కేవలకర్మభూమి. నిరంతరము జన్మావధిగ గృషివాణిజ్య వ్యవహారాదులకు శాశ్వతనిలయభూమి ఇవిలేకున్నచో క్షణముగూడ జరుగనేరదు.

ఈసప్తద్వీపముల వరుసలు భేదములుగలవి. బహుపురాణసమ్మతములుగానున్నవరుసలను వివరించి వ్రాసితిని. సముద్రములుమాత్రము అన్నిపురాణములందు నొకవిధములుగ నేయున్నవి. భేదములులేవు. జంబూద్వీపములో దక్షిణ దిశలోని కొన్నివర్షములుతప్ప మిగతవర్షములు మిగత ఆరుద్వీపములు మేఘమండలమున కుపరిలోఁ గ్రమముగానున్నవి. మేఘమండలమున కుపరిభాగములోనుండుటచేత వాటికివర్షముతోఁబనియేలేదు. వర్షము మేఘమండలముల క్రిందిభాగమునకే యావశ్యకము. ఆద్వీపములు కేవల జలభూతగుణద్వీపములు. హిమము ఘనీభవించినభూములు. అందుచేతనే వర్షముతో వారలకుఁబనిలేదు

బ్రహ్మలోకమగు సత్యలోకమువఱకు భూతాంశాధిక్యభూతగుణానుసారముగ భూమియుండును ఈశ్వరునికిది స్థూలబ్రహ్మాండముగను మనకు సమష్టిగా ద్రివిధరూపబ్రహ్మాండముగనున్నది. సప్తద్వీపములందుఁగలభూమి మనభూమివలె స్థూలముతోఁ గఠినమై పంచగుణాధిక్యమైనదిగాదు. క్రమముగా ఊర్ధ్వములో దేలికగా నుండును. ఈలాగున అంతస్థులుగాలేని సూర్యరథచక్రము పుష్కరద్వీపములో నున్న మానసోత్తర పర్వతమున కంటజాలదు. కాబట్టి యొకదానికొకటి ఉపరిలో అంతస్తులుగానున్నవి. ఈద్వీపములు మనదేహముతో సరిపోల్చినప్రదు అన్నియు సమానపరిధులుగ నెట్లుండును? ఈద్వీపములు దూరదర్శన యంత్రముల కందజాలని దూరములోనున్నవి. హిమము మధ్యలోనున్నది. మనహిమాలయపర్వత

మునకు మంచుగడ్డ లీపర్వతమునకుఁ బైనుండియే పడుచున్నవి. స్వర్గగంగయు
హిమాలయోన్నత శిఖరముల పైననే జలపాతముగఁ బడుచుండును. దీనినే గంగో
త్తరి శిఖరమని పిలుతురు నేటివైజ్ఞానికులు తుదకు హిమాలయపర్వతాగ్రోన్నత
శిఖరమువఱకు జూడఁగలరెరి. ప్రత్యక్షములోనున్న హిమాలయ శిఖరమునే
చూడఁజాలని వారలు కర్మచక్షుస్సామర్థ్యముకాని కేవల హిమస్వరూపమావరించి
అడ్డముగా దట్టముగానున్న ద్వీపాదులను లోకాదులనెట్లు చూడగలరు. భగవ
చ్ఛక్తితో అచింత్యచింతనముగనున్నది. పరిభ్రమణతో లవణసముద్రమే దాట
నివ్వక క్రిందికిఁద్రోసి ప్రారంభస్థలమునకే చేర్చునుగాని దాటనివ్వదు. మనకుఁ బైన
కేవలహిమవంతలోకము. అచ్చటికిఁబోవులోపలనే మనస్థూలపృథివీ శరీరములు
శీతలముతో బద్దలగును. ఏబదికోట్లయోజనముల విస్తీర్ణభూమియనియనగా
భూరాది సత్యలోకాంతముపఱకుఁగల భువనకోశమంతయుఁజేరును. గమ్యస్థాన
మంతయును భూమియే. ఆలోకాదులకును లోకప్రజలకును మనకును సర్వవిష
యాములందును సామ్యము లేదు. అవి సిద్ధభూములు. మనలోకాదులవలెఁ బంటల
బండించునట్టి భూములుగావు. అవి కేవల తపోలోకములు. తపస్సుతో ధ్యానాది
యోగాదులతోఁ బరమేశ్వరుని మెప్పించి మనోభీష్టములను బొందునట్టివి. వారి
దేహాదులు ఆయువులందు సుఖాదులందు గుణములందు మనకంటె అతీతములు.

మేరుపర్వతమునకు దక్షిణదిశలోనే మేఘ సంచారమున్నది కాని మేరువున
ఉత్తరదిశలో లేదు. మనకుఁ బూర్వసముద్రమునుండి పశ్చిమ సముద్రము
నకు వెళ్లుచు మరలఁ బశ్చిమమునుండి పూర్వునకును నలుదిశల కోణములకుమాత్రమే
మేఘములు తిరుగునట్లు కనఁబడుచుండును. మేఘమండలము మనకెన్నోనూర్ల
యోజనములపై నున్నది. అటుపైన లోకాదులలో మేఘములే లేవు. ఇందుకు మన
పంచాంగములలోఁగల మేఘోత్పత్తిని జూచిన సందేహముతీరును. పృథివికిఁ గార
ణము జలము. జలోష్ణములతో జలములోని స్థూలాంశము ఘనీభవించి కఠినత్వ
మెందును. ఈజలగుణానుసారముగఁ బృథివీ గుణమేర్పడును. కడపటిదియగు లవణ
సముద్రముతో గలిగినది మన యంత్యభూమిగాన దాని గుణాదులటునే యుండును.
ఇది అంత్యభూమి. ఇటులనే లవణసముద్రముపైనున్న సముద్రముల గుణాదుల
ననుసరించి నాయా ద్వీపాదులుండును. ఉపరి సముద్రములుత్తమ ధాతురూప గుణా
దులతో నున్నందుచేత నాద్వీపాదులు సహితము మనభూమికంటె నతిశయరూప
గుణాదులతోనున్నవి. తుదకు పుష్కరద్వీపము అన్నిటినిమించి సర్వాధిక్యతతో

నున్నది. దీనిపైన కేవల శుద్ధోదక సముద్రమున్నది. ఇది మనకు వాడుకలో నున్న శుద్ధోదకముగాదు. వేదములోఁ జెప్పఁబడు "ఆపోవా ఇదమ్ సర్వం" అనెడి మంత్రమునఁ జెప్పఁబడిన శుద్ధోదకము. ఇది సర్వకారణ శుద్ధమూల, దివ్యజలము. ఇది వర్షోదకముగాదు. దివ్యసృష్టిలోఁజేరినది. ఇది శ్రీమన్నారాయణ స్వరూపాంశము. అందుచేత పుష్కరద్వీపమత్యుత్తమమై బ్రహ్మకు స్థానముగ నున్నది. మన సముద్రము భూమియుఁ గడపటివి. అవి నిస్సారములు. ఇందుకు దాని గుణములే దృష్టాంతము. సప్తసముద్రములు సప్తద్వీపములు మనదేహములోని సప్తధాతువుల గుణాదులవలెనున్నవి. సప్తసముద్రము లావరించి వాటి గుణాదుల ననుసరించినవై సప్తద్వీపములేర్పడెను. మన దేహములోను సప్తధాతువులు సప్తద్రవరూపముగను, ఘనీభవించిన సప్తస్థూల పదార్థములుగనున్నవి. ఇవి గుణాదుల ననుసరించిన స్థూల, సూక్ష్మ, కారణరూపములతోనున్నవి. వివరించినచో విపులమేయగును. ఈలాగునఁ దెలియుటే వేదభూగోళాశయము. సప్తధాతువులెటుల నొకదానికంటె నొకటి ఊర్ధ్వములో మనదేహములోనున్నవో యటులనే బ్రహ్మాండవిశ్వములో ద్వీప సముద్రములు నొకదానికొకటి ఊర్ధ్వములోనున్నవి. మనభూమివలె మిగతభూతాదులలో నెంతమాత్రముండదు. ఇది మార్పులతోఁ దత్త్వస్వరూపములతో అంశాంశముగఁ దన్మాత్రాస్వరూపముతో నుండును. మనపృథివీ లోకములోఁగల చరాచరజీవరాసులు జలప్రధానముతో జీవవంతములుగను, జలభూతములో తేజఃప్రధానముగను, తేజోలోకములో వాత ప్రధానముగను, వాయులోకములో ఆకాశగుణ శబ్దప్రధాన ప్రతీతిగనుండును. అచ్చట కార్యక్రియారూప గుణాదులుసహిత మటులనేయుండును. వీటిననుసరించి కర్మ, భక్తి, జ్ఞాన వైరాగ్యాదులుండును. కాబట్టి మనభూమి కేవలకర్మలోకము. జలతేజోభూతలోకములు భక్త్యుపాసనా లోకములు. తదూర్ధ్వములోనున్న వాయ్వాకాశ లోకాదులు జ్ఞానవైరాగ్య సమాధిలోకములు. తుదకన్నియు శబ్దప్రణవరూపమేయగును. అందుచేత ఆది భూతజనితశబ్దము ప్రతిభూతమునందుఁ బ్రధానముగనున్నది మరల నుత్పత్తికావలసినచో దీనిమూలముతోనే క్రమముగా అధోగతిగానగును. అందుచేతఁ బ్రణవము సర్వమూలవాచక ప్రధానోపాస్యముగ నున్నదని వేదములోఁ దెలుపఁబడినది. ఈశబ్దముస్థూలములందు బాహ్యముగను సూక్ష్మాదులందు అంతరముగనుండి తుదకు స్వస్వరూపమున లీనమగును. ప్రతిభూతమునందును తేజస్సుప్రధానముగ నుండును. ఈ తేజస్సు భూతాదులలో భూతతేజస్సుగను భూతాతీతముతో ఆత్మస్వతేజస్సుగ

నిలుచును. దీనిననుసరించి మనపృథివియందు అగ్నితేజస్సున్నది. ఇదిరాత్రిలం దెక్కువగాఁ బ్రకాశించును. పగలు సూర్యతేజస్సుతో జీవులకుగోచరింపదు రాత్రిలందుఁ బత్తులు భూమిపైవ్రాలవు. చెల్లపైననేయుండును. ఇందుకుఁగారణము భూమియందుఁగల అగ్నితేజస్సే. ఖగోళశాస్త్రములో భూమినిఁగూడ ఉపగ్రహముక్రిందఁజేర్చిరి. గ్రహములు తేజస్సంబంధములు. ఈతేజస్సుల కనేక పర్యాయనామములాయాలోకాదుల ననుసరించి క్రాంతులనియు దీప్తులనియు మరీచికలనియు నక్షత్రములనియు విద్యుత్తులనియుఁ గిరణములనియు మయూఖములనియుఁ గలవు.

—o—

## సప్తద్వీపవిషయం - జంబూద్వీపము.

శ్రీమద్భాగవతం - అధ్యా. ౧౬ - పుట. ౪౩౧ - స్కంధం. ౫

రాజాః - ఉక్తస్త్వయా భూమండలాయామవిశేషో యావదాదిత్యస్తపతి యత్ర యత్ర చాసౌ జ్యోతిషాంగణైశ్చంద్రమా వాసహదృశ్యతే- తత్రాపి ప్రియవ్రతరథ చరణపరిఖాతైస్సప్త సింధవ ఉపక్లుప్తాః॥ ౧ ॥ యత ఏతస్యాస్సప్తద్వీప విశేషవికల్పస్త్వయా భగవన్ ఖలుసూచితః॥ ౨ ॥ ఏతదేవాఖిల మహం మానతో లక్షణతశ్చసర్వం జిజ్ఞాసామి భగవతోగుణమయ ఏవ స్థూలరూప ఆవేశితం మనో హ్యగుణేపి సూక్ష్మతమ ఆత్మజ్యోతిషి పరేబ్రహ్మణి భగవతి వాసుదేవాఖ్యే సాక్షాత్సమావేశితం తదుహైతద్గురోర్హార్హస్యాను వర్ణయితు మితి॥ 3 ॥

శ్రీశుకః - నవైరాజన్మహాభగవతో మాయాగుణవిభూతేః స్థానవిశేషాణాం నామరూపతః కాష్ఠాం మనసావచసా- వాధిగంతు మలం విబుధాయుషాపి పురుషస్తస్మాత్ప్రాధాన్యేనైవ భూగోళవిశేషం నామరూప లక్షణతో వ్యాఖ్యాస్యామః॥ ౪ ॥

—♦ ఇళావృతవర్షం. ♦—

యోవాయం ద్వీపః కువలయకమలకోశాభ్యంతరకోశో నియుతయోజన విశాలస్సమవర్తులో యథాపుష్కరపత్రం - యస్మిన్నవవర్షాణి నవయోజన సహస్రాయామాన్యష్టభిర్మర్యాదా గిరిభిస్సువిభక్తాని భవంతి॥ ౫ ॥

## —♦ మే రు ప ర్వ త ము: ♦—

ఏషాంమధ్యే ఇళావృతం నామాభ్యంతరంవర్షం - యస్యనాభ్యామవస్థితస్స ర్వ తస్సౌవర్ణః కులగిరి రాజో మేరుః - ద్వీపాయామ సమున్నాహః కర్ణికాభూతః - కువలయ కమలస్య మూర్ధని ద్వాత్రింశత్సహస్రయోజన వితతో మూలేషోడశ సహస్రయోజన విస్తారవత్యాం భూమ్యాం ప్రవిష్టః॥ ౬ ॥ ఉత్తరోత్తరే ణేళా వృతం నీలః శ్వేతః శృంగవానితి త్రయోరమ్యక హిరణ్మయ కురూణాం త్రయా ణాం వర్షాణాం మర్యాదాగిరయః ప్రాగాయతాః ఉభయతః క్షారోదావధయో ద్విసహస్రం పృథవ ఏకైకశః పూర్వస్మా త్పూర్వస్మా దుత్తరోత్తరో దశాం శాధికాం శే‍ౖర్ఘ్య ఏవహ్రసంతి॥ ౭ ॥ ఏవందక్షిణే నేళావృతం నిషధో హేమ కూటో హిమాలయ ఇతిప్రాగాయతాః యథానీలాదయోఽయుత యోజనోత్సేధా హరివర్ష కింపురుషవర్ష భారతవర్షాణాం యథాసంఖ్యః ౮ ॥ తథైవేళావృత మపరేణ చ మాల్యవద్గంధ మాదనావా నీల నిషథాయతా ద్విసహస్ర పృథూ కేతుమాల భద్రాశ్వయోస్సమానం విదధాతే॥ ౯ ॥

## —♦ మే రు వి ష యం. ♦—

మందరో మేరుమందరః సుపార్శ్వః కుముదః॥ ఇత్యయుత యోజనవిస్తారో న్నాహాః మేరోశ్చతుర్దిశ మవష్టంభ గిరయ ఉపక్లుప్తాః॥ ౧౦ ॥ చతుర్ష్వపి తేషుచూత జంబూ కదంబన్యగ్రోధాశ్చత్వారః పాదపప్రవరాః పర్వత కేతవ ఇవాధిక శతసహస్ర యోజనో న్నాహాస్తావ ద్విటపవితతయః॥ ౧౧ ॥ శతయోజన పరీణాహాః హ్రదా శ్చత్వారః పయోమధ్విక్షు రసమృష్టబలాః యదుపస్పృశ ఉపదేవ గణా యోగై శ్వర్యాణి స్వాభావికాని భరతవర్షం ధారయంతి॥ ౧౨ ॥ దేవోద్యానానిభవంతి చత్వారి నందనం చైత్రరథం వైభ్రాజకం విశ్వతోభద్రమితి యేష్వమర పరిబృఢాః సహాసుర లలనా లలామ యూథపతయః॥ ఉపదేవ గణైరుప గీయమాన మహిమా నః కిల విహరంతి॥ ౧౩ ॥ మందరోత్సంగే "ఏకాదశ శతయోజనోత్తుంగ" దేవ చూత శిరసోగిరిశిఖరే స్థూలాని ఫలాన్యమృతకల్పాని పతంతి॥ ౧౪ ॥ తేషాంవిశీర్య మాణానామతి మధుర సురభిగంధి బహుళారుణ రసోదేనారుణోదా నామనదీ మం దరగిరి వర శిఖరాన్నిపతంతీ - పూర్వేణేళావృత ముపప్లావయతి - యదుపజోషణా ద్భవాన్యా అనుచరీణాం పుణ్యజన వధూనాము వయవస్పర్శ సుగంధవాహో వాతో దశయోజనం సమంతాదనువాసయతి॥ ౧౫ ॥ ఏవం జంబూఫలానా మత్యుచ్చ నిపాత విశీర్ణానామనస్థి ప్రాయాణామిభకాయనిభా నాం రసేన జంబూనదీ మేరు

## (8) జంబూద్వీపచిత్రపటమునగల సంఖ్యలవివరము.

### పెద్ద సంఖ్యల వివరము.

1 మేరూపరిపీఠము, 2 లవణసముద్రము, 3 ఉత్తరకురువర్షము, 4 శృంగ పర్వతము, 5 హిరణ్మయవర్షము, 6 శ్వేతపర్వతపజ్త్రి, 7 రమ్యకవర్షము, 8 నీల పర్వతపజ్త్రి, 9 మధ్యలో నిలావృతవర్షము, 10 మేరుపర్వతమూలము, 11 తూర్పున గంధమాదనపర్వతపజ్త్రి, 12 భద్రాశ్వవర్షము, 13, 14 దక్షిణమున నిషధపర్వత పజ్త్రి, 15 హరివర్షము, 16 హేమకూటపర్వతపజ్త్రి, 17 కింపురవర్షము, 18 హిమాచలపజ్త్రి, 19 భారతవర్షము, 20 పశ్చిమమున మాల్యవంతపర్వతపజ్త్రి, 21 కేతుమాలవర్షము.

ఇచ్చట 20, 21 సంఖ్యలు పశ్చిమదిశలోఁ బొరబాటుతో వేయలేదు.

### మేరూపరిపీఠమునఁగల యష్టదిక్పాలకుల పురములఁదెలుపు చిన్న తెలుఁగు సంఖ్యలున్నవి.

౧ తూర్పున నమరావతి, ౨ ఆగ్నేయమునఁ దేజోవతి, ౩ దక్షిణమున సంయమి, ౪ నైఋతిదిశఁ గృష్ణాంగన, ౫ పశ్చిమమున శ్రద్ధావతి, ౬ వాయువ్యమున గంధవతి, ౭ ఉత్తరమున మహోదయము, ౮ ఈశాన్యమున యశోవతి.

### మేరూపరిమధ్యలో శాతకౌంభియను బ్రహ్మపురిగలదు. దాని చతుర్దిక్కుల నుండి నాల్గుశాఖలుగఁ బడుచున్న గంగాజలపాత నామముల వివరము.

౧ తూర్పున భద్రాశ్వవర్షమునఁబడుచున్న సితాగంగ, ౨ దక్షిణమున నలకనంద. ఇదియే మన భారతవర్షములో హిమాచలమువిూఁదపడు గంగ, ౩ పశ్చిమమునఁ గేతుమాలవర్షమునఁ బడుచున్నది చాక్షుషగంగ, ౪ ఉత్తరమునఁగురువర్షమునఁబడుచున్నది భద్రియనుగంగ.

### మధ్యలోనున్న యిలావృతవర్షములోఁగల సంఖ్యలవివరము.

### మేరుపర్వతమూలమునఁ జతుర్దిక్కులందుఁగల మహాపర్వతములు ౪.

సంఖ్యలు చిత్రించలేదు. తూర్పుదిశన మందరపర్వతము, దక్షిణదిశ మేరుమందరము, పశ్చిమమున సుపార్శ్వపర్వతము, ఉత్తరమున కుముదపర్వతముగలవు.

### ఈ మహాపర్వతములఁపైనఁగల వృక్షరాజము ౪.

౧ తూర్పున మందరపర్వతమునఁ జూతవృక్షము, దక్షిణమున మేరుమందర

పర్వతమున జంబూవృక్షము, పశ్చిమమున సుపార్శ్వపర్వతమునఁ గదంబవృక్షము. ఉత్తరమునఁ గుముదపర్వతమున న్యగ్రోధవృక్షముకలవు.

ఈవృక్షరాజముల పండ్లరస ప్రవాహముల వివరము ౪.

తూర్పున చూతవృక్షఫలరస ప్రవాహమునదైన యరుణోదయనదికలదు. దక్షిణమున జంబూవృక్ష ఫలరస ప్రవాహమునదైనది జంబూనది. పశ్చిమమునఁ గదంబవృక్ష ఫలరస ప్రవాహ మధురధారలుఁగలవు. ఉత్తరమున న్యగ్రోధవృక్ష ఫలరస ప్రవాహసంబంధ శతవలిశధారలుగలవు. వీటికిని సంఖ్యలు వేయలేను.

ఈమహాపర్వతములందుఁగల మహాహ్రదములు ౪.

౧ తూర్పున క్షీరహ్రదము, ౨ దక్షిణమున మధురహ్రదము,
పశ్చిమమున ఇక్షురసహ్రదము, ఉత్తరమున నిర్మలజలహ్రదము గలవు.

మహావనములు ౪.

తూర్పున నందనవనము, దక్షిణమున చైత్రరథవనము
పశ్చిమమున వైభ్రాజవనము, ఉత్తరమున విశ్వతోభద్రవనముకలవు.

మేరువునకుఁజుట్టునుగల పర్వతములు ౮.

తూర్పున జఠర, దేవకూటపర్వతములును, దక్షిణమునఁ గైలాస, కరవీర పర్వతంబులును, పశ్చిమమునఁ బవన, పారియాత్ర పర్వతములును, నుత్తరమున శృంగ, మకరపర్వతములునుగలవు ఇవి మేరువునకుఁ బ్రదక్షిణములుగ భద్రితకైయున్నవి. వీటికిని సంఖ్యలులేవు.

పైవానిఁ జుట్టుఁగల పర్వతములు ౧౮.

తూర్పునఁ గరంగ కురర, కుంభ, వైకంకత, త్రికూటపర్వతములును, దక్షిణమున శిశిర, పతంగ, రుచక, నిషధపర్వతములును, పశ్చిమమున సితివాస, కపిల, శంఖ, వైదూర్యపర్వతములును, నుత్తరమున చారువిహంగ, ఋషభ, నాగ, కాలాంజన, నారదపర్వతములునుగలవు. వీటికిని సంఖ్యలులేవు. కొన్నిటినిఁదెలుఁగు లిపిలో వ్రాయలేదు. బాలబోధలిపిలోనున్నవి. మిగత విశేషములు జంబూద్వీపమునఁ జూడఁదగును.

మందర శిఖరాదయుతయోజనాదవనీతలే పతతి॥ ౧౬ ॥ దక్షిణేనాత్మానం యావదిళావృత ముపస్యందయతి - తాసదుభయో రపిరోధసోర్యామృత్తికా తద్రసేనానువిధ్యమానాచ వాయ్వర్క సంయోగవిపాకేన సదామరలోకాభరణం - జాంబూనదంనామ సువర్ణంభవతి యదుహవావ విబుధాదయస్సహ యువతిభిర్మకుటకటకకటిసూత్రాద్యాభరణం రూపేణఖలు ధారయంతి॥ ౧౭ ॥ యస్తుమహాకదంబస్సుపార్శ్వ నిరూఢస్తస్య కోటరేభ్యోవినిస్సృతాః పంచాయామ పరిణాహాః పంచమధుధారాః - సుపార్శ్వ శిఖరాత్పతంత్యో పరేణాత్మాన మిలావృత మనుమోదయంతి - యావ్యుపయుంజానానాం ముఖనిర్వాసితో వాయుస్సమంతాచ్ఛతయోజన మనువాసయతి॥ ౧౮ ॥ ఏవంకుముద నిరూఢో యశ్శతవల్శోనామవటిస్తస్య స్కంధేభ్యో నీచీనాః పయోదధిఘృత మధుగుడాన్నాద్యంబరశయ్యాసనాభరణాదయ స్సర్వఏవ కామదుఘానదాః - కుముదాగ్రాత్పతం తస్తముత్తరేణేళావృత ముపభాజయంతి॥ ౧౯ ॥ యానుపజోషమాణానాం కదాచిదపి ప్రజానాం వళిపలితక్లమ స్వేదదౌర్గంధ్య జరామరణామయామృత్యుశీతోష్ణవైవర్ణ్యోప సర్గాదయస్తాప విశేషానభవంతి - యావజ్జీవం సుఖం నిరతిశయమేవకురంగ కురర కుసుంభవైకంకత త్రికూట శిశిర పతంగరుచక నిషధ శితివాస కపిలశంఖ వైడూర్య చారువిహంగర్షభ నాగకాలాంజననారదా దయోమేరోః కర్ణికాయా ఇవకేసర భూతాః - మూలదేశే పరిత ఉపక్లుప్తాః - జఠర దేవకూటౌ మేరుం పూర్వేణాష్టాదశయోజన సహస్ర ముదగాయతౌ ద్విసహస్ర పృథూత్తుంగౌ భవతః - ఏవమపరేణ పవన పారియాత్రౌ దక్షిణేనకైలాస కరవీరౌ ప్రాగాయతౌ - ఏవముత్తరస్త్రిశృంగ మకరావష్టభిరేతైః - పరిశ్రితోఽగ్నిరివ పరితశ్చకాస్తికాంచనగిరిః॥ ౨౦ ॥

—♦ ఆ శ్వా స ాం త. ♦—

మేరోర్మూర్ధ్ని భగవత ఆత్మయోనేర్మధ్యత ఉపక్లుప్తాం పురీమయుత యోజన సాహస్రీం సమచతురశ్రాం శాతకౌంభీం వదంతి తామను పరితోష్ట లోకపాలానాం యథాదిశం యథారూపం తురీయమానేన పురోష్టావుపక్లుప్తాః। ఇతి శ్రీమద్భాగవతే - పంచమస్కంధే - షోడశోధ్యాయః॥

శ్రీశుకః - తత్రహ భగవతస్సాక్షాద్యజ్ఞలింగస్య విష్ణోర్విక్రమతో వామ పాదాంగుష్ఠ నఖనిర్భిన్నోర్ధ్వాండకటాహ వివరేణాంతః ప్రవిష్టాయా బాహ్య జలధారా, తచ్చరణ పంకజావనే జనారుణ కింజల్కోపరంజితా ఖిలజగదఘమలాప హోప స్పర్శనామలా, సాక్షాద్భగవత్పదీత్య నుపలక్షిత వచోభి

ధీయమానాఽతిమహతా కాలేనయుగ సహస్రోపలక్షణేన దివో మూర్ధన్యవతతార॥ ౧॥
యత్తద్విష్ణు పదమాహుః॥ ౨ ॥ యత్రహవావ. వీరవ్రతఔత్తానపాదిః పరమభా
గవతోఽస్మత్కులదేవతా చరణారవిందోదక మితియామనుసవనం వర్ధమాన భగవ
ద్భక్తియోగేన దృఢం క్లిద్యమానాంఽతర్హృదయ ఔత్కంఠ్యవివశా మీలితలో
చన యుగళకుట్మల విగళితామల బాష్పకళ యాఽభివ్యజ్యమాన రోమపులక కులకో
ధునాపి పరమాదరేణ శిరసాబిభర్తి॥ ౩ ॥ తతస్సప్త ఋషయస్తత్ప్రభావాభిజ్ఞా
యాం ననుతపస ఆత్యంతికీ సిద్ధిరేతావతీ వేతి భగవతి సర్వాత్మ నివాసుదేవేఽన
పరత భక్తియోగలాభే నైవోపేక్షితాన్య పురుషార్థాత్మ గతయోముక్తి మివాగ
తాం ముముక్షవఇవస బహుమాన మద్యాపి జటాజూటై రుద్వహంతి॥ ౪ ॥ తతో
ఽనేక సహస్రకోటి విమానానీక సంకులదేవయానే నావతరం తీందు మండలమా
వార్య బ్రహ్మసదనేని పతతి॥ ౫ ॥ తత్రచతుర్ధాభిద్య మానా చతుర్భిర్నామభిశ్చ
తుర్దిశమ భిస్యందంతీ నదనదీపతి మేవాభిని విశతి, సీతా, లకనందా, చక్షుర్భద్రే
తి॥ ౬ ॥ సీతాతు బ్రహ్మసదనా త్కేసరావష్టం భాదిగిరి శిఖరేభ్యః కుముదకుర
రాది శిఖరాణ్యతీత్యా ధోధః ప్రస్రవంతీ గంధమాదన మూర్ధసుపతిత్వాంతరేణ
భద్రాశ్వవర్షం ప్రాచ్యాందిశి క్షారసముద్ర మభిప్రవిశతి॥ ౭ ॥ ఏవంమాల్యవచ్ఛి
ఖరాన్నిష్పతంతీ తతఉపరతవేగా కేతుమాల మభితశ్చక్షుః ప్రతీచ్యాందిశి సరిత్పతిం
ప్రవిశతి॥ ౮ ॥ భద్రాచోత్తరతో మేరుశిఖరాన్నిష్పతంతీ - సాగిరిశిఖరాద్గిరి మతి
హాయ శృంగవత శ్శృంగాదవస్యందమానా మానసోము త్తరాంస్తు కురూనభిత ఉదీ
చ్యాం దిశిలవణార్ణవం ప్రవిశతి॥ ౯ ॥ తథేవాలకనందా దక్షిణేనతు బ్రహ్మసదనా
ద్బహూనిగిరి కూటాన్యతిక్రమ్య హేమకూట హిమకూటాన్యతి రభస తరంరంహసా
లుఠంతీ భారతమభివర్షం కర్మక్షేత్రం దక్షిణస్యాం దిశి జలధిమను ప్రవిశతి॥ ౧౦ ॥
అన్యేచనదానద్యశ్చ వర్షేవర్షే సంతి బహుశో మేర్వాదిగిరిదుహిత రశ్శత శహస్ర
శః॥ ౧౧ ॥ అత్రాపి జంబూద్వీపే భారతమేవవర్షం కర్మక్షేత్రమన్యాన్యష్టవర్షాణి
స్వర్గిణాం పుణ్యశేషోపభోగస్థానాని భౌమస్వర్గపదాని వ్యపదిశంతి॥ ౧౨ ॥ ఏతేషు
పురుషాణామయుత పురుషాయుర్వర్షాణాం దేవకల్పానాం నాగాయుత ప్రాణానాం
వజ్రసంహనన బలవయోమోద ప్రముదిత మహాసౌరత మిథున వ్యవాయాపవర్గైక
వర్షాయుధృతైక గర్భకళత్రాణాం త్రేతాయుగసమః కాలోవవర్తతే॥ ౧౩ ॥
యత్రహదేవ పతయస్స్వైస్స్వైర్గణనాయకై ర్విహితమహార్హణా స్సర్వర్తు కుసుమ
స్తబకఫలకిసలయ శ్రియానమ్యమాన విటపలతా విటపిభిరుప శుంభమాన రుచిర

కాననాశ్రమా యతన వర్షగిరి ద్రోణీషు తథా చామల జలాశయేషు వికచ వివిధ నవ వనరుహామోద ముదిత రాజహంస జలకుక్కుట కారండవసారస చక్రవాకాదిభి ర్మధుకర నికరాకృతిభిరుప కూజితేషు జలక్రీడాది భిర్విచిత్ర వినోదైస్సులలిత సుర సుందరీణాం కామకలిత విలాసహాసావలోకా కృష్టమనో దృష్టయః స్వైరం కిలవిహ రంతి॥ ౧౪॥ నవస్వపివర్షేషు భగవన్నారాయణో మహాపురుషః పురుషాణాం తదనుగ్రహాయాత్మ తత్త్వవ్యూహేనాత్మనాద్యాపి సన్నిధీయతే। ౧౫॥ ఇళావృతే తు భగవాన్ భవఏకఏవ పుమాన్నహ్యన్యస్తత్రాపరః ప్రవిశతి భవాన్యాశ్శాప నిమిత్తానభిజ్ఞో యత్ప్రవిశ్య కశ్చనసానుచర స్త్రీస్వభావంగతః - తత్పశ్చాద్వక్ష్యామి॥ ౧౬॥ భవానీనాథః స్త్రీగణార్బుద సహస్రైరవరుధ్యమానో భగవతశ్చతు ర్మూర్తే ర్మహాపురుషస్య తురీయాం మహాతామసీం మూర్తిం ప్రకృతి మాత్మనస్సం కర్షణసంజ్ఞామాత్మని సమాధిరూపేణ సన్నిధాప్యైత దభిగృణన్ భవఉప ధారతి॥౧౭

శంకరః - ఓంనమో భగవతే వాసుదేవాయ సర్వగుణసంఖ్యానా యావ్యక్తా యనమ ఇతి॥ ౧౮॥ భజేభజన్యారణ పాదపంకజం భగస్యకృత్స్నస్యపరం పరాయణం - భక్తేష్వలంభావిత భూతభావనం భవాపహం త్వాం భవభావ మీశ్వరం॥ ౧౯॥ నయస్యమాయాగుణ చిత్తవృత్తి భిర్నిరీక్షతో హ్యణ్వపిదృష్టిరజ్యతే। ఈశేయథా నోజితమన్యు రంహసాం కస్తం నమస్యేత జిగీషురాత్మనః॥ ౨౦॥ అసద్దృశో యః ప్రతి భాతిమాయయా క్షీబేవ మధ్వాసవ తామ్రలోచనః। ననాగవధ్వోఽర్హణ ఈశిరే హ్రియా యత్పాదయోః స్పర్శన ధర్షితేంద్రియాః॥ ౨౧॥ యమాహురస్యస్థితిజన్మ సంయమం త్రిభిర్విహీనం యమనంత దృష్టయః। నవేదసిద్ధార్థ మివక్వచిత్ స్థిత భూ మండలంమూర్ధసహస్రధామసు॥ ౨౨॥ యస్యాద్య ఆసీద్గుణ విగ్రహో మహా న్విజ్ఞానధిష్ణ్యో భగవానజః కిల। యత్సంభవోహం త్రివృతాస్వతేజసా వైకారికం తామసమైంద్రియంసృజే॥ ౨౩॥ ఏతేవయం యస్యవశేమహాత్మనః స్థితాశ్శకుంతా ఇవసూత్రయంత్రితాః। మహానహం వైకృత తామసేంద్రియాః సృజామసర్వే యద నుగ్రహాదిదం॥ ౨౪॥ యన్నిర్మితాం కర్హ్యపి కర్మపర్వణీం మాయాం జనోయం గుణసర్గమోహితః। నవేదవిస్తారణ యోగమపిజసా తస్మైనమస్తద్విలయో దయా త్మనే॥ ౨౫॥ ఇతి శ్రీమద్భాగవతే - పంచమస్కంధే సప్తదశోధ్యాయః

—♦—

## ఇలావృతవర్షము.

జంబూద్వీప విస్తారము లక్షయోజనములు. ఇది తామరాకువలె వర్తులమై యితరద్వీపములకు మూలాధార ద్వీపముగనున్నది. ఇది తొమ్మిదివర్షములుగ భాగింపఁబడెను. (౧) ఇలావృతవర్షము. (౨) భద్రాశ్వవర్షము, (౩) భారత వర్షము. (౪ కింపురుషవర్షము, (౫) హరివర్షము, (౬) కేతుమాలవర్షము, (౭) రమ్యకవర్షము, (౮) హిరణ్మయవర్షము. (౯) కురువర్షము. ఇట్లుసదసచ్ఛాయల సర్గప్రతిసర్గలచే మొదట నవవిధముగా విభజింపబడెను. ప్రతివర్షవిస్తారము తొమ్మిదివేలయోజనములు. ఇందు ప్రతివర్షమునకును మధ్యతో నెల్లలుగ సీమాపర్వతములుగలవు. ఈజంబూద్వీపమధ్యలో ఇలావృతవర్షమను నది కర్ణికగాఁ దొమ్మిదివేల యోజనముల విస్తారముతో నాలుగుమూలలుగ భూస్వర్గమువలె మహావైభవోపేతముగ నున్నది. కొందరు స్వర్గలోకపుణ్యక్షయముతో నీ యిలావృత వర్షమందుజన్మించి మరల మనభూమియందు శేషపుణ్యముతో శ్రీమంతుల యింటఁగాని సదాచారసంపత్తిగల వారింటియందుఁగాని యోగులయింటఁగానిజన్మింతురని పురాణప్రమాణములున్నవి. ఈవర్షమధ్యలోఁగల పర్వతముల కధిపతియగు మేరుపర్వతరాజము కర్ణికవలె బంగారువలెఁ బ్రకాశించుచున్నది.

### —♦ మేరుపర్వతరాజము. ♦—

ఈపర్వతౌన్నత్యము ఆమూలాగ్రము లక్షయోజనములు. ప్రమాణము. వాయుపురాణము - అధ్యా. ౩౪ - భువనకోశవిన్యాసము - శ్లోకం ౫౦.

శ్లో॥ చతురాశీతి సాహస్ర ఉత్సేధేన ప్రకీర్తితః। ప్రవిష్టో షోడశాధస్తాద్విస్తృతస్తావదేవత్। సశరావస్థితఃపూర్వం ద్వాత్రింశన్మూర్ధ్ని విస్తృతః॥

ఈపర్వతమునకంటె నెత్తైన పర్వతమే లేదు. అందుచేత నీలోకములో సామెత "మహామేరువువలె" నున్నావని. దీని యడుగుభాగ విస్తారము చిన్నదిగఁ బదునారువేల యోజనములున్నది. భూమియందుఁ బదునారవేల యోజనములలోతుగఁ బాతుకొనియున్నది. భూమినుండి శిఖరమువరకు యెనుబదినాలుగువేల యోజనములు. ఇది యుపరిలోఁ గ్రమముగాఁ గొంచెము కొంచెము విశాలమగుచు చివరభాగము మూకుడువలె ముప్పదిరెండువేల యోజన విస్తారముతోనున్నది. దీని మధ్యలో బ్రహ్మపురి శాతకౌంభియను పేరుతోఁ బదివేల యోజనములు విస్తార

ముతో జతురశ్రమై యొప్పుచున్నది. దీని తూర్పుదిశయందు "అమరావతి"యను పేరతో నింద్రపురము రెండువేల యేడువందల యోజనముల వైశాల్యముతో నున్నది ఆగ్నేయదిశలోఁ "తేజోవతి"యను అగ్నిదేవునిపురము రెండువేలయేడువందల యోజనముల వైశాల్యముతో నున్నది. దక్షిణదిశలో యమునిపురమగు "సంయమినీ పురము" రెండువేల యేడువందల యోజనముల విస్తారమునన్నది. నైరృతిమూల యందు "కృష్ణాంగన" పురము రెండువేల యేడువందల యోజనముల విశాలముతో నిర్ఋతిపురమున్నది. పశ్చిమదిశలో "శ్రద్ధావతి"పురము రెండువేల యేడువందల యోజనముల వైశాల్యముతోనున్నది. ఇది వరుణపురము. వాయువ్యమూల"గంధవతీ" పురము రెండువేలయేడువందలయోజనముల విశాలముతోనుండును. వాయుపురము ఇదియే. ఉత్తరమున"మహోదయ"మను రెండువేలయేడువందలయోజనముల విశాలముకల గుబేరపురమున్నది. ఈశాన్యమూల "యశోవతి" యను పేర రెండువేల యేడువందల యోజనముల వైశాల్యముతో ఈశానపురమున్నది. స్వర్గపథగామిని యగు గంగానది ధ్రువమండలమగు విష్ణుపథమునుండి మేరువుపై మధ్యలోఁగల బ్రహ్మపురి సరస్సులోఁబడి నాలుగు శాఖలుగఁ దూర్పుదిశకును, దక్షిణదిశకును, పశ్చిమదిశకును, నుత్తరదిశకును వెళ్లి మహాజలధారలతో మేరువునకు నలువైపులఁ గలఁ క్రింది జంబూద్వీపమందుఁగల వర్షములలోఁబడి సముద్రములను జేరును. ఇంకను గంగవిషయ వివరముల క్రిందులో 258-వ పుటనుండీ చూడ వచ్చును. మేరుపర్వత మూలమునఁ దూర్పుదిశమందర పర్వతమిలావృత వర్షములోఁ బదివేల యోజనముల యెత్తుతో మేరువున కాధారముగ నున్నది. దక్షిణదిశ నిలావృత వర్షములో మేరుమందరమను పర్వతము పదివేలయోజనముల ఔన్నత్యముతో మేరుపర్వతమున కాధారముగ నున్నది. పశ్చిమదిశయందిలావృత వర్షములో సుపార్శ్వ పర్వతము మేరుపర్వతమూలమున ఆధారముగఁ బదివేల యోజనముల ఔన్నత్యముతో నున్నది. ఉత్తరమున నిలావృత వర్షములో మేరుపర్వతమూలమున ఆధారముగఁ గుముదపర్వతము పదివేల యోజనములు యెత్తున మేరువునకు నాలుగు దిశలయందు ఆధారపర్వతములుగ దైవనిర్మితములైయున్నవి. ఈనాలుగు పర్వతములందు గొప్ప ఫలవృక్షములున్నవి.

(౧) తూర్పుదిశయందుఁగల మందరపర్వతమునఁ జూతవృక్షము (మామిడి వృక్షము) పదునొకండువేల యోజనముల యెత్తుగల్గి నూరువేల యోజనముల పొడవుగ శాఖలతో నున్నది. దీనిఫలములు ఏనుగులను మించిన పరిమాణము నుండును.

ఈఫలములరసము అమృతతుల్యములైయుండును. ఆఫలములు బాగుగా పరిపక్వములై క్రిందఁబడి శిథిలములు కాగా వానివలన బ్రవహించు రసము మధురమై సుగంధముకలదై, మిక్కిలి యరుణకాంతుల నొప్పుచు "అరుణోద" యను నదీ రూపమునొంది మందర పర్వతశిఖరమునుండి క్రిందికిఁ బ్రవహించి ఇలావృతవర్ష పూర్వభాగమునంతయు దడుపుచు, అచ్చటి వారలను అమృతతుల్యులుగను సురభి సుగంధపరిమళ యుతులుగను ప్రకాశింపఁజేసి ధన్యులఁజేయును. ఈ యిలావృతమునందీ యరుణోదనదియందుఁ బార్వతీదేవి పరిచారికలతోఁగూడి యమృతతుల్య రసమును ద్రావి నూతన యౌవనవతియై సుగంధపరిమళముతో రంజిలుచుండును. ఈసుగంధవాసనలు పదివేల యోజనముల దూరము వ్రాకుచుండును. ఈపర్వతమునందుఁ జైత్రరథమను దేవోద్యానవముగలదు. ఈవనమునందు సురవరులు, దేవగంధర్వులు సంతతము గానము చేయుచు విహరించుచుందురు. ఇందు క్షీరహ్రదము కలదు. ఇది శతయోజన విస్తారముండును. ఇందులో స్నానాదులతోచేసి దేవగంధర్వులాదిగాఁ గలవారలు స్వభావసిద్ధములగు నణిమాద్యష్టైశ్వర్యములు గలిగి నిత్యానంద సంతుష్టులై వెలయుచుందురు

(౨) ఈమేరువునకు దక్షిణదిశలోఁగల మేరుమందర పర్వతమున గొప్పదియగు నొకజంబూవృక్షము పదునొకండువేల యోజనముల ఔన్నత్యముకలది. దీని శాఖలు నూరుయోజనముల పొడవుగలవి. ఈజంబూవృక్షముచేతనే దీనికి జంబూద్వీపమని పేరు. ఈజంబూవృక్షఫలములు గజశరీరములంత ప్రమాణముగలవై సూక్ష్మబీజములతోనుండును. ఆఫలములుపైనుండి క్రిందఁబడి శిథిలములైన రసప్రవాహము బ్రవహించుచున్నది. ఆప్రవాహమే జంబూనదియని పేరొందిి యిలావృత దక్షిణభాగమును దడుపుచున్నది. ఈనది యీలాగునఁ బ్రవహించుచున్నప్పు డుభయతీరములందును గలమన్ను తద్రసముతో సంయుక్తమై వాయ్వగ్ని (సూర్యకిరణ) సంయోగమువలన విపాకమునొంది సువర్ణమగుచున్నది. ఈజబూనదివలన గలిగినదిగనుకనే సువర్ణమునకు జాంబూనదమనెడి నామముగలిగెను. ఈ సువర్ణమును దేవతలు తమయువతీలలామలతోగూడ గిరీటములు, కడియములు, మేఖలాదులుగ నిర్మించుకొని సతతంబుధరించి ప్రకాశించుచున్నారు. ఈపర్వతమందు మధుహ్రదంబుగలదు. ఇది శతయోజనవిస్తారముగలదు. అందుస్నానపానాదులచే దేవగంధర్వాదిగణములు స్వభావసిద్ధములగు నణిమాద్యష్టైశ్వర్యములతోఁ బ్రకాశించుచున్నారు. ఇందువైభ్రాజమనెడు దేవోద్యానము

గలదు. అందు దేవతాలలామలు, సురవరసహితలై గంధర్వగణములు సంతతము తమమహిమలను మధురగీతాలాపములఁ బాడుచు సంతసంబున విహరించుచుందురు.

(3) మేరువునకు పశ్చిమదిశతో మూలమున సుపార్శ్వపర్వతమున, గొప్ప కదంబవృక్షరాజముగల ఇదియును పదునొకండు వేల యోజనములౌన్నత్యంబుగలది. దీనిమూలశాఖలు నూరుయోజనముల పరిమితి దీర్ఘములుగ వ్యాపించియుండును. ఈ వృక్షరాజమునుండి యైదు మధురధార లీసుపార్శ్వ పర్వత శిఖరమునుండి క్రిందికిఁ బ్రవహించుచు నిలావృత పశ్చిమభాగమును బరిమళింపజేయుచున్నవి ఈమధుర ధారలను బానముచేసినవారి ముఖపు సుగంధవాయువు శతయోజనదూరము వాఱికి పరిళమించుచుండును. ఇందు వైభ్రాజమును దేవోద్యానముగలదు. సురవరసహితులైన దేవతాలలామలు గంధర్వగణములు సంతతము తమ మహిమాతిశయములను మధురగీతాగానములతోఁ బాడుచు సంతసంబున విహరించుచుందురు. ఈ పర్వతమందు ఇక్షురసహ్రదము శతయోజన విస్తారముతోనున్నది. దీనియందు స్నాన పానాదులఁజేయు గంధర్వగణములు అణిమాద్యష్టైశ్వర్యములనుబొంది ప్రకాశించు చున్నారు.

(౪) మేరువునకుత్తరపార్శ్వమునఁ గుముదపర్వతమున గొప్పవటవృక్షరాజమున్నది. ఇది పదునొకండువేలయోజనముల యౌన్నత్యంబు కలిగియుండును. దీనిమూలశాఖలు నూరుయోజనములదూరము వ్యాపించియుండును. ఈవృక్షఫలములనుండి యుదయించునదులు పాలు, నెయ్యి, పెరుగు మధుయుక్తాన్నమువలె స్వాదురసముతోఁ బ్రవహించుచున్నవి. వీటిపానము అంబరళయ్యాసనాభరణాది వస్తువాంఛల దీర్చును. ఈనదులు కుముదపర్వత శిఖరమునునుండి క్రిందికిఁబ్రవహించి ఇలావృతవర్షోత్తరభాగంబుననున్న లోకులను సంతసింపఁజేయుచున్నవి. ఈనదులందు స్నానపానాదులఁజేయుటచే వారలయావజ్జీవమును వలీపలిత స్వేదదుర్గంధజరామరణ శీతోష్ణబాధలులేక సుఖవంతులైయొప్పుదురు. రోగద్వేషభయాదులుండవు ఇందు బర్హ్మలోదక హ్రదము శతయోజన విస్తారముతోనున్నది. స్నానపానాదులచేఁ బై సుఖములనే పొందుదురు. ఇందు విశ్వతోభద్రయను దేవోద్యానముకలదు.

ఈ మేరువునకుఁజుట్టను, (౧) కురంగము, (౨) కురరము, (3) కుంభము, (౪) వైకంకతము, (౫) త్రికూటము, (౬) శశిరము, (౭) పతంగము, (౮) రుచకము, (౯) నిషధము, (౧౦) సితివాసము, (౧౧) కపిలము, (౧౨) శంఖము, (౧3) వై(దూ)డూర్యము, (౧౪) చారుధిహంగము, (౧౫) ఋషభము

(౧౬) నాగము, (౧౭) కాలాంజనము, (౧౮) నారదము మొదలగు పర్వతములు కేసరములవలెఁ దనర్చుచున్నవి. మఱియు ౧ జఠర, ౨ దేవకూటపర్వతములు మేరువునకు దూర్పున వేయియోజనముల విస్తారముగను, పదునెనిమిది వేల యోజనముల దైర్ఘ్యముగలిగి రెండేసి వేలయోజనముల యున్నతముగలవై దక్షిణమునుండి ఉత్తరదిశకువిస్తరించి యొప్పుచున్నవి. దైర్ఘ్యమునందును, నౌన్నత్యమునందును, వైశాల్యమునందును, బైపర్వతసమానములగు, ౩ పవన ౪ పారియాత్ర పర్వతములు మేరువునకు బశ్చిమభాగంబుననుండు. దక్షిణంబున గ్రమముగాఁ దూర్పునకు విస్తరించుచున్న ౫ కైలాస ౬ కరవీరపర్వతములును, ఉత్తరంబునఁ ౭ త్రిశృంగ ౮ మకరపర్వతములును గలవు. ఈయెనిమిదిపర్వతములచేఁ బరివృతమైన మేరుపర్వత మువరిస్తరణములచేఁ బరివృతమగు నగ్నిహోత్రిని చందమునఁ బ్రకాశించుచున్నది.

ఇలావృతవర్షమునకుఁదూర్పుదిశ యెల్లగా సీమాపర్వతముగ గంధమాదన పర్వతమున్నది. ఈపర్వతము దక్షిణదిశనుండి ఉత్తరమువరకు దీర్ఘంబుగా రెండు వేలయోజనములపొడవుగలిగి ఉత్తరముననున్న సీమాపర్వతమగు నీలపర్వతమును దక్షిణమున సీమాపర్వతమగు నిషధపర్వతమునుఁ నంటి ఈరెంటిమధ్యలోఁదూర్పునఁగల భద్రాశ్వవర్షమునకును నిలావృతవర్షమునకును మధ్యలోనున్నది. ఈవర్షమువరకుఁ బశ్చిమమున ఎల్లగా సీమాపర్వతముగ మాల్యవంతపర్వతమున్నది. ఈపర్వతము నైఋతిమూలనుండి వాయువ్యమూలకు దీర్ఘముగ రెండువేలయోజనముల పొడవుగ ఉత్తరముననున్న సీమాపర్వతమగు నిషధపర్వతమునంటియున్నది. పశ్చిమమునఁగల కేతుమాలవర్షమునకును యిలావృత వర్షమునకు మధ్యలో నిది సీమాపర్వతముగనున్నది. ఈవర్షమునకుత్తరదిశ ఎల్లగా సీమాపర్వతముగ నీలపర్వతమున్నది. ఈపర్వతము పశ్చిమ లవణసముద్రమునుండి తూర్పున లవణసముద్రాంతమువఱకు రెండుదిశల సముద్రములనంటి దీర్ఘముగ రెండువేలయోజనములపొడవుగ ఉత్తరమున రమ్యకవర్షమునకును యిలావృతవర్షమునకును మధ్యలోనున్నది. ఈవర్షమునకు దక్షిణదిశలో ఎల్లగా సీమాపర్వతముగ నిషధపర్వతమున్నది. ఈపర్వతము తూర్పున లవణసముద్రమునుండి పశ్చిమమున లవణసముద్రాంతమువరకు రెండు దిశల సముద్రములనంటి దీర్ఘముగ రెండువేలయోజనముల పొడవుగ దక్షిణమున సీమాపర్వతముగ. హరివర్షమునకును యిలావృతవర్షమునకును మధ్యలోనున్నది. ఈనాలుగుపర్వతములు చౌకముగనున్నవి. వీటిమధ్యలో యిలావృతవర్షము చౌకముగనున్నది. ఇలావృతవర్షమునకుఁదూర్పున భద్రాశ్వవర్షము తొమ్మిది వేలయో

జనవిస్తీర్ణముగఁ దూర్పునఁగల లవణసాగరాంతమువఱకు వ్యాపించియున్నది. ఇటులనే ఇలావృతవర్షమునకుఁ బశ్చిమమునఁ గేతుమాలవర్షము తొమ్మిది వేలయోజన విస్తీర్ణముగ పశ్చిమమునగల లవణసముద్రాంతమువఱకు వ్యాపించియున్నది. ఇలావృతవర్షమునకు దక్షిణదిశయందుఁగల సీమాపర్వతమగు నిషధపర్వతమునకు దక్షిణమున హరివర్షము తొమ్మిదివేలయోజనముల విస్తారముగలిగి పూర్వపశ్చిమములుగ దీర్ఘముగనున్నది. ఈహరివర్షమునకు దక్షిణమున మఱల సీమాపర్వతముగ హేమకూటమనుపర్వతము ప్రాక్పశ్చిమ లవణసముద్రములనంటి నిషధపర్వతములోఁ బదునొకొండవ వంతుపొడవు తగ్గియున్నది. దీనిపొడవు ఒకవెయ్యి యెనిమిదినూర్ల యోజనములు. ఈ హేమకూటపర్వతమునకు దక్షిణదిశలోఁ గింపురుషవర్షము తొమ్మిదివేలయోజన విస్తారముతోఁ బూర్వపశ్చిమముల మధ్యలో దీర్ఘముగనున్నవి. ఈవర్షమునకు దక్షిణమున సీమాపర్వతముగ హిమాలయపర్వతము పూర్వపశ్చిమములుగ సముద్రములనంటి హేమకూట పర్వతములోఁ బదునొకొండవ వంతు కుఱచయై పదునారునూర్లయోజనవిస్తారముతో (పొడవుతో) నున్నది. ఈ హిమాలయమునకు దక్షిణదిశలో భారతవర్షమగు కర్మభూమియున్నది. దీనికి దక్షిణమున లవణసాగరమావరించియున్నది.

ఇలావృతవర్షమున కుత్తరమున సీమాపర్వతమగు నీలపర్వతమునకుత్తరమున రమ్యకవర్షము తొమ్మిదివేలయోజనవిస్తారముగ పూర్వపశ్చిమ లవణసాగరాంతము ఉభయపార్శ్వములందంటియున్నది. దీనికుత్తరదిశ సీమాపర్వతముగ శ్వేతపర్వతము నీలపర్వతములోఁ బదునొకొండవవంతు కుఱుచయై పూర్వపశ్చిమములు దీర్ఘంబుగా లవణసముద్ర ముభయపార్శ్వములందుఁగలదై పదునెనిమిదినూర్ల యోజనముల నిడుపుగనున్నది. ఈపర్వతమున కుత్తరదిశయందు హిరణ్మయవర్షము తొమ్మిదివేలయోజన విస్తారముతో పూర్వపశ్చిమముల నిడుపుగ లవణసముద్ర ముభయపార్శ్వములందుగలదైయున్నది ఈవర్షమున కుత్తరదిశ సీమాపర్వతముగ శృంగపర్వతము పూర్వపశ్చిమముల నిడుపుగలిగి లవణసముద్ర ముభయపార్శ్వములందుఁగలిగి శ్వేతపర్వతములోఁ బదునొకొండవవంతుతగ్గి పూర్వపశ్చిమములుగ శృంగపర్వతము పదునారునూర్లయోజనముల నిడుపుగా నుభయపార్శ్వములందు లవణసముద్రములంటియున్నది. ఈశృంగపర్వతమున కుత్తరదిశయందు కురువర్షము తొమ్మిదివేలయోజనవిస్తారముతోఁ బూర్వపశ్చిమంబులు నిడివిగలిగి ఉభయపార్శ్వములందు లవణసముద్రముతో ఆవరింపఁబడియున్నది.

ఈ యిలావృతవర్షంబందు త్రేతాయుగ కాలధర్మంబులు నడుచుచుండును. దీనికధిపతి ఈశ్వరుఁడు. ఇచ్చట వనములోఁ బార్వతీదేవి తనయనుచరస్త్రీలతో విహారమునల్పుటచేత పురుషులు రాకుండునట్లు శాపముపెట్టును. ఎవరేనిఁ బ్రవేశించినచో వారలు స్త్రీలగుదురు. అందుచేత శంకరుఁడుసహా ప్రవేశించనివాఁడాయెను.

పూర్వము సూర్యునిభార్య సూర్యునితేజస్సునకుఁదాళలేక యిలావృతవర్షములో ఈశాన్యభాగమునగల ఉద్యానవనములో అశ్వరూపముతోనుండగా నది తెలిసి సూర్యుఁడశ్వరూపముదాల్చి విహరించగా అశ్వినీదేవతలుపుట్టిరి. ఇలావృతవర్షమునందు దేవతలు సర్వదానివసించియుందురు. కనుకనే భూస్వర్గమనిరి. ఇందలి ప్రజలు సహస్రాయుష్మంతులు, వజ్రదేహులు, అమృతవంతులు మహాపుణ్యపురుషులకు నిలయమగు పుణ్యభూమి.

## —♦ ఆకాశవర్ణవివరము. ♦—

మనకుఁదారామండలమునఁ గనఁబడుచున్న ఆకాశము పంచభూతాత్మక మూలప్రధానమైనదికాదు. ఇది తేజోభూతాంతమునమున్న వాయుస్వరూపాకాశము. ప్రతిభూతమందు నాకాశమంశాంశముగనుండుట సహజము. ఆకాశమున కేస్వరూపముగాని, వన్నెలుఁగాని, చిత్రములుఁగాని లేవు. ఆకాశమనగా సర్వశూన్యము. మన కుపరిలో నగపడు నాకాశము నీలముగఁ గనఁబడుచున్నది. మన లోకములో దూరస్థలములుగ నున్నవన్నియు స్నిగ్ధముగ సమముగ నీలవర్ణముతో నగపడుచుండుట సహజము. పంచభూతములు సర్వత్ర నెటుచూచినను అన్నిటిలో నన్నియుండుట స్వాభావికధర్మము. దూరమైనకొలది వాయుభూతావరణముతో నన్నియు వాయురూపముతో అరూపముగ స్థూల కఠినస్థావరాదులు సహిత మీలాగుననే నగపడుటను మన మీలోకముననే చూచుచున్నాము. మనకుపరిలో అత్యంతదూరములోనున్న భూతలోకాదులలో నున్నవాటినిఁ జూచుటలో నింతకంటె అతిశయముగఁ గనఁబడుచుండును. ఇది సామాన్యసహజవిషయము.

ఇదిగాక మేరువుపరిలో నలుదిశలందుఁ గొన్ని పర్వతశృంగములున్నవి. అందు తూర్పుదిశన ఇంద్రపర్వతము, జ్యోతిశ్శృంగము పద్మరాగకాంతితో నుండుటచేత నాకాశము తూర్పునఁగొంచె మరుణధాతువుగ నగపడును. మేరువున కుపరి దక్షిణదిశలో వైడూర్యపర్వతము, నీలశృంగము నుండుటచేత దక్షిణదిశనున్న మనకు

అంతరిక్షము నీలముగ నగపడుచున్నది. మేరూపరిభాగమునఁ బశ్చిమదిశలో నిర్ఋతిఁ చిత్రిపర్వత శిఖరములుండుటచేతఁ గేసరివర్ణముతో (పసపు, ఎరుపు, మిశ్రితవర్ణము)తో నగపడుచుండును. మేరూపర్యుత్తరదిశ స్ఫటిక, మరుత్పర్వత శృంగములుండుటచేత నాదిశ తెల్లని వర్ణముగ నగపడుచుండును ఈలాగున నలుదిశల నాలుగువర్ణములతో మనకగుపడు నీలాకాశమున్నదని తెలియందగు.

—o—

# మేరువు విషయ వివరము.

శ్రీ వాయుపురాణము భువనకోశవిన్యాసము అధ్యాయం 3౪.

ఇదియొక మహదాకార భూత చైతన్య విశేషరూపము. ఇది ఘనవస్తు రూపముతో నున్నందుచేత సృష్టి చరాచరరూపములలోఁ బర్వతనామముతో రూపగుణాదులు చేర్చి వ్రాయఁబడినది. లోకవ్యవహార నిమిత్తము సృష్టిలోని పదార్థములను సంజ్ఞలతో విజ్ఞానమునకై యొకరూపమేర్పరచి చెప్పుట సగుణలక్షణము (మన) సృష్టికి గారణము పంచభూతములు. అందుచేత ఈ బ్రహ్మాండములో నన్నియుఁ బంచభూతాత్మక తత్స్వరూప గుణవికారభేదములతో నుండుట సృష్టి సహజ వైచిత్ర్యము. ఆయా భూతాధిక్య గుణాతిశయ భాగములతో నాయాభూత స్వరూపాకార గుణములు కలిగియుండుట సహజము. మనము కేవల పృథివీభూత లోకమునందేయుండి మనచుట్టునున్న వస్తురూపగుణాదులవలె, మన కుపరిలోనున్న యన్ని భూతాదులలో దృగ్గోచరముగా నొకేవిధముగ నుండవలెనననది సమంజస భావముకాదు. అది విజ్ఞానముకూడ నెంతమాత్రము గానేరదు. పృథివీభూత లోకములోఁ గేవల పృథివీభూతభాగరూప గుణాధిక్యముతోను, జలభూత లోకములో జలభూతరూప గుణాధిక్యముతో నుండును. ఇటులనే యితర భూతలోకములలో నాయా భూతాదిరూప గుణాధిక్యతతో నచ్చటచ్చటఁ జరచరాచర సృష్టియంతయు నుండును. పైలోకాదులందుఁగల వారలకును మనకు నేవిధముగా రూపగుణాది భేదములున్నవో యటులనే మిగిలిన క్షేత్రసృష్టి యంతయుఁ దదనుసారముగనే తప్పకయుండుననని తలంచవలెను. అందుచేత బ్రహ్మాండమునుగూర్చి వేదశాస్త్ర పురాణాదులు వివరించి వ్రాసిన దానినంతయు దీరాలోచనతోఁ దెలియుటుత్తమము. విజ్ఞానమయ వేదముల కర్థమపారము. సామాన్యుల యూహాల కతీతము.

వేదశాస్త్ర ప్రవచనముగూడ నిదియే. కేవల ప్రకృతి విజ్ఞాన నిర్ణయముల వంటిది కాదు. సర్వచరాచర సృష్టినంతయు నీలాగుననే నిశ్చయించవలెను. అదియే వేద శాస్త్ర పురాణాది సమ్మత విజ్ఞానము.

ఉదాహరణము- మన హిమాలయపర్వత మూర్ధ్వములోఁ గేవల జలభూత సంబంధమై మంచుగడ్డలతో నిండినదే కాని మనమున్న పృథివీభాగాధిక్యత యచ్చట చాలఅరుదు. మనకూర్ధ్వములోగల జలభూతలోకమునకు నీపర్వత సంబంధము సమీపించుటతో నీలాగున అధికముగానున్నది. తదుపరి కేవల జలస్వరూప భూత లోకములో నింకను అత్యధిక జలాంశాకారముగ నుండునే కాని తక్కువగా నుండఁజాలదు. ఇది ప్రత్యక్ష ప్రమాణము. ఇది ప్రకృతిభూత సృష్టిగుణము మేరువు కూడా మన కుపరిభూత లోకాదులలోఁ చేరి సర్వభూతాదులందును నొక మేఢీస్తంభాకారముగ నాకర్షణసూత్రముగాఁ బంచభూతాదులకు సంబంధించినదై పంచభూత రూప గుణాదులతోఁ బంచభూతాత్మకముగా నున్నదని శ్రీ వాయుపురాణమునందు వివరించిరి. ఇది సర్వభూతముల నాకర్షించి అంతస్థులుగా నుండి ఆధారాధేయ భూతముగా సూత్రప్రాయమై సుషుమ్నవేణు దండమువలె సర్వభూతాకార మేరువుగా నున్నదని తలంచవలెను. ఇతర పురాణములందు దీని తేజస్సునుబట్టి చైతన్యమునుబట్టి బంగారుకొండయని నిరూపించి అధికభావముతో వ్రాసిరి. తేజస్సు సర్వభూతములకుఁ జైతన్యము. సృష్టిస్థితిలయాదులకు, నీ త్రివర్గములకుఁ, దేజస్సే ప్రధానమగుటచేతఁ దృతీయ భూతమగు తేజో ప్రధానరూపముగ వర్ణించిరనియే తెలియవలెను. ఒక్కొక్కపురాణ మొక్కొక్కభావముతో బోధనాత్మకముగా నుండును. అన్నియు నొకేవిధముగానే యుండినచో మిగతభావము నేలాగునఁ దెలియగలుగుచుంటిమి? కాన విమర్శనలతో ఆలోచించినఁగదా సత్యముతో మన విజ్ఞానము సార్థకమగును. లేనిచో అనర్థమే యగును.

ఈలాగున మన వేద మహర్షులు తమ దివ్యదృష్టితో ఒక్కొక్కరొక విధముగా స్వానుభవమున మన మేలుకొఱకుఁ దాము దెలుసుకొన్నవాటిని వేదము లందున్నవాటిని సమన్వయముచేసి మనకుఁ దేట తెల్లముగా లోకవిజ్ఞానమునకై మహోపకారములుగ వ్రాసినవే శాస్త్ర పురాణములు.

ఈకాలములోఁగూడ నీవిధముగనే సర్వులు సర్వ పరిశోధనాంశములను ప్రకృతి విజ్ఞానమును ప్రతియొకరు నొకరిపైనొకరు విమర్శించి వ్రాయుచుండుటను, మన మనుసరించి నడుచుటను గమనించినచో వేదశాస్త్ర పురాణము లటులనే

యున్నవని తెలియును. మన విజ్ఞానమునకివియే మూలకారణములు. ఇవియే లేకున్నచో మనము పశుతుల్యులముగా నుండెడివారము. ఇదియునుగాక ఈ బ్రహ్మాండము పైనుండి క్రిందికేట వాలుగా నుండుటచేత ఒక భూతలోకమునకంటె మరొకభూతలోకము రాను రాను క్రిందికే దిగుచువచ్చినవి. అందుచేత మేరువు మనజంబూ ద్వీపమందలి యుపరిభాగములోఁగల ఇలావృత వర్ష భూభాగమధ్యలో సర్వభూత లోకాదుల నాక్రమించి క్రిందినుండి ఆకాశభూత లోకమువరకు నాయా భూతానుసార రూపగుణాదులతో నున్నది. ఈలాగున నుపరిలో ఇలావృతవర్ష మధ్య ప్రారంభమైన మేరువు నీభరతవర్షములో (జూపించుమన్నచో నదెటుల సాధ్యమగునని యూహించక ప్రశ్నించినచోఁ జూపు టెవరితరము. అంతమాత్రముతోనే పరిహసించుట ఉత్తమ ధర్మముగాదు.

ఇంకొకదృష్టాంతము - పురాణములనుబట్టి యాలోచించినచో గోచరించు ఆకాశగంగ పృథివీభూత జంబూద్వీపములో మేరువునుండి క్రిందికి నలువైపుల జలపాతముగ పతనమైనట్లువ్రాసిరి. ఈజలపాతము నేరుగా మేరుమూర్ధమునుండి క్రిందికిఁబడుటలో సమీపములోనున్న ఇలావృతవర్షమునందు బొత్తిగాబడక, దానికి రెండవ వర్షమగు హరివర్షభాగ భూమియందునుబడక, మూడవదియగు కింపురుష వర్షభాగమందునుబడక కింపురుషభరతవర్షముల సీమాపర్వతమైన హిమవచ్ఛిఖరము పైన పడినట్టువ్రాసిరి. మేరువుయొక్క ఔన్నత్యమును గంగాజలపాతదూరమును గణితశాస్త్రప్రకార మాలోచించినచో సరిపోవును అప్పుడు మేరుమూలము తెలియునుకాని సామాన్యముగఁ దెలియలేము.

మనలోకానుభవములో నితరనదులవలె మనగంగానది క్రిందినుండి ప్రారంభమైనదికాదనుట సర్వులకువిదితము. హిమవచ్ఛిఖరముపై జలపాతముగా బడివచ్చినదనుటస్పష్టము. ఇదివర్షధార జలముగాదు, దివ్యగంగ. మూలస్వరూపమునుండి స్వయముగ నుద్భవమై ప్రతిభూతలోకమందును సుషుమ్నగాఁ బ్రవహించి అంత్యభూతమగు మనభూమికి వచ్చినదేకాని సామాన్యజలరూప గంగయెంతమాత్రము గాదు. దానిగుణాతిశయములే నిదర్శనములు. ఇటులనే మేరువునుగూడఁ దలంచవలెను. దీనినిఁబట్టి మేరువిచట లేదనుట స్పష్టము. వేదశాస్త్రపురాణములను విమర్శించిచూడక, సత్యమెఱుఁగక, దీర్ఘాలోచనచేయక, యిష్టమువచ్చినట్లుపలుకుట సామాన్యము. నాస్తికము. ఇట్టిదృష్టాంతముల నాలోచించినచో నింక ననేకము లుండునుగాని మనము కనుఁగొనలేము. ఊరకవాదించిన అసమర్థవాదము

లగును.

మేరువు అన్నిపర్వతములకన్న నధికౌన్నత్యము గలదగుటచేతనే మనలోకములో ఆధిక్యవిషయమున నుదహరించుచున్నాము. దీనికిఁగారణము పంచభూతములందు నిది ఆధారాధేయముగ అగ్నిభూతాదులందును గేంద్రప్రాయముగ నున్నదని తలంచవలెను. శ్రీమహాబలిచక్రవర్తి సర్వస్వము దానమిచ్చినవెనుక దానమీయవలదని తనగురువు బోధించగా "మేరువు దలక్రిందైనను దానము చేయుట మాననని నెను. ఈమాటను ఆలోచించిన యెంతటి విషయార్థమో యూహింపరానిదిగానున్నది. తుదకు తత్త్వవిజ్ఞాన శాస్త్రరీతిగను నిదసమంజసమగును. తత్త్వముతో సూర్యధ్రువులే మేరువనియు నొకవిధముగ నూహింపనగును. మనలోకములోవలెఁ గేవల బ్రకృతిరూపాత్మకముగ మేరువున్నదనుట కేవల జడప్రకృతి వికృతిమిశ్రితవాదమగును. ఇది దాని నిజస్వరూపమెరుగక బోధగానున్నవారల ప్రశ్నయని తలంచవలెను. మేరువును "దివ్య" శబ్దపూర్వకముగ ప్రారంభించి ఉచ్చరించుటే వేదసమ్మతముగాని సామాన్యవాచ్యమెంతమాత్రముగాదు.

మరొకవిధముతో మేరువు జడస్థిర స్థావరాత్మక బాహ్యబ్రహ్మాండ భువనములో కులగిరులవలె నున్నదని యెంతమాత్రము దలంచరాదు. ఇదిపంచభూతమధ్యలోనున్న తేజోభూతరూపముఁ బంచభూతాదుల మధ్యలోనుండి సర్వభూతాధారమై యెట్లుప్రకాశింపజేయుచున్నదో యటులనే నిదియున్నది, ఈ తేజోభూతమే మధ్యలో లేనిచో నన్నియు అంధకారబంధురములై కేవల జడములేయైయుండెడివి.

మన దేహములో మూలాధారమునుండి సహస్రారమువరకు సుషుమ్న వేణుదండ మెటు సర్వాధారమైయున్నదో యటులనే క్షేత్రరూప బ్రహ్మాండములో నీ మేరువున్నది. మేరువకు మనస్సు ఉపమానముగనున్నది. అదెటులనిన ఈపిండాండదేహమున, ఆపాదమస్తకమువరకు మన స్సేవిధముగావ్యాపించి సర్వాధారమై సర్వసంబంధముతో నున్నదో నటులనే మేరువున్నది. మనస్సు సగుణనిర్గుణ మూర్తామూర్తముగ వ్యక్తావ్యక్తముగ నున్నదనినచో నున్నది, లేదనినచో లేదు. అదే విధముగ మేరువకూడ వాయుభూతప్రధానముతో నున్నది. ఇట్టిపంచభూతాత్మక మేరువును నిర్ణయించి యిటనున్నది యట లేదని నిరూపించుట కెవరికిసాధ్యము. మనస్సు ఇటనే నున్నదని నిర్ణయించుటే ముఖ్యము. మనస్సేవిధముగ ఉభయమధ్యదేహమగు కంఠమునందు వాయుభూతముతో నున్నదో నటులనే బ్రహ్మాండమధ్యలో సర్వసంధిగా ప్రాణనాడి వాత తేజోమయముగా జంబూద్వీపమధ్య నిలావృతవర్షమధ్యలో

నున్నది. రూపములేదని స్థాననిర్ణయము లేదని వాదింతురా? సర్వవర్ణాత్మకముగా బ్రహ్మాండాంతరములో సర్వాధార సువర్ణమై ప్రకాశించుచునేయున్నది. కనుఁ గొనవలెనని పరీక్షించితిరా! దొరకుటదుర్లభము. మనస్సును గనుగొన్నచో మేరువును గనుఁగొనఁదగును. ఈ రెండును సమానాంశములు. మనస్సునకు జ్ఞానప్రధానమెటులనో మేరువుగూడ జ్ఞానప్రధానముగనే చైతన్యప్రకాశక్షేత్ర రూపముగనున్నది. మేరూపరిభాగము సర్వదేవతా నివాసముగనున్నది. మనస్సు గూడ సర్వదేవతలకు నివాసభూమిగనున్నది. సర్వవిద్యలకు ఉపాసనలకు జప తపాదులకు యజ్ఞాదులకు సర్వకర్మలకు మనసెట్లు ప్రధానాధారముగనున్నదో మేరువుకూడ నీబ్రహ్మాండ విరాడ్దేహములో సర్వప్రధానముగనున్నది. శ్రీలలితా సహస్ర నామములో శ్రీపరమేశ్వరికి మేరువు మేరుశృంగములు ఆధారపీఠ ములుగ నున్నటులనే మనస్సుకూడనున్నది. మనస్సునకు శృంగములే సంకల్ప ములు. "సుమేరుశృంగమధ్యస్థాయైనమోనమః" అని చెప్పఁబడినది. సుమేరు వనగా దివ్యజ్ఞానమయమనస్సు, శృంగమధ్యస్థానమే- మనస్సుయొక్క చిత్తైకాగ్ర స్థానము. పరమేశ్వరి యనగాఁ కేవల పరిశుద్ధజ్ఞానమునకే అర్థము. మనస్సునకుఁ ద్రిగుణములు, త్రివరణత్రికరణము లెట్లున్నవో మేరువునకుఁ ద్రిశృంగములు త్రివర్ణలోకములు త్రికరణములటులనే యాకృతకలోకత్రయమునందున్నవి. మనస్సు నకు గుణాతీతముతో నేకముఖమెట్లుకలుగునో అకృతకలోకాదులలోను దదుపరిలో మేరువునకు ఏకశృంగమేయున్నది. సర్వము భావనాప్రధానము; గమ్యము; యోగ మార్గము. కాబట్టి మనస్సును మేరువును ఆద్యంతముల నిర్ణయించలేము. ఈరెం టిని సమానోపమాన ప్రధానముగ జెప్పుటే వైదికవేదభూగోళార్థము. మేరువం తముతో సర్వాంతము, పరాపరము ఆత్మ. మనస్సంతముతోను బరాపరము ఆత్మ స్వస్వరూపము ఈరెండును క్షేత్రసంబంధము. ఆవరణసంబంధములు పీఠస్థాన ములు. సర్వయజ్ఞక్రియాకర్మలకు భక్తిజ్ఞానయోగాదులకు మిక్కిలి ప్రాముఖ్య ములు. అందుచేత మేరువుదివ్యరూపము, జ్ఞానరూపము. జ్ఞానగోచరము చైతన్య రూపము చైతన్యము. ఇది తపస్సులకు వేదవిజ్ఞానులకుఁ జైతన్యహిరణ్మయ ప్రకాశ స్వరూప పర్వతరూపముగ విజ్ఞానదృగ్గోచరముగాని తదితరులకుశూన్యము. ఇట్టి విషయరహస్యములను దెలియక బోధనార్థముగఁ బురాణములందుఁ జెప్పినదానిని మనమున్న భూమిలోనే చూడమన్న నెవరితరము. విశ్వరూప సందర్శనమువలె జ్ఞాననేత్రగోచరముగనున్నదగును.

అక్షరసాంఖ్యశాస్త్రరీతిగా-

మేరువు=మే=౫. రు=౨, వు=౪. ౫+౨+౪=౧౧.

జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు వెరశిపది. పదునొకొండవది మనస్సు. అదే మేరువుగానగును. ఈ విరాడ్బ్రహ్మాండ దేహములో లోకాదులే యింద్రియాదులు. మేరువే మనస్సు. సర్వసంబంధసూత్ర సుషుమ్నగాయున్నది. సుషుమ్న ప్రకాశరూపమని షట్చక్రనిరూపణ శాస్త్రములందు వివరముగలదు. ఇదిమహాశక్తివంతమనియుగూడగలదు. ఇది రెండువిధములుగనున్నది. ఊర్ధ్వ అధోముఖములతో సర్వయోగాదల కతిప్రధానాధారాధేయముగనున్నది. మేరువుగూడ నటులనే ఊర్ధ్వఅధోముఖములగనున్నది. ఈ మేరూర్ధ్వశిఖర శృంగములో శక్తిరూపమగు శ్రీపరమేశ్వరికి స్థానమున్నది. జ్ఞానేంద్రియలోకాదులూర్ధ్వమహానాది లోకములు. కర్మేంద్రియములే గుణభేదముచే అధోలోకత్రయమై సర్గప్రతిసర్గ భావముచే అధోలోకసప్తకముగాఁ జెప్పఁబడినవి. ఈకారణాంతములచే మేరువునకును మనస్సునకును ఉపమానము. మనవేదశాస్త్ర పురాణములు, యోగతత్త్వ భావనాతిశయానంత విధానములతో ప్రకాశ మార్గగమ్యములై సర్వోత్కృష్టప్రధాన ప్రమేయములు. దీనినేమకొక విధానముతో జాతవేదస్స్వరూప ప్రకాశ పర్వతమని జెప్పిరి. అనగాఁ దేజోభూతము. సర్వభూతములందుఁ బ్రసిద్ధాధారముగ నున్నది. అగ్నిధ్యానమంత్రములో "చత్వారిశృంగా" అని చెప్పిరి. మేరువునకుఁ జతుశ్శృంగములు ముఖ్యములైనవి ఉన్నవి. ఇవి నాలుగు వేదములకుఁగూడ సమన్వయము. దేహములో వీణాదండోపరిభాగమునకుఁ బోల్చఁదగును. సప్తద్వీపములు దీనినాశ్రయించి చుట్టియున్నవి. ఈ ద్వీపములే మూలాధారాది షట్కమలములు. ఏడవదే సహస్రము. ఈ ఆధారకమలములు వేణుదండమునాశ్రయించి మన దేహములో నున్నట్టుగనే బ్రహ్మాండములో నీసప్తద్వీపములు మేరువునాశ్రయించి యున్నవి. దీనిననుసరించియే శ్రీవిద్యావిధానమంతయు నున్నది.

—♦ మేరువుశిఖరముపైన మఱికొన్ని పర్వతశృంగములు. ♦—

(౧) ఇంద్రపర్వతశృంగము= విషుసంజ్ఞరాసులందు సూర్యుఁడీపర్వతము నందుండును.

(౨) జ్యోతిశ్శృంగము=పద్మరాగకాంతి, సూర్యుఁడు దక్షిణాయనమున ఈపర్వతశిఖరమున సంచరించును.

(3) అగ్నిపర్వతశృంగము = ఇది ఆగ్నేయభాగమున మేరువుపైనున్నది.
(౪) నిఋతిపర్వతశృంగము = మేరువుపైన నైఋతిదిశనున్నది.
(౫) చిత్రశృంగము = శుభమగు సర్వవేదమయము.
(౬) స్ఫటికపర్వతశృంగము = మేరువుపైన కుబేరదిశనున్నది.
(౭) మరుత్పర్వతశృంగము = మేరువుపైన వాయువ్యదిశనున్నది.
(౮) చంద్రాజస్క-పర్వతశృంగము – రజతమయము.
(౯) ఈశానపర్వతశృంగము = ఈశాన్యభాగమున మేరువుపైనున్నది.
(౧౦) సౌమనస్యపర్వతశృంగము = ఇది మేరువుపైన తూర్పుభాగముననున్నది.

కాంచనమయశృంగము, ఉత్తరాయణపర్వతశృంగము. వీనియందు సూర్యుడుత్తరాయణమున సంచరించును.

రజతశృంగము.

సుమేరుశృంగము = మేరూఉన్నతశృంగము శ్రీలలితాపరమేశ్వరీ నిలయస్థానము.

వైడూర్యశృంగము = ఇది నీలముగా ఉండుటచేతనే ఆకాశము నీలవర్ణముగ నగపడుచున్నది.

మేరువునకుదూర్పున పద్మరాగకాంతితో జ్యోతిశ్శృంగముండుటచేత తూర్పుదిశన ఆకాశము పద్మరాగకాంతితోనుండును.

మేరువునకుబశ్చిమముననున్న పర్వతశృంగము కేసరివన్నెతో నున్నందుచేత నాదిశాకాశ కాంతియుండును

మేరువునుత్తరమున స్ఫటికశృంగముతో ఉత్తరదిశాకాశము తెల్లనికాంతిగ నగపడుచుండును.



## శ్రీ మే రు వు వి ష య ప్ర మా ణ ము.

(శ్రీవాయుపురాణము - భువనకోశవిన్యాసము - అధ్యా 3౪

హిమపాత్రయశ్చహిమవాన్ హేమకూటశ్చ హేమవాన్। తరుణాదిత్యవర్ణాభో హైరణ్యోనిమధః స్మృతః॥ ౧౪ ॥ చాతుర్వర్ణస్తు సౌవర్ణో మేరుశ్చోచ్చ్రతమః స్మృతః। వృత్తాకృతిపరిమాణశ్చ చతురశ్రః సముచ్ఛ్రితః॥ ౧౫ ॥ నానావర్ణస్తు

పార్శ్వేషు ప్రజాపతిగుణాన్వితః। నాభిబంధన సంభూతో బ్రహ్మణోఽవ్యక్త జన్మ
నః॥ ౧౬ ॥ పూర్వతః శ్వేతవర్ణోఽసౌ బ్రాహ్మణ్యస్తస్య తేనతత్। పీతశ్చదక్షిణేనా
సౌ తేనవైశ్యత్వమిష్యతే॥ ౧౭ ॥ భృంగపత్రనిభశ్చాసౌ పశ్చిమేన మహాబలః॥
తేనాస్యశూద్రతా దృష్టామేరోర్నానార్థకారణాత్॥ ౧౮ ॥ పార్శ్వముత్తర తస్తస్య
రక్తవర్ణం స్వభావతః। తేనాస్యక్షత్రతా చస్యాదితి వర్ణాః ప్రకీర్తితాః। వ్యక్తః
స్వభావతః ప్రోక్తో వర్ణతః పరిమాణతః॥ ౧౯ ॥ నీలశ్చవైదూర్యమయః శ్వేతశృం
గో హిరణ్మయః। మయూరబర్హవర్ణస్తు శాతకౌంభస్తు శృంగవాన్॥ ౨౦ ॥ ఏతే
పర్వతరాజానః సిద్ధచారణసేవితాః। మహాద్వీపాస్తు విఖ్యాతాశ్చత్వారః పత్రసం
స్థితాః। తతఃకర్ణిక సంస్థానో మేరుర్నామ మహాబలః॥ ౪౬ ॥ నానావర్ణేషు పార్శ్వే
షు పూర్వతః శ్వేత ఉచ్యతే। పీతంతుదక్షిణా తస్యశృంగంకృష్ణం తథాపరమ్॥ ౪౭ ॥
ఉత్తరం తస్యరక్తంవై శోభైర్వర్ణ సమన్వితమ్। మేరుస్సుశోభతే శుభ్రోరాజవత్సతు
ధిష్ఠితః॥ ౪౮ ॥ తరుణాదిత్యవర్ణాభో విధూమ ఇవపావకః। చతురాశీతి సాహస్ర
ఉత్సేధేన ప్రకీర్తితః॥ ౪౯ ॥ ప్రవిష్టఃషోడశాధస్తా ద్విస్తృతస్తావదేవతు। సశరావ
స్థితః పూర్వంద్వాత్రింశన్మూర్ధ్నివిస్తృతః॥ ౫౦ ॥ విస్తారాత్ త్రిగుణశ్చాస్యపరీణా
హః సమంతతః। మండలేన ప్రమాణేన త్రియస్త్రింశత్తదిష్యతే॥ ౫౧ ॥ చత్వా
రింశత్సహస్రాణి యోజనానాం సమంతతః। అష్టాభిరధికాని స్యుస్త్ర్యశ్రీమానే ప్ర
కీర్తితమ్॥ ౫౨ ॥ చతురస్రేణ మానేన పరిణాహః సమంతతః॥ చతుః షష్టిసహస్రాణి
యోజనానాం విధీయతే॥ ౫౩ ॥ స పర్వతో మహాదివ్యో దివ్యౌషధి సమన్వితః
భువనైరావృతః సర్వైర్జాతరూపమయైః శుభైః॥ ౫౪ ॥ తత్రదేవగణాః సర్వేగం
ధర్వోరగ రాక్షసాః। శైలరాజే ప్రదృశ్యంతే శుభశ్చాప్సరసాంగణాః॥ ౫౫ ॥
సతుమేరుః పరివృతో భువనైర్భూతభావనః। చత్వారో యస్యదేశావై నానాపా
ర్శ్వేష్వధిష్ఠితాః॥ ౫౬ ॥ భద్రాశ్వో భరతశ్చైవ కేతుమాలశ్చ పశ్చిమః। ఉత్తరా
కురవశ్చైవ కృతపుణ్యప్రతిశ్రయాః॥ ౫౭ ॥ కర్ణికా తస్యపద్మస్య సమంతాత్పరి
మండలా। యోజనానాం సహస్రాణి నవతిః షట్ప్రకీర్తితాః। చత్వారశ్చాభ్యశీ
తిశ్చ అంతరాంతరధిష్ఠితాః॥ ౫౮ ॥ త్రిశతంచ సహస్రాణి యోజనానాం ప్రమా
ణతః। తస్యకేసరజాలాని విస్తీర్ణాని సమంతతః॥ ౫౯ ॥ శతసహస్రికాయామా సా
శీతి పృథులాయతా। చత్వారితస్య పత్రాణి యోజనానాం చతుర్దిశం॥ ౬౦ ॥ తత్ర
యాసౌ మయాపూర్వం కర్ణికేత్యభిశబ్దితా। తాం వర్ణ్యమానామేకాగ్రాః సమాసేన
నిబోధత॥ ౬౧ ॥ శతాశ్రిమేనం మేనేఽత్రిః సహస్రాశ్రి మహర్షిర్భృగుః। అష్టాశ్రి

మేరుం సావర్ణిశ్చతురస్రంతు భాగురిః ॥ ౬౨ ॥ వార్ష్యాయణిస్తు సాముద్రం శరావం చైవగాలవః । ఊర్ధ్వవేణీకృతం గార్గ్యః క్రోష్టుకిః పరిమండలమ్ ॥ ౬౩ ॥ యద్యద్యస్య హి యత్పార్శ్వం పర్వతాధిపతేఋషిః । తత్తదేవాస్యవేదాసా బ్రహ్మైనం వేద కృత్స్నశః ॥ ౬౪ ॥ మణిరత్నమయం చిత్రం నానావర్ణప్రభాయుతమ్ । అనేకవర్ణనిచయం సౌవర్ణమరుణప్రభమ్ ॥ ౬౫ ॥ కాంతంసహస్ర పర్వాణాం సహస్రోదక కందరమ్ । సహస్ర శతపత్రం తం విద్ధిమేరుం నగోత్తమమ్ ॥ ౬౬ ॥ మణిరత్నార్పితస్తంభైర్మణిచిత్రితవేదికైః । సువర్ణమణి చిత్రాంగం తథావిద్రుమతోరణైః ॥ ౬౭ ॥ విమానయానైః శ్రీమద్భిః శతసంఖ్యైర్దివౌకసామ్ । ప్రభాదీపిత పర్యంతం మేరుం పర్వణి పర్వణి ॥ ౬౮ ॥ తస్యపర్వసహస్రేఽస్మిన్ నానాశ్రియ విభూషితే । సర్వదేవనికాయాని పన్నివిష్టాన్యనేకశః ॥ ౬౯ ॥ తమాపనచోర్ధ్వతలే దేవదేవశ్చతుర్ముఖః । బ్రహ్మబ్రహ్మవిదాంశ్రేష్ఠో వరిష్ఠస్త్రిదివౌకసామ్ ॥ ౭౦ ॥ మహాభువన సంపూర్ణైః సర్వైః కామఫలప్రదైః । మహాసురసహస్రైస్తం దిక్ష్వనేక సమాకులమ్ ॥ ౭౧ ॥ తత్ర బ్రహ్మసభారమ్యా బ్రహ్మర్షిగణసేవితా । నామ్నా మనోవతీనామ సర్వలోకేషు విశ్రుతా ॥ ౭౨ ॥ తత్రేశానస్యదేవస్య సహస్రాదిత్యవర్చసమ్ । మహావిమానం సంస్థాప్య మహిమ్నా వర్తతేసదా ॥ ౭౩ ॥ తత్రర్షిగణా దేవాశ్చతుర్వక్త్రస్యతే తదా । తదేవ తేజసా రాశిర్దేవానాం తత్రకీర్త్యతే ॥ ౭౪ ॥ తత్రాస్తేశ్రీపతిః శ్రీమాన్ సహస్రాక్షః పురందరః । ఉపాస్యమానస్త్రిదశైర్మహాయోగైః సురర్షిభిః ॥ ౭౫ తత్రిలోకపతేః స్థానమాదిత్య సమవర్చసః । మహేంద్రస్య మహారాజ్ఞః సర్వసిద్ధైర్నమస్కృతమ్ ॥ ౭౬ ॥ తమింద్రలోకం లోకస్య బుద్ధ్యావరమయాయుతమ్ । దీవ్యతేత్వమరశ్రేష్ఠైః స్త్రిదశైర్నిత్యసేవితమ్ ॥ ౭౭ ॥ ద్వితీయేఽప్యంతరతటే వైదిశ్యేపూర్వదక్షిణే । నానాధాతుశతైశ్చిత్రైః సురమ్యమతితేజసమ్ ॥ ౭౮ ॥ నైకరత్నార్థితతలమనేకస్తంభసంయుతమ్ । జంబూనదకృతోద్యానం నానారత్నసువేదికమ్ ॥ ౭౯ ॥ కూటాగారైర్వినిక్షిప్తమనేకైర్భవనోత్తమైః । మహావిమానంప్రథితం భాస్కరం జాతవేదసమ్ ॥ ౮౦ ॥ సాహితేజోవతీనామ హుతాశస్య మహాసభా । సాక్షాత్తత్ర సురశ్రేష్ఠః సర్వదేవముఖోఽనలః ॥ ౮౧ ॥ శిఖిశతసహస్రాఢ్యో జ్వాలామాలీ విభావసుః । స్తూయతేహూయతేచైవ తత్రర్షిగణైః సురైః ॥ ౮౨ ॥ అధిదైవకృతం విప్రైర్విశేషః సతుఉచ్యతే । సవిభాగంచ తేజశ్చ సర్వమేవ నసంశయః ॥ ౮౩ ॥ భోగాంతరమనుప్రాప్తా ఏక తేజో విభుస్స్మృతః । పృథక్ త్వంచ వాయుక్త్వాతు కార్యకారణమిశ్రితమ్ ॥ ౮౪ ॥ తమగ్నిం లోకలోకజ్ఞైస్తద్విద్యైస్తత్పరాక్రమైః । మహా

త్సభిర్మహాసిద్ధైర్మహాభాగైర్మనస్కృతమ్॥ ౮౫ ॥ తృతీయేఽప్యంతరతలే ఏవమేవ మహాసభా। వైవస్వతస్యవిజ్ఞేయా లోకేఖ్యాతాస్తు సంయమా॥ ౮౬ ॥ తథాచతుర్థదిగ్దేశే నైఋత్యాధిపతేః సభా। నామ్నాకృష్టాంగనా నామ విరూపాక్షస్యధీమతః॥ ౮౭ ॥ పంచమోఽప్యంతరతలే ఏవమేవ మహాసభా। వైవస్వతస్యవిజ్ఞేయా నామ్నాశుభవతీసతీ। ఉదకాధిపతేః ఖ్యాతా వరుణస్యమహాత్మనః। ౮౮ ॥ పరోత్తరే తథాదేశే షష్ఠేఽంతరతలేశివే। వాయోర్గంధవతీ నామసభా సర్వగుణోత్తరా॥౮౯ సప్తమేఽప్యంతరతలే నక్షత్రాధిపతేః సభా। నామ్నా మహోదయానామ శుద్ధవైడూర్యవేదికా॥ ౯౦ ॥ తథాష్టమేంతరతలే ఈశానస్యమహాత్మనః। యశోవతీ నామ సభాతప్తకాంచన సుప్రభా॥ ౯౧ ॥ మహావిమానాన్యేతాని ద్వ్యష్టప్టాను శుభానిహి। అష్టానాం దేవముఖ్యానామింద్రాదీనాం మహాత్మనాం॥ ౯౨ ॥ ఋషిభిర్దేవగంధర్వైరప్సరసాభిర్మహోరగైః సేవితాని మహాభాగైరుపస్థానగతైః సదా॥ ౯౩ ॥ నాకపృష్ఠం దివం స్వర్గమితియైః పరిపఠ్యతే। వేదవేదాంగవిద్భిర్హి శబ్దైః పర్యాయవాచకైః॥ ౯౪ ॥ తదేతత్సర్వదేవానా మధివాసే కృతాత్మనాం। దేవలోకే గిరా తస్మిన్ సర్వశ్రుతిషుగీయతే॥ ౯౫ ॥ నియమైర్వివిధైర్యజ్ఞైర్బహుభిర్నియతాత్మభిః। పుణ్యైరన్యైశ్చ వివిధైర్నైకజాతి శతార్జితైః। ప్రాప్నోతిదేవలోకం తం సస్వర్గఇతిచోచ్యతే॥ ౯౬ ॥ ఇతి శ్రీమహాపురాణే వాయుప్రోక్తే జంబూద్వీపవర్ణనం నామచతుస్త్రింశోఽధ్యాయః॥

మేరువునకుఁగల వర్ణంబులునాలుగు. తూర్పుభాగము తెల్లగను, దక్షిణదిశ పసుపుపచ్చగను, పడమట నల్లగను, నుత్తరదిశ ఎఱ్ఱగను నుండును. మేరువు మనసునకుఁ బోల్పఁదగియున్నదికాన మానసిక చాతుర్వర్ణ సమన్వయము యుక్తమే. రెండును బ్రణవమువలె నాదోపాసనాలయ యోగసిద్ధులకుఁదప్ప నితరులకసధరోత్తరముగ స్ఫురించును. మానవ మనస్తత్వము దివ్యమైయొప్పుటకు నాదలయసిద్ధి యావశ్యకము. తత్సిద్ధికిమూలాధారము మనస్సు. అయ్యది సౌవర్ణమయమై ఉచ్ఛ్రితమై ప్లుతాకారనాద పరిణామముకలదై చతురస్రాకారముతో విరాజిల్లును. ప్లుతాకారనాదపరిణామ మన 'అ' కార, 'ఉ' కార, మకారార్థ సూత్రములతో నాల్గువర్ణసూత్రములుగల నాదపరిణామము. మేరువర్ణమగు ప్రణవము పార్శ్వము లందు నానావర్ణములుగలిగి ప్రాజాపత్యగుణముతో సృష్టికర్తృత్వగుణములతో నున్నది. కనుకనే మహావిష్ణునాభిబంధవ సంభూతావ్యక్త జననవిరాజిత బ్రహ్మ

సంభవమైనదని చెప్పఁబడినది. ఆదిలో ఇడాపింగళ సుషుమ్నలనెడి అనవాక్షర త్రినాభిచక్రమందు ఋ ౠ, స్వరములురెండు. గాఢసుషుప్తి దశలోని యుచ్ఛ్వాస నిశ్వాస వాయుసంభవమగు ముఖ్యప్రాణ శరీరముతోనుండును. సుషుప్తితుల్య మగు నజ్ఞానదశ (నిత్యప్రళయ)యందు జీవుఁడు ప్రేతతుల్యుఁడు. ముఖ్యప్రాణము జీవించి జాగ్రతయందుండినను నపుంసకునివలె సామర్థ్యములేకయుండును. కాన అ 'ఋ' 'ౠ' 'ఌ' 'ౡ' వర్ణ చతుష్టయము మండచతుష్టయము చిద్గగనచంద్రికా తంత్రాలోకాది గ్రంథములందుఁ జెప్పఁబడినది.

పూర్వోదాహృతవర్ణములో నాదివర్ణము తెలుపు. దీనికే వేదవిహితబ్రాహ్మ ణ్యమనియర్థము. దక్షిణదిశగలది పసుపువర్ణము. ఇది దాక్షిణ్యమగుట వైశ్య త్వముకలదైయున్నది. పశ్చిమదిశనల్లగనున్నది. అదియు జ్ఞానరహితమై శూద్ర త్వమందినది. ఉత్తరదిశ యెరుపుగనుండియు ప్రాకృతాత్మవీర్యముచే క్షత్రియ త్వమునందినది. ఇయ్యవి యవ్యక్తసంభవ బ్రహ్మకచతురంగములు అవ్యక్తమగు నీచాతుర్వర్ణ్యములు వ్యక్తమై నాల్గుపర్వతశృంగములైనవి. నీలశ్వేతహిరణ్మయ చిత్రవర్ణములతో హేమకలశ శిఖరముతోఁ బ్రొవనూపమై మేరువు కలయుచు న్నది. ఇందు సిద్ధులుందురు. ప్రణవమే మేరుద్రుమము. ఇందు సర్గ ప్రతిసర్గలతో 81 లేక 84లక్షల జీవరాసులుకలవు. నవవర్షఖండాదులన్నిటికిఁ బ్రణవ మేమూలము. అయది నాల్గుదళములతో ధర్మసృష్టికిఁగూడ మూలాధారమైనది. 'అ' కార 'ఉ' కార 'మ కారార్థమాత్రలే దళములు. నానావర్ణములగు పార్శ్వదళములందు శ్వేతద్వీపముకలదు. మేరువువలె నిదియుబ్రత్యేకవర్ణశోభిత పార్శ్వములందు శృంగ ములుగలిగియొప్పుచున్నది. తూర్పునఁబీత శృంగము, దక్షిణమునఁశృంగము పడ మట శ్వేతశృంగము, ఉత్తరమున రక్తవర్ణశృంగము శ్వేతద్వీపమునగలదు. గైరికాది ధాతువిరాజమానుండగు హిమవంతునివలె నీశ్వేతద్వీపము శృంగవర్ణములు మిశ్రిత మైవెలుగుచుండ శోభాయమానంబైయుండు బాలార్కచ్ఛాయతోఁ జతుస్సహస్ర జీవరాసులుగ భాగమును మేరువే. భూగర్భమందు మేరువు షోడశ సహస్రయో జన పరిమాణము ప్రవేశించి యంతేపరిమాణ వ్యాప్తికలిగి ముప్పదిరెండుయోజన ముల పరిమాణము జోరగిల యమర్చబడినట్లు శరావాకృతితో నూర్ధ్వపీఠమున గంగాభాగీరథీ సామ్యముకలదైయున్నది. దానిమండలపరిమాణము ముప్పదిమూడు వేలు. అడ్డపుఁగొలత యెనుబదివేలని కొందరందురు, మరికొందరు చతురసాకృ తితో నరువదినాలుగు వేల యోజనములుకలదని పలికిరి. ఎట్లైనను మేరువు దివ్యౌ

షధీ సమన్వితమై స్వర్ణమయాయత భువనవ్యాప్త విరాట్సృష్టికి మూలస్తంభమై
యున్నది. దీనినాశ్రయించి యనేకగంధర్వోరగరాక్షసాప్సర స్త్రీగణంబులుం
దురు. చుట్టును నాల్గుదేశములు విరాజిల్లుటంజేసి యిది తత్కేంద్రమున బంధుర
వలెను, కర్ణికవలెను నున్నది, ఆచతుర్దిశలంగల దేశంబులు ఇలావృత, భారత,
కేతుమా, లోత్తరకురువర్షనామకంబులు. ఇయ్యది పుణ్యాత్ములకు జన్మభూమి,
మేరుమధ్యకర్ణిక తొంబదియారువేలయోజన పరిమాణము కలదై యుండును. ప్రతి
దేశమధ్యవైశాల్యము తొంబదినాల్గువేల యోజనములు. ఒక్కొక్కదేశమునందు
పద్మపత్రకింజల్కములంబువలె మూడువందల మూడునూర్లవేల యోజనవిస్తారము
సృష్టియున్నది. ఒక్కొక్కపత్రము నూటయెనుబదివేల వైశాల్యముగలదై యు
న్నది. అట్టిపత్రములు నాల్గుదిశలంగలవు. అది ద్వాదశరాశిచక్ర విషువదయన
కేంద్రమునుబోలినది. దీనినాశ్రయించి యుపాసించిన యత్రిభృగుసావర్ణిమను
భాగురులు, సంచులుగలదిగను, సహస్రాశ్రినిగను అష్టాశ్రినిగను చతురస్రముగను
దెలిపిరి. వార్ష్యాయణి సాముద్రజలముగను, గాలవుండు మూషుడురూపముగను,
గార్గుడూర్ధ్వవేణీరూపముగను నున్నట్లువర్ణించిరి. కాన దీనినిజస్వరూపము వేదపురు
షుండే యెఱుంగును. కనకాచలమని చెప్పంబడు నీమేరువు నానామణిమయధాతు
చిత్రితమై యరుణప్రభకలదైయున్నది. ఇదిసహస్రదళ గుహాకందరములుగలదై
సహస్రశతపద్మపత్రములంగలిగి కలిమలధ్వంస భారతకంకజమనికూడ చెప్పవచ్చును.
ఇందుం జాలవిమానంబుగడు వెలయుచుండును. దీనినాశ్రయించి దేవతాగణంబు
లుండును. దీనియూర్ధ్వభాగమున దేవాగ్రగణ్యుండగు బ్రహ్మవిరాజిల్లుచుండును.
అందుసకల కామఫలద భువనంబు వాసబ్రహ్మర్షిగణసేవితుండయి మనోవతియను
సభయందు బ్రహ్మదేవుడుండు. కేశవేశానుల సభామంటపంబులుగలవు. తన్నిక
టంబున దేవేంద్రసభయున్నది. అందలిమహేంద్ర సింహాసనంబు సూర్యసమాన
తేజోమయంబై యొప్పెడిని. మేరుద్వితీయతటంబున నాగ్నేయమున నానాధాతు
చిత్రవిచిత్ర రత్నస్థగితస్తంభ విరాజితవేదికాయుత స్వర్ణోద్యానంబుకలదు. అవ్వ
నంబు సుందరమందిర విరాజమానంబై జాతవేదసమానంబై భాస్కరవిమానంబునా
నొప్పు. అయ్యదే తేజోవతినామకాగ్నిమాహాత్మ్యసభామంటపము. అందు శత
సహస్రవిభూతులతో జ్వాలామాలయగు నాహుతాశనుండు మహర్షిగణసేవితుండు.
తత్సంస్తూయమానుండు హూయమానుండునైయుండును. విప్రులాతని సద్విదైవాధి
భూతాత్మ తేజోవిభాగముచేఁ బ్రకాశించునని వర్ణింపబడుచున్నాఁడు. అతఁడే

కాలకర్మోభయ సంకర్షణుఁడు. ఆమేరువు మూడవచతియయందు వైవస్వతమను సభయగు సంయమమును, నాలవచతియయందు నిర్ృతివసించు కృష్ణాంగనానామక సభయు, నైదవదగు సుమేరుపృష్ఠ తటంబున వివస్వత్పూరపుత్రుఁడును, జలగ్రాహాధిపతియునగు వరుణనివాసయోగ్యమగు బుభువతీనామసభా భవనంబును, నారవదానియందు వాయుదేవుని గంధవతీనామ సభామందిరమును, నేడవదానియందు నక్షత్రాధిపతియగు కుబేరసోముని వైడూర్యవేదికా సంరాజిత మహోదయనామ సభాస్థలంబును, నెనిమిదవ భృగూత్తమంబునఁగల యాశోవతీపురమధ్యంబున శంకరు నివాసపూత శుద్ధవిద్యాసభయుఁగలవు. ఆదిక్పాలుర విమానంబు లాసుమేరు పృష్ఠంబున తత్తత్సభావాతింగణంబులఁగలవు. సకలదేవాధవాసములం దీసుమేరువు శిక్షితాంతర్బహిరింద్రియవృత్తులుగల ధన్యులచే గీర్తింపఁబడుచున్నది. శ్రుతులందును నిది గానముచేయఁబడుచున్నది. నానావిధ నియమ యజ్ఞయాగయోగాదులచేతను విరాజిలు పూజనీయులు దీనిని సేవించుచుందురు. ఎట్టివాసనకలవాఁడట్టిస్వర్గ మునుబొందును.

ఇట్లుబింబుగర్భిత చతురస్రాకృతిగల చాతుర్వర్ణ్య చాతురాశ్రమ్య కథారూపముగా లక్ష్యశుద్ధికొఱకై సాంఖ్యయోగ పరిమాణవాచక శబ్దములతో వర్ణింపబడిన శ్రీనవ మేరుధ్రువచక్రవర్ణనచే వర్ణింపబడిన ప్రవృత్తిధర్మ చక్రమందైన కాలకర్మ చక్రరహస్యముఁకూడ తెలిసెను.

—o—

# భద్రాశ్వ వర్షము.

మహాభారతం స్కంధం ౫ - అధ్యా, ౧౮ - పుట, ౪౩౬

శ్రీశుకః - తథాచ భద్రశ్రవానామ ధర్మసుతస్తత్కులపతయః పురుషాః భద్రాశ్వవర్షే సాక్షాద్భగవతో వాసుదేవస్యప్రియాం తనుం ధర్మమయీం హయశీర్షాభిధానాం పరమేణ సమాధినా సన్నిధాప్యే దమభిగృణంత ఉపధావంతి। ౧ ।
భద్రశ్రవసఊచుః - ఓంనమోభగవతే ధర్మాయాత్మ విశోధనాయనమ ఇతి॥ ౨ ।
అహోవిచిత్రం భగవద్విచేష్టితం ఘ్నంతం జనోయం హిమిషన్నపశ్యతి। ధ్యాయన్నసద్యర్హి వికర్మసేవితుం నిర్హృత్యపుత్రం పితరం జిజీవిషుః॥ 3 ॥ వదంతివిశ్వం

కవయన్నశ్వరం పశ్యంతి చాధ్యాత్మ విదో విపశ్చితః। తథాపి ముహ్యంతి తవాజ మాయయా సువిస్మితం కృత్యమజం నతోఽస్మితం॥ ౪ ॥ విశ్వోద్భవస్థాన నిరోధకర్మతే హ్య కర్తు రంగీకృత మప్యపావృతః। యుక్తం న చిత్రం త్వయి కార్యకారణే సర్వాత్మని వ్యతిరిక్తేచ వస్తుతః॥ ౫ ॥ వేదాన్ యుగాంతే తమసా తిరస్కృతాన్ రసాతలాద్యో నృతురంగ విగ్రహః। ప్రత్యాదదేవైకవయేభియాచతే తస్మైనమస్తే వితథేహితాయ॥

ఈ భద్రాశ్వవర్షాధిపతి భద్రశ్రవుఁడను పేరుగలరాజు. ఇతఁడు సర్వసుగుణోపేతుఁడు ధీరుఁడును, తపశ్శాలియునైనవాఁడు ఈవర్షమున సర్వులు శ్రీహాయగ్రీవమూర్తి స్వరూపుఁడగు పరమాత్మను సర్వదా కర్మభక్తిజ్ఞాన యోగాదులతోఁ బూజింతురు. సర్వవిద్యాస్వరూపమూర్తియు వేదస్వరూపుఁడును బ్రహ్మప్రాప్తస్వరూపుఁడును, ప్రకృతిగుణాతీతుఁడును. సర్వాంతర్యామియు సృష్టిస్థితిలయాధీశుండును శాశ్వతసచ్చిదానంద స్వరూపుఁడును నగు నీహాయగ్రీవమూర్తిని సర్వదా ధ్యానించి ధన్యులగుచుందురు. దీనిమూలమంత్రము ఉపాసించువారలు పైమూలము వందుఁజూచి గ్రహించవచ్చును. ఇది శ్రీహాయగ్రీవమూర్త్యుపాసన నిలయక్షేత్రము. ఈవర్షమున వియద్గంగానది మేరువుపైన బ్రహ్మసదనమునుండి తూర్పుగా నొకశాఖగాఁబ్రవహించి మేరువుపైనుండి జలపాతముగా నిలావృతవర్షమునందుగల మందర పర్వతముపైఁబడి మఱల భద్రాశ్వవర్షమునకు సీమాపర్వతముగానున్న గంధమాదన పర్వతముమీఁదఁబడి భద్రాశ్వవర్షమునందు సీతానదిగా ఆకాశగంగశాఖ ప్రవహించి అచ్చటవారలనందరిని పునీతులుగాఁజేసి తూర్పువ లవణసముద్రముఁజేరును.



## భా ర త వ ర్ష ము.

శ్రీమద్భాగవతే - స్కంధే. ౫ - అధ్యాయ ౧౯ - పుట. ౨౨౧

చూ॥ భారతే పి వర్షే భగవాన్ నారాయణాఖ్య ఆకల్పాంత ముపచిత ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యో పశమో పరమ మాత్మోప లంభన మనుగ్రహాయాత్మవదా మనుకంపయా తపో వ్యక్త గతిశ్చరతి॥ ౯ । తంభగవాన్నారదో వర్ణాశ్రమ భవతీభిర్భారతీభిః ప్రజాభిర్భగవత్ప్రోక్తాభ్యాం సాంఖ్యయోగాభ్యాం భగవదనుభవోప

వర్ణనం సావర్ణేరుపధార్యమాణః పరమభక్తియోగే నోపసరతి॥ ౮॥ ఇదంచాపి గృణాతి- ఓం నమో భగవతే- ఉపశమశీలాయ- ఉపరతానాత్మ్యాయ- నమోఽకించనవిత్తాయ- ఋషిఋషభాయ-నారాయణాయ- పరమహంసాయ- పరమగురవే ఆత్మారామాధిపతయే- నమోనమఇతి॥ ౯॥ గాయతిచేదం॥ ౧౦॥ శ్లో॥ కర్తాస్య సర్గాదిషు యోనబధ్యతే నహన్యతె దేహగతోఽపిదైహికైః। ద్రష్టుర్నదృగ్యస్య గుణైర్విదూష్యతే తస్మై నమోఽసక్త వివిక్తసాక్షిణే॥ ౧౧॥ ఇదంహియోగేశ్వర యోగనైపుణం హిరణ్యగర్భోభగవాన్ జగాదయత్। యదంతకాలేత్వయి నిర్గుణే మనోభక్త్యాదధీతోజ్ఝిత దుష్కళేబరః॥ ౧౨॥ యథైహికాముష్మిక కామలంపట స్సుతేషుదారేషు ధనేషు చింతయన్। శంకేతవిద్వాన్ కుకళేబరాత్యయాద్యస్తస్య యత్నః శ్రమ ఏవ కేవలమ్॥ ౧౩॥ తన్నః ప్రభోత్వం కుకళేబరార్పితం త్వన్మాయయాహం మమతామధోక్షజః భింద్యామయేనాశువయం సుదుర్భిదాం విధేహి యోగంత్వయినస్స్వభావజమ్॥ ౧౪॥

చూ॥ భారతేప్యస్మిన్వర్షే సరిచ్ఛైలాస్సంతి బహవః మలయో మంగళప్రస్థో మైనాకః త్రికూట ఋషభః కూటకః కోల్లస్సహ్యో వేదగిరీ ఋశ్యమూకః శ్రీశైలో వేంకటో మహేంద్రో వారిధరో వింధ్యశ్శుక్తిమానృక్షగిరిః పారియాత్రో ద్రోణశ్చిత్రకూటో గోవర్ధనో రైవతకః కకుభోనీలః కాకముఖ ఇంద్రకీలోరామగిరి రితిచ అన్యేచ శతసహస్రశైలాః- తేషాంనితంబ ప్రభవానదానద్యశ్చ సంత్య సంఖ్యాతాః॥ ౧౫॥ ఏతాసామపో భారత్యః ప్రజానామభిరేవపునంతి నామాత్మనా చోపస్పృశంతి చంద్రవశా తామ్రపర్ణీ అవటోదా కృతమాలా వైహాయసీ కావేరీ వేణీ పయస్విని పయోదా శర్కరావర్తా తుంగభద్రా కృష్ణవేణీ భీమరథీ గోదావరీ నిర్వింధ్యాపయోష్ణీ తాపీరేవా శిలా సురసా నర్మదా చర్మణ్వతీ సింధుశ్శోణశ్చనదాః మహానదీ వేదస్మృతీ ఋషికుల్యాత్రిసమా కౌశికీ మందాకినీ యమునా సరస్వతీ దృషద్వతీ గోమతీ సరయూ రోధవతీ సుషమా శతద్రుశ్చంద్రభాగా మరుద్వృధా వితస్తా అసిక్నీ విశ్వేతి మహానద్యః॥ ౧౬॥ అస్మిన్నేవ వర్షే పురుషైర్లబ్ధ జన్మభిశ్శుక్లలోహిత కృష్ణవర్ణేన స్వారబ్ధేన కర్మణా దివ్యమానుష నారకగతయో బహ్వ్యఆత్మన ఆనుపూర్వ్యేణ సర్వాహ్యేవ సర్వేషాం విధీయంతే- యథా వర్ణవిధానమపవర్గశ్చాపిభవతి॥ ౧౭॥ యోసౌభగవతి సర్వభూతాత్మన్యనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే పరమాత్మని వాసుదేవే అనన్య నిమిత్తభక్తియోగ లక్షణో నానాగతి నిమిత్తా విద్యాగ్రంధి రంధన ద్వారేణ భవతి యథాపి మహాపురుష

ప్రసంగః॥ ౧౮ ॥ ఏతదేవహి దేవాగాయంతి॥ ౧౯ ॥

శ్లో॥ అహోబతైషాం కిమకారి శోభనం ప్రసన్న ఏషాం స్విదుతస్వయం హరిః। యైర్జన్మలబ్ధం నృషు భారతాజిరే ముకుందసేవోపయికం స్పృహాహినః॥ ౧౯॥ కిందుష్కరైర్నః క్రతుభిస్తపోవ్రతై ర్దానాదిభిర్వాద్యుజయేన ఫల్గునా। నయత్ర నారాయణ పాదపంకజస్మృతిః ప్రముష్టాతిశయేంద్రియోత్సవాత్॥ ౨౦ ॥ కల్పాయుషాం స్థానజయాత్పునర్భవాత్ క్షణాయుషాం భారత భూజయోవరః। క్షణేన మర్త్యేనకృతం మనస్వినస్సన్న్యస్య సంయాంత్యభయం పదంహరేః॥ ౨౧ ॥ నయత్ర వైకుంఠకథా సుధాపగా న సాధవో భాగవతాస్తదాశ్రయాః। నయత్ర యజ్ఞేశమఖామహోత్సవాస్సురేశలోకోపినవై స సేవ్యతామ్॥ ౨౨ ॥ ప్రాప్తాం నృజాతింత్విహయేచ జంతవో జ్ఞానక్రియా ద్రవ్యకలాప సంభృతామ్। నచేద్యతేరన్న పునర్భవాయతే భూయోవనౌకా- ఇవయాంతి బంధనం॥ ౨౩ ॥ యైశ్శ్రద్ధయా బర్హిషిభాగశోహవి ర్నిరుప్త మిష్టం విధిమంత్రవస్తుతః। ఏకః పృథఙ్నామభిరాహుతో ముదాగృహ్ణాతిపూర్ణస్స్వయ మాశిషాం ప్రభుః॥ ౨౪ ॥ సత్యం దిశత్యర్థిత మర్థితో నృణాం నైవార్థదో యత్పునరర్థితాయతః। స్వయం విధత్తే భజతామనిచ్ఛతా మిచ్ఛాపిధానం నిజపాదపల్లవమ్॥ ౨౫ ॥ యద్యత్రనస్స్వర్గ సుఖావశేషితం స్విష్టస్య సూక్తస్య కృతస్యశోభనం। తేనాజనాభేస్మృతి మజ్జన్మనస్స్యాద్వర్షే హరిర్యద్భజతాం శంతనోతి॥ ౨౬ ॥

చూ॥ జంబూద్వీపస్య రాజన్నుపద్వీపా నష్టావిహైక ఉపదిశంతి- సగరాత్మజై రశ్వాన్వేషణే- ఇమాం మహీం పరితో నిఖనద్భిరుపకల్పితాః॥ ౨౭ ॥ తద్యథా స్వర్ణప్రస్థశ్చంద్రశుక్ల ఆవర్తనో రమణకో మందేహారుణః పాంచజన్యః సింహళో లంకేతిఏవం భారతోత్తమ జంబూద్వీప వర్షవిభాగో యథోద్దేశముపవర్ణితః॥ ౨౮

ఇది శ్రీమద్భాగవతే - పంచమస్కంధే - ఏకోనవింశోధ్యాయః

భారతవర్షమున భగవంతుడు నారాయణ నామమున నొప్పుచుండును. ఈ కల్పాంతమువఱకు బదరికాశ్రమంబున నివసించి తపంబొనర్చుచు లోకహితార్థమై శమాదిషట్క సంపత్తితో వర్తించుచుండు. అట్టినారాయణుని నారదమహర్షి వర్ణాశ్రమధర్మములననుసరించుచున్న భారతవర్ష జనులతోఁగూడి సాంఖ్యయోగాదులను, కర్మభక్తిజ్ఞాన-వైరాగ్యాదులను సాధనములను సావర్ణిక మనువున కుపదేశించుచు పరమభక్తితో నారాధించుచుండును. స్తోత్రమంత్రములను పురాణము

లందుఁజూడి ఉపాసకులుగావచ్చును. ఈవర్షమునకు ముఖ్యాధిదైవతము నారాయణుఁడు. ఈభారతవర్షమునందు మలయము, మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటకము, కోల్లము, సహ్యము, వేదగిరి ఋశ్యమూకము, శ్రీశైలము, వేంకటము, మహేంద్రము, వారిధరము, వింధ్యము, శుక్తిమంతము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణము, చిత్రకూటము, గోవర్ధనము రైవతకము, కకుంభము, నీలము, కాకముఖము, ఇంద్రకీలము, రామగిరి, మొదలగు పెక్కు పర్వతములుగలవు. ఇంకను నూర్లకొలదిపర్వతములుఁగలవు. ఆపర్వతములం దుద్భవించిన నదీనదంబులును బెక్కులుగలవు అవియన్నియును మిక్కిలి పుణ్యదాయకములయినవి. భారతవర్షీయు లానదులందు సుస్నాతులయి వానినామస్మరణంబుగావించి పవిత్రులగుచున్నారు. చంద్రవస, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, పయోద, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, శిల, సురస, నర్మద, చర్మణ్వతి, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయు, భోగవతి, సుషమ, శతద్రు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, అసిక్ని, విశ్వ, విపాశ, సింధుశోణాది నదములు, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, మందాకిని, యమున, సరస్వతి, గోమతీసరయు చంద్రభాగాదినదులునయ్యవి. ఈభారతవర్షమునందుఁబుట్టిన పురుషులు సత్త్వరజస్తమోగుణ కల్పిత పుణ్యపాపములను దమకర్మములచే నానావిధములగు గతులను బొందుచున్నారు. అందు సాత్వికకర్మలకు స్వర్గగతియు, రాజసకర్మలకు మానవలోకగతియుఁ దామసకర్మలకు నధోలోకగతియు గలుగును. ప్రమాణము గీతావాక్యము "ఊర్ధ్వంగచ్ఛంతి సత్వస్థామధ్యే తిష్ఠంతి రాజసాః। జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః" కర్మలననుసరించి గుణములును, గుణములననుసరించి వర్ణంబులును, వర్ణములననుసరించి మోక్షసాధనములగు ననేకధర్మములు నిర్ణీతములై యున్నవి. పురుషుఁడు (శ్రేష్ఠుడు) ఉభయులకు నన్వయము. పుణ్యపాపమగు విద్యను ముందుగాఁదెలుసుకొని దానివలన భగవత్ప్రసంగము నలవఱచుకొనవలెను. ఇదేమోక్షసాధనము. దీనివలన భగవంతునియందనన్య ఫలరూపమగు భక్తియోగముదయించును. భక్తితో జ్ఞానముగలుగును. దీనితో అమనస్కముకలిగి పరవశముఁజెందును. కొంతకాలమునకు దార్ఢ్యముతో దీర్ఘకాలానుభవముతో సమాధినిశ్చలుఁడై జీవన్ముక్తుఁడగును. ఈభారతవర్ష ప్రశస్త్యమునుగుఱించి ఊర్ధ్వలోక

దేవతలుచాల ప్రశంసించి గానముఁజేయుచున్నారు.

భారతవర్షమున భగవంతుని యవతారస్వరూపముఁ తోఁదర్శించుభాగ్యము లభించుచుండును. ఇది భారతవర్షమహాత్మ్యము. భారతవర్షము కర్మభూమి. కర్మలచేతఁ త్రివర్గములు లభించును భక్తిజ్ఞాన వైరాగ్యాదులతో బ్రహ్మలోకాదులు లభించును. ఇంద్రియసుఖాదులు శాశ్వతములుగావు. వస్త్వంతరములు. భక్తిజ్ఞాన వైరాగ్యాదులు కొంతవరకు దేహసంబంధముతోను మనస్సంబంధముతో నుండుటచేత నిమిత్తమాత్రకర్మలకుఁ గొంతవఱకు నవకాశముండును దేహాతీతముతో లోకాతీతముతో కర్మలుముగియును. ఇతరలోకాదులు కల్పాంతాయువుతో బహుదీర్ఘకాలము నేమియును జేసుకొనవీలులేని లోకాదులుగనున్నవి. భారతభూమియందు శతసంవత్సరాయువుక్షణికమే. కాబట్టి అల్పకాలమైన సమస్తపదవులను సాయుజ్యమునొందవచ్చును. అందుచేతనే భారతవర్షమునందూర్ధ్వలోకాములవారు జన్మించి ధన్యులు ముక్తులునగుచున్నారు. ఇట్టిభారత భూమియందు యజ్ఞయాగాదులుగాని, దానవ్రతాదులుగాని, ధర్మకార్యములుగాని. దేవతాదిప్రతిష్ఠలుగాని, ఇష్టాపూర్తములు మొదలైనవిగాని పితృయజ్ఞాదులగు శ్రాద్ధాదులుగాని, మంత్రజపానుష్ఠానములుగాని, ధ్యానయోగాదులుగాని తుదకు పరోపకారములుగాని యెద్దానినిఁజేయని మానవజన్మము మృగతుల్యము. జ్ఞానేంద్రియాములు, కర్మేంద్రియాములు, సర్వవిద్యలు, వేదశాస్త్రపురాణాదులు విజ్ఞానసర్వస్వమునిచ్చునను ఆలోచించక ఈదేహమే శాశ్వతమని ఉత్తమకర్మలను చేయనిచో నీజన్మము నిరర్థకమై ముందేజన్మమురాగలదో యూహింపలేము- తుదకేయొకమార్గముతోనైనను ధన్యులుగావచ్చును. మనస్సననుసరించి గుణములు, గుణములననుసరించి కర్మలు, కర్మలననుసరించి దేహాదులు, దేహాదులననుసరించి లోకాదులు సుఖదుఃఖాదులు పరివర్తనములందుచుండును. మనస్సు జడమగునొకస్థాణువు (మొద్దు). ఈస్థాణువును పాతిబెట్టి పెంచగా మధ్యలో గౌణముగా చిగిర్చి పుష్పఫలాదులవంటి సువర్ణశబ్ద, స్పర్శరూప రస, గంధాదులు వాశ్ఛాణిపాద పాయూపస్థలేర్పడును. వీటితో ఈ స్థాణువు చిగిఱించి కొమ్మలు. పత్రములు, పూలు, కాయలుగలిగి అభివృద్ధిజెంది తుదకు నివన్నియును సంబంధములుతప్పి దూరములగును. ఎప్పటివలెనే స్థాణువునిలిచి తుదకు అగ్నికి ఆహుతి కాకమానదు. ఇట్టిది కంటకవృక్షమైనచో సర్వత్ర సర్వులకు కంటకముగనేయుండును. అటులలేక సుగంధపరిమళముగల వృక్షముగా చిగిఱించినచో దీనిపత్రములు, పుష్పములు, ఫలములు దేవపూజార్హ

ములై నివేదించబడి యజ్ఞరూపకముతో భగవదర్పితమై యనంతఫలదాయకమగును. ఇట్టి యింద్రియాదులను బాహ్యములో నుపయోగించక అంతర్యాగ యాగజలముచే వాసుదేవస్వరూపమునకు నివేదించి దివ్యశబ్ద స్పర్శరూప రసగంధాదులుగ మార్పు జెందించి తుదకు వీటినన్నిటిని వదలి మనస్సునొకదానినేనిలిపి నిజస్వస్వరూప తేజోంశములో దహింపజేయుటే జ్ఞానయోగసిద్ధిమార్గము.

ఈజంబూద్వీపమునకు లవణసముద్రముచుట్టును ఆవరణముగ వలయాకారముతో లక్షయోజనముల విస్తారముగలిగియున్నది. పూర్వము సగరచక్రవర్తి కుమారు లశ్వమును వెదకుటకై భూమినిద్రవ్వి నిర్మించిన యుపద్వీపము లెనిమిది గలవని పురాణములందుగలదు. అవి (౧) స్వర్ణప్రస్థము, (౨) చంద్రశుక్లము, (౩) ఆవర్తనము, (౪) రమణకము, (౫) మందేహారుణము, (౬) పాంచజన్యము (౭) సింహళము, (౮) లంకాద్వీపముఅను నామములచేత వ్యవహరించఁబడుచున్నవి. ఈవర్తమానకాలములో నీనామము లన్నియును మార్పులుచెంది క్రొత్త నామములతో నుండుటచేతఁ బ్రత్యక్షములుగా నున్నవాటిని సహితము తెలియజాలకున్నాము. ఈలాగున అన్యాక్రాంతముతో నన్నిటికిని విరూపభిన్ననామము లేర్పడెను. ఈలాగున దివ్యయుగాంతరములనాటి సృష్టికిని నిప్పటికి నెన్నిఅవాంతరపు మార్పులున్నవో తెలియను. పర్యాలోచనచేయక మాటాడుట నిష్ప్రయోజనము. ఈవర్షమున ఆకాశగంగ మేరువుపైన బ్రహ్మసరస్సులోపడి నాలుగుశాఖలుగా నాలుగుదిశలు ప్రవహించును. ఈనదిశాఖ దక్షిణదిశయందు మేరువుపైనుండి జలపాతముగా ఇలావృతవర్షమునఁగల మేరుమందర పర్వతశిఖరమునఁబడి యామీద సీమాపర్వతముగాఁగల హేమకూట పర్వతశిఖరమునఁబడి, పిమ్మట సీమాపర్వతముగాఁగల హిమాలయ పర్వతశిఖరమునఁబడి భారతభూమి యందు అలకనంద నామముతో ఆకాశగంగాశాఖ ప్రవహించి బదరీ, హరిద్వార ప్రయాగలదాటి కాశీక్షేత్రమున విశ్వేశ్వరునికిఁ బ్రదక్షిణముగాఁ బ్రవహించి కలకత్తాతీరమున తొమ్మిదిశాఖలుగా బంగాళాఖాతముజేరును. వీటిమధ్యగల భూభాగములను నవద్వీపములనికూడపిల్తురు. ఈనది భారతభూమిలో సర్వులను పునీతులుగఁ జేయుచున్నది. గంగామహిమ వర్ణనాతీతము.

—o—

# భారతవర్షమున కొన్ని పర్వతములు, నదులు, సరోవరములు, వనములు.

( మత్స్యపురాణము. )

## —♦ కైలాసపర్వతము. ♦—

హిమాలయపర్వత పృష్ఠభాగముననున్నది. దీనియందు కుబేరుఁడనేక గుహ్యకులతో (దేవయోనిజాతులై) నివసించియుండును. దీనియందనేక సరోవరములున్నవి. ఇచ్చటశివుండుండును. ఇదిశివునికి ముఖ్యపర్వతము,

## —♦ సువేలపర్వతము. ♦—

మందాకినియను ఆకాశగంగ దీనియందుఁబడును. శ్రీరామాయణమందీ పర్వతము లంకలోనున్నటుల జెప్పబడియున్నది. ఈపర్వతనదీతీరమునఁ నందనవనమున్నది.

## —♦ చంద్రప్రభయను పర్వతము. ♦—

సువేలపర్వతమున కెదురుగ నీపర్వతమున్నది. దీని సమీపములో అచ్ఛోదమను సరస్సున్నది. ఈసరస్సునుండి అచ్ఛోదమను పేరుతో నొకనది ప్రవహించుచున్నది. దీనితీరమునఁ జైత్రరథమను వనమున్నది. ఈచంద్రప్రభయను పర్వతమందు యక్షసేనాధిపతియగు మణిభద్రుఁడు వసించియుండును.

## —♦ శబలపర్వతము. ♦—

ఈపర్వతమున కెదుట సూర్యప్రభ లేక స్వయంప్రభయను వనంబుగలదు. దీనియందు లోహితంబను కమలాకరంబున్నది. దీనియందు తాహిత్యంబనునది యుత్పన్నమై నదీరూపమున ప్రవహించుచుండును. ఈ నదీతీరమున దేవారణ్యంబను వనంబుగలదు. అందు మణిధరుండను యక్షుఁడు గుహ్యకపరివారముతో పరివేష్టితుఁడై వసించియుండును.

## —♦ కకుద్మంతపర్వతము. ♦—

ఇది కైలాసపర్వతమునకుఁ బశ్చిమంబునఁగలదు. దీనియందు సరోవరములున్నవి. ఈసరోవరములనుండి యుద్భవించి ప్రవహించునదే సరయూనది యగుచున్నది. దీనితీరమున వైభ్రాజమను వనంబుగలదు. ఇందు, కుబేరానుచరుఁడగు ప్రహేతి సుతుఁడునగు బ్రహ్మధానుఁడు నివసించియున్నాఁడు.

—♦ అరుణ - ముంజవంతం - పర్వతములు. ♦—

ఈరెండు పర్వతములు పై కకుద్మంత పర్వతమునకు వెనుకభాగమందుఁగలవు. ముంజపర్వతమునందు శైలోదంబను సరోవరమున్నది. దీనినుండి శైలోదమను నది ప్రవహించుచున్నది. ఈనది దక్షు, సీతయను నదులమధ్యఁ బ్రవహించి సముద్రమును చేరును. ఈనది శివునికి ముఖ్యస్థానము, దీనినే శిలానదియనికూడ చెప్పుదురు.

—♦ గౌరిపర్వతము లేక గౌరీశిఖరము. ♦—

కైలాస పర్వతమున కుత్తరదిశనున్నది. ఇందుఁగాంచన వాలుకమను పుష్కరిణియున్నది. దీనినుండి బిందుసరోవరమను నది ప్రవహించుచున్నది. ఇచ్చట భగీరథుండ నేక సంవత్సరములు గంగను దెచ్చుటకై తపంబుజేసెను. ఈగంగానదియేడు శాఖలై ప్రవహించి సముద్రమును జేరెను. ఈగంగ శివుని తపోయోగమహిమచేఁ గట్టఁబడినందునఁ గుపితురాలై శివుని నిగ్రహించి పాతాళమునకేగుటకు సమకట్టిన దానిని శివుండుదెలిసికొని బ్రహ్మవాక్యముస్మరించి వదలినందున నాగంగ ప్రవాహముగ వెడలి అందులో నళిని, హ్లాదిని, ప్లావని, యను మూడుప్రవాహంబులు తూర్పు దిక్కునను, సీత, చక్షు, సింధు యను మూడు ప్రవాహంబులు పశ్చిమదిక్కునను, ఏడవది భగీరథునివెంబడించి దక్షిణదిక్కునఁ బ్రవహించినది. భగీరథుని వెంబడించుటచేత భాగీరథియను పేరు దక్షిణదిక్కునవచ్చిన శాఖబడసెను. మరల దీనియందనేకోపనదులు కలిసెను.

వస్వోకసారంబను నదీతీరమున సురభియను వనంబుగలదు. అరిసు కుబేరానుచరుఁడగు హిరణ్యశృంగుఁడను బ్రహ్మరాక్షసుఁడు విద్వద్బృందములతోడ నివసించియుండును.

హేమకూటపర్వతమున సరస్వతియను సరోవరమునుండి సరస్వతియను నది జనించెను. దీనినుండిజనించినవి గాంధారి, కల యను రెండునదులుగలవు.

మానస సరోవరమనునది హిమవత్పర్వతమునం దుత్తరదిశయందున్నది. దీనియందు. జ్యోత్స్న, అమృతకాంత యను నదులుపుట్టెను.

కురుదేశమున వైజయంబులను పండ్రెండు హ్రదంబులున్నవి. వీటినుండి, శాంతి, సంధ్యలను రెండునదులు ప్రవహించును.

—♦ సముద్రమున మునిగిన పర్వతములు. ♦—

ఋషభ, మైనాక, బాలక, చంద్రకాంత, ద్రోణ, సుమహాంత, చక్ర,

రుధికర, నారద, జీమూత, ద్రావణాదులు. ఇవి చతుర్దిశలయందు మునిగియున్నవి.

—♦ సంవర్తక పర్వతము. ♦—

ఇది వజ్రమైనాక పర్వతంబుల మధ్యనున్నది. ఇది అగ్నిపర్వతము. ఇది ఉదకపానమును జేయుచుండును.

—♦ చిత్రసానుపర్వతము - మానసపర్వతము. ♦—

శుద్ధోదక సముద్రమునఁ బూర్వదిశయందుఁగలదు. ఇది ౨౯౦౦౦ యోజనాయతము. దీనికుత్తరమున మానసంబను పర్వతము ౨౪,౦౦౦ యోజనపరిమితి గలిగియున్నది.

ఇంకను ననేకపర్వతములు సముద్రమున మునిగియున్నవి. కాలానుసారముగ నన్నియు బయలుదేరి దెలియుచుండగలవు. ప్రకృతిపరిణామ ప్రవృత్తితో సర్వదా యుండునేగాని యూరకయుండజాలదు.

—o—

# కింపురుషవర్షము.

శ్రీమద్భాగవతే - స్కంధ ౫ - అధ్యా. ౧౯ - పుట ౪౪౦.

శ్రీశుకః - చూ॥ కింపురుషే భగవంతమాది పురుషం లక్ష్మణాగ్రజం సీతాభిరామం రామం తచ్చరణ సన్నికర్షాభితతః పరమభాగవతోత్తమో హనుమాన్ సహ కింపురుషైరవిరతభక్తి రుపాస్తే- ఆర్ష్టిషేణేన సహగంధర్వైరనుగీయమానాం పరమకళ్యాణీం భర్తృభగవత్కథాం సంశృణోతి స్వయం చేదంగాయతి॥

ఓం నమోభగవతే- ఉత్తమశ్లోకాయ- నమ ఆర్యలక్షణ శీలవ్రతాయ- నమ ఉపశిక్షితాత్మన- నమఉపాసితలోకాయ- నమస్సాధువాద నికషణాయ- నమో బ్రహ్మణ్యదేవాయ- మహాపురుషాయ- మహారాజాయ నమఇతి। ౧ ॥

శ్లో॥ యత్తద్విశుద్ధానుభవైకమాత్రం స్వతేజసాధ్వస్త గుణవ్యవస్థం। ప్రత్యక్ప్రశాంతం సుధియోపలంభనం హ్యనామరూపం నిరహంప్రపద్యే॥ ౨ ॥ మర్త్యావతారస్త్విహమర్త్య శిక్షణం రక్షోవధాయైవ నకేవలంవిభోః॥ కుతోన్యథాస్యాద్రమతస్స్వఆత్మనః సీతాకృతాని వ్యసనానీశ్వరస్య। 3 ॥ నవైస ఆత్మాత్మవతాం సుహృత్తమఃసక్త స్త్రిలోక్యాం భగవాన్వాసుదేవః। నస్త్రీకృతం కశ్మల మశ్నువీ

తనలక్ష్మణంచాపి విహాతుమర్హతి॥ ౪ ॥ నజన్మనూనం మహతోన సౌభగం నచాపి బుద్ధిర్నాకృతిస్తోష హేతుః। తైర్యద్విసృష్టానపినోవనౌక సశ్చకారసఖ్యేబతలక్ష్మణాగ్రజః॥ ౫ ॥ సురోసురో వాథనరోథవానరః- సర్వాత్మనాయ స్సుకృతజ్ఞముత్తమమ్। భజేతరామం మనుజాకృతిం హరిం య ఉత్తరాననయత్కోసలాన్దివమ్॥ ౬ ॥

శ్రీకింపురుష వర్షాధీశుండు ఆర్ష్టిషేణుఁడు. భగవంతుఁడగు శ్రీరామచంద్రమూర్తియు లక్ష్మణున కగ్రజుండును, సీతాభిరాముండునగు మహాపురుషుని పాద కమల సేవాసక్తుఁడును బరమభాగవతోత్తముండును నగు హనుమంతుడు కింపురుష వర్షస్థులగు ప్రజలతోఁగూడి యవిచ్ఛిన్నకర్మ భక్తిజ్ఞాన వైరాగ్యములతో సర్వదా నుపాసించుచుండును. ఈ ఉపాసనా మూలమంత్రమును పై మూలమునందుఁ జూచిగ్రహించవచ్చును.

—౦—

# హరివర్షము,

---

శ్రీమహాభారతే - స్కంధ. ౫ - అధ్యా. ౧౮ - పుట. ౩౬.

హరివర్షేచాపిభగవాన్ నరహరిరూపేణాస్తే- తద్రూపగ్రహణ నిమిత్తముత్తరత్రాభిధాస్యే। ౭ । తద్దయితం రూపం మహాపురుషగుణ భాజనం మహాభాగవతో దైత్యదానవ కులతీర్థీకరణ శీలాచరితః। ప్రహ్లాదోఽవ్యవధానాద నన్యభక్తియోగేన సహ తద్వర్షపురుషై రుపాస్తే॥ ౮ ॥ ఇదంచోదాహరంతిః ఓంనమో భగవతే నరసింహాయ నమస్తే జస్తేజసే ఆవిరావిర్భావ వజ్రనఖ వజ్రదంష్ట్ర కర్మాశయాన్ రంధయ రంధయ నమ ఉగ్రస్వభావాయ మహాత్మనే- తమోగ్రసగ్రస స్వాహా. అభయమభయమాత్మని భూయిష్ఠాఇతి॥ ౯ ॥ శ్లో॥ స్వస్త్యస్తువిశ్వస్య ఖలః ప్రసీదతాం ధ్యాయంతుభూతాని శివంమిథోధియా। మనశ్చభద్రం భజతాదధోక్షజే హ్యావేశ్యతాం నోమతి రప్యహైతుకీ॥ ౧౦ ॥ మాగారదారాత్మజ విత్తబంధుషు సంగోయదిస్యా ద్భగవత్ప్రియేషునః। యఃప్రాణవృత్త్యా పరితుష్టఆత్మవాన్ సిధ్యత్యదూరాన్న తథేంద్రియప్రియః॥ ౧౧ ॥ యత్సంగలబ్ధం నిజవీర్యవైభవం తీర్థంముహుస్సం స్పృశతాం హిమానసం। హరత్యజోంత శ్శ్రుతిభిర్గతోంగజం కోవైనసేవేత ముకుంద విక్రమం॥ ౧౨ ॥ యస్యాస్తిభక్తిర్భగవత్యకించనా సర్వైర్గుణై స్తత్రసమా

సతేసురాః। హరావభక్తస్య కుతో మహద్గుణా మనోరథే నాసతి ధావతో బహిః॥ ౧౩
హరిర్హిసాక్షాద్భగవాన్ శరీరిణా మాత్మాఝషాణా మివతోయమీప్సితం। హిత్వా
మహాంస్తం యదిసజ్జతే గృహేతదా మహత్త్వం వయసా దంపతీనాం॥ ౧౪ ॥ తస్మా
ద్రజో౽రాగ విషాదమన్యుమాన స్పృహాభయద్త్యైన్యాధిమూలం। హిత్వాగృహం సం
సృతిచక్రవాళం నృసింహపాదం భజతాకుతోభయం॥ ౧౫ ॥

ఈవర్షాధిపతి ప్రహ్లాదుఁడు. ఇదిదైత్యదానవులకు నిలయభూమి. వీరలందరు దైత్యకులాధీశుండగు ప్రహ్లాదునితోఁగూడి సుస్నాతులై సదాచార సంపదతో శ్రీ లక్ష్మీనృసింహావతారమూర్తిని, కర్మభక్తిజ్ఞాన యోగాదులతోఁ బరమభక్తితో నారాధింతురు. ప్రహ్లాదానుచర దైత్యదానవులందరు ప్రహ్లాదునియందు పరమ భక్తిభావముతో మెలగుచుందురు. కేవలపరమాత్మరూపముతో నీనృసింహమూర్తిని సర్వదా ధ్యానించి ధన్యులగుచున్నారు. దీని మూలమంత్రమును ఉపాసకులు పైమూలమునందుజూచి గ్రహించవచ్చును.



## కే తు మా ల వ ర్ష ము,

శ్రీమద్భాగవతే - స్కంధ. ౫ - అధ్యాయం ౧౮ - పుట. ౪౩౭

గద్యః - కేతుమాలే భగవాన్ కామదేవస్వరూపేణ లక్ష్మ్యాఃప్రియచికీర్షయా ప్రజాపతేర్దుహితౄణాం పుత్రాణాంచ తద్వర్షపతీనాం పురుషాయుషా హోరాత్ర పరిసంఖ్యాతానాం యాసాంగర్భే మహాపురుష మహాస్త్రతేజ సోద్వేజిత తమోమన సాం విధ్వస్తాః వ్యసవస్సంవత్సరాంతేవినశ్యంతి॥ ౧౭ ॥ అతీవసులలిత గతివిలాస లసిత రుచిరహాస లేశాః లోకలీలయా కించిదుత్తంభిత సుందర భ్రూమండల సుభగ వదనారవింద శ్రియారమాం రమయన్నాత్మేంద్రియాణి రమయతే॥ ౧౮ ॥ తద్భ గవతో మాయామయం రూపం పరమసమాధియోగేన రమాదేవీ సంవత్సరస్య రాత్రిషుప్రజాపతే ర్దుహితృభి రుపేతా హస్సుచ తద్భర్తృభి రుపాస్తే॥ ౧౯ ఇదంచోదాహరంతి.- ఓం హ్రాం - హ్రీం - హ్రూం - ఓంనమో భగవతే - హృషీ కేశాయ - సర్వగుణవిశేష విలక్షితాత్మనే ఆకూతీనాం - చిత్తీనాం - చేతసాంచ - విశేషాణాంచాధిపతయే షోడశకళాయ - ఛందోమయాయ - అన్నమయాయ - అమృత

మయాయ- సర్వమయాయ- సహసే- ఓజసే- బలాయ- కాంతాయ- కామాయ నమస్తే- ఉభయత్రభూయాదితి॥ ౧౯ ॥ శ్లో॥ స్త్రియో వ్రతైస్త్వాం హృషీకేశ్వరం హ్యారాధ్య లోకే పతి మాశాసతేన్యమ్। తాసాం న తే వై పరిపాంత్యపత్యం ప్రియం ధనాయూంషి యతోస్వతంత్రాః॥ ౨౦ ॥ స వై పతిస్స్యాద కుతోభయస్స్వయం సమంతతః పాతిభయాతురంజనమ్। స ఏక ఏవేత రథామిథో భయం నైవాత్మ లాభాదధిమన్యతే పరమ్॥ ౨౧ ॥ యా తస్య తే పాదసరోరుహార్హణం నకామయే త్సాఖిల కామలంపటా। తదేవ రాశీప్సిత మీప్సితోర్చితో యద్భగ్నయాచ్ఞా భగవన్ ప్రతప్యతే॥ ౨౨ ॥ మత్ప్రాప్తయేజేశ సురాదయః ప్రభో తప్యంత ఉగ్రం తప ఐంద్రియేధియః। ఋతే భవత్పాద పరాయణాన్న మాంవిందంత్యహం త్వద్ధృదయా యతోజిత॥ ౨౩ ॥ సత్వం మమాప్యచ్యుత శీర్ష్ణివందితం కరాంబుజం యత్త్వదధాయి సాత్వతామ్। భిభర్షిమాం లక్ష్మవరేణ్య మాయయా క ఈశ్వరస్యేహిత మూహితుం విభుః॥ ౨౪ ॥

ఈ కేతుమాలవర్షంబునఁ బ్రజాపతికి రాత్ర్యభిమాన దేవతలనెడి పుత్రికలును, అహరభిమానదేవులనెడి పుత్రులుగలరు. రాత్రిందివాధిష్ఠాతలగు వారలే శతవత్సర రూపమగు నాయుర్దాయమును గణించుచుందురు. వారలీ కేతుమాలవర్షమున కధిపతులు. మహాపురుషుండైన నారాయణునిఁ బరాక్రాంతులు వీరిగర్భస్థజీవులను సంవత్సరాంతంబున నిర్జీవభావంబుగ బ్రసవింపఁజేయుచు. అందుచేత శ్రీలక్ష్మికిని రాత్ర్యభిమాన దేవతలకును, అహరభిమాన దేవతలకును బ్రియంబుజేయదలంచి శ్రీభగవంతుండు ప్రద్యుమ్నరూపంబున వర్తించుచుండును. ఈవర్షప్రజలు తనుకు సంతానములు కలిగి దీర్ఘాయువులుగానుండుటకై రమాదేవిని అభిమానదేవతలను ప్రద్యుమ్నమూర్తిని సర్వవిధములతోఁ గర్మభక్తిజ్ఞాన వైరాగ్యములతోఁ బ్రీతి కలుగులాగున ఉపాసించి సర్వసుఖ సంపదలను బొందుదురు. ఈ ఉపాసనామూల మంత్రమును పైమూలమందుజూచిగ్రహించవచ్చును.

ఈవర్షమున స్వర్గగంగ మేరుపర్వతము పైనగల బ్రహ్మసరస్సునందుజేరి నాలుగుశాఖలుగా నలుదిశలందు జలపాతముగాఁ గ్రిందఁబడును. ఇదియే మేరు పర్వత పశ్చిమదిశనుండి క్రిందికి ఇలావృతవర్షమునందుఁగల సుపార్శ్వపర్వత శిఖరమునఁబడి మఱల సీమాపర్వతముగాగల మాల్యవంత పర్వతము శిఖరమునఁబడి యీ కేతుమాలవర్షమునఁ జాక్షుష నామముతోఁ బ్రాచీనసరస్వతిగా బ్రవహించి

పశ్చిమదిశయందుఁగల లవణసముద్రముఁ జేరుచుండును. ఈనదీప్రవాహము నీ వర్షప్రజలందరినిఁ బుణ్యులుగఁ జేసి ధన్యతఁగావించును. గంగామహిమ వర్ణనాతీతము.



## ర మ్య క వ ర్ష ము.

శ్రీమద్భాగవతే - స్కంధే ౫ - అధ్యా. ౧౮ - పుట. ౮౩౭+౮౩౮.

చూ॥ రమ్యకేపి- భగవతః ప్రియతమం మాత్స్యమవతార రూపం తద్వర్ష పురుషస్యమనోః ప్రాక్ప్రదర్శితం ఇదానీమపి మహతా భక్తియోగే నారాధయతి.

ఇదంచోదాహరతి- ఓంనమోభగవతె ముఖ్యతమాయ నమస్సత్వాయ ప్రాణాయౌజసే సహసే బలాయ మహామత్స్యాయ నమఇతి॥ ౨౫॥

శ్లో॥ అంతర్బహిశ్చాఖిల లోకపాలకై రదృష్టరూపో విచరస్యురుస్వనః। స ఈశ్వరస్త్వం యఇదం వశే యన్నామ్నాయథా దారుమయీం నరః స్త్రియమ్॥ ౨౬ యం లోకపాలాః కిలమత్సర జ్వరాఃహిత్వాయ తంతోపి పృథక్సమేత్యచ। పాతుం న శేకుర్ద్వి పదశ్చతుష్పదస్సరీసృపం స్థాస్నుయదత్రదృశ్యతే॥ ౨౭॥ భవాన్ యుగాంతార్ణవ ఊర్మిమాలిని క్షోణీమిమామోషధి వీరుధాంనిధిమ్। మయాసహోరుక్రమ తేజ ఓజసా తస్మైజగత్ప్రాణ గుణాత్మనేనమః॥ ౨౮॥

రమ్యకవర్షమునకు మనువధిపతి. అతఁడు యుగాంతమందుఁజూచిన భగవత్స్వరూప మత్స్యమూర్తిని అభిన్నచ్ఛిన్న కర్మభక్తి జ్ఞానవైరాగ్యాదులతో సర్వదా స్తుతించుచు పరమభక్తితో నారాధించుచుండును. ఈ ఉపాసనా మూలమంత్రమును పైమూలమునందుఁ జూచి గ్రహించవచ్చును.



## హి ర ణ్మ య వ ర్ష ము.

శ్రీమన్మహాభాగవతే - స్కంధే. ౫ - అధ్యా. ౧౮ - పుట ౮౩౮

చూ॥ హిరణ్మయేతు భగవాన్నివసతి కూర్మతనుం బిభ్రాణస్తస్య తత్ప్రియతమాం తనుమర్యమాసహ తద్వర్షపురుషైః పితృగణాధిపతి రుపధావతి- మంత్రమిదం

చానుజపతి॥ ఓం నమోభగవతే- అకూపారాయ- సర్వసత్త్వగుణవిశేషణాయ నోపలక్షితస్థానాయ నమోవర్ష్మణే నమోభూమ్నే నమోవస్థానాయ నమస్తేఇతి-శ్లో యద్రూపమే తన్నిజమాయ యార్పితం చార్థస్వరూపం బహురూపరూపితమ్॥ సంఖ్యానయస్యాస్త్యయథో పలంభ నాత్తస్మైనమస్తే వ్యపదేశరూపిణే॥ 30॥ జరాయుజం స్వేదజమండజోద్భిజం చరాచరం దేవర్షిభూతమైంద్రియమ్॥ ద్యౌః ఖం-క్షితి శ్శైల సరిత్సముద్రా ద్వీపగ్రహర్క్షే త్యభిధేయఏకః॥ 31॥ యస్మిన్నసంఖ్యేయ విశేషనామరూపాకృతౌ కవిభిః కల్పితేయమ్। సంఖ్యాయ యాతత్త్వదృశాపనీయతే తస్మైనమస్సాంఖ్యనిదర్శనాయ॥ 32॥

హిరణ్మయవర్షమున శ్రీభగవంతుండు కూర్మరూపమునొంది వర్తించుచుండును. పితృగణంబుల కధిపతియగు నర్యముఁడు భగవంతునికిఁ బ్రియతమమగు నాకూర్మరూపమున నావర్షమునందుండు జనులతోఁగూడి స్తోత్రములచేతను మంత్రములచేతను మానసిక కర్మభక్తి జ్ఞానవైరాగ్యాదులతో నుపాసించును. ఈ ఉపాసనా మూలమంత్రమును పైమూలమునందుఁ జూచి గ్రహించవచ్చును.



## కురు వర్షము.

శ్రీమద్భాగవతం స్కంధం 5 అధ్యాయం 18 పుట 438

చూ॥ ఉత్తరేషు కురుషు భగవాన్‌యజ్ఞ పురుషః కృతవరాహ రూపఆస్తే తంతుదేవీ హ్యేషాభూస్సహ కురుభిరస్ఖలిత భక్తియోగే నోపధావతి ఇమాంచ పరమాం వారాహీముపనిషద మావర్తయతి॥

ఓం నమోభగవతే మంత్రతత్త్వలింగాయ యజ్ఞక్రతవే మహాధ్వరావయవాయ మహీధరాయ మహాపురుషాయనమః కర్మశుక్లాయ త్రియుగాయా గుణాయ నమస్తే ఇతి॥ 33। శ్లో॥ యస్యస్వరూపం కవయోవిపశ్చితో గుణేషు దారుష్వివ జాతవేదసం- మథ్నంతి మథ్నామనసాది దృక్షవో గూఢం క్రియార్థైర్నమ ఈరితాత్మనే॥ 34 ॥ ద్రవ్యక్రియా హేత్వయనేశ కర్తృభిర్మాయాగుణైర్వస్తు నిరీక్షితాత్మనే! అన్వీక్షయాంగాతి శయాత్మబుద్ధి భిర్నిరస్తమాయాకృతయే నమోనమః॥ 35॥ కరోతి విశ్వస్థితి సంయమోదయం యస్యేప్సితం నేప్సిత మీక్షితుర్గుణైః। మాయా

యథా యో భ్రమతే తదాశ్రియం గ్రాహ్ణోపనమస్తే గుణకర్మసాక్షిణే! 36 ॥
ప్రమథ్య దైత్యం ప్రతివారణం మృధేయోమాం రసాయా జగదాది సూకరః॥
కృత్వాగ్రదంష్ట్రే నిరగాదుదన్వతః క్రీడన్నివేభః ప్రణతోస్మితం విభుమ్। 39 ॥
ఇతి శ్రీ మద్భాగవతే పంచమస్కంధే అష్టాద శోధ్యాయః

కురువర్షమునందు భగవంతుఁడు వరాహరూపమున వర్తించు చుండును. భూదేవి ఇచ్చటి ప్రజతో అవిచ్ఛిన్నభక్తియోగమున నారాధించుచు ఉపనిషద్వాక్యమును జపించుచుండును. కేవల యజ్ఞరూప భగవదవతార వరాహమూర్తిగఁ కర్మభక్తి జ్ఞానవైరాగ్యాదులతో నారాధించి ధన్యులగుచున్నారు. ఈ ఉపాస నామాల మంత్రము ను పైమూలమందు గ్రహించవచ్చును

ఈవర్షమున స్వర్గగంగ మేరుపర్వతముపైగల బ్రహ్మసరస్సునుండి ఉత్తరదిశ శాఖగా భద్ర యనుపేరుతో మేరూపరినుండి జలపాతముగ నిలావృత వర్షమునఁ గల కుముదపర్వత శిఖరమునఁబడి. మఱల సీమాపర్వతమగు నీలపర్వతశిఖరమునఁ బడి, మరల శృంగపర్వత శిఖరమునఁబడి కురువర్షమునందుఁ బ్రవహించి ఉత్తర లవణసముద్రముఁ జేరుచున్నది. ఈ గంగానదిమహిమ వర్ణనాతీతము. ఈనదియందు స్నానాదులొనర్చినవారు పరిశుద్ధులై ధన్యులగుదురు.



## ప్ల క్ష ద్వీ ప ము.

శ్రీమద్భాగవతే - పంచమస్కంధే - వింశోధ్యాః - పుట. 883

శ్రీశుకః - చూ॥ అతః పరంప్లక్షాదీనాం ప్రమాణలక్షణ సంస్థానతో వర్ష విభాగోయన్యోద్దేశ ముపవర్ణ్యతే। జంబూద్వీపో యావత్ప్రమాణ విస్తారస్తావతా క్షారోదధినా పరివేష్టితో యథా మేరు ర్జంబ్వాఖ్యేన లవణో దధిరపి తతోపిద్విగుణ విశాలేన ప్లక్షాఖ్యే నపరిక్షిప్తః। యథాపరిఖా బాహ్యోపవనేన। ౧ ॥ ప్లక్షో జంబూప్రమాణో ద్వీపాఖ్యాతికరోహిరణ్మయ ఉత్థితో యత్రాగ్ని రుపాస్తే సప్త జిహ్వః తస్యాధిపతిః ప్రియవ్రతాత్మజ- ఇధ్మజిహ్వ- స్స్వంద్వీపం సప్తవర్షాణి విభజ్య సప్తేభ్యో వర్షనామేభ్య ఆత్మజేభ్య ఆకలయ్య స్వయమాత్మయోగే నోపరరామ॥౨॥ శివం యశస్యం సుభద్రం శాంతం క్షేమ మభయ మమృతమితి వర్షాణి- తేషుగిర యో సప్తైవాభిజ్ఞాతాః- మణికూటో- వజ్రకూట ఇంద్రసేనో జ్యోతిష్మా

## (౧) సప్తద్వీప సముద్రముల చిత్రపట సంఖ్యల వివరము.

— పెద్దసంఖ్యలు —

(౧) మేరోపరి పీఠము, (౨) సూర్యరథ ఈషాదండము యిరుసు, (మేరువునకు సంబంధము) (3) సూర్యుడు, (౪) సూర్యరథ సారధి అనూరుడు, (౫) సూర్యరథచక్ర త్రినాభి, (౬) సూర్యరథ ఈషాదండమునకును ధృవునికిగల సంబంధ రెండవదండము (యిరుసు) (౭) సీతాయను పేరుగల గంగాధార, ఇది మేరుపీఠ మధ్యలోగల బ్రహ్మపురమునుండి వెడలి తూర్పుదిశనుండి క్రిందికి జలపాతముగా గంధమాదన పర్వతశిఖరమునఁబడి జంబూద్వీపములో దూర్పుదిశనగల భద్రాశ్వవర్షములోఁ బ్రవహించి దూర్పుగా లవణసముద్రములో గలియును. (౮) అలకనంద మేరుపీఠ మధ్యలోఁగల బ్రహ్మపురమునుండి దక్షిణదిశలోఁ గ్రిందికి బడు గంగాజలపాతము. ఇది హిమాచలశిఖరమునఁబడి మనభారతభూమిలో బ్రవహించు గంగానది, (౯) భద్రయను గంగా జలపాతము. ఇది మేరుపీఠమధ్యలోఁగల బ్రహ్మపురమునుండి ఉత్తరదిశలో వెలువడి జంబూద్వీపము నుత్తర దిశలోగల శృంగవచ్ఛిఖరంబునఁ బడి కురువర్షములోఁ బ్రవహించు గంగా ప్రవాహము (౧౦) చాక్షుష యను గంగాధార. ఇది మేరుపీఠ మధ్యలోగల బ్రహ్మపురమునఁ బశ్చిమ దిశనుండి క్రిందికిబడు గంగా జలపాతము. ఇది జంబూద్వీప పశ్చిమములో గల కేతుమాల వర్షంబున బ్రవహించు గంగా ప్రవాహము. (౧౧) మానసోత్తర పర్వత ముత్తరదిశనగల సుందరమగు విభావరియను గుబేరపురము. (౧౨) రాహు కేతువుల మండలము. (౧3) సిద్ధచారణ మండలము. (౧౪) యక్షరక్ష రాక్షసాదుల మండలము. (౧౫) మేఘమండలము. (౧౬) సూర్యరథముయొక్క. (౧౭) సూర్య రథాశ్వముల కాడిమాను. (౧౮) సూర్యరథాశ్వ సప్తకము. ఛందోశ్వములు (అశ్వమున సప్తగుణములు గలది) అశ్వముల వివరము ముందు చిన్నసంఖ్యలలోఁ జూడను. (౧౯) మానసోత్తరపర్వతమున దూర్పుదిశనగల దేవధానియగు నింద్ర పురము (౨౦) లోకాలోకపర్వతము. (౨౧) స్వర్ణభూమి (అగ్నిమార్గము). (౨౨) శుద్ధోదక సముద్రము (౨3) పుష్కర ద్వీపార్ధభాగము (౨౪) మానసోత్తర పర్వతము, ఇది పుష్కరద్వీపమధ్యలో నున్నది. దీనిపైననే సూర్యరథ చక్రము దిరుగుచున్నది. (౨౫) పుష్కరద్వీపార్ధ భాగము. (౨౬) క్షీరసముద్రము. (౨౭) శాల్మలీద్వీపము. (౨౮) దధిసముద్రము. (౨౯) శాకద్వీపము. (3౦) సర్పిసముద్రము. (3౧) క్రౌంచద్వీపము. (3౨) సురాసముద్రము (33) కశద్వీపము, (3౪) ఇక్షుసముద్రము. (3౫) ప్లక్షద్వీపము. (3౬) లవణసముద్రము. (3౭)

జంబూద్వీపము (దీని ప్రత్యేకించిన చిత్రపటమును జూడుము) (౩౮) మేరుపర్వతము. దీనినిగురించి విశేషమును జూడుము. (౩౯) మేరుపర్వత మూలము. ఇది జంబూ ద్వీపమధ్యలోగల ఇలావృతవర్షమధ్యలో నున్నది. (౩౯) మేరుపర్వతమూల వలయము. (౪౦) మానసోత్తర పర్వతమున దక్షిణదిశలోగల సంయమినీపురము. (౪౧) మానసోత్తర పర్వతమున పశ్చిమదిశలోగల వారుణియను వరుణపురము. (౪౨) సప్తపాతాళాదులు. (౪౩) మహాజలము (౪౪) నరకములు. (౪౫) మహాభీకరకాలాగ్ని. (౪౬) జలము. (౪౭) కాలాగ్ని. (౪౮) సంకర్షణస్వరూప ఆదిశేషుడు. (౪౯) ఆదికూర్మము. (౫౦) ఆదియజ్ఞ వరాహము (౫౧) ఆధారశక్తి. (౫౨) సప్తావరణములు.

ప్లక్షద్వీపాది పుష్కరద్వీపాంతములోగల పర్వతసంఖ్యల నదుల సంఖ్యలాదిగా విషయాదులను నాయా ద్వీపాదుల విషయ విమర్శనలో జూడవచ్చును.

—♦ చిన్నసంఖ్యల వివరము ♦—

మేరూపరిలోగల చిన్న తెనుగు సంఖ్యల వివరము. (౧) ఇంద్రపురము సప్తద్వీప సముద్రముల చిత్రపటసంఖ్యల వివరము. (౨) అగ్నిపురము. (౩) యమపురము. (౪) నైరృతిపురము. (౫) వరుణపురము. (౬) వాయుపురము. (౭) కుబేరపురము. (౮) ఈశానపురము.

—♦ ఆంగ్ల సంఖ్యల వివరము ♦—

(1) ఇంద్రపర్వతము (ప్రాగాదిగ) (2) జ్యోతిష్కశృంగ పర్వతము. (3) నీలపర్వతము. (4) నైరృతి పర్వతము. (5) చిత్రశిఖర పర్వతము. (6) స్ఫటికశృంగ పర్వతము. (7) మరుత్పర్వతము (8) చంద్రాజనక పర్వతము. (9) ఈశాన పర్వతము. (10) సౌమనస్య పర్వతము. (11) రజతశృంగ పర్వతము. (12) సుమేరు మధ్యశృంగ పర్వతము. (13) వైడూర పర్వతము.

—♦ సూర్యరథాశ్వముల సంఖ్యల వివరము ♦—

"ఏకోఅశ్వోవహతి సప్తనామ" అని ఉపనిషత్ప్రమాణము. అశ్వమన సప్తవిధ గుణములు గలదని యర్థము. గుణములే రంగులు. జలభూతముతో తేజస్సు చేరుటచేత రంగులుగా మారును. ఇవియే అశ్వములుగను (స్థూలరూపము) ఆకాశ

వాయువులో వేద ఛందస్సులుగను తేజోభూతముతో అనూరుడుగను, యేకచక్రమే పృథివిగను, చక్రముయొక్క త్రినాభులే త్రికాలములుగను సప్తాశ్వములే సప్తగుణ రూపసముద్ర-ద్వీపములుగను తెలియవలెను.

సూర్యరథాశ్వముల సంఖ్యల వివరము. (౧) గాయత్రీ ఛందోరూపాశ్వము. (౨) బృహతీ ఛందోరూపాశ్వము. (౩) ఉష్ణిక్ ఛందోరూపాశ్వము. (౪) జగతీ ఛందోరూపాశ్వము (౫) త్రిష్టుప్ ఛందోరూపాశ్వము. (౬) అనుష్టుప్ ఛందోరూపాశ్వము (౭) పఙ్క్తి ఛందోరూపాశ్వము ఇవి సప్తగుణరంగులతోనున్నవి.

స్థూలరూప పృథివికి (బ్రహ్మాండము) జలమే కారము. క్షేత్రరూప బ్రహ్మాండములో సప్తద్వీప సముద్రములకు మూలకారణము శుద్ధోదకము. "ఆపో వా ఇదగ్ం సర్వం" సప్తద్వీప సముద్రముల చిత్రపట సంఖ్యల వివరము అను ఉపనిషత్ప్రమాణానుసారముగ శుద్ధోదక సముద్రముతో సప్తవిధ గుణధాతు రూపాంతరములుగ సప్తవిధ సముద్రములును వీటిననుసరించి యీసముద్రములతో ఘనీభవించినవే సప్తవిధగుణధాతు రూపాంతర ద్వీపములు. ఇవి ఒకదానికంటె మరొకటి నూర్ధ్వములో గుణాధిక్య వర్ణములతో సర్వవిధముల ప్రకాశించి సుఖానుభవములుగా నున్నవి. వీటినే క్షీరాదిగ లవణ సముద్రాంతములుగను, పుష్కర ద్వీపాంగ జంబూద్వీపాంతములుగనుఁ పురాణములందు స్థూలబోధగ చెప్పిరి. పురాణములు స్థూలములు గాన స్థూలరూపబోధగ చెప్పబడెను. ఆదినుండి క్రమముగ క్రమముగఁ నధోముఖముతో నన్నియును స్థూలతామసగుణ రూపాంతరముల వరకు వచ్చుట సృష్టి సహజము. ఈస్థూల రూపక్షేత్రాదుల ననుసరించి గలిగినవే జీవదేహాసులు. ఇందులో నూర్ధ్వములోనున్న శుద్ధోదకామృతరూప రససుధా సింధులే శుద్ధోదక సముద్రము క్రమముగాఁ నధోరూపాంతరములతో సప్తధాతు గుణరంగులతో సప్తవిధ ద్రవావరణములతోను సప్తవిధధాతు రూపపదార్థములతో సప్తద్వీపాదులుగ నున్నవి. ఇవి సాత్వికాది తామసాంతముతో నానావిధ గుణ రూప రుచులుగ మధురాది లవణాంతములుగ మార్పుజెందినవి సుధాసింధువుతోనే సర్వాధారమై స్థూలదేహమునకు సృష్టిస్థితిలయాదులకుఁ గారణ శుద్ధోదక సముద్రముగా నున్నది. జలములో తేజస్సు చేయుటచే సప్తగుణరూప వన్నెలుగ రూపాంతర పదార్థ వస్తు ద్రవ్యములుగ అశ్వములై ప్రకాశించినవి. వీటినే ఛందస్సులుగ చెప్పదగును. మిగత విషయాదు లాయాద్వీప విషయాదులందు చూడ వచ్చును.

---

## —। దివ్యమేరువ (సుమేరువ) విషయము. ।—

మేరువ విషయము సామాన్యముగ నర్థముగాని నిగూఢ రహస్యముగ నున్నది. ఇది తెలియకను విచారము లేకను సామాన్య భావములు పైకి స్ఫురించు పురాణములఁ జదివినవారలు వేదవిజ్ఞానము లేకను నుపాసనాది యోగవిజ్ఞానము లేకను బలువిధములుగఁ దాము కేవల పృథివీభూత స్థూలరూపగుణ ప్రకృతిబద్ధులై నందునను కేవల స్థూలరూప జడవస్తు దర్శనముగనే భావించినచో నదెట్లగుపడు నవకాశ మేలాగునగునో యోచింపరైరి. ఇది యీశ్వరాంశ చైతన్య తేజోవీర్యమే గాని జడపదార్థముగాదు. భూతముగాదు, తమోగుణముతో దర్శనముగాదు. జీవు డే విధముగ నాత్మనుండి మాయతో నావరణగుణ భూతాదులతో విరాడాదిగ నింత వరకు రాగలిగెనో యటులనే జడభూత క్షేత్రాదులం దీమేరువు చైతన్యవంత భూత రూపమై యాకాశాదిగఁ బంచభూతములందు నానా గుణవికారరూపాదులతో జడచేతనాచేతన చిజ్జడభూతములకు ముఖ్యాధార జీవచైతన్యమై సృష్టి స్థితిలయాదు లను గలుగఁజేసి ప్రకాశింపఁజేయుచున్నది ఇది సమష్టి మహాపంచభూత విశ్వ ములో మేరువుగను, చైతన్య జీవదేహాదులలో వీణాదండముగను, ప్రణవాది శబ్ద మాతృకా స్వరూప పరాపశ్యంతి మధ్యమ వైఖరిలో సర్వవాఙ్మయ అక్షరస్వరూప మూలబీజ చైతన్య సువర్ణస్వరూప ప్రణవ బీజముగను, మూర్త్యాదులలో మూల బ్రహ్మగను, నానావిధగుణస్వరూపములతో సర్వమూలాధార చైతన్య వీర్యవంతమై యున్నది. ఇదే సర్వజీవ దేహాదులలో సర్వజీవోత్పత్తికై బిందురూప చైతన్య వీర్య రస స్వరూపముతోఁ బంచభూతములతో పంచేంద్రియ స్వరూపేంద్రియముగ సర్వ జీవోత్పత్తికిఁ గారణరూపాంశమై యున్నది. ఈమేర్వాంశమే లేనిచో జగత్తే లేదు. సర్వదా ప్రళయమే యుండును. దీనితో నన్నియు నాకర్షింపఁబడి సృష్టిస్థితిల యా దులు గల్గి విరాడ్విశ్వమని యనిపించుకొనుచున్నది ఇది సూత్రప్రాణాది చైతన్య స్వరూపము. కనుక ప్రతిదానియందు నేది మూలాధారసూత్రమో యదియే మేరువు అందుచేతఁ బురాణములందుఁ బంచభూతాత్మక స్వరూపగుణరూపాదులతో నాయా భూతప్రధాన పురాణములందు నానా భూతగుణములుగ వర్ణించిరి. పర్వతమన మహదాకార స్వరూపమని యర్థమేగాని సామాన్య తమోరూపగుణ జడస్థాణు వెంతమాత్రము కాదు. అటులేనిచో మేరువును జుట్టి సర్వము దిరుగుచున్నదని పురా ణములందున్న ప్రమాణమున కేమియర్థము? ఈ యాత్మచైతన్య వీర్యతేజస్సునకు సర్వతత్త్వములు గుణములు కర్మభక్తి జ్ఞానవైరాగ్యములు యోగాదులు సర్వ

క్రియలు మేరువును మధ్యలోఁ జేసుకొని నిరంతరము భ్రమణగలిగి తిరుగుచున్నవి. దీనినే శిశుమారచక్రమునందును, దధ్యాద్యర్ణవాదులలోను, బృథివ్యాద్యాకాశాంత భూత లోకాదులను, లోకస్థులను కర్మల సంయోగములో భ్రమణలో బద్ధులై యీ దివ్య సుమేరువును బ్రదక్షిణముగాఁ దమధన్యతకొరకై యధ్యాత్మికముతోఁ దిరుగు చున్నారనే దలంచుటే ధన్యజీవుల మార్గము. ఈ మేరువే మధ్యలో లేనిచో సర్వము నకు భ్రమణయే లేదు; కాలకర్మల సంయోగమే లేదు. ఏమియును లేదనే భావము. కేవల సంపూర్ణమే. ఈ మేరువునకే క్షేత్రజ్ఞుఁడనియు పురుషుఁడనియుఁ బేరు. ఇట్టి దివ్య సుమేరువును జూపించమనినఁ గేవల తమోగుణ జడప్రకృతిభూత క్షేత్రములందెల్ల చూపించవలెనో యోచింపవలెను. ఎవరికి వారే యోచింపవలెను. పురాణములన్ని నేమి? ఎందుకుఁ బురాణములు చెప్పఁబడెను. అల్పబుద్ధులకును విజ్ఞానసముపార్జనము సేయఁ బ్రారంభించిన వారికిఁ బురాణములు స్థూలముగ బోధింప వ్రాసిరి. మేరువు యన సామాన్య శబ్దవాచ్యముగాదు. "దివ్య శబ్దవాచ్యముతో దాని నుచ్చరింప వలెను. ప్రాకృత కాలములో నీదివ్య శబ్దము సర్వత్ర సామాన్యముగ నుచ్చరించుట చేత నిది సామాన్యవాచ్యముగ నీ లోకమున వ్యవహరింపబడుచున్నది. కేవల నిరీశ్వర చైతన్యమునకుమాత్రమే యుపయోగించవలెను. కాన 'దివ్య' మేరువనియు సుమేరువనియు నుచ్చరించినచో వది గోచరించును. మేరువుతోనే భ్రమణ. భ్రమణ యున్నంతకాలము మేరువ యుండితీరును. భ్రమణతోనే పంచభూతము లుండును. భ్రమణతోనే కాలకర్మలు నుండును. ఉండినచో నన్నియు నుండవలెను. లేనిచో నన్నియును బోవలెను.

పురాణములందు దివ్యమేరువును పైభాగమున విశాలముగనుఁ, గ్రింది భాగము దక్కువగను వర్ణించిరి. అనగా సమష్టిరూపముతో సర్వదేవర్షులాదిగాఁగల వారలకును దివ్యజ్ఞానమునకునుఁ బ్రకాశమునకును, శిరస్సుగా ననంతరూపముతోఁ బూర్ణముగను గ్రమముగఁ గ్రిందికి వచ్చుటలో వ్యష్టిరూప వీర్యబిందువుగ జీవో త్పత్తికిఁ గారణముగఁ దమోలోకమునందుఁ గొంచెము నున్నదని తెలియవలెను. ఇది వీర్య బిందువగుటచేత క్షేత్రము నాకర్షించి యున్నది. ఇటులనే యీ బ్రహ్మాండ ములో నుపరిలో దివ్య మేరువు విశాలాధేయమై దేవతలకు ఋషులకు నిలయమై జ్ఞానతేజోzzర్ధ్వరేతస్సై మహర్లోకాదిగ సర్వాంతముతో స్వరూప కారణముఁ బూర్ణమగుచున్నది. వ్యష్టిలో బిందువుగను (జీవుడుగను) సమష్టిలో స్వరూపము గును (ఆత్మ). అందుచేత దివ్యమేరువు గ్రిందిభాగమణువుగను నుపరిలో విశాలము

గను నున్నదని భావము. దివ్యమేరువు ప్రమాణములో సంఖ్యావాచకముగ లక్ష పరిమితినిఁ జెప్పిరి. ఇందులోఁ బదునారు సంఖ్యల ప్రమాణము జంబూద్వీపమధ్యలోఁ గల ఇలావృతవర్షమధ్యలోఁ గలదు. అదియే దీనిపాదు ఇళ యన స్త్రీకిని భూమికిని యర్థము. ఈరెండు శ్రీవిష్ణువు భార్యలఁ బేర్లు. అనగా క్షేత్ర రూపమగు బృథివీ మధ్యయోనిలో నున్నందుచేత నిది. బిందురూప షోడశకళాత్మకముగ నుండును. జీవుల జన్మభూమియగు క్షేత్రము మేరురూప వీర్యమునకు (బిందు పాదునకు) స్థానమై షోడశసంఖ్య కళాత్మకముగనున్నదని భావము. ఉపరిలో విశాలమెను బదినాల్గువేలని చెప్పిరి సమష్టి పూర్ణములో నెనుబదినాలుగులక్షల జీవరాసులకు స్థానమని తెలిపిరి. జీవరాసులకు భూమిక్షేత్రము, యోని మధ్యస్థానము. యీ భావమున కనుగుణ్యముగ జంబూద్వీప మధ్యనిళావృతవర్ష మధ్యలో మేరువు పాదు గూడనున్నది. అందుచేత దివ్యసుమేరువు చైతన్య వీర్యస్వరూపముగఁ గూడనున్నదని భావము. ఇట్టి దివ్యసుమేరువును జూడదలఁచిన స్వవీర్యమునే చూడఁదలఁచిన వారలగుదురు. ఇది స్థూలరూపముతోఁ గర్మేంద్రియాదులకు నిలయమగు క్షేత్రములకు వీర్యము వంటిది. దీని యుపవీరమే జీవదేహములో హృదయ స్థానము. హృదయము సర్వదేవతలకును, నుపాసనలకును, యోగాదులకును, విశాల తేజో వీర కేంద్రము, సర్వమునకు నాశ్రయస్థానము. దివ్యసుమేరువు స్వరూపముతో నాత్మగను, సృష్టిచేతనభూతాదులలో తేజోవీర్యముగను, అచేతన స్థూలభూతాదులలో మేరువుగను దెలిసి యుపాసించినచో ధన్యులగుదురు. ఇట్టి దివ్యసుమేరువును కేవల పృథివీరూప స్థాణువుగా సగుణారాధకులకును, ప్రారంభులకును స్థూలబోధగాఁ జెప్పఁబడినది. దీనినే పరమావధిగా భావించక క్రమముగా నేవిధముగ నున్నదో వేదవిజ్ఞానముతో నుపాసించి ధన్యులుగావలెను. పురాణములకంటె వేదములు పరమావధి ప్రమాణసత్యములు పురాణములతో సామాన్య బోధ యగునేకాని పరమావధిగాదు. జపమాలిక (తావళము) మధ్యలో మూలముగనున్న దానిని దివ్యసుమేరువు సంజ్ఞగాగూడ జెప్పిరి. సర్వ మాతృకావర్ణములలో క్షం మేరువుగను, వేదమంత్రములలోఁ బ్రణవమే మేరువుగను జెప్పిరి. మూర్తులలో సదాశివుండే మేరువు. స్వరూపముతో నాత్మయే మేరువు. ఈలాగున సర్వవిధముల స్వరూప మూలముగను, ఆత్మచైతన్య తేజోవీర్యముగను దెలియడమే యుపాసనా యోగ విధానము. మేరూల్లంఘనముఁ జేయరాదని ప్రమాణవచనమున్నది. మేరూల్లంఘనమే యాత్మోల్లంఘనమగును. మేరువునకు మూలాధారకమలమగు పృథివీభూత

క్షేత్రమందు మనదేహములోఁ బ్రజాపతియగు బ్రహ్మయు గణపతియు నుందురు. వీరిపై నాపోభూత రసస్వరూప మేరుసంబంధ కమలమందు శ్రీ విష్ణువు గలడు. అతనిపై జగదాత్మ తేజస్వరూపాదిత్యుఁడును నతనిపై వాయుస్వరూప రుద్రుఁడును, నతనిపై నాకాశస్వరూప సదాశివుండును నాధారాధేయ స్వరూపులై యున్నారు. సుషుమ్నకుగూడ స్థానము మేరువు. ఈ మేరువునకుఁ బ్రతిస్వరూపమే జీవదేహము లలో వీణాదండము. దీని నాశ్రయించి సుషుమ్నయు, షడాధారకమలములు, దీని యం దధిదేవతలు, నుపరి సహస్రారము సర్వాధార పీఠముగను, సుధాసింధువును గలవు. ఇట్టి యనంతరస్వరూప దివ్యసుమేరువును (బంగారు కొండను) వివేక విజ్ఞానముతోఁ దెలియక ప్రత్యక్ష బాహ్యగోచరమునకుఁ జూపుమన్నచో శ్రీ రామచంద్రుఁడు తన బాల్యములో స్వర్లోకమున బ్రకాశించుచున్న చంద్రుని తన నేత్ర సమీపములో ప్రత్యక్షముగ జూపుమని చెప్పిన మూర్ఖదశవలెనగును. ఈ మేరువు ఆకాశభూతముతో సర్వావకాశ స్వరూపముగను, వాయు భూతముతో ధ్రువ రూపముతో వాయు సూత్రముగను, తేజోభూతముతో ఆదిత్యునితోఁ తేజో సూత్రముగను, (బంగారుకొండ) జలభూతముతో జంద్రరూపముతోఁ జలసూత్రముగను పృథివీభూతముతో పృథివినాకర్షించి భూధరపర్వతాకార సూత్రముతో సృష్టిస్థితిలయాది గుణములతో సర్వాధారమహదాకారభూత సువర్ణకాంతితో దివ్యమేరువుగ బంగారుకొండగ నున్నదని వర్ణించిరని భావము. దివ్యమేరువు దివ్యదేవతలకును, మహర్షులకు నూర్ధ్వరేతస్కులకును, సుమేరువు సువర్ణాక్షరములకూ సువర్ణమూల మేరు వత్సరప్రణవబీజముగను తేజస్సుతో సువీర్యముగను, వేదముతో జ్ఞానస్వరూపముగను నాడీసూత్రములలో సుషుమ్నగను, సర్వస్వరూప పూర్ణములో నాత్మగను దెలిసినవారలకుఁ జూడ సాధ్యమగును గాని మూఢాసురులెంతమాత్రము సమీపించజాలరు, జూడజాలరు. వారికి తమస్సే మేరువు. మేరువన బురుష సూక్తమే, పురుష స్వరూపమే, దీనికి భూతాద్యావరణములన్నియు క్షేత్రస్వరూప యోనులు. అందుచేత నన్నియు మేరువునాకర్షించి బద్ధములై యున్నవి. క్షేత్రజ్ఞుడే మేరువు దీని నాశ్రయించినదే కుండలినీశక్తి. దీనిమూలములో నున్నదే అధఃకుండలినీ. దీని కూర్ధ్వములో నున్నదే నూర్ధ్వకుండలిని. ఈ మేరువు శ్రీ విద్యలో భూప్రస్తారముగను, మేరు ప్రస్తారముగ నుపాసకులకు నారాధనరూపముగ నున్నది. అధోముఖములో సృష్టికిని, నూర్ధ్వముఖములో మోక్షములకుఁ గారణముగ నున్నది. ఇంకను ననేక విషయాదులు గలవు.

---

ధూమ్రవర్ణో హిరణ్యగ్రీవో మేఘమాల ఇతిసప్తసేతు శైలాః ౩॥ అరుణా నృమణా అంగిరసీ సావిత్రీ సుప్రభాతా ఋతంభరా సత్యంభరేతి మహానద్యః- యాసాంజలోపస్పర్శన విధూత రజస్తమసో హంసపతంగ గోర్ధ్వాయన సత్యాంగ సంజ్ఞాశ్చత్వారోవర్ణా స్సహస్రాయుషో విబుధోపమ సందర్శన ప్రజననాః స్వర్గద్వారం త్రయ్యావిద్యయా భగవంతం త్రయీ మయం సూర్యమాత్మానం యజంతే॥ ౪ ॥ ప్రత్నస్య విష్ణోరూపం యత్సత్యస్యర్తస్య బ్రహ్మణ అమృతస్య మృత్యోశ్చ సూర్యమాత్మాన మీమహీతి॥ ౫ ॥ ప్లక్షాదిషు పంచసు పురుషాణామాయు రింద్రియమోజస్సహోబలం బుద్ధిర్విక్రమ ఇతిచ సర్వేషా మౌత్పత్తికీ సిద్ధిరవిశేషేణ వర్ధతే ప్లక్షస్స్వ- సమానే నేక్షురసో దేనావృతో యథా॥

ఈద్వీపము జంబూద్వీపమునకు పైన చుట్టుచుట్టి వలయాకారముగనున్నది. దీని వైశాల్యము ౨౦౦౦౦౦ (లక్షల) యోజనవిస్తీర్ణము. దీనికుపరిలో ఇక్షురస సముద్రము చుట్టు చుట్టియున్నది, ఈయిక్షుసముద్ర వైశాల్యము ౨,౦౦,౦౦౦ (లక్షల) యోజన విస్తీర్ణమే. ఈ ద్వీపమునందు గొప్పదియగు ప్లక్షవృక్షముండుటచేత దీనికాపేరు గలిగెను. ఈవృక్షము బహుప్రకాశ వంతముగను నున్నతముగను నుండును. దీనిమూలము సప్తజ్వాలలతో అగ్నిహోత్ర ప్రకాశముతో నుండును. దీనిని బ్రియవ్రతునికుమారుఁడు ఇధ్మజిహ్వుఁడు బహుకాలముపాలించి తన యేడ్గురు కుమారులకుఁ బంచిపెట్టెను. ఈభాగములకుఁ దనకుమారుల నామములనే యుంచెను. పిమ్మట తాను భగవదుపాసనా యోగముతో ముక్తుఁడయ్యెను. (౧) శివము, (౨) యశస్యము, (౩) సుభద్రము, (౪) శాంతము, (౫) క్షేమము, (౬) అభయము (౭) అమృతమని ఏడు నాభాగములపేర్లు. ఈ పేరులుగలవారలే రాజులు.

ఇందలినదులేడు. (౧) అరుణ, (౨) నృమణి, (౩) అంగీరస, (౪) సావిత్రి, (౫) సుప్రభాత, (౬) ఋతంభర, (౭) సత్యంభర. ఈనదులయందు స్నానమాచరించువారలకు రజస్తమోగుణములు తొలగి సత్వగుణాభివృద్ధిచే పుణ్యమూర్తులగుదురు.

సీమాపర్వతములేడు. (౧) మణికూటము, (౨) వజ్రకూటము, (౩) ఇంద్రసేనము, (౪) జ్యోతిష్మంతము, (౫) ధూమ్రవర్ణము. (౬) హిరణ్యగ్రీవము, (౭) మేఘమాల. ఈపర్వతములే యందలి భాగముల కెల్లలు.

ఇచ్చట చాతుర్వర్ణ్యమువారలుందురు. (౧) హంసలు, (౨) పతంగులు,

(3) ఊర్ధ్వాయనులు, (౪) సత్యాంగులు. వీరల సంతానరూపాదులు దేవతలను మించియుండును.

వీరి ఉపాసన:- వేదోక్త కర్మమయుఁడును, వేదమయుఁడును, ఆదిత్య స్వరూప శరీరుఁడునగు, భగవంతుని సర్వదా ధ్యానాదియోగములతో బూజాదులతోను, జగత్కారణుఁడనియు, నిర్వికారుఁడనియు, నిరతిశయఫలదాతయనియు, బంధమోక్షహేతుఁడనియు, జగన్నాథుఁడనియు, సూర్యుడనియు నొప్పుచున్న ఆదిత్యుని సర్వదా ఉపాసించుచున్నారు.

వీరల యాయువు వెయ్యిసంవత్సరములు. వీరలు మనోబలముగలవారు. ఇంద్రియపటుత్వమును, దేహబలమును, బుద్ధిబలమును, సర్వులకును సహజములుగా నుండును. ఈద్వీపములో ఉద్యానములును, అగడ్తలును, కొలనులును, అన్నివైపులందుండును.

షట్చక్రోపాసకులకు నీద్వీపము స్వాధిష్ఠానచక్రము: స్థానను స్వాయంభువ లింగము: నిత్య క్లిన్నాశక్తి నిత్యానామము; ఈబీజము: ఇంస్వరము: శుక్లపక్ష ద్వితీయ తృతీయ చంద్రకళాయుగ్మము బహుళపక్షము త్రయోదశి చతుర్దశీయుగ్మము, పక్షద్వయ సామరస్యముచే చంద్రకళాత్మకముగ నుపాసింతురు.



# కుశ ద్వీ ప ము.

శ్రీమద్భాగవతే పంచమస్కంధే ౨౦ అధ్యాయం పుట ౪౪౪.

ఏవంసురోదాద్బహిస్త ద్ద్విగుణః సమానే నావృతోఘృతోదేన యథాపూర్వం కుశద్వీపం- యస్మిఁ కుశస్తంభో దేవకృత స్తద్ద్వీపఖ్యాప నోజ్జ్వలన ఇవాపరః స్వశష్ప పుష్పరోచిషాదిశోదశ విరాజయతి॥ ౧౧ ॥ తద్ద్వీపపతిః ప్రైయవ్రతో రాజాహిరణ్య రేతానామ స్వంద్వీపం సప్తభ్యస్స్వ సుతేభ్యో యథాభాగం విభజ్య స్వయంతు తపఆతిష్ఠత్॥ ౧౨ ॥ వసు, దాన, దృఢరుచి, నాభిగుప్త సత్యవ్రిత, వివ్రి, వామదేవ, నామభ్యః పుత్రేభ్యః। తేషాం వర్షేషు సీమాగిరయో నద్యశ్చాభిజ్ఞాతా స్సప్తసప్తైవ॥ ౧3 ॥ బభ్రుశ్చతు శృంగః కపిలశ్చిత్రకూటో దేవానీక. ఊర్ధ్వరోమా ద్రివిణ ఇతి। ౧౪ ॥ రసకుల్యా, మధుకుల్యా, శ్రుతవిందా, మిత్రవిందా, దేవగర్భా ఘృతచ్యుతా, మంత్రమాలేతి, యాసాంపయోభిః కుశద్వీపా

కసః, కుశలకోవిదాః అయుక్తకులక సంజ్ఞాః భగవంతం జాతవేదస్వరూపిణం కర్మ కౌశలేన యజంతే॥ ౧౫ ॥

శ్లో॥ పరస్య బ్రహ్మణ స్సాక్షాజ్జాతవేదో సిహవ్యవాట్। దేవానాం పురుషాంగానాం యజ్ఞేన పురుషం యజేతి॥ ౧౬ ॥ తథాబహిః క్రౌంచ ద్వీపోద్విగుణః సమానేన దధిమండోదేనపరిత ఉపక్లప్తో వృతోయథా కుశద్వీపో ఘృతోదేన॥

ఈద్వీపము వెలుపల సురాసముద్రముచే ఆవరింపబడియున్నది. ఈ ద్వీపము క్రింది భాగములోకూడ సురాసముద్రమావరణముగనున్నది ఈద్వీప వైశాల్యమెనిమిదిలక్షల యోజనములు. దీనికి సమానముగనే ఉపరిలోనున్న ఘృతసముద్రవైశాల్యము యెనిమిదిలక్షల యోజనములు. దీనియందు కుశస్తంభమొకటి యగ్నివలె బహుప్రకాశముతో బ్రహ్మచే నిర్మితమై యున్నందుచేత దీనికి కుశద్వీపమని సార్థకనామము కలదు. ఈకుశస్తంభముయొక్క వెలుతురు అరుణకిరణముల కాంతివలె దశదిశలయందు వ్యాపించియుండును. ఈద్వీపమునకుఁ బ్రియవ్రతుని కుమారుఁడు హిరణ్యరేత సుండధిపతి. ఇతడు కొంతకాలము పరిపాలించి ఈద్వీపము నేడు విధములుగా విభజించి, తన యేడ్వురుకుమారులను రాజ్యాభిషిక్తులుగఁచేసి తాను దపంబునకేగి ముక్తినిఁబొందెను. ఈద్వీపాధిపతులనామములచేతనే నీయేడువర్షముల నామములు బ్రకాశించి వ్యవహరింపబడుచున్నవి. దీనియందు వర్షవిభాగములుగ యేడు సీమాపర్వతములున్నవి. అవి (౧) బభ్రు, (౨) చతుశ్శృంగ, (3) కపిల, (౪) చిత్రకూట, (౫) దేవానీక, ౬) ఊర్ధ్వరోమ, (౭) ద్రవిణ.

వర్షాధిపతులు: (౧) వసువు, (౨) దానుఁడు (3) దృఢరుచి, (౪) నాభిగుప్తుఁడు, (౫) సత్యవ్రతుఁడు, (౬) విప్రనాముఁడు, (౭) దేవనాముఁడు వీరలచేఁ బరిపాలితములైయున్నవి.

ఈ ద్వీపమందుఁగల మహానదులు: (౧) రసకుల్య. (౨) మధుకుల్య, (3) శ్రుతవింద, (౪) మిత్రవింద, (౫) దేవగర్భ, (౬) ఘృతచ్యుత, (౭) మంత్రమాల యను నామములుగలవి అందలి ప్రజలు మహాపవిత్ర నదీజలంబుల స్పర్శచే నిర్ధూతకల్మషులైరి. ఈద్వీపమందు, (౧) కుశలులు, (౨) కోవిదులు, (3 అభియుక్తులు. (౪) కులకులని చాతుర్వర్ణ్యంబుల వారలుగలరు. వీరగ్ని స్వరూపుండగు భగవంతు నారాధించి స్తుతింతురు. "పరమేశ్వరా జాతవేద స్వరూపుడవై యజ్ఞరూపుండవై ఇంద్రాదిదేవతలకు హవిర్భాగంబులను గొనిపోయి తృప్తిపరుచు

చుందురు. శ్రీ భగవదంశ స్వరూపులగు ఇంద్రాది దేవతలందు అంతరాత్మయగు పర మాత్మరూపుడుగ యాగాదులలో యజ్ఞరూపుడవై తృప్తిజెంది ప్రీతిని గలిగించి అనుగ్రహింపు'మని సర్వదా అగ్నిరూపుని ధ్యానించి పూజించుచుందురు.

శ్రీ విద్యతో షట్చక్రోపాసకులు కుశద్వీపస్థానముసునాభిగను, మణిపూర చక్రముగను, నిత్యానామకచంద్రిక శుక్లపక్షమందు చతుర్థీపంచమీ యుగ్మతిథి పత్యముగల భేరుండావహ్నివాసినీ శక్తిగను కృష్ణమందు ప్రతిపదాది చంద్రకలా గణన తారుమారగునుగావున తత్ స్థానములో శివదూతీ మహావజ్రేశ్వరీ శక్తియుగ్మ ముగను తత్తన్నామయా విసర్గబిందుబీజములగు హ్రీంకారస్వరోర్ధ్వ యుగళముగను ధ్యానించి ఆరాధించుచుందురు.

—౦—

# క్రౌంచద్వీపము.

శ్రీమద్భాగవతే - పంచమస్కంధే - వింశోధ్యాయః - పుట. ౪౪౪.

తథాబహిః క్రౌంచద్వీపో ద్విగుణః సమానేన దధిమండోదేన పరీత ఉపక్లృప్తో వృతోయథా కుశద్వీపో ఘృతోదేన యస్మిన్ క్రౌంచోనామ పర్వతరాజో ద్వీపనామ నిర్వర్తక ఆస్తే॥ ౧౮ ॥ యోసౌ గుహప్రహరణోన్మథిత నితంబ కుంజోపి దధి మండోదేనా సిచ్యమానో భగవతావరుణే నాభిగుప్తో విభయో బభూవ॥ ౧౯ ॥ తస్మిన్నపి ప్రైయవ్రతో ఘృతపృష్ఠోనామాధిపతిః స్వేస్వేద్వీపే వర్షాణి సప్తధావిభజ్య తేషు పుత్రనామసు సప్తరిక్థాదాన్ వర్షపాన్ నివేశ్యస్వయం భగవాన్ భగవతః పరమకల్యాణ యశస ఆత్మభూతస్య హరేశ్చరణారవింద ముపజగామ॥ ౨౦ ॥ ఆమో దో మధుపహో మేఘపృష్ఠస్సుధామా బ్రాజిష్ఠో లోహితార్ణో వనస్పతిరితిఘృత పృష్ఠసుతాః తేషాం వర్షగిరయస్సప్త సప్తైవ నద్యశ్చాభి ఖ్యాతాః॥ ౨౧ ॥ శుక్లో వర్ధమానో భోజన ఉపబర్హిణ ఆనందో నందన స్సర్వతోభద్ర ఇతి అభయా అమృతౌఘా ఆర్యకా తీర్థవతీ తృప్తిరూపా పవిత్రవతీ శుక్లేతి యాసామంభః పవిత్రం సకల ముపయుంజానాః - గురు ఋషభ ద్రవిణక దేవక సంజ్ఞావర్షపురుషా ఆపోమయం దేవమయమపాం పూర్ణేనాంజలినా యజంతి॥ ౨౨ ॥

శ్లో॥ ఆపఃపురుష వీర్యాః స్థ పునంత్యో భూర్భువస్సువః। తానః పునంత్వమీ వఘ్నుస్స్పృశ తామాత్మ నాభువఇతి॥ ౨౩ ॥ చూ॥ ఏవం పరస్తాద్దధి మండోదా

తృరిత ఉపవేశిత శ్శాకద్వీపో ద్వాత్రింశల్లక్ష యోజనాయామః సమానేన దధ్నిరో దేన పరివేష్టితో యస్మిన్ శాకోనామ మహీరుహః॥

ఈద్వీపమున చుట్టుతో దధిసముద్రము చుట్టుచుట్టి ఆవరించియున్నది. ఈద్వీపము క్రిందిభాగములో ఘృతసముద్రము ఆవరించియున్నది. ఈద్వీపవైశాల్యము ఇరువదినాలుగులక్షలయోజనములు. దీనిచుపరిలోగల దధిసముద్ర వైశాల్యము ఇరువదినాలుగులక్షల యోజనములు. ఈద్వీపమందు క్రౌంచపర్వతమున్నందుచేత నాపేరుతో ఖ్యాతిజెందెను. పూర్వము కుమారస్వామికిని పరశురామునకును గల బలమును పరీక్షచేయుసమయములో కుమారస్వామి బాణములచే భిన్నమై దధిసముద్రము నందు మునుగగా మరల వరుణదేవునిచే రక్షితమై పూర్వస్థానముజేరి నిలిచెను. ఈ క్రౌంచపర్వతముయొక్క ప్రక్కలెగిరిపోవఁగా మూలమునిలిచి దధిసముద్రపుటలతో ఆవరింపఁబడియున్నది. ఈద్వీపమును ప్రియవ్రతుని కుమారుండు ఘృతపృష్ఠుండనురాజు పరిపాలించెను. పిమ్మట నతఁడాద్వీపమును నేడుభాగములుగా విభజించి తనయేడ్వురుకుమారుల కొప్పగించి, స్వయంప్రకాశుండును, నిరతిశయ మంగళరూపుఁడునగు పరమాత్మయందు మనస్సునిలిపి తత్సాన్నిధ్యమునుజెందెను. అతని కుమారులు, (౧) ఆమోదుఁడు, (౨) మధువహుఁడు, (౩) మేఘపృష్ఠుఁడు, (౪) సుధాముఁడు, (౫) ఋషీజ్యుఁడు, (౬) లోహితార్ణుఁడు, (౭) వనస్పతి యను వారలు. వీరినామంబులచేతనే వీరిభాగంబులు వ్యవహృతములు. ఈ యేడువర్షవిభాగములకుగ సీమాపర్వతములేడున్నవి. అవి (౧) శుక్లము, (౨) వర్ధమానము, (౩) భోజనము, (౪) ఉపబర్హణము, (౫) ఆనందము, (౬) నందనము, (౭) సర్వతోభద్రము. ఈ ద్వీపమునందు సుప్రసిద్ధములగు నదులు, (౧) భయ, (౨) అమృతౌఘ, (౩) ఆర్యక, (౪) తీర్థవతి, (౫) తృప్తిరూప, (౬) పవిత్రవతి, (౭) శుక్ల యను నామంబులతో యేడున్నవి. ఈనదీజలంబులు మహాపవిత్రవంతములు. ఇందు నాలుగువర్షములగు ప్రజలు, (౧) గురువులు, (౨) ఋషభులు, (౩) ద్రవిణులు, (౪) దేవకులని ప్రసిద్ధిజెందిరి. వీరలానదుల విమలజలంబుల నుపయోగించుకొనుచు, జలభూతస్వరూపుఁడగు పరమపురుషుని నుదకాంజలులతో నారాధించుచు స్తుతించుచుందురు. భగవంతుని దశావతారములు మొదలుగాగల లీలామానుషావతార పురుషులందరూ ధ్రువాకాశగంగా జలరూపమగు ఈనక్షత్ర వీధిమార్గముగానే భూమియందవతరింతురని వేదప్రమాణముకూడ నున్నది. ఈ ఉదక

ములు అందువలన శ్రీమన్నారాయణాంశముతో పరమాత్మస్వరూపములుగనున్నవి. త్రివర్గములగు భూలోక, భువర్లోక, సువర్లోకములును గంగాప్రవాహముచే మహా పవిత్రము చేయఁబడుచున్నవి.

శ్రీవిద్యతో షట్చక్రోపాసకులు, ద్వీపస్థానము హృదయము, అనాహత చక్రము, శివదూతీ నిత్యనామకచంద్రకళాశక్తి, సంబీజరి, ఋుస్వరము, శుక్లసప్తమి చంద్రకళతిథి, బహుళపక్షమున నవమిగా ధ్యానించి ఆరాధింతురు.

—o—

## శా క ద్వీ ప ము.

శ్రీమద్భాగవతే - స్కంధ ౫ - వింశోధ్యా. - పుట ౪౪౫.

చూ॥ ఏవం పరస్తాద్దధిమండో దా త్పరిత ఉపవేశిత శ్శాకద్వీపో ద్వాత్రింశ ల్లక్ష యోజనాయామః సమానేన చ క్షీరోదేన పరివేష్టితో యస్మిన్ శాకోనామ మహీరుహః స్వక్షేత్రవ్యపదేశః యస్యహ్యన్యంతర్బహిః ఖరమ్మదు స్పర్శాని యస్య హిమవాన్ సురభిగంధస్తం ద్వీపమనువాసయతి॥ ౨౩ ॥ తస్యాపి ప్రైయవ్రత ఏవాధిపతి ర్నామ్నా మేధాతిథిః సోపివిభజ్య సప్తవర్షాణి పుత్రనామాని తేషు స్వాత్మజాన్ పురోజవ మనోజవ లేపమాన ధూమ్రానీక చిత్రరథ బహురూప విశ్వధార సంజ్ఞాన్నిధాప్యాధిపతీన్ స్వయాంభగవత్యనంత ఆవేశిత మతిస్తపోవనం ప్రవివేశ- తేషాంవర్ష మర్యాదాగిరయో నద్యశ్చసప్త సప్తైవాసన్॥ ౨౪ ॥ ఈశాన ఉరుశృంగో బలభద్రశ్శతకేసర సహస్రస్రోతా దేవపాలో మహాసనఇతి॥ ౨౫ ॥ అనఘాయుర్దా ఉభయస్పృష్టి రపరాజితా పంచపదీ సహస్రశృతిః నిజధృతిరితి॥ ౨౬॥ తద్వర్షే పురుషా ఋుతవ్రత సత్యవ్రత దానవ్రత నువ్రత నామానోభగవంతం వా య్వాత్మకం ప్రాణాయామ విధూత రజస్తమసః పరమసమాధినా యజంతే॥ ౨౭ ॥ శ్లో॥ అంతః ప్రవిశ్యభూతాని యోబిభర్త్యాత్మకేతుభిః। అంతర్యామీశ్వర స్సాక్షా త్పాతునో యద్వశే ఇదమ్॥ ౨౮ ॥ చూ॥ ఏవమేవ క్షీరోదాత్పరతః పుష్కర ద్వీపస్తతో ద్విగుణాయామ స్సమంచత ఉపకల్పితస్స మానేన స్వాదూదక సముద్రేణ బహి రావృతః॥

ఈద్వీపమున కుపరిలో క్షీరసముద్రము ఆవరించియున్నది. ద్వీపవైశాల్యము ముప్పదిరెండులక్షలు. క్షీరసముద్రవైశాల్యము ముప్పదిరెండులక్షలు. ఈద్వీపము

క్రింద ఆవరించిన దధిసముద్రమై శాల్మలము బదునాఱులక్షల యోజనములు. ప్రియవ్రతునికుమారుఁడగు మేధాతిథి పరిపాలించి తనకుమారుల నామములతో వ్యవహృతములగువర్షముల నేడింటిని విభజించి కుమారులకిచ్చి తాను భగవంతుఁడగు వాసుదేవస్వరూపునియందు మనస్సునిలిపి తపోవనంబు ప్రవేశించెను. ఈద్వీపమున గొప్పదియగు శాకవృక్షమున్నందుచేత నీనామముగలిగెను. దీనిపుష్పముల పరిమళములచే నీద్వీపమెల్లను బరిమళింపఁజేయును. మేధాతిథికుమారులు తమతమ భాగములను జక్కగ ధర్మయుక్తముగ బరిపాలించుచున్నారు. (౧) పురోజవుఁడు (౨) మనోజవుఁడు, (౩) వేపమానుఁడు, (౪) ధూమ్రానీకుఁడు, (౫) చిత్రరథుఁడు, (౬) బహురూపుఁడు, (౭) విశ్వవాహుఁడు నను నామములుగలవారు. ఈ నామములే నీయేడువర్షముల పేర్లు. ఈవర్షములకు సరిహద్దులుగ మర్యాదాగిరులేడుగలవు. అవి (౧) ఈశానము, (౨) ఉరుశృంగము, (౩) బలభద్రము, (౪) శతకేసరము, (౫) సహస్రస్రోతము, (౬) దేవపాలము, (౭) మహానసము నను నామములఁగలి. ఈయేడు వర్షంబులందేడు నదులున్నవి. అవి (౧) అనఘ (౨) ఆయుర్ద, (౩) ఉభయస్పృష్టి, (౪) అపరాజిత, (౫) పంచనద (౬) సహస్రశ్రుతి, (౭) నిజధృతియని పిలువఁబడుచున్నవి. ఈవర్షంబునందలిప్రజలు (౧) ఋతవ్రతులు, (౨) సత్యవ్రతులు, (౩) దానవ్రతులు, (౪) సువ్రతులు ననువర్ణములు గలవారై ప్రాణాయామాదులచే రజస్తమోగుణములను దొలగించుకొని నిశ్చల సమాధి నవలంబించి వాయుశరీరకుఁడగు నోపరమాత్మా! ఎవడుముఖ్యప్రాణరూపముగా సమస్త జీవులలోను ప్రవేశించి సర్వజీవరాసుల ప్రాణముల నుద్ధరించుచున్నాఁడో ఎవని ఆధీనమై యీజగమంతయు వర్తించుచున్నదో అట్టిసర్వాంతర్వర్తియగు పరమాత్మకుఁడగు నీవు రక్షింపుమని సర్వదా ధ్యానించి స్తుతించుచుందురు. శ్రీవిద్యతోషడాధార కమలోపాసనగా భాగస్థానము విశుద్ధచక్రముఃకంఠము. కులసుందరీ నిత్యచంద్రికళాశక్తి. హంబీజము, ఔంస్వరము, శుక్లపక్షనవమి బహుళపక్షముతో సప్తమి చంద్రికళ శుక్లకృష్ణపక్షభేద మించుకైననూలేక పక్షద్వయమధ్యమునందు త్వరితా నిత్యాకలా గర్భితమై త్రినాభిచక్రరూపముగా చతురస్రాకృతితోకూడ విరాజిల్లుచున్నది.

—♦—

# శా ల్మ లీ ద్వీ ప ము.

శ్రీమద్భాగవతే - స్కంధే ౫ - వింశోధ్యాయ. - పుట. ౪౫౪

ప్లక్షస్స్వసమానే నేక్షురసో దేనావృతో యథాతథా। సద్వీపోపి శాల్మలో ద్విగుణవిశాల స్సమానేన సురోదేనావృతః। పరితః యత్రహివై శాల్మలిః ప్లక్షాయామా యస్యాం వాధఃకిల నిలయన మాహుర్భగవత శ్ఛందస్తు తస్య పతత్రిరాజస్యసాద్వీపస్య హూతయ ఉపలక్ష్యంతే॥ ౬ ॥ తద్వీపాధిపతిః ప్రియవ్రతాత్మజో యజ్ఞబాహుస్స్వసుతేభ్య స్సప్తభ్యస్తన్నామాని సప్తవర్షాణివ్యభజిత్ - సురోచనం సౌమనస్యం రమణకం దేవబర్హం పారిబర్హ మాప్యాయన మభిజ్ఞాతమితి॥ ౭ ॥ తేషు వర్షాద్రయో నద్యశ్చ సప్తైవాభిజ్ఞాతాః - స్వరస శ్శతశృంగో వామదేవః కుముదో ముకుందః- పుష్పవర్ష శ్శతశ్రుతి రితి అనుమతి స్సినీవాలీ సరస్వతీ కుహూరజనీ నందారాకేతి॥ ౮ ॥ తద్వర్షపురుషాః శ్రుతధర విద్యాధర వసుంధరే ధ్మధర సంజ్ఞాః భగవంతం వేదమయం సోమమాత్మానం వేదేన యజంతే॥ ౯ ॥

శ్లో॥ స్వగోభిః పితృదేవేభ్యో వ్యభజక్ శుక్లకృష్ణయోః। అంధః ప్రజానాం సర్వాసాం రాజానస్సోమ అస్త్వితి॥ ౧౦ ॥ చూ॥ ఏవం సురోదాద్బహిస్తద్ద్విగుణః సమానే నావృతో ఘృతోదేన యథాపూర్వ్వః కుశద్వీపః॥

ఈశాల్మలీద్వీపమునకుపరి ప్రతిసర్గచే సురాసముద్రముచేఁజుట్టు ఆవృతంబై యున్నది. దీనిక్రింది భాగమున నిక్షురస సముద్రమావృతముఁగనున్నది. ఈద్వీప విస్తారము నాలుగుఁలక్షల యోజనములు. దీనికుపరిలో ఆవరించియున్న సురాసముద్రవిస్తారము. ద్వీపవిస్తీర్ణసమానము. ఈ ద్వీపమున శాల్మలీవృక్షము ప్లక్షవృక్షమంత యౌన్నత్యము గలిగియున్నది. ఈశాల్మలీవృక్షనామమే యీద్వీపమునకుఁ గలిగి ప్రఖ్యాతిఁజెందెను. గాయత్రీస్వరూపాత్మక ఛందస్సులే యవయవములుగాఁ గలవాఁడును పక్షులకధిపతియునగు గరుత్మంతుని కావృక్షము నిలయమైయున్నది. ప్రియవ్రతుని కుమారుఁడగు, యజ్ఞబాహుఁడు బహుకాలము పరిపాలించి తనయేడ్వర కుమారులకు నీద్వీపము నేడుభాగములుగ విభజించి రాజ్యాభిషిక్తులుఁజేసి తాను తపోవనంబుఁజేరెను. ఇతని కుమారులు (౧) సురోచనుఁడు, (౨) సౌమనస్యుఁడు. (3) రమణకుఁడు, (౪) దేవబర్హుఁడు, (౫) పారిబర్హుఁడు, (౬) ఆప్యాయుఁడు, (౭)అభిజ్ఞాతుఁడను ఈనామములే ఆయాభాగములుగాఁగల వర్షనామంబులు. ఈ ద్వీపమున వర్షవిభాగములుగ మర్యాదాగిరులు ఉభయవర్షభాగముల మధ్యలో

(౧) స్వరస, (౨) శీతశృంగ, (3) వామదేవ, (౪) కుముద, (౫) ముకుంద. (౬ పుష్పవర్ష, (౭) శతశ్రుతియనికలవు. ఈ ద్వీపమునం దేడువర్షము లందేడు మహానదులున్నవి. అవి (౧) అనుమతి, (౨) శినీవాలి, (3) సరస్వతి, (౪) కుహూ (౫) రజని, (౬) నంద, (౭) రాక యని నామంబులుగలవి. ఇవిమహాపవిత్రములు. ఈనదీజలములచే బ్రజలు మహాపుణ్యవంతులగుచున్నారు. ఇచ్చటిపురుషులు, (౧) శ్రుతధరులు, (౨) విద్యాధరులు, (3) వసుంధరులు, (౪) ఇధ్మధరులని నాలుగువర్ణంబులవారు. వీరలు వేదోక్త వర్ణాశ్రమ ధర్మనిరతులు. సోమరూపుండగు పరమాత్మను, అమృతరూప చంద్రకళలతో శుక్లపక్షమునందమృతము వృద్ధిరూపములోను కృష్ణపక్షమందు దేవపితృగణంబులకొసంగి అమృతతుల్యులుగఁజేయునట్టి సోమరూప పరమాత్ముని ధ్యానయోగాదులతోను అర్చనాదులతోను స్తోత్రములతో సర్వదాఆరాధించి అనుగ్రహమును బొందుచుందురు.

శ్రీవిద్యతో షట్చక్రోపాసకులు, సిశాల్మలీ ద్వీపమును భూమధ్యస్థానమున గల ఆజ్ఞాచక్రమందు నిత్యానామక చంద్రకళాశక్తియగు, నీలపతాకను అధిదేవతగను హ్రీంబీజము, ఏంస్వరముగను, శుక్లఏకాదశి చంద్రకళతిధి సంజ్ఞగను బహుళపక్షమందు పంచమికళగను ధ్యానించి ఆరాధింతురు.



## పుష్కరద్వీపము.

### మానసోత్తరపర్వతం.

శ్రీమద్భాగవతే - పంచమస్కంధే - వింశోధ్యాయ - పుట. ౪౪౫

ఏవమేవ క్షీరోదాత్పరతః పుష్కరద్వీపస్తతో ద్విగుణాయామ స్సమంతత ఉపకల్పిత స్సమానేన స్వాదూదక సముద్రేణ బహిరావృతః- యస్మిన్ బృహత్పుష్కరం జ్వలన శిఖామల కనకపత్రా యుతాయుతం భగవతః కమలాసన స్యాధ్యాసనం పరికల్పితమ్॥ ౨౯॥ తద్ద్వీపమధ్యే మాన సోత్తరోనామైక ఏవా ర్వాచీన పరాచీనయో ర్వర్షయోర్మర్యాదా చలోయుతయోజనో చ్ఛ్రాయాయామః -యత్ర చతసృషు దిక్షుచత్వారి పురాణి లోకపాలానా మింద్రాదీనాం యదుపరిష్టాత్సూర్య రథస్య మేరుం పరిభ్రమతః సంవత్సరాత్మకం చక్రం దేవానా మహోరాత్రాభ్యాం చక్రవత్పరిభ్రమతి॥ 3౦॥ తద్ద్వీపస్యాధి పతిః ప్రియవ్రతో వీతి హోత్రోనామ

స్వాత్మజారమణకధాతక నామానౌ వర్షపతీ నియుజ్యస్వయం పూర్వజవద్భగవత్కర్మశీల ఆస్తే॥ ౩౧ ॥ తద్వర్షపురుషాః భగవంతం బ్రహ్మరూపిణం సకర్మకేణ స్వకర్మణాచారాధయంతి॥ ౩౨ ॥ ఇదం చోదాహరంతి॥ శ్లో॥ యత్తత్కర్మమయం లింగం బ్రహ్మలింగం జనోర్చతి। భేదేనైకాంత మద్వైతం తస్మైభగవతేనమఇతి॥ ౩౩ ॥ చూ॥ తతః పరస్తాత్ -

—♦ లో కా లో క ప ర్వ తః . ♦—

లోకాలోకో నామాచలో లోకాలోకయోరంతరాళే పరిత ఉపక్లుప్తః॥ ౩౪ ॥ యావాన్మానసోత్తర మేర్వోరంతరం తావతీభూమిః కాంచన్యాZదర్శతలోపమా, యస్యాం ప్రహితః పదార్థోన కథం చిత్పునః ప్రత్యుపలభ్యతే।

శ్రీమద్భాగవతే - పంచమస్కంధే - వింశోధ్యాః - పుట. ౭౭౬

తస్మాత్సర్వ సత్త్వపరిహృతా ఆసీత్॥ ౩౫ ॥ లోకాలోకఇతి సమాఖ్యా యదనేనాచలేన లోకాలోకయోరంతర్వర్తినా వ్యవస్థాప్యత ఇతి సలోకత్రయాంతే పరిత ఈశ్వరేణ విహితః యస్మాత్సూర్యాదీనాం ధ్రువాపవర్గాణాం జ్యోతిర్గణానాం గభస్తయోర్వాచీనాం స్త్రీన్ లోకానావితన్వానాః నకదాచిత్పరాచీనా భవితుముత్సహంతే॥ ౩౬ ॥ తావదున్నహనాయామః ఏతావానేవ లోకవిన్యాసో మానలక్షణ సంస్థాభిర్నిరూపితః కవిభిః॥ ౩౭ ॥ సతు పంచాశత్కోటి గుణితస్య భూగోళస్య ద్వాదశధావిభక్తేరాశి మయేచ రశ్మిచక్రి తురీయభాగోయం లోకాలోకాచలః - (౧౨,౫౦,౦౦,౦౦౦)

ఈద్వీపమరువదినాలుగులక్షల యోజనవిశాలముతో వలయాకారముగ శాల్మలీద్వీపమున పైభాగమందున్నది. దీనికి శుద్ధోదక సముద్రము అరువది నాలుగులక్షల యోజనావృతమై ఉపరిభాగమందున్నది. దీనికి బ్రియవ్రతుని కుమారుఁడు మొదటపాలించి తనయిర్వురుకుమారులగు, రమణ, ధాతకులకుఁ బంచి యిచ్చి సత్కర్మశీలుండై తనపూర్వసోదరులవలె బరమ బురుషునందు భక్తిసంయుతుఁడై పరమపదముఁనుబొందెను. ఈ ద్వీపమందు పుష్కరమను గొప్పకమల మొకటికలదు. ఈకమలమునకు బంగారువంటి కాంతిగల లక్షపత్రములుగలవు. ఈపత్రముల కాంతిసలుదిశలందును ప్రకాశించుచుండును. ఈకమల మధ్యలో బ్రహ్మఅధిష్టించియుండి యిచ్చటిప్రజలచే సేవింపఁబడుచుండును. ఈ పుష్కరము చేత నీద్వీపమునకు పుష్కరద్వీపమని నామంబుగలిగెను. ఈ పుష్కరాసనముతో

బ్రహ్మకు బుష్కరాసనుండని నామముకలిగెను.

## —♦ మానసోత్తర పర్వతము. ♦—

ఈద్వీపమధ్యభాగములో ద్వీపముచుట్టు వలయాకారముగ మానసోత్తరపర్వతమొకటి మర్యాదగిరి ఉభయభాగ సంధిగానున్నది. దీనియౌన్నత్యము పదివేల యోజనములు. ఈ పర్వతముపైన నాలుగుదిక్కులందు నింద్ర యమ వరుణ కుబేర పురంబులుగలవు. ఈ యింద్రాది పురముల మీదుగా మేరువునకుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచున్నది. సూర్యునిరథంబునకుఁజక్రమై స్వర్గలోక దేవతల కహోరాత్రములతో మఱి సంవత్సరాత్మకంబుగా ఉత్తరాయణ, దక్షిణాయన సంజ్ఞలుగ భూమియే బండిచక్రమువలె బరిభ్రమించు చుండను. ఈద్వీపప్రజలు చతుర్ముఖుండగు భగవంతుని కర్మయోగ విశిష్టమయిన భగవదుపాసనచే నారాధించుచుందురు. ఇంకను "ఓ దేవా! చరాచరాత్మక ప్రపంచమును సృజించివిశ్వకర్మస్వరూపుఁడుగనున్నావు. పరమాత్మకు శరీరుఁడుగనున్న నిన్ను జనులందఱును కామాదులచే భిన్నుఁడుగఁదలంచు చున్నారు. నీవు జగత్కర్తవు. నీకునమస్కారము"లని బ్రహ్మను బొగడుచున్నారు. ఇచ్చట చాతుర్వర్ణ్యములులేవు సర్వులు సమానులే. ప్రజలు సంకల్పసిద్ధులు, నిత్యతృప్తులు. పదివేల సంవత్సరము లాయు వ్యవంతులు.

షట్చక్రోపాసకులు, సహస్రారస్థానము. సర్వమంగళాశక్తి దేవత. శుక్ల త్రయోదశి చంద్రకళ, కం బీజము, ఓం స్వరము బహుళపక్ష సంజ్ఞతో తృతీయకళగఁ గొనియుపాసింతురు.

ఈ పుష్కరద్వీపమందుఁగల మానసోత్తరపర్వతము మేరుపరిధికి సమానముగ నుండను. కాబట్టి సూర్యరథమును సంచారమార్గ చక్రముగనున్నది.

## —♦ సప్తద్వీప సప్తసముద్రముల సమన్వయ స్వరూప వివరము. ♦—

బ్రహ్మాండమున శుద్ధోదకమునుండి క్షీరసముద్రాది లవణసముద్ర పర్యంతము క్రమముగ సముద్రములుద్భవించి వ్యాపించియున్నవి. ఇట్లేప్రాణులందుఁ బానరూపమునఁ జేరిన శుద్ధోదకము క్షీరాదిగ క్షారజలాంతము సప్తరూపములందిది ద్రవరూప ధాతుసప్తక పదార్థరూపమందెను. ఇదేరీతి సప్తసముద్రములు ఘనీభవించి సప్తద్వీపములయ్యెను. లోకమునక్షీరము దధిఘృతమధు (ఇక్షు) తక్రములు

పాత్రిభేదముచే చక్రాకృతినొందుటను చూచుచున్నాము. వీటియాత్మ నిస్సారమే లవణరూపద్రవము, తత్సారపదార్థము- వేదప్రమాణము "ఆపోవాఇదగ్ం సర్వం"అను అనువాకము- "అమ్భస్యపారే భువనస్యమధ్యే"యను నారాయణ ఉపనిషత్తు.



## చ తు ర్ది క్పా ల కు ల పు ర ము లు.

శ్రీవాయుపురాణం - అధ్యా. ౫౦

మేరోః ప్రాచ్యాం దిశి తథామానసస్యైవమూర్ధని। విసోకసారా మహేంద్రీ పుణ్యాహేమ పరిష్కృతా॥ ౮౭ ॥ దక్షిణేన పునర్మేరోర్మాన సస్యైవమూర్ధని। వైవస్వతోనివసతి యమః సంయమనీపురే॥ ౮౮ ॥ ప్రతీచ్యాంతు పునర్మేరోః మానసస్యైవమూర్ధని। సుఖానామ పురీరమ్యా వరుణస్యాపిధీమతః॥ ౮౯ ॥ దిశ్యుత్తరస్యాం మేరోస్తు మానసస్యైవమూర్ధని। తుల్యామాహేంద్ర పుర్యాతు సోమస్యాపి విభావరీ॥ ౯౦ ॥ మానసోత్తరపృష్ఠేతు లోకపాలాశ్చతుర్దిశం। స్థితాధర్మవ్యవస్థార్థమ్ లోకసంరక్షణాయచ॥ ౯౧ ॥ లోకపాలో పరిష్టాత్తు సర్వతో దక్షిణాయనే। కాష్ఠాంగతస్యసూర్యస్య గతిర్యాతాం నిబోధత। ౯౨ ॥

మేరువునకుఁ దూర్పుదిక్కున మానసోత్తర పర్వతమునందు మనోమయ కోశానంతరము విజ్ఞానమయకోశమందున్న విజ్ఞానమువలె నవనిధులతో ఇంద్రుని పురమగు అమరావతీపురము బంగారుమయమైయున్నది. మేరువునకు దక్షిణదిగ్భాగములో నామానసోత్తరగిరియందు సూర్యునికుమారుడగు యముడు నివసించు సంయమనీపురమున్నది. మేరువునకు పడమటిదిశయందు బుద్ధిమంతుడగు వరుణదేవుని పురమగు సుఖపురి యామానసోత్తరపర్వతమునందున్నది. మేరువునకుత్తరదిశయందు మానసోత్తర పర్వతమునఁ గుబేరుని నివాసమగు విభావరి ఇంద్రపురివలెనున్నది. ఇట్లు నామానసోత్తర పర్వతశిఖరమునందు నలుదిక్కులయందు లోకపాలురు ధర్మవ్యవస్థకొరకు లోకసంరక్షణార్థముగనున్నారు. ఇట్టిలోకపాలుర కుపరిభాగమందు పూర్వదేవతలకువలె పితృమానముచే పారమార్థికదినములయందు శ్లో॥ యానిశానర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ' అనునట్లు ఎల్లప్పుడును దక్షిణాయనమేయుండి సూర్యుడాదక్షిణాయన గతినేపొందుచుండును. దేవతలకదే పగటిభాగ

మైనిరంతరము సూర్యదర్శనమగుచునే యుండును.



## శుద్ధోదకసముద్రము,

పుష్కరద్వీపమునకుఁ జుట్టుచుట్టి ఆవరణముగ వలయాకారముతో కేవల శుద్ధోదక సముద్రమున్నది. దీనివైశాల్యము రువదినాల్గులక్షలయోజనములు. ఈ శుద్ధోదకమే యీసప్తద్వీపములకు ముఖ్యకారణము. మనలోకములోఁగల శుద్ధోదకమువంటిదికానేరదు. మనశుద్ధోదకము లవణసముద్రావరణముతోఁగల మిశ్రితమే. కేవలశుద్ధోదక మిప్పటికినిఁగాదు. ఈ శుద్ధోదక సముద్రజలమునుండి పృథివికి జనించినది ఇందుకు వేదప్రమాణము. "ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతా న్యాపః ప్రాణా వాఆపః పశవఆపోఽన్నమాపోఽమృతమాప స్సంమ్రాడాపో విరాడాప స్స్వరాడాపశ్ఛందాగ్ స్యాపోజ్యోతీగ్ ష్యాపో యజూగ్ ష్యాప స్సత్యమాప స్సర్వాదేవతా ఆపో భూర్భువస్సువ రాప ఓమ్"

"ఆపమాపా మపస్సర్వాః" "యోపాం పుష్పంవేదా పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్భవతి." నారాయణ ఉపనిషత్తు సూక్తము. ఇత్యాదివేదప్రమాణము లనేకములున్నవి. నీటియందుఁగల తేజోభాగము తగ్గుటచేత ఘనీభూతమగును. కొన్నిపదార్థములు వేడిమితో ద్రవత్వమునుబొందును. ద్రవత్వముగానున్న దానిని వేడిమితగ్గించిన ఘనీభవించును. మనశరీరములోఁగల శల్యాదులకు కారణము మనలోని ద్రవరూపజలమే. టెంకాయ మొదలగువాటిలోని జలభాగమునకు ఈజలమేకారణము. పాషాణాది లోహాదులకు వృక్షములకు దారువులకు సర్వకార్యములకు కారణముగనున్నది జలమే. మనశరీరములో వచ్చుచులుగ సప్తధాతువులుగాగల ద్రవములకును, మాంసమునకును, ఉత్తమమధ్యమ కనిష్ఠములకును సప్తచైతన్య జడపదార్థములకును జలమే ముఖ్యకారణము. మఱల ఉపరిలో తేజోభూతమునకు నీజలమే కారణము. "ఆపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్" అని మన నిత్యగాయత్రీ మంత్రోపాసనముతో నేయున్నది. ఒక్కభూతిమన్ని

భూతములకును కారణము గానున్నది. ఏభూతమునుగాని విడిచిన భూతమే లేదు. దీనికే పంచీకృతభూతములని యీపంచీకృతముతోనే పంచభూతములప్రవృత్తి. పంచభూతపరిణామమే ప్రపంచము.

ఈశుద్ధోదక సముద్రము తోనే గుణభేదములుగా గుణాదుల ననుసరించి క్షీర సముద్రమునకు పుష్కరద్వీపమునకు నీలాగు ననుసంధించి, దధిసర్పి సురాలవణేక్షు సముద్రములకును, నాయాద్వీపములకును ముఖ్యకారణకార్యము. మనలోక ములోనే అన్నిటికిని దృష్టాంతములున్నవి. గోవులకు నీళ్లుదాపి పాలనుగ్రహించు చున్నాము. పాలతో పెరుగు, నెయ్యి యుత్పత్తినొందుచున్నవి ఇక్షు రసమునకును సురకును వృక్షములే కారణము. జలరసముతో వీటినుండి యీరస ములుత్పన్నము లగుచున్నవి. మనభూమిలో జలముచేతనేగదా సమస్తపదార్థ ములు, ఫలములు, పుష్పములు, ఓషధులు వాసనలు రుచులుగలవన్నియు గలుగు చున్నవి. లవణసముద్రమునకుం గారణము, జలముతోంజేరిన పదార్థతత్త్వాత్వ రూపపరిణామమే భౌమపాత్రగుణమే లవణము. ఉదాహరణము మనము స్వచ్ఛ మైనపాలనే సంపూర్తిగా ద్రావినచో మరసటిరోజునకవే మనలో మూత్రస్వరూ పముగా మార్పుజెందును. తుదకెప్పటికినిం జెడని శుద్ధగంగోదకము ను ద్రావినను మనలో మూత్రరూపము జెందుచున్నది. పదార్థ (దేహ) సంబంధములప్రధానముతో శుద్ధగంగయు క్షీరములను సహిత మూలాగునంజేయునట్టి పదార్థము మనగానున్నది.

ప్రపంచస్వరూపమే ఇట్టిది. జీవస్వరూపమే యిట్టిది. లేకున్న జీవేశ్వరభేదము లేల? అమృతమునకు, మృతమునకు భేదములేల? సత్త్వాదిగుణాదులకును, తామ సాదులకునుగల భేదములేల? శుద్ధమగు తెలుపురంగులోనుండియే క్రమముగం బసపుం ఎఱుపుం నీలము తుదకు శుద్ధనలుపు పుట్టుచున్నవి. మరల నీరంగులన్నియును మార్పుజెంది తెలుపగును. ఏపదార్థమునుగాని పరీక్షించినచో నన్నియు నీలాగున నే యగుచున్నవి. సృష్టి క్రమమే లయక్రమము. శాశ్వతముగా ప్రపంచములో ప్రకృతి సంబంధవికారములే కాబట్టి సర్వము మార్పులతో విరూపాది రూపనామ క్రియా భేదములతో సర్వదా ప్రళయమువఱకు మారుచుండును. మఱల ప్రారంభము తనకుందానేయగు చుండును. ఈసముద్రము లెట్లు గలిగెను? ద్వీపము లెట్లు గలి గెను? అవెట్లున్నవి? క్షీరసముద్రాదులున్నవాయను సందేహము లేల? మనలోనే క్షీరగుణసమానధాతువులాదిగా సర్వపదార్థములు, రసధాతువులు, ఘనపదార్థము లును గుణమిశ్రితావరణములతో శిరస్సువరకును ఉత్తమ మధ్యమ కనిష్ఠములుగా

మేధ్యామేధ్యములుగా అనుభవములతో నీవ్యష్టి పిండదేహము లో నున్నట్లుగనే బ్రహ్మాండములో బ్రహ్మాండమునకు దగినట్లుగా నుండును మనదేహము బ్రహ్మాండములోని పదార్థరూపమేకదా? జగత్కారణకర్త భగవంతుడు (పదార్థములు) విస్తారముతో ప్రకృతిలోనున్నదంతయు విస్తారమగుచు తుదకు నిస్సారమై శూన్యమగును. విస్తారమే ప్రళయము.

పురాణాదులలో ప్రళయప్రతుని రథము వలయముగా దిరుగుటచేత రథచక్రఘట్టనాతిశయముతో "బల్లములు సముద్రములుగను మిగత భాగము ద్వీపములుగ నేర్పడెనని కారణములు చూపిరి. అట్టు ఆయెత్తుపల్లములు మన మనస్తత్వముతో సరిచూచుకున్న యెడల అన్నియూ సరిపడును. ఈజలములు రెండువిధములుగ భూతరూపములతో నున్నవి. ఒకటి జ్ఞానరూప కారణముతో ఆవరణాంతరములో సుషుమ్నగా కేవల ఆత్మ స్వస్వరూపకారణాంశముతో చైతన్యముతోఁ బ్రతిదేహాంతరములోఁ బ్రాణాడిగ జ్ఞానప్రకాశముతోనున్నదే ఆకాశగంగ. అది దివ్యజ్ఞాన స్వరూపిణిగనున్నది. ఇది క్షేత్రజ్ఞస్వరూపము. రెండవది క్షేత్రములకుఁ గారణభూతముగ బ్రహ్మాండముపరిలో శ్రీమన్నారాయణ స్వరూపోదక వాచ్యముగనున్నదే. మరల సప్తద్వీపముల కుపరిలో మూలకారణ స్వరూపములో శుద్ధోదక సముద్రముగ ఆవరణ దివ్యరూపముతో సత్త్వప్రధాన గుణముతో నున్నది. ఇటులనే పదార్థములలోఁగూడ కొన్ని కేవలక్షేత్రాదుల వృద్ధికొరకు ద్రిగుణములతోను గొన్ని క్షేత్రజ్ఞునికి బుష్టిరూపముగ క్షేత్రజ్ఞ స్వరూపాభివృద్ధికై ఓజోవంతములై శ్రేష్ఠములుగ నున్నవి. సత్వగుణ ప్రధానములగు వీనిని నిర్ణయించి వేదశాస్త్రములందుఁ దెలిపి, మనకు నిత్యమును వాడుకలోనికి దెచ్చి వాటి సహాకారముతో ఉత్తమక్షేత్రమగుటకొఱకును (దేహాదులుగను) ఉత్తమ క్షేత్రజ్ఞతకొరకును గారణముగను నాచరింపఁ జేసి ఆచారమని అనుష్ఠానమని విధియని నిర్ణయించి బోధించిరి. ఇవే సదాచారములు. ఈలాగునఁ దెలిసి ఆచరించుటే వేదమార్గవిహితము. గీతాదులలో వీటినే దైవసంపత్తుగఁ జెప్పిరి తదితరములే ఆసురీసంపత్తులు. వీటితో ఆసురసంపద లేల లభించును. దైవసంపత్తుతో దేవత్వము లభించును. కనుక నీశుద్ధోదక దివ్యజలము శింశుమారములో ధ్రువపథమునుండి వచ్చుచున్న దివ్యగంగయనియు, మహాపవిత్రవంతములు; దివ్యములనియుఁ దెలిసి ఉపాసకుఁడు గావలెను.

—o—

## సముద్రముల వృద్ధిక్షయములు.

శ్రీ మత్స్యపురాణం అధ్యాయం ౧౨౩ పుట ౧౧౬.

ఉదయద్యథ్యవ్యే నేపూర్వే సముద్రః పూర్యతేనదా ప్రక్షీయమాణే బహుళే క్షీయతేzస్తమయేతథా॥ ౩౦ ॥ ఆపూర్యమాణో హ్యుదధిరాత్మనైవాభిపూర్యతే। తతోవై క్షీయమాణేతు స్వాత్మన్యేవ హ్యపాంక్షయః॥ ౩౧ ॥ ఉదయాత్ప్రయసాం యోగాత్పుష్ణన్త్యాపో యథాస్వయమ్ తథాసతు సముద్రోzపి వర్ధతే శశినోదయే॥ ౩౨ ॥ అన్యూనా నతిరిక్తాస్తాః వర్ధం త్యాపో హ్రసంతిచ. ఉదయేzస్తమయే చేన్దోః పక్షయోః శుక్లకృష్ణయోః॥ ౩౩ ॥ క్షయవృద్ధీ సముద్రస్య శశివృద్ధిక్షయే తథా। దశోత్తరాణి పంచాహు రంగుళానాం శతానిచ॥ ౩౪ ॥ అపాంవృద్ధిః క్షయోదృష్టః సముద్రాణాంతు పర్వసు ద్విరాపత్వా త్స్మృతో ద్వీపో దధానాచ్చో దధిస్స్మృతః। కానిగీర్ణత్వాచ్చ గిరయో పర్వబంధాచ్చ పర్వతాః॥

పూర్వున జంద్రుడుదయించుచుండ సముద్రుడు శుక్లపక్షమందు సదాపూరితుడగు చుండును. బహుళపక్షమందు చంద్రుడు క్షయమునొందుచు నస్తమించుచుండ సముద్రుడు క్షీణుడగుచుండును. (అనగా చంద్రోదయకాలపు సముద్రపు వృద్ధి ఆనందబాష్పరూపమనియు చంద్రక్షయాస్తమయముల యందుగలది. సముద్రునికి దుఃఖబాష్పమనియు భావము). చంద్రుని వృద్ధిక్షయములవలెనే సముద్రునికి క్షయవృద్ధులును తిథిక్రమములనుబట్టి పదిహేనువందల యంగుళము లధికముగా నైదువందల యంగుళములవఱకు వృద్ధియు, క్షయము నగు చుండును.

ఇట్లు సముద్రసంబంధోదకముల వృద్ధిక్షయములు పర్వములయందుఁగూడ నుండును. ఇట్లు ద్వివిధములగు ఆపో దేవతాసంబంధమువలనను వృద్ధిక్షయములను ఉచ్ఛ్వసిచస్థితులతో నొంకు జలమున ధరించుటవలనను ఉదధియనుపేరు సముద్రము నకుఁ గలిగెను.

---

## జీవరాసుల సంఖ్యాది భేదములు.

పురాణాంతరే చతురశీతి లక్షజీవరాశీనామాహార భాషావాఙ్మయాది భేద నిరూపణమ్॥ యథా॥ శ్లో॥ ఏకాశీతి పదేవాస్తుమండపే వస్తురూపతః। చాతుర్లక్షం

మానవాఖ్యం మధ్యకేంద్రే వ్యవస్థితం॥ ఇత్యస్మత్ పురాణే మానవధర్మవాక్యోక్తేః త్రిలక్షా చంద్రికాహారాః మాంసం షోడశలక్షకం। పర్ణైస్సప్తలక్షకంస్యా త్తృణభక్షాం కాష్ఠభక్షం త్రిలక్షకం। మకరందే చతుర్లక్ష మంధకారం త్రిలక్షకం॥ ౨ ॥ ఆక పాశి త్రిలక్షంచ వాయుభక్షం త్రిలక్షకం॥ 3 ॥ లక్షం చైవ ఫలాహారం మహ్న హారం త్రిలక్షకం। పాషాణాశి చతుర్లక్షం మూలాహారం త్రిలక్షకమ్। ౪ ॥ ధూమా హారం త్రిలక్షంచ శోణితం చాష్టలక్షకమ్। శల్యాహారం ద్విలక్షంచ విష్ఠాహారంతు లక్షకం। ౫ ॥ చతుష్టయాశీతి లక్షం జీవానాం రాశిభేదతః। ఏషా మాహారభేదో సా చిత్స్వరూప మథశృణు॥ ౬ ॥ లక్షంతు వేదాశ్చత్వారో లక్షం భారతముచ్యతే। నవలక్షంతు వ్యాకరణం చాతుర్లక్షం జ్యోతిషం। ౭ ॥ ఆయుర్వేదోష్టలక్షం స్యా చ్ఛాలిహోత్రంతుషోడశంద్వా త్రింశన్మాలినీశాస్త్రం చాష్టి భరతం విదుః॥ ౮॥ జలజానవలక్షాస్స్యుః స్థావరా లక్షవింశతిః। కృమయో రుద్రసంఖ్యాస్స్యుః పక్షిణోద శలక్ష ॥ ౯ ॥ త్రింశల్లక్షం గజాశ్వాది చాతుర్లక్షాశ్చ మానవాః। జీవాశ్చతుష్ట యాశీతి ర్యత్రసంఖ్యాతిరంత్యజా॥ ౧౦ ॥ అంత్యజన్మ శతాచ్ఛూద్రః పంచవింశతి తశ్చవిట్। నవభ్యో వైశ్యజన్మభ్యో రాజాస్యాత్ షడ్భిరగ్రజః॥ ౧౧ ॥ సద్విజో జ్ఞానదేహేన దేవత్వమధిగచ్ఛతి। సద్విజో జ్ఞానహీనశ్చే జ్జీవయోనిః పునః పునః॥ ౧౨ ॥ అవిద్యైవ పతన్నిత్యం జడసంసార మృచ్ఛతి॥

## —♦ మాలినీశాస్త్ర వివరము. ♦—

ద్వాత్రింశన్మాలినీ లక్షం తద్భేదోత్ర నిగద్యతే। విశ్వకర్మం విశ్వవేషం విశ్వ సారంతు చైత్రికం। ౧ ॥ వాస్తుబోధం మహాతంత్ర మార్షం స్యాచ్చిత్రకాపిలం। కల్హారం భానుమద్వృత్తం విద్యావతి బహుశ్రుతం। ౨ ॥ విశ్వబోధం మానబోధం శాస్త్రికం విశ్వకాశ్యపమ్। కాలయూపం నలమయా విశాలం మానవిన్మయు॥ 3 ॥ పారాశర్యం వాదిసారం సంకీర్ణం సామసంహితా। త్ర్యక్షం బ్రాహ్మం చైద్రసారం వజ్రం దృష్టం తథైవచ। ౪ ॥ మానసారం తథాప్రోక్తం విద్వద్భి శ్శిల్పవేదిభిః॥ ఇత్థం తన్మాలినీశాస్త్రం ద్వాత్రింశల్లక్ష సంజ్ఞితం॥ ౧౫ ॥ మాలినీ శాస్త్రమనగ, యంత్ర, తంత్ర, నిర్మాణక్రమము యుద్ధనౌకాది కార్యక్రమ విధానము: అధి భౌతి కాధ్యాత్మిక లక్షద్వృగైక రహస్యముతోఁ జెప్పఁబడిన వైదిక రాసాయనిక మంత్ర భాషా శాస్త్రమే మాలినీశాస్త్రమని వాస్తుమండపములో జెప్పఁబడుచున్నది. ఇది వైదికమనియే చెప్పవలెను. బౌద్ధమని చెప్పరాదు. “ఋషీణాం భారతీ భాతి సరళా

గవనాంతరా॥ ధీరా _త్త_తస్వ మిచ్ఛంతి ముహ్యంతి ప్రాకృతాజనాః। అని ఆర్యభట్ట సిద్ధాంతరీత్యా పారమర్ష భారతీభాషా నియమముచే నిర్మింపఁబడుటచే వైదికమని తీర్మానము ఆహార నామ భాషావాఙ్మయాది భేదములతో జీవరాసు లెనుబది నాలుఁగులక్షల రకములని పురాణములఁ జెప్పఁబడినవి. వాస్తుమండపము (బ్రహ్మండము)న వస్తురూపమున నెనుబదియొక్క లక్షలున్నవి. అందు నాలుగులక్షలు జ్ఞానచైతన్య స్వరూపమానవాఖ్యగ మధ్యకేంద్రమునఁ గలవు. మానవభూ్రాక్ష మున నాహారభేదములచే జీవరాసు లీక్రిందిరీతిఁ జెప్పఁబడినవి. ఫలంబుల విష్ఠ బురు గొనున వొక్కొక్క లక్షయు, శల్యంబులఁ దినునవి రెండులక్షలును, వెన్నెలను, గడ్డిని, దారువును, వాతపంబును, ననలంబును, ననిలంబును నన్నంబును, వేరులను, ధూమంబును గొనునవి మూడులక్షల వంతునను, నంధకారమున నుండునవి మూడు లక్షలును, మట్టిని, మకరందమును, పాషాణంబును గొనునవి నాలుగేసిలక్షలును, నాకులఁగొనున వేడులక్షలును, జలమును, శోణితమును గొనున వెనిమిదేసి లక్ష లును, మాంసముఁ దినునవి పదునారులక్షలు జీవరాసులు గలవు.

చతుర్వేదంబు లొకలక్ష సంఖ్యయు, భారతమొకలక్ష సంఖ్యయు వ్యాకర ణంబులు తొమ్మిది లక్షలును, జ్యోతిషంబు నాల్గులక్షలును, నాయుర్వేదంబెనిమిది లక్షలును శాలీహోత్రంబు షోడశలక్షలును, మాలినీశాస్త్రంబు ముప్పదిరెండు లక్ష లును, భరతశాస్త్రి మరువదినాల్గులక్షలు గలవు.

జలజంతువులు తొమ్మిదిలక్షలును, స్థావరము లిరువదిలక్షలును, గ్రిములు పదునొకండు లక్షలును, బక్షులు పదిలక్షలును, గజాశ్వాదులు ముప్పదిలక్షలును, మానవులు నాల్గులక్షలు జీవరాసులు నుండును. అన్నియుఁ జేరి యెనుబదినాలుఁగు లక్షలు.

అంత్యజ జన్మములు నూరు గడచిన శూద్రజన్మ కలుగును అట్టి శూద్ర జన్మము లిరువదియైదు గడచిన విజన్మ లభించును. తొమ్మిది వైశ్యజన్మల యనంత రము రాజవంశమునఁ బుట్టుక లభించు. ఆరు రాజజననంబులు గతించిన బ్రాహ్మణ జననము కలుగును. బ్రాహ్మణుండు సదాచార వైదికధర్మ సంపత్తిగలవాఁడై జ్ఞాన దేహముచే దేవత్వముఁ బొందును. బ్రాహ్మణుండు జ్ఞానహీనుఁడైన మరల మరలఁ బలుజీవయోనులఁ బుట్టుచునే యుండును.

మాలినీశాస్త్రము ముప్పదిరెండులక్షలు. (౧) విశ్వకర్మము, (౨) విశ్వవేషము, (3) విశ్వసారము, (౪) చైత్రికము, (౫) వాస్తుబోధము, (౬) మహాతంత్రము,

(౭) ఆర్షం, (౮) చిత్రము, (౯) కాపిలం, (౧౦) కహ్లారము, (౧౧) భానుమస్వ్రొత్తము, (౧౨) విద్యావతి, (౧౩) బహుశ్రుతము, (౧౪) విశ్వబోధము, (౧౫) మానబోధము, (౧౬) శాస్త్రికము, (౧౭) విశ్వకాశ్యపము, (౧౮) కాలయూపము, (౧౯) నలశాస్త్రము, (౨౦) మయశాస్త్రము, (౨౧) మానవిట్యాస్త్రమును, (౨౨) మనుశాస్త్రము, (౨౩) పారాశర్యము, (౨౪) వాదిసారము, (౨౫) సంకీర్ణము, (౨౬) సామసంహితము, (౨౭) త్ర్యైక్యం, (౨౮) బ్రాహ్మము, (౨౯) ఐంద్రసారము, (౩౦) వజ్రము, (౩౧) దృష్టము, (౩౨) మానసారము. ఇట్లు దివ్యమానవమంత్ర భావసర్గముచే తత్త్వమ ను తెలిసి అనుభవించిన పిమ్మట ప్రకృతిలో యంత్రతంత్రాది నిర్మాణముచే సృజింపబడు మన్న సృష్టిని చెప్పునదే మాలినీశాస్త్రమని చెప్పబడును.

—o—

## క్రింది బ్రహ్మాండ వివరము.

పాతాళాదుల క్రిందనుండుజలము కొంతభాగమే. అవల నరకలోకాదులున్నవి. పాతాళముక్రింద జలము, దీనిక్రింద కాలాగ్నియుండును. ఈకాలాగ్ని క్రింద ఆదిశేషుఁడున్నాఁడు. ఈఆదిశేషానంతసంకర్షణ సంజ్ఞామూర్తిక్రింద కూర్మము, దీనిక్రింద వరాహము, దీనికినధోభాగమున ఆధారశక్తి ఆవరణములతోనున్నది. ఇది విశ్వసమష్టి విరాడీశ్వర శరీరస్థూల బ్రహ్మాండకోశ రూపము నకుఁదుది. అవల నేమియునులేని అతీతాత్మస్వరూపమే. మహాసంకల్పములో దీని వరుసక్రమమంతయు స్పష్టముగా నున్నది.

—•—

## పంచభూతములు.

శ్రీవాయుపురాణము భువనవిన్యాసము అధ్యాయము ౫౦ పుట.

సూతఉవాచ:- అథఃప్రమాణ మూర్ధ్వంచ వర్ణ్యమానం నిబోధత। పృథివీ వాయురాకాశ మాపో జ్యోతిశ్చ పంచమమ్। అనఃతధాతవో హ్యేతే వ్యాపకాస్తు

వ్రికీర్తితా॥ ౧ ॥ జననీ సర్వభూతానాం సర్వభూత ధరాధరా। నానాజన పదా కీర్ణా నానాధిష్ఠాన పత్తనా॥ ౨ ॥ నానానద నదీశైల నైకజాతి సమాకులా।

అనంతాగీయతే దేవీ పృథివీ బహువిస్తరా॥ ౩ ॥ నదీనదసముద్రస్థా స్తథా క్షుద్రాశ్రయాః స్థితాః। పర్వతాకాశ సంస్థాశ్చ అంతర్భూమి గతాశ్చ యాః॥ ౪ ॥ ఆపోऽనంతాశ్చ విజ్ఞేయాస్తథాగ్నిః సర్వలౌకికః। అనంతః పర్యతేచైవ వ్యాపకః సర్వసంభవః॥ ౫ ॥ తథాకాశ మనాలంబం రమ్యం నానాశ్రయం స్మృతమ్। అనంత మ్రథితం సర్వం వాయుశ్చాకాశ సంభవః॥ ౬ ॥ అపఃపృథివ్యాము దకే పృథివీచో పరిస్థితా॥ ఆకాశంచాపరమధః పునర్భూమిః పునర్జలమ్। ౭ ॥ ఏవమంత మనంతస్య భౌతికస్య నవిద్యతే। పురాసురైరభిహితం నిశ్చితం తన్నిబోధత॥ ౮ ॥ భూమిర్జల మథాకాశమితి జ్ఞేయాఃపరంపరాః స్థితిరేషాతు విజ్ఞేయా సప్తమేऽస్మిగ్ రసాతలే ౯॥ దశయోజన సాహస్రమేక భౌమం రసాతలమ్ సాదుభిఃపరి విఖ్యాతమేకైకం బహువిస్తరం॥ ౧౦ ॥

—♦ పంచభూత సప్తలోక వివరం. ♦—

క్రిందిలోక ప్రమాణములను, నూర్ధ్వలోక ప్రమాణములను జెప్పెదను. (౧) పృథివియు, (౨) వాయువు, (౩) ఆకాశము, (౪) జలము, (౫ జ్యోతిస్సు, ఈయైదును అనంతధాతువులనియు వ్యాపకములనియుఁ జెప్పఁబడుచున్నవి. సకల భూతములకు జననియు సకల భూతములను ధరించునదియును భూమియే. ఆభూమి నానాజనపదములతో వ్యాపింపఁబడి యనేకాధిష్ఠాన పట్టణములు గలిగియున్నది. మరియు నానానద నదీశైలములు గలదియై యనేకజాతులతో సంకులమై బహు విస్తారముగు నీభూమి అనంతమనియు, దేవియనియుఁ జెప్పఁబడుచున్నది. నదీనద సముద్రస్థితములగు భూతములు క్షుద్రమైన యాశ్రయములు గలిగియున్నది. అటులనే అప్పులు పర్వతములయందు, ఆకాశమందు స్థితికలవై భూమ్యంతర భాగములందుఁగూడ నున్నవి. అటులనే సర్వలోకములను వ్యాపించిన యగ్నియు అన్ని భూతములనుండి పుట్టుచున్నవాఁడై వ్యాపకుఁడై అనంతుడని పఠింపఁబడుచున్నాఁడు. అటులనే నిరాలంబమును నానాశ్రయమును మనోహరమునైన యాకాశముగూడ అనంతమనిచెప్పఁబడుచున్నది. అటులనే వాయువుకూడ ఆకాశసంభవమై యున్నది. అప్పులుఁ బృథివియందుండు. అనీరేపృథివిపై నుండును. క్రిందిభాగమున నాకసము దానిపై మరల భూమియు జలమునుండును. ఇట్లనంత భౌతికతత్వములకు అంతము లేకయుండును. భూమియు, దానిపైన జలము, దానిపైన మరల నాకాశమును

నీలాగున భూతపరంపర తెలియవలెను. ఇది యేడవదగు రసాతలమందుఁగల స్థితి. పదివేలయోజనములు వైశాల్యముగలిగి రసాతల మేకభూతత్వముగా నున్నది. (ఇది సప్తభూమికా ప్రాసాదమునకుఁ బునాది. సత్పురుషులచేత నీలాగు నొక్కొక్కటి బహువిస్తరములదై చెప్పఁబడుచున్నది. వీటిలో ప్రథమ మతలము. ప్రతిభూతము నందును బరమాత్మ స్వరూపచైతన్యబింబ ప్రతిబింబమొకటి యుండి ప్రకాశించు చుండును. పృథివియం దగ్నియు, జలమునందుఁ జంద్రుఁడును, తేజస్సునందు సూర్యుఁడును, వాయువునందు ధ్రువుఁడును, ఆకాశమునందు బ్రహ్మయునుండి సృష్టిస్థితి, సంహారాధికారముతో నున్నారు.

ఈలాగున భువనములు శ్రీ శంకరభగవత్పాదులు శ్రీ సౌందర్యలహరిలో ౧౪ శ్లోకమందు మహీతత్త్వమునందు ఏబదియారు జ్వాలలును ఉదకతత్త్వమునందు ఏబదిరెండు జ్వాలలును, (ఇవి అగ్నికి సంబంధము) తేజస్తత్త్వమునం దరువదిరెండు కిరణములును, వాయుతత్త్వమునందు ఏబదినాల్గు కిరణములును (ఇవి సూర్యసంబంధములు), ఆకాశతత్త్వమునందు డెబ్బదిరెండు కళలును, మనస్తత్త్వమునందు అరువది నాలుగు కళలును (ఇవిసోమునకుచేరినవి) మొత్తము మూడువందల నరువదియాఱును.



## పాతాళాదుల వివరము.

శ్రీవాయుపురాణము - భువనవిన్యాసము - అధ్యాయం ౫౦ - పుట ౭౨

దశయోజనసాహస్రమేకభౌమం రసాతలం। సాధుభిః పరివిఖ్యాత మేకైకం బహువిస్తరం॥ ౧౦ ॥ ప్రథమ మతలంచైవ సుతలంతు తతః పరం। తతః పరతరం విద్యాద్వితలం బహువిస్తరం॥ ౧౧ ॥ తతోగభస్తలం నామపరతశ్చ మహాతలం। శ్రీతలంచ తతఃప్రాహుః పాతాళం సప్తమం స్మృతం॥ ౧౨ ॥ కృష్ణభౌమంచ ప్రథమం భూమిభాగంచ కీర్తితం। పాండుభౌమం ద్వితీయంతు తృతీయం రక్తమృత్తికం॥ ౧౩ ॥ పీతభౌమం చతుర్థంతు పంచమం శర్కరాతలం। షష్ఠం శిలామయంచైవ సౌవర్ణం సప్తమంతథా॥ ౧౪ ॥

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా. ౨౪

ఉపవర్ణితం భూమేర్యథా సన్నివేశావస్థానం- అవనేరప్యధస్తాత్సప్త భూవివరాః - ఏకైకశో యోజనాయుతాంతరేణా యామవిస్తారేణోపక్లప్తాః - అతలం

వితలం సుతలం రసాతలం తలాతలం మహాతలం మహాతలం పాతాళమితి॥ ౫॥ ఏతేషు హి బిలస్వర్గేషు స్వర్గాదప్యధిక కామభోగైశ్వర్యానందభూతిః విభూతి సుసమృద్ధ భవనోద్యాన క్రీడావిహారేషు దైత్యదానవ కాద్రవేయాః నిత్యప్రముదితానురక్త కళత్రాపత్య బంధుసుహృ దనుచరాః గృహపతయ ఈశ్వరాదప్యప్రతిహత కామమాయాః వినోదానివసంతి॥ ౬॥ యేషుమహారాజ మయేన మాయావినాభినిర్మితాః పురోనానామణి ప్రవర ప్రవేకక విరచిత విచిత్రభవన ప్రాకారగోపుర సభాచైత్యచత్వరాదిభిర్నానా సురమిధున పారావత శుకశారికాకీర్ణ కృత్రిమభూమిభిర్వివరేశ్వర గృహోత్తమైః సమలం కృతాశ్చకాసంతి॥ ౭॥ ఉద్యానాని చాతితరాం మన ఇంద్రియానందిభిః కుసుమ ఫలస్తబక సుభగకిసల యావనతరుచిర విటపినాం కనకలతాంగా లింగితానాం – శ్రీభిస్సముదిత మిధున వివిధ విహంగకుల కోలాహల జలాశయానాం అమలబల పూర్ణానాం ఝుషాకులోల్లంఘనక్షుభిత నీరనీరజకుముద కువలయ కహ్లార నీలోత్పల లోహిత శతపత్రాది వనేషు కృతనికేతనానాం – ఏకవిహారాకుల మధుకర నికరాణాం మధురవివిధ స్వానాదిభి రింద్రియోత్సవై రమరలోక శ్రియమతిశయితాని॥ ౮॥ యత్రహ వా వనభయ మహోరాత్రాదిభిః కాలవిభాగై రుపలక్ష్యతే- యత్రమహాహిప్రవర శిరోమణయ స్సర్వం శార్వరం తమః ప్రబాధంతే॥ ౯॥ నవాఏతేషు వసతాం దివ్యౌషధి రస రసాయనాశన పానస్నానాది భిరాధయోవ్యాధయః పరిపతిత జరాదయశ్చ దేహవైవర్ణ్య దౌర్గంధ్య స్వేదక్లమ గ్లానిరితి వయోవస్థాశ్చ న భవంతి॥ ౧౦॥ నహి తేషాం కల్యాణానాం ప్రభవతి కుతశ్చన మృత్యుర్వినా భగవత్తేజ సశ్చక్రాపదేశాత్ యస్మిం ప్రవిష్టే సురవధూనాం ప్రాయః పుంసవనాని భయాదేవ స్రవంతి పతంతిచ॥ ౧౧॥

భూలోకమునకు గ్రిందుగా నేడుభూవివరములుగలవు. అందొక్కొక్కటి పదివేలయోజనముల యౌన్నత్యమును నంత విడల్పును దైర్ఘ్యమునుగలిగి యొప్పచున్నది. భూలోకాదులకంటెను సర్వవిషయాదులధిక భోగాధికములుగనున్నవి. స్వర్గమునకంటె అత్యధిక సుఖానంద భోగ్యభూములుగా నుండుటచేత వీటికి బిలస్వర్గములనుపేరుగలిగెను. అవిక్రమముగా (౧) నతలమనియు, (౨) వితలమనియు (3) సుతలమనియు, (౪) రసాతలమనియు, (౫) తలాతలమనియు, (౬) మహాతలమనియు, (౭) పాతాళమనియుఁ జెప్పఁబడుచున్నవి. ఈబిలస్వర్గములందు స్వర్గాదులకంటె నధికముగ కామభోగాదులుగలవు. వీనియందున్న యైశ్వర్యము స్వర్గాదులందు లేదు. వీనియందున్న యానందసమృద్ధియు, విభూతియుఁదక్కినవాని

యం దరుదు. ఇవి సర్వవస్తు సమృద్ధములగు మణిమయమందిరములచేతను నుద్యా
నవనములచేతను గ్రీడాస్థానములచేతను, బ్రకాశించుచున్నవి. ఇచ్చటదైత్యదా
నవ గద్రూసంతతులు వసింతురు. వారలు సంతతానందమును ననురాగమునుగలిగిన
భార్యాజనమును, నపత్యములును, బంధువులును, మిత్రులును, ననుచరులును గలిగి
సేవనలతో మదించిన గృహపాలకులుగలిగియుందురు. వారలకోర్కెలీశ్వరునికైనఁ
బ్రతిహతములు కానేరవు. వారుసర్వదా మాయావినోదులయి వర్తించుచుందురు.
మహామాయాబలవంతుఁడగు మయుడు నానావిధ విశేషసౌకర్యంబులుగఁ బురంబు 7
లను నిర్మించె. ఆపురములు నానావిధ రత్నశ్రేష్ఠములచే విరచితములగు విచిత్ర
భవనములచేతను, ప్రాకారముచేతను, గోపురములచేతను, సభామందిరములచేతను,
రథ్యావృక్షములచేతను, కవాటములచేతను, నాగ రాక్షస మిథునములచేతను
పావురములకును, శుకశారికాది పక్షులసమూహముల కాటపట్టగు కల్పితభూముల
చేతను అధిపతులచేతను నలంకృత బింబస్వర్గములయి విరాజిల్లుచున్నవి. అందు బహు
సుందరములగు నుద్యానవనంబులుగలవు. అందలివృక్షములు లతాసుమ గుచ్ఛ
ములచేతను వంగినవై సుందరములయి ప్రకాశించుచున్నవి. అందున్న పద్మాకర
ములు జతలుగట్టి విహరించుచున్న నానావిధ విహంగకోలాహల ధ్వనులచే నొప్పుచు,
నిర్మలజలపూరితములయి మత్స్యాదుల విహారములచేఁ జలించుచుండును. అందలి
జలములందున్న పద్మములును, కలువలును, తెల్లగలువలును, నెత్తగలువలును,
నీలోత్పలములును, నెత్తవిపద్మములు మొదలగువాని సమూహములతో శోభితము
లైయుండును. ఆపద్మవనములందు బలువిధములు విహరించుచున్న మధుకరబృం
దములు ఝుంకారములచే మనోహరములయి సకలేంద్రియముల కానందముఁగొన
గుచుండును. అట్టియుద్యానంబులచే నివి స్వర్గాదులను మీఱుచున్నవి. అచ్చటి
వారలు చిరకాలజీవులయి యుండుటచేఁ గాలమున కవయవభూతములగు నహో
రాత్రాదులచే భయపడ నవసరములేదు అచ్చట నహోరాత్రముల విభజించు
వెలుఁగునిచ్చు సూర్యాదులు లేకపోయినను, మహాసర్పముల ఫణామండలములందు
వెలయురత్నములు కాంతిసంతతులచే జీకట్లను దఱుముచున్నవి. సూర్యకాంతి
లేనందునఁ గర్మల ప్రసంగములులేవు. అచ్చటివారు దివ్యౌషధములసేవించి
రసాయనములఁద్రావి స్నానాదులు నాచరించినవారగుటచే వారికి మనఃపీడయు,
రోగములును, శరీరపు ముడుతలు, తలనెఱయుటయు, ముదుసలితనము మొదలగు
నవిలేవు. దేహవైవర్ణ్యము, దుర్వాసన, చెమ్మట, శ్రమ, నిరుత్సాహము మొదల

గునవి సంభవింపనేరవు. శ్రీవిష్ణుచక్ర భయకంపాదులుతప్ప నెద్దానిభయమును లేదు. విష్ణుచక్రముతోనే వారలకు మృత్యుభయమున్నది. కావున నాచక్రమన్న వారెంతయోభయపడుదురు. ఒకప్పుడాచక్రము ప్రవేశించెనేని భయాతిరేకముచే నచ్చటి స్త్రీలగర్భములు నేలబడుచుండును. ఇదెపుడువచ్చునోయని కలవరించుచుండురు.

ఈసప్తపాతాళములు నేడువిధములుగాగల భూములుగానున్నవి. (౧) కృష్ణభూమి, (౨) పాండుభూమి, (3) రక్తమృత్తిక, (౪) పీతభూమి, (౫) శర్కరభూమి (మొరపనేల) (౬) శిలామయభూమి, (౭) సౌవర్ణభూమిగ నున్నది.

ఈబిలస్వర్గభూము లనుభవించువారలు తపోవిశేష పుణ్యమూర్తులుగా నున్నవారలు. వీరలకుపరిలో స్వర్గలోక తేజోభూతములో నేల స్థానములేకపోయెనని శంకించవచ్చును. వీరలు రాజస తామస గుణప్రధాను లైనందుచేత వారితపస్సులు నట్టివిగానుండుటచేత స్వర్గానుభవమునకుఁ గొంతకాలము పరిపక్వదశనొంద నిచ్చట ప్రత్యేకించి సర్వసుఖసంపత్తితో నియమితులైరి. వీరలు మరొకకల్పమందు స్వర్గలోకమున కధికారులుకాగలరు. ఇందుకుబలిచక్రవర్తి యీలోకనివాసిగా నుండుట చేత విశదమగుచున్నది. వీరలు సర్వవిధముల దేవతలనుమించిన తపస్సంపన్నలుగాని గుణభేదములతో నీలాగున ప్రకృతమీకల్పములో నిదివఱకు నియంతలుగా నున్నవారలుండుటచేతను, వీరికిపరిపక్వకాలమునకుఅవధిగా నంతరాళములో భగవన్నియామకముగానున్నారు. కొన్నివిషయాదుల నాలోచించితే స్వర్గమునకంటె నధికములుగా నేయున్నవి.

—o—

## అ త ల ము.

శ్రీమద్భాగవతము పంచమస్కంధం అధ్యాయం ౨౪.

శ్లో॥ అథాతలే మయపుత్రో బలోనామాసురో నివసతి- యేనహవా ఇహసృష్టాః షణ్ణవతీర్మాయాః కాశ్చనాద్యాపి మాయావినోధారయంతి- యస్యచ జృంభమాణస్యముఖతస్త్రియ స్త్రీగణా ఉదపద్యంత- తాస్స్వైరిణ్యః కామిన్యః పుంశ్చల్యఇతి- యానైద్బిలయానం ప్రవిష్టం పురుషం రసేన హాటకాఖ్యేన సాధయిత్వా స్వవిలాసావలోకనాను రాగస్మిత సల్లాపోప గూహనాదిభిస్స్వైరం కిల రమయంతి॥ ౧౨ ॥ యస్మిన్నుపయుక్తే పురుష ఈశ్వరోహం సిద్ధోహ మిత్యయుత

మహాగజబల మాత్మానమతిమన్యమానః కత్థతే మదాంధఇవ॥ ౧౩ ॥

శ్రీ వాయుపురాణము భువనకోశవిన్యాసము అధ్యాయము ౫౦.

ప్రథమేతు తలేఖ్యాత మసురేంద్రస్య మందిరం। నముచేరింద్ర శత్రోశ్చ మహానాదస్య చాలయం॥ ౧౫ ॥ పురంచశంఖకర్ణస్య కబంధస్యచ మందిరం। నిష్కులాదస్య చపురం ప్రహృష్ట జనసంకులం॥ ౧౬ ॥ రాక్షసస్యచ భీమస్యశూల దంతిస్యచాలయం। లోహితాక్ష లింగానాం నగరం శ్వాపదస్యతు॥ ౧౭ ॥ ధనం జయస్యచపురం మాహేంద్రస్య మహాత్మనః। కాళియస్యచ నాగస్యనగరం కల సస్యచ॥ ౧౮ ॥ ఏవంపుర సహస్రాణి నాగదానవ రక్షసాం। తలేజ్ఞేయాని ప్రథమే కృష్ణభౌమే నసంశయః॥ ౧౯ ॥

అతలమందు మయపుత్రుడు బలుండనువాఁడు ప్రబలుఁడుగ నున్నాఁడు. అతఁడు మహామాయావి. మాయలు తొంబదియారుగలవు. ఇవి వీనికి స్వాధీనములు వాఁడావులింపగా వానినోటినుండి మూడు స్త్రీ గణములు పుట్టినవి. వారు స్వైరిణు లనియుఁ, గామినులనియు బుంశ్చలులనియు, నామములుగలవారు. స్వజాతివారితోఁ గ్రీడించువారు స్వైరిణులనఁబడుదురు. స్వేతరజాతి సంభవులతోఁగూడ విహరించు వారు కామినులనఁబడుదురు. అట్లు విహరించుటలో మతి చాంచల్యము గలవారు పుంశ్చలులు ఆస్త్రీగణములు బిలమును బ్రవేశించి వచ్చిన పురుషుని హాటకమను రసాయనముచే సంభోగసమర్థునిగా జేసికొని తమ విలాసావలోకనములచేతను, నను రాగ సూచకమగు మందహాసములచేతను, రహస్య సంభాషణములచేతను వాలింగ నాదులచేతను, స్వవశునిగాఁచేసుకొని వానితో రమించుచుందురు. ఆహాటకరసము నిరుపమ ప్రభావము గలది. దీని నుపయోగించిన పురుషుఁడు బది వేల దిగ్గజముల బలము లేక సహజబలముగలిగి మదాంధుడై తా నేయీశ్వరుఁడనియు, సిద్ధుఁడనియు, శ్లాఘించుకొనుచుండును. ఈలాగున మదాంధుడై రమించుచుండును. ఇది భూలోక ప్రభావము.

ఈచోట మొదట నసురేంద్రునిపురంబు గలదు. ఆపయివరుసగ నముచి, శంఖకర్ణ, కబంధ, నిష్కులాద, శూలదంతి, లోహితాక్ష, ధనంజయ, కాళియాది నామములుగల నాగులపురంబులు మనోహరంబులైయుండు. వీరందరు దేవేంద్ర శత్రువులు. మరియు నాగదానవ పురసహస్రంబులుండును. ఇయ్యది కృష్ణభూమి యనఁబడును.



# వితలము.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా. ౨౪

తతోఽధస్తా ద్వితలే హరో భగవాన్ హాటకేశ్వరః స్వపార్షద భూతగణావృతః ప్రజాసర్గోప బృంహణాయ భవాన్యా సహ మిధునీ భూయాస్తే- యతః ప్రవృత్తా సరిత్ప్రవరా హాటకీనామభవయో ర్వీర్యేణ- యత్రచిత్రభాను ర్మాతరిశ్వనా సమిధ్యమాన ఓజసాపిబతి- తన్నిష్ఠ్యూతం హాటకాఖ్యం సువర్ణం భూషణేన సురేంద్రా వరోధేషు పురుషాస్సహ పురుషీభిర్ధారయంతి॥ ౧౪ ॥

శ్రీవాయుపురాణము - భువనకోశము - అధ్యా. ౫౦

శ్లో॥ ద్వితీయోఽపి తలేవిప్రాదైత్యేంద్రస్య సురక్షసః। మహాజంభస్యచతథా నగరం ప్రథమస్యతు॥ ౨౦ ॥ హయగ్రీవస్యకృష్ణస్య నికుంభస్యచ మందిరం। శంఖాఖ్యోయస్య చ పురంనగరం గోముఖస్యచ॥ ౨౧॥ రాక్షస్యచ నీలస్య మేఘస్య క్రథనస్యచ। పురంచ కురుపాదస్య మహోష్ణీషస్య చాలయం॥ ౨౨ ॥ కంబళస్య చ నాగస్య పురమశ్వతరస్యచ। కద్రూపుత్రస్యచపురం తక్షకస్యమహాత్మనః॥ ౨౩ ॥ ఏవంపుర సహస్రాణి నాగదానవ రక్షసాం। ద్వితీయేస్మిన్ తలేవిప్రాః పాండుభౌమా ననంశయః॥ ౨౪ ॥

వితలమందు భగవంతుండగు రుద్రుడు హాటకేశ్వరుడను నామముధరించి తనభక్తులగు ప్రమథగణములచే సేవింపఁబడుచుండును. బ్రహ్మచే ప్రజావృద్ధిని జేయుమని యాజ్ఞాపింపఁబడిన రుద్రుండు సృష్టిని వృద్ధిచేయఁగోరి భవానీదేవితోఁ గ్రీడించుచుండెను. వారట్లు మిధునకర్మ మొనర్చుచుండగా వారివీర్యము ప్రవాహరూపముగా బాటిహాటకినీయను నదియయ్యె. అగ్నిహోత్రుఁడు వాయు ప్రసారమువలన దీప్తుండయి తనబలముచే దానినిభక్షించి యుమ్మివేయగా నది హాటకమనెడుపేరుతో సువర్ణనది యయ్యెను. నివాసులగు స్త్రీపురుషు లా సువర్ణముతో నాభరణములు చేయించుకొని యలంకరించుకొనుచుందురు. ఈకారణము చేత హాటకేశ్వరుండనెడి నామమునీశుఁడు దాల్చెను. దీనినిదేవతావనితలుగూడ ధరించిరి. ఇందుకు చిదంబరనటతంత్రములో "ఆకాశెతారకాలింగం పాతాళెహాటకేశ్వరం, మర్త్యలోకే మహాకాళం దృష్ట్వాముక్తి మవాప్నుయాత్"అని భూరాదిలోకత్రయ లింగమాత్రదర్శనము చేతనే జీవన్ముక్తికూడ చెప్పబడి ప్రమాణమగుచున్నది.

రెండవయధోలోకంబగు వితలము దైత్యరాక్షస నిలయంబు. అందు మొదటి పురము మహాజంభునిది. ఆపయి నికుంభునిపురంబుగలదు. దానితరువాత గోముఖుని శంఖాఖ్యపురంబొప్పును. పిదప క్రథన, కురుపాదాది రాక్షసపురములు. కంబళ, అశ్వతరతక్షక నాగాదుల పట్టణములుకలవు. ఇట్లునాగదానవ పురసహస్రంబులుగలిగి పాండుభూమియందా వితలంబు ప్రకాశించు.

—౦—

## సు త ల ము.

శ్రీమద్భాగవతము పంచమస్కంధము అధ్యాయము ౨౪.

శ్లో॥ తతోధస్తాత్సుతలే ఉదారశ్రవాః పుణ్యశ్లోకో విరోచనాత్మజోబలిః భగవతా మహేంద్రస్య ప్రియంచికీర్ష మాణేనాదితేర్లబ్ధకాయో భూత్వావటుర్వామన రూపేణ పరాక్షిప్తలోకత్రయో భగవదనుకంపయైవ పునః ప్రవేశితః- ఇంద్రాదిష్వవిద్యమానయా, సుసమృద్ధయా శ్రియాభి జుష్టః స్వధర్మేణారాధయం స్తమేవ భగవంత మపగత సాధ్వస ఆస్తేఽధునాపి॥ ౧౮॥ నోఏవైతత్సాక్షాత్కారో భూమిదానస్య యత్తద్భగవత్యశేషజే- అశేష జీవనికాయానాం జీవభూతాత్మ భూతేపరమాత్మని వాసుదేవే తీర్థతమేపాత్రి ఉపపన్నే- పరయా శ్రద్ధయా పరమాదర సమాహితమనసా సంప్రతిపాదితస్య సాక్షాదపవర్గ ద్వారస్య యద్బిల నిలయైశ్వర్యమ్॥ ౧౯ ॥ యస్యహవావ- క్షుతపతన ప్రస్థలనాదిషు వివశ స్సకృన్నామాభి గృణన్ పురుషః కర్మబంధన మంజసా విధునోతి- యస్యహైవ ప్రతిబంధనం త్వాహముముక్షవోన్యథైవోపలభ్యంతే- తద్భగవతో భక్తానాం సర్వేషా మాత్మనామాత్మదే - ఆత్మతమే॥ ౨౦ ॥ నైవభగవాన్న్యానముముష్యానుజగ్రాహ - యదుతపునరాత్మాను స్మృతిమోషణం మాయామయ భోగైశ్వర్యమే వాతనుతేతి॥ ౨౧ ॥ యత్తద్భగవతాఽనధిగతా న్యోపాయేన యాచ్ఞాచ్ఛలే నాపహృత స్వశరీరావశేషిత లోకత్రయః వరుణపాశైశ్చ సంప్రతిముక్తః- గిరిదర్యాం చాపవిద్ధ ఇతి హోవాచ భగవాన్ బలిః॥ ౨౨ ॥ నూనంబతాయం, భగవానర్థేషు ననిష్ణాతో యోసావిందోయస్య సచివో మంత్రాయ వృతఏకాంతతయో బృహస్పతిః- తమతిహాయస్వయ ముపేంద్రేణాత్మనా మాత్మాన మయాచతాత్మన ఆశిషోనో ఎవైతద్దాస్య మతిగంభీర వయసః కాలస్య మన్వంతర పరివృత్తం కియ

శ్లోకత్రయ మిదం॥ ౨౦ ॥ యస్యానుదాస్య మేవాస్మత్పితామహః కిలవవ్రేనతు స్వపిత్ర్యం యదుతా కుతోభయంపదం దీయమానం భగవతో పరతేస్వ పితరి॥ ౨౧ ॥ తస్యమహానుభావస్యాను పథమల మమృదితకషాయః కోవాస్మ ద్విధః- పరిహీణః భగవదనుగ్రహము పజిగమిషతీతి॥ ౨౨ ॥ తస్యానుచరితముత్త రస్మాద్విస్తరిష్యతే- యస్యభగవాన్ స్వయమఖిల జగద్గురుర్నారాయణోద్వారిగదా పాణి రవతిష్ఠతే- నిజజనానుకంపిత హృదయః- యేనాంగుష్ఠేన పదాదశకంధరో యోజనాయుతాయుతం దిగ్విజయ ఉచ్చాటితః॥ ౨౩ ॥

శ్రీ వాయుపురాణము భువనకోశము అధ్యా. ౫౦

తృతీయేతు తలేఖ్యాతః ప్రహ్లాదస్య మహాత్మనః। అనుహ్లాదస్య చపురం దైత్యేంద్రస్యమహాత్మనః॥ ౨౫ ॥ తారకాఖ్యస్య చపురం పురంత్రిశిరసస్తథా। శిశుమారస్య చపురం హృష్టపుష్ట జనాకులం॥ ౨౬ ॥ చ్యవనస్యచ విజ్ఞేయం రాక్షస స్యచమందిరం। రాక్షసేంద్రస్య చపురం కుంభిళ స్యఖరస్యచ॥ ౨౭ ॥ విరాధస్యచ క్రూరస్య పురముల్కాముఖస్యచ। హేమకస్యచ నాగస్యతథా పాండురకస్యచ॥ ౨౮ ॥ మణిమంత్రస్య చపురం కపిలస్య చమందిరం। నందస్య చోరగపతేర్విశాలస్యచ మందిరమ్ ఏవం పురసహస్రాణి నాగదానవరక్షసాం। తృతీయేzస్మింస్తలే విప్రాఃపీత భూమౌ నసంశయః॥ ౩౦ ॥ భాగవతాగ్రగణ్యుండును విపులకీర్తివంతుండును విరోచనుని కుమారుండునగు బలిచక్రవర్తి సుతలమందుఁ బ్రకాశించుచున్నాఁడు. ఇంద్రాదులకు సైతములేని యైశ్వర్యములతో వెలయుచు భయరహితుండై స్వధర్మముచే భగవంతు నారాధించుచు నిప్పటికిని వర్తించుచున్నాఁడు. పూర్వము బలిచక్రవర్తి త్రిలోకములను జయించి నిరంకుశముగాఁ బరిపాలించుచుండెను. అంత భగవంతుఁడగు విష్ణువు దేవేంద్రునకుఁ బ్రియమొనర్ప దలఁచి తానదితి గర్భమున వామనుఁడయి యుదయించి బ్రహ్మచారి వేషముఁ దాల్చి లోకత్రయము లతనివలన దీసికొని యతని సాత్త్వికోదార సుగుణములకు మిక్కిలి దయగలవాఁడై సుతలమందుండ నియమించెను. అది మొదలతఁడా భగవంతు నారాధించుచుఁ నందే యున్నాఁడు. భగవదవతారమూర్తియగు వామనుని కిట్టి మహాసాత్త్వికదానముఁ జేసిన మహాత్యాగ తపస్వికి నీసుతలసుఖ నివాస మెంతటిది! నిరతిశయాపవర్గమే ముఖ్యఫలముగాని యిది ఫలముకానేరదు. ఇతఁడు తన ప్రారబ్ధకర్మశేష ఫలమును గొంతకాల మనుభవింపవలసి యున్నందుచేత నీసుతల మందుండ భగవంతుఁడు నియమించెను. ఇది భగవదాజ్ఞగా శిరసావహించి ఇచట

నిరంతర భగవదారాధన పరాయణుండై బలి నిలిచెను. ఇంతకు మించిన ఐశ్వర్యమే లేదు. ఇది శాశ్వతైశ్వర్య ద్వారము. ఇది కేవల సర్వసన్న్యాసస్థితిర్జ్ఞానమే కాని వేరుకాదు. ఇది సమాధిస్థితికాని వేఱుగాదు. ఇట్టి మహా పరమపవిత్ర జ్ఞానికి విషయసుఖము లెంతటివి? బ్రహ్మాద్యాధిపత్యముగూడ దీనిముందెంత? భక్తికిని జ్ఞానమునకును భేదమే లేదు. ఇతడు ప్రహ్లాదుని మనుమఁడు గాన వేఱుగాఁ చెప్పవలెనా? కల్పాంతమందు నింద్రపదవికి రాఁబోవును. అందుచేత నిచ్చట కాలము గడుపుచున్నాఁడు. నిఖిల జగద్గురుఁడును, భగవంతుడునగు శ్రీ మహావిష్ణువు గదాపాణియై తనకుఁ బరమభక్తుఁడయిన బలియందనుగ్రహంబు గలవాఁడయి యాతని ద్వారమును సర్వదా కాచుకొనియున్నాడు. ఒకనాఁడు దిగ్విజయార్థము రావణుం డచ్చటికి వచ్చి యాద్వారమును జొచ్చుచుండగాఁ దనకాలి అంగుష్ఠముచే విష్ణువు పదివేలయోజనముల దూరము పడునట్లు మీటివైచెను. బలిచక్రవర్తియొక్క మహిమాతిశయముల నెవరు వర్ణింతురు?

మూడవది సుతలము. ఇది వితలమునకుఁ గ్రిందిభాగమున నుండును. ఇందు మహాత్ముండును బ్రహ్లాదుని పౌత్రిండుననగు బలిపురంబు కడుశోభాయమానంబుగ నుండును. పిమ్మట తారకుని నగరంబుండు తరువాత శిశుమార, కుంభిక, ఖర, విగా, ధోల్కాముఖాద రాక్షసపురంబులును, హేమక, పాండురిక, మణిమంత్ర, కపిల, నందాది నాగులపురిములు గలవు. ఇట్లు రాక్షసనాగపుర సహస్రంబులుగలిగి పీతభూమియైన సుతల బు కనులపండువై యుండు.

—o—

## త లా త ల ము.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యాయ. ౨౪

తతోఽధస్తాత్తలాతలే మయోనామ దానవేంద్రస్త్రిపురాధి పతిర్భగవతా త్రిపురారిణా త్రిలోక్యాశ్శం చికీర్షుణా నిర్దగ్ధ పురత్రయ స్తత్ప్రసాదాల్లబ్ధపదో మాయావినామాచార్యో మహాదేవేన పరిరక్షితో విగత సుదర్శన భయోమహీయతే। ౨౮।

శ్రీవాయుపురాణము - భువనకోశము - అధ్యా. ౫౦

చతుర్థే దైత్యసింహస్య కాలనేమే ర్మహాత్మనః। రజకర్ణస్య చ పురంనగరం

కుంజరస్యచ॥ 3౦ ॥ రాక్షసేంద్రస్య చ పురం సుమాలేర్బహువిస్తరం। ముంజస్య లోకనాథస్య వృకవక్త్రస్యచాలయం॥ 3౨ ॥ బహుయోజన సాహస్రం బహుపక్షి సమాకులం। నగరం వైనతేయస్య చతుర్థేఽస్మిన్ రసాతలే॥ 33 ॥

సుతలంబునకుఁ గ్రిందిభాగమున తలాతలంబుకలదు. అందుమయుఁడను దానవేంద్రుఁడు గలఁడు. వాఁడాలోకవాసులచేఁ బూజింపబడుచుండును. వాఁడు త్రిపురముల కధిపతియైయుండెడివాఁడు. లోకరక్షకుండును భగవంతుండునునగు రుద్రుండు పురత్రయమును బూర్వముదహించె. అప్పుడు మయుండు మిక్కిలి వేడుకొనగా నతనియందనుగ్రహించి రుద్రుండతని కాతలాతలము నొసంగి చక్రము వలని భయమును బాపె. అందుచేతమయుఁడు నిర్భీకుండయి సుఖవంతుఁడయి యిందునివసించుచున్నాఁడు.

ఇందు మొదట కాలనేమిపురంబుగలదు. పిమ్మట కుంజరుని పురంబుఁ గ్రమముగ ముంజసుమాల్యాదుల పురంబులుండు. ఆపురంబులు బహుపక్షిసమాకులంబై బహుయోజన విస్తారంబైయుండు. చతుర్థమంబగు నిందు వైనతేయునగరంబు ననన్యసామాన్యంబై ప్రకాశించుచుండును.



## మ హా త ల ము.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా. ౨౪

శ్లో॥ తతోఽధస్తాన్మహాతలే కాద్రవేయాణాం నైకశిరసాం క్రోధవశానాం గణః- కుహక- తక్షక- కాళీయ- సుషేణాది ప్రధానా మహాభోగవంతః - పత త్రిరాజాధిపతేః పురుషోత్తమవాహా దనవరత ముద్వేజమానాః స్వః కళత్రాపత్యసుహృత్కుటుంబసంగేన క్వచిత్ప్రమత్తావిహరంతి॥ ౨౯ ॥

శ్రీవాయుపురాణము - భువనకోశము - ౯౧.

శ్లో॥ పంచమే శర్కరాభూమే బహుయోజన విస్తృతే। విరోచనస్య నగరం దైత్యసింహస్య ధీమతః॥ 3౪ ॥ వైడూర్యస్యాగ్నిజిహ్వస్యహిరణ్యాక్షస్యచాలయం పురంచ విద్యుజ్జిహ్వస్య రాక్షసస్యచ ధీమతః॥ 3౫ ॥ మహామేఘస్య చ పురం రాక్షసేంద్రస్య శాలినః। కర్మారస్య చ నాగస్య స్వస్తికస్య జయస్యచ॥ 3౬ ॥ ఏవం పురసహస్రాణి నాగదానవరక్షసాం॥

తలాతలాధోభాగమున మహాతలమున్నది. అందు గద్రూప్రసూతులు ననేక శిరస్కులు నగు సర్పసమూహములుగలవు. ఇవి క్రోధస్వరూపములు. ఆసర్ప గణము (౧) కుహకుఁడు, (౨) తక్షకుఁడు, (3) కాలియుఁడు, (౪) సుషేణుఁడు మొదలగువారు ప్రధానులు. వారుదీర్ఘకాయములతో నొప్పుచున్నారు. వారు పరమ పురుషుండగు వాసుదేవునకు వాహనమగు గరుడునివలన నెల్లప్పుడును భయ మందుచు, దమభార్యలందును, సంతానములందును, స్నేహితులందును, నధికాసక్తి గలవారయి ప్రమత్తులయి విహరించుచుందురు.

ఇయ్యది శర్కరాభూమి. బహుయోజన విస్తీర్ణమైయుండును. ఇందువిరోచన, హిరణ్యాక్ష, విద్యుజ్జిహ్వ, మహామేఘాది రాక్షసపురంబులు, జయాది నాగ పురంబులు నుండును.



## రసాతలము.

శ్రీమద్భాగవతము - పంచమస్కంధం - అధ్యా, ౨౪.

తతోఽధస్తాద్రసాతలే దైతేయా దానవాః పణయో నామ నివాతకవచాః కాలకేయా హిరణ్యపుర నివాసిన ఇతి విబుధ ప్రత్యనీకా ఉత్పత్త్యామహౌజసో మహాసాహసినోభగవతః సకలలోకాను భావస్యహరేరేవ తేజసా ప్రతిహత బలావలేపా బిలేశయా ఇవనివసంతి- యేవై సరమ యేంద్రదూత్యా వాగ్భిర్మంత్రవర్ణాభిరింద్రాద్బిభ్యతి॥ ౨౯ ॥

శ్రీవాయుపురాణము - భువనకోశము - అధ్యా. ౫౦

శ్లో॥ షష్ఠేతలే దైత్యపతేః కేసరేర్నగరోత్తమం। సువర్ణాణః సులోమ్నశ్చ నగరం మహిషస్యచ। రాక్షసేంద్రస్య చ పురముత్క్రోశస్య మహాత్మనః॥ ౩౮ ॥ తత్రాస్తే సురసాపుత్రః శతశీర్షో ముదాయుతః। కశ్యపస్య సుతః శ్రీమాన్వాసుకిర్నామ నాగరాట్॥ ౩౯॥ ఏవంపురసహస్రాణి నాగదానవరాక్షసాం। షష్ఠే తలేస్మిన్ విఖ్యాతే శిలాభౌమే రసాతలే॥ ౪౦ ॥

మహాతలమున కధోభాగమున రసాతలమున్నది. అందు దితిసంతతివారు నివసించుచున్నారు. వారలంకరింపఁబడిన ఫణములచే నొప్పియున్నారు. వారు

(౧) నివాతకవచములనియు, (౨) కాలకేయులనియు (3) హిరణ్యపురవాసులనియు మూడు తెగలవారైయుందురు. వారు దేవతలకు శత్రువులై వర్తించుచుందురు. వారుపుట్టువుచేతనే మహాబలవంతులు. వారెక్కుడుసాహసముగలవారు. సర్వలోకములందును బ్రభావముగల నారాయణుని చక్రముచే బ్రతిహతబలులై సర్పముల చందమున వర్తించుచుందురు. ఇంతియగాక యింద్రదూతికయగు సరమ పలికిన మంత్రవర్ణరూపములగు వాక్కులకును నిందునకును భయమందుచుందురు. దేవతల హవిర్భాగముల నాశించి అడ్డగించినవారై గరుత్మంతునితో హతులైరి. మంత్రము "హతాఇం ద్రేణ పణయః శయధ్వమితి"

ఆరవదిరసాతలము. ఇయ్యది మహాతలమునకుఁ గ్రిందిభాగమునసుండును. ఇందు కేసరియను రాక్షసరాజు పురంబువెలయును. పిమ్మట సులోమ్ను, మహిషో త్కోచ్రక, సురసాత్మజాదిదానవుల పురంబులు, వాసుక్యాదినాగనాథుల పురంబులొప్పుచుండును. దానవనాగపుర సహస్రంబులెంతయు మనోజ్ఞంబులైయుండును. ఇయ్యది శిలాభూమియన నొప్పుచుండును.



## పా తా ళ ము.

శ్రీవాయుపురాణ - భువనవిన్యాసం - అధ్యా. ౫౦ - పుట. ౭౨

శ్లో॥ సప్తమేతు తలేజ్ఞేయం పాతాళే సర్వపశ్చిమే। పురం బలేఃప్రముదితం నరనారీసమాకులం॥ ౪౧ ॥ అసురాశీవిషైః పూర్ణముద్వృత్తై ర్దేవశత్రుభిః। ముచుకుందస్యదైత్యస్యగత్రవై నగరంమహత్॥ ౪౨॥ అనేకై ర్దితిపుత్రాణాం సముదీర్ణైర్మహాపురైః। తథైవనాగ నగరైబుద్ధి మద్భిః సహస్రశః॥ ౪3 ॥ దైత్యానాం దానవానాంచ సముదీర్ణైర్మహాపురైః। ఉదీర్ణై రాక్షసావాసై రనేకైశ్చ సమాకులం॥ ౪౪ ॥ పాతాళాంతే చవిపేంద్రా విస్తీర్ణే బహుయోజనే। ఆస్తేరక్తారవిందాక్షో మహాత్మాహ్యజరామరః॥ ౪౫ ॥ ధౌతశంఖోదర వపుర్నీలవాసా మహాభుజః విశాలభోగో ద్యుతిమాంశ్చిత్రమాలా ధరోబలీ॥ ౪౬ ॥ రుక్మశృంగారధాతేన దీప్తాస్యేన విరాజితా। ప్రభుర్ముఖసహస్రేణ శోభతేవై సకుండలీ॥ ౪౭ ॥ సజిహ్వామాలయా దేవోలోలజ్వాలానలార్చిషా। జ్వాలమాలా పరిక్షిప్తః కైలాస ఇవ లక్ష్యతే। ౪౮ ॥ సతునేత్ర సహస్రేణ ద్విగుణేన విరాజతా। బాలసూర్యాభితా

మేరుణశోభతే స్నిగ్ధమండలః ౪౯। 'తస్యకుంజేంద్రవర్ణస్య అక్షమాలావిరాజతే। తరుణాదిత్యమాలేవ శ్వేత పర్వతమూర్ధని॥౫౦॥ జటాకలాపో ద్యుతిమాన్ లక్ష్యతే శయనాసనే। విస్తీర్ణ ఇవమేదిన్యాం సహస్ర శిఖరోగిరిః॥ ౫౧ ॥ మహాభోగైర్మహాభాగైర్మహానాగైర్మహాబలైః। ఉపాస్యతే మహాతేజా మహానాగపతిః స్వయం॥ ౫౨॥ సరాజా సర్వనాగానాం శేషో నామ మహాద్యుతిః। సాప్యైష్ణవీ బాహ్యా తనుర్మర్యాదాయాం వ్యవస్థితా। ౫౩ । , సప్తైవమేతే కథితా వ్యవహార్యారసాతలాః। దేవాసుర మహానాగ రాక్షసాధ్యుషితాః సదా॥ ౫౪ ॥

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా. ౨౪

తతోధస్తాత్పాతాళే - నాగలోక పతయోవాసుకి ప్రముఖాః శంఖ-కుళిక- మహాశంఖ- శ్వేతధనంజయ- ధృతరాష్ట్ర- శంఖచూడ- కంబళాశ్వతర- దేవదత్తాదయో- మహాభోగినో మహామర్షానివసంతి- యేషాముహవైపంచ సప్త దశ శత సహస్ర శీర్షాణాం ఫణాసువిరచితా మహామణయో రోచిష్ణవః పాతాళ వివరతిమిర నికరం స్వతేజసా విధమంతి॥ ౨౯ ॥

ఇతి శ్రీమద్భాగవతే పంచమస్కంధే చతుర్వింశోధ్యాయః

రసాతలమున కథోభాగమునఁ బాతాళమున్నది. ఆపాతాళమున (౧ వాసుకియు, (౨) శంఖకులికుఁడు, (౩) మహాశంఖుఁడు, (౪) శ్వేతుఁడు, (౫) ధనంజయుఁడు, (౬) ధృతరాష్ట్రుఁడు, (౭) శంఖచూడుఁడు, (౮) కంబళుఁడు (౯) అశ్వతరుండు మొదలగు సర్పరాజులు, మహాకోప్రులు, మహాఫణములుగలవారునగు దేవదత్తాదులగు సర్పములును, నివసించుచున్నారు. ఆమహాసర్పములందుఁ గొన్ని యైదుశిరస్సులు, కొన్ని పదిశిరస్సులు, కొన్ని నూఱుశిరస్సులు, కొన్ని సహస్రశిరస్సులు గలిగియున్నవి. వానిఫణములందున్న మహామణులు సర్వదా ప్రకాశించుచు తమకాంతులచేఁ బాతాళమందున్న చీకట్లను దఱుముచుండును.

రసాతలమునకుఁ గ్రిందిభాగమునఁ బాతాళమున్నది. ఇందుఁ బడమటిదిశ బలిపురంబుగలదు. ఈపురంబు నరనారీకుల సంకులమై ప్రకాశించుచూ గృహములచే నొప్పుచుండును. ముచుకుందాదిదైత్య నగరంబులు బహురాక్షస సముదీర్ణంబులై యాలోకంబున నుండును. ఈలోకంబు బహుయోజన విస్తీర్ణంబయి యజరామరులగు వారలచే నిండియుండును. ఘాతకంభోదరశరీరులు, నీలాంబరులు, మహాద్యుతిమంతులు, చిత్రమాలాధరులు, బలవంతులు నగునాగులిందుందురు. కుండలాకృతి

గలిగి ఫణాసహస్రంబులు, జిహ్వామాలల నొప్పునాగులచే నీయది కైలాసంబువలె నుండును. నాగుల కధిపతియై ద్విసహస్ర నేత్రంబులతోఁ దరుణావిత్య సంకాశ మాలా జాలంబులతో. మహాభోగంబులు, మహద్బలంబులుగల మహాభాగులగు నాగకుమారులు సేవింప శేషుండు వెలయుచుండును. దేవాసురమహానాగ రాక్షసవిహార భూమియై యీపాతాళం బొప్పుచున్నది.



# నరకముల వివరము.

నరకః- నృణాతి ప్రాపయతి పాపినః స్స్వసమీపమితి నరకః నరక ఏవ నారకః నృనయనే- పాపిష్ఠులను తన సమీపమును బొందించునది. కావున మూలాధారాధోభాగమందు మలవిసర్గస్థానములో వర్ణింపబడినది. ఇందుకు "భూతభావోద్భవ కరోవిసర్గః కర్మసంజ్ఞితః అని గీతాచార్యుని వాక్యము.

ఇవి కొన్నిపురాణములందు సార్ధత్రికోటియని అనంతములని వ్రాసిరి. సంఖ్య సహజముగ జీవుల సృష్టి అధికముగా నగుచుండుటంబట్టి పాపులధికులుగా నగుట సహజము. అందుచేత నరకముల సంఖ్య పెరుగుచుండును. ఇది మన లోకరాజ్యము నందుగూడ ననుభవముగ నున్నదే. ప్రపంచవృద్ధితో నన్నియు వృద్ధియగుచుండను. అనేకసంఖ్యకు బర్యాయపదమున అనంతమనిగూడ చెప్పుదురు. విశేషమేమియును లేదు.

ఈనరకాదులుగూడ పంచభూతగుణానుసార రూపములుగ నున్నవి. ఆహాశ గుణతత్త్వమునుబట్టి నిర్ణయించవచ్చును.

ఇందులకొక దృష్టాంతవార్త యిటీవల వచ్చినది. అమెరికాదేశమున నొక నాడు కొందరు గొప్పకనుమల ప్రాంతమువెళ్లి యచ్చట విశ్రాంతిగానున్న సమయమున నేదోయొక గొప్పఆర్తధ్వని వినబడినదట. ఆలోచించగా తమచుట్టు నేప్రాణి సంచారము బొత్తిగనుండుట అసంభవమని జూచి కొంతసేపాలోచించగా సమీపములో నేదోకొండలందు చిన్నబిలమునుజూచి సమీపించగా నద్దానినుండి సూక్ష్మముగ నీఆర్తధ్వనులు వచ్చినవి. దానిఁదెలిసి యిచ్చటేదో జీవులకు బాధగల లోక మధోభాగములో దూరముగ నుండవలె యీశబ్దమునకుఁ గారణమని వెల్లడించిరి. ఈకారణముచేత దక్షిణదిశలో భూగర్భమం దీనరకలోకాదులున్నవని దృఢముగఁ

చెప్పవచ్చును. పురాణప్రమాణము లటులనే యున్నవి. విష్ణుపురాణము ద్వితీయాంశము అధ్యా ౯ తతశ్చనరకాని వ్రిభువోధస్సలిలస్యచ। పాపినోయేషు పచ్యంతే తాణి శ్రుణుష్వ మహామునే। ౧ ॥ రౌరవస్సూకరోధస్తా త్కాలోపిచిరు నస్తథా......సర్వానధః పశ్యంతి నారకాణ। 33 । పాతాళాదీన్సర్వాణి తథైవనరకాద్యజ॥ ౯.౨ ॥

—♦ నరకముల వివరములు - స్వవిషయం. ♦—

ఈనరకాదులు కేవల మంధకారలోకములు, నధోలోకములు. ఇవి మల సంబంధ దుర్గంధలోకాదులుగా నుండుటచేత నధోభాగమున సృజింపఁబడినవి. సహజముగా మనలోకములోఁ గారాగృహములు ప్రత్యేకించి యేమూలనో దూరముగ అంధకారయుతముగ నిర్మింపఁబడుచున్నవి. ఇవి దుష్కృత కర్మానుభవములు గాన సుఖము దుర్లభము. 'దుఃఖ' పదమునకుఁ బర్యాయపదముగా మనవారలు 'పాప' పదమును వాడుదురు. కొందరీపద వివరమాలోచించక హేళన చేయుచు తర్కింతురు. స్వరూపము దెలియకుండుటే యిట్టి అవకతవక తర్కావకాశములకుఁ గారణము. ఏ. బి. సి. క్లాసులతో శ్రీకృష్ణజన్మాగారములని భావనికర్యయముచే ఆత్మస్వాతంత్ర్యమును గోల్పోయిన మనసోదరులను చూచియేయున్నాము.

మనదేహములో దుర్గంధమలభాగ మధోభాగములో నున్నది. మన లోకములోగూడ నిటులనే కారాగారము లేమూలనో నిర్మితములుగా నుండును ఇవి సహజముగా అంధకారస్థలములుగానే యుండును. భగవన్నియామకమున లోకహితార్థముగ భూగర్భలోకాదులుగ అంధకారములుగ నరకములున్నవి. ఇచ్చట సూర్యరశ్మికి మార్గము లేదు కల్పితసౌకర్యముల కవకాశములులేవు. సహజముగా మన లోకములోఁ గారాగృహములందు దీపనియామకములు లేవు. ఇవియు నటులనే యని సర్వవిషయాదులందును దలంచవలెను. మనలోకములో జనరల్ ఆస్పత్రులలో నూతనముగా బోయినవారలకుఁ బ్రారంభములో అచ్చటి వారల బాధలను చూచి సహింపరాక భయకంపాదులతో స్తబ్ధత్వము మూర్ఛకలుగును. అది చాల వికారములుగ నేత్రములకుఁ దోచును. మనమే వారల ఘోర దుఃఖానుభవములను చూడలేక యెంతటి పాపములను చేసిరోయని యనుకొనుచుందుము. పాపపదము దుష్కృత్యానుభవములకు సూచనపదముగాని వేరుగాదు. ఈ నరకలోకాదులందేలాటి సౌకర్యములుండవు. అవి నిరంతర ఘోరబాధలతోను దుర్గంధపు

గర్తములతోను సహింపరానివిగ ఆర్తధ్వనులతో నిండి సహజములుగా నుండును. ఇచ్చటి వారల దేహములు ఆభాసలుగా నుండును. దేహముతోనున్నట్టుగా యను భవించువారలకు దోచియుండును. ఇవి సూక్ష్మ శరీరములుగా నుండును. అనగా స్వప్నతుల్యదేహములు. లేకున్న యనుభవబాధ ప్రవృత్తులు వెంటనే నివృత్తియై మరల బాధలకవకాశముగా సర్వాంగము లుండినట్లును సాకారవంతుడుగ నుండు నట్లుండును స్థూలదేహమే యైనచో యొకసారి అంగచ్ఛేదనానుభవముతో వికలాంగత్వ మేర్పడును. మఱల అంగసంపూర్ణత రాదు? స్థూలదేహముతోనున్నది అసంభవము. కాబట్టి మనఃప్రధాన సూక్ష్మదేహముగ నది యుండును మన లోకానుభవముతో నొకసారి అంగచ్ఛేదనగలిగిన జన్మావధిగాలోపించి నాయంగము వికలముగా నుండునేగాని మఱల సంపూర్తికాజాలదు. దీర్ఘకాలము బాధల నను భవింప నవకాశము సూక్ష్మశరీరముతో నుండును. మనము కొందరిని బిచ్చగాళ్లు వగైరాలనేగాక సంపన్నులనుకూడ చూచుచుంటిమి. అదియునుగాక నీస్థూలదేహ మిచ్చటనే త్యాగమైనది. ఈనరకములకు మీరిన నరకమే మనలోకములోని స్థూల శరీరానుభవము జన్మావధిగా దీర్ఘకాలానుభవముగ సహింపరానిదిగా నుండును. అయ్యదన్ననో కష్టతరము. దుఃఖవిముక్తి లేకనే మరణింతుము. ఈలాగు ననేక దుష్కార్యానుభవఫలముల నెన్నిజన్మాదులతో మరణాంతమగునట్లు క్రమముగ నను భవింపవలెనో తోచరానిదిగా నుండును. కాబట్టి నరకలోకాదులు సూక్ష్మ దేహముతో సర్వదుష్కృతములన్నిటిని నొకేసారి యనుభవముగా సంపూర్తిగా నగుటకై మనమేలు కొఱకై నియమింపఁబడియున్నవి. ఇది తెలియక విపరీత మనోభావనలతో లోకాదులెచ్చట యున్నవని నరకాదు లెక్కడివని ప్రశ్నింతురు. నీ స్థూలశరీరము తోనే ఆజన్మావధి బాధతో యనేక జన్మములుగ దీర్ఘకాల వ్యవధితో నిచ్చటనే ననుభవింపవచ్చును. ఎచ్చట యనుభవించినను నవి నరకములుగను నరక లోకాదులుగ నుండును. నరకలోకాదులు పాపఫలితముగఁ దప్పకుండును. ఎట్లైన నేమి? అనుభవమొక్కటే. అనుభవించుట కష్టతరములని తలంచి పుణ్యకార్య ప్రవృత్తులుగా సర్వదా నగుచుందురుగాక. సర్వవిధములుగ నింతవరకుంచిన దృష్టాంత ము ననుభవముకంటె మరొకటిలేదు. సంశయముతో విపరీత ఫలానుభవములకే మూలకారణమగును. ఎక్కువగా వివరింపనేల? గుణముల ననుసరించి మనోభావ ములు సంకల్పములుత్పత్తియగుచుండును. నరకలోకము కేవల దుర్గంధయుతము, ఘోరదుఃఖదమై, దారుణ భీకర భయకంపాదులతో నిండియున్న పాపభూయిష్ఠ

కారాగార తుల్యములు. సామాన్యముగ మనలోకమునందును అక్రమ కార్యములను హింసాది క్రూరకృత్యములను చేసి శిక్షితులైన వారలకుంగూడ నెక్కడనో అభుక్తమూలయందు ప్రబల ప్రాకారములలోను మరెవ్వరికి బ్రవేశింపరాకను, అజ్ఞాతముగ గుహలవలె గృహముల నిర్మించి వెలుతురుగాని దీపాదులుగాని లేనట్లు ప్రత్యేకముగం దలుపుల బిగించి కారాగారభటుల కాపుదలతో సర్వకార్యములను వారలతోనే చేయించి యనుభవింపచేయుదురు బ్రహ్మాండభువనమున కధికారిగాగల విరాట్టు లోకములో నీనరకములు అధోభాగమందు అంధకారలోకములుగా నిర్మించుటలో విపరీతాంశమేమియు నుండదు. తుదకీభాగములు దేహములో చూచినను, గృహములందు చూచినను గ్రామములందు చూచినను నీపాపభూయిష్ఠ దుర్గంధ మలస్థానములను యేమూలనో నిర్మించుచున్నాము. తల్లిగర్భములోగల శిశువు సహితము మలావరణ గర్భ సంబంధనరక మనుభవించలేకను క్రిమి కీటకాది బాధల కోర్వలేకను అంధకారమయాధోభాగములో నుండజాలక పరితపించుచు జ్ఞానోదయ మగుటచే నీగర్భనరకబాధను త్వరలో తొలగింపుమని ప్రార్థించుచుండునని మన పురాణములందే వివరించిరి

నరకములు సార్థత్రికోటులని పురాణములందు వివరించిరి. ఇదేమి విపరీతాంశముగాదు. ఇందులో కేవలప్రాముఖ్యనరకములు కొందరిరువదియొకటియనియు, కొందరిరువది యెనిమిదనియు కొందరెనుబదారనియు వివరించిరి. ఇవి మన రాజ్యములో ముఖ్యకేంద్ర కారాగృహములవలె ముఖ్యముగనున్నవని యనుకొనవచ్చును. సామాన్య కారాగృహము లెన్నోయున్నవి. లెక్కపెట్టినచో నీలోకములోను అసంఖ్యాకములుగ నుండవచ్చును. చిన్నరాజ్యములోనే అసంఖ్యాకములుగనున్నచో నీబ్రహ్మాండములో సార్థత్రికోటి నరకములుండుటలో నాశ్చర్యమేమి? సార్థత్రివలయాకారకాలసర్పిణియూ సప్తమాతృకాఖండమూల రూపిణియూ అగు కులాధరస్థిత మాతృ కాక్షరశక్తులచే మనోవాక్కాయ కర్మలయందుండ వ్రాభావముల శిక్ష కొరకై సృజింపబడినవే ఈనరకలోకములని తెలియుటకై సృష్టిలో జీవరాసుల ననుసరించి నరకాదు లనంత సంఖ్యలుగనుండుట సామాన్యమే. గావున జీవరాసులలోం బాపులసంఖ్యయే యధికము.

వీరలకు పుణ్యకర్మల కవకాశమే లేక నిర్బంధితులై యవధికాల మంతయుగు వరకు యమభటులచే శిక్షింపంబడుచు దుఃఖబాధల ననుభవించవలసియున్నందు చేత దుఃఖనివృత్తిగాగల పుణ్యకర్మల కవకాశముండజాలదు. అట్టి వారల గుఱించి

మనముచేయు పుణ్యకర్మసాధనములగు తీర్థాది గయాది శ్రాద్ధములును, దానధర్మములతో నరకలోక విమోచనకాగలదు మనకర్మలలోఁగూడ నిట్టివారిని గుఱించిన సూక్ష్మకర్మలు సామాన్యముగాఁ జేయుచునేయున్నాము. వీటి వివరముల నిదివరకే పంచమహాయజ్ఞములతో నిందులో వివరించియున్నాను. కాబట్టి యితరకర్మల కంటె శ్రాద్ధకర్మలతిప్రాముఖ్యములుగా నున్నవి. శ్రాద్ధమహిమలను వర్ణించలేము. పరోపకారములలో నిది యత్యంత ప్రధానము. ఈలోకములో నిర్బంధితుల గుఱించి సహజముగ మనము వారల విమోచనములకై యనేకవిధముల వ్యవహారాదులతోను, సౌకర్యముల విధానసాధనలతోను సమయానుసారముగఁ జేయుచునే యున్నాము. ఇదియు నటులనేయని తలంచవలెను. అన్నియు నొకే విధానములుగనే యున్నవి. కాని భేదము లెంతమాత్రములేదు. ఇందుకు వైశ్వదేవమందలి భూత బలి మంత్రముకూడ అర్థముతో "యేభూతాః ప్రచరంతిదివానక్తం బలిమిచ్ఛంతో వితుదస్య పేప్యాః॥ అనునది పాపభూత వికృతులనే యమభటులనియూ అట్టివాటికి పిండదానము మాత్రమే అనుగ్రహమనియూ చెప్పుచున్నది.

ఈలోకములోఁ గారాగారనియమిత భటులవలె నరకలోకములో కృష్ణవర్ణులుగనే యుందురు. ఇంకనునతిశయ ఘోర వికృతాకారములతో భీకరులై భయకంపాదులఁ గలిగించు వారలుగా నుందురు. ఈలాగు లేకున్న పాపులు భయపడరు. వీరలు మొదట నేవిధముగ పాపభీతిలేక ఉగ్రులై రౌద్రరూపముతో చేసిరో దాని ననుసరించియే ప్రాప్త యమభటుల యాకృతి కనఁబడును. తాను చేసిన దానినే మఱల తాను యనుభవింపక తప్పదు. అందుచేతనే భయముగలిగి నీనరక లోకానుభవమును బొందకుండ పుణ్యకర్మలను చేయుమని ధర్మశాస్త్రములు, నీతిశాస్త్రములు జ్ఞానశాస్త్రములు మిక్కుటముగా బోధించినవి. ఆతురతతో విచారవివేకము లేక మనస్సును స్వాధీనపరచుకొనలేక యిష్టమువచ్చినట్లుచేసి, తర్వాత దుఃఖపడిననేమి లాభము? అనుభవింపక తప్పదు. శాంతమే సర్వసమాధాన తపస్సు, కొంచెము ముందువెనుకల నాలోచించవలెను. ఎక్కువగా వ్రాయనేల? శిక్షాస్మృతులు, కారాగారములు, నరకలోకములు, యమభటులు, దండనాధికారియు, లేకున్న నే రాజ్యములోను పరిపాలన జరుగజాలదు. ఇవి యుండినను నిర్భయులై స్వేచ్ఛాపరులై యున్నారు కాని భయమును జెందని వారలనేకులున్నారు. గుణభేదము ననుసరించిన శాస్త్రములవలె శాసకులుకూడ ఈలోకములోనే మూడు రకములుగా నున్నారు. ఎట్లనగా గురురాత్మవతాం శాస్తారాజా శాస్తాదురాత్మనాం। ప్రచ్ఛన్న

కృతపాపానాం శాస్తావైవస్వతోయమః। అని చెప్పియున్నారు. వైవ స్వతయము డనగా పాపులు చేసిన ప్రచ్ఛన్న పాపఫలము ననుభవింపచేయుచున్న శనిగ్రహమని యే తెలియగలరు.

జీవుఁడు గతించగానే యమభటుల స్వాధీనుఁడై యమపురి దక్షిణ ద్వారముఁ జేరి యమదర్శనము చేయును. కాలసూత్రి యమదండమును శిరస్సుపైన బెట్టగానే జీవులు తమ వెనుకటి దినచర్యలను కాలసూత్రమగు కాలునియమదండ మహామహి మతో వాఙ్మూలముగా నిత్తురు. పాపమతిశయమై పుణ్యము లేశముగ నున్నచో మొదట పుణ్యసుఖానుభ వానంతరము పాపము ననుభవింపజేయుదురు. పుణ్యమతి శయమై పాపలేశముగ నున్నచో మొదట పాపమనుభవింపజేసి యావల పుణ్యసుఖా నుభవ మనుభవింపజేయుదురు. మన లోకములో నెంత ప్రమాణములు చేయించి నను నిర్భయులై కూటసాక్షులుకూడ ప్రమాణములనే బలుకుదురు. అచ్చట కాల సూత్రి యమదండమహిమతో అనృతమును చెప్పతలచినను జెప్పజాలరు. అందుకే యమ-ధర్మరాజ నామములనికి సార్థకము. సృష్టికర్తచే నిది నియమితము. మనవి సామాన్య ద్వంద్వ గుణాధికములుగాఁగల లోక విషయములు. ఇచ్చట అంతర బాహ్యముల భేదములతో వ్యవహరింతురు. అచ్చట వీటి కాస్పదము లుండజాలవు. అచ్చట సాక్షులు చిత్రగుప్తులు. ఇచ్చటి సాక్షులలోఁ గొందరట్టి వారుకారు. పార్టీల చిత్రములను నిష్పక్షపాతముగా వెలిబుచ్చుదురు. ఆ చిత్రగుప్తులు సర్వుల యందు సర్వదా ప్రత్యక్షులుగ జీవుల నేత్రము నాశ్రయించియున్నారు. మనస్సు గూడ నేత్రమే. అందులకే మనలోకములో మనసాక్షిని గోరుచున్నాము. అన్నియు భగవన్నియామకములు. భగవదాజ్ఞను శిరసావహించిబద్ధులుగా నుండురేగాని మన లోకములవలె నెంతమాత్రముకాదు. ఈలోకముల వారివలె, వేతనాదులు, ఫలితా నులు, అంతరంగికాశలు వారికి లేవు. వారలకు కేవల పరమార్థసాధనమే ముఖ్యా శయము. ఇచ్చట ధనసాధనమే ముఖ్యావశ్యము. అదియే కాలక్రమముచే తన కర్తవ్యమును తోచనివ్వక నిధనసాధనమగును.

నరకములు నీబ్రహ్మాండములోఁ జేరియుండుటచేత ముఖ్యముగా దెలుసు కొనవలసిన విషయముగా నున్నది. ఈలోకములో సర్వవిషయాదులు నెట్లు ప్రచార మూలకముతోను, పాఠశాలలతోను, వ్యవహారములతో నెట్లు దెలుసుకొని జీవి తాంశములుగా నున్నవో యటులనే నరకాదులవిషయవృత్తాంతముతో భయముగల నివారులై సాత్వికకర్మనిరతులు కాగలుగుదురని పురాణములందు వివరించిరి.

ఈనరకములు పంచభూతాను గుణ్యములుగఁ బంచభూత స్వరూపములుగ నున్నవి. కోపతాపసమయములందు సహజముగా మనము "అధోలోకములో పడి పోదువుగాక" యని శపింతుము. నరకలోకములు, అధోలోకములు, అంధకార లోకములు, ఘోరభయంకరాకార దారుణలోకములు. వీరలు శ్రీమహావిష్ణు స్మరణతోను మనముచేయు శ్రాద్ధాది దానధర్మములతోను ముక్తులగుదురు.



## నరకకుండములు.

### —♦ ౨౮ నరకాదుల విశేషవివరము. ♦—

శ్రీమద్భాగవతమ్ - పంచమస్కంధే - షడ్వింశోధ్యాయః

రాజాః - నరకానామ భగవన్ కిందేశ విశేషా అథవా బహిస్త్రిలోక్యా ఆహోస్విదంతరాళ ఇతి॥ ౪ ॥

ఋషిః - అంతరాళఏవ త్రిజగత్యాస్తు దిశిదక్షిణస్యా మధస్తాద్భూమే రుప రిష్టాదండ జలాశయస్య యస్యామగ్నిష్వాత్తాదయః పితృగణాః స్వానాం గోత్రాణాం పరమేణ సమాధినా సత్యావా శిషఆశాసా నానివసంతి- యత్రిహ భగవాన్ పితృ రాజో వైవస్వతః స్వవిషయం ప్రాపితేషు స్వపురుషైర్జంతుషు సంపాతేషు యథా కర్మా వద్యమె వానుల్లంఘిత భగవచ్ఛాసనః సగణో దమం ధారయతి॥ ౫ ॥ తత్ర హైకే నరకా నేకవింశతిం ప్రాహుః అథ తాంస్తె రాజన్నామ రూపలక్షణతోను క్రమిష్యామః,

శ్రీవాయుపురాణము - ఉపసంహారపాదము - అధ్యా. ౩౯

అధోగతీనాం వక్ష్యామి భూతానాం స్థానకల్పనాం। గచ్ఛంతి ఘోరకర్మా ణః ప్రాణినోయత్ర కర్మభిః॥ ౧౪౯ ॥ తామసానరకాః సర్వేయమస్యవిషయేస్థి తాః। తేషు దుష్కృతకర్మాణః పతంతీహ పృథక్ పృథక్॥ ౧౫౦ ॥ భూమేరథస్తా త్తే సర్వేరౌరవాద్యాః ప్రకీర్తితాః॥ ౧౫౧ ॥ ఏవమాది క్రమేణైవ వర్ణ్యమానాన్ని బోధత॥ భూమేరథస్తా త్సైవ నరకాః పరికీర్తితాః॥ ౧౫౨ ॥ తత్రానుభూయతే దుఃఖం క్షీణే కర్మణిపైపునః॥ ౧౫౩ ॥ తిర్యగ్యోనౌ ప్రసూయంతే కర్మశేషేణ తే తతః। దోశ్చనరకాశ్చైవ హ్యూర్ధ్వంబాధశ్చ సంస్థితాః॥ ౧౫౪ ॥ ధర్మాధర్మ నిమిత్తేన సద్యోజాయంతి మూర్తయః। ఉపభోగార్థ ముత్పత్తి రావపత్తిక కర్మ

తః॥ ౧౯ ॥ పశ్యంతినారకాం దేవా హ్యధోవక్త్రాః హ్యధోగతాః నారకా శ్చ తథా దేవాః సర్వాన్పశ్యంత్యధోముఖాః॥ ౨౦ ॥

శ్రీమద్దేవీభాగవతము - స్కంధం ౯ - అధ్యా. 3౨

శ్రీనారాయణ ఉవాచ - మాయాబీజం మహామంత్రం ప్రదత్వా విధిపూర్వకం। కర్మాశుభవిపాకంచ తామువాచ రవేస్సుతః॥ ౧॥ ధర్మరాజ ఉవాచ - శుభకర్మవిపాకాన్నసరకం యాతిమానవః। కర్మాశుభవిపాకంచ కథయామి నిశామయ॥ ౨॥ నానాపురాణభేదేన నామభేదేన భామిని। నానాప్రకారం స్వర్గంచ యాతి జీవః స్వకర్మభిః॥ 3 ॥ శుభకర్మ విపాకాన్నసరకం యాతికర్మభిః। కుకర్మణాచ నరకం యాతి నానావిధం నరః॥ ౪ ॥ నరకానాంచ కుండానిసంతి నానావిధానిచ। నానాశాస్త్రప్రమాణేన కర్మభేదేన యానిచ॥ ౫ ॥ విస్తృతాని చగర్తాని క్లేశదానిచ దుఃఖినాం। భయంకరాణి ఘోరాణి హేపత్నే కుత్సితానిచ॥ ౬ షడసీతిచ కుండాని చైవ మన్యాని సంతిచ। నిబోధ తేషాం నామానిప్రసిద్ధాని శ్రుతౌ సతి॥ ౭ ॥ వహ్నికుండం- తప్తకుండం- క్షారకుండం- భయానకం-॥ విట్కుండం- మూత్రకుండం- చ- శ్లేష్మకుండం- చ- దుస్సహం॥ ౮ ॥ గరకుండం- దూషికాయాః- వసాకుండం- తథైవచ। శుక్రకుండం అసృక్కుండం- అశ్రుకుండం చ కుత్సితమ్॥ ౯ ॥ కుండంగాత్రమలానాంచ కర్ణవిట్కుండమేవచ। మజ్జాకుండం- మాంసకుండం- నఖకుండం- చదుస్తరం॥ ౧౦ ॥ లోమకుండం- కేశకుండం- అస్థికుండం- చ దుస్తరం। తామ్రకుండం- లోహకుండం ప్రతప్తం క్లేశదం మహత్ ॥౧౧ చర్మకుండం- తప్తసురాకుండం- చ పరికీర్తితం। తీక్ష్ణకుండక కుండంచ- విషోదం- విషకుండకం॥ ౧౨॥ ప్రతప్తకుండం- తైలస్య కుంతకుండం- చ దుర్వహం। కృమికుండం- పూయకుండం- సర్పకుండం దురంతకం॥ ౧3 ॥ మశకుండం- దంశకుండం- భీమం గరళకుండకం। కుండంచ- వజ్రదంష్ట్రాణాం వృశ్చికానాంచ సువ్రతే॥ ౧౪ ॥ శరకుండం- శూలకుండం- ఖడ్గకుండంచ భీషణం। గోలకుండం- నక్రకుండం- కాకకుండం శుచాస్పదం॥ ౧౫ ॥ మంథానకుండం- బీజస్య వజ్రకుండం- చదుస్సహం। తప్తపాషాణకుండం- చతీక్ష్ణపాషాణకుండకం॥ ౧౬ ॥ లాలాకుండం- మసీకుండం- చూర్ణకుండం- తథైవచ చక్రకుండం- వక్రకుండం- కూర్మకుండం- మహోల్బణం-॥ ౧౭ ॥ జ్వాలాకుండం- భస్మకుండం దగ్ధకుండం- శుచిస్మితే। తప్తసూచీ- మసీపత్రం- క్షురధారం- సుచీముఖం॥ ౧౮ ॥ గోకాముఖం- నక్రముఖం- గజ

దంశం- చ గోముఖం। కుంభీపాకం- కాలసూత్రం- మత్స్యోదం- కృమికంతుకం॥౧౯
పాంసుభోజ్యం- పాశవేష్టం- శూలప్రోతం- ప్రకంపనం- ఉల్కాముఖ మంధకూపం
వేధనం- తాడనం- తథా॥ ౨౦ ॥ జాలరంధ్రం- దేహచూర్ణం- దలనం- శోషణం
కష-। శూర్పం- జ్వాలాముఖంచైవ- ధూమాంధం- నాగవేష్టనం॥ ౨౧ ॥ కుండా
న్యేతాని సావిత్రి పాపినాంక్లేశదానిచ। నియుక్తైః కింకరగణైరక్షితానిచ సంతతం॥ ౨౨
దండహస్తైః పాశహస్తై ర్మదమత్తైర్భయంకరైః। శక్తిహస్తై ర్గదాహస్తై శ్శూలహస్తై
స్సుదారుణైః॥ ౨౩ ॥ తమోయుక్తై ర్దయాహీనై రనివార్యైశ్చ సర్వతః। తేజస్వి
భిశ్చనిశ్శంకై ర్ధాతామ్రైః పింగళలోచనైః॥ ౨౪ ॥ యోగయుక్తై స్సిద్ధియుక్తై ర్నా
నారూప ధరైర్బలైః। ఆసన్నమృత్యుభిర్దృష్టైః పాపిభిస్సర్వ జీవిభిః॥ ౨౫ ॥ స్వక
ర్మనిరతై స్సర్వై శ్శాక్తై స్సౌరైశ్చ గాణపైః। అదృశ్యైః పుణ్యకృద్భిశ్చ సిద్ధైర్యో
గిభిరేవచ॥ ౨౬ ॥ స్వధర్మనిరతైర్వాపి విరక్తైర్వా స్వతంత్రకైః। బలవృద్ధిశ్చ
నిశ్శంకై స్స్వప్న దృష్టైశ్చ వైష్ణవైః॥ ౨౭ ॥ ఏతత్తే కథితంసాధ్వి కుండసంఖ్యానిరూ
పణం। యేషాం నివాసో యత్కుండే నిబోధ కథయామి తే॥ ౨౮ ॥

శ్రీదేవీభాగవతే మహాపురాణే నవమస్కంధే ద్వాత్రింశోధ్యాయః.

మానవులు శుభకర్మంబుల నాచరించిన నరకంబునకేగాక స్వర్లోకాదులకేగి సుఖింతురు. కుకర్మంబుల నాచరించినవారలకుఁ బలువిధంబులైన నరకంబులఁ బొందుట తప్పదు. కుకర్మకృతమనుజగణంబులు తత్కర్మఫలంబులంద భూమికి దక్షిణదిశ నధోభాగంబున సంయమనీపురికి గ్రిందుగా భయంకరంబులు, క్లేశదుఃఖదంబులు, కుత్సితంబులు, నతిమాత్ర విస్తృతంబులునగు నరకకుండంబులు పలువిధంబులుండును. అయ్యవి యెనుబదియారు సంఖ్యగలవి. (౧) వహ్నికుండము, (౨) తప్తకుండము, (౩) క్షారకుండము, (౪) విట్కుండము. (౫) మూత్రకుండము, (౬) శ్లేష్మకుండము, (౭) గరకుండము, (౮) దూషికాకుంటము, (౯) వసాకుండము (౧౦) శుక్రకుండము, (౧౧) అసృక్కుండము, (౧౨) అశ్రుకుండము, (౧౩) గాత్రమలకుండము, (౧౪) కర్ణవిట్కుండము, (౧౫) మజ్జాకుండము, (౧౬) మాంసకుండము, (౧౭) నఖకుండము, (౧౮) లోమకుండము, (౧౯) కేశకుండము, (౨౦) అస్థికుండము, (౨౧) తామ్రకుండము, (౨౨) లోహకుండము (౨౩) ప్రతప్తకుండము. (౨౪) చర్మకుండము, (౨౫) తప్తసురాకుండము, (౨౬) తీక్ష్ణకుండము, (౨౭) విషోదకుండము, (౨౮) విషకుండకము, (౨౯) ప్రతప్త

కుండము, (౩౦) తైలకుంభకుండము, (౩౧) కృమికుండము, (౩౨) పూయ కుండము (౩౩) సర్పకుండము, (౩౪) మశకకుండము, (౩౫) దంశకుండము, (౩౬) గరళకుండము, (౩౭) వజ్రదంష్ట్రకుండము, (౩౮) వృశ్చికకుండము. (౩౯) శరకుండము, (౪౦) శూలకుండము, (౪౧) ఖడ్గకుండము, (౪౨) గోళ కుండము, (౪౩) నక్రకుండము. (౪౪) కాకకుండము, (౪౫) మంథానకుండము, (౪౬) బీజకుండము, (౪౭) వజ్రకుండము. (౪౮) తప్తపాషాణకుండము, (౪౯) తీక్ష్ణపాషాణకుండము, (౫౦) లాలాకుండము, (౫౧) మసీకుండము, (౫౨) చూర్ణకుండము, (౫౩) చక్రకుండము, (౫౪) వక్రకుండము, (౫౫) కూర్మకుండము, (౫౬) జ్వాలాకుండము, (౫౭) భస్మకుండము, (౫౮) దగ్ధకుండము, (౫౯) తప్తసూచీకుండము, (౬౦) అసిపత్రకుండము, (౬౧) క్షురధారాకుండము, (౬౨) సూచీముఖకుండము, (౬౩) గోకాముఖకుండము, (౬౪) నక్రముఖకుండము, (౬౫) గజదంశకుండము, (౬౬) గోముఖకుండము, (౬౭) కుంభీపాకకుండము, (౬౮) కాలసూత్రకుండము, (౬౯) మత్స్యోదకుండము, (౭౦) కృమికంటకకుండము, (౭౧) పాంసుభోజ్యకుండము. (౭౨) పాశవేష్టకుండము, (౭౩) శూలప్రోతకుండము, (౭౪) ఉల్కాముఖకుండము, (౭౫) అంధకూపకుండము, (౭౬) వేధనకుండము, (౭౭) తాడనకుండము, (౭౮) జాలరంధ్రకుండము, (౭౯) దేహచూర్ణకుండము, (౮౦) దలనకుండము, (౮౧) శోషణకుండము, (౮౨) కషకుండము, (౮౩) శూర్పకుండము, (౮౪) జ్వాలాముఖకుండము, (౮౫) ధూమాంధకుండము, (౮౬) నాగవేష్టనకుండము.

ఈనరకకుండములు గదాదండశూల పాశశక్తి దారుణహస్తులు, మదమత్త భయంకరులు, తమోయుక్తులు. దయాహీనులు, సుదారుణులు, తామ్రపింగళాక్షులు యోగసిద్ధియుక్తులు, నానారూపధరులునగు యమభటులచే రక్షింపఁబడుచుండును. ఈకుండములు పలువిధంబులగు పాపంబులొనర్చిన జీవలోకంబులచే నిండియుండును. స్వధర్మనిరతులు, పుణ్యాత్ములు, నల్పపాపము లొనర్చినవారగు నారాయణపరాక్తేయ సిద్ధయోగు లీనరకకుండంబుల స్వప్నంబునంబోలెఁ దిలకింతురు.

## —♦ నరకకుండ లక్షణ వివరములు. ♦—

శ్రీమద్దేవీభాగవతము - నవమస్కంధము - ౩౭ అధ్యాయము.

ధర్మరాజ ఉవాచ - పూర్ణేందు మండలాకారం సర్వం - కుండంచవర్తులం।

నిమ్నంపాషాణ ఖేదైశ్చ పాటితం బహుభిస్సతి॥ ౧ ॥ నవశ్వరం చాప్రళయం నిర్మితం చేశ్వరేచ్ఛయా। క్లేశదం పాతకానాంచ నానారూపం తదాలయమ్॥ ౨ ॥

నరకకుండములు నింపుచుండుకుమండలములవలె గుండ్రముగ లోతై పలువిధ పాషాణములచే నిర్మింపఁబడి పాపులకుఁ బ్రాయశ్చిత్తముకొరకై యుండు. ఇయ్యవి ఈశ్వరునిచే నిర్మితమగు ప్రళయమున నశింపవు.

(౧) వహ్నికుండము.

జ్వలదంగార రూపంచ శతహస్తశిఖాన్వితమ్। పరితః క్రోశమానంచ వహ్నికుండం ప్రకీర్తితం॥ 3 ॥ మహాశబ్దం ప్రకుర్వద్భిః పాపిభిః పరిపూరితమ్। రక్షితం యమదూతైశ్చ తాడితైశ్చాపి సంతతమ్॥ ౪ ॥

వహ్నికుండము ధగధగమని నూర్లకొలది జ్వాలలతోనుండు వహ్నివలెనుండును. ఇందలి పాపులు మహాశబ్దంబు గావించుచుందురు. యమభటులు పాపులఁ గొట్టుచు నీకుండమునురక్షింతురు.

(౨) ప్రతప్తోదక కుండము.

ప్రతప్తోదకైః ప్రపూర్ణంచహింస్రజంతు సమన్వితమ్। మహాఘోరం కాకుశబ్దం ప్రహారేణ దృఢేనచ॥ ౫ ॥ క్రోశార్ధమానం తద్దూతైస్తాడితైర్మహాపార్షదైః॥

ప్రతప్తోదకకుండము హింసింపఁబడు పాపులగు జీవులచేనిండి యర్ధక్రోశవిస్తారముగలిగి మహాఘోరంబగు కాకుస్వనంబులచేఁ బ్రతిధ్వనించుచుండును.

(3) తప్తక్షారోదక కుండము.

తప్తక్షారోదకైః పూర్ణం పునః కాకైశ్చసంకులమ్॥ ౬ ॥ సంకులం పాపిభిశ్చైవ క్రోశమానం భయానకమ్। త్రాహీతిశబ్దం కుర్వద్భిర్యమదూతైశ్చ బాధితైః॥౭

తప్తక్షారోదక కుండము ఫెళఫెళమని యుడుకుచున్నసీటిచేతను, గాకిమూకలచేతను నిండిక్రోశదూర విస్తారముగలిగి పాపిసంకులమై మహాభయంకరమైయుండును. యమభటులుకొట్టుచుండ 'త్రాహి' 'త్రాహి'యను పాపుల యరపులచే నది మరియు ఘోరముగనుండును

(౪) విట్కుండము.

ప్రచలద్భిరనాహారైః స్సమ్యక్కంఠోష్ఠతాలుకైః విడ్భిరేవకృతం పూర్ణంక్రోశమానంచకుత్సితం॥౮॥ అతిదుర్గంధి సంసక్తం వ్యాప్తంపాపిభిరన్వహం తాడితైర్యమదూతైశ్చ తదాహారైస్సుదారుణైః॥ ౯ ॥ రక్షేతిశబ్దంకుర్వద్భిస్తత్కృతైరేవ భక్షితైః॥

విట్కుండమున నమేధ్యకుండము. పాపులిందు నాహారములేక కంఠమును, తాలువులు, నోష్ఠము నెండఁదపించి పొర్లుచుందురు. ఇది క్రోశదూరంబు విస్తరించి యుండును. యమభటులందుఁ బాపులఁ బ్రతిదినంబును తీవ్రప్రహారంబుల శిక్షించుచుందురు. పాపులాహారంబునకు, నందలికీటకంబుల కాటులకునోర్చి రక్షింపుమని యరచుచుందురు.

(౫) మూత్రకుండము.

తప్తమూత్రద్రవైః పూర్ణం మూత్రకీటైశ్చ సంకులం॥ ౧౦ ॥ యుక్తంమహాపాతకిభిస్తత్కృతైర్భక్షితైస్సదా గవ్యూతిమానం ధ్వాంతాక్తం శబ్దకృద్భిశ్చ సంతతం॥ ౧౧ ॥ మద్దూతైస్తాడితైర్ఘోరై శ్శుష్కకంఠోష్ఠతాలుకైః॥

మూత్రకుండ ముడుకుచుండు మూత్రంబుచే నిండియుండును. అందు కీటకకోటులునిండి మిలమిలమని తేలుచుండును. రెండుక్రోసులదూరంబు వ్యాపించి పాపులుమునిఁగి తేలుచుండఁ గడుహేయంబుగ నుండును. పాపులిందుఁగల క్రిమికూటంబులచే భక్షింపఁబడుచు, యమదూతాయుధ ప్రహారంబులందుచు శుష్కించిన యోష్ఠకంఠ తాలువలచే నరచుచునుందురు.

(౬) శ్లేష్మకుండము.

శ్లేష్మపూర్ణం ప్రశమితం తత్కృతైః పూరితంసదా॥ ౧౨ ॥ తద్భోజిభిః పాపిభిశ్చ వేష్టితం వేష్టితైస్సదా క్రోశార్ధం॥

శ్లేష్మకుండము శ్లేష్మకీటక పూరితంబై, యరక్రోసుదూరము వ్యాపించియుండును. పాపులిందాకీటక భక్షితులై భటశిక్షితులై దుఃఖించుచుందురు.

(౭) గరకుండము.

గరకుండంచ కృమిభిర్గరభోజిభిరన్వితం॥ ౧౩ ॥ గరకీటైర్భక్షితైశ్చ పాపిభిః పూర్ణమేవచ తాడితైర్భ్రమ దూతైశ్చ శబ్దకృద్భిశ్చ కంపితైః॥ ౧౪ ॥

గరకుండము విషముచేతను విషకీటకములచేతను నిండియుండును. పాపులిందు విషమునుభక్షించుచుఁ బ్రాణసంకటవేదనంబడియుఁ బ్రాణముపోక భటుల యరపులకుఁ గంపితశరీరులై యేడ్చుచుందురు.

(౮) దూషికాకుండము.

సర్వాశాకైర్వ్యజ్రదంష్ట్రైశ్శుష్కకంఠైస్సదారుణైః నేత్రయోర్మలపూర్ణంచ క్రోశార్ధం కీటసంయుతం॥ ౧౫ ॥

దూషికాకుండము కంటిపిసరుచేనిండియుండును. పాపులు సర్వాశాకులు,

వజ్రదంష్ట్రలు, శుష్కకంఠములవారై నేత్రమలంబునఁ దిగబడి వసించుచుందురు. దీనివిస్తీర్ణము క్రోశార్ధము.

(౯) వసాకుండము.

పాపిభిస్సకులం శశ్వద్భ్రమద్భిః కీటభక్షితైః వసారసేన సంపూర్ణం క్రోశతుర్యం సుఘస్సహం॥ ౧౬ ॥

వసారసము చేనిండి కీటకపూరితమై క్రోసులో నాలవభాగదూరము వ్యాపించి వసాకుండముండును. ఓర్వరాని యీకుండంబునఁ బాపులతిదుఃఖితులై యుందురు.

(౧౦) శుక్రకుండము

తద్భోజభిః పాతకిభిః యమదూతైశ్చ తాడితైః శుక్రకుండం క్రోశమితం శుక్రకీటైశ్చ సంయుతం॥ ౧౭ ॥ పాపిభి స్సంకులం శశ్వ ద్భ్రమద్భికీట భక్షితైః।

శుక్రకీటమిశ్రిత శుక్రంబుచేనిండి క్రోశదూరవ్యాప్తమై శుక్రపాన పాపులచేఁగూడి శుక్రకుండముండును. పాపులాకీటకంబులచే భక్షింపఁబడుచు దూతాయుధ తాడనంబులనొచ్చుచు దుఃఖంబులందుచుందురు.

(౧౧) అసృక్కుండము.

దుర్గంధి రక్తపూర్ణంచ వాపీమానంగభీరకం॥ ౧౮ ॥ తత్భోజభిః పాపిభిశ్చ సంకులం కీటభక్షితం,

క్రోశవిస్తృతమై, దుర్గంధరక్తపూరితమై క్రోసులోతుకలదై రక్తకీటక భక్షితావయవ పాపులచే నిండి యసృక్కుండముండును. అందలిపాపు లారక్తపానంబు చేయుచుందురు.

(౧౨) అశ్రుకుండము.

పూర్ణనేత్రాశ్రుభిస్తప్తం బహుపాపిభిరన్వితం॥ ౧౯ ॥ వాపీతుర్య ప్రమాణంచ రుదద్భిః కీటభక్షితైః।

తప్తంబులగు మనుజాశ్రువులచేనిండి యశ్రుకీటభక్షిత పాపి సమన్వితమై క్రోసునాలవపాలు దూరసువ్యాప్తమై యశ్రుకుండంబున్నయది.

(౧౩) గాత్రమలకుండము.

నృణాంగాత్రమలై ర్యుక్తం తద్భక్షైః పాపిభిర్యుతం॥ ౨౦ ॥ తాడితైర్యమదూతైశ్చవ్యగ్రైశ్చ కీటభక్షితైః।

గాత్రమలకుండము నరదేహ మలపూర్ణంబైయుండును. పాపులందా మలభక్షణసేయుచు, తన్మలకీటభక్షితులగుచు దూతశిక్షల నొచ్చుచుందురు.

(౧౪) కర్ణవిట్కుండము.

కర్ణవిట్పరిపూర్ణంచ తద్భక్షైః పాపిభిర్యుతం॥ ౨౧ ॥ వాపీతుర్య ప్రమాణంచ బ్రివద్భిః కీటభక్షితైః॥

కర్ణమలంబుచేనిండి క్రోసులో నాలవపాలు విస్తీర్ణమై, కర్ణవిట్కుండమున్నది. పాపులాగుబిలినమలుచు కీటకంబులచేఁ గరవఁబడుచు దుఃఖించు చుందురు.

(౧౫) మజ్జాకుండము.

మజ్జాపూర్ణం నరాణాంచ మహాదుర్గంధసంయుతం॥ ౨౨ ॥ మహాపాతకిభిర్యుక్తం పాపీతుర్యప్రమాణకం|

నరులమజ్జచేనిండి, దుర్గంధయుతమై, క్రోసులో నాలవపాలు దూరమువ్యాపించి మహాపాతకులచేనిండి మజ్జాకుండంబుగలదు.

(౧౬) మాంసకుండము.

పరిపూర్ణం సిగ్ధమాంసై ర్మమదూతైశ్చ తాడితైః॥ ౨౩ ॥ పాపిభిస్సంకులం చైవ వాపీమానం భయానకం|

నరస్నిగ్ధమాంసపుఃపూర్ణమై, క్రోశవిస్తీర్ణమై యమభటసంతాడిత పాపిజన సంకులమై, భయానకమై మాంసకుండంబుండును.

(౧౭) నఖకుండము.

కన్యావిక్రయిభిశ్చైవ తద్భక్షైః కీటభక్షితైః॥ ౨౪ ॥ పాహీతిశబ్దం కుర్వద్భిః త్రాసితైశ్చ భయానకైః వాపీతుర్య ప్రమాణంచ నఖాదిక చతుష్టయం॥ ౨౫

కన్యావిక్రేతలు, నఖకీట భక్షితదేహులు, త్రాహిశబ్దంకరులు, భయానక రూపులు భయచకితులునగు పాపులచేనిండి నఖకీటకయుతమై, నఖఖండపూరితమై క్రోశమాత్ర ప్రమాణదూరవ్యాప్తిగలిగి నఖకుండంబుండును.

(౧౮) లోమకుండము.

నఖకుండమువలె లోమకుండము రోమములచేనిండియుండును.

(౧౯) కేశకుండము.

నఖలోమకుండములవలె కేశకుండంబునుండును.

(౨౦) అస్థికుండము.

పైమూడు కుండములవలెనే యస్థికుండముండును.

(౨౧) తామ్రకుండము.

పాపిభిస్సంయుతం శశ్వన్మమదూతైశ్చ తాడితైః ప్రతప్త తామ్రకుండంచ

తామ్రోపమ్యల్కుశ్రీకాన్వితం॥ ౨౬ ॥ తామ్రీణాం ప్రతిమాలక్షైః ప్రతప్తం వ్యాప్తంసదా। ప్రత్యేకం ప్రతిమాశ్లిష్టై రుదద్భిః పాపిభిర్యుతం॥ ౨౭ ॥ గవ్యూతిమానం విస్తీర్ణం యమదూతైశ్చ తాడితైః।

కరగిన తామ్రలోహంబుచేనిండి తామ్రకుండముండును. ఇందు తామ్రప్రతిమలుండును. పాపులిందలి వేడిమికోర్వక యమభటశిక్షల ననుభవింపఁజాలక హాహాకారంబులు చేయుచుందురు. ఎఱ్ఱఁగగ్రాఁగి తామ్రప్రతిమలీకుండమున లక్షలకొలఁదియుండును. పాపులీవిగ్రహముల నాలింగనముచేయుచుఁ దాళలేక యరచుచుందురు. రెండుక్రోసులీకుండము విస్తరించియున్నది.

(౨౨ లోహకుండము.

ప్రతప్తలోహధారంచ జ్వలదంగార సంయుతం॥ ౨౮ ॥ లోహానాం ప్రతిమాశ్లిష్టైరుదద్భిః పాపిభిర్యుతం। ప్రత్యేకం ప్రతిమాశ్లిష్టైః శశ్వత్ప్రజ్వలితైర్భియా॥ ౨౯ ॥ రక్షరక్షేతి శబ్దంచ కుర్వద్భిర్దూత తాడితైః మహాపాతకిభిర్వ్యాప్తం ద్విగవ్యూతి ప్రమాణకం॥ 30 ॥ భయానకం ధ్వాంతయుక్తం లోహకుండం ప్రకీర్తితం।

లోహధారలతోనుండు నగ్గికలదై లోహకుండముండును. అందు నెఱ్ఱఁగఁగాలిన లోహప్రతిమలుండును. పాపులీప్రతిమల నాలింగన మొనరింపవలయును. వారలాలింగన భయములో రక్షింపు రక్షింపుమని యరచుచుండ యమభటులు తాడనమొనరించి యాలింగనముచేయింతురు. అదినాలుగుక్రోసుల వైశాల్యము కలదై, భీకరంబై గొప్పశబ్దముతోఁ గూడియుండును.

(౨3) ప్రతప్తకుండము.

ఇయ్యది లోహకుండమువలెనే యుండును.

(౨౪) చర్మకుండము. (౨౫) తప్తసురాకుండము.

చర్మకుండం తప్తసురాకుండం వాప్యర్థమేవచ॥ 3౧ ॥ తద్భోజపాపిభిర్వ్యాప్తం యమదూతైశ్చ తాడితైః।

చర్మతప్తసురాకుండము లర్ధక్రోశ ప్రమాణములుకలవై యుండును వీనిలోనిపాపులను కృతాంతభటసంతతి శిక్షించుచుండును.

(౨౬) తీక్ష్ణకుండము. (శాల్మలీవృక్షకుండము)

అతశ్చశాల్మలీకుండం వృక్షకంటకశోభితం॥ 3౨ ॥ లక్షపౌరుషమానంచ క్రోశమానంచదుఃఖదం। ధనుర్మానైః కంటకైశ్చ సుతీక్ష్ణైః పరివేష్టితం॥ 33 ॥

ప్రత్యేకం విద్ధగాత్రైశ్చ మహాపాతకిభిర్యుతం వృశ్చికాగ్నిప తత్భిశ్చ యమదూతైశ్చ పాతితైః॥ 34 ॥ జలందేహీతి శబ్దంచ కుర్వద్భిశ్శుష్కతాలుకైః॥ మహాభియాతివ్యగ్రైశ్చ దంష్ట్రైస్సంభగ్నమస్తకైః॥ 35 ॥

తీక్ష్ణకుండము (శాల్మలీవృక్షకుండము) బూరుగుచెట్లచే నిండియుండును. వీని ముండ్లు హస్తచతుష్టయ దీర్ఘమైనవి. ఈకుండము పదునైదుయోజనముల పొడవు కోసు వెడల్పుకలిగి కంటకవేష్టితమై యుండును. ఇదికడుంగడు దుఃఖదంబు. పాపులీచెట్లనెక్కి కంటకబాధకోర్వక పడుచుండ శమనదూత లాయుధముల నెత్తి వారి శిరముల శాత్రవులనుబోలెఁ బగులఁగొట్టుచుందురు. పాపాత్ములు నోరార జల మిమ్మని బ్రతిమాలుచుందురు.

## (౨౭) విషోదకుండము.

ప్రచలద్భిః యథాతప్తతైల జీవిభిరేవచ। విషోద్రైస్తక్షకానాంచ పూర్ణంచ క్రోశమానకం॥ 36 ॥ తద్భ్రష్టైః పాపిభిర్యుక్తం యమదూతైశ్చతాడితైః తప్త తైలంబుల నుండువారలవలె తక్షకాద్యురగ విషపూరితంబగు విషోదకుండంబునందలి పాపులు పరితపించుచుఁ బ్రచలించుచుందురు. యమభటులు విషభోక్తలగు వారల తీవ్రదండనముల బాధించుచుందురు.

## (౨౮) విషకుండము.

విషకుండము విషోదకుండము వంటిది.

## (౨౯) ప్రతప్తకుండము (30) తైలకుండము.

ప్రతప్తతైల పూర్ణంచ కీటాది పరివర్జితం॥ 37 ॥ మహాపాతకిభిర్యుక్తం దగ్ధాంగారైశ్చ వేష్టితం కాకశబ్దం ప్రకుర్వద్భిశ్చలద్భిర్హాత పీడితైః॥ 38 ॥ ధ్వాంత యుక్తం క్రోశమానం క్లేశదంచభయానకం। శూలాకారైస్సు తీక్ష్ణాగ్రైర్లోహ శస్త్రైశ్చ వేష్టితం॥ 39 ॥ శస్త్రతల్ప స్వరూపంచ క్రోశతుల్య ప్రమాణకం వేష్టితం తత్పాతకిభిః కుంత విద్ధైశ్చ వేష్టితైః॥ 40 ॥ తాడితైర్యమ దూతైశ్చ శుష్కకంఠోష్ఠతాలుకైః శస్త్రశయ్యలఁ బోలుచు ప్రతప్త, తైలకుండములు చిమ్మ చీకటికలవై క్రోశదూర వ్యాప్తములై క్లేశద భయంకరములై యుండును. వీని మండెడి యగ్నిజ్వాలలు చుట్టియుండును. శూలాదిలోహ శస్త్రధరులై యమభటులు పాతకుల నిందు దండించుచుందురు. పాపులు భటులచే శిక్షింపఁబడుచు కంఠ తాలువులెండఁ దపించుచుందురు

### (3౧) కృ మి కుం డ ము.

క్రిమిభిశ్చ శంఖ ప్రమితై స్సర్పమానై ర్భయంకరైః॥ ౪౧ ॥ తీక్ష్ణదంష్ట్రైశ్చ విశృతైర్వ్యాప్తం ధ్వాంతయుతం సతి। మహాపాతకి భిర్యుక్తం యమదూతైశ్చ తాడితైః॥ ౪౨ ॥ శంఖము నాకారముగల క్రిములచే నిండి భయంకరమై తమోవ్యాప్తి గలిగి దూతమర్దిత పాపులచే నిండి కృమికుండముండును.

### (3౨) పూ య కుం డ ము.

ద్విగవ్యూతి ప్రమాణంచ పూయకుండం ప్రచక్షతే। తద్భక్షైః పాపిభిర్యుక్తం యమదూతైశ్చతాడితైః॥ ౪3 ॥ పూయకుండము నాల్గు యోజనములు వ్యాపించి యందలి మలమును భక్షించుచు యమభటతాడనంబుల దుఃఖించుచున్న పాపులచే నిండియుండును.

### (33) స ర్ప కుం డ ము.

తాళవృక్ష ప్రమాణైశ్చ సర్పకోటి భిరావృతం సర్పవేష్టిత గాత్రైశ్చ పాపిభి స్సర్పభక్షితైః॥ ౪౪ ॥ నాకులంశబ్ద కృద్భిశ్చయమ దూతైశ్చతాడితైః। తాటిచెట్టు పొడవుగల సర్పములచే భక్షింపఁబడుచు, దూతతాడనంబు లందుచు పెద్దపెట్టున నరచుచున్న పాపులచే నిండి సర్పకుండముండును.

### (3౪) మశకుండము. (3౫) దంశకుండము. (3౬) గరళకుండము.

కుండత్రయం మశాదీనాం పూర్ణంచ మశకాదిభిః॥ ౪౫ ॥ సర్వం క్రోశార్థ మానంచ మహాపాతకి భిర్యుతం। హస్తపాదాది బద్ధైశ్చ క్షతజాఘేన లోహితైః॥ ౪౬ ॥ హాహేతిశబ్దం కుర్వద్భిస్తాడితైర్యమపార్షదైః। మశకదంశ గరళ కుండములు మశకదంశ గరళపూర్ణములై యొక్కొక్క క్రోసుదూరము వ్యాపించి యుండును. యమదూత లిందలి మహాపాపుల బంధించి కొట్టుచుందురు. పాపులు హాహా యని యరచుచుందురు.

### (3౭) వజ్రదంష్ట్రకుండము (3౮) వృశ్చిక కుండము.

వజ్రవృశ్చికయోఃకుండం తాభ్యాం చ పరిపూరితం॥ ౪౭ ॥ వాప్యర్థం పాపిభిర్యుక్తం వజ్రవృశ్చిక దంశితైః।

వజ్రదంష్ట్ర వృశ్చికకుండములు వజ్రకీటకదంశములచే నిండియుండును. వీని విస్తీర్ణ మర్థక్రోశదూరము. వజ్రదంశముచేఁ గరవఁబడుచు పాపులు యాతనముల పాలగుచుందురు.

(౩౯) శరకుండము, (౪౦) శూలకుండము, (౪౧) ఖడ్గకుండము.

కుండత్రియం శరాదీనాం తై రేవ పరిపూరితం॥ ౪౮ ॥ తైర్విద్ధైః పాపిభిర్యుక్తం వాప్యర్థం రక్తలోహితైః॥

శరశూలఖడ్గకుండములు శరశూలఖడ్గములచే నిర్మింపబడియుండును. వీని విస్తృతి యరక్రోసుదూరము. పాపులీకుండములఁబడి లేచుచుండుటవలన వారిశరీరముక్షత యుక్తమై యుండును. వారిక్షతములఁ గారినరక్తముచేఁ గుండము లెఱ్ఱవారియుండును.

(౪౨) గో ళ కుం డ ము.

తప్తతోయోద్యుక్తైః పూర్ణం సధ్వాంతం గోళకుండకం॥ ౪౯ ॥ కీటైస్సంకులమానైశ్చ భక్షితైః పాపిభిర్యుతం। వాప్యర్థమానం భీతైశ్చ పాపిభిః కీటభక్షితైః॥౫౦ రుదద్భిఃక్రోశమానైశ్చ యమదూతైశ్చ తాడితైః అతిదుర్గంధి సంయుక్తం దుఃఖదం పాపినాంసదా॥ ౫౧ ॥

దుర్గంధతప్తజలపూరితంబు గోళకుండంబు ఆనీటివేడికి వాసనకు యమభట తాడనంబులకుఁ దాళలేక పాపులు కడువాపోవుచుందురు. జలమందలి కీటకంబులచే వారుభక్షింపఁబడుచుందురు. దీనివిస్తీర్ణము క్రోసుదూరము. ఇది చాల చీకటికుండము.

(౪౩) న క్ర కుం డ ము.

దారుణై ర్వికృతాకారైర్భక్షితం పాపిభిర్యుతం వాప్యర్థం పరిపూర్ణంచ జలస్థై రత్నక్రకోటిభిః।

నక్రకుండము దారుణనక్రకోటిచే నిండియుండును. ఇది యరక్రోసుదూరము వ్యాపించియుండును. ఇందు మొసళ్లచే భక్షింపఁబడుచు పాపులుందురు.

(౪౪) కా క కుం డ ము.

విణ్మూత్రశ్లేష్మ భక్షైశ్చ సంయుతం శతకోటిభిః కాకైశ్చవికృతాకారై ర్భక్షితైః పాపిభిర్యుతం॥ ౫౩ ॥

నూరుకోట్లకాకులచే సంకులమై మలశ్లేష్మములచేనిండి కాకకుండముండును. వికృతరూపకాకములచేఁ బాపులు భక్షింపఁబడుచు బాధలనందుచుందురు.

(౪౫) మంథానకుండము. (౪౬) బీజకుండము.

మంథానకుండం బీజకుండం తాభ్యాంపూర్ణం ధనుశ్శతం భక్షితైః పాపిభిర్యుక్తం శబ్దకృద్భిశ్చసంతతం॥ ౫౪ ॥

మంథానబీజకుండములు నూరుధనువుల శరవేగ ప్రమాణదూరము విస్తరించి యుండును. వానిలోని కీటకములచేఁ భక్షింపఁబడుచు గట్టిగ నరచుచుఁ బాపు లుందురు.

(౪౭) వ జ్ర కుం డ ము.

ధనుశ్శతం జీవయుక్తం పాపిభిస్సంకులం సదా। శబ్దకృద్భిర్వజ్ర దంష్ట్రైస్సాం ద్రిధ్వాంతమయం పరం॥ ౫౫ ॥

నూరుధనువుల ప్రమాణదూరము వ్యాపించి కటికచీకటికలదై వజ్రకుండ ముండును. పాపులు యాతనకోర్వక యరచుచుందురు.

(౪౮) త ప్త పా షా ణ కుం డ ము.

వాపీద్విగుణమానంచ తప్తప్రస్తర నిర్మితం జ్వలదంగార సదృశం చలద్భిః పాపిభిర్యుతం॥ ౫౬ ॥

మండునిప్పులవంటి వేడిగల పాషాణములచే నిర్మింపఁబడి రెండుక్రోసుల దూరము వ్యాపించి పాపులచేనిండి తప్తపాషాణ కుండముండును.

(౪౯) తీ క్ష్ణ పా షా ణ కుం డ ము.

క్షురధారోపమైస్తీక్ష్ణైః పాషాణైర్నిర్మితంపరం। మంగలికత్తుల వాదరబోలు పాషాణములచే నిర్మింపఁబడి తీక్ష్ణపాషాణ కుండముండును.

(౫౦) లా లా కుం డ ము.

మహాపాతకిభిర్యుక్తం లాలాకుండంచ లోహితైః॥ ౫౭ ॥ క్రోశమాత్రంచ గంభీరం యమదూతైశ్చ తాడితైః।

లాలాజలముచేనిండి లోహనిర్మితమై లాలాకుండముండును. దీనిలోతు క్రోసుదూరము. యమభటులందుఁ బాపులఁగొట్టుచు బాధింతురు.

(౫౧) మ సీ కుం డ ము.

తప్తాంజనాచలాకారైః పరిపూర్ణం ధనుశ్శతం॥ ౫౮ ॥ చలద్భిః పాపిభిర్యుక్తం యమదూతైశ్చ తాడితైః।

తప్తమగు నంజనపర్వతమువలె మసిచేనిండి యోర్వరాని వేడిమిచే నూరుధనువులదూరము వ్యాపించి మషీకుండముండును. పాపులీవేడికోర్వక తపించుచుండ యమభటులు తీవ్రముగ దండించుచుందురు.

(౫౨) చూ ర్ణ కుం డ ము.

పూర్ణం చూర్ణద్రవైః క్రోశమానం పాపిభిరన్వితం॥ ౫౯ ॥ తదోర్భజభిః ప్రద

గ్ధశ్చ మమమూత్రైశ్చ తాడితైః।

వేడిపిండిచేనిండి క్రోసుదూరము వ్యాపించి పాపులచేనిండి చూర్ణకుండముం డును. పాపులాపిండి మెసవికాలుచు యమభటశిక్ష లొందుచుందురు.

(౫3) చ క్ర కు ం డ ము.

కుండం కులాలచక్రంచ ఘూర్ణమానంచసంతతం॥ ౬౦ ॥ సుతీక్ష్ణం షోడశా రంచ చూర్ణితైః పాపిభిర్యుతం।

తాకినఁబిండిచేయు వాడిగల పదునారంచులు గలిగిన కులాలచక్రములఁతోఁ పాపియుతమై చక్రకుండముండును.

(౫౪) వ క్ర కు ం డ ము.

అతీవవక్రం నిమ్నంచ ద్విగవ్యూతి ప్రమాణకం। ౬౧ । కందరాకారనిర్మా ణం తప్తోదైశ్చ సమన్వితం। మహాపాతకిభిర్వ్యక్తం భక్షితైర్జల జంతుభిః ౬౨ ।

చాలవక్రము లోతుగలిగి నాల్గుక్రోసులు వ్యాపించి గుహాకారంబుగ కాలు నీటివలె వేడిమిగల్గి జలజంతుపూర్ణమై వక్రకుండముండును. ఇందలి జలజంతు భక్షితపాపులు యాతననుభవింతురు.

(౫౫) కూ ర్మ కు ం డ ము.

జలద్భిశ్శబ్దకృద్భిశ్చ ధ్వాంతయుక్తం భయానకం। కోటిభిర్వికృతాకారైః కచ్ఛపైశ్చసుదారుణైః॥ ౬౩ । జలస్థైసంయుతంతైశ్చ భక్షితైః పాపిభిర్యుతం।

మంటలచేఁగూడిన జలపూరితమై చీకట్లుక్రమ్మి వికృతాకారపుఁ దాఁబేళ్లచే నిండి కడుభయంకరమై కూర్మకుండముండును. తజ్జలములందలి మొసళ్లు పాపుల భక్షించును.

(౫౬) జ్వా లా కు ం డ ము.

జ్వాలాకలాపైస్తేజోభిర్నిర్మితం క్రోశమానకం॥ ౬౪ ॥ శబ్దకృద్భిః పాతకి భిస్సంయుతం క్లేశదం సదా।

మంటలుగల వహ్నిగలిగి క్రోసుదూరము వ్యాపించి యెల్లప్పుడును దుఃఖము కలిగించుచు పాతకులశబ్దములతోఁగూడి జ్వాలాకుండముండును.

(౫౭) భ స్మ కు ం డ ము.

క్రోశమానంచగంభీరం తప్తభస్మభిరన్వితం। ౬౫ । తత్వజ్వాల ద్భిసంయు క్తంపాప భిర్భస్మభక్షితైః।

క్రోసుపరిమాణములోతుగల్గి తప్తముగుబూడిదచేనిండి నది భస్మకుండము.

పాపులీబాధి మెనవుచు దుఃఖపడుచుందురు.

(౫౮) దగ్ధకుండము.

తప్తపాషాణలోహానాం సమూహైః పరిపూరితైః॥ ౬౬ ॥ పాపిభిర్దగ్ధగాత్రైశ్చ సంయుక్తం శుష్కనాలుకైః। క్రోశమానం ధ్వాంతయుక్తం గంభీరమతిదారుణం॥ ౬౨ । తాడితైశ్చ భృదగ్ధైశ్చ దగ్ధకుండం ప్రకీర్తితం।

బాగుగఁగాలిన లోహపాషాణ జాలములచేనిండి దగ్ధకుండముండును. పాపులిందుఁ గాలినశరీరము, నెండినదవడలుఁగలవారైయుందురు. ఈకుండము చీకటి నుండి క్రోసుప్రమాణము లోతుగలిగియుండును. దూతలు పాపులదండించు చుందురు.

(౫౯) తప్తసూచీకుండము.

ప్రతప్తసూచీకుండంచ కీర్తితంచ భయానకం। కాలియెఱ్ఱవడిన సూదులు గలిగి కడుభయంకరమై తప్తసూచీకుండముండును.

(౬౦) అసిపత్రకుండము.

అసీపధారా పత్రిస్యాప్యచ్చైస్తారతరోరథః॥ ౨౧ ॥ క్రోశార్ధమానం కుండంచ పతత్పత్రి సమన్వితం పాపినాంరక్తపూర్ణంచ వృక్షాగాత్పతితాంధ్రవం॥ ౨౨ । పరిత్రాహీతిశబ్దంచ పుర్యతామసతామపి గంభీరధ్వాంతసంయుక్తం రక్తకీటసమన్వితం॥ ౨౩ ॥ తదసీపత్రకుండంచ కీర్తితంచ భయానకం।

కత్తివాదరవంటి వాదరగల యాకులతోనిండి క్రోసుదూరము వ్యాపించి అసిపత్రకుండముండును. అనుభవశూన్యములగు తత్త్వమస్యాది దొంగవేదాంతోపదేష్టలగు పాపులు నీయసిపత్రములు వ్రాలుచుండ వారిశరీరములు తెగి రక్తధారలు కారుచుండును. చిమ్మచీకటిగల యీకుండమునఁ బాపులు దిక్కుతెలియక కాపాడుమని యరచుచుందురు. ఇందలి రక్తకీటకంబులు పాపులగాయంబులదూరి కరచుచుండును.

(౬౧) క్షురధారాకుండము.

ధనుశ్శతప్రమాణంచ క్షురధారాస్రి సంయుతం॥ ౨౪ ॥ పాపినాంరక్తపూర్ణంచ క్షురధారం భయానకం।

నూరుధనువులప్రమాణముకలిగి మంగలికత్తులవాదరలజనించిన రక్తముచే నిండి క్షురధారాకుండముండును. క్షురముచేఁదెగిన పాపులరక్తముచూడ భయంకరమైయుండును.

(౬౨) సూ చీ ము ఖ కుం డ ము.

సూచీముఖాశ్రి సంయుక్తం పాపిరక్తాఘపూరితం॥ ౭౫॥ పంచాశద్ధనురాయామం క్లేశదం సూచికాముఖం।

సూదిమొనలు దవిలి పాపులశరీరములనుండి కారిన రక్తపూరితమై యేబది ధనువుల ప్రమాణముకలిగి దుఃఖము నిచ్చునదై సూచీముఖకుండముండును.

(౬౩) గో కా ము ఖ కుం డ ము.

కస్యచిజ్జంతుభేదస్య గోకాఖ్యస్య ముఖాకృతి॥ ౭౬॥ కూపరూపం రుధిరంచ ధనుర్వింశత్ప్రమాణకం। మహాపాతకినాంచైవ మహత్క్లేశప్రదం పరం॥ ౭౭॥ తత్కీటభక్షితానాంచ నమ్రాస్యానాంచ సంతతం।

గోకాముఖరూపముగలిగి యిరువది ధనువుల ప్రమాణదూరము వ్యాపించి కూపమువలెఁ జాల లోతుగలదై మహాపాతకులకుఁ గడుదుఃఖము గలిగించుచు గోకాముఖ కుండముండును. ఇందలి గోకాముఖ కీటకంబులచేఁ బాపులు భక్షింపఁబడుచు తలలువ్రాల్చి దుఃఖించుచుందురు.

(౬౪) న క్ర ము ఖ కుం డ ము.

కుండం నక్రముఖాకారం ధనుష్షోడశమానకం॥ ౭౮॥ గంభీరం కూపరూపంచ పాపినాం సంకులంసదా।

పదునారుధనువుల ప్రమాణదూరమువ్యాపించి కూపరూపముతోఁజాల లోతుగలిగి పాపులచేనిండి నక్రముఖకుండముండును.

(౬౫) గ జ దం శ కుం డ ము.

ధనుశ్శతప్రమాణంచ కీర్తితం గజదంశనం॥ ౭౯॥ నూరుధనువుల ప్రమాణదూరమువ్యాపించి గజదంశకుండ ముండును.

(౬౬) గో ము ఖ కుం డ ము.

ధనుస్త్రింశత్ప్రమాణంచ కుండం తద్గోముఖాకృతి। పాపినాంక్లేశదం శశ్వద్గోముఖం పరికీర్తితం॥ ౮౦॥

గోముఖమువలె ముప్పది ధనువులమాన దూరముగలిగి పాపులకు దుఃఖముఁ జేకూర్చుచు గోముఖ కుండముండును.

(౬౭) కుం భీ పా క కుం డ ము.

కాలచక్రేణ సంయుక్తం భ్రమమాణం భయానకం। కుంభాకారం ధ్వాంత యుక్తం ద్వ్యగవ్యూతి ప్రమాణకం॥ ౮౧॥ కాలచక్రమువలె గిరగిర తిరుగుచు,

చీకటిగలిగి నాల్గుక్రోసులువ్యాపించి కుండరూపమునఁ గుంభీపాకకుండము భయంకర ముగనుండును.

శ్లో॥ లక్షపౌరుషమానంచ గంభీరం విస్తృతంసతి। పత్రిచిత్రప్రతైలంచ తామ్రాదికుండమేవచ॥ ౮౨ ॥ పాపినాంచ ప్రధానైశ్చ మూర్ఛితైః కృమిభిర్వ్య తం పరస్పరంచ నశ్యద్భి శ్శబ్దకృద్భిశ్చ సంతతం॥ ౮౩ ॥ తాడితైర్యమ దూతైశ్చ ముసలైర్ముద్గరైస్తథా ఘూర్ణమానైః పతద్భిశ్చమూర్ఛితైశ్చ క్షణం క్షణం॥ ౮౪ ॥ పాతితైర్యమదూతైశ్చ రుదస్త్య స్త్రక్షణం పునః। యావన్తః పాపినస్సంతి సర్వకుం డేషుసుందరి॥ ౮౫ ॥ తతశ్చతుర్గుణాస్సంతి కుంభీపాకేచ దుఃఖదే సుచిరం వధ్యమా నాస్తే భోగాదపి ననశ్వరాః॥ ౮౬ ॥ సర్వకుండప్రధానంచ కుంభీపాకం ప్రకీర్తితం।

తామ్రకుండము మొదలు తప్తతైలకుండమువరకు లక్షపౌరుషమాన దూర ముండును. ఇందలిపాపులు నిరంతరము క్రిములచే భక్షింపఁబడుచు, నరచుచు యమభట ముసల ముద్గరాద్యాయుధ తాడనంబులచే క్షణక్షణము మూర్ఛిల్లుచు లేచుచు బాధల ననుభవింతురు. అన్నికుండములలోఁ గుంభీపాకము ప్రధాన మైనది. ఇతరకుండములకంటె నాలుగంతలధిక బాధాకరమైనది. పాపులభోగ శరీరములు వధింపఁబడినను నశింపక పెరుగుచుండును

(౬౮) కా ల సూ త్ర కు ం డ ము

కాలనిర్మిత సూత్రేణ నిబద్ధా యత్రపాపినః॥ ౮౭ ॥ ఉత్థాపితాశ్చదూతై శ్చ క్షణమేవ నిమజ్జితాః। నిశ్వాసబద్ధాస్సుచిరం తతో మోహం గతాపునః॥ ౮౮ ॥ అతీవక్లేశసం యుక్తాదేహభోగేన సుందరి। ప్రతప్తతోయయుక్తంచ కాలసూత్రం ప్రకీర్తితం॥ ౮౯ ॥

కాలసూత్రముచే బంధింపఁబడిన పాపులచేనిండి కాలసూత్రకుండముండును. సలసలకాగు నీరిందుఁగలదు. ఈజలమున మునిఁగిన పాపులను భటులు దండింతురు. బాధల ననుభవించి తప్పులగ్రహించియు మరల మోహమునొందుచు నిట్టూర్పు పుచ్చుచు వారుపరితపించు చుందురు.

(౬౯) మ త్స్యో ద కు ం డ ము

అవటః కూపభేదశ్చ మత్స్యోదస్స ఉదాహృతః। ప్రతప్తతోయ పూర్ణంచ చతుర్వింశ త్ప్రమాణకం॥ ౯౦ ॥ వ్యాప్తం మహాపాతకిభిర్వ్య దగ్ధాంగైశ్చ సంతతం। షుర్దితైస్తాడితైశ్చశ్వాదవటోదం ప్రకీర్తితం॥ ౯౧ ॥

అవటకూపాకృతితో, నుడుకు మత్స్యజలముచేనిండి నిరువదినాల్గుధనువుల

ప్రమాణదూరవ్యాప్తితోఁ గాలినశరీరములుగల పాపులచేనిండి మత్స్యోదకుండ మునుఁగుదురు. భటులీపాపుల దండించుచుందురు.

(౨౦) కృ మి క ం తు క కు ం డ ము.

యత్రోపస్పర్శమాత్రేణ సర్వవ్యాధిశ్చపాపినాం। భవేదకస్మాత్సతతాం యస్మిన్కుండే ధనుశ్శతే॥ ౯౨ ॥ అరుంతుదైర్భక్ష్యతేస్తు ప్రాణిభిర్యచ్చసంకులం। హాహేతిశబ్దం కుర్వద్భిస్తదే వారుంతుదం విదుః॥ ౯౩ ।

మర్మములు తాకునట్లు కఱచు పురుగులచే నిండియుండునది కృమికంతుక కుండము. ఇందలిజలము పాపులఁదాకగనే సర్వవ్యాధులు సంభవించును. ఈ కుండము నూరుధనువుల ప్రమాణదూరవ్యాప్తి కలది. పాపులరుంతుదక్రిములచేభక్షింపఁబడుచు హాహాకారంబులు సేయుచుందురు.

(౨౧) పా ం సు భో జ్య కు ం డ ము.

తప్తపాంసుభీరాకీర్ణం జ్వలద్భిస్తు పతంగకైః తద్భక్ష్యైఃపాపిభిర్యుక్తం పాంసుభోజ్యైర్ధనుశ్శతం॥ ౯౪ ॥ బాగుగఁగాలినధూళిచేనిండి పాపులచే నాధూళిభక్షింపఁబడుటంజేసి యియ్యది పాంసుభోజ్య కుండంబునాఁబడు. దీనివ్యాప్తి ధనుశ్శత ప్రమాణదూరంబు.

(౨౨) పా శ వే ష్ట కు ం డ ము.

పాతమాత్రేణ పాపీచ పాశేనావేష్టితోభవేత్। క్రోశమాత్రేణ కుండంచ తత్పాశావేష్టనం విదుః॥ ౯౫ ।

పాపులు పాశంబులచేఁ గట్టఁబడి శిక్షింపఁబడుటచే నీకుండము పాశవేష్టకుండమనఁబడు. దీనివిస్తృతి యొక్కక్రోసుదూరము.

(౨౩) శూ ల ప్రో త కు ం డ ము.

పాతమాత్రేణ పాపీచ శూలేనావేష్టితోభవేత్। ధనుర్వింశ త్ప్రమాణంచ శూలప్రోతం ప్రకీర్తితం॥ ౯౬ ॥

పాపులు శూలముల మధ్యనుంచఁబడి బంధింపఁబడుటవలన నీకుండము శూలప్రోతకుండమను పేరు గలిగియున్నది. దీనివ్యాప్తి యిరువది ధనువుల ప్రమాణ దూరమైయున్నది.

(౨౪) ఉ ల్కా ము ఖ కు ం డ ము.

పతతాంపాపినాం యత్రభవేదేవ ప్రకంపనం। అతివహిమతోయుక్తం క్రోశార్థంచ ప్రకంపనం॥ ౯౩ ॥ దదత్యేవ హిమే యాతా యత్రోల్కాః పాపినాంముఖే।

ధనుర్వింశ ప్రమాణంచ తరులాకభి స్సుసంకులం! ౯౮ ॥

అతిశీతలజలంబు, నల్కాసముదాయముఁగలిగి యుల్కాముఖ కుండముం డును. ఇందుపాపులనోట నుల్కలు జొరబారుచుండును. ఇరువదిధనువుల ప్రమాణ దూరము వ్యాపించియుండును.

(౨౫) అంధకూపకుండము.

లక్షపౌరుషమానంచ గంభీరంచ ధనుశ్శతం। నానాప్రకార కృమిభిస్సంయుక్తంచ భయానకం॥ ౯౯ ॥ అత్యంధకారవ్యాప్తంచ కూపాకారంచ వర్తులం। తద్భక్ష్యైః పాపిభిర్యుక్తం ప్రిణవ్యద్భిః పరస్పరం॥ ౧౦౦ ॥ తప్తతోయ ప్రదగ్ధైశ్చ జ్వలద్భిః కీటభక్షితైః। ధ్వాంతేనచక్షుషా చాంధై రంధకూపం ప్రకీర్తితం॥ ౧౦౧ ॥

లక్షమనుష్యమానదైర్ఘ్యంబును శతధనుప్రమాణ గాంభీర్యమునుగలిగి పలువిధక్రిమికీటకములతోనిండి గుండ్రనిబావివలె కటికచీకట్లతోఁ బాపులచేనిండి యంధకారకుండము భయంకరమైయుండును. పాపులు కీటకములచే భక్షింపఁబడుచుఁ వేడినీటికిఁ దాళలేక చీకటిఁగన్నులు తెలియక పరితపించుచుందురు.

(౨౬) వేధనకుండము.

నానాప్రకార శస్త్రైశ్చైర్యత్ర విద్ధాశ్చపాపినః। ధనుర్వింశ ప్రమాణంచ వేధనం తత్ప్రకీర్తితం॥ ౧౦౨ ॥

నానావిధశస్త్రములచేఁ బాపులు బాధింపఁబడుటచే నిది వేధనకుండమనఁబడును. దీనివైశాల్య మిరువది ధనువుల ప్రమాణముండును.

(౨౭) తాడనకుండము.

దండేనతాడితాయత్ర యమదూతైశ్చపాపినః ధనుష్షోడశ మానంచ తత్కుంఢం దండతాడనం॥ ౧౦౩ ॥

యమభటులిందుఁ బాపులను దండములఁ దాడఁనమొనర్తురు. కాననిది తాడనకుండము. ఇది పదునారు ధనువుల ప్రమాణవిస్తృతికలది.

(౨౮) జాలరంధ్రకుండము.

నిరుద్ధాశ్చ, మహాజాలైర్యథామీనాశ్చ పాపినః। ధనుర్వింశత్ప్రమాణంచ జాలరంధ్రంప్రకీర్తితం॥ ౧౦౪ ॥

చేపలు వలఁజిక్కినట్లు రంధ్రములు గలిగి వలవలెనున్న జాలరంధ్రకుండమునఁ బాపులు చిక్కితపింతురు. దీనివిశాలత యిరువదిధనువుల ప్రమాణదూరము.

(౨౯) దే హ చూ ర్ణ ఖ ం డ ము.

పతతాంపాపినాంకుండే దేహశ్చూర్ణోభవేదిహ। లోహబంధ నిబద్ధానాం కోటి పౌరుషమానకం॥ ౧౦౫ ॥ గంభీరం ధ్వాంత సంయుక్తం ధనుర్వింశత్ప్రమాణకం। మూర్ఛితానాం జడానాంచ దేహచూర్ణం ప్రకీర్తితం॥ ౧౦౬ ॥ పాపులదేహ మిందు పిండిచేయఁబడుట నియ్యది దేహచూర్ణఖండ నామకంబు దీనిలోతు కోటిమనుష్య మానంబు. ఇది యంధకార బంధురమైయుండును. దీనివైశాల్య మిరువది ధనువులప్రమాణంబు. శరీరము పిండియగుచుండఁ బాపులు మూర్ఛమునిఁగియుందురు.

(౩౦) ద ల న ఖ ం డ ము.

దళితాఃపాపినోయత్ర యమదూతైశ్చ తాడితాః ధనుష్షోడ శమానంచ తత్కుండందళనం స్మృతం॥ ౧౦౭ ॥

పాపులు యమదూతలచేఁ బడఁగొట్టఁబడుటచే దీనికి దలనకుండమను నామంబు ప్రసిద్ధంబు. ఇయ్యది పదునారు ధనువుల ప్రమాణదీర్ఘత గలిగి యున్నది.

(౩౧) శో ష ణ ఖ ం డ ము.

పతన్నైవపాపీచ శుష్కకంఠోష్ఠతాలుకః। వాలుకాసుచతప్తాసు ధనుస్త్రింశత్ప్రమాణకం॥ ౧౦౮ ॥ శతపౌరుషమానంచ గంభీరం ధ్వాంత సంయుతం। శోషణం ఖండమేతద్ధిపాపినాం పరదుఃఖదం॥ ౧౦౯ ॥

వేడియిసుకగలిగి ముప్పది ధనువుల ప్రమాణ దీర్ఘతయు నూరుమనుష్యమానములలోతు నున్నదై చీకటితోఁగూడి పడినపాపుల కంఠోష్ఠముల శోషింపఁజేయుటచే శోషణకుండమనుపేర నియ్యదియొప్పుచున్నది. పాపులకిది కడునఃఖముగలిగించును.

(౩౨) క ష ఖ ం డ ము.

నానాచర్మ కషాయోద పరిపూర్ణం ధనుశ్శతం। దుర్గంధియుక్తం తద్భక్ష్యైః ప్రాణిభిః సమలంకషం॥ ౧౧౦ ॥

పలువిధ చర్మకషాయపునీటిచేనిండి నూరుధనువుల ప్రమాణదీర్ఘవ్యాప్తిచే దుర్గంధముగలదై పాపు లొకరొకరు రాపిడిచే బాధననుభవింపఁదగినదై యున్నందుచేత నిదికషఖండమనఁబడును.

(౩౩) శూ ర్ప ఖ ం డ ము.

శూర్పాకారముఃఖం కుండం ధనుర్ద్వాదశ మానకం తప్తలోహై ర్వాలుకాభిః

పూర్ణం పాతకి సంయుతం॥ ౧౧౧ ॥ దుర్గంధయుక్తం తద్భక్ష్యైః పాపిభిస్సంకులం సతి। శూర్పాకార ముఖంకుండం ధనుర్ద్వాదశమాత్రికం। ౧౧౨ ॥

వేడియిసుక గలిగి దుర్గంధయుక్తమై పండ్రెండు ధనువుల పరిమాణదూరము వ్యాపించి శూర్పకుండముండును. పాపులాదుర్వాసనగల యిసుకను భక్షించుచు బాధలనొందుచుందురు.

(౮౪) జ్వాలాకుండము.

ప్రతప్తవాలుకాపూర్ణం మహాపాతకిభిర్యుతం। అంతరగ్నిశిఖానాంచ జ్వాలావ్యాప్తముఖం సదా॥ ౧౧౩ ॥ ధనుర్వింశతి మాత్రంచ పరిమాణం యస్యసుందరి జ్వాలాభిర్దగ్ధగాత్రైశ్చ పాపిభిర్వ్యాప్తమేవచ। ౧౧౪ ॥ తన్మహాక్లేశదంశశ్చైతత్కుండం జ్వాలాముఖంస్మృతం। పాతమాత్రాద్యత్రపాపీ మూర్ఛితోవైనరోభవేత్। ౧౧౫ తప్తేష్టకాభ్యంతరం వాక్యార్థం జిహ్మకుండకం।

జ్వాలాకుండమున వేడియిసుకయుండును. దీనిమధ్యభాగమున నగ్నిజ్వాలలతిభయంకరముగ నుండును. పాపులీజ్వాలలచేఁ గాయంబులు గాలమహాదుఃఖులై యుందురు. ఇందుపడినవెంటనే పాపులు మూర్ఛగలుగుదురు. మధ్యజ్వాలలు చుట్టియుండుట దీనికి జ్వాలాకుండాఖ్య దగియున్నది. ఈజ్వాల లర్ధక్రోశదూరము వ్యాపించియుండును. ఇరువది ధనువుల పరిమాణదూర మీకుండముండును.

(౮౫) ధూమాంధకుండము.

ధూమ్రాంధకార సంయుక్తం ధూమాంధైః పాపిభిర్యుతం॥ ౧౧౬ ॥ ధనుశ్శతం శ్వాసరంధ్రై ర్ధూమ్రాంధం పరికీర్తితం।

పొగచేనిండి యంధకారబంధురమైయుండుట నియ్యది ధూమ్రాంధకారకుండమనఁబడును. దీనివిస్తీర్ణము నూరుధనువుల పరిమాణదూరము.

(౮౬) నాగవేష్టనకుండము.

పాతమాత్రాద్యత్రపాపీ నాగైశ్చావేష్టితోభవేత్॥ ౧౧౭ ॥ ధనుశ్శతం రాగపూర్ణం తన్నాగైర్వేష్టితంభవేత్। షడశీతిచకుండాని మయోక్తాని నిశామయ। ౧౧౮

పాపులీకుండమునఁ బడగానే పాములచేఁ జుట్టబడుటచే నాగవేష్టకుండమనబడును. ఇది నూరుధనువుల పరిమాణదూరము వ్యాపించియుండును.

---

# సంకర్షణస్వరూపాదిశేషుఁడు.

---

శ్రీమద్భాగవతము - పంచమస్కంధము - అధ్యా. ౨౫

శ్రీశుకః - తస్యమూలదేశే త్రింశద్యోజన సాహస్రాంతరస్తే - యావైకలా భగవతస్తామసీ సమాఖ్యాతానంత ఇతి -సాత్త్వతీయాః యం ద్రష్టృదృశ్యయో స్సన్నికర్షణాదహమితి చాభిమాన లక్షణాత్సంకర్షణ ఇత్యాచక్షతే॥ ౧ ॥ యస్యేదం క్షితి మండలం భగవతో నంతమూర్తేః సహస్రశిరస ఏకస్మిన్నేవ శీర్షణి ధ్రియమాణం సిద్ధార్థ ఇవలక్ష్యతే॥ ౨ ॥ యస్యహావాఇదం - కాలేనోప సంజిహీర్షతో మర్షవిరచిత రుచిరభ్రమ ద్భ్రువో రంతరేణ సన్నికర్షణో నామ రుద్రఏకాదశవ్యూహ స్త్ర్యక్షస్త్రిశిఖంశూల ముత్తంభయన్ను దతిష్ఠత॥ 3 ॥ యస్యాంఘ్రికమలయుగళారుణ విశదనఖమణి షండమండలేష్వహి పతయ స్సహసాత్త్వత ఋషభై రేకాంతభక్తి యోగేనావనమంతః స్వవదనాని పరిస్ఫురత్కుండల ప్రభామండల మండితగండస్థలాన్యతి మనోహారిణి ప్రముదిత మనసః ఖలువిలోకయంతి॥ ౪ ॥ యస్యైవహినాగ రాజకుమార్య ఆశిష ఆశాసాశ్చార్వంగ దవలయ విలసిత విశద విపుల ధవళసుభగరుచిర భుజజరాత స్తంభేష్వగరు చందన కుంకుమ పంకాను లేపేనావలింప మానాస్తదభిమర్శనోన్మథిత హృదయ మకరధ్వజావేశ రుచిరలలితస్మితాః - తదనురాగ మదముదిత మదవిఘూర్ణితారుణ కరుణావలోకనయన వదనారవిందం సవ్రీడంకిల విలోకయంతి॥ ౫ ॥ సఏవభగవాననంతో నంతగుణార్ణవ ఆదిదేవ ఉపసంహృతామర్ష రోషవేగో లోకానాం స్వస్తయఆస్తే॥ ౬ ॥ ధ్యాయమాన స్సురాసురోరగ సిద్ధగంధర్వ విద్యాధరమునిగణై రనవరత మదముదిత వికృత విహ్వలలోచన స్సులలితముఖరితామృతే నాప్యాయమానః - స్వపార్షద విబుధ యూథపలీన పరిమ్లానరాగనవనిజతులసి కామోద మధ్వాసవేనమాద్యన్మధుకర వ్రాతమధుర గీత శ్రియం వైజయంతీం స్వాం వనమాలాం నీలవాసా ఏకకుండలలోహ హల్లకే కకుదికృత సుభగసుందర భుజోభగవాన్మాహేంద్రో వారణేంద్ర ఇవకాంచనీం కక్ష్యాముదార లీలోబిభర్తి॥ ౭ ॥ యఏష ఏవమను శ్రుతోభిధ్యాయమానో ముముక్షూణా మనాదికాలకర్మ వాసనా గ్రథిత మవిద్యామయం హృదయగ్రంథిం సత్త్వ రజస్తమోమయ మంతర్హృదయంగతఆశు నిర్భినత్తి. తస్యానుభావ మిమం భగవాన్ స్వాయంభువో నారదస్సహతుంబురుణా సభాయాం బ్రహ్మణస్సంశ్లోకయామాస॥ ౮

శ్లో॥ ఉత్పత్తిస్థితిలయహేతవోస్య కల్యాస్సత్త్వాద్యాః ప్రకృతిగుణాయ దీక్షయాసన్

యద్రూపం ధ్రువమకృతం యదేకమాత్మన్ నానాధాత్కథ ముహవేద తస్య వర్త్మ॥ ౯॥ మూర్తిం నః పురుకృపయా బభార సత్త్వం సంశుద్ధం సదసదిదం విభాతి యత్ర। యల్లీలాం మృగపతిరాదదే౽నవద్యామాదాతుం స్వజన మనాంస్యుదార వీర్యః॥ ౧౦॥ యన్నామ శ్రుతమనుకీర్త యేదకస్మాదార్తో వాయది పతితః ప్రలంభనాద్వా। హంత్యంహస్సపది నృణామశేష మన్యం కం శేషాద్భగవత ఆశ్రయేన్ముముక్షుః॥ ౧౧॥ మూర్ధన్యర్పిత మణివత్సహస్రమూర్ధ్నో భూగోళం సగిరిసరిత్సముద్రసత్త్వమ్। ఆనంత్యాదవిదిత విక్రమస్య భూమ్నః కోవీర్యాణ్యధిగణయేత్సహస్రజిహ్వః॥ ౧౨॥ ఏవం ప్రభావో భగవాననంతో దురంతవీర్యోరుగుణానుభావః। మూలేరసాయాః స్థిత ఆత్మతంత్రో యోలీలయాక్ష్మాం స్థితయేబిభర్తి॥ ౧౩॥

ఈబ్రహ్మాండమునకుఁ గ్రిందిభాగమున ముప్పదివేలయోజన వైశాల్యవ్యాప్తుఁడై ఆదిశేషుండు ఆధారభూతుండై యున్నాఁడు. ఇతఁడు తామసాహంకారమున కధిష్ఠాతయు అనంతస్వరూపుండునగు సంకర్షణాత్మక భగవత్కళాంశముగ వాయురూపభూతముగ సర్వాధారుండుగ నున్నాఁడు. ఆతనికాపేరు యాదృచ్ఛికము గావచ్చినదికాదు. అతఁడు జ్ఞాతకును, జ్ఞేయమునకు, నతీంద్రియవిషయకమగు శబ్దార్థజ్ఞానము నాపాదించుటంజేసి యట్లు చెప్పఁబడుచున్నాఁడు. ఇతఁడు జీవవర్గమున కభిమానియగు ముఖ్యప్రాణరూపదేవతయగుట వలన సహస్రనాడి దార్ఢ్యవృత్తికి హేతుభూతుఁడగుచున్నాఁడు ఇతనికిఁగల యనంతనామముగూడ యాదృచ్ఛికమైనదికాదు. సహస్రఫణములుగల యీసంకర్షణుని యొక్క శిరంబున నీబ్రహ్మాండమంతయును నావగింజవలె గానవచ్చుచున్నది. ఇట్లతఁడపరిచ్ఛిన్నుఁడగుట వలన ననంతుఁడనిపించుకొనుచున్నాఁడు. రెండుపదార్థముల కాలముగడచినపిమ్మట నతఁడు సమస్త ప్రపంచమును సంహరింపదలంచి కోపమున కనుబొమ్మలు ముడివేయగా నాభ్రూమధ్యమునుండి సాంకర్షణాత్మకైకాదశరుద్రసమూహము మూడు నేత్రములతోను, త్రిశూలముతోను నుదయించి ప్రపంచమును సంహరింతురు. అచ్చట సర్పరాజులందఱును నతని పాదపద్మముల నఖకాంతిసమూహమునం దవ్యభిచరిత భక్తిగలవారలై నమస్కరించుచుందురు. భాసురకుండలముల కాంతిమండలములచే నలంకృతములగు గండస్థలంబులుగలవై మిక్కిలిసుందరములయిన తమ వదనంబు లావఖకాంతులందుఁ బ్రతిఫలించుచుండగా మనంబులు సంతసింప నధికసుఖంబు గల్గునట్లుగా నతని విలోకించుచుందురు. అచ్చటి నాగకన్యలును నతని వలన బుద్ధిసార్థ్యముల నభిలషించుచుండ సుందరములగు నంగదవలయ, ప్రకాశితాం

గుడై, నిర్మలుడై, దీర్ఘకోమల సుందర శరీరుఁడై, వెండిస్తంభముల బోలుచునున్న యతని భుజములందగరు కుంకుమ చందనముల బూయుచుఁ దదీయభుజ స్పర్శచే సుందరమందహాస వదనులగు నాగకన్యలు ఆనందమున నుందురు. అనురాగాతిశయముచే ఘూర్ణితములై యరుణములై దయాపూరితములై యున్న నేత్రములతో ప్రకాశించుచున్నా సంకర్షణుని ముఖారవిందమందు నూతనప్రకాశము నాలోకించు చుందురు. అనంతుఁడను ననంత కల్యాణగుణ నిధియు, జగత్కారణ భూతుండును, నగు సంకర్షణుండు తన తేజస్సుచేఁ బ్రకాశించుచు, జగత్సంహార విషయమగు సహింపరాని క్రోధము నుపసంహరించి లోకములకు మంగళములు గలిగించుచు వర్తించును. మఱియు సురాసురులు, సిద్ధసాధ్య గంధర్వ యక్షకిన్నర, కింపురుష విద్యాధరులును, మునిగణములును, సర్వదాయమ్మహానుభావుని ధ్యానించు చుందురు. తన సుందర నేత్రములచేతను మృదుమధుర మంజులవాక్కులతో నందరిని సంతసింపఁజేయుచుండును. మకరంద రసయుక్త సుగంధపరిమళతులసీ వైజయంతీ వనమాలచేఁ బ్రకాశించుచున్న వాఁడును. నీలవస్త్రాలంకార భాసితుండును, దేదీప్యమాన మకరకుండలాలంకృత ప్రకాశుండును. హలాయుధ ధారియు భగవంతుండునునగు నాసంకర్షణుఁడు కాంచనసూత్రములచే వెలుఁగొందుచుండును. మఱియు భగవంతుఁడగు ననంతుండు తనచరిత్ర స్తోత్రములచే ధ్యానించుచున్న ముముక్షువులం దపార ప్రేమ గలవాఁడై వారిహృదయ కుహరంబులందుఁ బ్రవేశించి యనాది కామకర్మవాసనా నిలయమగు అవిద్యాతమోగ్రంధిని ఛేదించుచుండును. సృష్టిస్థితిలయాత్మకుండును త్రిగుణములకాశ్రయ భూతుండును, ప్రకృతి కతీతుండును పరమ పురుషుండును స్వరాడ్రూపుండును, జగదాధారభూతరూపుడును అగు ఆసంకర్షణమూర్తికిఁ దుంబురనారదాది బ్రహ్మర్షులు, దేవతలు, పితృదేవతలాదిగా సర్వులును బ్రహ్మసభలో లోకానుగ్రహార్థమై నిరంతరము ననేక వేదములస్తుతులతో గానముచేయుచు అతని కణమాత్రమైనను కోపము రాకుండ నిరంతరము కాచుకొనియుందురు. కోపము గలిగెనేని కాలాగ్నిరూప సంవర్తాగ్ని యతని నేత్రములం దుత్పత్తియై సర్వము నిమిషమున భస్మముచేయునని భీతిగలవారలై స్తుతించుచుందురు.

## — వి వ రా ర్థ ము. —

పురాణముల నీలాగునను, తత్త్వముతోఁగేవల వాయుస్వరూపుఁడనియు వాయువే సర్వాధారభూతమనియు. ఉత్పత్తికిని, స్థితికిని, లయమునకు ఆద్యంతములందును ప్రధానభూతమనియు సర్వమే వాయుస్వరూప సగుణమూర్తియనియుఁ

ప్రాణాధార స్వరూపుండనియు ఈ బ్రహ్మాండమంతయు వాయ్వాధారముతో నిలిచి ప్రకాశించుచున్నదనియు కుండలనీశక్తిస్వరూప యోగాదులతో నన్వయింతురు. జ్ఞానస్వరూపముతో అనంతుఁడనియు పరిపూర్ణుండనియు, సర్వాధారస్వరూపాత్మగను స్వస్వరూపునింగఁ దెలిసికొందురు- పంచభూతముల వరుసతో నీఆదిశేషుఁడు వాయుభూతావరణాత్మకుండగును. ఇతనియందుఁగల కాలాగ్ని తేజోభూతము. "వాయోరగ్నిః అగ్నే రాపః, అద్భ్యః పృథివీ" యని యుపనిషత్ప్రమాణము దశాంశాధిక్యముతో మిగతభూతములకంటె త్రిదశాధిక్యుఁడు కాన నితనివైశాల్యమును సమానముగాఁ నింతే వర్ణించినది.

వాయువునకుఁ దనక్రిందిభూతముల నన్నింటిని తనలోనికి లాగుకొని అరూపములుగ జేయు శక్తిగలదు. ఇదే ప్రళయరూపము. వాయువునుండి తేజోభూతముత్పత్తియైనది. కాబట్టి ప్రళయములో ఆదిశేషుని నేత్రమునందు అగ్ని పుట్టును. ఈయగ్ని సర్వమును దహించి మరల వాయువులోనే యుపశమించును. జలభూతమున్నూ మూలాధారుడగు జఠరాగ్నికి ఆధారమైనదై జీవనమగుచున్నది. కాబట్టి సర్వస్వరూపుఁ డనంతుఁడు. మొదట శేషించి అంతమునందును శేషించునుగాన ఆదిశేషుఁడు. సర్వమును తనలోనికి లాగుకొనునుకాన సంకర్షణుఁడు ప్రళయమూర్తిగాన రుద్రుఁడు శ్రీరుద్రమునందు అంగన్యాస కరన్యాసములందుఁ ప్రారంభములో "సంకర్షణస్వరూపో యోఽసావాదిత్యః పరమపురుషస్సఏవ రుద్రోదేవతా" యని వివరించిరి. దీనిధ్యానశ్లోకమునందునింకను విశదముగ నేయున్నది.

ఈ బ్రహ్మాండమెటులనున్నదనిన

ఒక ప్రత్యక్ష దృష్టాంతమును జూపెదను. బ్రహ్మాండమునకును, పిండాండమునకు నేమియునుభేదము లేదని యిదివరకే నిరూపించితిని. బ్రహ్మాండమునకు ప్రకృతి మాయావరణమున్నట్టుగనే పిండమునకు మాయావరణ కోశమున్నది. బ్రహ్మాండము జలములో నుత్పత్తిస్థితిగా నున్నట్టుగనే మాయలోఁగల జలమునందు పిండాండమున్నది. ఈపిండాండమునకును జలమునకును లోపలవాయువు సర్వవిధములుగ నాధారభూతముగనున్నది. అటులనే బ్రహ్మాండమునకు ఆధారభూతముగ ఆదిశేషుఁడు నిలిచియున్నాఁడు. ఈ వాయువే పిండాండమునకు సృష్టిస్థితిలయాదులకు ముఖ్యకారణము. పైనున్న ఋషులు, దేవతలు పితృదేవతలవలె మనము మనఆప్తులు, యాగరక్షణార్థముగ సుఖప్రసవమునకై నిరంతరము ప్రార్థించుచున్నాము. ఇచ్చట ముఖ్యకారణ ప్రార్థన స్వరూపుఁడే వాయువు,

## అష్టదిగ్గజములు.

ప్రకృతి - యహంకారాధారములు లేనిదే నిలువఁజాలదు. ఈ బ్రహ్మాండమునకు నాధారములుగ అష్టప్రకృతిరూప మహదహంకార స్వరూప చిహ్నములుగ పురాణములం దష్టదిగ్గజముల వివరించిరి. చైతన్య స్వరూపముతో గజమునకంటె నధికాకారముగల జీవరాసులు లేనందున ఔపచారికముగ వివరించిరి. ఈశ్వర దృష్టితో మనవలె నదియు నిశ్చయముగనే యుండును. వీటియందు సందేహము గలిగినచో మనవిషయాదులందు నన్నియు సందేహములగును. అనంతసృష్టికర్తకు నేమియు వింతలేదు సామాన్యమే. ఒకరథమును తయారుచేయుటలో ఆధారాధేయములుగ నొకదానికొకటి యుండవలెను. ఈబ్రహ్మాండము రథాకారముగనే యున్నది. ఈ అష్టదిగ్గజము లష్టచక్రములుగఁ దలంచవచ్చును. మనకుఁదోచినట్టు యంత్రములను కట్టడములను దయారుచేసినట్టుగనే ప్రకృతియున్నది. విపరీతములకు మనోభేదమే కారణము. బ్రహ్మాండము నిలుచుటకాధారభూతులుగ ఆదిశేషుడు. అష్టదిగ్గజములున్నవి - (౧) ఐరావతము, (౨) పుండరీకము, (౩) వామనము, (౪) కుముదము, (౫) అంజనము. (౬) పుష్పదంతము, (౭) సార్వభౌమము, (౮) సుప్రతీకము అనునష్టదిగ్గజములు. మన మహాసంకల్పములో నీయష్టదిగ్గజములను వివరించిరి. ఇవన్నియు అష్టప్రకృతులుగ సమన్వయము. ప్రకృతిలోచేరినవిగాన నొకదానికొకటి భిన్నరూపములుగ నున్నవి. తుదకు ప్రకృతియొక్కటైనను సృష్టితో నీలాగుభిన్నమగును. అందుచేత ఒకటిభేదములుగను - మరొకటి దీనికతీతముగ అభేదముగను సంపూర్ణముగను స్వస్వరూపముగ నున్నది. దీనినే ఆత్మయని శాస్త్రములు బోధించెను. ప్రకృతిభిన్నము. దానితో సర్వముభిన్నము.

## ఆదికూర్మము.

ఆదిశేషునిక్రింద కూర్మమాధారభూతరూపచక్రముగ నున్నది. అన్నియును భూతసంజ్ఞలుగ పంచభూతస్వరూపములతో వరుసగ ఒకభూతమునకు మరొకభూతమాధారాధేయములుగ నున్నవి. ఊర్ధ్వభాగములోను అధోభాగమునందు నీలాగుననే అనులోమ విలోమములుగనున్నవి. ఆదిశేషుఁడు వాయ్వాకాశభూత

రూపముతో నంతర్గత పంచభూతములతో మరలప్రారంభములుగానగును. మరల నీవరుస క్రమముతోనే ఆదిశేషునిక్రింద అగ్నిభూతముగ అధోముఖముతోనుండును. తరువాత జలభూతస్వరూపమే కూర్మము. దీనినిస్థూలరూపముతో కూర్మాకారముగ వర్ణించిరి. ఇదినారాయణాశ్ర చక్రాకారరూపము. ప్రతిదేహమందును, బ్రహ్మాండమందును త్రివిధలింగముగ పంచభూతముల వరుసలు విలోమానులోమములతోనున్నవి.

ఈబ్రహ్మాండగోళభూమికి ఆధారస్వరూపముగ నున్నదే కూర్మము. మందర పర్వతచరిత్రలో జలమునందుఁ గూర్మరూపముతో శ్రీభగవంతుడు అవతారమూర్తిగా నిలిచెననికలదు. కూర్మముపైనగల మందరపర్వతమే బ్రహ్మాండభూమి. దానిచుట్టుగల వాసుకియే ఆదిశేషుడు. పురాణార్థము బాహ్యములో స్థూలార్థముగను అంతరములో తత్వార్థముతో సూక్ష్మముగను, జ్ఞానముతో సర్వము పూర్ణరూపముతో నేకరూపముగ సమన్వయము. కూర్మమునే పృథివిగాగూడ తలంచవచ్చును. ఇదియు బ్రహ్మాండగోళాకారమే.



## యజ్ఞ వ రా హ ము - భూ మి.

ఆదికూర్మముక్రింద ఆధారభూతస్వరూపమూర్తిగ నున్నదే వరాహము. ఇది శ్రీభగవత్స్వరూప దివ్యయజ్ఞవరాహముగాని సామాన్యవరాహముకాదు. గనుక ప్రవృత్తిధర్మచక్రములో మొదటవ్యక్తమైన కాలావయమే వరాహము లేక కాలశక్తి అయినాకావచ్చును. "వరరూపేణఅహం" వారాహః అని అర్థము యజ్ఞరూపమని తెలిసి ఉపాసించవలెను. బ్రహ్మాండము, పాపాతిశయముతో జలప్రళయముతోఁ జేరుచుండగా విరాడ్రూప భగవంతుని యజ్ఞమూర్తిగ ఆరాధించుటచేత విరాడ్రూపయజ్ఞ వరాహావతారమూర్తిగ నతడుద్భవించి భూమినుద్ధరించి యథారూపముననిలిపెను. వరాహమనఁగ పృథివీతత్వస్థూలరూపము. లేక భౌమధ్రువమగు త్రిణాభిచక్రము యజ్ఞముతో వరరూపాత్మగ అవతరించి భూమిని ఉద్ధరించిన విరాడవతార యజ్ఞవరాహమన మహాపవిత్ర భగవత్స్వరూప దివ్యమూర్తిగా ఉపాసించవలెనుకాని దీనిరహస్యమును దెలియక లోకమునందుఁగల హేయరూపమగు సామాన్య వరాహముగఁ దలంచినచో పాపహేతువునకుఁ గారణమగును.

కాన నీభావముతో నెంతమాత్రము నెప్పటికిని దలంచరాదు. ఏభావముతోఁ దలంచిప్రార్థించిన నాభావరూప ఫలానుభవప్రాప్తి స్థితిరూపమే వారలకుఁ గలుగును. హేయమగు అపవిత్రమగు సామాన్యరూపముగఁ దలంచినచో నాఫలమునే బొందుదురు. దూరమాలోచించి ఉత్తమసాత్త్విక భగవద్రూప యజ్ఞవిరాట్టుగాఁ దలంచి ధ్యానించినచో నీఫలమునుబొంది సుఖలోకాదుల ననుభవించి భగవత్సన్నిధిఁజేరుదురు. అధమమార్గావలంబులుగాక ఉత్తమపుణ్యమార్గావలంబులుగావలెను. ఈవరాహమూర్తితో భూమికి అతిప్రాశస్త్యముగలిగి సర్వసస్యాశ్రయమై మహాపుణ్యతీర్థములకును, శైలములకును, ఆరామములకు, దేవతానిలయములకును, కర్మభక్తిజ్ఞాన వైరాగ్యములకు మహాపవిత్రభూమియయ్యెను. ప్రమాణములు భూమిర్ధేనుర్ధరణీ లోకధారిణీ "ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా" "అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే వసుంధరా" "శిరసాధారయిష్యామి రక్షస్వమాంపదే పదే" "సర్వసస్యాశ్రయాభూమి ర్వరాహేణ సముద్ధృతా" ధేనువు ఏవిధముగా తనగర్భములో సమస్తబ్రహ్మాండము" నన్నింటిని నిముడ్చుకొని ఆధారభూతముగ నున్నదో యటులనే భూమియున్నది. భూమి సర్వసస్యములకును చేతనాచేతనములకును, సర్వాధారముగనున్నది. (౧ అట్టిభూమిని శ్రీయజ్ఞవిరాడ్వరాహమూర్తి సంబంధముతోఁ దన సహస్రబాహువులకాంతితో ఆలింగనముతో నీటిలోఁ బ్రళయమగుచున్నదానిని ఆకర్షించి తనముఖదంష్ట్రముతో జలోపరిభాగమునందు నిలిపినందుచేతను, (౨) శ్రీత్రిమూర్తి స్వరూపమున్నూ ఆదిత్యరథాశ్వములునుఅగు వేదఛందస్సులపారఘట్టనమును మానసోత్తర పర్వత సంస్పర్శనము కలిగినందుచేతను, (3) సూర్యరథచక్రము మానసోత్తర పర్వతమునంటి తిరుగుటచేతను పవిత్రమైనది. మనస్సుకుత్తరములో బుద్ధియున్నది. బుద్ధియే ఆదిత్యుఁడు. మనస్సే భూమి. మనస్సంకల్పములే సృష్టిజాలము. సుబుద్ధితో సుమనస్సుగా పవిత్రవంతమైనదని తత్త్వతాత్పర్యము. సదాచారమే రథము. అశ్వములే వేదములు. విష్ణుక్రాంతియేవ్యాప్తి. సర్వలోకవాసులీమహిమాతిశయమును దెలియవలయును. ధేనువును బూజించి దానిని ప్రదక్షిణముచేసి స్పృశించినమస్కరించిన సర్వపాపములు నశించును. (౪) విష్ణుక్రాంతే వసుంధర. యజ్ఞవరాహరూప విష్ణుపత్నిగా భూమియున్నందుచేత విష్ణుక్రాంతమైనందుచేతను మహాపవిత్రవంతురాలని తలంచి స్పృశించి ప్రార్థించి ధరించినవారల పుణ్యాతిశయమునువర్ణించలేము

బ్రహ్మాండభారమును మోయుచున్న ఆదిశేషుని బలమునే వర్ణింపజాలము.

అట్టిఆదిశేషునికి ఆధారముగ భగవత్స్వరూప కూర్మరూప చక్రమున్నది. దీని కాధారముగ సర్వభారమునువహించిన మూలవిరాడ్రూప యజ్ఞవరాహము భగవదవతారముతో స్థూలరూపముగ సర్వులకుపాస్యముగనున్నది. పురాణాదులలో హిరణ్యాక్షుఁడు భూమినిచుట్టి సముద్రములో ముంచెననియున్నది. అనగా బ్రహ్మప్రళయములో బ్రహ్మాండప్రళయము హిరణ్యకశిపుడు బ్రహ్మలలోఁజేరినవాఁడు. అట్టిబ్రహ్మాండ ప్రళయము జలముతోనగును, జలము శ్రీమన్నారాయణాంశము. గాన మరలభూమిని ఉద్ధరించుటకే వరాహరూపమును ధరించెను. పృథివి యజ్ఞాదులకునిలయము. ప్రార్థనతో విష్ణువు వరాహమై పృథివిని ఉద్ధరించి తనయందు నిలుపుకొన్నాఁడనిభావము, పృథివికిని మనస్సునకు సమన్వయముగూడ నగును. హిరణ్యాక్షరాక్షసుఁడే దుష్టమనస్సు. సముద్రమేసంసారము. దీనిలోఁ దేలినవాఁడే శ్రీమన్నారాయణుఁడు.

## యజ్ఞవరాహము.

యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః యను అనువాకమంత్రప్రమాణముతో యజించి ధన్యులగుదురుగాకయని ఫలితార్థము. అందుచేతనే పురుషసూక్తములో ఈఋఙ్మంత్రము నిత్యములో ఫలశ్రుతిగానున్నది. పురుషసూక్తము సర్వత్ర సర్వదా యోగ్యము. పఠనీయము; సర్వపాపహరము. బ్రహ్మాండములో నిదియు అంత్యభూమికగ సర్వాధారముగనున్నది. మనకంటె పూర్వులగు దేవతలీరీతిగఁ దెలిసి యజించి ధన్యులైరి. ఇంతటితో బ్రహ్మాండగోళము ముగిసెనుకాని మనము మనదేహాదులెడతెగనివిగా నగుచునేయున్నవి. ప్రకృతకాలములో ప్రకృత్యుత్పత్తులకే ప్రాధాన్యముగనున్న ఆధ్యాత్మవిద్యకును, క్రియాకర్మలకు నాస్పదమే కష్టతరముగనున్నది. ప్రకృతివ్యామోహాతిశయము అనంతదేహాదులకే కారణముగును. సృష్టివిస్తారముతోఁ బ్రళయసమీపమునకే చేరుదుము. ప్రకృతి తనకుఁదానే విస్తృతితో తనప్రళయమునకే ఎదురుచూచుచుండునుకాని తనకతీతమై తనలోనిరంతరస్వరూపముగనున్న ఆత్మను దెలియనీయదు; చూడనీయదు. తాను క్షణికము; అశాశ్వతము; లేనిదిగనున్నందుచేత నింతతొందరలు గలుగజేయుచున్నది. శాశ్వతసత్యముగనే యుండినచో శాంతముగనే యుండెడిది. ఏమియును లేనిదిగ నున్నందుచేతనే దేనిని నుండనీయక సర్వప్రళయముచేయును. సుషుప్తిలోగాని యిదియణఁగదు. ఇది యున్నంతకాలము యోగనిద్రనుఁ గలుగజేయదు. సుషుప్తిలేకనే తాను స్వయముగా సర్వదా నుండఁజాలదు. మనకాసుషుప్తిని

సంపూర్ణముగఁ దెలియనీయదు: పొందనీయదు: దాటనీయదు: నిలువనీయదు. ఎటు జూచినను దీనితో మహాప్రయాసముగనున్నది. క్షణకాలమైన నొకచోట నిలువనీయదు. మహాపరిభ్రమణతో భ్రమింపఁజేయుచున్నది. తూష్ణీంభావముతో నే నాటికైన సాధింపనగును. తనలోను దనబాహ్యములోను సర్వత్ర స్వరూపముండియుఁ దెలియనీయక వ్యవహరింపజేయుచున్నది. దీనిసర్వమునుదెలిసి ఋషులెట్లు ధన్యులైరో దెలియదు. ఎవరికివారే దీర్ఘాలోచనతోఁ దెలుసుకొనవలెను. అంతవరకుఁ దెలియఁజాలదు. నాస్తికతతో సర్వదా ప్రళయము లేతప్పవు. ప్రకృతిపదార్థ వస్తువిజ్ఞానానందముతో నెంతమాత్రము ధన్యులుగానేరము. అధ్యాత్మవిజ్ఞానముతోనే సర్వజయము.

పృథివీభూత మాతృభూతమగుటచేత సర్వభూతములిందులో జేరియున్నందుచేత సర్వభూతములసార మిందులోనున్నందుచేత నిది మహాపవిత్రతకును సర్వాశ్రయతకునకును ప్రధానముగనున్నది. ఆదియునుగాక విరాట్టునకు నిది పాదతలమగుటచేత అత్యంతపవిత్రము. పాదమూలము సర్వమూలము, బ్రనాడిగ ఊర్ధ్వగతికిఁ బ్రాపకము, గమ్యస్థానము. "త్వయిసర్వం ప్రతిష్ఠితే"అని ఉపనిషత్ప్రమాణము. అందుచేత నిదిముఖ్యాశ్రయము, భూతములకును, సృష్టికి నిది అంత్యభూమిగ స్థూలబ్రహ్మాండగోళముగ నున్నది. "సర్వసస్యాశ్రయాభూమి వరాహేణ సముద్ధృతా." సస్యమూలముతో ఓషధీవ్రీహ్యదులు, ఫలాదులు కలుగును. ఇవియే సర్వజీవరాసుల యుత్పత్తికిని స్థితికిని జీవనాధారము. ప్రాణాధారము. పృథివికి గంధగుణ ముండుటచే సర్వసస్యములు పుష్పించుటకును, ఫలించుటకు ముఖ్యావకాశముకలిగినది. పుష్పము ఇహపరసాధనలకుఁగూడమూలము. కాబట్టి యీపృథివి మనకు మాతృభూమిక; ఉపాస్యదైవము. "శిరసాధారయిష్యామి రక్షస్వమాం పదేపదే. గచ్ఛంతిపరమాంగతిమ్"అని ఉపనిషత్ప్రమాణము. ఇది తెలియక ఉదాసీనభావముతోఁ జూచినచో మనపతనమునకును, నిచటనే పరంపరజన్మాదులును స్థిరస్థావరాదిగఁ గ్రిమికీటకాద్యచేత నజన్మాదులును సంభవించును. ప్రకృతవిజ్ఞానముతో నీవిజ్ఞానమునకుఁ బ్రకాశప్రవృత్తి లేదాయెను. కలికాలమహిమను వేదఋషులు ముందుగనే పురాణములందు వివరించినను దెలియలేకయున్నాము.

### వేద ప్రమాణము.

"భూమిర్ధేను ర్ధరణీలోకధారిణీ। ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేనశతబాహునా। మృత్తికేహనమే పాపం యన్మయా దుష్కృతం కృతమ్। మృత్తికే బ్రహ్మద

త్వాసి కాశ్యపేనాభి మంత్రితా। మృత్తికేదేహిమే పుష్టిం త్వయిసర్వం ప్రతిష్ఠితే। త్వయాహతేనపాపేన గచ్ఛామి పరమాంగతిం॥" మిగతకొన్ని వేదమంత్రములను పైన నేఁడదహరించి విమర్శించినాను.

ఓంశాన్తి శ్శాన్తి శ్శాన్తిః



# ఆ ధా ర శ క్తి.

ప్రతివస్తువునకు ఆద్యంతములని రెండుచివరభాగములున్నవి. ఒకటి ఊర్ధ్వములో చివరభాగాంశముగను మరొకటధోభాగములో అంత్యాంశముగనున్నవి. పైభాగముననున్నదే మూలప్రకృతి. పరాశక్తిస్థానము. క్రిందనున్నదే ఆధారశక్తి. అనగా ఆదిశేషస్థానము. మొత్తము త్రిఖండలోకత్రియ వృత్తాకృతితో త్రిణాభిచక్రమై వాగర్థమూల ప్రణవరూపలోకత్రియ ధ్రువస్థానమని చెప్పబడుచున్నది. ఈ రహస్యమే తంత్రాగమములయందు "అర్థశ్శబ్దైన వేదేన గాయత్ర్యాం వ్యాహృతిష్వియం। తాజమితచ్ఛితౌసాఖె తద్బ్రహ్మద్వయ మస్మ్యహం"అనిచెప్పబడుచున్నది. ఈ రెంటిశక్తులచేతనే సర్వముధార్యమయి సృష్టిస్థితిలయాదులతో వ్యవహారములుగ బ్రకాశించుచుండును. ఇవి అణుమాత్రమునకైనను మహాశక్తిగానుండును సర్వాధారము. ఈ రెంటి ఆధారములతో బ్రహ్మాండమునకు భ్రమణపరిణామాదులు గలిగియుండును.

దీనికి ఆవరణములున్నవి. ఈ ఆవరణములకు అంతరమేమియు లేదు. అదే అవ్యక్తము. ఈ అవ్యక్తమే మహామూలప్రకృతి. జ్ఞానముతోఁ దెలియఁదగినది. ఈలాగు ననంతముగా నెంతపెంచినను యేతుదకైన అంతముగావలెను. అటుల లేకున్న అనవస్థ పరిప్రాప్తమగును. స్థూలసూక్ష్మకారణములన్నియును దృశ్యములు, ప్రకృతిమూలములు, కల్పితములుగాన శాశ్వతసత్యములుగావు. దీనికి సరిహద్దులు నిర్మాణకార్యక్రమముతో ముగియును. ఇది ఈశ్వరదృష్టిలోఁగల స్థూలబ్రహ్మాండము.* మనదృష్టి స్థూలములో స్థూలసూక్ష్మకారణముగ మనమున్నాము, మనలోను మూడువిధములుగ. శరీరములున్నవి. ఇవి మనకు బాహ్యములో అనంతరూపముగ ఈశ్వరశరీర బ్రహ్మాండమున్నది. దీనికతీతముగ జ్ఞానరూపముతోనున్నదే శుద్ధమూలప్రకృతి. పరాశక్తి. దీనికతీతమాత్మయే.

# ప్రళయముల వివరము.

---

మహాప్రళయములు నాలుగువిధములు. (౧) నిత్యప్రళయము, (౨) నైమిత్తికము. (౩) ప్రాకృతికము, (౪) ఆత్యంతికము. నిత్యమన సుషుప్తిలో మనము నిత్యముగా అనుభవించుచున్నదే. నైమిత్తికమనగ సహస్రయుగపర్యంతమగు బ్రాహ్మదినమును నిమిత్తగాజేసి అగునట్టి భౌతికప్రళయమే. ఇందుకు "సూర్యాచంద్రమసౌ ధాతాయథా పూర్వమకల్పయత్"అను మంత్రము ప్రమాణముగావున ఇదియే త్రైలోక్యప్రళయము. ధ్రువమండలమువఱకుమాత్రము. ఇది మహాభయంకరముగ శ్రీవిష్ణుపురాణ షష్ఠాంశ తృతీయాధ్యాయమందు వర్ణింపఁబడినది. శ్రీమహావిష్ణువు సూర్యుని సప్తరశ్ములయందుఁ బ్రవేశించి, సమస్తజలములను బీల్చివేసి, కాలాగ్నిరుద్రుఁడై స్థూలాదులగు పర్వతారణ్యస్థావర జంగమాత్మక త్రిలోకములను దహింపజేసి, మహాజ్వాలలతోఁ బ్రజ్వలించుచుండఁగ, దుస్సహతాపమును సహింపజాలక ఇంద్ర, మను, పితృదేవతలును, సిద్ధసాధ్యయక్షాదులును, స్వర్గలోకమును విడిచి మహర్లోకమును బ్రవేశింతురనియు, నచ్చటను తాపముగలిగెనేని జనలోకమును, అచ్చటినుండి తపోలోకమునకు నేగుదురనియు, మఱల ప్రళయము నివర్తించి, సృష్టి మొదలిడఁగనే, అచ్చటినుండి తమతమలోకములకు వత్తురనియు నీదిగువ శ్లోకములచే వాయుపురాణమందుఁ జెప్పబడినది.

శ్లో॥ పితృభిర్మనుభిశ్చైవ సాధ్యైస్సప్తర్షిభి స్తథా। యజ్వానశ్చైవ యేప్యన్యే తద్భక్తాశ్చైవతైస్సహ। మహర్లోకం గమిష్యంతి త్యక్త్వాత్రైలోక్య మీశ్వరాః।

మహర్లోకం పరిత్యజ్య గణాస్తేవై చతుర్దశ। సశరీరాశ్చ యాంత్యన్యే జనలోకం సహానుగైః, ఏవం దేవా స్సపితరఋుషయో మానవాశ్చయే॥ మిత్రైస్సహోర్ధ్వం గచ్ఛంతి వ్యావర్తంతే చతైస్సహ, జనలోకా త్సురాస్సర్వే దశకల్పాః పునః పునః॥ పర్యాయకాలే సంప్రాప్తే సంభూతా నిధనేష్విహ, అవశ్యం భావినాఽర్థేన సంబధ్యంతే తథాతుతే॥ నివర్తంతే తథావృత్తా తేషాం సద్యోనివిస్తరః। మహర్జనం ప్రాపిజనాత్తపం చాప్యేకాంత తస్తానిభవంతిసత్యే॥ మన్వంతరాణాం పరివర్తనాని ముంచంతి సత్యేన తపోవరాణి. తపోఽభియోగా ద్విషయప్రహాణా ద్విశంతితేఽపీశ్వర మేవదేవం॥

పుణ్యకర్మ ఫలానుభవార్థము జనలోకమునుండి మహర్లోకమునకు, మహా

ర్లోకమునుండి స్వర్గలోకమునకు, అధికారిక పదవులుగల దేవతలు లోనగువారలు ప్రతికల్పాంతమందు వచ్చుచుఁ బోవుచుందురుకాని, తపస్సంపన్నులును, జితేంద్రియులును, ద్వంద్వరహితులును, నిష్కాములునగు మహర్షులు, సనకాది మునీశ్వరులు ఉత్తమదేవతలు, ఊర్ధ్వరేతస్కులై బ్రహ్మదేవునితోడ సత్యలోకమున నుండి మన్వంతరములయందును, కల్పప్రళయమందున్ను, రాకపోకలుచేయక బ్రహ్మతోడఁ బ్రాకృతిక మహాప్రళయమందుఁ బరమాత్మయందు లీనమగుదురు.

శ్లో॥ చతుర్ముఖ దినస్యాంతే జగదేతచ్చరాచరమ్। తదాహి దహ్యతేసర్వం త్రైలోక్యం భూర్భువాదికమ్॥

విష్ణుపురాణం - ద్వితీయాంశం - అధ్యాయం ౭

త్రైలోక్యమే తత్కృతకం మైత్రేయ పరిపఠ్యతే, జనస్తపస్తథా సత్యమితి చాకృతకం త్రయమ్॥ ౧౯ ॥ కృతాకృతకయో ర్మధ్యే మహర్లోక ఇతిస్మృతః। శూన్యోభవతి కల్పాంతే యోఽత్యంతం నవినశ్యతి॥ ౨౦ ॥

విష్ణుపురాణే.

భూర్లోక, భువర్లోక, స్వర్లోకములు మూడును, త్రైలోక్యము. ఇది కృతక మనఁగా, బ్రహ్మదేవుని దినాంతమగు ప్రళయమందు దహింపఁబడి, మఱలఁ గల్పాదియందు సృజింపబడునది. జనస్తపస్సత్యలోకములు మూడును అకృతకములనఁబడును. అనఁబ్రతికల్పాంతమందు నశింపక, కల్పాదియందు సృజింపఁబడక, బ్రహ్మదేవునాయుః పరిమితివఱకు నుండి, బ్రహ్మ పరమాత్మయందు లీనమైనపుడు ప్రకృతియందిమికి ప్రాకృతిక ప్రళయముగలిగినపుడు బ్రాహ్మీప్రకృతితోపాటుగా నశించును. కృతక, అకృతకలోకములమధ్యయందు మహర్లోకముండును. నైమిత్తిక ప్రళయమందుఁ ఈక్రింది త్రైలోక్యము దహింపఁబడఁగ అధికారిక దేవతలు, మనువులు, పితరులు, ఋషులు లోనగు వారలు మహర్లోకమందు నివసించువారు కల్పాంతవాసులు ప్రళయాగ్నిజ్వాలా సంతప్తులై మహర్లోకవాసు లెల్లరతోడ జనలోకమును, అచ్చటినుండి తపోలోకమును, బ్రవేశింతురు మహర్లోకము కల్పాంతమందు శూన్యముగ నుండునుగాని, అత్యంతికముగ నశింపదు. ప్రళయాగ్నిచల్లారి కల్పాదియందు సృష్టి ప్రారంభింపఁగనే, అధికారిక పదవులును, పుణ్యకర్మానుభవములుగల దేవతలు, పితరులు, మనువులు, లోనగువారలు ఊర్ధ్వలోకములనుండి మహర్లోకములోనికి బ్రవేశించి యచ్చటినుండి స్వర్గలోకముఁజేరుదురు. మహర్లోకము కృతాకృతకలోకములకు సంధిస్థానము. దేవతలందఱు జనలోకమునుండి పది

కల్పముల పర్యంతము వచ్చుచుఁ బోవుచునుండి పిమ్మట నివృత్తిమార్గము నవలంబించి పరమాత్మయందైక్యమును జెందుదురు. వారివారి కర్మఫలమునుబట్టి కొందఱు యుగప్రళయమందును, మఱికొందఱు, మన్వంతర ప్రళయమందును, కొందఱు నైమిత్తిక కల్పప్రళయమందును, కొందఱు ప్రాకృతిక కల్పప్రళయమందును, కొందఱు ప్రాకృతికప్రళయమందును స్వస్వరూపమందు లయింతురు. ప్రాకృతికప్రళయమన కాలాది సిసృక్షా సంకల్పము నశించగా ఉద్యోగమునుండి విరమించిన అధికారివలె తనప్రకృతితో కలిసి తనతన కల్పాంతమగువరకూ ఆనందనిమగ్నుడగుటయే యగును. ఆత్యంతిక ప్రళయమనఁ బునరావృత్తిరహితమగు మోక్షము. ఇట్లు ప్రళయభేదములుగలవు. బ్రహ్మదేవుని దినాదియందు సృష్టికల్పమును, దినాంతమందు ప్రళయకల్పమును గలుగుచు, ౩౬౦ దినములైన సంవత్సరమును, ౧౦౦ సంవత్సరములైన సత్యలోకస్థులతోడఁ బరమాత్మయందు లీనమునగుచుందురు.

శ్లో॥ ఏకార్ణవేతు త్రైలోక్యే బ్రహ్మనారాయణాత్మకః, భోగిశయ్యాగతశ్శేతే త్రైలోక్యగ్రాసబృంహితః॥ జలస్థైర్యోగిభిర్దేవై శ్చింత్యమానోఽబ్జసంభవః వ్యతీతాయాంతు శర్వర్యాం సబుద్ధ్వాసృజతేపునః॥ ఏవంతు బ్రహ్మణోవర్షం తథావర్షశతంభవేత్। గతేవర్షశతే బ్రహ్మపరమాత్మని లీయతే॥

కల్పప్రళయమందుఁ ద్రైలోక్యము దహింపఁబడి యేకార్ణవమైయుండ నారాయణస్వరూపియగు బ్రహ్మ శేషశయ్యాగతుఁడై యోగనిద్రను జెందును. ఇట్లు రాత్రికడపి జలముమీఁదనుండు యోగులచేతను దేవతలచేతను, ప్రార్థింపఁబడి బ్రహ్మ వుత్థాన దశనొంది (యనగా మేల్కొని) మఱల సృష్టింపఁ బ్రారంభించును.

ప్రాకృతిక ప్రళయమందు శతాయుః పరిపూర్తి చెందిన బ్రహ్మ అకృతక లోకస్థులతోడఁ బరమాత్మయందు లీనము చెందఁగ సమస్తలోకములు, పంచభూతములు, తద్గుణములు. నన్నింటిని గ్రసించి శ్రీమన్నారాయణమూర్తి మహాప్రళయార్ణవమందు వటపత్రశాయియై కొంతకాలముండి విలాసముచే మఱల చతుర్ముఖ బ్రహ్మను, సమస్తలోకములను బంచభూతములు గలుగునట్లు సంకల్పించును.

శ్లో॥ ద్వాత్రింశదబ్ద కోట్యస్తు తథాబృందాష్టకం భవేత్। ఖర్వద్వయం నిఖర్వంచ శంకుత్రయ యుత తథా॥ పద్మమేకం సముద్రాశ్చ త్రయోబ్రహ్మసమాగతే। బ్రహ్మవిష్ణుదినే చైకః పతత్యేవం వదంతితే। మనీషిణ స్తథావిష్ణు రహన్యగ్రస్య శంకరః। ఈశ్వరస్య తథాదాసౌ ససాంఖ్యాప్రకృస్తతేథా। అతః పరం పరేధామ్ని కాలసంఖ్యా నవిద్యతే। బ్రహ్మణోఽతః పరం సంఖ్యానాస్తి చైతన్మతం

హిం.॥

ఇత్యగ్నిపురాణమ్.

మానవమానముచే ద్విపదార్థసంఖ్యగల బ్రహ్మయు నిదివఱలో జెప్పఁబడెను. బ్రహ్మపతనము విష్ణువున కొకదినమును, విష్ణుపతనము శివునకొకదినమును, శివుని పతనము పరమేశ్వరున కొకదినమునగును. నిర్గుణుడును, నిరంజనుడును, అనంతుఁడునునై సాంఖ్యప్రకృతిగల పరమేశ్వరునకుఁ గాలసంఖ్యానియమితి లేనందున పతనములేదు. కాన అచ్యుతుఁడనబడును. నిత్యశాశ్వతవిభూతియు, సర్వజ్ఞ, సర్వశక్తియుక్త సచ్చిదానంద స్వరూపియునగు పరమేశ్వరు విలాసముచేఁద్రిగుణాత్మకమగు సృష్టి కలుగుచుండునని భావము. కాలము అనంతము, అపరిచ్ఛిన్నము, పరమాత్మ స్వరూపము. పరిచ్ఛిన్నమైనచో నియమితిచేఁ బతనము కలుగుచుండును.

శ్లో॥ ద్విపరార్థాత్మకః కాలః కథితో యామయాతవ, తదహస్తస్య మైత్రేయ విష్ణోరీశస్య కథ్యతే॥ విష్ణుపురాణే షష్ఠాంశే, చతుర్థోధ్యాయే, శ్లో॥ ౪౭.

ద్విపరార్ధకాలపరిమితిగల బ్రహ్మపతనము శ్రీమహావిష్ణువు కొకదినమనివిష్ణుపురాణమందును జెప్పబడినది.

మహాసంకల్పమందు "శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః"అని చెప్పుటవలన నింతకుమున్ను కొందఱు బ్రహ్మలుండి లయించినట్లును ప్రకృతపుబ్రహ్మయొక్క కల్పము జరుగుచున్నట్లును స్పష్టమగుచున్నది. అంధకారబంధురమగు మహాప్రళయార్ణవమందు అనంతభోగిశయ్యాగతుఁడగు శ్రీమన్నారాయణమూర్తి నాభికమలమునుండి జనించిన చతుర్ముఖబ్రహ్మ అనిరుద్ధరూప విష్ణువును గూర్చి స్తుతించిన సందర్భములోఁ బైవిషయము స్పష్టమగుచున్నది.

శ్లో॥ త్వత్తో-మే మానసం జన్మప్రథమం ద్విజపూజితమ్। చాక్షుషం వైద్వితీయంమే జన్మచాసీత్ పురాతనమ్॥ త్వత్ప్రసాదాత్తు మేజన్మ తృతీయం వాచికం మహత్। త్వత్తశ్శ్రవణజం చాపి చతుర్థం జన్మమేవిభో॥ నాసత్యం చాపి మేజన్మ త్వత్తః షష్ఠం వినిర్మితమ్। అండజం సప్తమం జన్మ పద్మజన్మేతి మేఽభో॥ సర్గేసర్గే హ్యహం పుత్రస్తవ త్రిగుణవర్జిత॥

శ్రీమహాభారతే శాంతిపర్వణి.

ఓపరమేశ్వర! మొదట నీమనస్సువలన జనించుటంజేసి మానసబ్రహ్మనైతిని. ద్వితీయకల్పమందు నీచక్షుస్సువలన నుత్పత్తియగుటంజేసి చాక్షుష బ్రహ్మనైతిని. తృతీయకల్పమున మీవాక్కునుండి పొడముటవలన వాచికబ్రహ్మనయితి.

చతుర్థకల్పమున మీశ్రవణమువలన నుత్పత్తియగుటంజేసి శ్రావణబ్రహ్మనై పరగితి. పంచమకల్పమున మీనాసాపుటమువలన జనించుటంజేసి నాసత్యబ్రహ్మనై వెలసితి. షష్ఠకల్పమున అండమువలన నుత్పత్తియగుటవలన అండజబ్రహ్మనైతి. సప్తమ కల్పమున ఆవగా నిప్పుడు మీనాభిపద్మమునుండి జనించుటవలన నాభిపద్మజ బ్రహ్మ యనియు, పద్మసంభవుడనియు, పాద్మకల్పీయ బ్రహ్మయనియు బిలువఁబడుచున్నాను. మీయనుగ్రహమువలన నిదిసప్తమజన్మము. ప్రతికల్పమందును (సృష్టియందును) త్రిగుణరహితుఁడవగు నీకు నేను పుత్రుండను. నీవుతండ్రిగనుంటివి. అని మహాభారత శాంతిపర్వ మోక్షధర్మపర్వమునందు పాద్మకల్పీయబ్రహ్మ స్తుతించినట్లుకలదు.

ఇటులనే మనకును బ్రళయములు సర్గప్రతిసర్గలతో నాల్గువిధములుగ బ్రహ్మకువలె నున్నది. నిత్యప్రళయము నిద్రాకాలము. దేహమునకు రోగాదులతోఁ బ్రకృతిసంబంధ దేహప్రళయము కొంతవఱకుగలిగి మఱల ఆరోగ్యము సంభవించగనే సర్వసంపూర్ణమగుట ఇదిరెండవది. బ్రహ్మాదులకువలె ఆధికారిక పదవీవాంఛను విడచుటే ప్రాకృతప్రళయము. ఆత్యంతిక ప్రళయమే మనదేహాభిమానత్యాగము, ఇందులో నిజీవుఁడు బ్రహ్మాండములోఁజేరును. మరల శ్రీమన్నారాయణ నాభీకమలమునుండి సృష్టియై వచ్చినట్లు మనఉత్తరజన్మము, కాన మన సృష్టియు బ్రహ్మసృష్టియు సమానము. జ్ఞానముతో సర్వము బ్రహ్మస్వరూపభావనాయోగముగనుండును. తప్పక తత్స్వరూపులమే యగుదుము. సర్వకార్యములు ఫలములు అనుభవములు భావనాయోగ సిద్ధిరూపముగనే యున్నవి. మనకు తండ్రితాతగానున్న బ్రహ్మ ఈలాగువ తనమూలమును దెలిసి ధన్యుఁడైనందుచేత మనము సర్వవిధముల తెలుసుకొన్నవారలమై ఆచరణతో అనుభవసిద్ధి ఫలరూపప్రాప్తులగుదుము. లేక ఇదే శాశ్వతమని తలంచినచో నిదే శాశ్వతముగనే కాని యితరమెట్లు రాగలదు. మనస్సునాశ్రయించి వాసనలు కోరికలుండును. వాసనలెఱుగుట కష్టతరము, తెలిసినను పోగొట్టుకొనుట మరింతకష్టతరము. మన వేదఋషులెంతటి ధర్మమార్గము లెన్నివిధములుగ వివరించి చూపికొ తెలియజాలని వారలమైతిమి. ఎంతటి పరోపకారులో గ్రహించలేకపోతిమి. వేదశాస్త్రపురాణాదులు నిత్యానుభవములో నున్నను నమ్మకము సమాధానము శాంతియు గలుగలేదు. ఇది కలిధర్మము.

—o—

## బ్రహ్మాండమునుగుఱించి చివరసమష్టిస్తుతి.

ఏపరమాత్మ - అవిచ్ఛిన్న సత్యానంద స్వరూపముతో సర్వసంపూర్ణుఁడై మహాప్రకాశముతోనుండి యీయనేక బ్రహ్మాండ భూగోళములను సృజించి యిందులోఁజేరి సృష్టిస్థితిలయ కార్యకారణుఁడై వెలుఁగుచున్నాఁడో,

ఏపరమాత్మ - బోధక బోధనా స్వరూపుండై శ్రీమహాగురుస్వరూపముతోను, బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులకు సర్వాధిపుండై మహాకారణికుఁడై యీబ్రహ్మాండ భూగోళములందు సర్వస్వరూపుఁడుగ లీలావినోదుఁడై వెలయుచున్నాఁడో!

ఏపరమాత్మ - అనేకానంత బ్రహ్మాండ భూగోళములకు సృష్టిరూప వీక్షణముతో లక్ష్యలక్షణుఁడై అనంతానంత ప్రకృతులతోఁజేరి తేజోవిలాస భాసితుఁడై యున్నాఁడో,

ఏపరమాత్మ - పంచబ్రహ్మలాదిగ సనకాదిబ్రహ్మర్షులు, మహర్షులు, దేవతలాదిగ సర్వస్వరూపములుగను, నక్షత్ర తారాగణయుక్త శింశుమార దివ్యదేహములతోను, చరాచరరూప నామములతో నిత్యప్రకాశకుండై ఈబ్రహ్మాండ భూగోళములో వెలుగుచున్నాడో,

ఏపరమాత్మ - శ్రుతి స్మృతి పురాణేతిహాస సర్వశాస్త్రములతోను సర్వవిద్యలతోను, శ్రీమహావిద్యతోను ప్రబోధితుండై కేవల వేదవేద్యుఁడై యీ బ్రహ్మాండ భూగోళములోఁ బ్రకాశించుచున్నాఁడో,

ఏపరమాత్మ - సమస్త చరాచర సృష్టిరూపాంతర విశిష్ట వాసుదేవరూపాంతర్యామియై వాసుదేవుండై, అనంతుఁడై వెలయుచు సమష్టిబ్రహ్మాండ గోళములోఁగూడ సమష్టిగఁ బ్రకాశించి తుదకేకరూపుఁడై పూర్ణుఁడైయున్నాఁడో.

ఏపరమాత్మ - కాండద్వయోపపాద్య యజ్ఞయాగాది స్వరూపముతో నీబ్రహ్మాండగోళమును సృజించి ప్రళయములతో మరల యజ్ఞరూపుఁడై ఉద్ధరించుచు నిందులోనే, త్రివర్గ త్రివర్గాతీత లోకాదులఁ గల్పించి తుదకు నన్నిటిని తన సత్యస్వరూపములో లీనముచేసి శాశ్వతానందదాయకుఁడగుచున్నాఁడో,

ఏపరమాత్మ - శ్రీత్రివిక్రమ పాదాంగుష్ఠ నభోర్ధ్వ సంస్పర్శతో అండకటాహాభిన్నమై ఉద్భవమైన జ్ఞానతీర్థ స్వరూపిణియగు గంగా స్వరూపముతో సత్యలోకాదిగ ధ్రువమండలమునుండి క్రిందికి శింశుమారముతోఁజేరి మేరు శిఖరమందుఁగల

బ్రహ్మసరస్సుఁజేరి నలుదిశల ద్వారంబులనుండి జలపాతముతో జంబూద్వీపముతో నలుదిశలందుగల వర్షంబులందుఁ బ్రవహించి సాగరంబులను బాతాళాదులనుజేరి, ఆదిత్యస్వరూపముతో వృష్టిప్రధాన పర్జన్యరూపుఁడై సమస్తప్రాణికోటి సృష్టికి నిరంతరము కారణమై రసవంత వ్రీహ్యాది ఫలరూపముతో సంరక్షించి, గంగాప్రవాహములో మునిఁగినవారలను బునీతులుగఁజేసి యీ బ్రహ్మాండగోళములో ముక్తినిచ్చుచున్నాఁడో,

ఏపరమాత్మ - వలన బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మవృక్షమూలముఁతో నుత్తమ పరమహంసలుగను, సంయమీంద్ర, దేశికేంద్ర శ్రీభగవత్పాద పూజ్యులుగ ఇంద్ర, సరస్వతీ, భారతీ గిరి, తీర్థానందేత్యాది నామమాత్రభేద కేంద్రరూపులుగ నుద్ధరించి యీ బ్రహ్మాండములో సూర్యమండల భేదనముతో ధ్రువముఁజేర్చుచుఁ దుదకు స్వస్వరూపానందుల నొనర్చుచున్నాఁడో,

ఏపరమాత్మ - సమస్త పాపక్షయకరములగు, పుణ్యనదీ, తీర్థ, క్షేత్ర, శైల, దుర్గ, గుహ, వనారామాదుల రూపమునను, పాంచభౌతిక రూపాత్మక మూర్తి స్వరూపులుగను విభూతియోగాదులందుగల, గజ, సింహాశ్వ, ధేను, వృక్ష, పర్వత చక్రవర్త్యాదిగను మంత్ర, తంత్ర యంత్రాక్షర, ఋతు, మాస, పక్షాది కాలస్వరూప విభూతి విశేషముతోఁ బ్రకాశించి యీబ్రహ్మాండములో ఆనందింప జేయుచున్నాఁడో,

ఏపరమాత్మ - కాలస్వరూపముతో, లవ త్రుటికాదిగ, మనుష్యదేవగంధర్వ పితృ, దేవ, మను, బ్రహ్మమానముల పర్యంతము పరమాయుః పరిమితిగాగల కాలాత్మక స్వరూపుఁడై సర్వసృష్టిని దేశకాలైకరూపిణియగు తనమాయాశక్తిప్రభావముచే భ్రమింపజేసి పరిభ్రమణగా భూత భవిష్యద్వర్తమాన కాలభేదములతో ననేకమూర్తులతో బద్ధులుగజేసి సప్తావరణములకులోనై యుండినట్లుగా యీబ్రహ్మాండగోళములోనే కాలాత్మక కాలస్వరూపుఁడై వెలుఁగుచున్నాఁడో,

ఏపరమాత్మ - పంచాశత్కోటియోజన విస్తారమగునిందులో పాతాళాదిగ భూలోకాది స్వర్గలోకాంత శింశుమారచక్ర ధ్రువాంతముగను, ఆవల బ్రహ్మలోకాదులతోను, తదూర్ధ్వలోకాదులతోను విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృత దేహపరతత్వములతో, దత్స్వరూపుఁడుగను, వ్యష్టిదేహాదులలో విశ్వ, తైజస, ప్రాజ్ఞలుగను, మూలాధారాది ద్వాదశాంత చక్రములతోను, బంచకోశములతోను గ్రంథిత్రయముతోను, అగ్నిత్రయాదులతోను, షణ్ణవతి తత్వములతోను, బంచభూతములతోను బ్రకృతిపురుష, జీవేశ్వర, గురుశిష్యులు, స్వామిసేవక భేదములతోను, త్రిపుటి

భేదములతోను, దిక్ప్రుష్ట్యైక్యముతోను, ప్రాణస్వరూప వాయ్వగ్న్యాధార ప్రధానముతో జీవాదిగ హిరణ్యగర్భస్వరూపాంతమువరకును మాయా మనోరూపముతో, సర్వాధార, సర్వాధిష్ఠాన, స్వరూపుఁడుగ నీబ్రహ్మాండ గోళములోనున్నాఁడో, అట్టి సర్వాంతర్యామియొక్క ఉపాధిభేదములే భేదములుగఁదోఁచి పశ్వాసుర ప్రకృతిబద్ధులగువారిని భ్రమింపఁజేసి సర్వానర్థదాయకములాయెను. ఇందుకనేక ఉపనిషత్ప్రమాణములుండియు అజ్ఞానముతో భేదవాదపరవశులమైతిమి. విచారవివేకముతో సర్వము ఏకస్వరూపము పూర్ణము. ఇట్టిస్వరూపస్థానము, సాత్విక నిష్కామ సత్కర్మల ఫలముతోఁ గలుగును.

## —♦ విరాట్ విశ్వరూపదర్శనము. ♦—

జ్ఞానోదయమునకు, ఒకవిస్మయ, విస్మృత, విశ్వదర్శనము ఆకస్మికముగఁ జూపిననేకాని, విస్మయముజెంది ఈవిశ్వవిస్మృతిజెంది, విశ్వవిస్మయుఁడై తదేకనిష్ఠతో విశ్వాసముతోఁ దనమనస్సును మరలింపనేరనివాఁడై, స్థూలములోనుండి, సూక్ష్మములోఁజేరి, మరల స్థూలములోఁ బ్రవేశించుటకు స్మృతిలేనివాఁడై కొంతవరకైనను తదేకనిష్ఠతోనుండజాలఁడు. ఆవల నిటులనే మనస్సును మరలించు నుపాయములయొక్క అయినా ఉపాసనాయోగముతోఁ గ్రమముగఁ గొంతకాలమువధిగాఁగల సమాధితో అభ్యాసదార్ఢ్యముతోఁ గొంతకాలమునకుఁ బరిపక్వదశతో బొత్తిగా నీస్థూలదేహ సంబంధమును విడచి కారణముజేరి ఏతుదకైన బొత్తిగ విడచుట తటస్థించకతప్పదు. ఇందుకు దృష్టాంతము- శ్రీకృష్ణభగవానులు అర్జునునికెంతబోధించినను జ్ఞానోదయము గలుగకుండెను. తుదకు విశ్వరూప సందర్శనముతో జ్ఞానోదయమాయెను. అటులనే యీబ్రహ్మాండములోని విషయాదులతోను జితప్రపటములతోను, మనస్సనకొకవిధమైన లక్ష్యభావముతో మార్పుగలుగును.

ఇట్టి విశ్వరూప దర్శనమునకు ప్రబంధ సంబంధిగా మనము ప్రతిరోజును జేయుచున్న ముఖ్యకర్మల నిర్బంధముగ మనవేదఋషులు నిశ్చయించి ఆచరింపఁజేసిరి. ఏతన్మంత్రోపాసనయే, శ్రీపురుషసూక్త, శ్రీరుద్రోపనిషత్తులు, గీతాది యోగ శాస్త్రములు, పురాణాదులు, యజ్ఞాదులు, ఆరాధనలు, తపస్సులు, అధ్యయనములు, పూజాదులు, జపాదులు, ధర్మములు, క్షేత్ర, తీర్థారామాదుల మహాత్మ్యాదుల దర్శనములు, వీనినిశోధించి విధివాక్యములచే నిత్యానుష్ఠాన కర్మలనుఁజేసి మనలను సత్తమసంతతివారినిగా తయారుచేసి ధన్యులైరి.

ఈసదాచారముతో నేనాటికైన పరిపక్వదశకు రాగలిగి తపఃప్రభావముతో విస్మయ విశ్వరూప భావోదయముగలిగి ఆవల దర్శనీయుఁడై మానవుడు ధన్యుఁడగును అందుచేత విధిగాజెప్పిరి. అనగా చేసియేతీరవలెనని తీర్మానము. తప్పక ప్రతివారలును క్రమసంస్కారులై చేయవలెను. సంధ్యయింపలో తమతమ కుల శాస్త్రవిధిప్రకారము అమంత్రకముగాను సమంత్రముగాను మానవమాత్రునకెల్ల ప్రథమకర్తవ్యము.

ఈలాగున ఉభయత్ర పరస్పర సంబంధ త్రిపుటితో మిథునీభావముతో వీని యందదియును, దానియందువీఁడును. పరస్పరాశ్రితులై జ్ఞానోత్పత్తిగలిగి ధన్యులగుదురు. తద్వారామోక్షముగాని ఇహముగాని పరముగాని తప్పకలభించును. తరువాతనైన వివేకవిచారజ్ఞానోదయములు గలుగును. తప్పదు- "హరిః ఓంతత్సత్"



# సామ్రాజ్యమంత్రస్వరూపము.

హరిః ఓం=సామ్రాజ్యం భౌజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠ్యం రాజ్యం మహారాజ్య మాధిపత్యమయం సమన్తపర్యాయీ స్యా త్సార్వభౌమ స్సార్వాయుః అంతాదా పరార్ధాత్ పృథివ్యై సముద్ర పర్యంతాయా ఏకరాడితి॥

( ౧ సామ్రాజ్యం భౌజ్యం, ౨ స్వారాజ్యం, 3 వైరాజ్యం. )

( ౪ పారమేష్ఠ్యం రాజ్యం, ౫ మహారాజ్యమాధిపత్యమయం )

అర్థము:- త్రిపాత్తులోని మధ్యమపాదము సామ్రాజ్యము, భోజ్యమగును. (౨) స్వారాజ్య, (3) వైరాజ్యములు ఆదియందుఁ క్రమసృష్టితోను, (3) వైరాజ్యము సంపూర్ణమైన పిమ్మట, (3) వైరాజ్యమే, (౨) స్వారాజ్యముగను, (౨) స్వారాజ్యము, (3) వైరాజ్యముగను విపర్యాసమగును. (పరివర్తనమగును.) అనఁగా త్రిమూర్తులలో ఆద్యంతములందుఁ జెప్పబడుచున్న బ్రహ్మయు, రుద్రుడును దమ ఆధిసృష్టి సంహారాధికారములతో తారుమారగుటే క్రమాక్రమసృష్టియని చెప్పఁబడును.

తరువాత నాలుగవదగు మహత్తత్వమందు (వ్యాహృతియందు) శుద్ధజీవునకే, ౪ పారమేష్ఠ్యమనెడి పదము (తురీయపదము) అదియును క్రమక్రమసృష్టివైభవముచే

మొదటప్రకృతి రంజనముగాను ఆవల స్వయంప్రకాశ పదముగాను రాజ్యమై ప్రాప్తించును. తదనంతరము అయిదవదియగు "జన" వ్యాహృతియందు, సకలాధిపత్యరూపమగు '(౫) మహారాజ్యముతోఁగూడ నీమైదు పదములందు సమంత పర్యాయముగా, (అనగా నీమైదుపదములందు స్వేచ్ఛానుసారముగ) సంపూర్ణవ్యాప్తితో ఆరోహణావరోహణములు చేయుచు చతుస్సముద్ర పర్యంతముగల భూమికి ఏకరాజై, సృష్టి, స్థితిలయాంతముగా నీత్రయాధికారమునుకూడ తానొకఁడే పొందునని సారాంశము. ఆస్థితి సదాశివునకే యున్నది.

(౧) మహారాజ్యమాధిపత్యం = సదాశివత్వము, సదాశివుఁడు ఈశానమంత్రస్వరూపుఁడు.

(౨) పారమేష్ఠ్యం= ఈశ్వరుడు తత్పురుషమంత్రస్వరూపుఁడు.

(౩) వైరాజ్యం = రుద్రుఁడు, అఘోరమంత్రస్వరూపుడు.

(౪) స్వారాజ్యం = విష్ణు, వామదేవమంత్రస్వరూపుఁడు.

(౫) సామ్రాజ్యం = బ్రహ్మ, సద్యోజాత మంత్రస్వరూపుఁడు.

—♦ క్రమ సృష్టి. ♦—

(౧) వైరాజ్యం=క్రమసృష్టిలో మూడవవాఁడైన రుద్రుఁడగును.

(౨) సామ్రాజ్యం=(విష్ణువు) కర్మఫలభోక్తృ మాత్రస్వరూపమగునుగాని తనవిష్ణుస్వరూపమందుకూడ సంపూర్ణజ్ఞాన స్వరూపముండదు. ఇతఁడు సంరాట్= బాగుగ ప్రకాశించు నభిమాని.

(౩) స్వారాజ్యం=బ్రహ్మ.

మొదటివైరాజ్యము పూర్తికాగా అనగా క్రమసృష్టి పూర్తికాగాయని.

(౧) వైరాజ్యమునకు, మార్పులుగ, రుద్రునకు బ్రహ్మత్వమును.

(౨) సామ్రాజ్యమునకు—మార్పులుగ స్వారాజ్యముగల బ్రహ్మాత్మక రుద్రత్వమును బొందును.

(౩) స్వారాజ్యము=విష్ణువునకుమాత్రము మార్పులులేవు ఆద్యంతములందుగల సామ్రాజ్య, వైరాజ్యములకుమాత్రమే మార్పులు, బ్రహ్మత్వ అధికారముగలవారిస్థానమున రుద్రత్వ అధికారమును. రుద్రత్వాధికారముగల స్థానమునకు బ్రహ్మత్వాధికారమును మార్పుచెందుచుండును. క్రమసృష్టితో ఒకవిధముగను వ్యుత్క్రమములో మరొకవిధముగను మార్పులుగ నగుచుండును. అనఁగా మొదటి క్రమముతో సామ్రాజ్యకర్త బ్రహ్మయు, వైరాజ్యకర్త రుద్రుడుగను, మరల

వ్యుత్క్రమములో, వైరాజ్యకర్త బ్రహ్మయు, సామ్రాజ్యకర్త రుద్రుఁడగును. ఈ లాగున మార్పులు జెందుదురు. మధ్యలోనున్న స్వారాజ్యముమాత్రము మార్పు జెందక ఉభయత్ర విష్ణ్వధికారము క్రిందనేయుండును; భూః, భువః, సువః అనునవి వ్యాహృతులు;

నాలుగవది- మహర్లోకవ్యాహృతి. ఇదిమహత్తత్వము. పారమేష్ట్యసంబంధాధికారముగలది. మధ్యలోగలది విష్ణుపదము. రజోగుణముతోఁగూడి సృష్టి. స్థితి. సంహారములనుబొంది జగత్కారణమగును.

సాక్షిత్వముతోను, శుద్ధసత్వప్రధానములగు సృష్టిస్థితిలయాదులతో జగన్నాటకసూత్రధారిత్వము పొందిన పారమేష్ట్యమగుదానినే రాజ్యముఖమని చెప్పవచ్చును. అట్టి జగత్కారణమునకుఁగూడ సాక్షియగుటచే అయిదవవ్యాహృతియగు "జనలోకమునకు మహారాజ్యమునకు విశ్వేశానుఁడు (సదాశివుఁడు) సర్వాధిపత్యమునుబొంది సముద్రపర్యంతమగు అనగాఁ (లోకాలోక) చక్రవాళాంతమువరకు గలసృష్టికంతటికిని భువనములకంతమును గుణభేదములేనట్టి మహాకారణుఁడగును. ఇదే సకల ప్రపంచాధికారము.

## —♦ ఈసామ్రాజ్యమంత్రముయొక్క సంపూర్ణార్థవివరము. ♦—

ఇదిమూడువిధముల యధికార వర్గముతోనున్నది. అన్నిటికంటె నుపరి వర్గముతో సంపూర్ణాద్వితీయానందముతో ఆత్మస్వరూపమునే వాచ్య వాచకైకరూపమగు ప్రపంచముతో మనకు గురుతుగా నిర్లిప్త సాక్షిభూత తత్త్వముతో ఈశానస్వరూపమగు సదాశివతత్త్వముగా "మహారాజ్యమాధిపత్యముతో స్వరాట్టుగా ఈశానమంత్రార్థముగ దెలియవలెను. ఇది కేవల శుద్ధప్రకృతికి పరాపరముగా నౌపచారికముగా నిమిత్తమాత్రముగా జెప్పఁబడును. ఇందులో సప్తవ్యాహృతులుండవు. వ్యాహృతుల కతీతము. తుదకు ఎవఁడు ఏకముగా మిగిలియుండునో అట్టివానివిషయము (సప్తవ్యాహృతుల కతీతము.) ఇది అంతరబాహ్యములం దానంద స్వరూపముతో అద్వితీయమే. ప్రకృతిలీనము. ప్రకృతితోనే రెండవదిగానగును. "తస్యప్రకృతిలీనస్య యఃపరస్స మహేశ్వరః" అను శ్రుతి ప్రమాణము,

రెండవది "పారమేష్ట్యంరాజ్యం" పైనజెప్పిన మహారాజ్య మాధిపత్యమగు సదాశివతత్త్వమగు స్వరాట్టునకుఁ గ్రిందిభూమిక రెండవది. ఇది సప్తవ్యా

వ్యాహృతులలోఁ దురీయ వ్యాహృతియగు మహర్లోక వ్యాహృతి. దీనిక్రిందఁ ద్రివిధ వ్యాహృతులగు "భూః భువః సువః"అనునది యొకవర్గముతోఁ బరంపరలుగా యాతాయాతములతో పునరావృత్తులుగ విలోమానులోమములుగా ఆద్యంతములందు భేదములతోఁగల పరివర్తనముతోనుండును. ఇది భోజ్యము. ఈతురీయ వ్యాహృతిలో పారమేష్ఠ్య సంబంధరాజ్యముగ గ్రింది త్రివిధ బ్రహ్మ, విష్ణు, రుద్ర మూర్తులలో మధ్యలోఁగల విష్ణుస్వరూప తత్త్వముతో రజోగుణముతో క్రింది త్రివర్గముల కతీతముగ గ్రింది త్రివర్గ వ్యాహృతులకు నిది సృష్టిస్థితిలయాదుల కాశ్రయమై నిమిత్తకారణభూమికగ సంరాట్టుగ, ఈశ్వరత్వముతోనున్నది. ఇదియు మహత్తత్వమే, దీనికిపైన కేవల శుద్ధసత్త్వ ప్రధాన నిమిత్తమాత్రముతో స్వరూప గుణముతో కారణభూమికగనున్నది. అయిదవదియగు సదాశివస్వరాట్టు- ఈశానమంత్రార్థతత్త్వము. సాక్షి మహారాజ్యమాధిపత్యములని నామాంతరములు. ఈరెండవదానికే రాజ్యమనిపేరు ఇది వామదేవమంత్రస్వరూపము. సంరాట్టు ఈశ్వరత్వము. నాలుగవది. అంతరములో శుద్ధసత్త్వప్రధానము. బాహ్యములో రజోగుణముతో జగత్కారణము. దీనికి పైతత్త్వములో నీత్రివిధగుణములుండవు. ఎటుజూచినను సంపూర్ణము, ఆనందము. ఇందులోనుండి భిన్నత్వమైనదే శుద్ధ కేవలజ్ఞానస్వరూపిణి. ప్రకృతిదీనిలోఁగల వ్యాహృతులు "జన, తప, సత్య"ములు. అయిదవదియగు మహారాజ్యాధిపత్యములో (దీనికిపైనున్నదానిలో) నీవ్యాహృతులుండవు. వ్యాహృతులకతీతము. ప్రళయములతో వ్యాహృతులుండును. వ్యాహృతులతోఁ బ్రళయములుండును. రెండును పరస్పర సంబంధములు. పైసదాశివములో ప్రళయమేలేదుగాన వ్యాహృతులుండవు. సర్వాతీతము అద్వితీయ సంపూర్ణతత్త్వముతో దీనిభావబోధకమగును. అందుచేత నీనాలుగవదియగు పారమేష్ఠ్యరాజ్యము విష్ణువ్యాప్తితో విష్ణువుగా మూల త్రివర్గమధ్యలో విష్ణువుగా ఉభయ మధ్యలో స్థితిగామార్పుల కవకాశములేకుండా ఆదినుండియైన అంత్యమునుండియైన నే క్రమముతోనైనను మధ్యలోనేవచ్చునదిగానున్నది త్రివర్గ త్రిగుణమూర్తులందధిష్ఠానముతో వ్యాప్తిగా విష్ణురూపముతో మరల నీత్రివర్గములపైన నాలుగవదిగానున్నది. దీనికివ్యాప్తియేలేనిచో ముందు త్రివర్గ త్రిగుణ త్రిమూర్తుల భేదావభాసమున కవకాశకారణమేయుండదు. ఒకదానిలోనుండి మరొకటిగాఁ గ్రమ గుణకారణవ్యాప్తితో రావలెనేకాని అన్నియు నొకేసారి గలుగనేరవు. ఉత్పత్తి విధ్వంసమార్గ మీలాగునసేయగును. ఇది మంత్రభేదములలో వామదేవస్వరూప

మని, సంరాట్టని, శ్రీమహావిష్ణువని, పారమేష్ట్యంరాజ్యమని లోకముతో మహర్లోక మని, వ్యాహృతితో "మహ"యని మహత్తత్వమని నామాంతరములుకలది. దీనిలో జన, తప సత్యములంతర్వాఠితము లైయుండును. ఇందులో ప్రకృతిశుద్ధ రజోగుణ ముతో బహిర్ముఖముతో సృష్టి, స్థితిలయ జగత్కారణమును బొందినదగును. అంత రముతోఁగేవల సర్వగుణ ప్రధాన స్వరూపము. కాబట్టి ద్వివిధముల కవకాశకారణ స్వరూపముగ నేర్పడెను.

సాక్షిత్వముతోను, శుద్ధసత్వ ప్రధానముతోనుగల శుద్ధరజోగుణముతో సృష్టిస్థితి సంహారములతో మహాపంచభూత జగత్కారణత్వమును బొందిన పారమే ష్ట్యమగుదానినే "రాజ్య"మని చెప్పనగును.

దీనికిసాక్షిగా కారణస్వరూపుఁడుగా, భూతస్వరూప జనలోకమునకు, విధ్యే శానుఁడుగ సదాశివుఁడుగ, స్వరాట్టుగ, మహారాజ్యమునకుఁగూడ సాక్షియై విశ్వ లుఁడై సర్వాధిపత్యమునుబొంది సముద్రపర్యంతమగు, లోకాలోకమువఱకుగల సృష్టికంతటికిని సప్తభువనముల కతీతమై నిర్గుణముతో మహాకారకుండగును. సము ద్రముతో భూమియు. భూమిలోసముద్రము పరస్పర సంబంధము కలిగియుండును. ఇదే ప్రకృతిపురుషులుగను సూర్యచంద్రాదులుగను, సృష్టికిఁగారణార్థముగను, రాజ్యమునకాధారముగను, స్థితిగను సమన్వయము. ఇదే యీశానమంత్రాభి ప్రాయము. పంచభూతములలో నేభూతిసృష్టినిఁ జెప్పినను మిగతభూతములసృష్టి అంతర్వాతములుగ తప్పకయుండుననియే తెలియవలెను. ఇవిస్థూల, సూక్ష్మ, కారణసృష్టులతో వాయాభూతాదుల గుణముల నాశ్రయించిన సృష్టితోనుండును. భూతాదుల ననుసరించి సప్తవ్యాహృతులును, వ్యాహృతుల ననుసరించి సృష్టిస్థితి లయములును, వ్యాహృతులతోనే పరివర్తనములై జ్ఞానోదయమగునంతవరకు ఎడ తెగనిదిగా బృంహితమగుచు ప్రవృత్తియే యగుచుండును. అందుచేత వేదములలో వ్యాహృతులుగ జెప్పిరి. ఈ వ్యాహృతులను జ్ఞానపరముగాఁ దెలిసినచో నివృత్తి మార్గముతో ధన్యుఁడగును. వ్యాహృతులతోనే లోకములు, లోకాదుల ననుస రించి సృష్టియు నగుచుండును. దీనికిఁగారణము గుణములు. ఈవ్యాహృతులు బాహ్యములోను, అంతములోను ద్వివిధములుగ నున్నవి. బాహ్యములో త్రిలో కాదులుగను అంతరములో త్రినాభిచక్రాదులుగను, ధాతురూపములుగను, కోశా దులుగను, మనదేహమునందున్నవి. జ్ఞానముతోఁ దనయందును అజ్ఞానముతోఁ దనకు బాహ్యమునందున్నవి. ఈరెంటినిఁ దెలియుటే జ్ఞానము, ఇదే శ్మ

యజ్ఞము. అది బాహ్యయజ్ఞము. పరపీడనము. ఇది తనలోఁగల భేదభావము నశించునంతవఱకు నీవాసనలుండుగవు, వాసనలకుఁ దనలోఁదానేమూలము. ఇదే బంధము. దీనితోనే బాహ్యబంధము. వ్యాహృతులకుఁబ్రణవము మూలము. ప్రణవమునకు త్రిపూర్ణమగు పరబ్రహ్మమేమూలము. ఈప్రణవమును స్వరూపముతోఁజూచిన ప్రకృతిలీనమును, ప్రకృతిలోఁజూచిన నీప్రణవము కామరూప ప్రవృత్తి ప్రపంచమునగును. ఇవి సగుణ నిర్గుణ ప్రవృత్తి నివృత్తి భేదములుగ నుండును. ఈవ్యాహృతులు వేదమంత్రములతో యజ్ఞరూప వ్యాహృతి మంత్రములుగను, పురాణః తంత్రములతో లోకాదులుగను, కాలస్వరూపములుగను ఉపాసనగను అధికారపదవులుగను. భోగరూపములుగను, తత్త్వశాస్త్రములతో స్వరూపకారణములుగను, మనస్సునాశ్రయించి నామ, రూప, గుణ ఫలభేదములతోఁ జెప్పినను; తుదకన్నియు జ్ఞానముతోనే నేకరూపమేయగును. భిన్నమెంతమాత్రములుగానేరవు. మనస్సున్నంతకాలము గుణత్రయములుదప్పవు అవస్థాత్రయములుదప్పవు.

—♦ మూడు, నాలుగు; అయిదవరాజ్య విమర్శనము. ♦—

3 వైరాజ్యం, ౪ స్వారాజ్యం, ౫ సామ్రాజ్యం. ఇవేమఱల వ్యుత్క్రమముతో అయిదవది మూడవదిగను, నాలుగవది సర్వత్ర ఏమార్పులు లేకను, మూడవది అయిదవదిగను, విలోమానులోమములతో బ్రహ్మరుద్రుడుగను, రుద్రుడుబ్రహ్మగను మార్పులగుచుండును. బ్రహ్మయందు రుద్రాంశమును, రుద్రునియందు బ్రహ్మాంశముండును. ఇదే సృష్ట్యంశము బ్రహ్మగను, లయాంశము రుద్రుడుగ నగుచుండును. సృష్ట్యంతము లయమును లయాంతము సృష్టియు నగును. బ్రహ్మరుద్రులు పరస్పర సంబంధములతో పరివర్తన లందుచుండురు. ఈ మూడు, నాలుగు, అయిదును జేరి త్రివర్గమనబడు విరాట్శరీరము ఇవి భూః, భువః, సువః యను వ్యాహృతిలోకములు.

మూడవదియగు వైరాజ్యము అఘోరమంత్రస్వరూపుఁడగు రుద్రలోకము. రెండవదియగు స్వారాజ్యము వామదేవమంత్రరూప విష్ణులోకము. క్రింది మొదటిది సామ్రాజ్యము సద్యోజాత మంత్ర బ్రహ్మస్థూలమునకు కారణము మహత్త్వములో (శుద్ధతత్త్వములో) రజోంశములో పారమేష్ఠ్య సంరాట్టులో బాహ్య తమోగుణములో మఱల త్రివృత్కరణముతో సత్త్వ రజస్తమోగుణ పరివర్తనముగల వరుసతో మూర్తులుగఁ దెలియవలెను. త్రివృత్కరణముతో బ్రతిగణమందును

ప్రతిసృష్టియు భేదములగుచుండును. ఈలాగున సమన్వయముతో భేదములకవకాశమే లేదు. భేదములన్నియు ప్రకృతిలోగలిగినవి. గుణములు ప్రకృతిలోనివేను. ఆత్మఒక్కటే ప్రకృతిలో ప్రకృతితో త్రివిధకారణ కార్యముల నిమిత్తముగా మార్పులుగా జెందెనేగాని స్వస్వరూపములో నేమియునులేని పూర్ణస్వరూపమే. ఇదే పరమరహస్యమని తలంపవచ్చును.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః



Printed at the Desabandhu Press, Tadpatri.